శ్రీ

# ఆంధ్ర వాచస్పత్యము

అను సీయుకార్థాది

ఆంధ్ర ప్రతిపదార్థ పర్యాయపద నిఘంటువు

## శ్రీ శ్యామలకామశాస్త్రీయము

ఆంధ్రవిద్యా వాచస్పతిత్యాది బిరుదాంకితులగు

## కొట్ర శ్యామలకామశాస్త్రిగారిచే

వ్రాయఁబడినది.

క కారాది ఙ కారాంతమువఱకుగల

రెండవ సంపుటము


## కొట్ర శ్యామలకామశాస్త్రి అండ్ సన్స్

వారిచే ప్రకటితము.

కరప, కాకినాడ.

శ్రీ లక్ష్మీ ముద్రాక్షరశాలయందు ముద్రితము,

జగన్నాథపురం, కాకినాడ.

1937.

# క.

క. ఒకయక్షరము. హల్లులలో నిది మొదటి యక్షరము (నిజమైనహల్లులు క్, ఖ్, గ్, ఘ్ ఇటువంటి పొల్లులు మాత్రమే. ఇవి యుచ్చరించుట కష్టము గావున నచ్చులతోఁ జేర్చి క్ + అ=క, గ్ + అ=గ. అని సులభముగాఁ బలుకఁబడుచున్నవి. చ్ + అ = చ ఇచ్చట 'అ' హ్రస్వముగనుక 'చ' హ్రస్వహల్లనియు, చ్ + ఆ=చా ఇచట 'ఆ' దీర్ఘము గనుక 'చా' దీర్ఘహల్లనియుఁ దెలియునది. ఇట్లే తక్కినహల్లులు.) సం. వి. అ. పుం. 1. నలువ: చూ, బ్రహ్మ. 1; 2. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 3. గాలి: చూ, వాయువు; 4. అగ్ని: చూ, నిప్పు; 5. సూర్యుఁడు: చూ, సూర్యుఁడు; 6. జముఁడు: చూ, యముఁడు; 7. ఆత్మ: చూ, పరమాత్మ; 8. మతి: చూ, బుద్ధి; 9. మనస్సు: చూ, హృదయము; 10. నెమిలి: చూ, మయూరము; 11. ఏఁడాది: చూ, సంవత్సరము; 12. తెలుపు: చూ, వర్ణము. 6; 13. అడవి: చూ, విపినము; 14. ఆశ్చర్యము: చూ, వింత. 1; 15. సంద్రము; చూ, సముద్రము; 16. పసుపు: చూ, వర్ణము. 6; 17. అధిక ప్రకాశము, మిలమిల: చూ, వెలుతురు. 1; న. అవ్య. 18. నాశములేనిది; 19. ఉదకము: చూ, నీరు. 1; 20. తల: చూ, శిరము. 1; 21. సుఖము: చూ, సంతోషము; (శ. క. రత్న.) పా. 22. కంఠ్యములలో నొకటి: చూ, కంఠ్యములు.

కంకంటిపాపరాజు. పా. 18 శతాబ్ది. ఇతని గ్రంథము ఉత్తరరామాయణము.

కంకచిత్తు. సం. వి. త్. పుం. కంకచయనమను యాగముచేయువాఁడు: చూ, గాడువు 4.

కంకటకుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

కంకటము. సం. వి. అ. పుం. 1. కవచము: చూ. బొందడము; 2. శివునిమొక్కనవాలు: చూ, బాణము. 1.

కంకటి. వై. వి.=ఖట్వికా. ఖట్వా. రూ-కంకటి. అచ్చ. యు, కాం. 595: చూ, మంచము.

కంకటిల్లు. వా. అ. క్రి. భయకంపితుఁడగు. "దెబ్బలచేత పిల్లవాఁడు కంకటిల్లెను."

కంకణబంధము. అం. శబ్దాలంకారములలో నొకటి: చూ, శబ్దాలంకారములు. (చూ, అలంకారము. 3.)

కంకణము. సం. వి. అ. న. 1. కడియము, చేతినగ, కాలినగ (బిరుదు)"ముంజేతికంకణంబు." "తే. కంకణముఁగట్టి వైవల్య కర్తమంది." వేమన. 334: చూ, భూషణము. 2; 2. వ్రతకాదులలోఁగూడిన ముంజేతిముడుగు: చూ, భూషణము. 2; 3. చేతఁగట్టుకొనెడు తోరము: చూ, రక్షాసూత్రము; 4. ముత్యములు పగడములు లోనగువానిఁ జేర్చి గ్రుచ్చఁబడిన చేసరము: చూ, భూషణము. 2; 5. నీరు లోనగువానిబొట్టు: చూ, బొట్టు; 6. కొండకొన: చూ, శిఖరము. 1; 7. గట్టి: చూ, బెడిదము; పా. 8. అస్త్రములు ఏఁబది మూఁడింటిలో నొకటి: చూ, అస్త్రములు; దే. వి. (1) ఒకానొక నీటిపక్షి. అము. 4, ఆ. 101: చూ, మల్లెకేగులు.

కంకణాయి. దే. వి: చూ, కంకణము. (1.)

కంకణ్యము. సం. వి. అ. పుం. అఁగాఁకర*: చూ, కాఁకర.

కంకతము. సం. వి. అ. పుం, న. దువ్వెన: చూ, ప్రసాధని.

**కంకతిక.** సం. వి. ఆ. స్త్రీ: చూ, కంకతము.

**కంకత్రోటము.** సం. వి. అ. పుం. గద్దముక్కుచేప, జలవ్యాఘ్రము: చూ, మత్స్యము. 1.

**కంకపత్రము.** సం. వి. అ. పుం. 1. అమ్ము: చూ, బాణము. 1; 2. గింజెపట్టనివడ్లు: చూ, ధాన్యము; 3. ఊఁక: చూ, తుషము; 4. గ్రద్దయొడలిపైనున్న ఈఁక.

**కంకము.** సం. వి. అ. పుం. 1. లోహపృష్ఠము: చూ, రాబందు; 2. మహోత్పలము,తమ్మి *: చూ, పద్మము. 1; 3. గద్ద: చూ, దాక్షాయ్యము; అం. 4. మహీనతానములు ఏడింటిలో నొకటి: చూ, మహీనతానములు.

**కంకముఖము.** సం. వి. అ. పుం. కాఁచిన లోహము నెత్తెడుసాధనము: చూ, సందంశము.

**కంకర.** వై. వి. 1.=కర్కరమ్. కంకరరాయి: చూ, రాయి; విణ. 2. పరుసదనము: చూ, పరుషము.

**కంకరగాడిద.** వై. వి: చూ, కంచెరగాడిద.

**కంకరతల.** వా. వి. అజ్ఞాని: చూ, మూర్ఖుఁడు.

**కంకరము.** సం వి, అ. న. 1. తక్రము: చూ, మజ్జిగ; విణ. 2. హీనమైనది, నికృష్టము: చూ, హీనము. 1.

**కంకరరాయి.** ద్వ. వి. కర్కరము: చూ రాయి.

**కంకరి.** దే. వి. సున్నములోనగునది : చూ, లేపము.

**కంకరుఁడు.** సం. వి. అ. పుం. జాత్యాచారాదులచేత నిందితుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

**కంకష్ఠ్యము.** సం. వి. అ. న. పండ్లమురికి: చూ, పండ్లపాఁచి.

**కంకసి.** సం. వి. ఈ. స్త్రీ. పాసని,అఁగాఁకర*: చూ, కొఁకర.

**కంకాలము.** అం. అస్త్రము లేఁబదిమూఁడింటిలో నొకటి: చూ, అస్త్రములు.

**కంకాళము.** సం. వి. అ. పుం. 1. చర్మమాంసరహితమైన యొడలి ఎముకలగూఁడు.(స్కెలిటన్.): చూ,శల్యము. 1; అం.2. జన్యతాళములుతొంబది యాఁటింటిలో నొకటి: చూ,జన్యతాళములు. (చూ, తాళము. 2.)

**కంకి.** దే. వి. జొన్నలోనగువాని వెన్ను: చూ, వెన్ను.

**కంకు.** దే. స. క్రి. 1. అదలఁగొట్టు. "వాఁడు నన్ను కంకెను.": చూ, బెళిపించు; 2. తిట్టు: చూ, శపించు.

**కంకుఁడు.** సం. వి. అ. పుం. 1. కపట బ్రాహ్మణుఁడు: చూ, బ్రాహ్మణుఁడు; 2. కిరాతుఁడు, రాపులుఁగులను చంపి తినెడిబోయ: చూ, వ్యాధుఁడు. 1; 3. జముఁడు: చూ, యముఁడు; 4. కంకుభట్టు, అజ్ఞాతవాసమున పాండురాజు పెద్దకొడుకైన ధర్మరాజు ఉంచుకొనిన మారుపేరు: చూ, ధర్మరాజు. 1; 5. క్రూరుఁడు, చెడ్డమనసు గలవాఁడు: చూ, వ్యాధుఁడు. 2; 6. మనోహరుఁడు, : చూ, సౌందర్యవంతుఁడు.

**కంకులుపెట్టు.** ద్వ. స. క్రి. తిట్టు:చూ, శపించు.

**కంకువు.** సం. వి. ఉ. స్త్రీ: కొఱ్ఱలు: చూ, ధాన్యము.

**కంకుష.** సం. వి. ఆ. స్త్రీ. రెడ్డివారి నానఁబ్రాలు *: చూ, స్వర్ణక్షీరి.

**కంకుష్ఠము.** సం. వి. అ. న. 1. గజజాత కంకుష్ఠము: కంకుష్ఠువు; 2. క్షీరిణి *: చూ, స్వర్ణక్షీరిణి.

**కంకుష్ఠమృత్తిక.** సం. వి. ఆ. స్త్రీ. కాలపాలకము: చూ, భూమి. 1.

**కంకుష్ఠారేచని.** సం. వి. ఈ. స్త్రీ: చూ, కంకుష్ఠము. 2. *.

**కంకుష్ఠువు.** సం. వి. ఉ. న. 1: చూ, కంకుష్ఠము. 1; (ఏనుఁగుయొక్క రేణము. ఇది కొంత

కషాయములలో మూఁడుమారులు భావనచేసిన శుద్ధి.); 2: చూ, బ్రిహ్మదండి. *.

కంకేలి. సం. వి. ఇ. పుం. = కంగేలి *: చూ, హేమపుష్పము.

కంకోలి. సం. వి. ఇ. పుం.=కంగేలి*—పై.—

కంఖటము. సం. విశే. (అ. ఆ. అ.) కఠినము, కట్టి: చూ, బెడిదము.

కంఖటి. సం. వి. ఈ. స్త్రీ. రంగులు వేయు కుంచె. "వర్ణలేఖాచ కఠినీ కంఖటీఖటీ." త్రి. శే. ద్వి. శై. 86: చూ, లేఖని.

కంఖాణము. సం. వి. అ. పుం. గుఱ్ఱము: చూ, హయము.

కంగటి. పై. వి.= ఖట్టికా. రూ- కంకటి. "ఉ. ...భృంగిరిటింపఁగాఁ......పిశాచముల్, కంగటికాలు నమ్మఁదగుకైదువు రత్నంబుశల్యఖండముల్." పై. 5, ఆ. 85: చూ, మంచము.

కంగటికొళ్ళు. ద్వి. వి. గాడిదకొళ్ళవలెనుండు కాళ్ళు: చూ, ముడికాళ్ళు.

కంగటికాళ్ళవాఁడు. ద్వి.వి. ముట్టు మోఁకాళ్ళు గలవాఁడు: చూ, సంజ్ఞు.

కంగవ. దే. వి. చోటు. "సీ ఇగవుపట్టిమ్ము చోటిక్కువసెల విక్కు సెప్పకంగవకెంకి నిట్టయనఁగ, స్థానమగు." ఆం, భా. ద్వి.పుర. 13: చూ, స్థానము. 1.

కంగాణము. దే. వి. కళ్ళమునందలి కావలి.

కంగారు. దే. వి. 1. పోరాటము. ఆం. భా, ద్వి. కు. 222: చూ, యుద్ధము; వా. 2. ఆపత్సమయమునకలుగు తొందర. "కొంపలు అంటుకొన్నవి. వాడి తాటాకులకొంప. కంగారు వాడుఁగాక నీకేమి."

కంగాళీ. హిం. విశే. 1. నీచమైన. "వాఁడు కంగాళీమనిషి."; వా. 2. సంకరము. "వానికులము కంగాళీ అయినది.". (తెలుఁగున వాడుక.)

కంగాళీవాఁడు. వా. నీచమైన బుద్ధిగలవాఁడు.

కంగు. దే. వి. 1. నూలిపోఁగుతో కంకరగా నేర్పఱచిన కన్ను. "ద్వి. బంగారు సరిగఁ గన్నడు కుట్టులమరు, కంగులుఅవికలుఁగనుపట్టఁ దాడికి." రా. బాల, కాం. 754; "బా- కంగుల్ దీటిన్ పైటిణీఅవిక." విజ. 2, ఆ. 155; 2. బిడ్డలకు పోసెడిచేసుకాలాముదము: ఉంగ్గు; 3. కంచు(మోఁత: చూ, స్వరము. 2; 4. ఉప్పుఁబట్టలోని గీఁతపై బాలుఁడు నిలుచుండి ఇటునటు దాఁటిపోకుండఁగ కాఁచుట. "వాఁడు కంగుసరిగా కాఁచుచున్నాఁడు. (వా)"

కంగుణి. సం. వి. ఈ. స్త్రీ. 1. కొఱ్ఱలు: చూ, ధాన్యము; 2. ఎక్కుడుఁదీఁగె*: చూ, మాసేరు.

కంగునీపత్రి. సం. వి. అ. స్త్రీ. 1. ఎక్కుడుఁదీఁగె *: చూ, మాసేరు; 2. జ్యోతిష్మతి*: చూ, వ్రాతదుర్మల.

కంగునీపత్రము. సం. వి. అ. పుం: చూ, రుత్తిరి. *.

కంగులము. సం. వి. అ. పుం. మునికట్టు పొందలుకొన్న వేళ్లతోఁగూడినచేయి: చూ, హస్తము.

కంగువు. సం. వి. ఉ. స్త్రీ. ప్రియంగువు. కొఱ్ఱలు: చూ, ధాన్యము.

కంగేలి. పై. వి.= కంకోలి, కంకేలి *. "సీ.పా గడమనుకంగేలిఁ దగవిరుల్ గలిగించె సెమ్మిఁగల్గుమిపితన్నియునాకర్త." యు. 4, ఆ.20: చూ హేమపుష్పము.

కంగోరు. దే. వి. నిడుపుకొసు: చూ, వస్త్రము.

కంగోరుపావడ. ద్వి. వి. —పై.—

కంచటము. సం. వి. అ. న. జలాశయములలో నొకటి *: చూ, పద్మము. 1.

కంచడము. సం. వి. అ. పుం. —పై.—

**కంచి.** వై. వి. 1.= కాంచి. పుణ్యనగరములలో నొకటి. "గీ. కాఁపుఁగోడలు కంచేంత కాఁపురంబుఁ, బాలవంటికులంబుఁగీడ్వఁ అచియుటికె." పాండు. 8, అ.81: చూ, దేశము; విశే. 2. పృథువు, పెద్ద: చూ, విపులము.

**కంచికామాక్షి.** అం. అత్తులలో నొకతె: చూ. అత్తులు. వర్ణన.—"సీ. ఏపట్టణము సముద్దీర్ణ కామాక్షిత, పః పరిపాక సంపద్విధాయి ... పుణ్యతరమైన యా కాంచీపురముఁగనియె." కళా. 2, అ. 130.

**కంచిమేఁక.** ద్వ. వి. పెద్దపొదుఁగుగల ఒకరకము మేఁక: చూ, మేషము. 1.

**కంచియ.** దే. వి. 1. పసులు మేయకుండ మున్నుక నిలిపిన పొలము. రూ-కంచె: చూ, వివీతము; 2. రూ- కంచె. వృతి, తోఁట చుట్టు జెముడు బలుసు లోనగువానిచే నేర్పఱుపఁబడిన వెలుఁగు: చూ, ప్రాచీనము. 1.

**కంచుకము.** సం. వి. అ. పుం. 1. చేనుఁగప్పు: చూ, అవికె. (చూ, వస్త్రము.); 2. తలుపునకుఁ గ్రిందుమీఁదుల నుంచెడు కూఁచేము: చూ, ఉలుమార్పు; 3. పాము పైపొర: చూ, సిదరము. 3; 4. కవచము: చూ, బొందడము; 5. ఆకాశము: చూ, విన్ను; 6. తెల్లనిబట్టు: చూ, వస్త్రము.

**కంచుకి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ఒకరకము ఓషధి: చూ, వృక్షము; న. పుం. 2. కొజ్జా, అంగడీలు: చూ, సౌవిదల్లుఁడు; 3. లంజెకాఁడు: చూ, విటుఁడు; 4. పాము: చూ, సర్పము; 5. అగరుమాను. *: చూ, చందనము.

**కంచులిక.** సం. వి. అ. స్త్రీ. చేనుఁగప్పు: చూ, అవికె (చూ, వస్త్రము.)

**కంచె.** దే. వి: చూ, రూ-కంచియ.

**కంచెకోట.** ద్వ. వి. జెముడు మొదలగువానిచేఁ గోటకుఁజుట్టు నేర్పఱుపఁబడిన ఆవరణము: చూ, ప్రాచీనము. 1.

**కంచెగోడ.** ద్వ. వి. కంపపాఁతినగోడ, కంపగోడ, కాట్రిగడ: చూ, కంచెకోట.

**కంచెల.** వై.వి.=కంచులీ. కంచుకము. "చ. విలుకలకొల్కి కల్కి యొకచేడియ నాటకసాల మేడపై...యుబ్బికం, చెలతెగిపడ్డ... జీన్నలన్." స్వా. 5, అ. 68: చూ, అవికె. (చూ, వస్త్రము.)

**కంచే.** దే. వి. పెనము: చూ, స్వేదని. (చూ, పాత్రము. 6.)

**కంచేము.** వై. వి. 1. బంగారు వెండి లోనగువానిచేఁ జేయఁబడిన పాత్రము, పళ్లెము. ఆము. 2. అ. 16: చూ, పాత్రము. 6; 2. బంగారు వెండి లోనగువానిచేఁ జేయఁబడిన బోసపుట్టిక. పి. శకుం. 2. అ. 165: చూ, పాత్రము. 6.

**కంచేర.** వై. వి. కంచుపనిచేసి బ్రదికెడుజాతి "కంచరవాఁడు."

**కంచేరగాడిద.** వై. వి. (కంచేరము + గాడిద.) అశ్వతరము. కంచేరమునకుఁ గట్టెడు ఒకరకముగాడిదె: చూ, రాసభము.

**కంచేగము.** వై. వి. ఒకరకము రథము, గాడీ: చూ, శకటము. 1.

**కంచేగవాఁడు.** వై. వి.= కాంస్యకారః. కంచు పనిచేయువాఁడు: చూ, కాంస్యకారుఁడు.

**కంచేరి.** వై. వి. —వై.—

**కంచు.** వై. వి.=కంసమ్. కాంస్యము. "కంచుగంట." "కంచుమ్రోఁగునట్లు కనకంబు మ్రోఁగునా." వేమన.176: చూ, లోహము.1.

**కంచుకంటు.** దే. వి. కంచువు. వేఁచుట లోనగువాని కుపయుక్తమగు లోహపాత్రము. "సీ. కంచువు బాణలి కంచుకంటనఁదగు." అం, భా. ద్వి. తై. 248: చూ, పాత్రము.

కంచుకాగడాలు. వా. ప్రకాశమానమైన దీపములు. "ఎన్ని కంచుకాగడాలు వేసి వెదకినను దొరకలేదు."

కంచుగిన్నె. వ్య. వి. అమత్రము, పోతపోసిన కంచుగిన్నె: చూ, పాత్రము. 1.

కంచుడమాగము. దే. వి. 1. ఒకరకము కోడి: చూ, కోడి; 2. ఒకరకము క్షుద్రశునకము: చూ, శునకము.

కంచుమించు. దే. వి. 1. ఒకజాతిడేగ: చూ, శ్యేనము; విణ. 2. కానరానిది "గీ. కాక మించుల వినుమానికంపుజోదు, మంచుగమిగ కంచుమించు గానించుకరణి." "వ. పటు భుజాస్ఫాలనంబులఘుంబులు మృగంబులగు కంచుమించులైపఱవ." రామా. 5, ఆ. 305: (సం. ప):— అగోచరము, అతీంద్రియము, అత్యధ్యక్షము, అదృశ్యము, అదృష్టము, అస్తము.

కంచుశుద్ధి. పా. కంచు చింతాకు రసముతో ముమ్మారును, ఉలవకట్టుతో ముమ్మారును (దాటించేను) కాల్చి చల్లార్చిన శుద్ధియగును.

కంచుభస్మక్రియము. పా. శుద్ధిచేసిన కంచు రేకులుగా వేయించి సన్నముగా కత్తిరించి అందుసమముగా గంధకము పెట్టి జిల్లేడు వేరుపాలను మర్దించి ఆరేకులకుపూసి ఎండించి ఈప్రకారము ఏడుమారులుచేసి వజ్రమూసను గజపుటము పెట్టిన కంచు భస్మమగును.

కంచుభస్మసిందూరము. పా. కంచుభస్మములో సగము పాదరసము పెట్టి మొదట మఱ్ఱిపాలు, పిమ్మట నిమ్మపండ్ల పులుసు, హంసపాదిఆకు రసము, రావిచెక్కరసము, తుమ్మచెక్క కషాయము, మోదుగచెక్క రసము, దూలతామరవేళ్లరసము వీటితో వేర్వేఱుగా మర్దించి నిమ్మపండ్లపులుసు కషాయముతో మూసలోపెట్టి ఏడు గజపుటములుగాని, ఏడుమార్లు కమ్మరకొలిమినిగాని పుటములు పెట్టిన సిందూరించును. (పుటము—మందువండుట. వా)

కంజక. సం. వి. అ. స్త్రీ. చిఱుతేకు*: చూ, రాగంగి.

కంజజుఁడు. సం. వి. అ. పుం. నలువ: చూ, బ్రహ్మ. 1.

కంజనుఁడు. సం. వి. అ. పుం. మరుఁడు: చూ, మన్మథుఁడు.

కంజము. సం. వి. అ. న. 1. తామర*: చూ, పద్మము. 1; 2. అబ్ధినవనీతము, అమృతము, పీయూషము: చూ, సుధ. 1; అ. పుం. 3. కేశము: చూ, వెండ్రుక. 1.

కంజరము. సం. వి. అ. పుం. 1. జఠరము, కడుపు: చూ, భ్రూణము.1; 2. ఏనుఁగు: చూ, హస్తి.

కంజరుఁడు. సం. వి. అ. పుం: చూ, సూర్యుఁడు.

కంజలము. సం. వి. అ. పుం. 1. మదనపక్షి: చూ, మదనము; 2. కుసువేశ*: చూ, స్త్రీవేగము.

కంజాకము. సం. వి. అ. పుం. కంబూకము: చూ, తవుడు.

కంజాతము. సం. వి. అ. న. నీటిపుట్టుగు, తామర*: చూ, పద్మము. 1.

కంజారము. సం. వి. అ. పుం. 1. జఠరము, కడుపు: చూ, భ్రూణము 1; 2. ఏనుఁగు: చూ, హస్తి. (రూ—కంజరము.)

కంజారుఁడు. సం. వి. అ. పుం. 1. సూరుఁడు: చూ, సూర్యుఁడు; 2. నలువ: చూ, బ్రహ్మ.1; 3. సన్యాసి: చూ, ముని. 1.

కంజిక. సం. వి. అ. స్త్రీ. బల్య*: చూ, పెన్నెరు.

కంజుఁడు. సం. వి. అ. పుం. నలువ: చూ, బ్రహ్మ. 1.

కంజే. వై. వి. = కపింజలు. కముఁజే: చూ, కాఁజే.

కంట. దే.వి.1.కట్టరము, నాట్యబంధము "సీ. కంటయ

చనఁగనుగట్టరమనఁగను నాట్యబంధంబొప్పు." అం, భా. ప్రి. నాట్య. 130: చూ, నాటకము. 1; 2. ఆలోకనము, కనుట. భార, భీష్మ. 1, అ. 22; భార. అను. 1, అ. 228: చూ, లక్షణము. 3.

కంటఁబడు. ద్వి. అ. క్రి. అగపడు: చూ, లోఁబడు.

కంటక. సం. వి. అ. స్త్రీ. 1. ఎఱ్ఱతుమ్మెద: చూ, గండోలి; 2. కడుఁదురు: చూ, మక్షిక.

కంటకపిత్తము. సం. వి. అ. పుం. ములువెలఁగ*: చూ, వెలఁగ.

కంటకపుంఖి. సం.వి. ఈ. స్త్రీ. ఇక్షుపుంఖము, ములువెంపలి*:చూ, వెంపలి.

కంటకప్రావృత. సం. వి. అ. స్త్రీ. గృహకన్య*: చూ, కలబంద.

కంటకఫలము. సం. వి. అ. పుం. 1. పణస*: చూ, పనస. 2; 2. ఏటువంగ*: చూ, వంగ.

కంటకము. సం. వి. అ. పుం. 1. ముల్లు:చూ, సితాగ్రము;2.చేపలోనగువాని ఎముక:చూ, శల్యము. 1; 3. కాకి: చూ, వాయసము. 1; 4. గగురుపాటు: చూ, గోమాంచము; 5. వెదురు; చూ, వేణువు; 6. సూచ్యగ్రము: చూ. సూదిమొన; 7. వెటుకుమాట: చూ, పరుషము. 2; 8. త్రికంటకము*: చూ, పల్లేరు; 9. ఆరుదొండ, తుజాలకము*: చూ, దొండ; దే. వి. (1) విరోధమునుపుట్టించు మాట. స్వా. 3, అ. 84: చూ, పరుషము. 2; విణ. 2. విరోధముగలది. భాగ.అర. 6.అ. 32: చూ, విరుద్ధము.

కంటకవృంతాకి. సం. వి. ఈ. స్త్రీ. ములక*: చూ, హింగులి.

కంటకశోధనవిధి. అం. ప్రకరణములు ఇరువదింటిలో నొకటి: చూ, ప్రకరణములు.

కంటకశ్రేణి. సం. వి. ఈ. స్త్రీ. కంటకారి*: చూ, వాఁకుడు.

కంటకాంశము. పా. పద్మ్యాంశములలో నొకటి: చూ, పద్మ్యాంశములు.

కంటకాఖ్య. సం. వి. అ. స్త్రీ. అలికులసంకుల, సప్తల*: చూ, విరజాజి.

కంటకాగారము. సం. వి. అ. పుం. కృకలాసము, తొండ: చూ, సరటము.

కంటకాఢ్యము. సం. వి. అ. పుం. వికంకత:చూ, గొట్టెఁగ.

కంటకాదిభాగము. సం. వి. అ. పుం. కంపతొడుగు: చూ, ప్రాచీనము. 1.

కంటకారి. సం. వి. ఈ. స్త్రీ. బృహతి*: చూ, వాఁకుడు.

కంటకారిక. సం. వి. అ. స్త్రీ. —పై—

కంటకాలము. సం. వి. అ. పుం. :చూ, పనస*

కంటకాలుకము. సం వి. అ. పుం. తీఁటకసింద*: చూ, సముద్రాంత.

కంటకాష్ఠీలము. సం. వి. అ. పుం. ఒకరకము చేప: చూ, మత్స్యము. 1.

కంటకాసన. సం. వి. అ. స్త్రీ. కందురీఁగ:చూ, మక్షిక.

కంటకాసి. సం. వి. ఇ. స్త్రీ. బూరుగు*: చూ, శాల్మలి.

కంటకాహ్వదయము. సం. వి. అ. న. తామరదుంప*: చూ, పద్మకందము.

కంటకి. సం. వి. ఈ. స్త్రీ. 1. గొట్టె*:చూ, రేఁగు; 2. మాతులదుత్రమము*: చూ, వారద; 3. ఖలీనము, కళ్ళెము: చూ, వాగె; పుం. 4. నాగరంగము*: చూ, నారింజ; 5. ఖదిరము, చండ్ర*: చూ, విట్ఖదిరము.

కంటసరి. వై. వి.= కంఠసరః. మెడసర: చూ, భూషణము. 2.

కంటసరులు. దే. వి. బ. ఒకరకమువడ్లు: చూ, ధాన్యము.

కంటాణి. వా. కాగితములులోనగునవి కుట్టుకొనుటకనువుగ కట్టుపిడియు' గొడ్డమునుగల ఇనుప ఊచ. రూ- కంఠాణి, కంటాళము: చూ, సూది.

కంటాఫలము. సం. వి. అ. పుం. పనస *: చూ, పనస.

కంటార్తగల. సం. వి. ఆ. స్త్రీ. నల్లగోరంట*: చూ, గోరంట.

కంటాలువు. సం. వి. ఉ. స్త్రీ. ములువెంపలి*: చూ, వెంపలి.

కంటాహ్వయము. సం. వి. అ. న. తామరదుంప *: చూ, పద్మకందము.

కంటాళము. దే. వి. 1. రూ- కంఠాణి: చూ, కంటాణి; 2: చూ, కంటలము. (1), (2),(3).

కంటి. సం. వి. న్. పుం. 1. చణకము: చూ, సెనగలు; దే.వి. (1)షష్ఠీవిభక్తి కొంతమగు. ఉదా.— కన్ను-కను; కన్నులు-కనులు. ఠ. కంటి: కన్నుల- కనుల; వా. (2) కంటియ: చూ, భూషణము. 2.

కంటికలక. ద్వ. వి. 1. కలక: చూ, బిడాలము. 2; 2. కనీనిక, కంటినల్లగుడ్డు: చూ, బిడాలము. 2.

కంటికావరము. పా. క్రిందుమీదులు కనబడకపోవుట అనగా నిర్లక్ష్యము. "ఆ. కంటికావరమున గానడుమరణంబు,......భోగవాంఛచేత బురహరుగానడు." వేమన 882.

కంటిగుడ్డుపెపార. పా. నేత్రశుక్లము.

కంటికొన. ద్వ. వి. కటాక్షము,కడకన్ను: చూ, నేత్రము. 1.

కంటితెవులు. ద్వ. వి: చూ, బిడాలము. 2.

కంటిపాప. ద్వ. వి. కంటినల్లగుడ్డులోని ప్రతిఫలనము: చూ, తారకము. 1.

కంటియ. వై. వి.= కణికా. రూ-కంటె. చక్రాకారపు కంఠాభరణము. (వెండి బంగారులోనగునది): చూ, భూషణము. 2.

కంటివాలు. ద్వ. వి. (కల్లు + వాలు.) చక్రాయుధము, చుట్టువాలు. భద్రా. 1, ఆ: చూ,బాణము. 1.

కంటివినికి. దే. వి. చక్షుశ్శ్రవము, పాము: చూ, సర్పము.

కంటివిన్కరి దే. వి. —పై.—

కంటీలు. దే. వి. బ. చెవిసర. ఆం, భా. ద్వి.మ. 148: చూ, భూషణము. 2.

కంటు. దే. వి. 1. పగతుడు:చూ, శత్రువు.1; 2. ప..: చూ, విరోధము. 1.

కంటె. వై. వి. 1.= కణికా; ఆము. 6, ఆ· 6: చూ, రూ- కంటియ; దే. అవ. 2. పంచమీవిభక్తి ప్రత్యయము.

కంటోన్మెంటు. ఆం. దండువిడియు ప్రదేశము, శిబిరము.

కంట్రాక్టు. ఆం: చూ, రూ-కంత్రాక్టు.

కంట్రాక్టు ఆఫ్ సర్వీసు. ఆం. దాస్యపత్రము.

కంట్రి. ఆం. జనపదము; దేశము; నాడు; సీమ; పల్లెటూరిసీమ.

కంటుము. దే. వి: చూ, రూ- కంటలము. (1), (2), (3).

కంఠకూణిక. సం. వి. ఆ. స్త్రీ. విపంచి: చూ, వీణె.

కంఠకూర్చ. పా. (థైరోయిడ్ కార్టిలేజ్.)

కంఠక్రియలు. ఆం. సుందరి, తిర్యక్సైన, పరివర్తితము, ప్రకంపిత. (4)

కంఠగులిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, కంఠకూణిక.

**కంఠరోగజాతకుఁడు.** పా. 1. తృతీయమునఁ బాపులున్నను, 2. తృతీయాధిపతి గుళికునితోఁ గాని, రాహువుతోఁ గానిఁ గూడినను, 3. శని కుజునితోఁ గలిసి తృతీయమునఁ బాపునిచేఁ జూడఁబడినను, 4. తృతీయాధిపతి రాహువుతోఁ గలిసి యొకపాపునిచేఁ జూడఁబడినను కంఠరోగజాతకుఁడగును.

**కంఠరోహిణి.** పా. (డిప్తేరియా) ఇదియొక అంటు రోగము.

**కంఠశాలుకము.** సం. వి. అ. పుం. 1. గళశుండిక: చూ, రోగము. 1; 2. ఒకరి నాశ్రయించి జీవించుట, ఉపజీవిక: చూ, బ్రదుకు. 1.

**కంఠశోధని.** సం. వి. ఈ. స్త్రీ. మిక్కిలి తీపి నిచ్చు ఓషధి*: చూ, యష్టిమధుకము. (రూ- కంఠశోభిని.)

**కంఠశోభిని.** సం. వి. ఈ. స్త్రీ. —పై—

**కంఠశోషణము.** సం. వి. అ. న. కుత్తుక ఎండుట; 2. వ్యర్థప్రసంగము, ఉపయోగములేని సంభాషణము.

**కంఠశ్రుతి.** పా. అశ్వశాస్త్రమునందలి చిత్రవర్ణములు ముప్పదింటిలో నొకటి: చూ, చిత్రవర్ణములు.

**కంఠసరము.** సం. వి. అ. పుం.= చూ, కంటసరి.

**కంఠసిర.** పా. మెడప్రక్కనుండు పెద్దసిర. (జగ్ లర్ వెయిన్.)

**కంఠసూత్రము.** సం. వి. అ. న. 1. పుస్తె: చూ, మంగళసూత్రము; 2. మెడత్రాడు, (గొలుసు), హారము: చూ, భూషణము. 2.

**కంఠస్థము.** సం. విశే. (అ. ఆ. అ.) కంఠమందున్నది. కంఠపాఠముగా వచ్చినది.

**కంఠస్నానము.** సం. వి. అ. న. తలతడియకుండ నటుల చేయుస్నానము: చూ, స్నానము. 1.

**కంఠాగ్ని.** సం. వి. ఇ. పుం. కుత్తుకయందు నిప్పుగల పక్షి: చూ, పక్షి.

**కంఠాణి.** వా. వి: చూ, కంటాణి.

**కంఠాభరణము.** సం. వి. అ. న. కంఠమునందు నగ: చూ, భూషణము. 2.

**కంఠాభరణములు.** అం. అశ్వశాస్త్రమున దళ ధ్రువములుగాక మిగిలినశుభావర్తముల(సుడులు)కు ఆగంతుకములని నామములు. వానిలోని వినాలుగు కంఠాభరణములు: చూ, శుభావర్తములు.

**కంఠాగము.** సం. వి. అ. పుం. శూరద్వయ యుద్ధము; గొంతుపయిచేతులు వేసి త్రోసికొనెడి పోరాటము; గొంతుకచించుకొనుచు తిట్టుకొనెడి పోరాటము: చూ, యుద్ధము.

**కంఠాల.** సం. వి. ఆ. స్త్రీ. పెరుఁగు త్రిచ్చు కడవ: చూ, మంథని.

**కంఠావర్తము.** సం. వి. అ. పుం. స్త్రీసౌభాగ్య లక్షణము; మెడయందుసుడిగల స్త్రీ మంచి అదృష్టశాలియగుటకు గురుతు: చూ, లక్షణము. 1.

**కంఠి.** సం. వి. న్. పుం. క్షత్రియుఁడు: చూ, రాజు. 1; 2. కుబేరునికత్తి: చూ, కత్తి. 2; 3.= కంఠియ: చూ, భూషణము. 2; 4. మెఱుపు: చూ, విద్యుత్తు. 1.

**కంఠిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. కంఠియ. "ఉ. కంకణకంఠికా కటకకాంచి ముఖాభరణవ్రజంబుతో." వై. 7, ఆ. 11: చూ, భూషణము. 2; 2. మెఱుపు: చూ, విద్యుత్తు. 1.

**కంఠీరథము.** సం. వి. అ. పుం. బాలకాదిక్రీడా శకటము; మనుష్యులుమోయు విమానమను రథము: చూ, శకటము. 1.

**కంఠీరవము.** సం. వి. అ. పుం. సింగము: చూ, సింహము.

కంఠీరవి. సం. వి. ఈ. స్త్రీ. అడ్డసరము*: చూ, వైద్యమాత.

కంఠీరవుఁడు. సం. వి. అ. పుం. చెందురుఁడు: చూ, చంద్రుఁడు.

కంఠేకాలుఁడు. సం. వి. అ. పుం. కుత్తుకఁ గందు వాఁడు: చూ, శివుఁడు.

కంఠేరథము. సం. వి. అ. పుం. అందలము మొద్ద లగునవి: చూ, పాలకి.

కంఠేరుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) పేద: చూ, బీదవాఁడు.

కంఠోష్ఠ్యములు. పా. "ఒ-ఓ-ఔ." (మ॥ రూ॥ గారి ఆంధ్రభాషావాగను శాసనము.)

కంఠ్యము. సం. విశే. (అ. ఆ. అ.) కంఠమునఁ బుట్టినది.

కంఠ్యములు. పా. "అ- ఆ- క- ఖ- గ-ఘ-ఙ- హ- ః."

కండ. వై. వి. 1. మాంసము. "ఇందుభవత్తను వులఁ గల, కండలు పెత్తుగను." మార్క. 1, ఆ. 74: చూ, మాంసము; 2. = ఖండక. మత్స్యండి. పటికి బెల్లము. "సీ. చింపివల్క ములేమి చేసెడిపనఁ గావు నెఱపైఁ కండవుం డెఁగలుగాని॥ జై. 8, ఆ. 204: చూ, బెల్లము. 1; 3 మాంసముముక్క. "గీ. ఖం డాసైకొని కండతుండెములుగా ఖండించి." రామా. 1, ఆ: చూ, మాంసము.

కండకన్నులు. పా. దుర్మాంసము పెరిగిన కంటి తెవులు: చూ, బిడాలము. 2.

కండకాయ. పా. (బెర్రీ.) (వంకాయమున్నగునవి) కండకాయలు. (బెర్రీస్) మృదుఫలము లు. ఉదా.— దానిమ్మ, అరఁటి మొదలగు ఫలకవచము మెత్తగానుండునుగా నమృదుఫల ములు.)

కండకావరము. ద్వ. వి. గరువము: చూ, హం కారము.

కండచక్కెర. వై. వి.= ఖండశర్కర. పటిక బెల్లము: చూ, బెల్లము. 1.

కండచీమ. ద్వ. వి. ఉలంగకము, పెద్దనల్లచీమ: చూ, పిపీలిక.

కండచెక్క. వై. వి. కాలఖండము, కడుపు లోపలిపక్క నల్లనైయుండెడి మాంసము. "సీ. కండచెక్కయునంగఁ గాలఖండమల రును." ఆం, భా. ద్వి. వ. 138: చూ, యకృత్తు.

కండనము. సం. వి. అ. న. కంజాకము: చూ, తప్పు.

కండని. సం. వి. అ. న. ఉలూఖలము: చూ, రోలు. 1.

కండపట్టు. ద్వ. అ. క్రి. బలియు: చూ, స్థూలించు.

కండముక్క. వై. వి. నల్లగుండె: చూ, యకృత్తు.

కండరము. పా. స్నాయువు; పేశి; మాంస రజ్జు. (మసిల్.) ఇందుకు సంబంధించిన శాస్త్రపరిభాషాపదములు.— అంగుష్ఠాపకర్షక స్నాయువు, అంగుళీసంకోచక స్నాయువు, అంగుళపార్శ్వక స్నాయువు, అంతర్వక్రీ కా ష్ఠిక స్నాయువు, అంతరస్థశ్రోణిగవాక్షీయ స్నాయువు, అంసకంఠక స్నాయువు, అంత ర్ధమని స్నాయువు - అంతరపాంగ స్నాయువు, అంసాపకర్షక స్నాయువు, అంసాంతరిక స్నా యువు, అంతరావర్తిక స్నాయువు- ఉత్తానక స్నాయువు, అంతర్జంఘ స్నాయువు- జంఘా పురోగ స్నాయువు, అంసాతుక సంయోజక స్నాయువు, అంసోన్నమక స్నాయువు, అంసప్రచ్ఛద స్నాయువు-అధిస్కంధ స్నాయు వు, అపకర్షక (బహిక్షేపక) స్నాయువు; అధ

రావచమక స్నాయువు- అధోవృనికర్షక స్నాయువు, అధినితంబపిండక స్నాయువు, అధకటీస్నాయువు - శ్రోణిపక్షీయస్నాయువు, అధస్త్రిర్యక్ స్నాయువు, అధరాంసపృష్ఠిక స్నాయువు, అధస్థిర్యక్ స్నాయువు, అధోభృకుటిస్నాయువు - నేత్రనిమీలిక స్నాయువు - నేత్రనిమీలిని పేశీ, అక్షకోటరస్నాయువు - అధోజత్రు స్నాయువు, అధఃపార్శ్వక స్నాయువు, అక్షివిసర్జనీ పేశీ - పక్ష్మ స్నాయువు, అనైచ్ఛిక పేశ్యములు - పరతంత్రి కండరములు, ఆస్యవలయస్నాయువు - కపోలికా పేశీ - ముఖముద్రిణి పేశీ, ఉల్మలిక స్నాయువు, ఉరఃఫలక గ్రైవేయక స్నాయువు - ఉరోగ్రైవేయక స్నాయువు, ఉరోజస్నాయువు - గరిష్ఠఉరః పరిచ్ఛదస్నాయువు, ఉదరదండిక స్నాయువు, ఉత్తానక స్నాయువు - అంతరావర్తక స్నాయువు, ఉరఃకంఠిక స్నాయువు, ఉరఃకర్ణమూలిక స్నాయువు, ఉదరచ్ఛదస్నాయువు, ఊరుపరిసారక స్నాయువు, ఊర్ధ్వ నాసాపుటస్నాయువు, ఊర్ధ్వతిర్యక్ స్నాయువు, ఊరుగతుంగ పరిస్నాయువు, ఊర్ధ్వదర్శిని స్నాయువు - ఋజుఊర్ధ్వస్నాయువు, ఊర్ధ్వతిర్యక్ స్నాయువు, ఋజుఊర్ధ్వ స్నాయువు - ఊర్ధ్వదర్శిని స్నాయువు, ఋజ్వుదర స్నాయువు, ఋజుస్నాయువు - ఋజు పేశీ, ఐచ్ఛిక పేశ్యములు - స్వతంత్ర కండరములు. ఓష్ఠసమ త్రికర్షక స్నాయువు, కంఠోత్తానక స్నాయువు, కర్ణస్నాయిక్ స్నాయువు, కపోలికా స్నాయువు - వేణువాదక స్నాయువు, కంఠసంకోచిక స్నాయువు, కరపరిసారక స్నాయువు, కలారూపస్నాయువు, కటిపార్శ్వపరిచ్ఛద స్నాయువు, కపోలికా పేశీ - ఆస్యవలయ స్నాయువు - ముఖముద్రణి పేశీ, కరతలపరిసారక స్నాయువు, కటిచతుగస్రి స్నాయువు, కరపృష్ఠిక స్నాయువు, కలాకల్ప స్నాయువు, కరపత్రక స్నాయువు- మహాఅరిత్రాకార స్నాయువు - రంపపుఆకారపు స్నాయువు, కర్ణాంతరిక స్నాయువు, కండరతంతువులు - స్నాయుపక్ష్మము - కాకలీస్నాయువు, కాకాష్ఠికా స్నాయువు, క్షుద్రరస స్నాయువు - లఘుఉరః పరిచ్ఛద స్నాయువు, కూర్పరద్వారికా స్నాయువు, గరిష్ఠఉరః పరిచ్ఛద స్నాయువు-ఉరోజస్నాయువు, గరిష్ఠఊరువ్యూహ స్నాయువు, గుదాస్థి స్నాయువు, గుదోత్కర్షక స్నాయువు, గుదసంకోచక స్నాయువు, గుదకర్షక స్నాయువు, చతుష్పద స్నాయువు, చతురకస్త్రిక స్నాయువు, చర్వక స్నాయువు - హనుకూటకర్షక స్నాయువు, చిబుకజిహ్వాకంఠిక స్నాయువు, చిబుకోత్క్షేపణి స్నాయువు, జంఘాపురోగ స్నాయువు - అంతర్జంఘ స్నాయువు, జానుపృష్ఠిక స్నాయువు, జిహ్వాకంఠిక స్నాయువు, తాలూత్తంసక స్నాయువు, తాలూత్తోలక స్నాయువు, త్రికోణికాఖ్య స్నాయువు, త్రిపద (త్రిశిర) స్నాయువు, దీర్ఘకటిలంబి స్నాయువు, దీర్ఘకరవిసర్తక స్నాయువు, దీర్ఘయామ స్నాయువు, ద్విశిర స్నాయువు, ద్విగుంఫిక స్నాయువు, ద్విధారాపాత్రికారిక స్నాయువు, నటనీ స్నాయువు, నానాసంకోచక స్నాయువు, నానాపరిసారక స్నాయువు, నానామూల స్నాయువు, నితంబపిండక స్నాయువు, నేత్రనిమీలిక స్నాయువు - నేత్రనిమీలిని పేశీ -అధోభృకుటి స్నాయువు, పక్ష్మ స్నాయువు, పటహోత్తంసి స్నాయువు, పరతంత్రికండరములు -అనైచ్ఛిక పేశ్యములు, పర్యంకాంతరిక స్నాయువు, పాణిసంకోచ స్నాయువు,

కండువా. దే: చూ, రూ- కండువ.

కండువాదూలము. వా. అడ్డదూలము : చూ, దూలము.

కండువు. సం. వి. ఉ. స్త్రీ. 1. ఖర్జువు, తీటు: చూ, పామ; 2. దూలగొండి*: చూ, కూక శింబి.

కండూకరి. సం. వి. ఈ స్త్రీ. దూలగొండి* : చూ, కూకశింబి.

కండూఘ్నము. సం. వి. అ. పుం. ఆర్గ్వధము*: చూ, జిల్లేడు.

కండూతి. సం. వి. ఇ. స్త్రీ. కండువు. తీటు: చూ, పామ.

కండూయ. సం. వి. అ. స్త్రీ.—పై.—

కండూయనము. సం. వి. అ. పుం.—పై.—

కండూయిత. సం. వి. అ. పుం. గోకుకొను వాడు.

కండూర. సం. వి. అ. స్త్రీ. దూలగొండి*: చూ, కూకశింబి; 2. పుల్లబచ్చలి*: చూ, బచ్చలి.

కండూరము. సం. వి. అ. పుం. కంద* : చూ, సూరణము.

కండూలము. సం. వి. అ. పుం. —పై.—

కండె. వై. వి. 1. నాలిక డె. రూ-కండియ : చూ, సరి; 2. ధాన్యాదికణికము, జొన్న లోనగువాని కంకి: చూ, వెన్ను; 3. సాముచే మిక్కిలి గట్టిపడిన భుజము. అచ్చ. యు. కాం. 135: చూ, స్కంధము. 1.

కండెము. వై. వి. సాముచే మిక్కిలి గట్టిపడిన భుజము, కండె. "చ. ఘనుడవ సాము కండె పుం బిసాళియయింబున సారెం గాన నే, మన సునుపుక సుధారసము మాటికిం గ్రోలని మాచు." విజ. 1, ఆ. 108 : చూ, స్కంధము. 1.

కండోలకము. సం. వి. అ. పుం. గంప : చూ, బుట్ట.

కండోలము. సం. వి. అ. పుం: చూ, కండోలకము.

కండోలవీణ. సం. వి. ఆ. స్త్రీ. చాండాలిక, మాలవీణె: చూ, వీణె.

కండోలి. సం. వి. ఈ. స్త్రీ. —పై.—

కండ్రి. దే. వి. ఉలంగవము, పెద్దనల్లచీమ: చూ పిపీలిక.

కండ్రావి. దే. వి. వ్యసనకరము, కామక్రోధా దులవలనం బుట్టిన దోషసంబంధము.

కండ్లరావి. ద్వ. వి. 1. బోధిమ్రుమము *: చూ, రావి; 2. కంబూషయను యొకానొక రావి*: చూ, రావి.

కండ్వోఘము. సం. వి. అ. పుం. గొంగళిపురుగు చూ, కూకకీటము.

కంత. సం. వి. ఆ. స్త్రీ. 1. పసుపు, కుంకుమ, గుమ్మడికాయ, కుందుడుకాయలు, సున్ని పిండి, నూనె మొదలగునవి తలంటునకై పెండ్లి యైదవవాడు పెండ్లికూతురువారు పెండ్లి కుమారునివైపువారికి పంపించు తగవు;వా. వి. 2. సందుపీడ. "దొంగ ఈకంతనుండి పాతి పోయెను.": చూ, సందు 5.(రూ- గంత)

కంతి. వై. వి. 1.=గ్రంథి. పర్వము, వెదురు చెఱకు లోనగువాని కనుపు : చూ, బుడిపి 2.=గ్రంథి. అణియ : చూ, దద్దుర్వు; 3.= గ్రంథి. చీమకుట్టు లోనగువాని దద్దురు: చూ, దద్దుర్వు; 4.=గ్రంథి. దెబ్బవలన వాచు వాపు. "ద్వి. ముద్దుల వీపు కంతులు గట్ట మోదిరి వారిచ్చ. 2, భా. 503 : చూ, బొప్పి.

కంతిరీవాడు వా. వి. 1. రూ-కంత్రివాడు, ఎంగును నిలకడ లేనివాడు: చూ, సంకుసు కుడు; 2. సంకరుడు. (రూ - కంత్రి వాడు.)

కంతు. దే. వి. గడువు: చూ, మితి.

తామరలోనగు వానియుంప *: చూ, పద్మకందము; 5. కంద *: చూ, సూరణము; 6. కందారి *: చూ, దుష్టావేళ; 7. దుబ్బు: చూ, పైరుదుబ్బు; వై. వి. (1)= స్కంధః. పశుజాతి మూపు, చేప్పు. "క. కందముతీరు వృత్తముల గౌరవముంబడ పొట్ట వంబు..... లోకమై." రామా. 2, అ: చూ, స్కంధము. 1. (శబ్దరత్నాకరము)

కందమూలము సం. వి. అ. న. తెల్లగలువ *: చూ, పద్మము. 1.

కందర. సం. వి. ఆ. స్త్రీ. కందరము, కొండ యందు తొలుకఁబడిన బిలము: చూ, రంధ్రము. 1.

కందరటము. సం. వి. అ. పుం. విరిగి *: చూ, శ్లేష్మాతకము.

కందరము సం. వి. అ. న. 1. అల్లము *: చూ, శృంగబేరము; 2. కొండయందు తొలువఁబడిన బిలము : చూ, గంధ్రము. 1; 3. అంకుశము: చూ, సృణి; వి. అ. పుం. 4. అంకురము: చూ, మొలక. 1; 5. బెజ్జము: చూ, రంధ్రము. 1.

కందరాకరము. సం. వి. అ. పుం. కొండ: చూ, పర్వతము.

కందరాలకము. సం. వి. అ. పుం. కలజువ్వి*: చూ, ప్లక్షము.

కందరాలము. సం. వి. అ. పుం. 1. అక్షోటము *: చూ, వృక్షద్రుమము; 2. కలజువ్వి*: చూ, ప్లక్షము; 3. అగ్నిలింగము: చూ, పాగ.

కందరి. సం. వి. ఈ. స్త్రీ. = కందారి, తీక్ష్ణకంటక *: చూ, దుష్టావేళ.

కందరిక. దే. వి. ఎద్దువీఁపుపై వేసెడు గంత, కందళము: చూ, గంత. 2.

కందరుహా. సం. వి. ఆ. స్త్రీ. అరఁటి *: చూ, రంభ. 2.

కందరోద్భవ. సం వి. ఆ. స్త్రీ. పొట్టికొమ్మలూడలుగల చెట్టు, శిఫ *: హ్రిస్వశాఖాశిఫము.

కందర్పకూపము. సం. వి. అ. పుం. మరుని ల్లు చూ, భగము. 12.

కందర్పజీవము. సం. వి. అ. పుం: చూ, కందరోద్భవ *.

కందర్పబలశాసనము. అం. రి- ధ- హీనతానములు ఏడింటిలో నొకటి: చూ, రి-ధ - హీనతానములు.

కందర్పము. సం. వి. అ. పుం. జన్యతాళములు నూటనొకటింటిలో నొకటి: చూ, జన్యతాళములు. (చూ, తాళము. 2.)

కందర్పముసలము. సం. వి. అ. న. మగగుఱి: చూ, శిశ్నము.

కందర్పశృంఖలము. సం. వి. అ. పుం. శృంగారరతిబంధము: చూ, రతిబంధము.

కందర్పుఁడు. సం. వి. అ. పుం. మరుఁడు: చూ, మన్మథుఁడు.

కందలత. సం. వి. ఆ. స్త్రీ. మాలాకందము*: చూ, సూరణము.

కందవర్ధనము. సం. వి. అ. పుం.—వై.—

కందవల్లి. సం. వి. ఈ. స్త్రీ. చేమకర్కోటకి*: చూ, వంధ్యాకర్కోటకి.

కందసత్జ్ఞము. సం. వి. న్. న. యోనిరక్తరోగము: చూ, రోగము. 1.

కందసారము. సం. వి. అ. న. నందనవనము, ఇంద్రుని ఉద్యానవనము: చూ, వనము. 2.

కందసుందరము. సం. వి. అ. న పలురంగుల తామరపద్మము: చూ, పద్మము, 1.

సుధాబ్ధిఁ బొడమినచెలువ తోఁబుట్టుమాకు." స్వా. 2, ఆ. 41: చూ, శిశువు, 5. పటిక బెల్లము: చూ, బెల్లము. 1; అ. క్రి. 6. త పించు. "క. కందుకల పసిఁడిగాఁచినఁ, గందివివర్ణమయినట్లు." భార. సభా. 2, ఆ.89: చూ, సంతాపించు; 7. నలుపగు: చూ, స దడించు.

కందుఁడు. వై. వి. 1. = స్కంధః. కుమార స్వామి: చూ, స్కందుఁడు; 2. మరుఁడు: చూ, మన్మథుఁడు.

కందుఁబాఱు. దే. వి. (కందు + పాఱు.) రూ- కందువాఱు: చూ, మలినమగు.

కందుకనృత్యము. అం: చూ, ఉద్ధతము. 2.

కందుకము. సం. వి. అ. పుం. 1. కందుకము: చూ, బంతి. 3; 2. బదరి *: చూ, రేఁగు 1; అం. 2: చూ, ఉద్ధతము. 2.

కందుకూరిరుద్రకవి. పా. ఇతనిగ్రంథము నిరం కుశోపాఖ్యానము. (16 శతాబ్ది.)

కందుగలఱేఁడు. ద్వి. వి. ఎదమచ్చగల సామి: చూ, చంద్రుఁడు.

కందుపక్వము. సం. వి. అ. న. నీటిసంబంధము లేకుండఁగ వేఁచిన బియ్యము; పేలాలు: అటు కులులోనగునవి.

కందురీఁగ. వై. వి.= గంధోలి: చూ, మక్షిక.

కందురు. వై. వి.= —పై.— "క. ఎంతేని జనియె నాతని సుందరియును...... పురంద రుఁడరిగిన, కందువరయే నిప్పుడెట్లు గాంతు నోయనుచుఁజా." భార. ఉద్యో. 1, ఆ. 170.

కందులు. పా. బ: చూ, ఆఘికములు.

కందువ. దే. వి. 1. తెగ, గుంపు. వి, పు. 1, ఆ. 173: చూ, సమూహము; 2. చమత్కా రము. విజ. 1, ఆ. 142: చూ, సామర్థ్యము.1; 3. ఏకాంతము. "గీ. సకియలతెఱంగు... యిందువదనయున్న కందువకేతెంచి, పొంచి నిలిచి యాలకించి." విక్ర. 1. ఆ. 128: చూ, రహస్యము. 1; 4. జాడ. "వ. అచ్చోటి పెద్దలవలనం గందువయెఱిఁగిచని తత్పురాభ్యంత రంబు ప్రవేశించిరి." కాశీ. 2, ఆ. 42: చూ, సూచన. 1; 5. రహస్యపుచోటు. "క. కందువచోటికిఁ గొనిపో, వందారరు గుటయు." భార. శా. 1. ఆ. 196: చూ, మఱుఁగుచోటు; 6. ఋతువు. నిర్వ. 8, ఆ. 63: చూ, మాసద్వయము; 7. చోటు. నిర్వ. 10,ఆ. 89: చూ, స్థానము.1; 8. నేరుపు. భార. విరా. 4. ఆ. 29: చూ, సామర్థ్యము 1.

కందువము. దే. వి. 1. నేరుపు: చూ, సామర్థ్య ము. 1; 2. చమత్కారము; చూ, సామర్థ్య ము. 1. (రూ-కందువ.)

కందువాఱు. దే. అ. క్రి. (కందు + పాఱు): చూ, రూ- కందుఁబాఱు. "అరవిందవిరోధి యుఁగందువాఱె." కా. 2. ఆ. 70.

కందువు. సం. వి. ఉ. పుం, స్త్రీ. 1. పెనము, స్వేదని: చూ, పాత్రము. 6; 2. కంచుకంటు, వేఁచుటకుపయుక్తమగు లోహపాత్ర: చూ, పాత్రము. 6; దే. వి. (1) బిడ్డ: చూ, శిశువు.

కందూరము. సం. వి. అ. పుం. కంద *: చూ, సూరణము.

కందూరేఖలు. సం. వి.ఆ.స్త్రీ. మోఁకాలులయొక్క కడుపురుచములు తొడలు వీనియందుండు రేఖలు: చూ, లక్షణము. 1.

కందెన. దే. వి. 1. బండి ఇరుసునకు బూసెడు మసి; 2. బండికన్నులయందుఁ బట్టించు చేమురు. "ఇరుసునఁగందెనఁబెట్టక." సుమతీ శతకము; సై. 7, ఆ. 98.

కందెఱ. ద్వి. వి. (కన్ను + తెఱ) కంటినిరక్షించు ఱెప్ప; ఉ, హరి. 2, ఆ. 84: చూ, ఱెప్ప.

కందోటము. సం.వి. అ. న. 1.నల్లకలువ*: చూ, పద్మము. 1: పుం. 2. తెల్లకలువ *: చూ, పద్మము. 1.

కందోతము. సం. వి. అ. పుం. కలువ *: చూ, పద్మము. 1.

కందోత్థము. సం. వి. అ. న. —పై.—

కంధము. సం. వి. అ. పుం. మబ్బు; చూ, మేఘము. 1.

కంధర. సం. వి. అ. స్త్రీ. రూ-కంధరము. కంఠము: చూ, మెడ.

కంధరము. సం. వి. అ. పుం. 1. —పై.—; 2. మబ్బు: చూ, మేఘము. 1; 3. స్త్రీకి శాస్థానములలో నొకటి: చూ, కంఠము. 12.

కంధి. సం. వి. ఇ. పుం. 1. సంద్రము: చూ, సముద్రము; స్త్రీ. 2. గ్రీవ: చూ, మెడ.

కంప. సం. వి. అ. స్త్రీ. 1. కంచికామాక్షికి ప్రియమైన నొకతీర్థము; దే. వి. (1) రూ-క్రింప, ముండ్లమండ: చూ, ప్రాకారము. 1.

కంపకోట. ద్వ. వి. అలవ: చూ, ప్రాకారము. 1.

కంపగోడ. ద్వ. వి. -పై.- (కంపతోఁగూడిన గోడ.)

కంపణము. సం. వి. అ. పుం. ఒకరకము ఆయుధము. "వ. కణయకంపణ ... భిండివాలప్రముఖ ప్రహరణంబులు." ఉ, హరి. 4, ఆ. 213: చూ, బాణము. 1.

కంపతోడుకు. ద్వ. వి. రెండు ఎద్దుచెర్మి తో లెడి కంపపోగు.

కంపనము. సం. వి. అ. న. 1. అదురు: చూ, చలనము. 1; 2. వదలుట: చూ, విమోచనము; విణ. (అ. ఆ. అ.) 3. కదలునది: చూ, చరము; 4. వణకునది: కంప్రము.

కంపనుఁడు. సం. వి. అ. పుం. 1. కదలు స్వభావముఁగలవాఁడు: చూ, స్థాయిత; 2. కంపనుఁడను రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; 3. రావణుని సేనాధిపతులలో నొకఁడు: చూ, రాక్షసుఁడు. 1; 4. కదలించువాఁడు.

కంపపులుఁగు. ద్వ. వి. శకునపక్షి: చూ, వెలిగువ్వ.

కంపము. సం. వి. అ. పుం. 1. వణఁకు: చూ, వేపథువు; విణ. 2. వణఁకు: చూ, వేపథువు; అం. 3. సాత్త్వికభావములు ఎనిమిదింటిలో నొకటి—ఒడలు వణఁకుట; "అద్దిరయ్యా! యిమ్మద్దులగుమ్మ ప్రియుని ముద్దులు నడువుము గాలింజలించు మాలతియుం బోలెఁ దూలి చలించుచుండెను." (కంపము): చూ, సాత్త్వికభావములు.

కంపమాను. సం. విణ. (అ. ఆ. అ.) 1. వడఁకునది: చూ, వేపథువు; దే. వి. (1) పాడె, ఖాటి: చూ, శవయానము.

కంపలక్ష్మ. సం. వి. న. పుం. గాలి: చూ, వాయువు.

కంపలఁబడ్డకాకి. గా. చిక్కులలోఁ బడినవస్తువు. "మన్నెద్దుక్కుటకుక్ భజించుమమతి పుట్టక కంపలబడ్డకాకిపై." (పాండురంగ మహాత్మ్యము)

కంపాకము. సం. వి. అ. పుం. గాలి: చూ, వాయువు.

కంపించు. సం. అ. క్రి. వడఁకు: చూ, వణఁకు.2.

కంపితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వణఁకినది: చూ, ప్రేంఖితము; అం. 2. శిరోభేదములు తొమ్మిదింటిలో నొకటి: చూ, శిరోభేదములు; 3. శిరఃక్రియలు పదునేడింటిలో నొకటి: చూ, శిరఃక్రియలు; 4. దృష్టిక్రియలు పదునెనిమిదింటిలో నొకటి: చూ, దృష్టిక్రియలు; 5. గండక్రియ లాఱింటిలో నొకటి: చూ, గండక్రియలు; 6. అధరములు ఆఱింటిలో నొకటి: చూ, అధరము.6; 7. కటిక్రియలు అయిదింటిలో నొకటి: చూ, కటిక్రియలు; 8. ఊరుక్రియలు అయిదింటిలో నొకటి: చూ, ఊరుక్రియలు; 9. గాయకదోషములు పదునాలుగింటిలో నొకటి;

చూ, గాయకదోషములు; 10. గమకములు పదునైదింటిలో నొకటి: చూ, గమకములు.

**కంపిఱుగుడు.** దే. వి. రూ- కంపుటిఱుగుడు *: చూ, శింశుప.

**కంపిలము.** సం. వి. అ. పుం.=కంపిల్లము, రంజనికము * (కన్న-కంపిల్ల): చూ, గోచని. (పేగులలో పాములనుచంపుటకిడి మందు.)

**కంపిల్లకము.** సం. వి. అ. పుం. = కంపిల్లము. —వై.—

**కంపిల్లము.** వై. వి. = కాంపిల్య. కంపిలము. —వై.—

**కంపు.** సం. వి. ఉ. స్త్రీ. 1. మోఁగాళ్ళవఱకు కప్పియుండెడు మోజా చెప్పులు : చూ, పాదుక; దే. వి. (1) గంధము. "క. చేసినటులంటుకంపెటుగఁ జాలదునాసిక." భార. ఆశ్వ. 2, అ. 31: చూ, వాసన. 1; (2) దుర్గంధము: చూ, వాసన. 1.

**కంపుఁదుమ్మ.** దే. వి. (కంపు + తుమ్మ) తెల్లతుమ్మ *: చూ, విట్ఖదిర.

**కంపుటిఱుగుడు.** దే. వి. (కంపు + ఇఱుగుడు): చూ, రూ- కంపిఱుగుడు*.

**కంపె.** దే. వి. తాంబూలపాత్రము. ఆం, భా. ద్వి. మ. 166: చూ, పాత్రము. 6.

**కంపెనీ.** ఆం. వ్యాపారసంఘము, వర్తకసంఘము. సహవాసము.

**కంపెలుక.** దే. వి. (కంపు + ఎలుక) చుంచు: చూ, మూషికము.

**కంపోజిటరు.** ఆం. అక్షరసంధానోద్యోగి; కూర్చువాఁడు.

**కంపోత్థము.** సం. వి. అ. న. కలువ *: చూ, పద్మము 1.

**కంప్రము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కదలునది: చూ, చరము; 2. వణఁకునది: చూ, వేపథువు.

**కంప్రీకృతము.** సం. వి. అ. న. చలించునదిగాఁ జేయఁబడినది.

**కంప్రుఁడు.** సం. వి. అ. పుం. కదలు స్వభావముఁగలవాఁడు, కంపనుఁడు: చూ, క్షాయిత.

**కంబడి.** వై. వి. =కంబళి. రూ- కంబళి: చూ, రల్లకము.

**కంబమయ్య.** వై. వి. స్తంభోద్భవ నృసింహస్వామి. "సీ. కంబమయ్యరో మేలుకలిగిన నీ కొక్క గరుటాలమంతుని కానుకిత్తు." య. 2, ఆ. 3: చూ, నృసింహుఁడు.

**కంబము.** వై. వి. 1. = స్తంభః. గుంజె: చూ, స్తంభము. 1; 2. మల్లపరికరవిశేషము. ఆం, భా. ద్వి. శు. 207: చూ, మల్లశాస్త్రము.

**కంబమురాయఁడు.** వై. వి: చూ, కంబమయ్య. "రాజు గాఁడమ్మ కంబమురాయఁడు." య. 1, ఆ. 120.

**కంబగత్రాడు.** వా. వి. కొబ్బరిపీఁచుతో నల్లిన త్రాడు. చేత్రాడు: చూ, త్రాడు.

**కంబరము.** సం. వి. అ. పుం. 1. చిత్రవర్ణము: చూ. వర్ణము. 6; 2. బంగరురంగు : చూ, వర్ణము. 6.

**కంబవము.** సం. వి. అ. పుం. చీరపేను : చూ, యూకము.

**కంబవల్లి.** వై. వి. = స్తంభబలి. ఉపనయనము నందుఁ గడపటిదినముచేయు స్తంభపూజలో నగునది: చూ, స్తంభబలి.

**కంబళిభోజనన్యాయము.** పా. గొంగళిలో భోజనముచేయుచు వెంట్రుకలేతీన రీతి.

**కంబళము.** సం. వి. అ. న. 1. జలము: చూ, నీరు. 1; పుం. 2. = కంబడి. గొంగళి: చూ, రల్లకము; 3. కండువా : చూ, వస్త్రము; 4. కంబళిపురుగు: చూ, కూకకీటము; 5. గంగడోలు: చూ, సాస్న; 6. ఏనుఁగుమీఁద

బఱువైన రత్నకంబళి: చూ, రల్లకము; 7. అ శ్వోపరి చిత కంబళము: చూ, ప్రఖరము.

కంబళవాహ్యకము. సం. వి. అ. న. గంత్రి, దిడ్డిన ఎద్దులుపీయుబండి: చూ, శకటము. 1.

కంబళి. సం. వి. న్. పుం. 1. ఎద్దు: చూ, వృష భము. 1; వై. వి. (1) = కంబళి. కంబడి: చూ, రల్లకము.

కంబళిపురుగు. వై. వి. గొంగళిపురుగు: చూ, కకీటుము.

కంబళివాహ్యకము. సం. వి. అ. న: చూ, కంబళవాహ్యకము.

కంబరుఁడు. సం. వి. అ. పుం. శేషుఁడు: చూ, సర్పము.

కంబాధ. సం. వి. అ. స్త్రీ. రూ - కబాధ. తల నొప్పి: చూ, శిరోభారము.

కంబాలాట. వ్య. వి. (కంబాలు + ఆట) బాలి కల ఆటలలో నొకఆట: చూ, బాలక్రీడ.

కంబి. సం. వి. ఇ. స్త్రీ. 1. వెదురుకమ్మి: చూ, వంశాంశము; 2. ఇనుములోనగువాని గరిటె: చూ, దర్వి. 1; (చూ, పాత్రము. 6); 3 వెదురు *: చూ, వేణువు; 4. వెదురు గరిటె: చూ, తెడ్డు.

కంబిలము. సం. వి. అ. న. నీళ్ళుల పల్లము: చూ, గంధ్రము. 1.

కంబు. సం. వి. అ. న. 1. జలము: చూ, నీరు. 1; 2. తల: చూ, శిరము. 1; 3. సుఖము: చూ, సంతోషము; పుం. 4. గాలి: చూ, వాయువు; 5. నెమలి. చూ, మయూరము. (ఇట్టి ఏకాక్షరశబ్దములకు అమరాదర్శమందు మాత్రము అధునికప్రయోగములయందు రూపమిట్లు కానఁబడుచున్నది.)

కంబుక. సం. వి. అ. స్త్రీ. అశ్వగంధ *: చూ, పెన్నేరు.

కంబుగ్రీవ. సం. వి. అ. స్త్రీ. మూఁడురేఖలు (ముడుతలు) గలకంఠము: చూ, మెడ.

కంబుపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. కంబుమాలిని*: చూ, శంఖకంద.

కంబుమాలిని. సం. వి. ఈ. స్త్రీ.—వై.—

కంబులు. దే. వి. బ. 1. సజ్జపైరు: చూ, సస్య ము; 2. సజ్జలు అనుధాన్యము: చూ, ధాన్యము.

కంబువు. సం. వి. ఉ. పుం. న. 1. శంఖము: చూ, సంకు. 1; పుం. 2 ఏనుఁగు: చూ, హస్తి; 3. కడియము: చూ, భూషణము. 2; 4. నత్తగుల్ల: చూ, సంకు 1; 5. కప్పచిప్ప, జలశుక్తి: చూ, సంకు. 1; 6. కుత్తుక: చూ, మెడ; 7. జలజమనుచెట్టు: చూ, శంఖము. 6.

కంబుకము. సం. వి. అ. పుం. కండనము: చూ, నిష్ఫుసము.

కంబుకాష్ఠకము. సం. వి. అ. పుం. 1. మేలైన కడియము: చూ, భూషణము. 2; 2. మేలైన శంఖము: చూ, సంకు. 1.

కంబుకా... సం. వి. అ. స్త్రీ. కండ్లగొరిని*: చూ, గారి.

కంబోజము. సం. వి. అ పుం. 1. మేలైన శం ఖము: చూ, సంకు 1; 2. కాంభోజదేశము: చూ, దేశము; 3. కాంభోజదేశపు ఏనుఁగు: చూ, హస్తి. రూ-(కంభోజము.)

కంభోజము. సం. వి. అ. పుం.—వై.—(విశ్వ కోశము.)

కంబ్యద్భువు. సం. వి. ఉ. స్త్రీ. = కమ్మెచ్చు: చూ, బహుగంధిని.

కంభారి. సం. వి. ఈ. స్త్రీ. రూ- గంభారి, గుమ్మడు *: చూ, మహాఫలము.

కంభి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. ఇత్తడిలోనగువాని గరిటె: చూ, దర్వి. 1. (చూ, పాత్రము. 6.)

కంభువు. సం. వి. ఉ. న. ఉశీరము *: చూ, వట్టివేరు.

**కంస.** సం. వి. ఆ. స్త్రీ: చూ, కంసవతి.

**కంసజిత్తు.** సం. వి. త్. పుం. శ్రీకృష్ణుఁడు: చూ, విష్ణువు. 1.

**కంసము.** సం. వి. అ. పుం, న. 1. = కంచు. ధ్వని హెచ్చుగాఁగలలోహము: చూ, లోహము. 1; 2. కంచుగిన్నె: చూ, పాత్రము. 6; 3. మానవిశేషము; తవ్వ, కచోలము: చూ, మానము. 1.

**కంసవతి.** సం. వి. ఈ. స్త్రీ. కంసుని తోఁబుట్టువు: చూ, కంస.

**కంసహా.** సం. వి. అ. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

**కంసారాతి.** సం. వి. ఇ. పుం. శ్రీకృష్ణుఁడు: చూ, విష్ణువు. 1.

**కంసాలి.** తే. వి. కమసాలి: చూ, స్వర్ణకారుఁడు (ఆంధ్రపదపారిజాతము.)

**కంసాస్థి.** సం. వి. న్. న. కంచు: చూ, లోహము. 1.

**కంసుఁడు.** సం. వి. అ. పుం. 1. మగద్దుఁడు, తుంటరి: చూ, వ్యాఘ్రుఁడు. 2; 2. కృష్ణుని మేనమామ: 3. ఉగ్రసేనుఁడు: చూ, మూలదేవుఁడు.

**కకకకలు.** వా.వి. బ. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము. "కకకకలు కికకికలు వెకవెకలు నాడ్గఁటపనికిరావు.": చూ, హహా హహా.

**కకటిక.** సం. వి. ఆ. స్త్రీ. కివచము: చూ, బొందడము.

**కకణము.** సం. వి. అ. పుం. జలకణము: చూ, బొట్టు. 6.

**కకపాల.** వై. వి. = కక్షపాల. రూ- కక్షపాల. స్వా. 1, ఆ. 59: చూ, కైపాల.

**కకపాలము.** సం. వి. అ. పుం. అడుగునపాయిన కుండపెంకు.

**కకవికలు.** వై.వి. బ.=కాకపికా, యథాయథలు. కళా. 8, ఆ. 102: చూ, వికావికలు. (రూ- కకావికలు.)

**కకావికలగుట.** జా. చెదరిపోవుట. "ఆత్మసైనిక సముంబు కకావికలైకలంగి." కళా. 8, ఆ. 58.

**కకావికలు.** వై. వి. బ.=కాకపికా. రూ-కకవికలు. కళా. 8, ఆ. 58: చూ, వికావికలు.

**కకిరణము.** సం. వి. అ. పుం. సూర్యకిరణము: చూ, మయూఖము. 1.

**కకీర్తనము.** సం. వి. అ. న. విష్ణుకీర్తనము: చూ, స్వాగము. 2.

**కకుంభము.** సం వి. అ. పుం. సన్యాసులుంచుకొనెడి గిండివంటిపాత్రము: చూ, పాత్రము 6.

**కకుజభాషలు.** అం. భాషలు 96. అందు కకుజ భాషలు 7:—భిన్నపంచమి, కాంభోజి, మధ్యమగ్రామ, రగంతి, మధ్యమ, శకటి, మిశ్రి: (చూ, ఉపవిద్యలు.)

**కకుజభాషాంతరభాష.** అం. అంతరభాషలు నాలుగింటిలో నొకటి. పాలవాహనిక: చూ, అంతరభాషలు. 2.

**కకుజవిభాషలు.** అం. విభాషలు 20. అందు కకుజవిభాషలు 3:—భోగవర్ధని, ఆభీరిక, మధురిక. (చూ, ఉపవిద్యలు.)

**కకుత్తు.** సం. వి. ద్. పుం. 1. కకుదము, ఎద్దుమూఁపురము: చూ, స్కంధము. 1: 2. జిహ్వ, నాలుక: చూ, రసన; 3. రాజచిహ్నము: చూ, లక్షణము. 1; 4. కొమ్ము: చూ, విషాణము; విణ. 5. మేలుబంతి (విశ్వకోశము.): చూ, శ్రేష్ఠము.

**కకుదము.** సం. వి. అ. పుం, విణ: చూ, కకుత్తు.

**కకుదావర్తి.** గ. అం. అశుభావర్తములలో నొకటి: చూ, అశుభావర్తములు.

వంటి పనిముట్టు: మట్టి పెల్లగించెడు పనిముట్టు: (రూ-కత్తువ. కట్టుమడ, గసిక.)

కత్తి. వై. వి. 1.=కర్త్రి. ఖడ్గమ్. మల్లబంధవిశేషము: చూ, విన్నాణములు; 2.=కర్త్రి. ఖడ్గమ్. కత్తి: చూ, కిష్టి. 2; 3.=ఖడ్గమ్. కైదువు: చూ, బాణము. 1; 4. మంగలికత్తి: చూ, మంగలికత్తి. (రూ-కత్తియ-కత్తె. పురుషోత్తమకవీయము.)

కత్తికాసు. వై. వి. వడ్లవాని ఆయుధవిశేషము: చూ, బాణము. 1.

కత్తికలాంచుడు. ద్వ. వి. అసికరుడు: చూ, ఖడ్గి.

కత్తిగంటము. పా. ఒకకొనను కత్తిగలగంటము.

కత్తినూరుట. జా. కలహామునకు సిద్ధమగుట. "నామీఁద కత్తినూరుచున్నాఁడు." "ఇత్తరి మనపైఁ గత్తినూరుచున్నవాఁడెవండో యెఱుఁగరా." (ధర్మజరాజ నూయము.)

కత్తిపిడక. వై. వి. కుండ్రవాని కత్తులబుట్ట.

కత్తిపీట. వై. వి. కూరలు లోనగునవి తఱుగుటకుఁ బీటయందమర్చిన కత్తి: చూ, కిష్టి. 2.

కత్తిమందు. ద్వ. వి. 1. ముళ్లుగలిగి కాడలతోఁ గూడిన పాలచెట్టు. *; 2. కత్తి యొఱకు పూయువగను; 3. గడ్డలకు పూయు మందు.

కత్తిమీఁదిసాములు. జా. కష్టమగు పనులు. "దొరగతనపున్నరవుల్మఱి కత్తిమీఁది సాములు సుమ్మీ." కువలయాశ్వ. వేమన 499.

కత్తియ. అప. 1. ఒకానొక పద్యత్రయము. "అంటుకత్తియ,చెలికత్తియ,సొగసుకత్తియ." మొ. రూ-కత్తె.); 2. వై. వి.=కర్త్రి. ఆఁడుది: చూ, స్త్రీ. (పురుషోత్తమకవీయము.)

కత్తియము. దే. వి. అంకెలబంతి: రూ-కత్తెము.

కత్తిరించు. వై. క్రి. రూ-కత్రించు. వస్త్రము లోనగువాని ఛేదించు. చంద్రా. 2, ఆ. 88: చూ, చించు.

కత్తిరిల్లు. వై. అ. క్రి. భిన్నమగు. శుక. 1, ఆ. 177: చూ, వేఱుపడు.

కత్తివాతియమ్ము. వై.వి. (కత్తివాయి+అమ్ము.) అర్ధచంద్రబాణము. "ఆ. వాఁడియైన కత్తివాతియమ్మునుఁ గొని ... నైమగూఁకటుల నొనర్చి." భార. అర. 6. ఆ. 250: చూ, బాణము. 1.

కత్తులసాన. వై. వి. కరగచక్రము: చూ, సాన.2.

కత్తువ. దే. వి: చూ, రూ-కత్తవ.

కత్తృణము. సం. వి. అ. న. 1. పలఘ్నము కామంచి*: చూ, తృణము. 1; 2. నాఁచు*: చూ, శైవలము 1.

కత్తె: చూ, రూ-కత్తియ.

కత్తెము. దే. వి: చూ, రూ-కత్తియము.

కత్తెర. వై. వి. 1.=కృత్తికా. కృత్తికానక్షత్రము. కాశీ. 1, ఆ 188: చూ, నక్షత్రము. 1: 2.=కర్తరి. కత్తిరించెడి ఆయుధము: చూ, బాణము. 1; 3. భరణి మూఁడునాలుగు పాదములయందును కృత్తికయందును రోహిణి మొదటిపాదమునందును సూర్యుఁడుండు కాలము: కర్తరి; 4. కత్తెరవలె మృగములను ఖండించుటచే శుకర్రుకియ్యఁబడిన పేరు: చూ, సివంగి. 2; 5. మల్లబంధ విశేషము: చూ, విన్నాణములు.

కత్తెరకాలు. ద్వ. వి. అందలపుకొమ్ములకు అడుగున పోటీగా నమర్చెడు మాస్వకాలు.

కత్తెరగాయము. ద్వ. వి. గాయవిశేషము. ఉ, హరి. 2, ఆ. 94: చూ, గాయము.

కత్తెరచీల. ద్వ. వి. మీటముఖసలచీల వదలి రాకుండ దానిచివర రంధ్రమున నడ్డముగా వేసెడు చీల.

కత్తెరచుక్క. వై. వి. కృత్తిక: చూ, నక్షత్రము. 1.

కత్తెరదొంగ. ద్వ. వి. ముడియకత్తిరించు దొంగ: చూ, ముచ్చు. 1.

కత్తెరనెల. ద్వ. వి. కార్తికమాసము: చూ, మాసము. 1.

కత్తెరబావిలీ. ద్వ. వి. స్త్రీ. గ్రథూపావిశేషము: చూ, ధూపనము. 2.

కత్తెరబోను. ద్వ. వి. 1. ఎలుకబోను; సా. 2. అపాయకరమగుస్థితి. (వా)

కత్తెరవంగ. వై. వి.=కర్త్రాకా. పెద్దవంగ *: చూ. వంగ.

కత్తెరవాసము. ద్వ. వి. ఎగరుగాని కత్తెర వలె నుండెడు వాసము.

కత్తోయము. సం. వి. అ. న. కల్లు: చూ, సుర. 1.

కత్రి. దే. వి. జక్కులసీయను ఆటమొక్క ఒక యంగము. ఉ, రా. 6, ఆ. 189.

కత్రించు. వై. స. క్రి: చూ, రూ-కత్తిరించు. "ద్వి. కత్రించుకొనిరాయ గండనూత్రములు." రా. సు, కా. 351. పుట

కత్సవరము. సం. వి. అ. న. మూఁపు: చూ, స్కంధము. 1.

కథ. సం. వి. ఆ. స్త్రీ. 1.=కత-కద. ఇంమిక సత్యమైన ప్రబంధము; కాదంబర్యాది: చూ, సమాచారము. 2; 2. తొల్లింటికత: చూ, సమాచారము. 2; 3. వాస్తవార్థముగల హర్ష చరితాదిగ్రంథము, ఆఖ్యాయిక: చూ, పరికథ; 4. గౌరి: చూ, పార్వతి. 1; 5. మాహిష్మతీపురము: చూ, దేశము.

కథంకథికుఁడు. సం. విణ. అడుగువాఁడు: చూ, ప్రశ్నకర్త.

కథంకథిత. సం. వి. ఆ. స్త్రీ. అడుగుట: చూ, ప్రశ్నము.

కథకము. సం. వి. అ. పుం. అరగడియ: చూ, గడియ. 1.

కథకుఁడు. సం. విణ. 1. కథచెప్పెడువాఁడు: కథాప్రాణుఁడు: 2. సూతుని కొడుకు: చూ, పుత్త్రుఁడు 1; 3. చెప్పెడువాఁడు: కథాప్రాణుఁడు; 4. పురాణము తెలిసినవాఁడు: చూ, పౌరాణికుఁడు.

కథముఖ. అం. ఋగ్వేదములోని అష్టవర్గములలో నొకటి: చూ, అష్టవర్గము.

కథలుచెప్పునది. అం. మాతీ చతుష్టయములో నొకతె: చూ, మాతీచతుష్టయము. (వీనికి మతాంతరములు మూఁడుగలవు. మూఁడవ దానిలోని పరిచారికాత్రితయములో నిదియొకటి.)

కథాప్రసంగము. సం. వి. అ. పుం. 1. వాతూలము, సుడిగాలి: చూ, వాయువు; 2. అప్పుల మంద: చూ, ఘనువు; 3. తొల్లింటికత: చూ, సమాచారము. 2; 4. వేదాంగమైన విధి: కల్పము.

కథాప్రసంగుఁడు. సం. వి. అ. పుం. 1. పాములవాఁడు: చూ, మాల (1); విణ. 2. గారడీఁడు: చూ, ప్రాతిహారకుఁడు.

కథాప్రాణుఁడు. సం. విణ: చూ, కథకుఁడు. 1-3-4.

కథంచు. సం. స. క్రి. ఆజ్ఞాపించు. "క. అనుటయు ... కథంతు నీదుకోరిక యలరన్." హరి. ఉ. 5. ఆ. 110: చూ, పిలవిచ్చు.

కథితము. సం. విణ. చెప్పఁబడినది: చూ, వ్యాఖ్యాతము. 2.

కథితుఁడు. సం. విణ. చెప్పఁబడినవాఁడు: ఉక్తుఁడు.

కథోద్ఘాతము. అం. నాటకలక్షణమున ప్రస్తావనాంగములు మూఁడింటిలో నొకటి: చూ, ప్రస్తావనాంగములు. (తనకనుకూలించు సూత్రధారుని మాటగాని సంగతిగాని గ్రహించి చెప్పుట.)

కద. వై. వి. 1.=కథ. రూ-కదా. ఇంచుక సత్యమైన ప్రబంధము. కాదంబర్యాదిః చూ, సమాచారము. 2: 2.=కథ. రూ-కదా. తొల్లింటికత. రా. యు. కాం. 72: చూ, సమాచారము. 2; దే. అవ్య. 3. ప్రసిద్ధిని దెలిపెడి. ఉ, రా. 4. ఆ. 174: రూ-కదా-కదె-కదే, కా-కాదా-కాదె-కాదే.

కదంపదము. సం. వి. అ. పుం. తెల్లావాలు: చూ, సర్షపము.

కదంబకము. సం. వి. అ. పుం. 1. —వై.—; 2. గుంపు: చూ, సమూహము: వై. విశ.=(1) కదంబః. కలిసినది.(కర్పూరము అగురుచందనము కస్తూరి తక్కోలము, కుంకుమపువ్వు వీనితోఁ జేయఁబడినది.) పంచ. నా. 2. ఆ. 226: చూ, మిశ్రము. (రూ-కదంబము.)

కదంబపుష్ప. సం. వి. ఆ. స్త్రీ. ముండరిక *: చూ, ముండరిక.

కదంబపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. పెద్దబోడతరము *: చూ, ముండిని.

కదంబము. సం. వి. అ. న. 1. కదుపు, గుంపు: చూ, సమూహము; పుం. 2. తెల్లావాలు: చూ, సర్షపము; 3.=కడిమి *: చూ, నీపము; 4. కెరువు: చూ, బాణము. 1; 5. శాకనిరసితము, కూరలలోఁ దీసివేసిన తొడిమెలు పేచు మొదలైనవి; 6. కలంబము: చూ, కూరనార; 7. పక్కును, పొడిపిండి: చూ, సాదము. (1); వై. విశ. (1) మిశ్రితము. ఆము. 2, ఆ. 75, అం, భా. ద్వి. స. 168: (వృత్తియందు అంత్యవర్ణలోపంబు వికల్పంబుగాఁగు. కదంబకాది.): చూ, మిశ్రము.

కదంబముకుళన్యాయము సా. కడిమిచెట్టు పువ్వు ఒకదానిలోనుండి యొకటి వరుసగా దండవలె నుండుననుకీతి.

కదంబి. సం. వి. ఈ. స్త్రీ. ఒకానొక తీఁగె *: చూ, లత. 1.

కదంబించు. వై. అ. క్రి. 1. మిళితమగు. "సీ. సాంబ్రాణి ధూపవాసనఁ గదంబించు వీథుల మంగళద్రవ్యములు ఘటించి." జై. 7, ఆ. 49: చూ, మేళగించు. 1; అం. ప్రే. 2. మిళితముచేయు.

కదకము. సం. వి. అ. పుం. ఉల్లడ: చూ, వితానము.

కదక్షరము. సం. వి. అ. న. కుత్సితమైన అక్షరము: చూ, వర్ణము. 1.

కదధ్వము. సం. వి. న్. పుం. చెడుత్రోవ: చూ, మార్గము. 1.

కదనము. సం. వి అ. న. 1. దోసము: చూ, పాపము; 2. జగడము: చూ, యుద్ధము; 3. కీడు: చూ, విపత్తు; అం. 4. విన్నాణములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, విన్నాణములు.

కదను. దే. వి. అశ్వగతివిశేషము: చూ, హాయము.

కదన్నము. సం. వి. అ. న. కుత్సితమైన అన్నము: చూ, సాదము. (1.)

కదపా. వా. వి: చూ, ముచ్చిలక.

కదము. వై. వి.=స్కందము. అస్కందితము, రవగాలు: చూ, ఖురి.

కదర. దే. అవ్య. (కద + ర) రూ-కదరా. సంతాపార్థకము: చూ, సంతాపము.

కదరము. సం. వి. అ. పుం. 1. నల్లచండ్ర *: చూ, విట్ఖదిరము; 2. ఒకానొక రోగము: చూ, రోగము. 1; 3. క్రకచము: చూ, అంపము; 4. సోమవల్కము, తెల్లతుమ్మ *: చూ, విట్ఖదిరము; 5. కరీరము *: చూ, వెణుతురు; 6. కానుక: చూ, లంచము.

కదరె. దే. అవ్య. (కద + రె) రూ- కదరే. రసి. 4. ఆ. 177: చూ, సంతాపము.

కదరే. దే. అవ్య —పై.— "ఈ, వ్యాజస్వాంతుఁడు సక్కియుబ్బుఁగదరే." దశ. 2, ఆ. 73.

కదస్యుఁడు. సం విణ. పసినిగొట్టు: చూ, లోభి.

కదలడము. దే. వి. యాత్ర, పయనము: చూ, ప్రయాణము. (రూ-కదలిక - కదలిపోక - కదలుడు)

కదలాడు. దే. అ. క్రి. (కదలి + ఆడు) అల్లల్లాడు. హ. 2, ఆ. 47: చూ, చలించు (రూ- కదలు-కదులు-కసరు)

కదలించు. దే. స. క్రి. ఉత్సాహించు: చూ, కదలుచు.

కదలిక. దే. వి. 1. కదలు. "ఎ గి. కదలికల జాలు జలుఁగుఁబయ్యెదలతోడ." హ. 4, ఆ. 111: చూ, చలనము. 1; 2. పయనము: చూ, ప్రయాణము; 3. పూనిక. రామా. 6, ఆ. 106: చూ, యత్నము; 4. అవయవముల కదలిక: చూ, విక్షేపము. 3.

కదలిపోక. వా. వి. పయనము: చూ, ప్రయాణము.

కదలు. దే. వి. 1. కదలిక. భాగ. అర. 7, ఆ. 28: చూ, చలనము. 1; 2. పయనము: చూ, ప్రయాణము; 3. పూనిక. ఉ. హరి 5, ఆ. 184: చూ, యత్నము; అ. క్రి. 4. కదలాడు: చూ, చలించు; 5. ఏతెంచు: చూ, వెళ్లు. 3; 6. పూను. "గీ. నరుఁడుగాఁడీవమున...బాణమొకటి సంధించి యేయఁగదలఁగనొక్కని పల్కె నాకాశవాణి." జై. 5, ఆ. 122: చూ, యత్నించు; 7. పరుగిడు. ఆం. భా. త్ర. 86: చూ, పరుగెత్తు.

కదలుచు. దే. స. క్రి. రూ- కదల్చు: అదరించు- రూ- అదలించు. కదలించు- రూ- కదల్చు; (సం.ప):- ఉత్సాహించు.

కదల్చు. దే. స. క్రి. —పై.—

కదలుడు. దే. వి. పయనము. "నీరలిప్పుడే కదలుడు చాటిచెప్పుఁడేలుఁగనే." కాశీ. 4, ఆ. 187: చూ, ప్రయాణము.

కదలుతులుము. ఆం. మల్లబంధవిశేషము. విన్నాణములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, విన్నాణములు.

కదలునిలుకడ. ఆం. ఉపనీతములు పదునాలింటిలో నొకటి: చూ, ఉపనీతములు.

కదలుపరువడి. ఆం. మల్లశాస్త్రమునందలి పరువళ్ళు పండ్రెండింటిలోనొకటి: చూ, పరువళ్లు.

కదలుమెలకువ. ఆం. ఉపనీతములు పదునాలింటిలో నొకటి: చూ, ఉపనీతములు.

కదలుమొన. ఆం. మల్లశాస్త్రమునందలి మొనలు పండ్రెండింటిలో నొకటి: చూ, మొనలు.

కదళ. సం. వి. ఆ స్త్రీ. 1. కోలపొన్న *: చూ, పృశ్నిపర్ణి; 2. తుండకేరి *: చూ, దొండ; 3. బూరుగు *: చూ, శాల్మలి.

కదళకము. సం. వి. అ పుం. అరఁటి *: చూ, రంభ. 2.

కదళము. సం. వి. అ. పుం. 1. —పై.—; 2. కోలపొన్న *: చూ, పృశ్నిపర్ణి.

కదళి. సం. వి. ఈ. స్త్రీ. 1. అరఁటి *. (దీని పుష్పము శిలింధ్రము): చూ, రంభ. 2; 2. ఏనుఁగుఅంబారిమీఁది టెక్కెము: చూ, సిడము; 3. (ఇరువదియంగుళముల నిడివిగల లేడి; క. పుం. ఇరువదియంగుళముల నిడివిగల ఇఱ్ఱి. అనికొందఱు.): చూ, హరిణము. 1; 4. కవచము: చూ, బొందడము. ఆం. 5. శాక్య పాకములు మూఁడింటిలో నొకటి: చూ, శాక్య పాకములు.

**కదళీకఁద.** అం. ఆయుర్వేదమునందలి ఘృతములలో నొకటి: చూ, ఘృతములు.

**కదళీపాకము.** అం. పాకములు నాలుగింటిలో నొకటి: చూ, పాకములు.

**కదళీవంధ్య.** పా. అరఁటిచెట్టువలె నొకసారి ప్రసవించినది (స్త్రీ): (చూ, స్త్రీ.)ప్రబంధరాజ వెంకటేశ్వర విజయవిలాసము:చూ,వంధ్యలు.

**కదా.** సం. అవ్య. 1. ఎప్పుడు: కదాచన; దే.అవ్య.(1)కిలార్థకము: చూ, రూ- కద. 3. (రూ-కద- కదె- కదే- కా- కాదా-కాదె- కాదే.)

**కదాచన.** సం. అవ్య: చూ, కదా. 1.

**కదాడిక.** సం. వి. ఆ. స్త్రీ. బొంత : చూ, వస్త్రము.

**కదించు.** దే. స. క్రి. రూ- కదియించు. కదియఁజేయు. హంస. 2, ఆ. 214 (కదించి= మూసి): చూ, మూయు. 1.

**కదియఁబడు.** ద్వి. అ. క్రి. (కదియన్ + పడు) చేరు. "క. పఱతెంచి కదియఁబడియె, డ్రెబ్బఁవేసిన...మస్తకము తెగన్." నిర్వ. 3, ఆ. 27. (స్వార్థమునఁపడు.): చూ, సమీపించు.

**కదియించు.** దే. స. క్రి: చూ, రూ- కదించు.

**కదియు.** దే. అ. క్రి. 1. చేరు. భార. సౌ. 1, ఆ. 164: చూ, సమీపించు; 2. సమానముగు. భార. ఆర. 2. ఆ: చూ, సరిపోవు. 1; 3.సక్తముగు. "క. కృతనిశ్చయుఁడగు శేషుని, ధృతరాష్ట్రుఁడ నెడు ఫణికదిసియిట్లను." జై. 7, ఆ. 80: చూ, సాధించు.

**కదిర.** దే. వి. ఒకానొక చేఁప: చూ,మత్స్యము.1.

**కదీక్షణము.** సం. వి. అ. న. కుత్సితమైనచూపు: చూ, లక్షణము. 3. (ఇత్యాది)

**కదీరితము.** సం. వి. అ. న. కుత్సితవచనము: చూ, వ్యాఖ్యాతము. 2. (ఇత్యాది)

**కదీశత్వము.** సం. వి. అ. న. కుత్సితప్రభుత్వము: చూ, రక్షణము. (ఇత్యాది)

**కదీహ.** సం. వి. ఆ. స్త్రీ. కుత్సితపుఆశ: చూ, వాంఛ. (ఇత్యాది పదములూహ్యంబులు.)

**కదుకొను.** దే. అ. క్రి. (కదుము + కొను.) అతిశయించు. "చ. కదుకొనివేఁడి బాష్పములు క్రిమ్మి పయింబయిఁబర్వ." రా. యు, కాం. 2356: చూ, ముమ్మరించు.

**కదుపు.** వై. వి. 1.= కదంబ. ఆవులమంద."క. శరముల వేగంబున... వెసవునగోపకుఁడుగదుపు వెలిచిః మాడ్కిన్." భార. భీష్మ. 2, ఆ. 215; భాగ. విరా. 1, ఆ. 101 : చూ, ధేనువు; 2. సజాతీయపశుపక్ష్యాది సమూహము. "ఎనుపకదుపు, జిక్కిసన్యస్తపు, పంది పేము; 2. జగడము: చూ, యుద్ధ. చిల్క- 8. కీడు: చూ, విపత్తు; అం. వంగడము.

**కదుము.** దే. వి. 1. గ్రంథి, పుంగుడు: చూ, బొప్పి; స క్రి. 2. ఆక్రమించు, అలము. "క. బహువిధ్యోగాస్త్రములన్ ... కదిమిను నాభాది దనుజగణదేహంబుల్." ప్రభా. 5, ఆ. 214: చూ, ముగ్గించు.

**కదురు.** దే. వి. 1 నూలువడికెడు (కదురు) కపాలనాలిక: చూ, తర్కువు; అ క్రి. 2. అతిశయించు. భార. ద్రోణ. 2, ఆ. 231: చూ, ముమ్మరించు; 3. జనించు. భాగ. విరా. 2, ఆ. 33: చూ, పుట్టు. 2; 4. పొంగారు. "వ. ప్రగలని శౌర్యసంపదలఁ బెట్టినదండలు దర్పవ్యకే కదుంగదురుచు...రాను పదిసేయకపోరిరి పేరువాఁఱుచున్." కళా. 8, ఆ. 99: చూ విజృంభించు.

**కదుష్ణము.** సం. వి. అ. న. 1. ఇనుమంతకాఁక: చూ, మందోష్ణము; (చూ, వేఁడిమి); విశ. 2. ఇంచుకవేఁడిమిగలది: చూ, మిడి. 4.(చూ, వేఁడిమి.)

కనకప్రయోగ. అం. తంత్రములు అఱువదినాలుగింటిలో నొకటి: చూ, తంత్రములు.

కనకప్రసవ. సం. వి. ఆ. స్త్రీ. బంగారు మొగలి *: చూ, మొగలి

కనకము. సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1; పుం. 2. ఉమ్మెత్త *: చూ, హాలాపుష్పము; 3. సంపకము *: చూ, సంపెగ; 4. కోవిదారము *: చూ, దేవకాంచనము; 5. నల్లఅగలు: చూ, రాజార్హము; 6. ఇభాఖ్యము *: చూ, నాగకేసరము; 7. కింశుకము *: చూ, మోదుగు.

కనకరంభ. సం. వి. ఆ. స్త్రీ. సువర్ణకదళి *: చూ, రంభ. 2.

కనకరసము. సం. వి. అ. పుం. అరిదళము: చూ, హారిదళము.

కనకలత. పా. ఒకానొక వృత్తము.—— ఇందొక్కొక్క పాదమున రోజుజగణములు, ఒక నగణమునులఘువై పదుమూఁడక్షరములుండు యతి గలిగి ఏకవింశచ్ఛందస్సునందుఁబుట్టినవృత్తము. ఉదా.——"జనముల భగభగయనుచు ప్రజ జనములఁ బొదవినఁగ, దవశిఖినుడిపిన మధు ముర- నరసి దమనయసిప్పే, లవముగఁ బలుమఱు నిగుడదీ- లఘువులు మఱి పదుమూఁడ, డవ యొడ నిగతిఁబొసఁగిన బె- డఁగడరుఁ గనకలతక.": చూ, వృత్తము. 1.

కనకలోద్భవము. సం. వి. అ. పుం: చూ, సజ్జరసము.

కనకాంగి. సం. వి. ఈ. స్త్రీ. బంగారువంటి యంగములుగల స్త్రీ: చూ, స్త్రీ.

కనకాక్షి. సం. వి. ఈ. స్త్రీ. పైఁడికంటిపక్షి, గుడ్లగూబ: చూ, నకినంపుఁబులుఁగు.

కనకాచలము. సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు అస్తమించుకొండ: చూ, పర్వతము; 2. మేరుపర్వతము: చూ, పర్వతము.

కనకాద్రి. సం. వి. ఇ. పుం. ——పై.——

కనకాధ్యక్షుఁడు. సం. వి. అ. పుం. సువర్ణరక్షకుఁడు: చూ, భాండారికుఁడు.

కనకాపగ. సం. వి. ఆ. స్త్రీ. కావేరీనది: చూ, నది.

కనకారకము. సం. వి. అ. పుం. కాంచనము *: చూ, దేవకాంచనము.

కనకాలుక. సం. వి. ఆ. స్త్రీ. రాజద్వారమున నుంచెడి బంగారపు గిండిచెంబు, భృంగారము: చూ, పాత్రము. 6.

కనకాసనము. సం. వి. అ. న. బంగరుపీఁట: చూ. పీఁట.

కనకాహ్వము. సం. వి. అ. న. నాగకేసరము *: చూ, నాగకేసరము.

కనకాహ్వయము. సం. వి. అ. పుం. ఉమ్మెత్త *: చూ, హాలాపుష్పము.

కనపులు. దే వి. జెల్లు *: చూ, తృణము. 1.

కనరు. దే. వి. 1. ఒగరు. ఆము. 2, ఆ. 68: చూ, రసము. 5; 2. చేదు చూ, తిక్తము; 3. వికటుగంధము, వెగటు: చూ, సుగంధము; 4. కోపము: చూ, రోషము; (రూ-కనలు-కనుపు-కలుచే.); 5 కందగడ్డ లోనగువాని యందలి నస, దురద: చూ, మసము; విణ. 6. హితవుకానిది "ఉ. ఓరావణా నాదుబుద్ధి వినరా కనరా కనరా శుభస్థితుల్." సమీ. 3, ఆ. 116: చూ, అహితము.

కనలు. దే. వి. 1. కోపము. "కన్నులంగనలునఁ గెంపు పెంపడరఁగా." హరి. ఉ. 4, ఆ. 55: చూ, రోషము; 2. జ్వాల. "సీ. అలుఁగులఁ బొడిపించి...కరులచేఁ ద్రొక్కించి కనలా టగ్నిఁ, ద్రోయించి ... పవనుచేనిపురించి." లక్ష్మి. 4, ఆ. 178: చూ, నిప్పు; అ. క్రి. 3. కోపగించు: చూ, రోషించు; (రూ-కనారిలు-కాగు) 4. జ్వలించు. "అనలజ్వాల

"సీ. కనుగలవింటఁ జో, క్కుపు చవుల్వు ట్టించి, ... కంకేళిఁ బ్రబలరాగంబునించి." వ. సు. 3, ఆ. 53. (పొల్లుపరమగుచో ఉకారమునకు వైకల్పికముగ లోపంబగు. ఉదా. "కన్గలిగి." మొ.); స. క్రి. 3. చూచు: చూ, వీక్షించు; 4. నిశ్చయించు: చూ, ప్రసరించు; 5. ఎఱుఁగు. భాగ. స్కా. 2, ఆ. 76: చూ, తెలియు; 6. పొందు, సక్తమగు. భార. అర. 7, ఆ. 431: చూ, ప్రాపించు; 7. భాగ్యము పొందు. "ఆ. పురుషవృషభులయిన పురుషులతోడ, నారిగ పరమభక్తిఁ బరిచరింపఁ, బోవఁ నుటుశివ పుణ్యంబు సేసితి, వంచుఁ బ్రీతిఁ గాఁగిలించుకొనిరి." 291. "క. సమరమున బాహుబలద, ర్పము మెఱయంగంటి ననుచు ... సంజనుండై." భాగ. సభా. 2, ఆ. 305: చూ, ప్రాపించు.

కనుఁగొను. దే. స. క్రి. (కను + కొను) 1. చూచు: చూ, వీక్షించు; 2. ఎఱుఁగు, తెలిసికొను: చూ, తెలియు.

కనుఁబాటు. దే. వి. 1. చూపు. "గీ. శివుని కనుఁ బాటుగాఁక చిత్తభవుఁడు." విక్రి. 8, ఆ. 52: చూ, లక్షణము. 3; 2. దృష్టిదోషము. "సీ. దర్పంబు కనుఁబాటు దాఁకకుండఁగ నొడుగుల సెల్లుఖ చిగదృక్కోటినాఁగు" భాగ. భీష్మ. 1, ఆ. 119: చూ, దృష్టిదోషము.

కనుఁబ్రాము. దే. స. క్రి. (కను + ప్రాము) మోసపుచ్చు, కనుమూయు. "క. అనుజన్మవనూనమనం, బొనరించిన ద్రోహివగుట నోర్వక నిన్నుఁ, గనుఁబ్రామిసంహరించిన, నఘుఁ జెందునె సుకృతంబు నగచరతిలకా." రామా. 5. ఆ. 316: చూ, వంచించు.

కనుక. దే. ద్రి. 1. హేతువును దెలిపెడి, అటు గాన: చూ, హేతువు; 2. ఇది వాక్యాలంకారముగఁ బ్రయోగింపఁబడును. "ఉ. భూసుతకోసమేఁ గనుక బొంకితి నేనియుఁ బెద్దకాలము, జేసిననాతపంబు రసిఁ జెందక నిష్ఫలమౌ." ఉ, రా. 8, ఆ. 86: కన.

కనుకట్టు. దే. వి: చూ, రూ- కనికట్టు. (చూ, ఐంద్రజాలికము.)

కనుకని. దే. వి రూ- కన్కని. తొందఱపాటు. కళా. 7, ఆ. 158: చూ, సంభ్రమము.

కనుకలి. దే. వి. చూపు. ప్రభా. 3, ఆ. 25: చూ, లక్షణము. 3. (రూ- కన్ను-కానుపు-కాన్పు-కనుబాటు.)

కనుకుట్టు. దే. విశే. బాధకుఁడు. "నిరాలికల్క్రూరపోకులకనుకుట్టు." రా. వి. 3, ఆ. 8: చూ, కంటకుఁడు.

కనుకుట్టుఁదనము. ద్వ. వి. (కనుకుట్టు + తనము) ఈర్ష్య. "వ. కనుకుట్టుఁదనంబున సతనిధర్మంబునకు విఘ్నంబుఁ గావింపందలంచి." భో. 6. ఆ 125: చూ, మాత్సర్యము. 1.

కనుకూలి. దే. వి. ధాన్యరూపమైన కూలి.

కనుగిలుపు. దే. వి. కనుసైగచేయు: రూ- కనుగిల్పు. కనుగీటు- కన్గీటు, కన్గిలి- కన్గిలు, కన్గిలుపు- కన్గిల్పు.

కనుగిల్పు. దే. వి.—పై—

కనుగీటు. దే. వి.—పై.—

కనుగీటుట. జా. రమ్మనుట, పొమ్మనుట, కావలెననుట, అక్కఱలేదనుట, మున్నగునవి. "మీరు కాసంత కనుగీటినచో నెంతటిపనియేని రవంతలో గోటమీటుకొని వచ్చువారము." (ధర్మజ రాజసూయము.)

కనుగుఁజేఁప. ద్వ. వి. ఒకరకము చేఁప: చూ, మత్స్యము. 1.

కనుచీఁకటి. దే. వి రేఁజీఁకటి : చూ, మేచకము. 1.

కనుట. దే. వి. చూచుట: చూ, లక్షణము. 3.

కన్కని. దే. వి. రూ-కనుకని: చూ, సంభ్రమము. 1; భార. అశ్వ. 4, ఆ. 123.

కన్కంట. దే. క్రి.(కంటన్ + కంటన్) ప్రత్యక్షముగా. "తాఁజూచికన్గంట సయ్యమపాశికేశ్వరు నెట్లు మ్రింగుమనె." భాగ. 8, స్కం. 239.

కన్కిసరు. దే. వి. కోపయుక్త నేత్రదోషము.

కన్గిలి. దే. వి: చూ, రూ-కనుగిలుపు.

కన్గిలు. దే. వి. —పై.—

కన్గిలుపు. దే. వి. —పై.—

కన్గిల్పు. దే. వి. —పై.—

కన్గీటు. దే. వి. —పై.—

కన్గొను. దే. స. క్రి. (కను + కొను): చూ, రూ-కనుగొను.

కన్న. దే. అవ. ఒకానొక ప్రత్యయము. వసు. 2, ఆ. 56.

కన్నఁడు. వై. వి.=కృష్ణః. కృష్ణుఁడు: చూ, విష్ణువు. 1. (రూ-కన్నయ్య.)

కన్నకొడుకు. ద్వ. వి. కొడుకు: చూ, పుత్రుఁడు. 1.

కన్నఁగత్తి. వా. వి. దొంగ కన్నముత్రవ్వుకత్తి: చూ, ఖాణము. 1.

కన్నగాఁడు. వై. వి. (కన్నము + కాఁడు) గండిదొంగ: చూ, ముచ్చు. 1. (రూ-కన్నడీఁడు.)

కన్నడ. దే. వి. ఉపేక్ష. "సీ. ఒకనిమాటున వైరి నుఱ్ఱుడఁగించిన సుకరశౌర్యమెన్నఁ గన్నడయొనర్చు." మందా. 1, ఆ. 21: చూ, మందెమేలము. 2; అం. 2. స్త్రీరాగములు ఇరువదినాలుగింటిలోనొకటి: చూ. స్త్రీరాగములు: (చూ, స్వరము. 2.)

కన్నడబ్రాహ్మణులు. వా. శైవబ్రాహ్మణులలోని కర్ణాటకులలో నొక తెగవారు: చూ, బ్రాహ్మణులు.

కన్నడము. వై. వి.=కర్ణాట. కర్ణాటదేశభాష: చూ, భాష. 1.

కన్నడి. వై. వి.=కర్ణాట. కర్ణాటదేశస్థుఁడు: రూ-కన్నడీఁడు.

కన్నడించు. దే. స. క్రి. అశ్రద్ధచేయు: ఉప్పరికించు. (సం. ప): —ఉపేక్షించు.

కన్నడీఁడు. దే. విశే. 1. (కన్నడ + ఈఁడు) ఉపేక్షించువాఁడు: ఒప్పరికించువాఁడు; (సం. ప): —ఉపేక్షకుఁడు; 2. రూ-కన్నగాఁడు: చూ, ముచ్చు. 1; వై. వి. 3. కర్ణాట: చూ, కన్నడి (పురుషోత్తమకవీయము.)

కన్నది. వా. వి. తల్లి: చూ, మాత. 1.

కన్నవాకొడుకు. వా. వి. బెదరినవాఁడు.

కన్నపుఁగత్తి. ద్వ. వి: చూ, కన్నఁగత్తి.

కన్నపెట్టు. ద్వ. స. క్రి. (కన్నము + పెట్టు.) కన్నమువేయు. సారం. 2, ఆ. 95. పర. 4, ఆ. 185.

కన్నపోవు. ద్వ. అ. క్రి. (కన్నము + పోవు) కన్నమువేయఁబడు. పర. 5, ఆ. 15.

కన్నము. వై. వి. 1.=కర్ణః, గోడకంత: చూ, రంధ్రము. 1; 2.=కర్ణః, కనుము: చూ, రంధ్రము. 1.

కన్నయ్య. వై. వి. 1. (కన్నఁడు + అయ్య)=కృష్ణః. కృష్ణుఁడు: చూ, విష్ణువు. 1; ద్వ. వి. 2. (కన్న + అయ్య) కన్నతండ్రి: చూ, పితరుఁడు.

కన్నఱ. దే. వి. వగ. "ఉ. తలిదండ్రులు వారలటున్నవారొయీ, కన్నఱఁజూడఁ బాలయితిఁ గావిధి నేమని దూఱ నేరతుఁ." ర. మా. 2, ఆ 41: చూ, దుఃఖము.

కన్నఱతి. దే. విశే. (కన్నఱ + ఇ) దుఃఖితుఁడు; ఉ, హరి. 6. ఆ. 28: చూ, విమనుఁడు.

కన్నళవు. దే. వి. ఉపేక్ష. వసు. 4, ఆ. 86: చూ, మందెమేలము. 2.

కన్నవిటి. దే. విణ. (కన్ను + అవిటి) అంధుఁడు. "క. చెవిటికి శంఖధ్వని కన్నవిటికి దీపంబు... వృథయగుఁ." భల్లా. 4, ఆ: చూ, గుడ్డి.

కన్నాఱు. దే. విణ. (కన్ను + ఆఱు.) 1. మేలుతరము: చూ, శ్రేష్ఠము; 2. మేలుబంతి. భార. భీష్మ. 1, ఆ. 76: చూ, శ్రేష్ఠుఁడు; 3. అగ్రేసరుఁడు. స్వా. 4, ఆ. 42: చూ, శ్రేష్ఠుఁడు; వి. 4. తములపాకుల కట్టయందు మొగటనుండెడియాకు.

కన్నాణ. దే. వి. మల్లశాస్త్రమునందలి విన్నాణములలో నొకటి: చూ, విన్నాణములు (చూ, మల్లశాస్త్రము) (రూ-కన్నాతు- కర్ణాటు.)

కన్నియ. వై. వి. 1.=కన్యక. పెండ్లికానిపడుచు: చూ, స్త్రీ; 2.=కన్యక. కూఁతురు: చూ, పుత్త్రిక. 1; 3. =కన్య. కన్యారాశి: చూ, రాశి. 2; 4.=కన్య. ఆఁడుది. లక్ష్మీ. 3, ఆ. 89: చూ. స్త్రీ; విణ. 5. రూ-కన్నె. క్రొత్త. "కన్నియగేదఁగి పూరేకు. కన్నియ మొలుంగు." మొ: చూ, నూతనము; 6. చిన్న, అల్పము: చూ, స్వల్పము.

కన్నియలేడి. ద్వి. వి. కొరండము; పారిశ్చ. 1. భా. 637: చూ, మహాపక్షము. (రూ-కన్నెలేడి- కన్నెలేదు- కన్నెలేడుపిట్ట.)

కన్నీరు. ద్వి. వి. (కన్ను + నీరు) హర్షశోకములవలన కన్నులఁ గారెడునీరు: చూ. రోదనము. 2. (రూ-కన్నునీరు- నీరు.)

కన్నీరుమున్నీరు. జా. కన్నీరుసంద్రము. ఎక్కువగా యేడ్చుట. "హంసుండు కన్నీరు మున్నీరగుచుండఁ గృపాణంబునకుఁ దన ప్రాణంబులు బలియిచ్చె." (ధర్మజరాయనూయము.)

కన్ను. దే. వి. 1. కపటము. "ఆ. డబ్బుడంబు ...కిటుకుకన్ను గజముగ వుదనంగ కపటమవు." ఆం, పదా. గుణ. 10: చూ. వ్యాజము. 1; 2. పర్వము, గనుపు: చూ, బుడిపి; 3. నెమలిపురికన్ను: చూ, పించెము; 4. రూ- కను, అంజకము: చూ, నేత్రము. 1; 5. చూపు. "గీ. వచ్చిరెండకన్ను వానకన్నును నెఱుంగని పుగంధ్రులు." భార. అశ్వ. 1, ఆ. 148; ఆము. 5, ఆ: చూ, లక్షణము. 3; 6. పాడ. "వ. అని...యప్పటికన్నెఱింగి ... పట్టిన." భాగ. ఆర. 7, ఆ. 68: చూ, సూచన. 1; 7. బండిచక్రము. అచ్చ. అయో, కాం. 19: చూ, బండికల్లు; 8. వంతెనద్వారము; 9. మృదంగాది వాద్యభాండముఖమునందేర్పఱుపఁబడిన వృత్తనీలమండలము. "వ. ఎందేనియుఁ గన్ను వేయుట మృదంగాది వాదిత్రంబులయందు, ధాతువాదంబులు తెలుపగుట శాబ్దికులయందకాక." ఆము. 4. ఆ. 187; 10. కలయందలి రంధ్రములు. "వ. పాత్రలవలయునుంబోలెఁ గన్నులుచెదరి." కవిక. 4. ఆ, 113; 11. వ్రణాదిరంధ్రము: చూ, రంధ్రము.

కన్నుండఁగనుపాపతీయుట. జా. మోసపుచ్చుట. "వినువల్లభ కన్నుండఁగ నా పాపఁ దివియు నేర్పుగల మునిముచ్చు కనిత." (కళాపూర్ణోదయము.)

కన్నుగానకుండుట. జా. కంటికిఁ జూడనిస్థితి వచ్చుట. క్రిందుమీఁదు తెలియఁగకుండుట. మదమెక్కుట. "జరాసంధుఁడు గర్వాంధకారమునఁ గన్నుగానకున్నవాఁడు." (ధర్మజరాజసూయము.)

కన్నుగుట్టుట. జా. సహింపలేకపోవుట. "వాని సిరిం జూచి కన్నుగుట్టుచున్నది." (వా.)

కన్నునీరు. వా. వి: చూ, రూ-కన్నీరు.

కన్నుమొఱఁగు. దే. స. క్రి: రూ-చూ, కనుమొఱఁగు.

**కన్నులఁగప్పుకొనుట.** జా. ఎక్కువగా ప్రేమించుట. "కన్న వారి తెఱంగునఁ గన్నులఁగప్పుకొను గొప్పతనంబు." (ధర్మజ)

**కన్నులకఱవు.** జా. కన్నులకు చూచు భాగ్యము లేమి. "నీవిచ్చేటకు విచ్చేయుటంజేసి యూకొన్న నాకన్నులకఱవుదీరె." (ధర్మజ)

**కన్నులపండువ.** జా. నేత్రపర్వము. "కన్నుల పండువై పొలుచుఁ గన్గొనఁ గప్పురలక్ష్మి." (కవికర్ణరసాయనము.)

**కన్నులమండ.** దే. వి. చెఱకు*: చూ, రసాలము.

**కన్నులమాయను.** దే. వి. —పై.—

**కన్నులవిలుకాఁడు.** దే. వి. రూ- కన్నులవిల్కాఁడు; "ద్వి. కన్నులవిలుకాఁడు గాఁచె భాగ్యంబు." విష్ణు. పూ. 8 అ: చూ. మన్మథుఁడు.

**కన్నులవిలుతుఁడు.** దే. వి. —పై.— (రూ- కన్నులవిల్తుఁడు.)

**కన్నులుగలపక్కి.** ద్వ. వి. నెమలి: చూ. మయూరము; వెంకటేశ్వరఆంధ్రము. 97.

**కన్నులులేనిప్రాణి.** అం. నిరర్థకములు పదిఁటిలో నొకటి: చూ, నిరర్థకములు.

**కన్నులులేని ముఖము.** అం. అప్రకాశములు తొమ్మిదింటిలో నొకటి: చూ, అప్రకాశములు.

**కన్నువేయు,** దే. అ. క్రి. ఆదికొను: చూ, దృష్టించు.

**కన్నె.** వై. వి.=కన్యక, కన్య: చూ, రూ- కన్నియ. (కూఁతునకు.—"ద్వి. కన్నెల నూర్వురఁ గడురూపవతులఁ, గనియె." రా. బాల, కాం. 33 పుట; క్రొత్తకు.-కన్నెనెయ్యము, కన్నెతమ్మి, కన్నెయెండ మొ.)

**కన్నెకయ్యము.** ద్వ. వి. ప్రథమయుద్ధము: చూ, యుద్ధము.

**కన్నెకోమలి.** ద్వ. వి. ఔషధములలోని యొకానొక మూలిక *: చూ, వృక్షము.

**కన్నెగోరుకోఁత.** ద్వ. వి. కన్యకల గోళ్లతీయు విధి.

**కన్నెబావి.** దే. వి. నీళ్లులేనిబావి, కోనేటివంటి పెద్దబావి. (అని కొందఱు.)

**కన్నెము.** దే. వి. కోతిగుండెకాయ.

**కన్నెఱికము.** ద్వ. వి. 1. కన్యాత్వము; 2. వారకన్యాప్రథమసంగమము. "నీ కన్నెఱికముఁ గంటుసరియిచ్చి దిమ్మన్నకాదఁటవే." క్షేత్ర. గు. 186 పాట, 164 పదము.

**కన్నెఱుంగుట.** జా. అభిప్రాయము తెలిసికొనుట, ఇంగితమెఱుంగుట. "రాజు కన్నెఱింగి వాఁడవై యాతని చిత్తవృత్తి ననువర్తింపవలయు." (నీతిచంద్రిక -విగ్రహము.)

**కన్నెలేడి.** ద్వ. వి: చూ, రూ-కన్నియలేడి. "సీ. కొక్కెర...కోవెల కన్నెలేడి." యా. 2, ఆ. 24.

**కన్నెలేడు.** ద్వ. వి. —పై.— (వా)

**కన్నోజీ.** వై. వి=కన్యాకుబ్జ: చూ, రూ-కనోజీ.

**కన్నోటు.** దే. వి. (కన్ను + ఓటు) భయము: చూ, వెఱపు.

**కన్పట్టు.** దే. అ. క్రి: చూ, రూ-కనుపట్టు.

**కన్మొఱఁగు.** దే. స. క్రి: చూ, రూ-కన్నుమొఱఁగు.

**కన్య.** సం. వి. అ. స్త్రీ = కన్నియ- కన్నె. 1. పెండ్లికానిపడుచు: చూ, స్త్రీ; 2. కూఁతురు: చూ, పుత్రిక. 1; 3. కన్యారాశి: చూ, రాశి. 2; 4. ఆఁడుది: చూ. స్త్రీ; 5. గృహకన్య *: చూ, కలుబంద; 6. పటోలిక *: చూ. పొట్ల; అం. 7. రాసులు పండ్రెండింటిలో నొకటి: చూ, రాసులు, 8. దూతీచతుష్టయములలోని మూఁడవదానియందలి పదియాఱింటిలో నొకటి: చూ, దూతీ

కన్యాశుల్కము. సం. వి. అ. న. ఓలి: చూ, శుల్కము.

కన్యాసంవరణము. అం. కన్యాదానాంగములు అయిదింటిలో నొకటి: చూ, కన్యాదానాంగములు.

కన్యోపము. సం. వి. అ. న. హస్తావయవములు (వ్రేళ్ళు): చూ, హస్తపుచ్ఛము.

కన్నె. గ్రా. వి. కనుసైగ: చూ, సైగ.

కపటనాటకము. పా. ద్రోహచింతతోకూడిన నాటకము.

కపటము. సం. వి. అ. పుం, న.=కపుసు-కువాళము: చూ, వ్యాజము. 1.

కపటాలి. సం. వి. ఇ. స్త్రీ. ఫుల్లబచ్చలి*: చూ, బచ్చలి.

కపటి. సం. విణ. కపటముతోకూడినవాఁడు: కపటికుఁడు, కపటుఁడు. కృతకుఁడు,కృత్రిముఁడు; (తె. ప):—కప్పయెలుంగు పాము; న. పుం. 2. ఏనుఁగు: చూ, హస్తి.

కపటించు. సం. అ. క్రి. కపటమొందు. "ద్వా. కపటించె వైరులకు తలలెలయింక." రా. అర, కాం. 157.

కపటికుఁడు. సం. విణ: చూ, కపటి.

కపటిని. సం. వి. ఈ. స్త్రీ. చీడానాయక గంధద్రవ్యము: చూ, రాజాగ్రము.

కపటుఁడు. సం. వి. అ. పుం: చూ, కపటి.

కపటేశ్వరి. సం. వి. ఈ స్త్రీ. తెల్లవాకుఁడు*: చూ, వాఁకుడు

కపర్దకము. సం. వి. అ. పుం. 1 శివుని జటాజూటము: కపర్దము; 2. గవ్వ: చూ, వరాటము.

కపర్దము. సం. వి. అ. పుం.—పై—

కపర్ది. సం. వి. న. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

కపాటము. సం. విణ. రూ-కవాటము: చూ, తలుపు.

కపాఘము. సం. వి. అ. న. పాపిద్దుతియగుడు*: చూ, నూర్యానువర్తిని.

కపాలనాలిక. సం. వి. ఆ స్త్రీ. కదురు: చూ, తక్కువు.

కపాలభృత్తు. సం. వి. త్. పుం: చూ, శివుఁడు.

కపాలము. సం. వి. అ. పుం, న. 1. తలపుఱ్ఱె: చూ, శల్యము. 1; 2. కుండలోనగువాని పెంచిక: చూ, బోలె; 3 గుంపు: చూ, సమూహము; 4. పులుము: చూ, మండలము. 3: పుం. 5. పాము: చూ, సర్పము.

కపాలసంధి. అం. షోడశసంధులలో నొకటి: చూ, షోడశసంధులు.

కపాలికి. సం. వి. న్. పుం. 1. పునుకతాలుపు: చూ, శివుఁడు; 2. కపాలమతప్రవర్తకుఁడు; 3. ఏకాదశ రుద్రులలో నొకఁడు: చూ, రుద్రుఁడు; 4: చూ, పంటితెవులు.

కపాలిని. సం. వి. ఈ. స్త్రీ. గౌరి: చూ, పార్వతి.

కపాలుఁడు. సం. వి. అ. పుం. చెఱుగఁడు: చూ, వ్యాఘ్రుఁడు. 2.

కపి. సం. వి. ఇ. పుం. 1. నల్లమామిడి *: చూ, మామిడి; 2. తురుష్కమను గంధద్రవ్యము: చూ, రాజాగ్రము; 3. కోఁతి: చూ, వానరము; 4. వెన్నుఁడు: చూ, విష్ణువు.1; 5: చూ, సూర్యుఁడు; 6. చిల్లమడ్డి: చూ, సల్లకి; 7. ఏనుఁగు: చూ, హస్తి.

కపింజల. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకనది: చూ, నది.

కపింజలము. సం. వి. అ. పుం. = కవుజు, తెల్లలయందు చిత్రవర్ణముగల బట్టవన్నెపిట్ట: చూ, కాఁజు.

దిగ్గజముల భార్యలలో నొకతె: చూ, దిగ్గజ భార్యలు.

కపిలద్యుతి. సం. వి. ఇ. పుం: చూ, సూర్యుఁడు.

కపిలవర్గ. ఆం. అశ్వశాస్త్రమునందలి అనువర్గములు పండ్రెండింటిలో నొకటి: చూ, అనువర్గములు.

కపిలద్రాక్ష. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక ద్రాక్ష *: చూ, ద్రాక్ష.

కపిలధార. సం. వి. ఆ. స్త్రీ. 1. స్వర్గతీర్థ విశేషము: చూ, నది; 2. కపిలతీర్థము.

కపిలబ్రాహ్మణులు. సా.శీ. ఘూర్జర బ్రాహ్మణులలో నొక తెగవారు. సామవేదులు. జైమినీయ సూత్రమువారు. దేవతాపూజకులు. సూరతు, భరోచ్ జిల్లాలయందుఁ గానంబడియెదరు: చూ, బ్రాహ్మణులు.

కపిలవ[illegible]ము. సం. వి. అ. పుం. స్త్రీ సౌభాగ్య లక్షణము: చూ, లక్షణము. 1.

కపిలము. సం. వి. అ. పుం. 1. గోరోజనమువంటి వర్ణము: చూ, వర్ణము. 6; 2. బ్రాహ్మణవర్ణము: చూ, [illegible]; 3. ఒకానొక పాము: చూ, సర్పము; 4. [illegible]: చూ, [illegible]; 5. కుక్క: చూ, శునకము; విణ. 6. గోరోజనమువంటి వర్ణముగలది: చూ, వర్ణము. 6; ఆం. 7. అసంయుతహస్తములు పలుబదియైదింటిలో నొకటి: చూ, అసంయుతహస్తములు.

కపిలవర్గ. ఆం. అశ్వశాస్త్రమునందలి అనువర్గములు పండ్రెండింటిలో నొకటి: చూ, అనువర్గములు.

కపిలశింశుప. సం.వి. ఆ. స్త్రీ. పచ్చయిరుగుడు*: చూ. శింశుప.

కపిలాక్షి. సం. వి. ఈ. స్త్రీ. —వై.—

కపిలాశ్వుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు: చూ, వేలుపుఱేఁడు.

కపిలుఁడు. సం. వి. అ. పుం 1. కపిలమహాముని: చూ, ముని. 1; 2. లచ్చిమగఁడు: చూ, విష్ణువు. 1; 3. అగ్ని: చూ, నిప్పు.

కపిలె. దే. వి. ఎడ్లనుగట్టి తోలి నీరెత్తెడి యంత్రము: చూ, మోట.

కపిలోమ. సం. వి. ఆ. స్త్రీ. రేణుక *: చూ, సల్లకి.

కపిలోమఫల. సం. వి. ఆ. స్త్రీ: చూ, దూలగొండి *.

కపిలోహము. సం. వి. అ. న. ఇత్తడి: చూ, లోహము. 1.

కపిల్లిక. సం. వి. ఆ. స్త్రీ. గజపిప్పలి *: చూ, పిప్పలి.

కపిశత్రుఁడు. సం. వి. అ. పుం. నారదుఁడు: చూ, ముని. 1.

కపివల్లి. సం. వి. ఈ. స్త్రీ: చూ, కపిల్లిక. *.

కపిశ. సం. వి. ఆ. స్త్రీ. 1. చిన్న ఎఱ్ఱచీమ: చూ, పిపీలిక; 2. కపిశానది: చూ, నది; 3. పూలగురివెంద *: చూ, తులాబీజము.

కపిశము. సం. వి. అ. పుం. 1. చిల్లమడ్డి: చూ, సల్లకి; 2. పసుపుమీఱిన యెఱుపు: చూ, వర్ణము. 6; 3. [illegible]; విణ. 4. పసుపుమీఱిన యెఱుపుగలది: చూ, వర్ణము. 6.

కపిశాంజనుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

కపిశాపుత్రుఁడు. సం. వి. అ. పుం. దయ్యము: చూ, భూతము.

కపిశి. సం. వి. ఈ. స్త్రీ. పూలగురివెంద *: చూ, తులాబీజము; 2. కల్లు: చూ, సుర. 1.

కపిశిక. సం. వి. ఆ. స్త్రీ. కల్లు: చూ, సుర.1.

కపిశీర్షకము. సం. వి. అ. న. 1. కపిశీర్షము: చూ, కోటకొమ్మ; 2. గోడపైచివర: చూ, సుద. 2; 3. ఇంగిలీకము: చూ, హింగుళము.

కపిశీర్షము. సం. వి. అ.న. చూ, కపిశీర్షకము. 1; 2. గోడపైచివర: చూ, సుద. 2.

కపోతము. సం. వి. అ. పుం. 1. అడవి పావురము, గువ్వ: చూ, పావురము, 2. పారావతము: చూ, పావురము: 3 పదునైదు సంవత్సరముల యేనుఁగు: చూ, హస్తి; అం. 4. సంయుతహస్తములు ఇరువదినాలుగింటిలో నొకటి: చూ, సంయుతహస్తములు; 5. నృత్తహస్తములు ఇరువదితొమ్మిదింటిలో నొకటి: చూ, నృత్తహస్తములు.

కపోతవము. సం. వి. అ. న. పొగ్రిద్దుటిగుడుచు*: చూ, సూర్యావర్తని.

కపోతవర్ణి. సం. వి. ఈ. స్త్రీ: చూ, కపోతిక.

కపోతవేగ. సం. వి. ఆ. స్త్రీ: కపోతబంక.

కపోతసారము. సం. వి. అ. న: సౌవీరాంజనశిల: చూ, సౌవీరము. 2. (చూ, రాయి)

కపోతాంఘ్రి. సం. వి. ఇ. స్త్రీ. గువ్వగుత్తి*: చూ, గంజాగ్రము.

కపోతాంజనము. అం. అంజనములలో నొకటి: చూ, అంజనములు.

కపోతారి. సం. వి. ఇ. పుం. డేగ: చూ, శ్యేనము.

కపోదా. దే. వి. శిథిలధనువు: చూ, బాణము. 1.

కపోలము. సం. వి. అ. పుం. 1. చెక్కిలి: చూ, లెంప; 2. స్త్రీకళాస్థాన చుంబనస్థాన విశేషములు: చూ, కళలుండు స్థలములు.

కపోలములు. అం. 1. స్త్రీలక్షణాంగములు పదునెనిమిదింటిలో నొకటి; కపోలములు బలిసి యద్దములవలె నునుపుగలిగిన భూజ్యారాలగు. నునుపులైనను కుడిసుడులున్నను సుఖవతియగు. రోమములులేకున్న స్వేచ్ఛావిహారిణి యగు. నూతులవలె లొట్టలైయున్న విధవయగు: చూ, స్త్రీలక్షణాంగములు; 2. పురుషలక్షణాంగములు పదునెనిమిదింటిలో నొకటి; (చెక్కులు).— సంపూర్ణములై పద్మపత్ర సమకాంతి గలిగిన భోగియు లక్ష్మీవంతుఁడును సకలవిద్యాసంపన్నుఁడునగు. (సింహ, వ్యాఘ్ర). జసనుములైన వ్యవసాయము చేయుచు భోగియై బహుసంతతి నొందును: చూ, లక్షణాంగములు; 3. మధ్యమక్షేత్రము లయిదింటిలో నొకటి: చూ, మధ్యమక్షేత్రములు.

కపోలావర్తము. సం. వి. అ. పుం. స్త్రీసౌఖ్యలక్షణము: చూ, లక్షణము. 1.

కప్పెళి. దే. వి. ఒకానొక ధిష్ణ్యము: చూ, ధిష్ణ్యము.

కప్ప. దే. వి: చూ, మండూకము. 1.

కప్పెలుపు. దే. వి. కాసకముచేత ఉబ్బు కలిగి యుండు లేచెడు గుల్ల: చూ, వ్రణము. 1.

కప్పచిప్ప. దే. వి. నీటియందలిగుల్ల, శంబూకము: చూ, సంకు 1.

కప్పటము. అం. ఆయుధములు ముప్పదిరెంటింటిలో నొకటి: చూ, ఆయుధములు.

కప్పడము. వై. వి. 1.=కర్పటః. స్త్రీకట్టుకోక. "సీ. చిలుక తేరును ... నీకుఁ, గప్పుఁగప్పడమును... కాళి! నీకు." పా. 2, ఆ. 35: చూ, వస్త్రము: 2.= కర్పటః, చినిఁగినబట్ట. "కడవసములఁ గోలలఁగ, ప్పడములు వీగలధనంబు." భార. ఆది. 7, ఆ. 227: చూ: వస్త్రము; 3 =కర్పటః. మాసినబట్ట: చూ, వస్త్రము; 4.=కర్పటః, సన్యాసులకాటి, చూ, వస్త్రము.

కప్పతాళము. మి. వి. కప్పవలెనుండు తాళము: చూ, బీగము.

కప్పనాపురు. దే. వి. చిఱుకప్పకాటుచేత పసులకుఁ గలిగెడు పానసపురోగము. హరి, పూ. 6, ఆ. 46: చూ, పశురోగము.

కప్పము. దే వి. 1. పన్ను: చూ, సిస్తు. 1; 2. కట్నము: చూ, లంచము.

కప్పదొలుఁగుపాము. దే. వి. మండూకధ్వని చేయుపాము: చూ, సర్పము; 2: చూ, కపటి.

కప్పగపడు. ద్వ. అ. క్రి. (కప్పగము + పడు) తొట్రుపడు; "క. అప్ప కుమారులు నెనని... గప్పగపడిచూచి...పురస్కృతాగ్నిహోత్రుఁ డగుచున్." జై. 6, ఆ. 89: చూ, సంభ్రమించు.

కప్పరపాటు. ద్వ. వి. తొందరపాటు. భా. 6, స్కం. 332: చూ. సంభ్రమము.

కప్పగము. దే. వి. 1. —పై—: 2. =కప్పగము. పలుకంగులు: చూ, వర్గము. 6.

కప్పరి. వై. వి.=కర్పరి. ఓడ. పా. 3, ఆ. 280. శుక. 2, ఆ. 11: చూ, హోడము.

కప్పిరి. దే. వి. (కప్పు + ఇగులు) కొద్దిచీకటి: చూ, మేచకము. 1.

కప్పె. దే. వి: చూ, గొంక. (ప్రాక్లి.)

కప్పు. దే. వి. 1. ఆచ్ఛాదనము: చూ, వ్యవధానము. 3: 2. నలుపు: చూ, వర్ణము. 6; 3. చీఁకటి; హంస. 4, ఆ. 5: చూ, మేచకము. 1; 4. పల్నొక్కు; హంస. 4, ఆ. 8: చూ, దంతక్షతము; 5. ఇంటిపైకప్పు: చూ, పటలము; స. క్రి. 6. ఆచ్ఛాదించు: చూ, మూయు. 1; అ. క్రి. 7. క్రమ్ము. భాగ. ఆది. 2, ఆ. 15: చూ, వ్యాపించు.

కప్పుఁగుత్తుకపుల్గు. దే. వి. (కప్పు + కుత్తుక పుల్గు) నెమలి; ఆచ్చ. కిష్కిం. కాం. 69: చూ, మయూరము.

కప్పుఁదెరువరి. దే. వి. (కప్పు + తెరువు + అరి) అగ్ని: చూ, నిప్పు.

కప్పుఁదెరువుజాడ. దే. వి. (కప్పు + తెరువు జాడ) అగ్ని; ఆంధ్రనామసంగ్రహము. దేవ. 18: చూ, నిప్పు.

కప్పుఁదెరువుదారి. దే. వి. (కప్పు + తెరువు దారి) —పై—

కప్పున. దే. వి: చూ, స్థాపనము.

కప్పుచేటిగొంగ. దే. వి: చూ, బలరాముఁడు; వేంక. అం. దే. 19.

కప్పుటైదువ వెనిమిటి. దే. వి: చూ, శివుఁడు; (సాంబ. దే. 3.)

కప్పుడు. దే. వి. ఆచ్ఛాదనము: చూ, వ్యవధానము. 3.

కప్పుత్రోవరి. దే. వి. అగ్ని; సాంబ. దే. 12: చూ, నిప్పు.

కప్పుదెంచు. దే. అ. క్రి. (కప్పు + తెంచు) క్రమ్ము. "గీ. ఉఱుముచు నల్లెడం బిడుగు లుగ్రతతి...గప్పుదెంచు." భా. ద్రోణ. 1, ఆ. 89: చూ, వ్యాపించు.

కప్పుబల్ల. దే. వి. ద్వారముమీఁద గొడుగుబల్లను తన్నుబల్లను నడుమనుండెడి పలక.

కప్పుమల. దే. వి. కాటుకకొండ: చూ, పర్వతము.

కప్పుమేనిగాము. ద్వ. వి. (కప్పుమేను + గాము) శనిగ్రహము: (చూ, శని;) చూ, రాహువు 2.

కప్పురగంధి. వై. వి.= కర్పూరగంధి. కర్పూరగంధమువంటిగంధముగల ఆఁడుది; పా. 3, ఆ. 11: చూ, స్త్రీ.

కప్పురపుటనఁటి. ద్వ. వి. (కప్పురము + అనఁటి): చూ, రూ- కప్పురపుటనఁటి *.

కప్పురపునూనె. ద్వ. వి. కర్పూరతైలము: చూ, తైలము. (వా)

కప్పురపుబెండ. ద్వ. వి. (కప్పురము + బెండ) గంధమూలము *: చూ, షడ్గ్రంథ.

కప్పురపువంగ. ద్వ. వి. (కప్పురము + వంగ) కత్తెరవంగ *: చూ, వంగ.

కప్పురబోగి. వై. వి.= కర్పూరభోగి అనుసస్యము: చూ, సస్యము.

కప్పురబోగులు. వై. వి. బ. = కర్పూరభోగి.

చూ, శూద్రుఁడు; 6. కమ్మకొలమువాఁడు: చూ, శూద్రుఁడు; విణ 7. పులుసులేనిది; "కమ్మఁగూర." మొ; 8. తియ్యనిది. రూ- కమ్మన; "కమ్మనీరు" మొ: చూ, మధురము; 9. వాసనగలది. "కమ్మనూనియ." మొ.

కమ్మగాఁపు. దే. వి. మలయమారుతము: చూ. వాయువు. (రూ కమ్మగాడ్పు.)

కమ్మచ్చు. వై. వి.=కంబ్యచ్చు. (కమ్మి + అచ్చు) లోహపుఁదీఁగెల లాగునది. రూ- కమ్మిచ్చు. ఆము. 4, ఆ. 148: చూ, బహురంధ్రిణి.

కమ్మచ్చునఁదీయుట. జా. లాగఁదీయుట.

కమ్మటము. దే. వి. 1: చూ, రూ-కమటము. పండ్రా. 4, ఆ. 17; 2. అయస్కారకర్మ: కమ్మరము. (ప్రకృతి-కర్మర. పురుషోత్తమకవీయము.)

కమ్మటీఁడు. దే. వి. (కమ్మటము + ఈఁడు) కంసాలి: చూ, స్వర్ణకారుఁడు.

కమ్మతము. దే. వి: చూ, రూ-కమతము.(ప్రకృతి. కర్మఠ. (పురుషోత్తమకవీయము.)

కమ్మతీఁడు. దే. వి. (కమ్మతము + ఈఁడు) 1: చూ, రూ-కమతీఁడు. స్వా 5, ఆ. 47; 2 కమ్మరి: చూ, స్వర్ణకారుఁడు.

కమ్మన. దే. వి. 1. కమ్మఁదనము: చూ, మాధుర్యము; 2. (మాధుర్యము) కావ్యగుణములలో నొకటి: (చూ, గుణము.); 3. సౌరభము, (ఇది విశేషణమగుచో ఇకారాంతము) "ఉ. తేనెలు...కమ్మనిపండు లింపుసొంపారఁగ." భాగ. అన. 7, ఆ. 11: చూ, వాసన. 1.

కమ్మనిమ్మ.. దే. వి. తియ్యనిమ్మ: చూ, శర్కరాంకము.

కమ్మనీరు. ద్వ.వి. పూఁదేనె. ఆము. 5, ఆ.121; నై. 3, ఆ. 102: చూ, మకరందము.

కమ్మనూనియ. ద్వ. వి. సంపెంగ మొదలగువానిం జేర్చి చేసిన తైలము. రూ-కమ్మనూనె. భార. అను. 2. ఆ: చూ, తైలము.

కమ్మపంజులు. దే. వి. బ. రత్నతాటంకము, పంజులకమ్మలు స్వా. 3, ఆ. 28: చూ, భూషణము. 2.

కమ్మబిల్లి. ద్వ. వి. పునుఁగుపిల్లి. పి.శకుం. 1, ఆ. 98: చూ, మార్జాలము.

కమ్మర వై. వి. 1=కర్మార. ఇనుముపనిచేసి బ్రదికెడుజాతి: కమ్మరుల; 2 =కర్మార. ఇనుముపనిచేసి బ్రదికెడు జాతివాఁడు: చూ, స్వర్ణకారుఁడు. (వా.) (రూ- కమ్మరి- కనుమరి- కరుమరి-కరుముల.)

కమ్మరత. వై. వి. అయస్కారస్త్రీ: కమ్మరది.

కమ్మరది. వా. వి. —పై.—

కమ్మరము. వై. వి: కమ్మరిపని: రూ-కమ్మటము. (ప్రకృతి. కర్మార. పురుషోత్తమకవీయము.)

కమ్మరవాఁడు. ద్వ. వి. కమ్మరి: చూ, స్వర్ణకారుఁడు.

కమ్మరి. వై. వి =కర్మారః (కమ్మర + ఇ.) 1. —పై— అం, భా. ద్వి. కూ. 284; 2. బాణాకారుఁడు. అచ్చ. అయో, కాం.15: కమ్మరీఁడు.

కమ్మరీఁడు. వై. వి.=కర్మారః (కమ్మర + ఈఁడు). —పై.— (బాణాకారుఁడు.— "వ. తెఱవరుల గెలువం దరలు మరునకుం దఱియను కమ్మరీఁడు వెరపునం జేసియునిచిన కలికుటమ్ముల గుంపుల సొంపునం బెంపారు కలువకొ్రవ్విరులును." నీలా. 3, ఆ. 10.)

కమ్మరు. దే. వి: చూ, రూ-కమరు.

కమ్మరుబొంగు. దే. వి. రెండు గాఁడికమ్ముల నడిమి బిగిబద్ద.

కమ్మరేఁగు. దే. వి. కశేరుకము *: చూ, రేఁగు. (రూ-కమరేను-కమ్మరేను.)

కమ్మరేను. దే. వి. —పై.—

కమ్మవిలుకాఁడు. దే. వి. రూ-కమ్మవిల్కాఁడు. మరుఁడు: చూ, మన్మథుఁడు. విక్రి. 8, ఆ. 57.

కమ్మవిలుతుఁడు. దే. వి. రూ- కమ్మవిల్తుఁడు. —పై.—

కమ్మి. వై. వి. 1.=కంబి- కంభీ. వెదురులోన గువాని కమ్మి: చూ, వంశాంశము; 2 =కంబి-కంభీ. బంగారులోనగు వాని కమ్మి; 3.వస్త్ర పుఁగమ్మి. భీ. 1, ఆ. 116: చూ, చెంగు; 4. బండికంటి కడకమ్మి. భాగ. 5, స్కం. 2, ఆ. 81; 5. పేముబొద్దు: చూ, బొద్దు.

కమ్మిబండి. ద్వ. వి. కమ్మివేసిన మ్రానిచక్రపు బండి: చూ. శకటము. 1.

కమ్మిరించు. దే. అ. క్రి. ఆచ్ఛాదించు. భో. 3, ఆ. 44: చూ, మూయు. 1.

కమ్ము. వై. స. క్రి. 1. కమ్మిగా చేఁగఁగొట్టు. వసు. 2, ఆ. 82; 2. చుట్టుకొను : చూ, వేష్టించు.

కమ్ముకొను. వై. స క్రి. గుట్టుగానుంచుకొను.

కమ్మునీరు. ద్వ. వి. ఉపజలము: చూ, నీరు. 1.

కమ్ములపైబండి. దే. వి. ఘూమశకటము: చూ, పొగబండి. (రైలు) (ట్రామ్) (డీసెల్ రైలు కారు)

కమ్మెచ్చు. వై. వి. చూ, రూ-కమ్మచ్చు.

కమ్మెగాకు. దే. వి. (కమ్మెర + ఆకు) కొరపు నల్లతములపాకు: చూ, తములపాకు.

కమ్మెరాకుతీఁగె. దే. వి. కారపు నల్లతములపాకులతీఁగె *: చూ, తాంబూలవల్లికి.

కమ్ర. సం. వి. ఆ. స్త్రీ. ఏఱు: చూ, నది.

కమ్రము. సం. వి. అ. న. 1. పిడకనిప్పు: చూ, నిప్పు; విశే. 2. ఇంపైనది: చూ. హృద్యము; 3. ఇచ్ఛకలది: చూ, వాంఛ.

కమ్రుఁడు. సం. విశే. కాముకుఁడు: చూ, వలపుకాఁడు.

కయస్థ. సం. వి. ఆ. స్త్రీ. ఉసిరిక *: చూ, శ్రీఫలి. 1.

కయానము. సం. వి. అ. న. జలయానము.

కయావాహము. సం. వి. అ. పుం : చూ, ఎనుపదూడ.

కయి. దే. వి. 1. చేయి. రూ-కై: చూ, హస్తము; వై. వి. 2.=కవి, రూ-కై : చూ,మాటలల్లువాఁడు; (రూ-కయివాసరుఁడు - కై - కైస రుఁడు) 3. లొందము: రూ, కుండము; అప. 4. చతుర్థీవిభక్తి ప్రత్యయము. రూ- కై.

కయిక. వై. వి. 1.=కైకేయి. కేకయరాజుకూఁతురు: చూ, కైకేయి; 2. దశరథమహారాజు భార్య: చూ, కైకేయి.

కయికట్టు. ద్వ. వి. రూ- కైకట్టు. సందర్భము: చూ, సమయము. 1.

కయికానుక. దే. వి. రూ- కైకానుక. రాజులు లోనగువారినిఁ జూడఁబోవునపుడు కొనిపోయెడి యుపహారము. రామా. 2, ఆ. 5; య. 1, ఆ. 104: చూ, లంచము.

కయికొను. దే. అ. క్రి. 1. రూ- కైకొను. పూను: చూ, యత్నించు; స. క్రి. 2 రూ- కైకొను. గ్రహించు : చూ. పుచ్చుకొను; 3. రూ-కైకొను. లక్ష్యపెట్టు: చూ, లెక్క సేయు.

కయికోలుపు. దే. ప్రే. కైకొనఁజేయు. రూ-కైకొలుపు.

కయికోల. దే. వి. గుడ్డలునేసి బ్రదికెడు ఒకానొకజాతి: రూ-కైకోల.

కయికోలవాఁడు. దే. వి. ఒకరకము సాలెవాఁడు. రూ-కైకలవాఁడు-కైకోలవాఁడు: చూ, సాలెవాఁడు.

**కయికోలు.** దే. వి. 1. రూ- కైకోలు. అంగీకారము: చూ, సమ్మతి. 1; 2. రూ- కైకోలు. గ్రహణము: చూ, ప్రతిగ్రహము. 1.

**కయిచేఁపులు.** దే. వి. బ. రూ- కైచేఁపులు: చూ, నమస్కారము.

**కయిజీతము.** ద్వ. వి. రూ- కైజీతము : చూ, బత్తెము.

**కయిజో.** దే. వి. వాగెనువెనుక కీడ్చికట్టుట: రూ- కైజో.

**కయిజోలు.** దే. అ. క్రి. ఒఱగు: చూ, వ్రాలు. 3.

**కయిఁజో.** దే. వి. రూ- కైఁజో: చూ, కాఁజో (ప్రకృతి-కపింజల. పురుషోత్తమకవీయము.)

**కయిదువు.** దే. వి. పోలిక : చూ, సామ్యము. (రూ-కైదువు.)

**కయిత.** వై. వి.=కవితా. కవిత్వము : చూ, మాటలల్లుట. (రూ-కయితము-కైతము-కైత)

**కయిదండ.** దే. వి. రూ-కైదండ: చూ, భూషణము. 2.

**కయిదు.** దే. వి. 1. రూ- కైదు. కపింజలము: చూ, కాఁజో; 2. రూ- కైదు. చెఱ చూ, బంధనాలయము; (చూ, గృహము. 1.)

**కయిదువు.** దే. వి. రూ-కైదువు: చూ, బాణము. 1.

**కయిపదము.** వై. వి.=కవిపదమ్. రూ-కైపదము. కవిపరిజ్ఞానపరీక్షార్థము పూరింపనిచ్చెడిపద్యాంశము: చూ, సమస్య.

**కయిపు.** దే. వి. 1. రూ-కైపు. క్రొవ్వు: చూ, మదము. 1; 2. రూ- కైపు. అందము: చూ, సౌందర్యము; 3. రూ- కైపు. రీతి : చూ. విధము. 1; 4. రూ- కైపు. ఉంకింపు: చూ, విజృంభణము; 5. రూ -కైపు. కపటము: చూ, వ్యాజము. 1.

**కయిఫీయతు.** హిం. వి. ఒకానొక విషయమునకు తీసికొను వాఙ్మూలము.

**కయిముడి.** దే. వి. రూ- కైముడి. చర్మవాద్యములలో నొకటి: చూ, వీణె.

**కయిమోడుపు.** ద్వ. వి. రూ-కైమోడుపు: చూ, నమస్కారము.

**కయిరఁడు.** దే. వి. కయిరఁడను పేరుగలగుఱ్ఱము: చూ, హయము.

**కయిరవడి.** వై. వి.=ఖాదిరవటికః. రూ- కైరవడి: చూ, రంగదము.

**కయిలాగు.** దే. వి. రూ- కైలాగు: చూ, భూషణము. 2.

**కయిలాటకాఁడు.** దే. విశే. (కయిలాటము+కాఁడు) రూ- కైలాటకాఁడు. మాయావి: చూ, ప్రాతిహారికుఁడు.

**కయిలాటము.** దే. వి. రూ- కైలాటము: చూ, మాయము. 1.

**కయిలు.** దే. వి. పండిన ధాన్యపుకోలత : చూ, రూ- కైలు.

**కయివడి.** దే. వి. 1. ప్రకారము. రూ- కైవడి: చూ, విధము. 1; 2. రూ-కైవడి. పోలిక: చూ, సామ్యము. (రూ- కయివలి - కవుడవు- కైవడి- కైవలి)

**కయివడిముస్తె.** వై. వి.=కైవర్తీముస్తకమ్. రూ- కైవడిముస్తె. *: చూ, ముస్తకము.

**కయివలి.** దే. వి. రూ- కైవడి. పోలిక: చూ, సామ్యము.

**కయివారము.** దే. వి. 1. గనిమయించు: రూ- కైవారము; వై. వి. 2.=కవిహార. రూ-కైవారము. పొగడిక: చూ. స్తోత్రము.

**కయివారముసేయు.** ద్వ. స. క్రి. రూ-కైవారముసేయు. పొగడు: చూ, స్తుతించు.

**కయివు.** దే. వి. 1. రూ- కైవు. ఉన్మాదము: చూ, వెఱ్ఱి. 1; 2. రూ- కైవు. లాహిరి: చూ, మదము. 1.

కయివ్రాలు. దే. అ. క్రి. 1. రూ- కైవ్రాలు. ఒఱగు: చూ, వ్రాలు. 3; 2. పక్షులులోనగునవి క్రిందికిదిగు: రూ- కైవ్రాలు; 3. రూ- కైవ్రాలు. కొలుచు: చూ, ప్రవిలచు.

కయివ్రాలుచు. దే. ప్రే. కైవ్రాలఁజేయు: రూ- కైవ్రాలుచు.

కయిసరుఁడు. వై. వి.=కవీశ్వరః: చూ, రూ- కయిసరుఁడు.

కయిసాటిచుక్క. ద్వ. వి. హస్తానక్షత్రము. రూ- కైసాటిచుక్క: చూ, నక్షత్రము. 1.

కయిసేఁత. ద్వ. వి. 1. రూ- కైసేఁత. అలంకారము: చూ, భూషణము. 2; 2. రూ- కైసేఁత. పూజ: చూ, సపర్య.

కయిసేయు. ద్వ. స. క్రి. 1. రూ- కైసేయు. అలంకరించు: చూ, సింగారించు; 2. రూ- కై సేయు అర్చించు: చూ, పూజించు.

కయిసరుఁడు. వై. వి.= కవీశ్వరః. రూ- కైసరుఁడు: చూ, మాటలల్లువాఁడు.

కయ్య. దే. వి. 1. రూ- క్రియ్య. చిన్ననీటి కాలువ: చూ, నది; (ప్రకృతి- కుల్య. పురుషోత్తమకవీయము.); 2. మరిమడి: చూ, పొలము.

కయ్యపుఁదిండి. దే. వి. (కయ్యము + తిండి) కలహభోజనుఁడు, నారదుఁడు. అచ్చ. సుం, కాం. 2: చూ, ముని. 1.

కయ్యము. దే. వి. జగడము: చూ, యుద్ధము. (ప్రకృతి-కలహ. పురుషోత్తమకవీయము.)

కయ్యర. దే. వి. హీనజాతివార్తికము: చూ, ముత్తెము.

కయ్యాలకచ్చె. దే. వి. కణ్ణికోరు పాండు 4. ఆ. 10: చూ, పేచీకోరు.

కయ్యాలమెకము. ద్వ వి. జంబుకము: చూ, నక్క.

కర. వై విశ. 1.=ఖరమ్. తీక్ష్ణము. "కరసార.": చూ, తీవ్రము; (రూ- కరా- కఱుకు) దే.వి. 2.అల; చూ, వీచి.1; (రూ-కరడు-కరడము-కరండము-కడలు) 3. ఒడ్డు. లక్ష్మి. 1, ఆ. 42: చూ, తీరము; 4. పసులుమేయుటకై దున్నక నిలిపిన పొలము: (చూ, వివీతము.); చూ, భూమి. 1.(రూ-కొరక-కొరన-కొఱఁకు-కొఱను); 5. గౌరవము: చూ, మర్యాద.

కరంకము. సం. వి. అ. పుం. 1. లోపల నేమియు లేని బొండ్లపుఁజిప్ప: కరకము; (తె. ప):—చిప్ప; 2. కంకాళము, ఎముకలగూఁడు: చూ, శల్యము. 1; 3. తల: చూ, శిరము. 1; 4. వక్కలాకులతిత్తి: చూ, పాడపము. 1; 5. పుర్రె, కపాలము: చూ, శల్యము. 1.

కరంకశాలి. సం. వి. ఇ. పుం. కరంకమను పేరు గల చెఱకు *: చూ, చెఱకు.

కరంగము. సం. వి. అ. పుం. కొంచెము పాదవు గల జింక: చూ, హరిణము. 1.

కరంజకము. సం. వి. అ. పుం. కానుగు*: చూ, శాదఘ్నము.

కరంజఫలకము. సం. వి. అ. పుం. కపిత్థము *: చూ, వెలఁగ.

కరంజము. సం. వి అ. పుం. 1. కానుగు *: చూ, శాదఘ్నము; న. 2. పులిగోరు *: చూ, వ్యాఘ్రనఖము; 3. కగ్గకాయ: చూ, భిక్ష్యము.

కరండకము. సం. వి. అ.పుం. కరాటము: చూ, పాత్రము. 6.

కరండము. సం. వి. అ. పుం, స్త్రీ, న. 1.=కరడము. —వై.—; 2. కత్తి: చూ, రిష్టి 2; 3. తేనెపెర: చూ, మధుపటలము; 4. కన్నెలేడి: చూ, మహాపక్షము; 5. తెలికలు *: చూ, నువ్వులు; దే. వి. (1) అల: చూ, వీచి. 1.

కరండి. సం. వి. న్. పుం. ఒకరకముచేఁప: చూ, మత్స్యము. 1.

కరంబము. సం. వి. అ. పుం. 1. కంపిల్లము *: చూ, రోచని; 2. కూడిక: చూ, సంయోగము; 3.రూ-కరంభము.(పెరుఁగులోఁ కలిపిన) పేలపిండి: చూ, సాదము. (1); విణ. 4. కలిసినది: చూ, మిశ్రము.

కరంబితము. సం. విణ. 1. కలిసినది: చూ, మిశ్రము; 2. చెక్కఁబడినది: చూ, రక్షితము.

కరంభ. సం. వి. అ. స్త్రీ. దుట్టుపు *: చూ, విషాణి.

కరంభకము. సం.వి అ.న. (పెరుఁగులోఁగలిసిన) పేలపిండి: చూ, సాదము. (1)

కరంభము. సం. వి. అ. పుం. 1. —పై.—; 2. వనపిప్పలి *: చూ, పిప్పలి.

కరఁగు. దే. వి. 1. కరఁగుట; అ.క్రి. 2. కాళు. లక్ష్మి. 3, ఆ 71: చూ, స్రవించు; అంత్రి. 3 కరఁగించు. భార. విరా. 2, ఆ 27: కరఁచు.

కరఁగుపడు. ద్వ. అ. క్రి. (కరఁగు + పడు) కరఁగు. స్వా. 6, ఆ. 9: చూ, స్రవించు,

కరఁచు. దే. ప్రే. కరఁగఁజేయు: చూ, కరఁగు 3.

కరక. సం. వి. అ. స్త్రీ, అ. పుం. 1. ఇరాచరము: చూ, వడగల్లు; 2.= కరగ. గళంతిక: చూ, పాత్రము. 6; దే. వి. (1) కరక *: చూ, హరీతకి; (2) బూతి: చూ, భస్మము; అం. 3. ఫలములు మూఁడింటిలో నొకటి: చూ, ఫలములు.

కరకంచు. దే. విణ. (కరక + అంచు) కరకాయ నీటిలో వ్రాసిన అంచు: చూ, చెంగు.

కరకంటకము. సం. వి. అ. పుం. గోరు: చూ, నఖము.

కరకటి. దే. వి. బలము: చూ, స్థూలము. 2.

కరకణి. దే. వి. వేఁటాడుటకు ఉపయుక్తమగు ఒకానొక సాధనము. "గొరక లత్తళములు కరకణీలు." సుకాం, 3. ఆ. 70: చూ, వాగుల.

కరకపత్రిక. సం. వి. అ. స్త్రీ. నీళ్లుముంచు తోలుబొక్కెన: చూ, బొక్కెన.

కరకము. సం. వి. అ. పుం. 1. ఎముకలగూఁడు: చూ, కల్యము. 1: పుం, న. 2. కమండలువు: చూ, పాత్రము. 6; 3. లోపలను ఏమియు లేని బొండ్లపుచిప్ప: చూ, కరంకము. 1; పుం. 4. దాడిమము *: చూ, దానిమ్మ; 5. ఒకరకముపక్కి: చూ, పక్షి; 6. అహింస్రపత్రిము *: చూ, పుట్టగొడుగు; 7. కరక: చూ, వడగల్లు. (రూ-కరము.)

కరకర. దే. వి. 1. వ్రాయుట, పినగలు మొదలగునవి నములుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హరాహరా; 2. ప్రొద్దు పొడుచుటయందగు ననుకరణము: చూ, హరాహరా.

కరకరి. దే. వి. 1. నొప్పించుస్వభావము; 2. మచ్చరము: చూ, మాత్సర్యము; 3. కోపము: చూ. రోషము; 4. పగ: చూ, విరోధము. 1; 5. కలఁత, క్షోభము: చూ, సంతాపము.

కరకసా. వై. విణ. కఱకు. "కరకసానేల." "మనకు కరకసామాటలేల.": చూ. బెడిదము.

కరకాంభము. సం. వి. న. పుం. కొబ్బరి *: చూ, నారికేళము.

కరకావృష్టిన్యాయము. పా. రాతినేలపై వాన కురిసినరీతి.

కరకొమ్మ. దే. వి. మచ్చరము: చూ, మాత్సర్యము.

కరకాయ. దే. వి. (కరక + కాయ) కరక చెట్టుకాయ. (శ్లేష్మహరము. విరేచనకారి.)

కరగ. దే. వి. కురిమిడిగట్టు: చూ, పేటువు. 1.

కరగసము. వై. వి.=క్రకచః: చూ, అంపము.

కరగోడ. ద్వ. వి. కోరడి: చూ, ప్రాచీనము.

కరగ్రహణము. సం. వి. అ. న. 1. పెండ్లి: చూ, వివాహము; 2. చేపట్టు: చూ, హస్తగ్రహణము.

కరఘర్షణము. సం. వి. అ. పుం. పెరుగు త్రచ్చు కవ్వపుకఱ్ఱ: చూ, మంథానము.

కరఘర్షి. సం. వి. న్. పుం. —పై.—

కరచ్ఛద: సం. వి. అ. స్త్రీ. అధోపుష్పి*: చూ, బరివెంక.

కరచ్ఛదము. సం. వి. అ. పుం. —పై.—

కరచ్ఛురిక. సం. వి. అ. స్త్రీ. =కరంకోమేరిక త్తి: చూ, రిష్టి. 2.

కరజము. సం. వి. అ. న. 1. పులిగోరు. రూ-కరంజము *: చూ, వ్యాఘ్రనఖము; 2. గోరు: చూ, నఖము; 3. కానుగు, రూ-కరంజకము *: చూ, శాదఘ్నము; 4: చూ, చెడుదుమ్మ.

కరజాఖ్యము. సం. వి. అ. పుం. పులిగోరు *: చూ, వ్యాఘ్రనఖము.

కరజోడి. సం. వి. ఇ. పుం: చూ, హస్తజోడి*.

కరట. సం. వి. అ. స్త్రీ. 1. సుకతి, ప్రయాసచే బిడుకఁదగిన ఆవు: చూ, ధేనువు; 2. కాఁచి *: చూ, వాయసి.

కరటదంతన్యాయము. సా. కాకిదంతములు పరిశోధింప మొదలిడినరీతి.

కరటము. సం. వి. అ. పుం. 1. కాకి: చూ, వాయసము; 2. కుసుమపువ్వు: చూ, వహ్నిశిఖము; 3. గోఁమురుకప్ప: చూ, మండూకము; 4. ఏనుఁగుచెక్కిలి: చూ, హస్తి; (రూ-కటము) 5. పనికిమాలిన బ్రిదుకు; 6. ఒకానొక ధ్వని: చూ, స్వరము. 2; 7. చనిపోయినవానికి పదునొకండవనాఁడు చేయు శ్రాద్ధము: చూ, కర్మములు; 8. బిల్వము *: చూ, మారేడు; 9. వాద్యభాండము: చూ, వీణె.

కరటి. సం. వి. న్. పుం. ఏనుఁగు: చూ, హస్తి.

కరటుఁడు. సం. వి. అ. పుం. 1. పరలోకము లేదనువాఁడు: చూ, నాస్తికుఁడు; 2. కుత్సిత బ్రాహ్మణుఁడు: చూ, బ్రాహ్మణుఁడు.

కరటుకము. సం. వి. అ. పుం, స్త్రీ. గుడుగు పల్లిక *: చూ ఘూకుండి.

కరటువు. సం. వి. ఉ. పుం. ఒకానొక పక్షి: చూ, పక్షి.

కరడ. దే. వి. 1. రూ-కరండకము. కరవడము. కరొటము: చూ, పాత్రము. 6; అం. 2.అవనద్ధ వాద్యములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, అవనద్ధవాద్యములు.

కరడము. సం. వి. అ. పుం. 1. కేంటు: చూ, స్వరము. 2; దే. వి. (1) అల. "సీ. కాంతాది మఖము పైకత వేదికాస్థలి కంకణ్ళపికృతులు కరడములును." భీ. 5, అ. 168: చూ. వీచి.1.

కరడి. వై. వి.= కరండికా. పుష్పాదులుంచెడు కరండము: చూ, బుట్ట. (రూ-కరడు-కరడియ.)

కరడు. వై వి. 1.—పై.—; దే. వి. 2. ఒకానొక పిట్ట: చూ, పక్షి; 3. అల; భాగ. ద్రోణ. 2, అ. 126: చూ, వీచి. 1.

కరణకమ్మబ్రాహ్మణులు. సా. వీరిలో మూఁడు శాఖలవారున్నారు. 1. ఓగోటికరణకమ్మలు, ఓగోటికరణ కమ్మలు; 2. కొలిజేటి కరణకమ్మలు; 3. బగల్నాటి కరణకమ్మలు అని మూఁడు భేదములు. వీరు ఋగ్వేదులు. ఆశ్వలాయనసూత్రానుష్ఠాతలు. వీరు లౌకికసంబంధిసమర్థులు.

కరణకమ్మలు. దే. వి. బ. బ్రాహ్మణులలో నొక తెగవారు: చూ, బ్రాహ్మణులు.

కరణత్రాణము. సం. వి. అ. న. తల: చూ, శిరము. 1.

**కరణము.** సం. వి. అ. న. 1. గణికుడు: చూ, పంజీకరుడు; (రూ-కరణీకుడు.) 2. ఉపకరణము: చూ, పనిముట్టు; 3. ఇంద్రియము: త్వగాది; 4. కారణము: చూ, హేతువు; 5 క్రియాభేదము; 6. పని: చూ, ప్రయోజనము. 1; 7. గణితశాస్త్రసంబంధము: చూ, క్షేత్రము; 8. గీతాభేదము; 9. నృత్యభేదము: చూ, నృత్యము; 10. చందనాదుల పూత: చూ, పూత. 3; 11. ఒకానొక రతిబంధము: చూ, రతిబంధము; 12. ఒడలు: చూ, శరీరము; 13. రెండు పాదములలో తిరుగుట; జ్యో. 14. బవాది.—(ఇవి. 11.-బవ, బాలవ, కౌలవ, తైతిల, గరజి, వణిక్కు, భద్ర, శకుని, చతుష్పాత్తు, నాగవము, కింస్తుఘ్నము.); 15. దినాంగములలోని యొకటి: చూ, దినాంగములు; 16. కారకములలోనిది యొకటి (కార్యసిద్ధికి ముఖ్యముగా నుపయోగించు వస్తువు.): చూ, కారకములు; 17. జన్యతాళములలో నొకటి: చూ, జన్యతాళములు.

**కరణములు.** బం. 1. మనస్సు, వాక్కు, కాయము. (గ); 2. బవాది: చూ, కరణము. 14; 3. గాంధర్వ వేదమునందలి భావాధ్యాయ ప్రభేదములోనివి.—ఇవి 108.—తలపుష్పపుటము. లీనము, వర్తితము, వలితము. మండలస్వస్తికము, కరస్వస్తికము. అక్షిప్తరేచితము, అర్ధస్వస్తికము పృష్ఠస్వస్తికము, దిక్స్వస్తికము స్వస్తికము, అంచితము, అపవిద్ధము. సమనఖము, ఉన్మత్తము, స్వస్తికరేచితము, నికుట్టకము, అర్ధనికుట్టకము, కటిచ్ఛిన్నము, కటీసమము, భుజంగత్రాసితము, అలాతము, విక్షిప్తము, ఆక్షిప్తము, నికుంచితము, ఘూర్ణితము, ఊర్ధ్వజానువు, అర్ధరేచితము, మత్తల్లీ, అర్ధమత్తల్లీ రేచక, నికుట్టకము, లలితము, వలితము, దండపక్షము, పాదాపవిద్ధకము, నూపురము, భ్రమరము, ఛిన్నము. భుజంగత్రస్తరేచితము, భుజంగాంచితకము, అర్ధరేచితము. చతురము, కటిభ్రాంతము, వ్యంసితము, చక్రాంతము, వైశాఖరేచితము, వృశ్చికకుట్టితము, వృశ్చికరేచితము, లతావృశ్చికము, ఆక్షిప్తము, అర్గళము, తలవిలాసితము, లలాటతిలకము. పార్శ్వనికుట్టనము, చక్రమండలము, ఉరోమండలము, ఆవర్తము, కుంచితము, డోలాపాతము, వివృత్తము, వినివృత్తము, పార్శ్వక్రాంతము, నిసుంభితము, విద్యుద్భ్రాంతము, అతిక్రాంతము. విక్షిప్తము, వివర్తితము, గజక్రీడితము, గండసూచితము, గరుడప్లుతము. తలసంస్ఫోటితము, పార్శ్వజానువు, గృధ్రావలీనకము, సూచి, అర్ధసూచి, సూచీవిద్ధము, హరిణప్లుతము, పరివృత్తము. దండపాదము, మయూరలలితము, ప్రేంఖోలితము. సన్నతము. సర్పితము, కరిహస్తకము, ప్రసర్పితము. అపక్రాంతము, నితంబము, స్ఖలితము, సింహవిక్రీడితము, సింహకర్షితము, అవహిత్థకము, నివేశము, అలకాక్రీడితము, జనితము. ఉపసృతము, తలసంఘట్టితము, ఉద్వృత్తము, విష్ణుక్రాంతము, లోలితము, మదస్ఖలితము, సంభ్రాంతము, విష్కంభము, ఉద్ఘట్టితము, శకటాస్యము ఊరోవృత్తము, వృషభక్రీడితము, నాగాపసర్పితము, గంగావతరణము. (108.)

**కరణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కొంకణదేశమునందలి ప్రసిద్ధమగు చెట్టు: చూ. వృక్షము; దే. వి. (1) రీతి. "జనార్దనుడకృగణి." హరి. ఉ. 6, ఆ. 160: చూ, విధము. 1; పా. 3. ఐమూలరాశి: చూ, రాశి. 2.

**కరణికము.** వై. వి. కరణముచేయుపని: రూ-కరణీకము, కరిణికము-కరిణీకము.

**కరణీకము.** వై. వి. —వై.—

**కరణీయము.** సం. విణ. చేయఁదగినది: కర్తవ్యము.

**కరణుఁడు.** సం. వి. అ. పుం. శూద్ర స్త్రీకిని వైశ్యునకును బుట్టినవాఁడు.

**కరణులు.** అం. సంజీవకరణి, సంధానకరణి, సావర్ణ్యకరణి, విశల్యకరణి. (4)

**కరతలము.** సం. వి. అ. పుం. అఱచేయి: చూ. హస్తము. 1.

**కరతలములు.** అం. స్త్రీలక్షణాంగములు ఏఁబది యెనిమిదింటిలో నొకటి: చూ. స్త్రీలక్షణాంగములు. (అఱచేతులు).— కోమలములైన భాగ్యవతియగు. పద్మములఁబోలి మెత్తనైనను సమములయినను సుఖవంతురాలగు, పెద్దవిగా నున్న దరిద్రురాలగు. పొట్టివై పరిక్లేశ మొందును. లావైన విధవ యగు.

**కరతలామలకము.** బా. అఱచేతిలోని ఉసిరిక కాయ. సులభముగ స్వాధీనమగునది. "సక. వృత్తంబులును నీచిత్తంబునకుఁ గరతలామలకమైయున్నవి."

**కరతలామలకన్యాయము.** పా. చేతిలోని ఉసిరిక కాయవలె స్పష్టముగనున్నదనుకీతి.

**కరతాళము.** సం. వి. అ. న. అఱచేతులు గొట్టుటలో కలుగు చప్పుడు: చూ. స్వనము. 2.

**కరతాళి.** సం. వి. ఈ. స్త్రీ.—వై.—

**కరతాళిక.** సం. వి. ఆ. స్త్రీ. నిప్పువన్నె గుత్తుల కానుగు *: చూ. శాదభ్నము.

**కరతిత్తి.** వై. వి. = కరదృతిః. వటుత్రిపుసంచి. హరిశ్చ. 2, భా. 1127: చూ. హడపము. 1.

**కరతోయ.** సం. వి. ఆ. స్త్రీ. గౌరీవివాహకాలమందు ఈశ్వరునిహస్తములనఁ బుట్టినయేఱు, ఆగోద: చూ. నది.

**కరదనము.** అం. విజ్ఞానములు ముప్పదిరెండింటి లోనొకటి: చూ. విజ్ఞానములు.

**కరదము.** సం. వి. అ. పుం. కానుక: చూ. లంచము.

**కరదివియ.** వై. వి. = కరదీపిక. కాగడా: చూ. దివిటీ. (రూ-కరదివ్వియ- కరదివ్వె. "ద్వి.కర మునఁబూని ... కరదివ్వె." హరిశ్చ. 1, భా. 1856.)

**కరదీపిక.** సం. వి. ఆ. స్త్రీ.= కరదివియ—వై.—

**కరదీపికాన్యాయము.** పా. తనచేతిలోని దీపము తనకుపయోగింపక యితరుల కుపయోగించునను రీతి.

**కరన్యాసము.** సం. వి. అ. పుం. అంగన్యాసము*: చూ. న్యాసము.

**కరపట్టు.** దే. వి. వస్త్రాంతమైన రెంపు: చూ. వస్త్రము. 1;

**కరపత్రము.** సం. వి. అ. న. 1.క్రకచము: చూ. అంపము; పా. 2. ప్రకటనపత్రము.(నోటీసు.)

**కరపత్రవంతము.** సం. వి. త. పుం. తాళము *: చూ. తాళ. 2.

**కరపత్రిక.** సం. వి. ఆ. స్త్రీ. జలక్రీడ: చూ. విలాసము 1.

**కరపర్ణము.** సం. వి. అ. పుం.1. కందగర్భము*: చూ. హ్రస్వశాఖాశిఫము; 2. పేగాముద ము *: చూ. వ్యదంబకము.

**కరపల్లవము.** సం. వి. అ. పుం. కరశాఖ అంగుళము: చూ. వేలు. 1.

**కరపాత్రము.** సం. వి. అ. న. జలక్రీడ: చూ. విలాసము. 1.

**కరపాదము.** అం. ఉత్తానకరణబంధములు నలుబది యొకటింటిలో నొకటి: చూ. ఉత్తానకరణ బంధములు: (చూ. బంధములు.)

**కరపార్శ్వరేఖ.** సం. వి. ఆ. స్త్రీ. సంతానసంఖ్య రేఖ.

**కరపాలము.** సం. వి. అ. పుం. = కరవాలు. ముప్పదియంగుళములకు మించినకత్తి: చూ. రిష్టి. 2.

కరపుచ్చే. దే. వి. కర్బూజా *: చూ, సోమ కర్కటి.

కరపృష్ఠములు. అం. స్త్రీలక్షణాంగములు ఏఁబది యెనిమిదింటిలో నొకటి: చూ, స్త్రీలక్షణాంగములు. (మీఁచేతులు).-స్థూలములై యె త్తుగనున్న మీఁజేతులు రాలగు.

కరఫల. సం. వి. ఆ. స్త్రీ. కలివె *: చూ, సాష్టపుష్పఫల.

కరఫలము. సం. వి. అ. పుం. 1. గుజ్జును దోఁచెడు గొలపము: చూ, గొలపము; 2. క్షుర ప్రిపు నెడి గొలపము: చూ, బాణము. 1.

కరబదరన్యాయము. పా. చేతిలోని రేఁగుపండు వలె తేలికగానుండునరీతి.

కరబదరము. బా. అఱచేతిలోని రేఁగుపండు. (సులభమైనది)

కరబుజేము. దే. వి. ఇతాలియను *: చూ, పగిడి.

కరబూజా. వా. వి: చూ, కరపుచ్చే *. (రూ. కర్బూజా. హిం.)

కరభకాండిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, ఉష్ట్ర కర్ణి *.

కరభదోహనన్యాయము. పా. ఆవు ఉండఁగా గాడిద పాలు పితికినరీతి.

కరభప్రియ. సం. వి. ఆ. స్త్రీ. పిన్న రేఁగడిదూల*: చూ, స్వల్పదురాలభ.

కరభము. సం. వి. అ. పుం. 1. మనికట్టు మొదలు చిటికెనవ్రేలి మొదలుదాఁకఁగల చేతి వెలుపలిచోటు; 2. ఒంటెపిల్ల: చూ, లొట్టిపిట్ట; 3. గాడిద: చూ, గార్దభము.

కరభర్జితము. సం. వి. అ. న. నానఁబెట్టి వేయించిన గుగ్గిళ్లు: చూ, పొరి.

కరభవల్లభము. సం. వి. అ. పుం. 1. కపిత్థము* చూ, వెలఁగ; 2. గొలుగు *: చూ, పీలువు.

కరభాదని. సం. వి. ఈ. స్త్రీ. పిన్న రేఁగడిదూల *: చూ, స్వల్పదురాలభ.

కరభి. సం. వి. న్. పుం. 1. ఏనుఁగు: చూ, హస్తి; ఈ. స్త్రీ. 2. ఆఁడుఒంటె: చూ, లొట్టిపిట్ట; 3. ఆఁడుగుఱ్ఱము: చూ, హయము.

కరభీకము. సం. వి. అ. పుం. సింగము: చూ, సింహము.

కరభూషణము. సం. వి. అ. న. పోఁచీలు-చేకట్లు మొ: చూ, భూషణము. 2.

కరభోరు. సం. వి. ఊ. స్త్రీ. మనికట్టు మొదలుకొని చిటికెనవ్రేలువఱకు నుండెడు ప్రదేశమువలెను ఏటవాలుగానుండు తొడలుగల ఆఁడుది: చూ, స్త్రీ.

కరమట్టము. సం. వి. అ. పుం. గువాకము *: చూ, పోఁక.

కరమరి సం. వి. ఈ. స్త్రీ. 1. ఖైదుచేయుట: చూ, బంది; 2. కారాగృహము: చూ, బంధనాలయము. (చూ, గృహము. 1.)

కరమర్దకము. సం. వి. అ. పుం.= కలివె *: చూ, సాష్టపుష్పఫల.

కరమర్దము. సం. వి. అ. పుం.=కలివె—పై.—

కరమర్ది. సం. వి. ఈ. స్త్రీ.—పై —

కరమర్దిక. సం. వి. ఆ. స్త్రీ. గోస్తని *: చూ, ద్రాక్ష.

కరమాలము. సం. వి. అ. పుం. 1. ధూపము: చూ, పొగ; 2. మబ్బు: చూ, మేఘము. 1.

కరము. సం. వి. అ. పుం. 1. చేయి: చూ, హస్తము; 2. కిరణము: చూ, మయూఖము. 1; 3. తొండము. చూ, శుండము; 4. రూకారము, కప్పము: చూ, పిస్తు. 1; 5. కరక: చూ, వడగల్లు; 6. రెండుజేనలకొలఁది కిష్కువు: చూ, మూర. 1; 7. మబ్బు: చూ; మేఘము. 1; 8. అజాజి *: చూ, సువది. 2; దే. అవ్య. (1) కడు. (వృత్తియందు దీనికి వాఁడికశబ్దము

పరమగుచో ముపర్ణలోపము మహాకవి ప్రయోగములయందుఁ గానఁబడుచున్నది. "కరవాఁడి చూపులు. కరవాఁడినఖములు." మొ): చూ, మతిమతి.

కరముక్తకము. సం. వి. అ. న. అస్త్రవిశేషము: చూ, బాణము. 1.

కరములు. పా. వీనికి ఉపమానములు.-పద్మము, చిగురు.

కరములురెండు. అం. ఇవి అంగములు ఎనిమిదింటిలోనివి: చూ, అంగము. 9.

కరయంత్రము. సం. వి. అ. న. బాణమువారినిఁ గూర్చి వేళ్లను పట్టెడిపట్టు: చూ, ముక్తకము.

కరరుట్టు. సం. వి. హ. పుం. గోరు: చూ, నఖము.

కరరుహము. సం. వి. అ. పుం. 1. —పై.—; 2. నఖముచిప్ప: చూ, కోలము: (చూ, నఖము.)

కరర్ధి. సం. వి. ఇ. స్త్రీ. కరతాళి: చూ, స్వరము. 2.

కరలాఘవము. అం. ఉపపీతములు పదునాలింటిలో నొకటి: చూ, ఉపపీతములు.

కరవంది. సం. వి. ఈ. స్త్రీ. కలివె *: చూ, సామ్లపుష్పఫల.

కరవటము. వై. వి.=కరండ. రూ-కరాటము, బంగౌ; లక్ష్మీ. 3, ఆ.81: చూ, పాత్రము. 6

కరవడము. వై. వి.= —పై.—

కరవర్తక. సం. వి. అ. స్త్రీ. బాణము వేయునప్పుడు బొటనవేలికిఁ దగిలించుకొను యుంగరము: చూ, భూషణము. 2.

కరవాఁక. దే. వి. సముద్రపుగట్టు నారనుండెడు బురదనేల: చూ, భూమి. 1.

కరవాఁడి. దే. వి. మిక్కిలివాఁడి: చూ, తీవ్రము.

కరవాడు. దే. వి. రూ-కఱవాడు, ఎండినచేప: చూ, మత్స్యము. 1.

కరవాతి. సం. వి. ఈ. స్త్రీ. కత్తి: చూ, రిష్టి. 2

కరవాయి. దే. వి. లోహకారుఁడు సుత్తెతోఁ బాత్రములను చేఁగఁగొట్టునప్పుడు ఒత్తుడుగా వానిలోపలఁజొప్పించెడి మొనవంటి దిమ్మెమొనపు యినుపకమ్మి.

కరవాలము. సం. వి. అ. పుం. 1.=కరవాలు. రూ-కరపాలము-కరాపాలము, నిమిచోకత్తి: చూ, రిష్టి. 2; 2. గోరు: చూ, నఖము.

కరవాలు. వై. వి.=కరవాలము. కత్తి. అచ్చ. సుం, కాం. 58: చూ, రిష్టి. 2

కరవాలిక. సం. వి. అ. స్త్రీ. 1. కత్తిపీఁట: చూ, రిష్టి. 2: 2. బాఁకు: చూ, బాణము.1.

కరవి. సం. వి. ఈ. స్త్రీ. 1. కొప్పు: చూ, వేసలి; 2. ఇంగువ *: చూ, ఇంగువు. 1.

కరవింద. సం. వి. అ స్త్రీ.=కలివె *: చూ, సామ్లపుష్పఫల.

కరవీర. సం. వి. అ. స్త్రీ. తామ్రవర్ణ మనశ్శిల: చూ, రాయి.

కరవీరక. సం. వి. అ. స్త్రీ. సౌరాష్ట్రి, అపరధాన్యవిశేషము: చూ, ధాన్యము.

కరవీరకందసంజ్ఞము. సం. వి. అ. పుం. ఒకగకము కంద *: చూ, సూరణము.

కరవీరకరము. అం. శస్త్రములు నలుబదియేడింటిలో నొకటి: చూ, శస్త్రములు.

కరవీరకము. సం. వి. అ. పుం. ఏఱుమద్ది *: చూ, మద్ది.

కరవీరభుజ. సం. వి. అ. స్త్రీ. తొగరి *: చూ, సురాష్ట్రజము. 1.

కరవీరము. సం. వి. అ. పుం. 1. కత్తి: చూ, రిష్టి. 2; 2.=గన్నేరు *: చూ, హయమారకము.

కరవీరి. సం. వి. ఈ. స్త్రీ. 1. పుత్రవతి: చూ, స్త్రీ; 2. ఉత్తమమైనఆవు: చూ, ధేనువు; 3. దేవతలతల్లి: చూ, దేవమాత.

కరవీరుఁడు. సం. వి. అ. పుం. ఒకానొక రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

కరశాఖ. సం. వి.ఆ. స్త్రీ. వ్రేలు: చూ, వేలు.1.

కరశీకరము. సం. వి. అ. పుం. ఏనుఁగు తొండముచివరను పుట్టెడుమదము: చూ, మదము.1.

కరశూకము. సం. వి. అ. పుం. గోరు: చూ, నఖము.

కరసాన. వై. వి.=కరశాణ. రత్నాదులు సానఁబట్టెడు చక్రాకారమైనసాన; భాను. 8, ఆ; నిర్వ. 6, ఆ. 48: చూ, సాన.

కరసు. దే. వి. పరుసఁదనము: చూ, పరుసము.

కరస్నువు. సం. వి. ఉ. పుం. చేయి: చూ, హస్తము.

కరహాటు. అం. దేశములు ఏఁబదియాఱింటిలో నొకటి: చూ, దేశము (రూ-కరహాటము.)

కరహాటకము. సం. వి. అ. పుం. మ్రింగ *: చూ, శ్వసనము.

కరహాటము. సం. వి. అ. పుం. 1. తామరదుంప *: చూ, పద్మకందము; 2. పుష్పవిశేషము: చూ, సంధ్య; 3. పెద్దమ్రింగ *: చూ, శ్వసనము; 4: చూ, రూ-కరహాట.

కరా. వై విశే.=ఖరమ్. రూ-కర. "కరాచురి": చూ, తీండ్రము.

కరాంగణము. సం. వి. అ. పుం. పెక్కుజనులచే వ్యాప్తమైన అంగడివీధి: చూ, మార్గము. 1.

కరాంబుకము. సం. వి. అ. పుం. కలివె *: చూ, సాన్నుపుష్పఫల.

కరాంబుజము. సం. వి. అ. పుం. —పై—

కరాంగుళినఖములు. అం. స్త్రీలక్షణాంగములు ఏఁబదియొనిమిదింటిలో నొకటి. (రక్తిమగలిగి వర్తులమైయున్న నఖభోగములందును. తెల్లగనున్నను పుష్పిగలిగినను దరిద్రురాలగు.): చూ, స్త్రీలక్షణాంగములు.

కరాంగుళులు. అం. 1. స్త్రీలక్షణాంగములు ఏఁబదియొనిమిదింటిలో నొకటి: చూ, స్త్రీలక్షణాంగములు; (చేతివ్రేళ్లు).- (గూఢములైన సుఖవతియు, సనుపులై బలిసియు సందులేకున్న రాజపత్నియగు. ఎత్తులై వ్యత్యయములైన కలహప్రియయగు. వికటములైనను వక్రములయినను విధవయగు.): చూ, స్త్రీలక్షణాంగములు.

కరాగా. వా. నిక్కొచ్చుగా, పట్టినపట్టు వదలకుండఁగ. "డబ్బు యిచ్చెఁగాని కదలనని కరాగా కూర్చున్నాఁడు."

కరాచురకత్తి. వై. వి. = కరచ్ఛురిక. కత్తి; స్వా. 4, ఆ. 28: చూ, రిష్టి. 2. (రూ-కరాచురి-కరాచూరి-కరవాలు.)

కరాచురి. వై. వి. = కరచ్ఛురిక. —పై.— స్వా. 5, ఆ. 71. (రూ-కరాచూరి.)

కరాచూరి. వై. వి. = —పై.— రామా. 1, ఆ. 6.

కరాటము. వై. వి. = కరండము: చూ, రూ-కరవటము. చంద్రా. 1, ఆ. 45.

కరాపాలము, సం. వి. అ. పుం. కత్తి, ముప్పది అంగుళములకు మించినకత్తి: చూ, రిష్టి. 2.

కరాపువు వై. వి. ఉత్కటము *: చూ, లవంగము.

కరామర్దము. సం. వి. అ. పుం. కలివె *: చూ, సాన్నుపుష్పఫల.

కరామ్లకము. సం. వి. అ. పుం. —పై.—

కరాయిక. సం. వి. ఆ. స్త్రీ. పెద్ద పెంటి కొక్కెర, బలాక: చూ, బకము.

కరారు. హిం. వి. ఏర్పాటు.

కరారునామా. హిం. వి. ఒడంబడికపత్రము.

కరారోటము. సం. వి. అ. పుం. ఉంగరము: చూ, భూషణము. 2.

కరాళకము. సం. వి. అ. పుం. నల్లతొలసి *: చూ, తులసి.

కరాళత్రిపుటు. సం. వి. ఆ. స్త్రీ. మామెన *; శారిబ.

కరాళము. సం. వి. అ. న. 1. నల్లగగ్గెర *: చూ, పర్ణాసము; 2. వెన్నెముక: చూ, శల్యము.1; పుం. 3. సర్జరసమునూనె: చూ, తైలము; 4. ఒకానొక నరకము: చూ, నరకములు; విణ. 5. ఒడ్డుమిట్టయినది; 6. తుంగము, పొడవైనది: చూ, పొడవు. 2; 7. వెఱపుఁబుట్టించునది: చూ, భయంకరము; 8. దంతురము, పరిక్కలుఁగా నడుము పొడవైనది: చూ, పొడవు. 2; 9. జిహ్మము, వంకరైనది: చూ, వంకర.

కరాలి. సం. విణ. 1. క్రూరమైనది; 2. అగ్ని యొక్క పదికీలలలో రెండవది.

కరాళించు. దే. అ. క్రి. 1. బొబ్బరించు. "క. గిరిగహ్వర కోనంబులఁ దవ్వులంబడి దరికొని మొరగలిగొని కాలుకాలానలంబు కైవడిం గదిసికరాళించి." హర. 4, ఆ. 108: చూ, శబ్దించు; 2. సకిలించు: చూ, హేషించు; స. క్రి. 3. దూఱు. "ద్వి. వక్కసేయని లేకి వాఁడనినన్ను, లెక్కసేయక కరాళించె నీరాజు." పారిజా. 2, భా. 1474. చూ, నిందించు.

కరాళికము. సం. వి. అ. పుం. ఒకానొకచెట్టు: చూ, వృక్షము.

కరాళికుఁడు. సం. వి. అ. పుం. దంతురుఁడు: చూ, మిడిపండ్లవాఁడు.

కరి. సం. వి. ఇ. పుం. 1. ఏనుఁగు: చూ, హస్తి; 2. కోఁతి: చూ, వానరము; దే. వి. (1) ఎల్ల; "క. భాండీరవటముకరిగా." హరి. పూ. 7, ఆ. 98: చూ, సీమ. 1; (2) తెలివిడి: చూ, నిదర్శనము. 1; (3) ఆడుగుఱి: చూ, భగము. 12; (4) పశుయోని: చూ, భగము. 12; (5) కఱకుటమ్ము: చూ, బాణము.1; విణ. (6) సాక్షి; భార. ఆది. 2, ఆ. 120: చూ, సాక్షి.

కరికణావల్లి. సం. వి. ఈ. స్త్రీ. చవ్యము *: చూ, సేవ్యము. (సేవ్యమనుగ్రంథ్యము)(చూ, రాజార్హము.)

కరికపిత్థన్యాయము. పా. ఏనుఁగుమ్రింగిన వెలఁగపండు పండువలెనుండియు లోపలిగుంజు అంతయు హరించుననురీతి.

కరికరక్రీడ. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక బాహ్యరతి: చూ, రతిబంధము.

కరికరక్రీడనము. సం. వి. అ. న. —పై.—

కరికరజంఘులు. అం. పురుషలక్షణాంగములలోని జంఘల (పిక్కలు) యందలివిశేషము. (కరికరజంఘులైన శ్రీమంతుండగు): చూ, లక్షణాంగములు.

కరికవలము. సం. వి. అ. న. ఏనుఁగునకిచ్చు ఆహారప్రముద్ద: చూ, విధానము. 4.

కరికుంభజము. సం. వి. అ. పుం. ఏనుఁగు కుంభస్థలమునందుఁబుట్టునుసిరికపండంతముత్తెము: చూ, ముత్తెము.

కరికుసుంభము. సం. వి. అ. పుం: చూ, నాగకేసర మూర్ఘకము.

కరిఖలము. సం. వి. అ. పుం. వేడుకగానాడెడు జూదము: చూ, వ్యవహారము. 4.

కరిగర్జితము. సం. వి. అ. న. ఏనుఁగుగోఁక, బృంహితము: చూ, స్వరము. 2.

కరిజము. సం. వి. అ. పుం. లేఁత ఏనుఁగుపిల్ల: చూ, హస్తి.

కరిణబత్తుఁడు. దే. వి. కయిగోలవాఁడు: చూ, సాలెవాఁడు.

కరిణలు. దే. వి. బ. —పై.—

కరిణవాఁడు. దే. వి. —పై.— (రూ- కరిణిబత్తుఁడు- కరిణెవాఁడు)

కరిణి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడేనుఁగు: చూ, హస్తి.

కరిణిబత్తుఁడు. దే. వి: చూ, కరిణబత్తుఁడు.

కరిణికము. వై. వి: చూ, రూ- కరణికము. (రూ- కరిణీకము.)

కరిణీకుఁడు. వై. వి. కరణము: చూ, పంజీకరుఁడు.

కరిణీపత్రిసవన్యాయము. పా. పందికి పది పిల్లలు పుట్టుటకన్న నేనుఁగున కొకపిల్లపుట్టిన మేలు అనురీతి.

కరిణెబత్తుఁడు. దే. వి: చూ, రూ-కరిణబత్తుఁడు.

కరిణెలు. దే వి. బ.—వై.—

కరిణెవాఁడు. దే. వి.—వై.—

కరిత్తము. సం. వి. అ. పుం. ఇనుపగరిఁటె: చూ, దర్వి. 1. (చూ, పాత్రము. 6.)

కరిదారకము. సం. వి. అ. పుం. సింగము: చూ, సింహము.

కరిది. దే. వి. 1. వీణకరివె: చూ, వీణాదండము; 2. నగ్మవాద్యములలో నొకటి: చూ, నీగె. 2.

కరిపత్రము. సం. వి. అ. న: చూ, తాళిసపత్రి*.

కరిపదము. సం. వి. అ. న. రతివిశేషము: చూ, రతిబంధము.

కరిపిప్పలి. సం. వి. ఈ. స్త్రీ. ఏనుఁగుపిప్పలి *: చూ, పిప్పలి.

కరిపోతము. సం. వి. అ. పుం. ఎత్తుగున్న లేఁత ఏనుఁగుపిల్ల: చూ, హస్తి.

కరిబృంహితము. పా. ఒకానొక వృత్తము. ఉదా.— ఈవృత్తమునందు ఒక్కొక్క పాదమున భ, న, భ, న, భ, న, రగణములు గలిగి పదుమూఁడవయింట యతిగల ఏకవింశచ్ఛందస్సునందుఁ బుట్టినవృత్తము. ఉదా.— "మూఁడుభనములు రేఫమును బని- మూఁట విరతియు సొంపుగాఁ గూడుకొనఁగరిబృంహితము సమ-కూర్చి వసుమతిమండలా, పీడమును కరిబృంహితరవము- పెల్లుగఁ బలుకుచుండఁగా, గోడిగపు చినవాఁడు శకటునిఁగూల్చిన హరి నుతించెదఁగ." : చూ, వృత్తము. 1.

కరిబంధము. సం. వి. అ. పుం. ఏనుఁగునకుకట్టు స్తంభము: చూ, హస్తి.

కరిభము. సం. వి. అ. పుం. చైత్యము. *: చూ, రచ్చ. 7.

కరిమాచలము. సం. వి. అ. పుం. సింగము: చూ, సింహము.

కరిముఖుఁడు. సం. వి. అ. పుం. ఏనుఁగుమోము సామి: చూ, వినాయకుఁడు. 1.

కరివె. దే. వి. 1. వీణకరివె: చూ, వీణాదండము; 2. కలివె *: చూ, సామ్లపుష్పఫల.

కరివెద. దే. వి. నేలనున్నవిత్తుటకు వాన నెనురు చేరుచుట.

కరివేఁప. దే. వి. ఒకానొక చెట్టు: చూ, వృక్షము.

కరివేఁపాకు. దే. వి. తాలింపులో వేయు ఒకానొక చెట్టుఆకు.

కరిశాబకము. సం. వి. అ. పుం. లేఁత ఏనుఁగు పిల్ల: చూ, హస్తి.

కరిశ్లోలుకము. సం. వి. అ. న. దిక్కులకొన: చూ, దిగంతము.

కరిసంవర్గకము. సం. వి. అ. పుం. తాండ్రి *: చూ, విభీతకము.

కరిసనము. వై. వి. 1.= కర్షణము. కమతము; భాగ. ఆగ. 4, ఆ. 298: చూ, వ్యవసాయము. 2; (రూ- కరిసె- కరిసెనము- కరిసెము- కర్సనము.) 2.= ఘర్షణము. రూ- కర్సనము. ఒత్తుడు: చూ, పీడనము.

కరిసించు. వై. స. క్రి. = ఘృష్. ఘర్షించు. బహులాశ్వచరిత్రము. 1, ఆ. 102: చూ, రాయిడిచేయు. (రూ-కరసించు)

కరిసె. వై. వి. 1. = కర్షము. కాలుపలము: చూ, పలము. 1; (ముప్పావుతులమెత్తు); 2. కమ

తము: చూ, వ్యవసాయము. 2. (రూ-కరిసె-కరిసెనము)

కరిసెనము. వై. వి. 1.= కర్షణము: చూ, రూ-కరిసనము. 1; 2.= ఘర్షణము చూ, రూ-కరిసనము. 2.

కరిసెము. వై. వి.= కర్షణము. కసుతము: చూ, వ్యవసాయము. 2.

కరిహస్తకము. అం. కరణములు నూటయెనిమిదింటిలో నొకటి: చూ, కరణములు.

కరిహస్తము. అం. నృత్తహస్తములు ఇరువదితొమ్మిదింటిలో నొకటి: చూ. నృత్తహస్తములు.

కరీర. సం. వి. ఆ. స్త్రీ. 1. చిమ్మట: చూ, రిల్లు; 2. ఏనుఁగుకొమ్ము మొదలు: చూ, కరీరిక; 3. నురదగొండి *: చూ, దూలగొండి.

కరీరఫలిని. సం. వి. ఈ. స్త్రీ. కొబ్బరి *: చూ, నారికేళము.

కరీరము. సం. వి. అ. పుం, న. 1. వెదురుమొలక *: చూ. మొలక. 1; పుం. 2. కుండ: చూ, భాండము. 3; 3. క్రకరము *: చూ, వెణుతురు.

కరీరి. సం. వి. ఈ. స్త్రీ. 1. చిమ్మట: చూ. రిల్లు; 2. ఏనుఁగుకొమ్ము మొదలు: చూ, కరీరిక. (ఏనుఁగు దంతములక్రిందిచోటు. రూ కరీరము. పురుషోత్తమకవీయము.)

కరీరిక. సం. వి. ఆ. స్త్రీ. 1. గజదంతమూలము: కరీర, కరీరి; (తె. ప):— ఏనుఁగుకొమ్ము మొదలు; 2. చిమ్మట: చూ. రిల్లు.

కరీరికము. సం. వి. అ. పుం. బొబ్బరి *: చూ, శాకపుష్పము.

కరీషము. సం. వి. అ. పుం, న. 1. పాంశువు, ఎరువు: చూ, పిడక; 2. ఏఱుపిడక: చూ, పిడక; 3. గోమయపిష్టము: చూ, పిడక.

కరీషాగ్ని. సం. వి. ఇ. పుం. ఎండిన పిడకనిప్పు, కమ్రిము: చూ, నిప్పు.

కరుండు. సం. వి. అ. పుం. ఇచ్ఛగలవాఁడు: చూ, వలపుకాఁడు.

కరుకు. దే. వి. మందాకు మాడ్చి రాసినపొడి. రూ- కఱుకు: చూ, భస్మము.

కరుగు. దే. వి 1. సస్యగుచ్ఛము: చూ, పొట్ట కఱ్ఱ; 2. పోఁతపోసినడి అచ్చు; రంగరా. 2, ఆ. 12: చూ, పోఁతఅచ్చు.

కరుండు. దే వి. 1. గట్టిపడినముద్ద. భార. స్త్రీ. 1, ఆ. 36: చూ, ముద్ద. 2; 3. దినదినము వాగ్రిడు సంకీర్తనపురెక్క. చిట్టా- రూ- చిఱు: చూ. పద్దు. 3.

కరుకుగట్టు. దే. అ. క్రి. గట్టిముద్దఅగు: చూ, ముద్దకట్టు

కరుణ. సం. వి. ఆ. స్త్రీ. 1. కనికరము: చూ, దయ: అం. 2. రసములు తొమ్మిదింటిలో నొకటి: చూ, రసములు; 3. రసదృష్టులు యెనిమిదింటిలో నొకటి: చూ, రసదృష్టులు.

కరుణమల్లి. సం. వి. ఈ. స్త్రీ. నవమాలిక *: చూ, విరజాజి.

కరుణము. సం. వి. అ. పుం. 1. నింబ: చూ, నిమ్మ; 2. కరుణారసము: చూ, రసములు.

కరుణవిప్రలంభము. నా. విప్రలంభ విశేషము: చూ, రసములు.

కరుణాకూర్చుఁడు. సం. వి. అ. పుం. అద్వయావాది: చూ, బుద్ధుఁడు.

కరుణాఖ్యము. సం. వి. అ. న. తాళప్రాణకళా విశేషము: చూ, తాళము. 2.

కరుణాపరము. సం. విణ: చూ, దయాపరము.

కరుణామోహము. అం. మోహావస్థాచతుష్టయములో నొకటి: చూ, మోహావస్థాచతుష్టయము.

కరుణి. సం. వి. ఈ. స్త్రీ. పుష్పవృక్షవిశేషము: చూ, వృక్షము.

కరుణించు. సం. అ. క్రి. కనికరించు: చూ, దయసేయు.

కరుదు. దే. వి. మాట: చూ, వ్యాఖ్యాతము. 2. (రూ-కఱద)

కరుబుజాదోస దే. వి. అతిక్తఫల *: చూ, దోస.

కరుమరి. వై. వి.= కర్మార: చూ, కరుమలి.

కరుమల. వై. వి. 1. ఇనుముపనిచేసి బ్రదికెడు జాతి. "కరుమలవాఁడు, కరుమాలది.": చూ, కమ్మర; 2. ఇనుముపనిచేయువాఁడు: చూ, స్వర్ణకారుఁడు.

కరుమలి. వై. వి. ఇనుముపనిచేయువాఁడు: చూ, స్వర్ణకారుఁడు.

కరులు. దే. వి. బ పక్షికిఁజల్ల్కములు: చూ, పక్షమ్ము. 4

కరువ. వై. వి.= గ్రావః. కొండ: చూ, పర్వతము.

కరువలి. దే. వి. రూ- కఱ్ఱలి. గాలి: చూ, వాయువు.

కరువలిపట్టి. దే. వి.1. గాలిచూలి:చూ,భీముఁడు; 2. ఆంజనేయుఁడు:చూ,వానరము; 3.కోఁతి: చూ, వానరము.

కరువలిరిక్క. ద్వి. వి. స్వాతి, కెంపుసవతు: చూ, నక్షత్రము. 1.

కరువలివిందు. దే వి. అగ్ని. రామా. 6, ఆ 67: చూ, నిప్పు.

కరువు. దే. వి 1. రూ- కరుగు. పోఁతపోసెడు అచ్చు; ఆము. 2, ఆ. 47:చూ, పోఁతఅచ్చు; వై. వి. 2 =గర్భః.కడుపులోనిపిండము.భాగ. అను. 1, ఆ. 11: చూ, భ్రూణము. 1.

కరుసు. వై. వి.= 1. పరుష. కట్టెవిరుపుమాట, రూ-కఱకు- కొఱు- కొలోగ్డము: చూ, పరుషము. 2. (రూ-కరసు); దే. వి. 2 పచ్చి నర్మము: చూ, తోలు. 1.

కరూశము. సం. వి అ. పుం.కరూశమను దేశము: చూ, దేశము.

కరూశుఁడు. సం. వి. అ. పుం. 1. కరూశదేశపు రాజు: చూ, రాజు. 1; 2. ప్రజాపాలనతత్పరుఁడు: చూ, రాజు. 1; 3. శివార్చకుఁడు: చూ, పూజారి.

కరేందుకము. సం. వి. అ. న. వాసనగడ్డి *: చూ, తృణము. 1.

కరేకరము. సం. వి. అ. న. 1. పిడికిటిపోటు: చూ, యుద్ధము; 2. బాహుమధ్యము: చూ, మోఁచేతిమడుపు.

కరేటము. సం. వి. అ. పుం. గోరు: చూ,నఖము.

కరేటవ్య. సం. వి. ఆ. స్త్రీ. పెద్దకక్కెర:చూ బకము.

కరేటువు. సం. వి. ఉ. పుం. స్త్రీ. 1. రూ- కర్కరేటువు. —వై:—; 2. గోరు: చూ, నఖము.

కరేణుభువు. సం. వి. ఉ. పుం. పాలకాప్యముని: చూ, ముని. 1.

కరేణువు. సం. వి. ఉ. స్త్రీ. 1. ఆఁడేనుఁగు: చూ, హస్తి; పుం. 2. ఏనుఁగు: చూ, హస్తి; 3. అక్షోటము *: చూ, మృదుద్రుమము; 4. పాలకాప్యముని: చూ, ముని. 1.

కరేణుసుతుఁడు. సం. వి. అ. పుం. పాలకాప్యముని: చూ, ముని. 1.

కరేజకము. సం. వి. అ. పుం. తురుష్కమను గంధద్రవ్యము: చూ, రాజార్హము.

కరేరువు. సం. వి. ఉ. పుం. 1. చెట్టు: చూ, వృక్షము; 2. కోఁతి: చూ, వానరము.

కరేష్టము. సం. వి. అ. పుం. కర్జికారము *: చూ, మృదుద్రుమము.

కరైక్యము. సం. వి. అ.న. రెండుచేతులు ఒకటిగా చేర్చుట.

కరోటకము. సం. వి. అ. న. బట్టలపెట్టె: చూ, పెట్టె.

కరోటము. సం. వి. అ.న.పుర్రె:చూ,శల్యము.

2. ఇనుపగుదియ: చూ, ముద్గరము; పుం 3. అద్దము: చూ, ముకురము; విణ. 4. కఠినమైనది: చూ, బెడిదము; 5. గట్టిది: చూ, బెడిదము.

కర్కరాంగము. సం. వి. అ. పుం. కుంకటి గుడ్డంగి: చూ, గాత్యూహము.

కర్కరాంధకము. సం. వి. అ. పుం. సాదు నుయ్యి: చూ, నుయ్యి.

కర్కరాతుకము. సం. వి. అ. పుం. ఏట్రింత: చూ, వ్యాఘ్రాటము.

కర్కరాటుకము. సం. వి. అ. పుం. పెద్ద కొక్కెర: చూ, బకము.

కర్కరాటువు. సం. వి. ఉ. పుం. కడకన్ను: చూ, నేత్రము. 1.

కర్కరాలము. సం. వి. అ. పుం. భ్రమరకము, ముంగురులు: చూ, వెండ్రుక.

కర్కరాహ్వ. సం. వి. ఆ. స్త్రీ. జెమ్మి*: చూ, శమి.

కర్కరి. సం. వి. ఈ. స్త్రీ. 1 కర్కటి*: చూ, దోస; ఆము. 2. ఆ. 73; 2. గిండిచెంబు: చూ, పాత్రము. 6.

కర్కరిక. సం. వి. ఆ. స్త్రీ. 1. ఇక్షువు*: చూ, రసాలము.3;2. గిండిచెంబు: చూ, పాత్రము.6.

కర్కరికము. సం. వి. అ. పుం. గిండిచెంబు, నీటిచెంబు (అని కొందఱు): చూ, పాత్రము.6.

కర్కరేటము. సం. వి. అ. న. మెడపట్టి గెంటుట: చూ, గెంటుట.

కర్కరేటువు: సం. వి. ఉ. పుం, స్త్రీ. పెద్ద కొక్కెర: చూ, బకము.

కర్కలి. సం. వి. ఈ. స్త్రీ. కర్కటి *: చూ, దోస; 2. గిండి: చూ. పాత్రము. 6.

కర్కశ. సం. వి. ఆ. స్త్రీ. 1. తేలుకొండి *: చూ, వృశ్చికము. 2; 2. బూరుగు *: చూ, శారద.

కర్కశచ్ఛద. సం. వి. ఆ. స్త్రీ. కోశాతకి *: చూ. పొట్ల.

కర్కశచ్ఛదము. సం. వి. అ. పుం. 1. -పై -; 2. పెద్దటేకు *: చూ, శాకోటము.

కర్కశదల. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక చెట్టు: చూ, దగ్ధ *.

కర్కశదలము. సం. వి. అ పుం. చేఁదిపొట్ల *: చూ. పొట్ల.

కర్కశము సం. వి. అ. పుం. 1. కంపిల్లము *: చూ, గోరోచని; 2. కసింద *: చూ, బలుసు; 3. ఇక్షువు*: చూ, రసాలము.3; 4. కత్తి: చూ, రిష్టి. 2; 5.=కఱకు. కెంపులయందలి నలుసు: చూ, నలుసు; 6. మరకతదోషము: చూ, రత్నము 1; 7. విద్రుమదోషము: చూ, రత్నము. 1; విణ. 8. కనికరములేనిది; చూ, నిర్దయ; 9. కఠినమైనది: చూ. బెడిదము; 10. గట్టిది: చూ, బెడిదము; 11. తెగువగలది: చూ. సాహసము; 12. నొప్పించునది: చూ, ఘుస్రము.

కర్కశవాక్యము. సం. వి. అ. న. కఠినోక్తి: చూ, పరుషము. 2.

కర్కశిక. సం. వి. ఆ. స్త్రీ. అడవిరేఁగు *: చూ, రేఁగు. 1.

కర్కశుఁడు. సం. విణ. అదయుఁడు: చూ, నిర్దయుఁడు.

కర్కసారము. సం. వి. అ. న. (పెరుఁగుతోఁ గలిపిన) పేలపిండి: చూ, సాదము. (1)

కర్కాటకశృంగి. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-కర్కటకశృంగి *.

కర్కాటకబ్రాహ్మణులు. సా. బొంబాయి రాజధానిలోఁ జేరిన సతారాకు దక్షిణమున కృష్ణకోయన యను నదులు సంగమించుచోట నుండు కర్హాడ యను పురమువలన వీరికీపేరు కలిగినది. వీనిని పరశురాముఁడు ఒంటె ఎముకలనుండి సృష్టించెననియు భారద్వాజ,

కౌశిక, వత్స, కౌండిన్య, కశ్యప, వశిష్ఠ, జమదగ్ని, విశ్వామిత్ర, గౌతమ, అత్రి యను పది గోత్రంబులు గలవారనియు సహ్యాద్రి కాండమునఁ జెప్పుచున్నది: చూ, బ్రాహ్మణులు.

కర్కాటకి. సం. వి. ఈ. స్త్రీ. 1. తీఁగె *: చూ, లత. 1; 2: చూ, కర్కాటకశృంగి *.

కర్కారుకము. సం. వి. అ. పుం. కళింగము *: చూ, పుచ్ఛ.

కర్కారుకి. సం. వి. ఈ. స్త్రీ. ముల్లుదోస *: చూ, దోస.

కర్కారువు. సం. వి. ఉ. పుం. కూష్మాండము *: చూ, గుమ్మడి.

కర్కి. సం. వి. న్. ఇ. పుం. కర్కాటకరాశి: చూ, రాశి. 2.

కర్కోటకము. సం. వి. అ. పుం. 1. బిల్వ *: చూ, మారేడు; 2 తేలు: చూ, వృశ్చికము. 3. నాగుపాము: చూ, సర్పము; 4. విషవిశేషము: చూ, విసము. 1.

కర్కోటకి. సం. వి. ఈ. స్త్రీ. 1. పెద్దబీఱ*: చూ, బీఱ. 2; 2. పొమ్మరి*: చూ, కలబంద; 3. అల్లితీఁగె; అల్లిగుంప *: చూ, పద్మకందము; 4. మట్టుకాఁకర *: చూ, సుషవి. 1.

కర్కోటకుఁడు. సం. వి. అ. పుం. దోసకోరి: చూ, వ్యాఘ్నుఁడు. 2.

కర్కోటము. సం. వి. అ. పుం. 1. నాగుఁబాము: చూ, సర్పము; 2. మట్టుకాఁకర *: చూ, సుషవి. 1.

కర్కోటి. సం. వి. ఈ. స్త్రీ. దావడంగి *: చూ, దేవతాళము.

కర్కోటిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, కర్కాటకశృంగి *.

కర్కోలకము. సం. వి. అ. న. తక్కోలు*: చూ, వైజయంతి. 4. (రూ-కక్కోలకము.)

కర్కోలికము. సం. వి. అ. న. —పై.—

కర్చూరకము. సం. వి. అ. పుం. ఒట్టికసింద *: చూ, షడ్గ్రంథ.

కర్చూరము. సం. వి. అ. పుం. 1. —పై.—; 2. బంగారు: చూ, లోహము. 1.

కర్ణకాయ. దే. వి. కరంజమను భక్ష్యము: చూ, భక్ష్యము.

కర్ణకారుఁడు. దే. వి. ఓడవాఁడు: చూ, సరంగు.

కర్ణము. వై. వి.=కార్యమ్: చూ, పని. 2.

కర్ణ. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక చెట్టు: చూ, సువర్ణావళి.

కర్ణకండువు. సం. వి. ఉ. పుం. ఒకానొక చెవి రోగము: చూ, బాధిర్యము.

కర్ణకీటి. సం. వి. ఈ. స్త్రీ. ఒకానొక పురుగు, కీటకవిశేషము: చూ, పురుగు.

కర్ణక్ష్వేడము. సం. వి. అ. పుం. ఒకానొక చెవిరోగము: చూ, బాధిర్యము.

కర్ణగూథకము. సం. వి. అ. పుం. —పై.—

కర్ణగూథము. సం. వి. అ. న. గులివి: చూ, గులివి.

కర్ణజములము. సం. వి. అ. న. —పై.—

కర్ణజలౌక. సం. వి. ఆ. స్త్రీ. చెవిచొరుపాము: చూ, సర్పము. (రూ- కర్ణజలౌకము)

కర్ణజలౌకము. సం. వి. స్. పుం. —పై.—

కర్ణజాహము. సం. వి. అ. న: చూ, చెవిగూబ.

కర్ణజిత్తు. సం. వి. త్. పుం. అర్జునుఁడు: చూ, విజయుఁడు. 1.

కర్ణదర్పణము. సం. వి. అ. పుం. తాటంకము: చూ, భూషణము. 2.

కర్ణదుందుభి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఒకానొక పురుగు: చూ, పురుగు; పా. 2. (టింపెనం) చెవుగూబలోని ధ్వనినాకర్షించు పలుచేనిపొర.

కర్ణధారుఁడు. సం. వి. అ. పుం. ఓడంగి: చూ, సరంగు.

కర్ణపత్రము. సం. వి. అ. న. చెవికమ్మ: చూ, భూషణము. 2.

కర్ణపర్వము. పా. భారతపర్వములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, పర్వములు. "క. అనుపమబలులగు కర్ణార్జునవీరుల శౌర్యమహిమ శోభిల్లంగా, నెనిమిదియగు పర్వంబిది, యనంబగగుం గర్ణపర్వ మతిహృద్యంబై."

కర్ణపాలి. సం. వి. ఈ. స్త్రీ: చూ, కర్ణపత్రము.

కర్ణపుష్పము. సం. వి. అ. పుం. ప్రియాలము*: చూ, మోరటి.

కర్ణపూరకము. సం. వి. అ. పుం. తుంగ*: చూ, తృణము. 1.

కర్ణపూరము. సం. వి. అ. పుం. 1. అసోగము*: చూ, హేమపుష్పము; 2. కడప *: చూ, నీపము; 3. పుష్పాదులచేఁ జేయఁబడిన చెవికమ్మ: చూ, భూషణము.2; 4. దిరిసెనము*: చూ, శిరీషము; 5. నల్లఁగలువ *: చూ, పద్మము. 1.

కర్ణప్రతినాహము. సం. వి. అ. పుం. చెవిరోగములలో నొకటి: చూ, బాధిర్యము.

కర్ణఫలము. సం. వి. అ. పుం. ఒకానొక చేఁప: చూ, మత్స్యము. 1.

కర్ణమచ్ఛము. సం. వి. అ. పుం. ధార్మికలక్షణము: చూ, లక్షణము. 1.

కర్ణమలము. సం. వి. అ. న. గులిమి: చూ, గులివి.

కర్ణము. సం, వి. అ. న. 1. చెవి: చూ, శ్రోత్రము; 2.=కన్నము, గోడకంత: చూ, రంధ్రము. 1; 3. చుక్కాని: చూ, పీలి. 2; పా. 4. కోణము, మూల. (ఏంగిల్.)

కర్ణముకురము. సం. వి. అ. పుం. తాటంకము, చెవికమ్మ: చూ, భూషణము. 2.

కర్ణములు. అం.1. పురుషలక్షణాంగములు ఏఁబదియెనిమిదింటిలో నొకటి; ఇవి హ్రస్వములైన మహాభాగుఁడగు. దీర్ఘములైన మధ్యముఁడు. రోమమున్న సుఖి. మచ్చగలిగిన ధార్మికుఁడగు: చూ, లక్షణాంగములు; 2. స్త్రీలక్షణాంగములు ఏఁబదియెనిమిదింటిలో నొకటి; ఇవి శ్రీకారములఁబోలినను చక్కిలములవలె నుండినను భాగ్యవతియగు. రోమములేకున్న భోగియగు. మొదటను కుడిసుడియున్న సద్వృత్తశాలియగు. శంఖములవలెనున్న దుశ్శీలురాలగు. రోమమున్న మగనితోఁ బోరుచుండును. నల్లనిమచ్చయున్న పుత్రవతియు సుఖవతియునగు. అతిస్థూలములైన మగనిఁజంపును: చూ, స్త్రీలక్షణాంగములు; పా. 3. వీనికి ఉపమానములు.—శ్రీకారములు, నవసంఖ్య, చక్కిలములు.

కర్ణమూలము. సం. వి. అ. న: చూ, చెవిగూబ.

కర్ణమూలావర్తము. సం. వి. అ. పుం. స్త్రీసౌభాగ్యలక్షణము: చూ, లక్షణము. 1.

కర్ణమోటి. సం. వి. ఈ. స్త్రీ. చాముండాదేవి. సప్తమాతృకలలో నొకతె: చూ, మాతృకలు.

కర్ణరంధ్రము సం. వి. అ. న: చూ, చెవిగూబ.

కర్ణరసాయనము. జా. చెవులకింపైనది. "వాని పాట కర్ణరసాయనంబుగానున్నది."

కర్ణరోగజాతకుఁడు. పా. నవాంశకుండలియందలి కారకాంశరాశియందు కేతువు ఉన్నయెడల కర్ణచ్ఛేదమైనను, కర్ణరోగమైనను గలుగును. తృతీయాధిపతియున్న రాశ్యధిపతి కేంద్రమున నుండి పాపగ్రహసంబంధముండినను కర్ణరోగజాతకుఁడగును.

కర్ణలత. సం. వి. ఆ. స్త్రీ. చెవితమ్మె: చూ, భూషణము. 2.

కర్ణవంశము. సం. వి. అ. పుం. చాకమగు మంచెము: చూ, మంచెము.

కర్ణవర్జితము. సం. వి. అ. పుం. 1. పాము: చూ, సర్పము. విణ. 2. చెవిలేనిది.

కర్ణవిట్టు. సం. వి. శ్. పుం. గులిమి: చూ, గులివి.

కర్ణవేధని. సం. వి. ఈ. స్త్రీ. అంకుశము: చూ, సృణి.

కర్ణవేష్టకము. సం. వి. అ. న. కుండలము, పురుషుల చెవిపోఁగులు: చూ, భూషణము. 2.

కర్ణవేష్టనము. సం. వి. అ. న.—పై.—

కర్ణసంస్రావము. సం. వి. అ. పుం. చెవిరోగము: చూ, బాధిర్యము.

కర్ణస్ఫోట. సం. వి. ఆ. స్త్రీ. త్రిపుట *: చూ, బొల్లిబూసర.

కర్ణాఁదువు. సం. వి. ఉ. పుం. చెవికమ్మ: చూ, భూషణము. 2.

కర్ణాకర్ణి. వా. వినికిడిగుస.

కర్ణాత్రివర్తి. అం. అశుభావర్తములలో నొకటి: చూ, అశుభావర్తములు.

కర్ణాటు. అం. కర్ణాటదేశము: చూ, దేశము. (రూ- కర్ణాటము) (తద్భ-కన్నడము)

కర్ణాటకులు. వా. శైవబ్రాహ్మణులలోని పంచద్రావిడులలో నొక తెగ. కన్నడభాష మాట్లాడు దేశమందలి బ్రాహ్మణులు కర్ణాటకులు. వీరిలో అరవతొక్కు—అను బ్రాహ్మణులు, ఉరిచి బ్రాహ్మణులు, కన్నడబ్రాహ్మణులు, కమ్మెబ్రాహ్మణులు సగరబ్రాహ్మణులు, బొబ్బరబ్రాహ్మణులు అనిఆఱువిధములు: చూ, బ్రాహ్మణులు.

కర్ణాటచతుష్పద. వా. ఒకానొకవృత్తము: చూ, వృత్తము. 1; అప్ప. 4, ఆ. 286.

కర్ణాటు. అం. విన్నాణములలో నొకటి: చూ, విన్నాణములు.

కర్ణానుజుఁడు. సం. వి. అ. పుం. యుధిష్ఠిరుఁడు: చూ, ధర్మరాజు. 1.

కర్ణాభరణకము. సం. వి. అ. పుం. రేల*: చూ, రేల.

కర్ణార. సం. వి. ఆ. స్త్రీ. అంకుశము: చూ, సృణి.

కర్ణారి. సం. వి. ఇ. పుం. కిరీటి: చూ, విజయుఁడు. 1.

కర్ణాస్ఫాలనము. సం. వి. అ. పుం. ఏనుఁగు చెవి కొట్టుకొనుట: చూ, ఝులఝుల.

కర్ణి. సం. వి. ఈ. స్త్రీ. 1. కదళి *: చూ, రంభ. 2; న్. పుం. 2. రేల *: చూ, రేల; 3. ఒకానొకకొండ: చూ, పర్వతము.

కర్ణిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చెవికమ్మ: చూ, భూషణము. 2; 2: చూ, తొండము చివర; 3. తామరదుద్దు: చూ, మిద్దె (చూ, పద్మము. 1.); 4. నడిమివ్రేలు: చూ, మధ్యము; 5. ఒకరకము బాణము: చూ, బాణము. 1; 6. అగ్నిమంథని *: చూ, వైజయంతి. 1; 7. పిన్నగోరంట *: చూ, గోరంట; 8. కుట్టని: చూ, శంభళి.

కర్ణికము. అం. 1. ఆసనములు ముప్పదింటిలో నొకటి: చూ, ఆసనములు; 2. బాణాగ్రములు పదింటిలో నొకటి: చూ, బాణాగ్రములు.

కర్ణికాచలము. సం. వి. అ. పుం. సుమేరుపర్వతము: చూ, పర్వతము.

కర్ణికారము. సం. వి. అ. పుం. 1. రేల*: చూ, రేల; 2. అక్షోటము *: చూ, కొండగోగు. (దీనికి దోహదక్రియ సల్లాపము.); 3. గోఁగు *: చూ, మృదుద్రుమము.

కర్ణికి. సం. వి. న్. పుం. ఏనుఁగు: చూ, హస్తి.

కర్ణీరథము. సం. వి. అ. పుం. బాలక్రీడాది శకటము: చూ, శకటము. 1.

కర్ణీసుత. సం. వి. ఆ. స్త్రీ. గ్రామదేవత: చూ, మహాలక్ష్మి. 3.

కర్ణీసుతుఁడు. సం. వి. అ. పుం. కంసుఁడు: చూ, మూలదేవుఁడు.

కర్ణుఁడు. సం. వి. అ. పుం. 1. కుంతి పెద్ద కొడుకు, కుంతికి కన్యకావస్థయందు సూర్యుని వలనఁబుట్టిన కొడుకు: చూ, రాధేయుఁడు.

కర్ణేందువు. స్సం. వి. ఉ. పుం. 1. చెవినగ: చూ, భూషణము. 2; 2. కర్ణప్రదేశము.

కర్ణేజపుఁడు. సం. విశే. చాడీగొట్టు: చూ, తంటలమారి. 1.

కర్ణ్యము. సం. వి. అ. న. గులిమి: చూ, గులివి.

కర్త. స. వి. ఋ. పుం. 1. బమ్మ, నలువ: చూ, బ్రహ్మ. 1; విశే. 2. కారకుఁడు: చూ, పనివాఁడు; అం. 3. కారకములాఱింటిలోనొకటి; కర్త = క్రియయందు స్వాతంత్ర్యముకలది: చూ, కారకములు.

కర్తనము. సం. వి. అ న. 1. కత్తిరించుట: చూ, ఛేదనము; 2. స్త్రీలు రాట్నము వడుకుట: చూ, తర్కుటము; 3 స్త్రీలు గాఁముతియానుచేయుట; 4. తుంగ *: చూ, తృణము. 1.

కర్తరి. సం. వి. ఈ. స్త్రీ. 1. కత్తెర: చూ, బాణము. 1; 2. = కత్తెర. భరణి మూఁడునాలుగు పాదములయందును, కృత్తికయందును, రోహిణి మొదటిపాదమునందును సూర్యుఁడుండుకాలము: చూ, కత్తెర; అం. 3. ఏకవింశతి మహాదోషములలో నొకటి: చూ, ఏకవింశతి మహాదోషములు.

కర్తరీముఖము. సం. వి. అ. పుం. 1. అభినయ హస్తవిశేషము అనఁగా బొటనవ్రేలివంచి చూపుడువ్రేలి మొదటఁగూర్చి ఉంగరపువ్రేలిని వంచిచూపుడు నడిమివ్రేళ్ళను కత్తెరవలె పట్టినది: చూ, వ్యంజకము. 1; అం. 2. అసంయుతహస్తములు నలుబదియైదింటిలో నొకటి: చూ, అసంయుతహస్తములు.

కర్తరీస్వస్తికము. సం. వి. అ. పుం. 1: చూ కర్తరీముఖము. 1; అం. 2. సంయుతహస్తములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, సంయుతహస్తములు.

కర్తలాణము. సం. వి. అ. పుం. = కత్తలాన- కత్తలాని. తెల్లనిగొరిజయుఁ దోఁకయు వెండ్రుకలునుగల నల్లగుఱ్ఱము. నై. 6, ఆ. 96. (ఉచ్చైశ్శ్రవముతో దీనిసరిఁబోల్చి తెల్లనియని విశేషణ మిచ్చియుండుటచేత నిక్కడనిది యశ్వమాత్రపరమని యెఱుంగునది): చూ, హయము.

కర్తవ్యము. సం. విశే. చేయఁదగినది: కరణీయము.

కర్తారి. సం. వి. ఈ. స్త్రీ. మెట్టవంగ *: చూ, వంగ.

కర్తృక. సం. వి. ఆ. స్త్రీ. క్షుద్రఖడ్గము: చూ, రిష్టి. 2

కర్తృత్రియము. అం. ప్రకృతి, జీవాత్మ, పరమాత్మ: చూ, త్రియము.

కర్తృత్వము. సం. వి. అ. న. 1. కర్తృభావము: కారకత్వము; 2. కర్తృధర్మము.

కర్త్రి. సం. వి. ఈ. స్త్రీ. = కత్తి: చూ, రిష్టి. 2.

కర్త్రి. సం. వి. ఈ. స్త్రీ. = కర్త్రియ. 1. ఆఁడుది: చూ, స్త్రీ. 2. క్రియావతి: చూ, స్త్రీ.

కర్దటము. సం. వి. అ. పుం. తామరదుంప *: చూ, పద్మకందము.

కర్దనము. సం వి. అ. న. 1. సంజాఁడు: చూ, మాంసము; పుం. 2. పంకము: చూ, బురద.

కర్దమి. సం. వి. ఈ. స్త్రీ. చైత్రపూర్ణిమ: చూ, పున్నమ.

కర్దమము. సం. వి అ. పుం. పంకము: చూ, బురద.

కర్దముఁడు. సం. వి. అ. పుం. కర్దముఁడను పేరుగల బ్రహ్మ: చూ, బ్రహ్మ. 1.

కర్ద్రిమి. సం. వి. ఈ. స్త్రీ. అష్టాపది *: చూ, మల్లె. 1.

కర్పటధారి. సం. విణ. 1. మాసినగుడ్డలు ధరించినవాఁడు: కర్పటికుఁడు; 2. ఊరజోగి: చూ, యాచకుఁడు.

కర్పటము. సం. వి. అ. పుం. 1. బట్ట: చూ, వస్త్రము; 2.= చినిఁగినబట్ట: చూ, వస్త్రము; 3. మాసినగుడ్డ: చూ, వస్త్రము; 4. సన్న్యాసులగుడ్డ: చూ, వస్త్రము. (తద్భ-కప్పడము) (రూ-కరపటము-పటి)

కర్పటికుఁడు. సం. విణ: చూ, కర్పటధారి.

కర్పణి. సం. వి. ఈ. స్త్రీ. చిఱుపాల *: చూ, మనుపాల.

కర్పరము. సం. వి. అ. పుం. 1.=కప్పెర. పుర్రె: చూ, శల్యము. 1; 2. = కప్పెర. వెడల్పు ముఖముగల పెద్దపాత్రము: చూ, పాత్రము.6; 3.= కప్పెర. బిచ్చగానిగిన్నె: చూ, పాత్రము. 6; 4. ఒకరకముబాణము: చూ, బాణము. 1; 5.= కప్పలి. ఓడ: చూ, పోడము. (పురుషోత్తమకవీయము)

కర్పరాలము. సం. వి. అ. పుం. అక్షోటము *: చూ, కొండగోనుగు.

కర్పరి. సం. వి. ఈ. స్త్రీ. మ్రానిపసుపునవండిన అంజనవిశేషము: చూ, రసాంజనము.

కర్పరికాతుత్థము. సం. వి. అ. న. —పై—

కర్పాసము. సం. వి. అ. పుం, న. రూ-కార్పాసము *: చూ, ప్రత్తి.

కర్పాసి. సం. వి. ఈ. స్త్రీ. రూ- కార్పాసి*. —పై—

కర్పూర. అం. 1. తైలములలో నొకటి: చూ, తైలములు; 2. అంజనములలో నొకటి చూ, అంజనములు. (కర్పూరాంజనము)

కర్పూరకము. సం. వి. అ. పుం.1. ఒల్లికసింద*: చూ, షడ్గ్రంథ; 2. అంకపీలి *: చూ, మ్రానిపసుపు.

కర్పూరగంధి. సం. వి. ఈ. స్త్రీ.=కప్పురగంధి: చూ, స్త్రీ.

కర్పూరతృణము. సం. వి. అ. న. వాసనగడ్డి *: చూ, తృణము. 1.

కర్పూరతైలము. సం. వి. అ. న.: చూ, కప్పురపునూనె.

కర్పూరనాళిక. సం. వి. ఆ. స్త్రీ. పక్వాన్నవిశే షము: చూ, సాదము. (1)

కర్పూరభోగి. సం. వి. ఈ. న. = కప్పురభోగి.

కర్పూరమంజరి. సా. ఈ గ్రంథమును కాళిదాసు రచించెను. మఱియు శివదేవుఁడును కూడ రచించెను.

కర్పూరమణి. సం. వి. ఇ. పుం. ఒకరకము పాషాణము: చూ, సౌవీరము.

కర్పూరము. సం. వి. అ. పుం, న.=: చూ, కప్పురము; అం. 2. గంధములు యనిమిదింటిలో నొకటి: చూ, గంధములు.

కర్పూరవం.. వా. వి. సీ.ఁనం.యా, ...ములగ. (...)*: చూ, ...

కర్పూరవేదిక. సం. వి. ఆ. స్త్రీ. కైలాసము: చూ, పర్వతము.

కర్పూరశిలాజిత్తు. సా. ఇంగువశుద్ధి:—కర్పూర శిలాజిత్తు తామరపూలరసముతో గాని కలువపూలరసముతో గాని ఒకరోజు మునూరిన శుద్ధి.

కర్పూరస్నేహము. సం. వి. అ. న.: చూ, కప్పురపునూనె.

కర్పూరాది. అం. చూర్ణములుపదునాఁడింటిలో నొకటి: చూ, చూర్ణములు.

కర్ఫరము. సం. వి. అ. పుం. అద్దము: చూ, ముకురము.

కర్బరము. సం. వి. అ. పుం. పెద్దపులి: చూ, శార్దూలము. 1.

కర్బరి. సం. వి. ఈ. స్త్రీ. 1. గౌరి: చూ,

పార్వతి. 1; 2. ఆఁడుపులి : చూ. శార్దూలము. 1. (రూ-కర్బురి)

కర్బురుఁడు. సం. వి. అ. పుం. రూ-కర్బురుఁడు. నైరృతి: చూ. మూలకోఁడు.

కర్బుదారకము. సం. వి. అ. పుం. విరిగి*: చూ, శ్లేష్మాతకము.

కర్బుదారము. సం. వి. అ. పుం. కాంచనము *: చూ, దేవకాంచనము.

కర్బురా. సం. వి. అ. స్త్రీ. కలిగొట్టు *: చూ, సాలి. 2.

కర్బురటము. సం. వి. అ. పుం: చూ, కర్బురాగకము *.

కర్బురఫలము. సం. వి. అ. పుం: చూ, సొకురుండము *.

కర్బురము. సం. వి. అ. న. 1. జలము: చూ, నీరు.1; 2. రూ-కర్బూరము- కార్బురము, బంగారు: చూ, లోహము. 1; పుం. 3. దోషము: చూ, పాపము; 4. కప్పురము. చిత్రవర్ణము: చూ, వర్ణము. 6; 5. కుందురుష్కమను గంధద్రవ్యము: చూ, గంధాగము; విశ. 6. చిత్రవర్ణముగలది: చూ, వర్ణము. 6

కర్బురశిలాజతువు. సం. వి. ఉ. న: చూ, సిలాజిత్తు.

కర్బురసువ్యాప్తి. సం. వి. న్. పుం. లత్తుక: చూ, లక్క.

కర్బురి. సం. వి. ఈ. స్త్రీ: చూ-రూ-. కర్బరి.

కర్బురుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ-కర్బురుఁడు. (రూ-కర్బూరుఁడు)

కర్బూరకము. సం. వి. అ. న. అంకెపెలి*: చూ, మూత్రనిపసుపు.

కర్బూరము. సం. వి. అ. న. 1 రూ-కర్బురము. బంగారు: చూ, లోహము. 1; 2. అరిదళము: చూ, హరిదళము; పుం. 3. కటి, నల్లని అతివస *: చూ, విస; 4. ఒజ్జికసింద *: పద్మగ్రంథి.

కర్బూరుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ-కర్బురుఁడు.

కర్మ. సం. వి. న్. న. 1. చేయుట. దేనిని, వేనిని మొదలగు ఆకాంక్షలపైవచ్చు సమాధానము: చూ, విధి; 2.=కర్మ. జాబు: చూ, లేఖ. 3; అం. 3. కారకములు ఆఱింటిలో నొకటి; క్రియార్థములయొక్క ఫలమునకాధారమైనది: చూ, కారకములు; 4. ఘనవాద్యములు ఆఱింటిలోనొకటి: చూ, ఘనవాద్యములు.

కర్మంది. సం. వి. అ. పుం. యతి: చూ, ముని. 1.

కర్మకరి. సం. వి. ఈ. స్త్రీ. 1. వెలకుఁగొన్న దాసి: చూ, పరిచారిక; 2. బింబిక *: చూ, దొండ; 3. పొగ *: చూ, స్రివ.

కర్మకరుఁడు. సం. విశ. 1. పరిచారకుఁడు: చూ, సేవకుఁడు. 1; 2. జముఁడు: చూ, యముఁడు; 3. కూలివాఁడు: చూ, సంబళకాఁడు.

కర్మకారుఁడు. సం. వి. అ. పుం. 1. ఇనుముపని చేయువాఁడు. అయస్కారుఁడు, కర్మారుడు: (తె.ప.):— కనుమరి, కమ్మతీఁడు, కమ్మర, కమ్మరవాఁడు, కమ్మరి, కమరిఁడు, కమసాల-రూ-కమసలి, చూ, స్వర్ణకారుఁడు; విశ.2. అమిజికాఁడు: చూ, వెట్టివాఁడు.

కర్మకీలకుఁడు. సం. వి. అ. పుం. చాకలి: చూ, రజకుఁడు.

కర్మఠుఁడు. సం. విశ. పనియందు నేర్పరి: చూ, పనివాఁడు.

కర్మజదేవతలు. అం. దేవతలు అయిదుగురిలో నొకరు: చూ, దేవతలు.

కర్మజము. సం. వి. అ. పుం. 1. కర్మయుగము: చూ కలియుగము; 2. వటము*: చూ, మఱ్ఱి; విశ. 3. క్రియాజన్యము.

కర్మకుఁడు. సం. విశే. జీతముకాక నొకపని చేయువాఁడు: చూ, పనివాఁడు.

కర్మణిప్రయోగము. అం. ప్రయోగములు నాలుగింటిలోనొకటి: చూ, ప్రయోగములు.

కర్మణ్య. సం. వి. ఆ. స్త్రీ. జీతము: చూ, వేతనము. 1.

కర్మణ్యభుజుఁడు. సం. విశే. జీ. కూలివాఁడు: చూ, సంబళకాఁడు.

కర్మణ్యము. సం.విశే.1.కర్మ యోగ్యమైనది; కర్మార్హము; 2. క్రియాపూర్వమైనది:కర్మార్హము.

కర్మత్రయము. అం. 1. పుణ్యము, పాపము, పుణ్యపాపమిశ్రమము: చూ, త్రయము: 2. ఆగామి, సంచితము, ప్రారబ్ధము: చూ, త్రయము.

కర్మధారము. సం. వి. అ. పుం. పట్టెకి: చూ, నాగలి. 1.

కర్మధారయసమాసము. వ్యా. ఇందులోని రెండు పదములలో నొకటి విశేషణము ఒకటి విశేష్యమునై యుండును. ఉదా - నల్లగలువ, కృష్ణసర్పము, మయూరవ్యంసకము: చూ, సమాసము. 1; ఇందుకు సంబంధించిన సమాసములు:—

1. విశేషణపూర్వపద కర్మధారయము,
2. విశేష్యపూర్వపద కర్మధారయము,
3. విశేషణోభయపద కర్మధారయము,
4. ఉపమానోత్తరపద కర్మధారయము,
5. ఉపమానపూర్వపద కర్మధారయము,
6. సంభావనాపూర్వపద కర్మధారయము,
7. అవధారణపూర్వపద కర్మధారయము.

కర్మఫలము. సం. వి. అ. న. 1. కర్మవిపాకము; 2. కర్మరంగఫలము.

కర్మభువి. సం. వి. ఈ. స్త్రీ. నల్లనేల: చూ, భూమి. 1.

కర్మభూమి. సం. వి. ఇ. స్త్రీ: చూ, ఆర్యావర్తము.

కర్మము. సం. వి న్. న. 1. ఆలుసంజ్ఞగలది: చూ, సత్కర్మము, 2. కార్యము, పని: చూ, ప్రయోజనము. 1.

కర్మములు. అం. 1. ఇవి. 16.—గర్భాధానము, పుంసవనము. సీమంతము జాతకర్మము, నామకరణము, అన్నప్రాశనము. చౌలము, ఉపనయనము, ప్రాజాపత్యము. సౌమ్యము, ఆగ్నేయము. వైశ్వదేవము. గోదానము. సమావర్తనము, వివాహము. అంత్యకర్మము. (16); 2. తర్క-శాస్త్రమునందలి పంచవిధ కర్మములు.—ఉత్క్షేపణము, అవకుంచనము. ప్రసారణము. గమనము, అవక్షేపణము; 3 షట్కర్మములు —యజనము. యాజనము, అధ్యయనము, అధ్యాపనము. దానము, ప్రతిగ్రహము. (6): 4. కర్మములు.— కాయికకర్మ, వాచికకర్మ. మానసికకర్మ. (3)

కర్మమూలము. సం. వి. అ. న. దర్భ *: చూ, తృణము. 1.

కర్మమోటి. సం. వి. ఈ. స్త్రీ. శివుని పరిచారికలలో నొకతె: చూ. పరిచారిక.

కర్మయుగము. సం. వి. అ. న: చూ, కలియుగము.

కర్మయోగము. అం. యోగములు రెండింటిలో నొకటి: చూ, యోగములు.

కర్మరంగము. సం. వి అ. పుం, స్త్రీ. ఒకానొక చెట్టు: చూ, వృక్షము.

కర్మరహితుఁడు. సం.విశే: చూ, పనిలేనివాఁడు.

కర్మరి. సం. వి. ఈ. స్త్రీ. సుకాక్షిరి *: చూ, వంశరోచన.

కర్మవజ్రుఁడు. సం. వి. అ. పుం. అడుగు పుట్టువు: చూ, శూద్రుఁడు.

కర్మశీలుఁడు. సం. విశే. ఫలముకోరినను లేక

న్నను కార్యమును జేయు స్వభావము కల వాఁడు: కార్ముకుఁడు.

కర్మశూరుఁడు. సం. విణ: చూ, కర్మక్షముఁడు.

కర్మసంచయపురి. అం. పురులు ఎనిమిదింటిలో నొకటి: చూ, పురులు.

కర్మసచివుఁడు. సం. వి. అ. పుం. రాచకార్యము కంటె తక్కిన ప్రయోజనములయందు జాగరూకుఁడై యుండువాఁడు.

కర్మసన్న్యాసికుఁడు. సం. వి. అ. పుం. యతి: చూ, ముని. 1.

కర్మసమర్థుఁడు. సం. విణ. పనియందు సమర్థుఁడు: చూ, సమర్థుఁడు.

కర్మసాక్షి. సం. వి. ఇ. పుం. చేయుపనుల సాక్షి: చూ, సూర్యుఁడు.

కర్మహీనుఁడగు విప్రుఁడు. అం. నిరర్థకములు ఏడింటిలో నొకటి: చూ, నిరర్థకములు.

కర్మాగారము. పా. పరిశ్రమాలయము.

కర్మారము. సం. వి. అ. న. వెదురు*: చూ, వేణువు.

కర్మారుఁడు. సం. వి. అ. పుం.=కర్మకారి: చూ, కర్మకారుఁడు.

కర్మార్హము. సం. విణ: చూ. కర్మణ్యము.

కర్మార్హుఁడు సం. వి. అ. పుం. మనుజుఁడు: చూ, మనుష్యుఁడు.

కర్మాలయము. పా. కర్మాగారము.

కర్మి. సం. వి. న్. పుం. 1. నాగరంగము*: చూ, నారింజ; 2. మనుజుఁడు: చూ, మనుష్యుఁడు; 3. అంతరంగము: చూ, హృదయము. 2; 4. ఒడలు: చూ, శరీరము; 5. కొలువుకాఁడు: చూ, సేవకుఁడు. 1.

కర్మిణి. సం. వి. ఈ. స్త్రీ: చూ, పూర్వమీమాంస.

కర్మిష్ఠుఁడు. సం. విణ. కర్మయందు అధికనిష్ఠ గలవాఁడు.

కర్మ్మవు. సం. వి. ఉ. న. పని: చూ, ప్రయోజనము. 1.

కర్మేంద్రియపంచకము. అం. వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ (5.): చూ, ఇంద్రియములు.

కర్మేంద్రియపురి. అం. పురులు ఎనిమిదింటిలో నొకటి: చూ, పురులు.

కర్మేంద్రియములు. అం. వికారములు పదునారింటిలో నొకటి: చూ, వికారములు.

కర్వటము. సం. వి. అ. న. 1. కోటచేతను అగడ్తచేతను దుర్గమమైన ప్రధాననగరము: చూ, దేశము; 2. రెండువందల గ్రామములమధ్యనుండు మనోజ్ఞమైన గ్రామము. 804 గ్రామములలో ముఖ్యగ్రామమని కొందఱు. 400 గ్రామములలో సుందరమగు గ్రామమని కొందఱు. (త్రికాండశేషము.) (రూ-ఖర్వటము.): చూ, దేశము.

కర్వము. సం. వి. అ. పుం. ఎలుక: చూ, మూషికము.

కర్వరము. సం. వి. అ. పుం. పెద్దపులి: చూ, శార్దూలము.

కర్వరి. సం. వి. ఈ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2 ఇంగువమ్రాను*: చూ, హింగువు. 1.

కర్వురుఁడు. సం. వి. అ. పుం. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1;

కర్వలి. దే. వి. గాలి: చూ. వాయువు. (రూ-కరువలి.)

కర్శము. సం. వి. అ. పుం. ఒజ్జికసింద*: చూ, మద్గ్రింథ.

కర్షకుఁడు. సం. విణ. 1. ఈడ్చువాఁడు: చూ, తిగుచువాఁడు; 2. దున్నికొని బ్రదుకువాఁడు: చూ, వ్యవసాయి.

కర్షనక్రము. సం. వి. అ. పుం. కత్తులసాన: చూ, సాన. 2.

కర్షణము. సం. వి. అ. న. 1. ఈడ్చుట: చూ, లాగు. 3; 2.=కరిసెనము. దున్నుట: చూ, వ్యవసాయము. 2; 3. ఒఱపిడి: చూ, పీడనము.

కర్షణి. సం. వి. ఇ. స్త్రీ. 1. కులట: చూ, ఱంకులాఁడి; ఈ. స్త్రీ. 2. చిఱుపాల * చూ, మనుపాల.

కర్షఫల. సం. వి. అ. స్త్రీ. ఉసిరిక *: చూ, శ్రీఫలి. 1.

కర్షఫలము. సం. వి. అ. పుం. తాఁడి *: చూ, విభీతకము.

కర్షము. సం. వి. అ. పుం. న. 1.=కరిసె, అగపలము, పదునాఱుమాసముల యెత్తు: చూ, ఫలము. 1; (ముప్పావుతులమెత్తు అని పురుషోత్తమకవియము); పుం. 2. ఒరయిక: చూ, పీడనము.

కర్షాపణము. సం. వి. అ. పుం. పదునాఱు మాసములయెత్తు వెండినాణెము, ఎనిమిది చిన్నములయెత్తు వెండినాణెము. (రూ-కార్షాపణము-కార్షాపణకము-కార్షికము.)

కర్షిణి. సం. వి. ఈ. స్త్రీ. చిఱుపాల*: చూ, మనుపాల.

కర్షువు. సం. వి. ఉ. స్త్రీ. 1. కాలువ: చూ, నది; 2. యజ్ఞార్థమైనమక్కి: చూ, వ్యవసాయము. 2; 3. వార్తాకము *: చూ, వంగ; 4. ఏఱు: చూ, నది; ఉ. పుం. 5. పిడకనిప్పు: చూ, నిప్పు.

కర్సనము. వై. వి. 1.=కర్షణము రూ-కరిసెనము. భార. సౌ. 1, ఆ. 31: చూ, వ్యవసాయము. 2; 2.=ఘర్షణము రూ-కరిసెనము: చూ, పీడనము.

కర్హి. సం. అవ్య. ఎప్పుడు: చూ, ఎన్నఁడు. 3.

కఱ. వై. వి. 1.=కాలః, నలుపు; హరి. పూ. 8, ఆ. 156: చూ, వర్ణము. 6; (రూ-కఱయ-కఱి- కఱియ- కఱ్ఱి- కఱ్ఱీ- కారియ- కారు- కాఱియ.) (పుం-క)2. మరక; హరి. పూ. 5, ఆ. 120: చూ, మఱక. (రూ-కఱ్ఱ-గఱ్ఱ.)

కఱకంచుచీర. ద్వ. వి. చిత్రవర్ణపుకోక: చూ, వస్త్రము.

కఱకంటుఁడు. వై. వి.=గరళకంఠుఁడు: చూ, శివుఁడు. (రూ-కఱకంఠుఁడు)

కఱకంఠుఁడు. వై. గ్రా. వి.—వై.—

కఱకంఠుతలమానికము. ద్వ. గ్రా. వి. చందమామ: చూ, చంద్రుఁడు.

కఱకంఠుతలయేఱు. ద్వ. గ్రా. వి.—వై—

కఱకరి. వై. విశే. (కఱకు + అరి) 1= కర్కశ. కఠినుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 2. శేగ్వరి. స్వా. 4, ఆ. 7: చూ, సమర్థుఁడు.

కఱకఱ. దే. వి. కంచుట పొద్దుపొడుచుట ఒగయుట తెఱుగుట నమలుటలోనగువాని యందగు ధ్వన్యనుకరణము: చూ, హాహాహూహూ.

కఱకఱి. దే. వి. 1. బలాత్కారము: చూ, బలవంతము; 2. బాధ; ఆము. 5, ఆ. 61: చూ, దుఃఖము.

కఱకు. వై. వి. 1 = కర్కరమ్. గట్టి; హరి. ఉ. 7, ఆ. 183: చూ, బెడిదము; 2. కర్కర రూ-కఱుకు: చూ, గఱుకు; వై. విశే. 3.= కర్కర. గట్టి. "కఱకునేల.": చూ, బెడిదము; 4. రూ- కఱుకు. పరుసఁదనము "కఱకుమాట." పెం: చూ, పరుషము.

కఱకుఁదనము. వై. వి = కర్కరమ్. గట్టి: చూ, బెడిదము.

కఱకుగిలు. వై. అ. క్రి. = కర్కర. గట్టిదగు. కవిక. 5, ఆ. 110: చూ, బిరుసగు.

కఱకుటమ్ము. ద్వ. వి. రూ- కఱుకుటమ్ము. వాఁడిగలబాణము: చూ, బాణము. 1.

కఱకుట్లు. దే వి. బ. శూల్యము: చూ, మాంసము. (రూ-కఱుకుట్లు-కఱ్ఱకుట్లు-కఱ్ఱుకుట్లు.)

96

కఱుకుసుమ్మ. ద్వ. వి. ఇసుక. స్వా. 5, ఆ. 38: చూ, సికత. 4.

కఱుకులు. వై. వి. బ. పరుషవచనము: చూ, పరుషము. 2.

కఱచు. దే. స. క్రి. 1. అలవాటుచేయు: చూ, వాడుకపడు; 2. కాటుచేయు. భార. ఆది. 3, ఆ. 203: చూ, మాకొను.

కఱుమేట. దే. వి. పంటిచేతికొఱికి గాయపఱుచుట: చూ, కాటు.

కఱటి. దే. విశ. 1. దబ్బఱకాఁడు. "క. మతి రొత్తఁగి యెఱుఁగనొల్లని, కఱటిం దెలుపంగ." భార. ఆది. 4, ఆ. 72; హరి. పూ. 9, ఆ. 224: చూ, వంచకుఁడు; 2. కుత్సితుఁడు: చూ, వ్యాధుఁడు 2; 3. అజ్ఞాని: చూ, మూర్ఖుఁడు.

కఱత. వై. వి. 1.= కృత. చేష్ట: చూ, పని. 2; 2. చెడుపని; లక్ష్మీ. 4, ఆ. 135: చూ, దుశ్చేష్ట.

కఱతలాఁడు. వై. విశ.=కృత.(కఱతలు + ఆఁడు) చెడువ్యాపారముగలవాఁడు; హరి. పూ. 5, ఆ. 245: చూ, వ్యాధుఁడు. 2.

కఱద. వై. వి.=1. బుద్ధి: చూ, బుద్ధి; 2. మాట: చూ, వ్యాఖ్యాతము. 2.

కఱదు. దే. వి. మోసము: చూ, వంచన.

కఱదూపము. వై. వి. కాలధూపః. ధుంధుమారము. భీ. 3, ఆ. 45: చూ, పొగ.

కఱనూనె. ద్వ. వి. (కఱ + నూనె) మాలినితైలము: చూ, తైలము.

కఱపు. దే. వి. 1. చెడుబోధ. "గీ. కకుని కఱపు విని యసన్మార్గవృత్తికిఁ జొచ్చి యిట్టియెడరు తెచ్చుకొనియె." భార. భీష్మ. 1, ఆ. 80: చూ, బోధనము; స. క్రి. 2. ఎఱిఁగించు: చూ, బోధించు.

కఱపుట. దే. వి. తెలియఁజేయుట: చూ, బోధనము.

కఱియ. దే. వి. నలుపు: చూ, వర్ణము. 6.

కఱవ. దే. వి. ఒకానొకమూలిక*: చూ, వృక్షము.

కఱవాడు. దే. వి. 1. ఎండినచేఁప: చూ, మత్స్యము. 1; 2. సిగబంతి: చూ, భూషణము. 2.

కఱవు. దే. వి. 1. కాటకము; భార. శాంతి. 4, ఆ. 73; రామా. 5, ఆ. 148: చూ, దుర్భిక్షము; (ప్రకృతి.—ఖర్వ. పురుషోత్తమకవీయము) 2. పూరిండ్లుకప్పునపుడు యేర్పఱచుకొనిన మితి; అచ్చ. బాల, కాం. 21..

కఱి. వై. వి. 1.= కాలః. నలుపు: చూ, వర్ణము. 6; 2. పశుయోని, చూ, భగము. 12; 3. ఇంద్రియుఁడు: చూ, వేలుపుతేఁడు; విశ. 4. నల్లనిది: చూ, వర్ణము. 6.

కఱిచిలుకు. ద్వ. వి. ఉండసురియ అను బాణము: చూ, బాణము. 1.

కఱిచేడియ. ద్వ. వి. గౌరి: చూ, పార్వతి. 1.

కఱినేల. ద్వ. వి. ముప్పదిరెండుకుంటలపొలము: చూ, భూమి. 1.

కఱిపక్కము వై. వి.= కాలపక్ష. నెలయందలి రెండవ సమభాగము: చూ, బహుళపక్షము.

కఱిమొన. ద్వ. వి కఱ్ఱయొక్క మొన: చూ, మొన.

కఱిమొల. ద్వ. వి. అడ్డుకుతగిలించు నాగవాసము: చూ, నాగవాసము.

కఱియ. వై. విశ= కాల. నల్లనిది. పాండు. 5, ఆ. 268: చూ, వర్ణము. 6.

కఱియావు. ద్వ. వి. నల్లనిఆవు: చూ, ధేనువు.

కఱివేము. ద్వ. వి. కాలశాకము, కరివేఁపాకు*: చూ, బల. (రూ-కరివేఁప)

కటివేలుపు. ద్వ. వి. కృష్ణుఁడు, నల్లనయ్య: చూ, విష్ణువు. 1. (రూ-కటివేల్పు.)

కటివేల్పుడాకన్ను. ద్వ. వి. విష్ణువునకు వామనేత్రము, చేందురుఁడు: చూ, చంద్రుఁడు.

కటివేల్పురిక్క. ద్వ. వి. శ్రవణము. తూపురిక్క, తూపురూపురిక్క: చూ, నక్షత్రము.1.

కటివేల్పునిల్లాలు. ద్వ. వి. లచ్చి: చూ, లక్ష్మి.1.

కటివేల్పుతాయి. ద్వ. వి. కప్పుతాయి, నీలము: చూ, రత్నము. 1.

కఱ. దే. వి. 1. తీక్ష్ణము: చూ, తీండ్రము; 2: చూ, రూ- కసరు; 3. రూ-కఱకు: చూ, పగెవము; 4. తాయిలోఁగువానికిఁ గలుగఁ జేసెడు కఱకు: చూ, గఱుకు; 5. బీగము: చూ, శౌర్యము; స. క్రి. 6. ఒరయు; స్వా. 4, ఆ. 58: చూ, రద్దు. 1.

కఱకుటమ్ము. ద్వ. వి: చూ, రూ-కఱకుటమ్ము.

కఱకుట్లు. దే. వి. బ: చూ, రూ- కఱకుట్లు. చంద్రా. 6, ఆ. 100.

కఱక్కు. దే. వి. కఱకుటయందగు ధ్వన్యనుకరణము; ఉ. రా. 7, ఆ.211: చూ, హూహూ.

కఱకోల. దే. వి: చూ, రూ- కఱుగోల. (వా)

కఱుగోల. దే. వి. (కఱ + గోల) 1. వాఁత వేసెడు యినుపకమ్మి: చూ, చేరుపుడుఁగోడుపు; 2. నాఁగటికుంపకోఁ నమర్చెడు ఇనుపకమ్మి: కఱుకోల, కఱ్ఱు, కొఱు, నక్కు; (సం. ప): — కుశి, కూటము, కృషకము- రూ- కృషికము.

కఱుసు. వై. వి.= కృతి, నేర్పు; ఉ. రా. 2, ఆ. 60; హరి. ఉ 10, ఆ. 251; ప్రభా. 3, ఆ. 52: చూ, సామర్థ్యము. 1.

కఱుదులాఁడు. వై. విశ. (కఱుదులు + ఆఁడు) ఉపాయశాలి, నేర్పరి. "క. కఱుదులాఁడగు చక్రికవటంపుటనువునఁదను మోసపుచ్చిన." హరి. ఉ. 7, ఆ. 36: చూ, సమర్థుఁడు.

కఱ్ఱ. వై. వి. 1.= కొల. రూ- కఱ. నలుపు; హరి. పూ. 5, ఆ. 255: చూ, వర్ణము. 6; 2. మరక: చూ, మఱక; 3. = కాష్ఠము, కొయ్య: చూ, వంటచెఱకు.

కఱ్ఱకుట్లు. దే. వి. బ: చూ, రూ- కఱుకుట్లు.

కఱ్ఱగుద్దలి. దే. వి. కాష్ఠగుద్దాలము: చూ, ముద్గరము.

కఱ్ఱనూనె. దే. వి. దారుతైలము: చూ, తైలము.

కఱ్ఱపెండలము. దే. వి. ఒకరకము దుంప *: చూ, పెండలము.

కఱ్ఱనుడ. దే. వి. నెల్లగింపనుపయుక్తమైన పనిముట్టు; పం. న. నా. 1, ఆ. 248: చూ, కత్తి వ.2.

కఱ్ఱి. వై. వి. 1.= కాల. నలుపు: చూ, వర్ణము.6; 2. అర్జునుఁడు: చూ, విజయుఁడు. 1; విశ. 3. కాలుఁడు. "తే. గీ. తెల్లదామర రేకులట్టుల్లసిల్లు, కన్నుదోయి నొప్పారెడు కఱ్ఱియాతఁడు." హరి. పూ. 9, ఆ. 255: చూ, నల్లనివాఁడు.

కఱ్ఱినెచ్చెలి. ద్వ. వి. వెన్నుఁడు: చూ, విష్ణువు.1.

కఱ్ఱినేస్తి. ద్వ. వి. —పై.—

కఱ్ఱు. దే. వి. 1. నాఁగటి కుంపయందమర్చెడి యినుపపాళము: చూ, కఱుగోల.2; 2. దాగు: చూ, మఱక.

కఱ్ఱుకుట్లు. దే. వి. బ: చూ, కఱుకుట్లు. రుక్మాం. 3, ఆ. 226.

కఱ్ఱుగుద్దలి. ద్వ. వి. తొల్లిక, త్రవ్వుట కుపయుక్తమైన పాఱవంటి పనిముట్టు; కళా. 4, ఆ. 78: చూ, తొల్లిక.

కల. సం. వి. ఆ. స్త్రీ, విశ: చూ, రూ- కళ; దే. వి. (1) ఒరసాపు: చూ, మూర్ఛ; 2. అదర్శనము: చూ, స్వప్నము. 1.

కలంక. వై. వి. 1.= కలంకమ్. గుఱుతు: చూ, లక్షణము. 1; 2.=కలుషము. దోషము: చూ, పాపము; 3. ఒకానొక దేశము: చూ, దేశము;

విశే. 4. కలఁగినది. (రూ-కలంకు- కళకు- కలచే.): చూ, వ్యాకులము.

కలంకనీరు. ద్వ. వి. కలుషోదకము: చూ, నీరు.1.

కలంకము. సం. వి.అ. పుం.1.=కలంక.గుఱుతు: చూ, లక్షణము. 1; 2. ఇనుపచిట్టెము: చూ, మండూరము; 3. రూ-కళంకము. దూఱు: చూ, నింద. 1; 4. కాలాయసముయొక్క మలము: రూ-కళంకము.

కలంకష. సం. వి. అ. స్త్రీ. కరతాళి : చూ, స్వరము. 2.

కలంకషము. సం. వి. అ. పుం. సింగము: చూ, సింహము.

కలంకారి. దే. వి. వ్రాఁతపనిబట్ట: చూ, వస్త్రము.

కలంకి. సం. విశే. నిందతోఁగూడినది : చూ, నిందాస్పదము.

కలంకు. దే. వి. 1. గుఱుతు: చూ, లక్షణము. 1; 2. అపవాదము: చూ, నింద. 1; 3. కలంక, దోషము: చూ, పాపము.(ప్రకృతి.—కలంక. పురుషోత్తమకవీయము.)

కలంకురము. సం. వి. అ. పుం. అంబసాంభ్రమము: చూ, నీటిసుడి.

కలంజము. సం. వి. అ. పుం.=గంజాయి*: చూ, త్రిశూలిని.

కలంత. వై. వి.=గళంతిక: చూ, పాత్రము. 6.

కలంతాజా. పా. క్రిందఁగనఁబఱచు అదనపు సంగతి. (ఫుట్ నోట్) (వాడుక.)

కలందరము. సం. వి. అ. పుం. వర్ణసంకరజాతి విశేషము.

కలందాను. హిం. వి.వ్రాఁతకలములుంచు పెట్టె.

కలందిక. సం. వి. ఆ. స్త్రీ. సర్వవిద్య.

కలందువు. సం. వి. ఉ. పుం.ఒకరకముకూరాకు: గోళి, ఘోళి.

కలంబకుఁడు. సం. విశే.చెవుడుగలవాఁడు: చూ, మూఁగవాఁడు. 3.

కలంబము. సం. వి. అ. పుం. 1: చూ, కూరనారం 2. అమ్ము. రూ-కళంబము: చూ, బాణము.1; 3. కడిమి *: చూ, నీపము.

కలంబి. సం. వి. ఈ. స్త్రీ. తీఁగబచ్చలి *: చూ, బచ్చలి.

కలంబిక. సం. వి. ఆ. స్త్రీ. తీఁగబచ్చలి కూర: కలంబువు.

కలంబుటము. సం. వి. అ. న. అప్పుడు తఱచి తీసిన వెన్న, ఆవెన్న కాఁచిన నెయ్యి: చూ, మంథజము.

కలంబువు. సం. వి. ఉ. పుం: చూ, కలంబిక.

కలఁక. దే. వి. 1. దోషము: చూ, పాపము; 2 కంటికలఁక: చూ, బిడాలము. 2. (రూ-కలఁగుఁడు- కలఁగుండు) (ప్రకృతి.-కలుష. పురుషోత్తమకవీయము)

కలఁకఁబాఱు. దే. అ. క్రి. కలఁతపడు; భాగ. 10 స్కం. పూ. 54: చూ, సంక్షోభించు.

కలఁకపాటు. ద్వ. వి. కలఁత; కళా. 4, ఆ. 175: చూ, సంతాపము.

కలఁకు. వై. వి.1.=ఖల. తానము: చూ, స్థానము.1; 2. జగడము: చూ, యుద్ధము; 3. కల్లము: చూ, ఖలము.

కలఁకువ. దే. వి. కలఁతి: చూ, సంతాపము (రూ- కలఁకుండు- కలఁత - కలపనఁబిండ- కరకరి- కలవరము- కలాపః- కలాపము- కళవళము) (పురుషోత్తమకవీయము)

కలఁగఁబడు. ద్వ. అ. క్రి. కలఁగు; భాగ. ద్రోణ. 4, ఆ. 5; శివరా. 1, ఆ. 94. (స్వాగమునపడు): చూ, సంక్షోభించు

కలఁగఁబాఱు. దే. అ. క్రి. —వై.— (రూ-కలఁగఁబడు- కలకఁబాఱు- కలఁగు- కలఁతపడు- కలగుండుకొను- కలగుండుపడు- కలగొను- కలవరపడు- కలవరపోవు-కలుచేపడు

కళవళపడు- కళవళించు.) (పురుషోత్తమ కవీయము.)

కలఁగు. దే. అ. క్రి. —పై—

కలఁచియాడు. దే. స. క్రి. (కలఁచి + ఆడు) కలఁగఁజేయు. భాగ. పురా.1, ఆ.158: చూ, కలగుండువెట్టు.

కలఁచు. దే. స. క్రి. —పై—

కలఁత. దే. వి. కలఁతపాటు: చూ, సంతాపము. (రూ-కలఁక)

కలఁతపడు. దే. అ. క్రి. కలఁగు: చూ, సంక్షోభించు.

కలకంఠము. సం. వి. అ. పుం. 1. కోయిల: చూ, పికము; 2. తెలిపిట్ట: చూ, హంస; 3. పారావతము: చూ, పావురము; 4. అవ్యక్తమధురధ్వని: చూ, స్వరము. 2.

కలకంఠీవీణావాంసస్వరము. పా. అష్టపుత్రవతీ లక్షణము: చూ, లక్షణము. 1.

కలకండ. దే. వి. పగుళోర్కెక. రూ-కల్కండ: చూ, బెల్లము. 1. (దీని నే పటికబెల్లమందురు)

కలకము. సం. వి. అ. పుం. శకులమను చేఁప: చూ, మత్స్యము. 1.

కలకల. దే. వి. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హహాహహా.

కలకలము. సం. వి. అ. పుం. 1. = కోలకోల. గుంపునఁబుట్టిన పెద్దమ్రోఁత: చూ, స్వరము.2; 2. యక్షధూపము: చూ, సర్జరసము.

కలకాలము. పా. ఎల్లప్పుడు: చూ, సతతము. 2.

కలకు. దే. వి. కళ్ళెము: చూ, వాగె. (రూ-కళ్ళియము - కళ్ళె - కళ్ళెము - కళ్యము- గలాము- లగాము.) (పురు-క)

కలక్టరు. ఆం. మండలకరగ్రాహి, జిల్లాకు అధికారి.(రూ- కలెక్టరు.)

కలగర. దే. వి. గుంటగలగర *: చూ, భృంగరాజము. (రూ-గుంటకలగర- గుంటగలగర- గుంటగలిజేరు) (పురు-క)

కలగలపు. దే. వి. (కలపు + కలపు) 1. కలుపుఁగోలు: చూ, బుజ్జగింత; (రూ-కలుపుఁగోలు- కల్పుఁగోలు- కలుపుఁగోలుతనము) 2. అనుకుగా వండిన కూర: చూ, వ్యంజనము. 1. (రూ- కలగల్పు)

కలగల్పు. దే. వి. —పై.—(కలుపుఁగూరగను— పాండు. 4, ఆ 184.)

కలగుండు. దే. వి. 1. కలఁత: చూ. సంతాపము; 2. కలుషము: చూ పాపము.

కలగుండుకొను. దే. అ. క్రి. కలఁగు. భార. ద్రోణ. 1, ఆ. 293: చూ, సంక్షోభించు.

కలగుండుగను. దే. అ. క్రి.—పై.—

కలగుండువెట్టు. దే. స. క్రి. కలఁగఁజేయు. "సీ. సాత్యకి యేచి ధృష్టద్యుమ్నుఁడును దానును గురుసైన్యములఁ గలగుండువెట్టి." భార. భీష్మ. 3, ఆ.64: ఆలోడించు, కలఁచియాడు, కలఁచు.

కలగుషు. దే. వి. కలుషము: చూ, పాపము.

కలగూర. దే. వి. (కలపు + కూర) పెక్కుదినుసులు కలసిన కూరాకు: చూ, వ్యంజనము. 1.

కలగొను. దే. అ. క్రి. (కలపు + కొను) 1. కలఁగు: భాగ. పురా. 4, ఆ. 169: చూ, సంక్షోభించు; 2. క్రమ్ము. ఉ. హరి. 5, ఆ. 107: చూ, వ్యాపించు.

కలఘోషము. సం. వి. అ. పుం. కోయిల: చూ, పికము.

కలచి. దే వి. కలుషము: చూ, పాపము.

కలజువ్వి. దే. వి. రూ- కలుజువ్వి *: చూ, ప్లక్షము.

కలటము సం. వి. అ. న. ఇంటికప్పు: చూ, పటలము.

కలతిక. సం. వి. అ. స్త్రీ. భుజశిరస్సుక్రింద నాలుగు అంగుళములవఱకుగల ప్రదేశము.

**కలతూలిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. సంభోగము తక్క తక్కిన విషయముల యందు ఇచ్ఛగల స్త్రీ: చూ, స్త్రీ; 2. కులట: చూ, ఱంకులాఁడి.

**కలతెలుఁగు.** దే. వి. నిజము: చూ, సత్యము. 1.

**కలత్రము.** సం. వి. అ. న. 1 రూ-కళత్రము. పెండ్లాము: చూ, భార్య; 2. నితంబము. తొడలమీఁద నడుముక్రింది భాగము: చూ, పిఱ్ఱ.

**కలధూతము.** సం. వి. అ. న. వెండిబంగారులలో నగువాని నాణెము: చూ, నాణెము.

**కలధౌతము.** సం. వి. అ. న. 1. —పై.—; 2. బంగారు: చూ, లోహము. 1; 3. వెండి: చూ, లోహము. 1; 4. అవ్యక్తమధురధ్వని: చూ, స్వరము. 2.

**కలధ్వని.** సం. వి. ఇ. పుం. 1. అవ్యక్తమధురధ్వని: చూ, స్వరము. 2; 2. కోయిల: చూ, పికము; 3. నెమలి: చూ, మయూరము; 4. పారావతము: చూ, పావురము.

**కలన.** సం. వి. ఆ స్త్రీ. 1. తెలియుట: చూ, వ్యక్తము. 2; 2. పొందుట: చూ, ప్రాప్తము.1; దే. వి. (1)జగడము: చూ, యుద్ధము. (రూ-కలను- కల(దు-కయ్యము) (ప్రకృతి.-ఖలమ్. పురుషోత్తమకవీయము)

**కలనఁబోవరులతెన్ను.** దే. వి: చూ, సూర్యుఁడు.

**కలనతపసి.** వై. వి. = కలితాపస. నారదుఁడు: చూ, ముని. 1. పు

**కలనతపసితల్లి.** ద్వి. వి. పలుకురాణి: చూ, సరస్వతి.

**కలనము.** సం. వి. అ. పుం. 1. వేతసము: చూ, ప్రబ్బలి; న 2. గురుతు: చూ, లక్షణము.1; 3. దోషము: చూ, పాపము.

**కలను.** వై. వి. 1 = ఖలమ్. తానము. భార; శాంతి. 3, ఆ. 61: చూ, స్థానము. 1. 2.= కలిః. జగడము; రామా. 8, ఆ. 54: చూ, యుద్ధము; (యుద్ధభూమి అని కొందఱు.) 3.= ఖలః. కల్లము; విజ్ఞా. ఆ, కాం. 104: చూ, ఖలము. 4.

**కలప.** దే. వి. 1. నాఁగటిమెంప: చూ, నాఁగలి; 2. ఇల్లుకట్టుటకుపయోగించెడు దూలములు వాసములులోనగునవి; భార. అశ్వ. 1, ఆ. 56; 3. కఱ్ఱలగుట్ట. "కలప అడితి."

**కలపకట్టియ.** వై. వి. = కలము, కఱ్ఱపుల్లతోఁ జేసిన కలము: చూ. లేఖిని. (రూ-కలపకట్టె)

**కలపడము.** దే. వి. 1. ఒకసంఖ్యతో నితరయొక సంఖ్య కలుపుట, కూటము: చూ, సంకలనము; 2. యుక్తవయస్సు వచ్చినపిల్లను భర్తతోఁ గలుపుట: చూ, గర్భాధానము.

**కలపతాల్పు.** దే. వి. 1. నాఁగటిజోదు: చూ, బలరాముఁడు; 2. నాలవకొలువువాఁడు: చూ, శూద్రుఁడు.

**కలపనగంప.** దే. విణ. కజ్జికోరు; హరి. పూ. 5, ఆ. 92: చూ, పేచీకోరు.

**కలపనఁబిండి.** దే. వి. (కలపడము + పిండి) కలఁత; ఉ. హరి. 5. ఆ. 59: చూ, సంతాపము.

**కలపము.** దే. వి. 1. కలయఁజేయుట. "క. తల యంటె నొకతె కొనికిఁ, గలపంబునఁ జేసి తావిగల్గిన నూనెక." య. 4, ఆ. 95; 2. పరిమళద్రవ్యములు చేర్చి కలిపిన చందనము. "సీ. కలపంబులభినవ గంధంబులుఁగ గూర్చి." భార. విరా. 1, ఆ. 107: చూ, మిశ్రము.

**కలపు.** దే. వి. 1. రూ- కలుపు. మిశ్రదధి: చూ, పెరుఁగు. 1; 2 కల్గియుట. "ఇరువుర మనములకలపు." మార్క. 5, ఆ. 72; స. 89. 3. కలియఁజేయు. "మగల యిలు వరుసఁగల పెను." రాఘ. 2, ఆ. 99.

**కలబంద.** దే. వి. గృహకన్య*. చూ- కలుబంద*.

కలభకర్ణిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, ఉష్ట్రకర్ణి *.

కలభము. సం. వి. అ. పుం. 1. రూ-కళభము. ఏనుఁగుగున్న: చూ, హస్తి; 2. రూ- కళభము, ముప్పదియేండ్ల ఏనుఁగు: చూ, హస్తి; 3. ఒకానొక చేఁప: చూ. మత్స్యము. 1; 4. ఎలుకజీడి *: చూ, భల్లాతకి.

కలభవల్లభము. సం. వి. అ. పుం. గోలుగు *: చూ, పీలువు.

కలభి. సం. వి. ఈ. స్త్రీ. ఆముదము: చూ, వ్యాడంబకము.

కలమము. సం. వి. అ. పుం. 1. కలము: చూ, లేఖిని; 2. వరిపైరు: చూ, సస్యము; 3. లత్తుక: చూ, లక్క; 4. ఎఱ్ఱబుడమలు: చూ, ధాన్యము; 5. నల్లగుఱ్ఱము: చూ, హయము; 6. మొలక: చూ, మొక్క. 1; 7. ఇరువదియేండ్ల ఏనుఁగు: చూ, హస్తి; 8. చారము *: చూ. ప్రియ; 9. వరిపొట్ట: చూ, పొట్ట. 2.

కలమోత్తమము సం. వి. అ. పుం. శాలిధాన్యము: చూ, ధాన్యము.

కలమరి. దే. విశే. (కలము + అరి) ఓడ యెక్కి పోవువాఁడు. భార. శాం. 5, ఆ. 588.

కలము. సం. వి. అ. న. 1. రేతము: చూ, రేతస్సు. 1; 2. కోలి *: చూ, గృధ్రనఖి; పుం. 3. పిన్నవరగోఁగు *: చూ, పీలువు; 4. అజీర్ణము: చూ, రోగము. 1; విశే. 5. అవ్యక్త మధురాక్షరధ్వని: చూ, స్వనము. 2; దే. వి. (1) కలువగంధము: చూ, వాసన; (2) ఓడ; కాశీ. 3, ఆ. 123: చూ, పోడము; (3) పండ్రెండుతూముల కొలఁదిగలపరిమాణవిశేషము. పర. 3, ఆ. 156; వై. వి. (4)=కలమ. లేఖిని: చూ, లేఖిని.

కలముఁడు. సం. వి. అ. పుం. దొంగ: చూ, ముచ్చు. 1.

కలయ. దే. క్రి. అంతట. "క. కొలువు కలయఁగనుంగొని." భార. ఉద్యో. 2. ఆ. 115: చూ, పిమ్మట. (రూ-కలయఁగ)

కలయంపి. దే. వి. సుష్మనఁగుటకై కస్తూరి చందనములోనుగాఁగల సుగంధవస్తువులఁగలిపి నల్లెడు నీరు: చూ, పేన్నీళ్లు. (రూ- కలపడము- కలాఁపి) (పేన్నీళ్లు అనునవి అపరిశుద్ధవస్తువులను శుద్ధిచేయుటయందు వాడెదరు)

కలయఁగ. దే. క్రి: చూ, కలయ.

కలయఁబడు. ద్వి. అ. క్రి. (కలయక + పడు) కలయు. జై. 3, ఆ. 62. (స్వార్థమునపడు): చూ, ప్రాప్తించు.

కలయిక. దే. వి. సంగమము: చూ, సంయోగము. (రూ-కలియిక-కలుప.)

కలయు. దే. స. క్రి. 1. కామించు: చూ, వలచు; 2. కూడు. హ, ఉ. 2, ఆ. 54: చూ, ప్రాప్తించు; అ. క్రి. 3. అసఁగిపెనఁగు: చూ, పేళగించు 1.

కలయుమొలుకువ. ద్వి వి. మల్లయుద్ధములోని విశేషము: చూ, మల్లశాస్త్రము.

కలరవము. సం. వి. అ. పుం. కపోతము: చూ, పావురము.

కలరా. వా. విషూచి, వమనవిరేచనవ్యాధి: చూ, విషూచిక.

కలరు. దే. వి. 1 కలిగినవారు. "పాడియు సత్యముంగలరుపాండుతనూజులు." భాగ; అం. 2. రంగు

కలరూపు. ద్వి. వి. యాథార్థ్యము: చూ, సత్యము. 1.

కలలజము. సం. వి. అ. పుం.: చూ, సర్జరసము.

కలలజోద్భవము. సం. వి. అ. పుం. పాలము*: చూ, మద్ది.

కలలము. సం. వి. అ. పుం, న. 1. = కరువు: రూ-కలిలము. గర్భపిండము: చూ, పిండము; 2. జరాయువు: చూ, మావి. 2.

కలవ. దే. వి. 1. రూ-కలువ- కల్వ *: చూ, పద్మము. 1; 2. కలయుట: చూ, సంయోగము; 3. కలసిన యిసుకయు సున్నమును; 4. కలుషములగు జలాదులు; విణ. 5. కలసినది: చూ, మిశ్రము. (ప్రకృతి.-కలుష. పురుషోత్తమకవీయము)

కలవంటకము. దే. వి. (కలవు + వంటకము.) నూవుపొడిలోనగువానితోఁ గలపిన వంటకము. చిత్రాన్నము: చూ. సాద... (1)

కలవడము. దే. వి: చూ, కలయంపి.

కలవడు. ద్వ. అ. క్రి. (కలవు + పడు)కలయు "కలవడిమాటలఁ బ్రియములు." సుగ్మాం. 3. ఆ. 64: చూ, ప్రాప్రించు. (రూ- కలయఁబడు- కలయు- కలియు - కలుగు - కల్గు - కలువు)( పురు-క)

కలవరపడు. ద్వ. అ. క్రి. (కలవరము + పడు) కలఁతపడు: చూ, సంక్షోభించు.

కలవరపోవు. దే. అ. క్రి. (కలవరము + పోవు) —పై.—

కలవరము. దే. వి. 1. కలఁత: చూ. సంతాపము; 2. చింత: చూ, పశ్చాత్తాపము; 3. కలవరింత: చూ, స్వప్నము. 1. (రూ- కలవరింత- కలవరింపు- కలవలము - కలువరింత - కలువరింపు- కళవళము- పలవరింత.) (పురు-క)

కలవరించు. దే. అ. క్రి. మైమఱచిమాటాడు అచ్చ. అర. కాం. 96.

కలవరింత. దే. వి. రూ - కలువరింత. కళా. 5. ఆ. 58: చూ, స్వప్నము 1. (రూ- పలవరింత.)

కలవరింపు. దే. వి —పై.— (రూ- కలువరింపు.

కలవలము. దే. వి. —పై.— (రూ-కలవరము.)

కలవాఁడు. దే. విణ. 1. ఆప్తుఁడు. "ఉ. శాంతనవుండు సర్వకురుసంతతికిఁగలవాఁడు కాఁడె" భార. ఉద్యో 2, ఆ. 164: చూ, స్నేహితుఁడు. 1; 2. ధనవంతుఁడు. "సీ. అరకూట కలాప మర్గ్వావే. కలవానికేనర్గ్వామే నిర్ధరేశ్వరునకు." నై. 4, ఆ. 68: చూ, సంపన్నుఁడు; 3. శక్తుఁడు. "వినుమాపనికెల్లఁ బాండుపుత్రులె కలవారు." భార. ఉద్యో. 3. ఆ. 201: చూ. లావరి.

కలవాలము. సం. వి. అ. పుం.=కరవాలు, కత్తి: చూ, రిష్టి. 2.

కలవింకము. సం. వి. అ. పుం. 1. ఊరఁబిచ్చుక: చూ. పిచ్చుక; 2. గూఁకటిమూఁగ: చూ. భృంగరాజము. 3.

కలశము. సం. వి. అ.పుం. న. ఈ. స్త్రీ. 1. ఘటము, కుండ: చూ, భాండము. 3; (రూ-కలసము-కలశి = నీళ్లకడవ) 2. అభినయహస్త విశేషము: చూ, వ్యంజకము. 1; అం. 3. సంయుతహస్తములు ముప్పదిరెండింటిలోనొకటి: చూ, సంయుతహస్తములు.

కలశరేఖ. అం. లక్షణాంగములలో నొకటి: చూ, లక్షణాంగములు.

కలశాబ్ధి. సం. వి. ఇ. పుం. పాల్కడలి: చూ, సముద్రము.

కలశాబ్ధిజ. సం. వి. ఆ. స్త్రీ. పాలమున్నీటికూఁతురు: చూ. లక్ష్మి. 1.

కలశి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. కోలపొన్న *: చూ, పృశ్నిపర్ణి; 2. కుండ: చూ, భాండము. 3; మెఱుఁగుఁజిలికెడు కుండ: చూ, భాండము. 3; 4. నీళ్ళకుండ: చూ, భాండము. 3; 5. నక్కతోకపొన్న *: సృగాలవిన్న.

కలశిక్లీతని. సం. వి. ఈ. స్త్రీ. కోలపొన్న *: చూ, పృశ్నిపర్ణి.

కలశోదధి. సం. వి. ఇ. పుం. పాలసముద్రము: చూ, సముద్రము.

కలసము. సం. వి. అ. పుం. కుండ: చూ, భాండము. 3. పెరుఁగుజిలికెడు కుండ.

కలసి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. కోలపొన్న*: పృశ్నిపర్ణి; 2. మెఱుఁగుఁజిలికెడు కుండ: చూ, భాండము. 3; 3. కుండ: చూ, భాండము. 3; 3. నీళ్ళకుండ: చూ, భాండము. 3.

కలసికొను. దే. అ. క్రి. రూ- కలిసికొను: చూ, సంయుక్తమగు.

కలసీసుతుఁడు. సం. వి. అ. పుం. 1. అగస్త్యుఁడనుముని: చూ, ముని. 1; 2. వేలుపుటొజ్జ: చూ, బృహస్పతి.

కలసోదధి. సం. వి. ఇ. పుం. పాలకడలి: చూ, సముద్రము.

కలహంస. సం. వి. అ. పుం. 1. కాదంబము, ధూమ్రవర్ణములైన ముక్కు కాళ్ళు రెక్కలు గలహంస, మధురముగాఁ బలుకుహంస: చూ, హంస; 2. రాజహంస, ఎఱ్ఱని ముక్కు కాళ్లుగల హంస: చూ, హంస; ("రాజహంసస్తు కాదంబే కలహంసే నృపోత్తమే. పుం. కలహంసస్తు కాదంబే రాజహంసే నృపోత్తమే." అని విశ్వకోశము); 3. రాజశ్రేష్ఠుఁడు: చూ, రాజు. 1; 4. కమలినీకలహంస నాటికయందు నాయకుఁడై చెప్పఁబడ్డ రాజు: చూ, రాజు. 1. (రూ-కలహంసము)

కలహంసము. సం. వి. అ. పుం.—పై.—

కలహనాశనము. సం. వి. అ. పుం. సెమిలడుగు*: చూ, పూతికరజము.

కలహప్రియ. సం. వి. అ. స్త్రీ. గోరువంక: చూ, శారిక.

కలహప్రియుఁడు. సం. వి. అ. పుం. నారదుఁడు: చూ, ముని. 1.

కలహము. సం. వి. అ. పుం, న. 1. = కలన - కయ్యము. జగడము: చూ, యుద్ధము; పుం. 2. సమరము: చూ, యుద్ధము; 3. కత్తియొఱ: చూ, ప్రత్యాకారము; 4. కట్టుట: చూ, బంధము. 1; 5. శోభ: చూ, వెలుతురు. 1.

కలహశీలుఁడు. సం. విశే. కచ్చెపోతు: చూ, పేచీకోరు.

కలహాంతరిత. అం. ముందుకోపముచేఁ బ్రియుని విడనాడి వెనుక పరితాపమునొందెడు నాయిక, నాయికలు ఎనమండ్రిలో నొకతె: చూ, నాయికలు.

కలహాశనుఁడు. సం. వి. అ. పుం. నారదుఁడు: చూ, ముని. 1.

కలహించు. సం. అ. క్రి. జగడమాడు: చూ, పోట్లాడు.

కలాంకురము. సం. వి. అ. పుం. బెగ్గురు: చూ, సారసము.

కలాంకురుఁడు. సం. వి. అ. పుం. కంసుఁడు: చూ, మూలదేవుఁడు.

కలాంతరము. సం. వి. అ. న. 1. వృద్ధి: చూ, వడ్డి; 2. లాభము: చూ, లాభము. 1.

కలాంబిక. సం. వి. ఆ. స్త్రీ. వడ్డిబ్రదుకు: చూ, వృద్ధిజీవిక.

కలాకూలము. సం. వి. అ. న. విషము: చూ, విషము. 1.

కలాకేళి. సం. వి. ఇ. పుం. మరుఁడు: చూ, మన్మథుఁడు.

కలాచి. సం. వి. ఈ. స్త్రీ.= కాళంజి. తమ్మపడిగము: చూ, పాత్రము. 6.

కలాచిక. సం. వి. ఆ. స్త్రీ. 1. లొట్టికట్టు: చూ, ముంగిలి. 2; 2. ఇంటికోన: చూ, ప్రకోష్ఠము; 3. బుజేముతుద.

కలాటీనము. సం. వి. అ. పుం. ఏటిత్రింత: చూ, వ్యాఘ్రాటము.

కలాదము. సం. వి. అ. పుం. 1. జొన్నపండు; 2. కుక్కలమైథునము: చూ, సంయోగము.

కలాదుఁడు. సం. వి. అ. పుం. 1. అగసాలె: చూ, స్వర్ణకారుఁడు; 2. చందమామ: చూ, చంద్రుఁడు; 3. విద్యచెప్పినవాఁడు: చూ,

పంతులు. 1; 4. మాతులుఁడు: చూ, మేన మామ; 5. మేనమామకొడుకు: చూ, మేన బావ; 6. జ్ఞాతి: చూ, దాయాఁదుడు; 7. కఠిన చిత్తుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 8. మొండె పుగామ్ము, రాహువు: చూ, రాహువు. 2; 9. కేతుగ్రహము: చూ, రాహువు. 2.

కలానిధి. సం. వి. ఇ. పుం. 1. చెందురుఁడు: చూ, చంద్రుఁడు; 2. ముక్కంటి: చూ, శివుఁడు; 3. పండితుఁడు: చూ, విద్వాంసుఁడు.

కలానువాది. సం. వి. ఇ. పుం. 1. తుమ్మెద: చూ, భ్రమరము; 2. చటకము: చూ, పిచ్చుక; 3. కయిజా: చూ, కాఁజా.

కలాపకము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగు మెడసంకెల: చూ, శృంఖలము. 2; 2. పండ్రెండుపేటల హారము: చూ, భూషణము.2; 3. నొసటిబొట్టు: చూ, బొట్టు. 1.

కలాపతి. సం. వి. ఇ. పుం. చెందురుఁడు: చూ, చంద్రుఁడు.

కలాపన. దే. వి. కలఁత: చూ, సంతాపము.

కలాపము. సం. వి. అ. పుం. 1. ఇరువదియైదు పేటలుగల స్త్రీలయొడ్డాణము: చూ, భూషణము. 2; 2. నెమలిపురి: చూ, పింఛము. 1; 3. అమ్ములపొది: చూ, బాణము. 1; 4. తొడవు: చూ, భూషణము. 2; 5. గుంపు: చూ, సమూహము; 6. ఓంకారము: చూ, ప్రణవము; 7. చెడ్డపలుకు: చూ, చెడ్డమాట; 8. మణిఖచితమగు ప్రదేశములేక తిన్నె; 9. ఒడలు: చూ, శరీరము; 10. తెలివి: చూ, బుద్ధి; 11. ముక్తి: చూ, మోక్షము. 1; 12. చేయుట; 13. సర్వసమునందు రెండు కాళ్ళతోను మూఁడుమారులు నృత్యము చేయుట; 14. కళలలో భేదము; 15. వేద వాక్యము; 16. ఒకవిధమగు కాలము; దే. వి. (1) కలఁత: చూ, సంతాపము.

కలాపి. సం. వి. న్. పుం. 1. నెమలి: చూ, మయూరము; 2. జువ్వి *: చూ, ప్లక్షము; దే. వి. (1) రూ- కలయంపి. అం, భా. ద్వి. పు. 23: చూ, పేన్నీళ్ళు.

కలాపిని. సం. వి. ఈ. స్త్రీ. 1. రాతిరి: చూ, రాత్రి; 2. నాగరముస్త *: చూ, తృణము.1.

కలాపుఁడు. సం. వి. అ. పుం. 1. కంసాలి: చూ, స్వర్ణకారుఁడు; 2. చెందురుఁడు: చూ, చంద్రుఁడు; 3. ఇనుఁడు: చూ, సూర్యుఁడు; విణ. 4. వ్రాసెడువాఁడు: చూ, శిల్పి.

కలాపూర్ణుఁడు. సం. వి. అ. పుం. చెందమామ: చూ, చంద్రుఁడు.

కలాబాక్షము. సం. వి. అ. పుం. వ్రీహిధాన్యము: చూ, ధాన్యము.

కలాభృత్తు. సం. వి. త్. పుం. చెందమామ: చూ, చంద్రుఁడు.

కలామకము. సం. వి. అ. పుం. కలమధాన్యము: చూ, ధాన్యము.

కలాయ. సం. వి. ఆ. స్త్రీ. గండదూర్వ *: చూ, తృణము. 1.

కలాయకము. సం. వి. అ. పుం. లంకలసెడువడ్లు: చూ, ధాన్యము.

కలాయనము. సం. వి. అ. పుం. పేరము: చూ, వర్తకము.

కలాయనుఁడు. సం. వి. అ. పుం. నట్టువుఁడు: చూ, నర్తకుఁడు.

కలాయము. సం. వి. అ. పుం. 1. గుండ్రని సెనగలు: చూ, సెనగలు.(బోడసెనగలనివాడుక); 2. లంకలసెడువడ్లు: చూ, ధాన్యము.

కలాయి. హిం. పాత్రలకు తగరముపూయుట.

కలాలాపము. సం. వి. అ. పుం. తుమ్మెద: చూ, భ్రమరము.

కలాలి. హిం. వి. కల్లుసారాయలమ్మువాఁడు.

కలావతి. సం. వి. ఈ. స్త్రీ. 1. తుంబురువీణ: చూ, వీణె. (తుంబురను గంధర్వునివీణె) (రూ-కళావతి); 2. కళలనుదెలిసినయాఁడుది, రూ-కళావతి: చూ, స్త్రీ; అం. 3. తాళాధ్యాయప్రకరణములోని తతవాద్యములుఇరువదింటిలో నొకటి: చూ, తతవాద్యములు.

కలాలుఖానా. హిం. వి. కల్లుసారాయలమ్ము దుకాణము.

కలావరు. అం. వి. 1. (రూ- కళావరు.)-పేకాటలోని నలుపు గుఱుతుగల కాకితము. 2. నాసాధరణము: చూ, భూషణము 2.

కలావాదము. అం. శివసాంప్రోక్తములగు పదునెన్మిది తంత్రములలోనొకటి: చూ, తంత్రములు.

కలావికము. సం. వి. అ. పుం. కోడి: చూ, పుంజు.

కలావికలము. సం. వి. అ. పుం. చటకము: చూ, పిచ్చుక.

కలాసకము. సం. వి. అ. పుం. పదునాలుగంగములుగల నర్తనభేదము: చూ, నాటకము. 1. (తె. స:— కలాసికి)

కలాసము. దే. వి. కుమ్మరి కుండలుచేయు సాధనము.

కలాసి. హిం. వి. ఓడమీఁదిపనివాఁడు. (రూ-కళాసి. తెనుఁగుపవాడుక)

కలాసికి. వై. వి.=కలాసకము: చూ, నాటకము 1.

కలాహకము. సం. వి. అ. పుం. కాహళయను వాద్యము, నఫీరి: చూ, వీణె.

కలి. సం. వి. ఇ. పుం. 1. కయ్యము: చూ, యుద్ధము; 2. జగడము: చూ, యుద్ధము; 3. కలియుగము. 4,32,000 వత్సరములకాలము: చూ, యుగములు. (చూ, ఊగము. 2.); 4. ఈఁదబోయిన కొలుగలవాఁడు: చూ, పంగుళు; 5. శూరుఁడు: చూ, వాంఛీరుఁడు. 2; 6. తాఁడె *: చూ, విభీతకము; ఇ. స్త్రీ. 7. కల్లము: చూ, వాగు; 8. నీలి *: చూ, రంజని; 9. త్రప్పించుటకు సిద్ధమైన మొగ్గ: చూ, మొగ్గ.1; దే. వి. (1) కడుగు: చూ, శుక్తము. 1; (2) పులియఁబెట్టిన కడుగునీరు: చూ, శుక్తము. 1.

కలింగ. సం. వి. ఆ. స్త్రీ. పెద్దపిఱుఁదులు గల యాఁడుది: చూ, స్త్రీ.

కలింగకము. సం. వి. అ. పుం. కొడిసెకాయ: చూ, వత్సకము. (ఇంద్రయవము)

కలింగము. సం. వి. అ. పుం. 1. కొడిసె *: చూ, వత్సకము; 2. కర్కటకము *: చూ, పుచ్ఛ; 3 కుంకటిమూఁగ: చూ, భృంగరాజము. 3; 4. సెమిలడుగు *: చూ, భూతికగజము; 5. కళింగదేశము: చూ, దేశము; 6. కొడిసెకాయ: చూ, వత్సకము. (ఇంద్రయవము); 7. కొండ: చూ, పర్వతము; 8. చక్రవందనము: చూ, సౌందర్యము.

కలింగి. సం. వి. ఈ. స్త్రీ. కొడిసెకాయ: చూ, వత్సకము. (ఇంద్రయవము)

కలింగుఁడు. సం. విణ. 1. నేర్పరి: చూ, సమర్థుఁడు; పుం. 2. వాయులింగము అనఁగా శ్రీకాళహస్తీశుఁడు. (అని వాడుక)

కలింజకము. సం. వి. అ. పుం. కటము: చూ, చాఁప. (రూ-కిలింజకము)

కలింజనము. సం. వి. అ. పుం. మంగలిపల్లె: చూ, దేశము.

కలింజము. సం. వి. అ. పుం. కటము: చూ, చాఁప.

కలిందకన్య. సం. వి. ఆ. స్త్రీ. యమునానది: చూ, నది.

కలిందజ. సం. వి. ఆ. స్త్రీ.—పై.—

కలిందము. సం. వి. అ. పుం. 1. తాఁడె *, విభీతకము; పా. 2. కలిందమనుకొండ: చూ, పర్వతము.

**కలిందుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు: చూ, సూర్యుఁడు.

**కలిక.** సం. వి. అ. పుం, స్త్రీ. 1= కళ్లెము: చూ, వాగె; 2. ముకుళము: చూ, మొగ్గ. 1.

**కలికము.** సం. వి. అ. పుం. 1. కొంగ: చూ, బకము; దే. వి. (1) శైత్యనివారణార్థము కంటికి వేసెడు మందు.

**కలికారకము.** సం. వి. అ. పుం. సెమిలడుగు *: చూ, పూతికరజము.

**కలికారకుఁడు.** సం. వి. అ. పుం. నారదుఁడు: చూ, ముని. 1.

**కలికారము.** సం. వి. అ. పుం. 1. గూఁకటి మూఁగ: చూ, భృంగరాజము. 3; 2. కావ్యకమను పక్షి: చూ, పీతమస్తకము; 3. సెమిలడుగు *: చూ, పూతికరజము.

**కలికారి.** సం. వి. ఈ. స్త్రీ. ఉపవిష భేదము*: చూ, విష.

**కలికాలి.** సం. వి. ఈ. స్త్రీ. కలికాలియను తరిగొఱ్ఱ *: చూ, హాలిని.

**కలికి.** దే. వి. 1. రూ- కల్కి, ఆఁడుది: చూ, స్త్రీ; 2. రూ- కల్కి. మనోజ్ఞురాలగు ఆఁడుది: చూ, స్త్రీ; 3. కొంగతలఈఁక: చూ, ఔక్కు. 1; 4. మనోజ్ఞము; ఉ. హరి. 3, ఆ. 147: చూ, సౌందర్యము.

**కలికోత్కలిక.** పా. కావ్యలక్షణములోని క్షుద్రప్రబంధలక్షణమును తెలుపునది: చూ, క్షుద్రప్రబంధము.

**కలిగించు.** దే. స. క్రి. 1. కలుగఁజేయు: చూ, సృజించు; 2. లేనిది కలుగఁజేయు: చూ, సృజించు.

**కలిగించుట.** దే. వి: చూ, పుట్టించుట.

**కలిగొట్టు.** దే. వి. పాటల *: చూ, స్థాలి. 2.

**కలితనము.** దే. వి. నేర్పు. భార. విరా. 4, ఆ. 333: చూ, సామర్థ్యము. 1.

**కలితము.** సం. వి. అ. పుం, స్త్రీ. 1. కళ్ళెము: చూ, వాగె; విశే. 2. ఎఱుఁగఁబడినది: చూ. విదితము.1; 3. పొందఁబడినది: చూ, ప్రాప్తము.1.

**కలితాంతము.** (గీతాలంబనము) పా. ఒకానొక వృత్తము. ఇందొక్కొక్కపాదమునందు త, జ, జ, వ, గణములుగలదై ఎనిమిదవయింట యతిగల ఏకాదశ ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా — "సామోద్భవవిక్రమ సంయుతమై· వేమాఱుతబాలగ । విస్తృతమై, దామోదరదేవుక, ధల్వాలుకన్, భూమింగలితాంతము । పూర్ణమగున్."

**కలితాపసుఁడు.** సం. వి. అ. పుం.= కలహతపసి. నారదుఁడు: చూ, ముని. 1.

**కలితి, కల్తి.** హిం మిశ్రితము, స్వచ్ఛము కానిది.

**కలితుఁడు.** సం. విశే. 1 ఆప్తుఁడు: చూ, స్నేహితుఁడు. 1; 2. జ్ఞాతి: చూ, దాయాదుఁడు; 3. చుట్టము: చూ, బంధువు.

**కలిదైవత్య.** సం. వి. ఆ. స్త్రీ. పదునాలుగవ తిథి, చతుర్దశి: చూ, తిథి 1.

**కలిద్రుమము.** సం. వి. అ. పుం. తాండ్రి *: చూ, విభీతకము.

**కలినాశాంశము.** పా. షష్ట్యంశములలోని 27-41 అంశము (లు): చూ. షష్ట్యంశములు.

**కలిప్రియుఁడు.** సం. వి. అ. పుం. 1. నారదుఁడు: చూ, ముని. 1; 2. కోఁతి: చూ, వానరము.

**కలిభుజకము.** అం. శకములుఆఱింటిలోనొకటి: చూ, శకములు.

**కలిమము.** దే. వి. నంజుడు. "వ. అప్పుడేచంపి తిత్తొలిచి గాలిగొనవైచిన కుక్క కలిమంబు గనుంగొని." భార. శాం. 3. ఆ. 285: చూ, మాంసము.

**కలిమారకము.** సం. వి. అ. పుం. సెమిలడుగు *: చూ, పూతికరజము. (రూ-కలికారకము)

కలిమాలకము. సం. వి. అ. పుం: చూ, రూ. కలిమారకము

కలిమాలకుఁడు. సం. వి. అ. పుం. ఎకిమీఁడు: చూ, ప్రభువు. 2.

కలిమాల్యము. సం. వి. అ. పుం. నెమిలదుంగు *: చూ, పూతికరజము.

కలిమి. దే. వి. రూ- కల్మి. 1. అతిశయము: చూ, హెచ్చు. 2; 2. సంపద. "క. కలిమి యచుట్టలఁ జేర్చును." భార. శాం. 1, ఆ. 51: చూ, సంపత్తి. 1; 3. స్థానము: చూ, స్థానము. 1; 4. కలుగుట. "ఇట్టిమహిమ కలిమికిఁ గతమెయ్యది." భార. అన. 4, ఆ. 189: చూ, పుట్టించుట.

కలిమిచెలి. దే. వి. లచ్చి: చూ, లక్ష్మి. 1.

కలిమిదండుగ. ద్వ. వి. నేరములేకున్నను ధనవంతుని మొద్ద రాజు పుచ్చుకొనెడు ధనము.

కలిమిలేములు. లో. భోగాములు: చూ, కష్టసుఖములు. "కలిమిలేములు కావడికుండలు."

కలిమోహనము. సం. వి. అ. పుం. పండ్లతోనిండిన మేడి *: చూ, మేడి.

కలియకట్టు. దే. అ. క్రి. 1. కలియఁగట్టిగా అంటఁగట్టు; 2. అంటుకట్టు: చూ, తొర్రుపు. 3.

కలియఁబెట్టు. దే. స. క్రి. ఎనయఁజేయు: చూ, ఎనుచు, ఎనుపు.

కలియిక. దే. వి: చూ, రూ- కలయిక.

కలియికలాగులు. పా. ఒకానొక రతిబంధము: చూ, రతిబంధము.

కలియు. దే. స. క్రి. రూ-కలయు. పొందు: చూ, ప్రాపించు. (కలుషు. కలుపుఁగోలు ఇత్యాది సాధారణప్రయోగములంబట్టి ఇట్లు ఇకారమధ్యముగాను వ్రాయఁబడియె.)

కలియుగము. అం. 1. యుగములు నాలుగింటిలో నొకటి. చూ, యుగములు. (చూ, కలి. 8.) పా. 2. కలియుగంబున భూపతనలగ్నమే జన్మలగ్నమని శాస్త్రము చెప్పుచున్నది. ఈసమయమును బట్టి జన్మలగ్నము కనిపెట్టవలెను.

కలియుగవర్జ్యములు. అం. సముద్రయానము, అన్యవర్ణ స్త్రీని బెండ్లియాడుట, పుత్రోత్పత్తిమనుష్యులయందు బహువధము, శ్రాద్ధములయందు మాంసపరిగ్రహము, వానప్రస్థ సన్న్యాసములు, పెండ్లియైన పడుచునకు మఱలఁబెండ్లిచేయుట, నరమేధాశ్వమేధ గోమేధములు, మహాప్రస్థానగమనము. (8)

కలిలము. సం వి. అ. న. 1. అందుకాని రక్తమును మగవాని రేతస్సును కలిసినముద్ద: చూ, రేతస్సు. 1; పుం. 2. గండ్రగొడ్డలి: చూ, ముద్గరము; 3. పరస్త్రీ సంగమము: చూ, సంయోగము; 4. ఎఱుఁగరానిది: చూ, రహస్యము; 5. చొరరానిది: చూ, దుర్గమము.

కలివ. సం. వి. అ. స్త్రీ. కర్మము: చూ, వాగి.

కలివి. దే. వి. రూ-కలివె *: చూ, సాన్లపుప్పఫల. (ప్రకృతి. కరివింద. పురుషోత్తమ కవీయము.)

కలివె. దే. వి. రూ— వై.— (ప్రకృతి. కగమర్ద. పురుషోత్తమకవీయము)

కలీనము. సం. వి. అ. పుం. పచ్చిగుగ్గిలము: చూ, హాయము.

కలీయము. సం. వి. అ. పుం. న. కళ్లెము: చూ, వాగె.

కలు. దే. వి. రూ- కల్లు. 1. శిల. లక్ష్మి. 2, ఆ. 56: చూ, రాయి; 2. బండిచక్రము. కాశీ, 1, ఆ. 77: చూ, బండికల్లు; వై. వి. 3. మద్యము. ఉ. హరి. 4, ఆ. 182. చూ, సుర. 1; 4. మద్యవిశేషము: చూ, సుర. 1.

కలుఁగానుగు. దే. వి. (కలు + కానుగు) తాడియంటి. *: చూ, వార్షికము. 1. (రూ- కలుఁగాగ్రునుగు)

కలుఁగు. దే. వి. 1. బొక్క-:చూ, రంధ్రము.1; 2. గుహ. అప్ప. కిష్కిం, కాం. 27: చూ. రంధ్రము. 1; 3. గర్తము:చూ, రంధ్రము.1. (రూ-కగ్గు)

కలుఁగాగ్రునుగు. దే. వి: చూ, రూ- కలుఁగానుగు.

కలుఁసి. దే. వి. చెఱువులోనగువాని నీళ్ళుపోవుటకు రాతితోఁగట్టిన మార్గము: చూ, మరిగొమ్మ.

కలుక్కు-. దే. వి. మనసు నొచ్చుటయందగు నను కరణము; సా. 3, ఆ. 50: చూ, హుళాహుళా.

కలుకాగ్రంత. దే. వి: చూ, కలుఁగానుగు *.

కలుగచ్చ. దే. వి. ఒకరకముగచ్చ *: చూ, సోమరాజి.

కలుగానుగ దే. వి. రాతిగానుగ; రామా. 1, ఆ. 127: చూ, గానుగ. (సున్నపుగానుగ అని వాడుక)

కలుగు. దే. అ. క్రి. 1. ఒప్పిదమగు. భార. ఉద్యో. 4, ఆ. 185: చూ, గవణించు; 2. ఉండు. భార. ఆది. 2, ఆ. 110: చూ, వర్తించు; 3. శివ. హరి. ను. 6, ఆ. 59:చూ, పర్యాప్తమగు; 4. జన్మించు. భాగ. 9,స్కం: చూ, పుట్టు. 2; 5. కూడు. అని. 2, ఆ. 141: చూ, సరిపడు. 2; స. క్రి. 6. పొందు. భాగ. ఆర. 1, ఆ. 231: చూ, ప్రాప్తించు. (రూ-కల్గు)

కలుగొట్టు. దే. వి: చూ, రూ-కలిగొట్టు *.

కలుచి. వై. వి. 1.=కలుషమ్. దోషము. భాగ. కాం. 4, ఆ. 183: చూ, పాపము; (రూ-కలుషి); 2. కలఁత: చూ, సంతాపము; 3. క్రోధము: వై. 5, ఆ.157:చూ,రోషము.

కలుచిపడు. వై. అ. క్రి. కలఁతపడు. లక్ష్మి. 5, ఆ. 4: చూ, సంక్షోభించు.

కలుజువ్వి. దే. వి: చూ, రూ- కలజువ్వి *.

కలుపు. దే. వి. 1. దధి. "ఒల్పుఁబప్పులు పొడికూర గుంపుకలుపున్ వడియంబులు."శశాం. 3, ఆ. 14: చూ, పెరుఁగు 1; 2. మిశ్రదధి: చూ, పెరుఁగు. 1. (రూ-కలపు); 3. పైరులోని కసవులోనగునది: చూ, అలుము; స.క్రి. 4. కూర్చు, కలియఁజేయు:చూ, సంధించు.3.

కలుపుఁగోలు. దే. వి. (కలుపు + కోలు) రూ- కల్పుఁగోలు. అభేదము. "మ. పోగాడుసురట్టివారలకుఁ గల్పుంగోలు పుట్టింప." చంద్రి. 3, ఆ: చూ, బుజ్జగింత. 1.

కలుపుఁగోలుతనము. ద్వ. వి. రూ- కల్పుఁగోలుతనము. అభిన్నత్వము; రామా. 5, ఆ. 134: చూ, బుజ్జగింత. 1.

కలు[illegible]. సం. విశ. 1 అప్ప[illegible]పడము: చూ, సంకల[illegible]డు. 1; 2. జాతి: [illegible]తరమున భార్యను భర్త[illegible]యము: చూ, గర్భాధానము.

కలుబ[illegible] దే. వి: చూ, రూ-కలబంద *.

కలుమంద. దే. వి.—పై.—

కలుము. వై. వి.= కల్మష. కలుమగంధము;అం, భా. ప్ర. ఢ. 106: చూ, వాసన.

కలుముచ్చు. దే. వి. అంబేద:చూ, నిప్పువెరా జకుఁడు.

కలుములగరితబిడ్డ. ద్వ. వి. సిరిచూలి: చూ, మన్మథుఁడు.

కలుములచెలి. దే. వి. లచ్చి: చూ, లక్ష్మి. 1.

కలువ. వై. వి. 1.= కైరవ. రూ- కల్వ. ఒకానొకజలపుష్పము, ఉత్పలము. య. 5, ఆ. 104: చూ, పద్మము. 1; 2. కూడిక: చూ, సంయోగము.

కలువకంటి. ద్వ. వి.(కలువ + కన్ను)1.ఆఁడుది: చూ, స్త్రీ; 2. కలువ రేకులవంటి కన్నులు గల యాఁడుది: చూ, స్త్రీ.

కలువడేము. వై. వి. (కలువ + వడెము) ఉత్స వాదికాలములలో ధ్వజస్తంభములోనగువాని యందు వేర్లఁగట్టెడు బంగారు కలువపూ దండ. కళా. 2, ఆ. 9; రా. అ కాం. 52; భార. ఆది. 6, ఆ. 149: చూ, వితానము.

కలువము. దే. వి. రూ-కల్వము. మందునూరు ఱాయి: చూ, రాయి.

కలువరాయఁడు. వై. వి. చందమామ: చూ, చంద్రుఁడు (ఇట్లు కలువ ఱేఁడులోనగునవి.)

కలువరింత. దే. వి: చూ, రూ- కలవరింత.

కలువరింపు. దే. వి.—వై.—

కలువతాకట్టు. ద్వ. వి.శిలాబంధపుష్కరిణి:చూ, సరస్సు. 1.

కలువ ఱేకు. ద్వ. వి. 1. కలువపూ ఱేకు: చూ. రూ- కల్వ ఱేకు; బ. 2. రూ- కల్వ ఱేకు. పిఱుఁదులమీఁది నఖక్షతము: చూ, నఖక్షత ము; బ. 3. కంటిరెప్పలయందలి నఖక్షతము, రూ-కల్వ ఱేకు: చూ, నఖక్షతము.

కలువలగాయ. వై. వి. తమ్మిలవిందు. "కలువల గాయ వంగడపుఁదోడవ." ఆన్ధ్ర. యు. కాం. 79: చూ, సూర్యుఁడు. (ఇట్లు కలువలఱేఁడు)

కలువల ఱేనితోఁడు. ద్వ. వి. లచ్చి: చూ, లక్ష్మి.1.

కలువవిందు. ద్వ. వి.కుముదబాంధవుఁడు రామా. 6, ఆ. 80: చూ, చంద్రుఁడు. (ఇట్లు కలు వచెలి)

కలువు. దే. అ. క్రి: చూ, రూ- కలుగు. (పుట్టుట.— "ఉ. నీవుగలువక నియతోన్న తిఁగాంచెఁ దండ్రియున్." వసు.5, ఆ. 15; పొందు.— "క. రారా పురిలేలచేసెదు, రా రానుఁగలువఁ గలువరారా మేడక." సా. 2, ఆ. 128)

కలుషము. సం. వి. అ. న. 1.= కలుచే: చూ, పాపము; 2. భయానకరసము, నవరసములలో నొకటి: చూ, రసములు; పుం.3. దున్నపోతు: చూ, మహిషము; 4. కోపము: చూ, కోపము; 5 పులికడుగు: చూ. శుక్తము. 1; 6. గాలి: చూ, వాయువు; 7.దుమ్ము: చూ. రేణువు.1; 8. నెల: చూ, మాసము. 1; విణ. 9. కలఁకఁ బాఱినది: చూ, మలినము. 3; 10. సహించు నది: చూ, నిర్దయము; 11. చిత్రవర్ణముకలది: చూ, వర్ణము. 6.

కలుషించు. సం. అ. క్రి. కలఁకఁబాఱు. హరి. ఉ. 2, ఆ. 29; భాగ. వి. 2. ఆ. 48: చూ, సంక్షోభించు

కలుషుఁడు. సం. వి. అ. పుం. గర్హ్యుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

కలుసుఁగూర. ద్వ. వి. (కలుసు + కూర) అనుకుగాఁగండిన కూర. "కలుసుఁ గూరలును బహుఁగదియ్య పులుఁ బండీ నాలు వాన వాలు సున్న." వై. 8, ఆ. 50. (కలగలు పుకూర అనివాడుక): చూ, వ్యంజనము. 1.

కలోపనిషత్. అం. మధ్యసగాత్రమున మూర్ఛనలు ఏడింటిలో నొకటి: చూ, మధ్యమగ్రామగత మూర్ఛనలు.

కల్కండ. దే. వి: చూ, రూ- కలకండ.

కల్కఫలము. సం. వి. అ. పుం. దాడిమము *: చూ, దానిమ్మ.

కల్కము. సం. వి. అ. పుం, న. 1. కపటము: చూ, వ్యాజము. 1; 2. కలుషి:చూ,పాపము; 3. నెయ్యినూనెలోనగు వానియందు అడుగున నిలిచినమడ్డి: చూ, మడ్డి. 2; 4. పీయుగడము: చూ, మలము. 1; 5. మలసామాన్యము:చూ, మలము, 1; (క్రొవ్వు, రేతస్సు, నెత్తురు, మెదడు, మూత్రము, విష్ఠ, గులిమి, చీమిడి, తెపుడే, కన్నీరు, పుసి, చెమటయనుపన్నెండు విధములయిన మలములు); 6. తాండ్ర *: చూ, విభీతకము.

**కల్కి.** సం. వి. ఇ. పుం. 1. తాఁడి *: చూ, పిఛీతకము; 2. దశావతారములలో నొకటి: చూ, అవతారములు. (రూ- కలికి); దే. వి. (1) రూ- కలికి. ఆఁడుది: చూ, స్త్రీ; (2) రూ- కలికి. మనోజ్ఞురాలగు ఆఁడుది: చూ, స్త్రీ.

**కల్కుఁడు.** సం. విశే. పాపాలముద్ద: చూ, పాపాత్ముఁడు.

**కల్గు.** దే. వి. 1: చూ, రూ-కలుఁగు. 1- 2- 3; అ. క్రి. 2: చూ, రూ- కలుగు. 1- 2- 3- 4- 5- 6-

**కల్నేటు.** దే. వి. కన్నియలేడి: చూ, మహోపక్షము. (ఆంధ్రపద పారిజాతము)

**కల్పకము.** సం. వి. అ. పుం 1. తెల్లతుమ్మ *: చూ, విట్ఖదిరము; 2. కల్పవృక్షము *: చూ, వేలుపుఁజెట్టు; 3. కప్పూరము: చూ, సిగము.

**కల్పకవద్వల్లి.** సం. వి. ఈ. స్త్రీ. అడవికాఁకర: చూ, సుషవి, 1.

**కల్పకుఁడు.** సం. వి. అ. పుం. నాపితుఁడు: చూ, మంగలి.

**కల్పక్షయము.** సం. వి. అ. పుం. బ్రహ్మ ప్రళయము, తుగ్రింగుడు: చూ, సంవర్తము. 1 (బ్రహ్మదినప్రళయము)

**కల్పన.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆయిత్తముచేయుటకై యేనుఁగునకుఁ గట్టిన నిడుత్రాడు; 2. కల్పించుట: చూ, రచన.

**కల్పనము.** సం. వి. అ. న. 1. క్లృప్తి: చూ, సంగ్రహము. 2; 2. కల్పన: చూ, రచన; 3. మనోవ్యాపారము, ఎన్నిక: చూ, సంకల్పము.

**కల్పపాదపము.** సం. వి. అ. పుం. కల్పవృక్షము: చూ, వేలుపుఁజెట్టు.

**కల్పము.** సం. వి. అ. పుం. 1. బ్రహ్మప్రళయము, కల్పాంతమ్ము తుగ్రింగుడు: చూ, సంవర్తము. 1; 2. దేవతరువు *: చూ, వేలుపుఁజెట్టు; 3. పాడి: చూ, సత్యము. 1; 4. బ్రహ్మదినము; 5. వేదాంగమైనవిధి: కథాప్రసంగము; 6 నియమగ్రంథము: చూ, శాస్త్రములు 7. అవాంతరకల్పము: చూ, వికల్పము; 8. శ్రేష్ఠముకాని ధర్మము; 9. వేదాంగకల్పశాస్త్రము; 10. స్వోచితధర్మమును వదలకుండుట; విశే. 11. కొంచెము తక్కువగానున్నది (నపుంసకలింగమును అగును); అం. 12. శాస్త్రములు ఆఱింటిలోనొకటి: చూ, శాస్త్రములు; 13. వేదాంగములు ఆఱింటిలో నొకటి: చూ, వేదాంగములు; 14. విద్యలు పదునాలుగింటిలోనొకటి: చూ, విద్యలు; 15. కల్పము అనఁగ కల్పించునది.= వేదములోఁ జెప్పఁబడియున్న దర్శపూర్ణమాసాది యాగములోఁ జేరియున్న క్రియలను జేసినతరువాత నేదియో ఆవరుసను బోధించెడిది యనుట. ఈకల్పసూత్రములు నాలుగు వేదములకును వానిఁ జేరిన ప్రతిశాఖకును ఒక్కొక్క గ్రంథముచొ॥ పుట్టియున్నట్టు కన్పట్టుచున్నవి. అట్లేలాగుననిన.— ఒక యజుర్వేదమునకు కలిగియున్న నూటొక్క శాఖలలో కాలవశముచేత నన్నిన్ని నశింపఁగ నిప్పటిలో ఆపస్తంబ, బోధాయన, సత్యాషాఢ, కౌషీయ, హిరణ్యకేశి వైఖానససూత్రములని యారు నిలిచియున్న వీటిలో మొదటి రెంటిని వేదభాష్యములో, సాయణాచార్యులని నామాంతరముగల మాధవాచార్యులవారు ప్రధానములుగ నెంచి వీనితో సమన్వయముగ వేదార్థమును వివరించియున్నారు. ఆపస్తంబకల్ప సూత్రమునకు 32 ప్రశ్నములు. బోధాయనకల్పసూత్రమునకు ౧౦౧ ప్రశ్నములు. వేదముశ్రుతియనిపించుకొనును. దానియందు విధింపఁబడిన కర్మములు శ్రౌతములనిపించుకొనును. అవి

పరిధానకర్మలు, తదంగకర్మలు అని రెండు విధములు. వాటివిధమును కల్పసూత్రముల చేతఁ దెలిసి చేయించెడివారు ఋత్విక్కులు, శ్రౌతులు అనిపించుకొందురు. యజుర్వేద కల్పసూత్రజ్ఞులు అధ్వర్యులనిపించుకొందురు. ఋగ్వేదకల్పసూత్రజ్ఞులు హోతలు, సామవేదకల్పసూత్రజ్ఞులు ఉద్గాతలు. అథర్వవేద కల్పసూత్రజ్ఞులు ఆగమికులు అనిపించుకొందురు. ఇందులో కొన్ని గృహ్యసూత్రములు, ధర్మప్రశ్నములు అని వేఱువేఱుగా నున్నవి. వానిలో వివాహోపనయనాది వైదికాచారములుకొన్ని ఖిలశాఖాప్రసిద్ధములైన ధర్మములను విధింపఁబడెను. ఆగ్రంథములు స్మృతులనియును వానియందు విధింపఁబడిన కర్మములు స్మార్తములనియు వాడఁబడును. ఆపస్తంబకల్పసూత్రమునకు ధూర్తస్వామికృతమైన భాష్యముకలదు. ఈలాగుననే ప్రతికల్పసూత్రమునకును వేఱువేఱు భాష్యములును వ్యాఖ్యానములునుకలవు. ఆపస్తంబముని చేసిన శ్రౌతప్రశ్నములేమి గృహ్యప్రశ్నమేమి యావచ్ఛుభకర్మలను గుఱించియే కాని మఱియొకటి కాదు. అనఁగ నౌపాసనము మొదలుకొని అశ్వమేధాంతము క్రతువులును, నిషేకాదిశ్మశానాంతములైన షోడశకర్మములును చెప్పఁబడినవనుట. అయితే ఆపస్తంబముని శుభమునుబోధించిన తననోటనశుభమును బోధింపసమాధానము లేనందున నంయస గుఱించి తనశిష్యుఁడైన భరద్వాజమునిచేత చేయించెను. ఆసూత్రములోఁ జెప్పఁబడినది యావత్తును ఔర్ధ్వదైహికము బ్రహ్మమేధసంస్కారమును అనిపించుకొనును. ఈ యజుర్వేదము జ్ఞలయమునకు ముఖ్యమంత్రమై యున్నది. అనఁగా హోమములు మొదలైనవానికి నుపయోగించెడిది అనుట. అట్టి హోమములయందుకొనఁగల దేవతలను పేరు పేరువరుసల పిలుచుటకును పొగడుటకును నుపయోగించెడి మంత్రములు ఋక్కులు, అవి కలదిఋగ్వేదము. ఒకదేవతను పొగడెడి ఋక్కులగుంపు స్తుతము=స్తోమము అనిపించుకొనును. ఈఋక్కులలో మొదటివానియందు కొనిదైదికములైన సప్తస్వరములతో పాడిన ఉద్గానము = అదే సామమనిపించుకొనును. ఋగ్వేదమున శాశ్వలాయన కల్పసూత్రము ప్రసిద్ధము. సామవేదమునకు ఛాందోగ్య కల్పసూత్రము ప్రసిద్ధము. ఈమూఁడు వేదములేకగ్రీవమై అన్నిశాఖలవారికి సమస్తక్రతువులును నడిపించుచుండును. అథర్వవేదమైన యీమూఁటినిఁ జెందక ప్రత్యేకముగా శ్యేనయాగము మొదలైన అభిచారికకర్మములనఁగా శత్రుసంహారము ప్రయోజనముగాఁగల జపహోమాదులనువానిని విధింపుచుండును. అందులో అథర్వణభద్రకాళి మొదలైన యుగ్రదేవతల ప్రార్థనలు బహుఋక్కులయందుఁ గలిగియుండును. ఆమంత్రములకు ఆకర్షణము, స్తంభనము, మారణము, మోహనము, వశీకరణము, ఉచ్చాటనము అనెడు షట్ప్రయోగములు మొదలైనవాటిని బోధించుటకై దూర్వాసకల్పసూత్రము మొదలైనవికలవు. అది యావత్తుమంత్రశాస్త్రము=ఆగమశాస్త్రమనిపించుకొనును: (చూ, ఉపవిద్యలు)

**కల్పవృక్షము.** సం. వి. అ. పుం. 1. కోరినవస్తువులనిచ్చెడు దేవవృక్షసామాన్యము*: దూ, వేలుపుఁజెట్టు; అం. 2. కల్పవృక్షములయిదింటిలోనొకటి: చూ, కల్పవృక్షములు; 3. మహాదానములు పదునాఱింటిలో నొకటి: చూ, మహాదానములు.

**కల్పవృక్షములు.** అం. మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము.(ర)

కల్పసూత్రములు. పా. (అగ్ని వైశ్య సూత్రే) బోధాయనాది తొమ్మిది సూత్రములు.— 1 బోధాయనము, 2 ఆపస్తంబము, 3.సత్యాషాఢము, 4 ద్రాహ్యాయణము, 5 అగస్త్యము, 6 శాణ్డిల్యము, 7 ఆశ్వలాయనము, 8 శాంభవీయము, 9 కాత్యాయనము.— ఇవి షోడశసంస్కారాత్మకములై కర్మప్రతిపాదితమగు పూర్వకాండమును మాత్రము వచించుటచే నీసూత్రములు పూర్వసూత్రములు; వైఖానసాది తొమ్మిది సూత్రములు.— 1 వైఖానసము, 2 శౌనకీయము, 3 భారద్వాజము, 4 అగ్ని వైశ్యము, 5 జైమినీయము, 6 (మా) వాధూలము, 7 మాధ్యందినము, 8 కాణ్డిన్యము, 9 కౌషీతకము.— ఇవి నిషేకాద్యష్టాదశ సంస్కారాత్మకములై కర్మ ప్రతిపాదిత పూర్వకాణ్డమును జ్ఞానప్రతిపాదితమగు అపరకాణ్డమును వచించుటచే నీసూత్రములు అపర సూత్రములు. (చూ, ఆపస్తంబము అచ్చుల అనుబంధములో) ఈసూత్రానుష్ఠాతలందఱును బ్రాహ్మణులే. ఇందొకరికంటె మఱియొకరు శ్రేష్ఠులనిగాని తక్కువవారనిగాని చెప్పుట మహాఋషుల దూషించుటయగును.

కల్పాంతము. సం. వి. అ. పుం. ప్రళయము, తుగ్గింగుడు: చూ, సంవర్తము. 1.

కల్పించు. సం. స. క్రి. 1. కలిగించు: చూ, సృజించు; 2. రచించు: చూ, విరచించు.

కల్పితము. సం. వి. అ. పుం. 1. నిర్మించిన యేనుఁగు: చూ, హస్తి; విణ. 2. రచియింపఁబడినది: చూ, విరచితము.

కల్మషము. సం. వి. అ. పుం. 1. కసటు: చూ, పాపము; 2: చూ, హస్తపుచ్ఛము; పుం. 3. ఒకానొకనరకము: చూ, నరకములు; 4.నలుపు: చూ, వర్ణము. 6; విణ. 5. నల్లనిది: చూ, వర్ణము. 6; 6. కలఁకఁబాఱినది: చూ, మలినము. 3.

కల్మని. సం. వి. ఈ. స్త్రీ. పాందాను: చూ, పాడపము. 1. (చూ, పాత్రము. 6.)

కల్మషకంఠుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

కల్మషపాదుఁడు. సం. వి. అ. పుం. ఇక్ష్వాకు వంశీయుఁడగు అయోధ్యాధిపతి, సౌదాసుఁడనురాజు: చూ, రాజు. 1.

కల్మాషము. సం. వి. అ. పుం. 1. చిత్రవర్ణము: చూ, వర్ణము. 6; 2. నలుపు: చూ, వర్ణము 6; 3. అలచేందలు: చూ, రాజమాషము; 4. కసటు: చూ, పాపము; 5. కోపము: చూ, రోషము; 6. నలుపెక్కువగాఁగల తెలుపు: చూ, వర్ణము. 6; విణ. 7. చిత్రవర్ణము కలది: చూ, వర్ణము. 6; విణ. 8. నలుపెక్కువగాఁగల తెలుపుగలది: చూ, వర్ణము. 6; 9. నలుపుగలది: చూ, వర్ణము. 6.

కల్మాషి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఎచ్చునలుపుగల తెల్లని వస్తువు; 2. కల్మాషీనది: చూ, నది; 3. యోనిమూలము: చూ, భగము. 12; 4. గుదము: చూ, ముడ్డి.

కల్మాషుఁడు. సం. వి. అ. పుం. గక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

కల్మి. దే. వి: చూ, రూ- కలిమి.

కల్య. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడుది: చూ, స్త్రీ; 2.=కల్లు: చూ, సుర. 1; 3. మంచిమాట: చూ, హితవచనము; 4. కరక *: చూ, హరీతకి.

కల్యము. సం. వి. అ. న. 1. వేకువ: చూ, వేగుజాము, 2.=కల్లు: చూ, సుర. 1; 3.ప్రధానము: చూ, శ్రేష్ఠ్యము; విణ. 4. ఏడమూకుఁడు: చూ, చెవిటిమూఁగ; 5. ఉపాయము

కలది. (మాట): చూ, హితవచనము; 6. శుభమైనది. (మాట): చూ, హితవచనము; 7. రోగములేనిది: చూ, వార్తము. 8; 8. సంపాదింపఁబడినది: చూ, సంపాదితము; 9. తరుణమునఁ దగినది: రూ-కాల్యము.

కల్యజగ్ధి. సం. వి. ఇ. స్త్రీ కల్యవర్తము: చూ, ప్రాతర్భోజనము:

కల్యత్వము. సం. వి. అ. న. రోగములేమి: అనామయము, ఆరోగ్యము.

కల్యపాలుఁడు. సం. వి. అ. పుం. కబ్బిలి: చూ, సురాజీవి.

కల్యవర్తము. సం. వి. అ. పుం. కల్యజగ్ధి: చూ, ప్రాతర్భోజనము.

కల్యాణ. అం. ఘృతములలో నొకటి: చూ, ఘృతములు.

కల్యాణగోత్రి. సం. వి. అ. స్త్రీ. గంగానది: చూ, నది.

కల్యాణగోత్రము. సం. వి. అ. పుం. 1. మేరువు: చూ, పర్వతము; 2. అర్క-పర్ణము *: చూ, జిల్లేడు; 3. మంచిదారి: చూ, సన్మార్గము.

కల్యాణబీజము. సం. వి. అ. పుం. మనూరము. బిల్లతలగడ: చూ, లోడు.

కల్యాణము. సం. వి. అ. న. 1. క్షేమము: చూ, శుభము. 1; 2. చొక్క-పుబంగారు: చూ, లోహము. 1; 3. బుద్ధి, వృద్ధియను ఓషధి ద్రవ్యాంగము: చూ, వృద్ధి; 4. పెండ్లి: చూ, వివాహము; 5. అతిశయము: చూ, శాశ్వతము; విణ. 6. మంగళకరమైనది: చూ, శుభము. 1.

కల్యాణి. సం. వి. ఈ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2. నేల: చూ, భూమి. 1; 3. ఒకానొక రాగము: చూ, స్వరము. 2: 4. కారుమినుము: చూ, మినుము; 5. ఆవు: చూ, ధేనువు.

కల్యాణిక. సం. వి. అ. స్త్రీ. మణిసిల: చూ, రాయి.

కల్యాణిని. సం. వి. ఈ. స్త్రీ. 1. బల *: చూ, ముత్తవపులగము; విణ. 2. కల్యాణ విశిష్టమైనది.

కల్యాపాలుఁడు. సం. వి. అ. పుం. కల్లమ్ము వాఁడు: చూ, సురాజీవి.

కల్యుఁడు. సం. వి. అ. పుం. 1. దక్షుఁడు, నవబ్రహ్మలలో నొకబ్రహ్మ: చూ, బ్రహ్మ. 1; 2. నిరోగుఁడు: చూ, వార్తుఁడు; 3. శూరుఁడు: చూ, సమర్థుఁడు; 4. మూఁగవాఁడు: చూ, మూఁగ. 3; 5. చెవిటి: చూ, బధిరుఁడు.

కల్ల. దే. వి. 1. పరుషవచనము; పర. 3. ఆ. 297: చూ, పరుషము. 2; 2. అసత్యవచనము; కళా. 3, ఆ. 246: చూ, వితథము; 3. తప్పు; పా. 2, ఆ. 251: చూ, నేరము; 4. మోసము; అచ్చ. యు, కాం. 116: చూ, వంచన; 5. తోఁటలోనగువాని వెలుగు. "వెలికల్లమై తురా వేల్పులకుదుపుచో." ఉ, హరి. 4, ఆ. 308: చూ, ప్రాచీనము. 1; విణ. 6. అసత్యము: చూ, వితథము; 7. పరుషము: చూ, పరుషము. 2.

కల్లంగడి. ద్వ. వి. సారాకొట్టు: చూ, గృహము. 1.

కల్లంబా. అం. విన్నాణములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, విన్నాణములు. (రూ-కల్లము.)

కల్లఁడు. సం. విణ. చెవిటి: చూ, బధిరుఁడు.

కల్లజగడము. ద్వ. వి అభ్యాఖ్యానము: చూ, యుద్ధము.

కల్లతనము. దే. వి. 1. చెడ్డనడత; కాశీ. 4, ఆ. 90: చూ, తప్పునడత; 2. మోసము; భాగ. 6, స్కం. 5: చూ, వంచన.

కల్లత్వము. సం. వి. అ. న. స్వరభేదము: చూ, స్వరము. 2; 2. చెవుడు: చూ, పెద్దవిన్నపము

**కల్లము.** సం. వి. అ. పుం. 1. కల్లమాట: చూ, వితథము; 2. పసుపు: చూ, వర్ణము. 6; అం. 3: చూ, రూ-కల్లంబు; దే. వి (1)రూ-కళ్లము: చూ, ఖలము. 4.

**కల్లరి.** దే. విశే.(కల్ల + అరి.) 1. రూ-కల్లరీఁడు. అసత్యము పలుకువాఁడు: చూ, ముఖరుఁడు; 2. తప్పుచేసినవాఁడు; సా. 2, ఆ. 273: చూ, బొంకులాఁడు; 3. మోసగాఁడు; అచ్చ. అర, కాం. 66: చూ, వంచకుఁడు; 4. దుష్టుఁడు (శేక) దుష్టురాలు; అచ్చ. బాల, కాం. 86: చూ, వ్యాఘుఁడు. 2.

**కల్లరీఁడు.** దే. విశే. (కల్లరి + ఈఁడు) -పై.- (స్వార్థమున ఈఁడు.)

**కల్లరుజా.** దే. వి. మత్స్యవిశేషము; హంస. 4, ఆ. 187: చూ, మత్స్యము. 1.

**కల్లాసు.** వా. కల్లుమీఁది ఆస: చూ, సురకము.4.

**కల్లి.** దే. వి. తోఁట లోనగువాని వెలుగు: చూ, ప్రాచీనము. 1. (బాలచంద్రోదయము.)

**కల్లు.** దే. వి. 1. కన్ను; భల్లా. 1, ఆ: చూ, నేత్రము; 2. శిల; నై. 8, ఆ. 152: చూ, రాయి; 3. బండిచక్రము; భాగ. కర్ణ. 3, ఆ. 342: చూ, బండికల్లు; వై. వి.=కల్యా. 4. మద్యము; భాగ. విరా. 2, ఆ. 93: చూ, సుర. 1; 5. మద్యవిశేషము; రా. అ, కాం: చూ, సుర. 1; రూ-కలు. 2-3-4-5.

**కల్లుకుండ.** ద్వ. వి. గంజ: చూ, భాండము. 3.

**కల్లుగిన్నె.** ద్వ. వి. కల్లుత్రాగెడుగిన్నె, సరకము: చూ, సుర. 2.

**కల్లుతేట.** ద్వ. వి. కల్లుపై తేలినతేట: చూ, సురామండము.

**కల్లుత్రాగుట.** ద్వ. వి: చూ, సరకము. 2.

**కల్లుపాక.** ద్వ. వి. కల్లుగల ఇల్లు: చూ, గృహము. 1.

**కల్లుపెంటు.** ద్వ. వి. కల్లమ్మెడుచోటు: చూ, శుండ. (శ. ర.)

**కల్లుపడు.** ద్వ. అ. క్రి. (కల్లు + పడు) మ్రాను పడు; స్వా. 5, ఆ. 19; భల్లా. 2, ఆ: చూ, స్తంభించు.

**కల్లువడ్డన.** ద్వ.వి. కల్లువడ్డింపు: చూ, సరకము.5.

**కల్లువడ్డింపు.** ద్వ. వి. —పై —

**కల్లువెల్లి.** ద్వ. వి. కల్లుసంద్రము: చూ, సముద్రము.

**కల్లుసంద్రము.** ద్వ. వి. —పై.—

**కల్లెలుక.** దే.వి. (కల్లు + ఎలుక) పొలములలోఁ గలుఁగులయందుండెడి యెలుక; స్వా. 4, ఆ. 25: చూ. మూషికము.

**కల్లేడు.** దే. వి. ఒకానొకపక్షి; స్వా. 4, ఆ. 58: చూ, పక్షి.

**కల్లేఱు.** దే. వి. (కల్లు + ఏఱు) వీరభద్రపర్వత పాదమూలమునఁ బాఱెడి యొకనది; కాశీ.3, ఆ. 28: చూ, నది.

**కల్లోలము.** సం. వి. అ. పుం. 1. పెద్దఅల: చూ, వీచి. 1 (రూ-ఉల్లోలము = పెద్దవాఁగులు.); 2. ఆనందము: చూ, సంతోషము.

**కల్లోలిని.** సం. వి. ఈ. స్త్రీ. ఏఱు: చూ, నది.

**కల్లోలుఁడు.** సం విశే. పగవాఁడు: చూ, శత్రువు. 1.

**కల్వ.** వై. వి =కైరవ: చూ, రూ-కలువ *.

**కల్వము.** దే. వి: చూ, రూ-కలువము.

**కల్వకేఁకు.** ద్వ. వి: చూ, రూ-కలువకేఁకు.

**కల్వలదొరదారి.** ద్వ. వి.గౌరి: చూ, పార్వతి.1.

**కల్హారము.** సం. వి. అ. న. సౌగంధికము, ఇంచుక యెఱుపును దెలుపును గలిగి మిక్కిలి పరిమళముగల కలువ *: చూ, పద్మము. 1.

**కవ.** దే.వి. 1. జత, రూ-కవలి. "జిక్కిఁకవ." చూ, సంగడి. 5; 2. యుగళము. "కన్ను

గవేము.'': చూ. సంగడి. రే. (రెండర్థములు నొకటిగానే చెప్పుచున్నారు.)

కవకము. సం.వి.అ. పుం.ముద్ద: చూ, సాపాటు.

కవకవ. దే. వి. 1. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము; జై. 6, ఆ. 116: చూ, హాహా; 2. పలుకుటయందగు ధ్వన్యనుకరణము: ఉ, రా. 7, ఆ. 288: చూ, హాహా; 3. వ్రాలుటయందగు ధ్వన్యనుకరణము; నళ. 3, భా. 971: చూ, హాహా.

కవచపత్త్రము, సం. వి. అ. న. బుజేపత్త్రి *: చూ, భూర్జము.

కవచము. సం. వి. అ. పుం. 1. బొందలము: చూ, బొందడము; 2. తప్పెట, పటహము, ఢవణము: చూ, వీణె; 3. కలజువ్వి *: చూ, ప్లక్షము; 4. పర్పాటకము*: చూ, తృణము.1; పుం, స్త్రీ. 5. ఱొమ్ము: చూ, వక్షము; 6 అకు: చూ, పర్ణము. 1: 7. రాత్రి వేలు కొనియుండుట: చూ, గోగారము; 8.సన్నాహము: చూ, యత్నము.

కవటు. దే. వి. 1. పెద్దకొమ్మ; భాగ. విగా. 1, ఆ. 162: చూ, శాఖ 1; విణ. 2. లేఁత: చూ, సుకుమారము. "కవటాకు." వెు.

కవటి. సం. వి. ఈ. స్త్రీ. కవాటము: చూ, తలుపు.

వడి. దే. వి. వాద్యవిశేషము; ఆం, భా. ప్ర. నాట్య. 128: చూ, వీణె. (రూ-కవిడి.)

వణకాఁడు. దే. విణ మల్లగమనము దెలిసినవాఁడు; ఆం, భా. ద్వి. కు. 208.

కవణము. వై. వి.=ఖాదనమ్. గుఱ్ఱము మొదలగు వానియొక్క ఉలవలు లోనుగాఁగల భక్ష్యము; జై. 2, ఆ. 16: చూ, భక్ష్యము. (రూ-కవళము.)

కవనము. సం. వి. అ. పుం.కవిత్వమును చెప్పుట. (వాడుక.)

కవను. దే. వి. కసవు; ఆం, భా. ద్వి. క. 76: చూ, తృణము. 1.

కవపులుఁగు. దే. వి. జక్కవపక్కి: చూ, చక్రవాకము. (ఆం. వ. చర. 31.)

కవపుల్గుదాయ. దే. వి. చెందమ్మదుఁడు: చూ, చంద్రుఁడు.

కవయి. సం. వి. ఈ. స్త్రీ. చొఱచేఁప: చూ, మత్స్యము. 1.

కవయుట. దే. వి. 1. రతి; చూ, సంయోగము; 2. కూడిక: చూ, సంయోగము.

కవర. సం. వి. అ. స్త్రీ. బర్బరి *: చూ, వాయింట.

కవరకి. సం. వి. ఈ. స్త్రీ. 1. కారాగారబంధము: చూ, బంధనాలయము; 2. శిఖ: చూ, సిగ.

కవరము సం.విణ. 1. శిఖ: చూ, సిగ; 2. కూడుకొన్నది: చూ. సంయుక్తము; 3. చెక్కఁబడినది: చూ, గుప్తితము; పుం. వి. 4. ఉప్పు: చూ, లవణము. 1.

కవరి. సం. వి. ఈ. స్త్రీ. కొప్పు: చూ, వేసలి.

కవరు. వా. వి 1. (వ్రాసినజాబును ఉంచెడు) కాగితపు సంచి. (ఎన్వలప్); 2. పైకప్పు.

కవర్గము. పా. "క ఖ గ ఘ ఙ" (వర్ణవిభాగప్రకరణము.—క ఖ గ ఘ ఙ-క వర్గము; చ ఛ జ ఝ ఞ-చ వర్గము; ట ఠ డ ఢ ణ-ట వర్గము; త థ ద ధ న-త వర్గము; ప ఫ బ భ మ-ప వర్గము. ఈ 25 అక్షరములకు 'స్పర్శము' లని పేరు.): చూ, స్పర్శములు.

కవలలు. దే. వి. బ. పాచికలు; ఆము. 1, ఆ.59: చూ, పాచిక.

కవలకాయ. దే. వి: చూ, అమడకాయ.

కవలవారు. దే. వి. అమడలు: చూ, యమళశిశువులు.

కవలి. దే. వి. జీర: చూ, సంగడి. 5. (ఆంధ్ర పద పారిజాతము.)

కవలు. దే. వి. 1. కుశలవులు, శ్రీరామపుత్రులు; ఉ.రా. 7, ఆ. 164: చూ, యమళశిశువులు; 2. నకులసహదేవులు; భార. భీష్మ 1, ఆ. 109; ఆంధ్రపద పారిజాతము: చూ, యమళ శిశువులు; 3. కవలిబిడ్డలు: చూ, యమళశిశువులు; 4. వేదాదిపఠనమునందుఁ గొంత సామ్యముచే నొకటి విడఁబడి మఱియొకటివచ్చి కలయుట. "సీ. ఎడనెడను గవల్గఁ దడఁబడకుండంగ గుఱుతులు మదిఁబాదుకొలిపి నిలిపి." కళా. 4, ఆ. 41.

కవలుకొను. దే. అ. క్రి. వేదాదిపఠనమునందుఁ గొంత సామ్యముచే నొకటి విడఁబడి మఱియొకటి వచ్చి కలయు. "ఎ. గీ. కమలజుని వేదపఠనంబు కవలుకొనియె." విక్ర. 4, ఆ. 50: కవలువోవు.

కవలువోవు. దే. అ. క్రి. (కవలు + పోవు) —పై— "గీ. కవలువోకుండఁ బుత్త్రుఁడో కలుకకంటి." పాండు. 2, ఆ. 19.

కవళము. సం. వి. అ. పుం.=కబళము, ముద్ద: చూ, సాపాటు.

కవసము సం. వి. అ. పుం. కవచము: చూ, బొందడము.

కవాటము. సం. వి. అ. పుం, న. ఈ. స్త్రీ. చూ, తలుపు. (రూ-కపాటము.)

కవాటవక్రము. సం. వి. అ. న. వృక్షభేదము: చూ, వృక్షము

కవాటి. సం. వి. ఈ. స్త్రీ: చూ, తలుపు.

కవాడము. అర. వి. ఎద్దులుమోయు బరువు.

కవాతు. హిం. వి. దండువారు చేయు సాధకము, కసరతు. (ఢిల్లు.)

కవాగము. సం. వి. అ. న. తామర*: చూ, పద్మము. 1.

కవి. సం. వి. ఇ. పుం. 1=కయి. కావ్యకర్త. చూ, మాటలల్లువాఁడు; 2. శుక్రుఁడు: చూ, రాహువు. 2; 3 వాల్మీకి: చూ, ముని. 1; 4. పక్షివిశేషము: చూ, పక్షి; పుం, విణ. ఇ. 5. పండితుఁడు: చూ, విద్వాంసుఁడు; ఇ. స్త్రీ. 6. (గుఱ్ఱము) కళ్లెము: చూ, వాగె.

కవించు. దే. స. క్రి. రూ-కవియించు; భాగ.9, స్కం. 102: చూ, వ్యాపించు.

కవిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కళ్లెము: చూ, వాగె; 2. చొఱచేఁప: చూ, మత్స్యము. 1; 3. కేవికాపుష్పము *: చూ, వృక్షము.

కవికంఠభూషణము. పా. ఒకానొక వృత్తము. ఈ వృత్తమునందొక్కొక్క పాదమునందు స, జ, స, స, స, జ, గ ములతోఁ గూడి తొమ్మి చూ, పక్షి. ంగల పందొమ్మిదవ ఛందస్సు వి. (కల్లు + ఏఱు) ఉదా.— "నవరత్న ...యుము-నఁ ...సాసజగంబులక్ గవుల్ । కవికంఠభూషణము - గా రచియింతురు మాటిమాటికి । నవ్రణిల్లు శబ్బమున - నందకపాణి నుపేంద్రురుక్మిణీ। ధవుసల్క-థాసుధలఁ - దత్పరులైన మహాత్ములట్లుగాక్." అప్ప. 244 పొరటు: చూ, వృత్తము. 1.

కవికర్ణరసాయనము. పా. ఈ గ్రంథకర్త సంకుసాల నృసింహకవి. (16 శతాబ్ది.)

కవికల్పద్రుమము. అం. ఈ గ్రంథకర్త ఓపదేవుఁడు: చూ, కావ్యనాటకములు.

కవికల్పితచరిత్ర. పా. ప్రబంధము.

కవిచకోర చంద్రోదయము. పా. ఈ గ్రంథకర్త అల్లమరాజు రామకృష్ణకవి (19 శతాబ్ది.)

కవిచేయు. దే. అ. క్రి. 1. కవియు; జై. :5 ఆ. 109: చూ, వ్యాపించు; 2. కన్నువేయు; చూ, దృష్టించు.

కవిజనచకోర చంద్రోదయము. పా. ఈ గ్రంథకర్త సారపరాజు కొండకవి.

కవిజనరంజనము. పా. ఈగ్రంథకర్త అడిదము సూరకవి (18 శతాబ్ది)

కవిజ్యేష్ఠము. సం. వి. అ. పుం. వాల్మీకిముని: చూ, ముని. 1.

కవిడి. దే. వి. చర్మవాద్యవిశేషము: చూ, వీణె.

కవిత. సం. వి అ. స్త్రీ. 1. పాత్రము: చూ, పుస్తకము; ఋ. పుం. 2. కవి: చూ, మాటలల్లువాఁడు.

కవిత్రయము. పా. నన్నయ, తిక్కన, ఎఱ్ఱన: చూ, త్రియము. (చూ, కవులు)

కవిత్వము. సం. వి. అ. పుం. 1.= కయితము: చూ, మాటలల్లుట; అం. 2. అవధానములు రెనిమిదింటిలో నొకటి: చూ, అవధానములు.

కవిత్వాగనన. పా. ఛందస్సునకు సంబంధించినది. (ఆశు, గర్భ, బంధ, చిత్రకవిత్వములు): చూ, ఉపవిద్యలు.

కవియము. సం. వి. అ. పుం, స్త్రీ. కళ్లెము: చూ, వాగె.

కవియించు. దే. స. క్రి. రూ- కవించు: చూ, వ్యాపించు.

కవియు. దే. అ. క్రి. 1. పర్వు; భాగ. కర్ణ. 2, ఆ. 281: చూ, వ్యాపించు; 2. కన్ను వేయు: చూ, దృష్టించు.

కవియువెంచు. దే. అ. క్రి. (కవియు + తెంచు) కవియు; భార. విరా. 5, ఆ. 192: చూ, వ్యాపించు; 2. కన్ను వేయు: చూ దృష్టించు.

కవిరాజమనోరంజనము. పా. ఈగ్రంథకర్తకను పర్తి అబ్బయామాత్యుఁడు. (18 శతాబ్ది)

కవిరాజవిరాజితము. పా. ఒకానొక వృత్తము. ఈవృత్తమునందొక్కొక్క పాదమునందు న, జ, జ, జ, జ, జ, జ, వ గణములుగలిగి ఎనిమిదింటఁ బదునాలుగింట నిరువదింట యతులుగల త్రిశోభావిలసచ్ఛందస్సునందుద్భవించిన వృత్తము. ఉదా.— కలయఁగ నొక్కొక్క నా రము నాఱుజ, కారములున్నవ్వము, గాటము గానలరిసబోద్వార దాచలశైలము, లెత్తివిరామము, లందినిర । గ్గళ కవిరాజ వి రాజితవృత్తము, రాణజనార్దన గమ్యకథా । వళులఁగ వీతులు, వర్ణనసేయఁగ, వ్రాలునజస్రము, వావిరిగా.” అప్ప. 249. పుట.

కవిరామాయణుఁడు. సం వి. అ. పుం. వాల్మీకి ముని: చూ, ముని. 1.

కవిరి. వై. వి.= ఖాదిరి. కాఁచు: చూ, గంగి దము (గ్రహాణికి మంచిది)

కవిరిగుండ. ద్వ. వి. కాఁచువడియము. -వై.-

కవిల. వై. వి= కపిల. కపిలవర్ణము; భార. ఆది. 4, ఆ. 254: చూ, వర్ణము. 6.

కవిలాసిక. సం. వి. అ. స్త్రీ. వీణావిశేషము: చూ, వీణె.

కవిలియ. దే. వి. ఘటించిన నీలపటుపువర్గు పుస్తకము. లెక్కపుస్తకము. “నీదుకవిలియ నీవ్రాసిన లిపి.” పాండు. 5, ఆ. 52: చూ, పుస్తకము (రూ- కవిలె)

కవిలె. దే. వి. —వై.— “కవిలెలోనున్న పరికరంబు పరిజ పాపపుణ్యముల్ చిత్రగుప్తుండు తెలుప.” ఉ, రా. 8, ఆ. 316. (గంటముతో వ్రాసిన తాటాకులప్రతి అనివాదుక)

కవివాల్మీకి. సం. వి. అ. పుం: చూ, కవిరామాయణుఁడు.

కవివేది. సం. విణ పండితుఁడు: చూ, విద్వాంసుఁడు.

కవీయము. సం. వి. అ. న. కళ్లెము: చూ, వాగె.

కవీశ్వరుఁడు. సం. వి. అ. పుం. 1.=కయిసరుఁడు. కవులలో శ్రేష్ఠుఁడు: చూ, మాటలల్లువాఁడు; 2. అంచె: చూ, హంస.

కవీశ్వరులు. అం. సభాసప్తాంగములలో నొకరు: చూ, సభాసప్తాంగములు. (చూ, అంగము.9)

కవు. దే. వి. వృత్తియందు కాను శబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. "కవుఁదీఁగ." పెం: రూ- కా.

కవుఁగిలి. వై. వి.= క్రోడః: చూ, రూ- కాఁగిలి.

కవుఁగిలించు. వై. స. క్రి: చూ, రూ- కాఁగిలించు.

కవుఁగిలింత. వై. వి: చూ, రూ- కాఁగిలింత.

కవుఁగిలింపు. వై. వి. —వై.— (రూ- కాఁగిలింపు.)

కవుఁజు. వై. వి.= కపింజలః: చూ, రూ-కాఁజు.

కవుచు. దే. వి. 1. రూ- కాచు: చూ, మాంసము; 2. చేఁపమీఁదిపొలసు: చూ, రూ- కాచు- కాయ.

కవుడు. వై. వి. 1.= కపటః. రూ- కాడు: చూ, వ్యాజము. 1; 2. మోసము: చూ. వంచన.

కవును. దే. వి. 1. అవలగ్నము, రూ- కాను: చూ, మధ్యము. 1; 2. అడుచెప్పులు: చూ, పాదుక; 3. వింటినడుము. రూ- కాను: చూ, వింటినడుము.

కవున్నిలు. అం. ఆలోచన సభ

కవురు. దే. వి. వర్ణాధిక్యము. రూ- కారు: చూ, వర్ణము. 6.

కవులు. దే. వి. 1. రూ-కాలు: పట్టా. దీనికి ఎదురు ఒడంబడిక=కదపా (లేక) ముచ్చిలకా); అం. 2. నన్నయ, తిక్కన, ఎఱ్ఱన: చూ, త్రయము: (చూ, కవిత్రయము); 3. సభాంగములలోనొకరు: చూ, సభాంగములు.

కవేరకన్య. సం. వి. ఆ. స్త్రీ. కావేరీనది: చూ, నది.

కవేరజ. సం. వి. ఆ. స్త్రీ. 1. కవేరరాజపుత్రిక: చూ, పుత్రిక 1; 2. కావేరీనది: చూ, నది:

కవేరుఁడు. సం. వి. అ. పుం. కవేరుఁడను రాజు: చూ, రాజు. 1.

కవేలము సం: వి. అ. న. కలువ *: చూ పద్మము. 1.

కవోష్ణము. సం. వి. అ. న. 1. ఇంచుకవేఁడి: చూ, మందోష్ణము; (చూ, వేఁడిమి) విణ. 2. ఇంచుకవేఁడిగలది: చూ, మిడి. 4. (చూ, వేఁడిమి.)

కవ్యము. సం. వి. అ. న. పితృదేవతలకియ్యఁదగిన యన్నము: చూ, సాదము. (1)

కవ్యవాలము. సం. వి. అ. పుం. పితృగణవిశేషము: చూ, యముఁడు.

కవ్వంపుమలతరితాఁడు. ద్వ. వి. నాగుఁబాము; వేం, ఆం. తిర్య. 102: చూ, సర్పము.

కవ్వడ. వై. వి. (కవ + వడి)=సవ్యసాచి, కిరీటి; భార. ఆది. 6, ఆ. 82: చూ, విజయుఁడు. 1. (పురుషోత్తమఃవీయము)

కవ్వపుఁగొండ. ద్వ. వి. మంథాద్రి; లక్ష్మి. 3, ఆ. 35: చూ, పర్వతము. (ఇట్లుకవ్వపుమల)

కవ్వపుమలదాల్పు. ద్వ. వి. వెన్నుఁడు; సాంబ. నిఘ. 4: చూ, విష్ణువు. 1.

కవ్వము. దే. వి: చూ, మంథానము.

కవ్వు. దే. స. క్రి. 1. కబళించు: చూ, మ్రింగు; 2. అపహరించు: చూ, దొంగిలించు.

కవ్వోము. వా. వి. పల్లకిమోయువారి ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

కశ. సం. వి. ఆ. స్త్రీ. 1.=కక్కసము. గుఱ్ఱపుకొరడా: చూ, మునికోల. 2; 2. మాంసరోహిణి, సుగంధిద్రవ్యము యొక్క భేదము: చూ, రాజార్హము.

కశము. సం. వి. అ. పుం. బూతపిల్లి: చూ మార్జాలము.

కశాంకరుఁడు. సం. వి.అ. పుం. అశ్వశిక్షకుఁడు చూ, రేవంతుఁడు.

కశార్హుఁడు. సం. విణ. చేబుకు దెబ్బలకు తగినవాఁడు: కశ్యుఁడు.

కశిపువు. సం. వి. ఉ. పుం. 1. అన్నము: చూ, సాదము. (1); 2. బట్ట: చూ, వస్త్రము; 3. అన్నవస్త్రములు: చూ, కూడుగుడ్డ; 4. పఱుపు; భాగ. 2, స్కం: చూ, శయ్య. 1.

కశీకరము. సం. వి. అ. పుం. జలకణము: చూ, నీరు. 1.

కశేరుక. సం. వి. ఆ. స్త్రీ. వెన్నెముక: చూ, శల్యము. 1.

కశేరుమధుర. సం. వి. ఆ. స్త్రీ. చ్యవను గ్రింధ్యము: చూ, రాజార్హము.

కశేరుకము. సం. వి. అ. న. 1. కమ్మరేఁగు *: చూ, రేఁగు; 2. కొట్టిగడ్డ *: చూ, సుప్రప్వము; 3. చతురశ్రికము *: చూ, ముబువెలఁగ.

కశేరువు. సం. వి. ఉ. పుం 1. గజవిశేషము: చూ, హస్తి; 2. నుదురు: చూ, లలాటము; 3. చుక్క: చూ బొట్టు. 1; 4. ముస్తె *: చూ, తృణము. 1; 5. జంబూద్వీపముయొక్క భాగములోనగు నది; 6. బంగారము: చూ, లోహము. 1; ఊ. స్త్రీ. 7. తృణకందము: చూ, తృణము. 1.

కశ్మలము. సం. వి. అ. న. 1. మూర్ఛ: చూ, రోగము. 1; పుం. 2. నిషాదగ్రామము, బోయపల్లె: చూ, దేశము; విశే. 3. రూ-కస్మలము. కలఁకఁబాఱినది: చూ, మలినము. 3. (తద్భ= కసుమాలము)

కశ్మీరము. సం. వి. అ. పుం. కాశ్మీరదేశము: చూ, దేశము.

కశ్మీరజన్మ. సం. వి. న్. న. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము.

కశ్యపనందనుఁడు. సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు: చూ, హరివాహనుఁడు.

కశ్యపము. సం. వి. అ. పుం. చేఁప: చూ, మత్స్యము. 1.

కశ్యపుఁడు. సం. వి. అ. పుం. కశ్యపముని: చూ, ముని. 1.

కశ్యము. సం వి. అ. న. 1 గుఱ్ఱము నడుము: చూ, హయము; 2. కల్లు: చూ, సుర. 1; విశే. 3. కశకుఁదగినది.

కశ్యుఁడు. సం. విశే: చూ, కశార్హుఁడు.

కష. సం. వి. ఆ. స్త్రీ. 1. దక్షునికూఁతులలో నొకతె; 2. పిన్నరేగడి దూలగొండి *: చూ, స్వల్పదురాలభ.

కషణము. సం. వి. అ. న. 1. ఒరయిక: చూ, పీడనము; విశే. 2. ఉడకనిది: అపక్వము, ఆమము.

కషణి. సం. వి. ఈ. స్త్రీ. 1. కులట: చూ, ఱంకులాఁడి; 2 కళ్ళెము: చూ, వాగె.

కషము. సం. వి. అ. పుం. 1. ఒఱగల్లు: చూ, నికషము; 2. శాణము: చూ, సాన.

కషాకుఁడు. సం. వి. అ. పుం. 1. చాయమగఁడు: చూ, సూర్యుఁడు; 2. అగ్ని: చూ, నిప్పు.

కషాయ. సం. వి. ఆ. స్త్రీ. పిన్నరేగడిదూల *: చూ, స్వల్పదురాలభ.

కషాయకృత్తు. సం. వి. త్. పుం. ఎఱ్ఱలొద్దుగు *: చూ, లొద్దుగు.

కషాయపత్వకము. సం. వి. అ. న. చేండ్రి *: చూ, విట్ఖదిరము.

కషాయఫలము. సం. వి. అ. న.—పై.—

కషాయము. సం. వి. అ. పుం. 1. ఒగరు: చూ, రసము; 2. =కసియము. కాచినసారము: అనుపానము, కసియము-రూ- కస్సెము. (మందుతోఁగూడ చేర్చి పుచ్చుకొనెడు రసమునికొందఱు); 3. పూసికొనెడి చందనాది: చూ, సుగంధము; 4. చందనాదులపూఁత: చూ, పూఁత; 5. ఎఱుపు ఎక్కువకలిసిన తెలుపు: చూ, వర్ణము. 6; 6. క్రముకము *: చూ పోఁక; 7. నిర్యాసము: చూ, బ్రానిబంక,

8. సౌరభము: చూ, పరిమళము. 1; 9. సరిగమపదనిస యను గీతము: చూ, స్వరము. 2; 10. బాధ: చూ, దుఃఖము; 11. విప్లవము: చూ, విపత్తు; విశే. 12 ఎఱ్ఱనిది: చూ, వర్ణము. 6; 13. వాసనగలది: చూ, వాసన.

కషాయయావనాళము. సం. వి. అ. పుం. తువరయావనాళ ధాన్యము: చూ, ధాన్యము.

కషాయి. సం. వి. న్. పుం. నింబము *: చూ, వేము. (సాలమని కొందఱు.)

కషాయిక. సం. వి. అ. స్త్రీ. నీరుదోమ: చూ, మశకము.

కషి. సం. విశే. బాధకుఁడు: చూ, హింసకుఁడు.

కషిక. సం. వి. అ. స్త్రీ. పక్షిజాతి: చూ, పక్షి. (రూ-కషీక)

కషికుఁడు. సం. వి. అ. పుం. కస్నపుదొంగ: చూ, ముచ్చు. 1. (రూ-కషీకుఁడు)

కషిణి. సం. వి. ఈ. స్త్రీ. రెడ్డివారినానుబాలు: చూ, స్వర్ణక్షీరి.

కషీక. సం. వి. అ. స్త్రీ. 1. ఒరగల్లు: చూ, నికషము; 2. పక్షిజాతి: చూ, పక్షి. (రూ-కషిక)

కషీకుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ- కషికుఁడు.

కషుఁడు. సం. వి. అ. పుం. సానపెట్టుట మొదలగు పనులచే జీవించెడు ఒకానొక జాతివాఁడు: చూ, సానలవాఁడు.

కషేరుక. సం. వి. అ. స్త్రీ: చూ, రూ-కశేరుక.

కషోపలము. సం. వి. అ. పుం. ఒరగల్లు: చూ, నికషము.

కష్టకష్టము- సం. వి. అ. న. =కటకట. అయ్యయ్యో: చూ, సంతాపము. (పురు-కవీయము)

కష్టకారకుఁడు. సం. విశే. కసుకుట్టు: చూ, హింసకుఁడు.

కష్టకారము. సం. వి. అ. పుం. కాఁపురము: చూ, సంసారము. 1.

కష్టకాలము. పా. ఆపత్కాలము.

కష్టపడు. మి. అ. క్రి. (కష్టము + పడు.) 1. దుఃఖపడు. (శ. ర.) : చూ, నొగులు; 2. శ్రద్ధతో పాటుపడు. (వాడుక)

కష్టము. సం. వి. అ. న. 1. నొగులు: చూ, దుఃఖము; 2. దోసము: చూ, పాపము; 3. అడవి: చూ, విపినము; విశే. 4. దుఃఖము కలది: చూ, దుఃఖము; 5. పాపముగలది: చూ, పాపము. 1; 6. చొరరానిది: చూ, దుర్గమము.

కష్టములు. అం. ఇవి ఎనిమిది.—దేశాంతరగమనము, భార్యావియోగము, ఆపత్కాలమందు బంధుదర్శనము, ఉచ్ఛిష్టభక్షణము, శత్రుస్నేహము, పరాన్నప్రతీక్షణము, భంగము, దారిద్ర్యము. (8)

కష్టసుఖములు. పా. వి. బ. కలిమిలేములు: (తె. ప): - అవుగాములు- రూ- వొగాములు, కలిమిలేములు.

కష్టస్థానము. సం. వి. అ. న. కష్టమును గలిగించుతావు, వారకము: చూ, స్థానము. 1.

కష్టాత్ముఁడు. సం. విశే: చూ, కడగండ్లమారి.

కసటు. వై. వి. 1. =కష్టదోసము; భార. అర. 6, ఆ. 307: చూ, పాపము. 1; 2. మాలిన్యము; స్వా. 2, ఆ. 55: చూ, మలినము.

కసపిస. దే. వి. మిక్కిలి నవులుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

కసమస. దే. వి. తొట్రుపాటు; విక్రి. 8, ఆ. 87: చూ, సంభ్రమము.

కసము. సం. వి. అ. పుం. 1. ఒరగల్లు: చూ, నికషము: వై. వి. 2. =కశా. కొరడా: చూ, మునికోల. 2.

కసరతు. హిం. వి. సాధకము: చూ, కవాతు.

కసరు. దే. వి. 1. ఝంఝ, వానగాలి; స్కా.3. ఆ. 9: చూ, వాయువు; 2. రూ-కసురు. లజ్జ: చూ, సిగ్గు; 3. రూ-కసురు. కోపము; ఆము. 5, ఆ. 60: చూ, కోపము; 4. రూ-కసురు. తిట్టు: చూ, శాపము. 1; 5. రూ-కసురు, లాభము: చూ, లాభము; అ. క్రి. 6. రూ-కసురు. చలించు; భాగ. 7, స్కం: చూ, సలించు; స. క్రి. 7. రూ-కసురు. కోపించు. "క. అంపఁదగువారిఁ గసరుచు నంపి." స్కా. 5, ఆ. 7: చూ, కోపించు.

కసవు. వై. వి. 1.=ఘాసః. కసవు: చూ, తృణము. 1; 2 ఇంటిపెంట: చూ, పెంట.1.

కసవుఁగుప్ప. ద్వ. వి.(కసవు + కుప్ప.) 1. ఇంటిపెంట: చూ, పెంట. 1; 2. గడ్డివామి: చూ, మేటి.

కసవోత్పాటనము. సం. వి. అ. పుం. చూ, వాసకము *.

కసాయి. దే. వి. ఆఘాతుఁడు: చూ, సంహారకుఁడు.

కసి. దే. వి. 1. కోపము; "కసితీఱఁ గొట్టినది.": చూ, కోపము; 2. దురద; హరి. ఉ. 7, ఆ. 22: చూ, విదర్చిక; 3. కోరిక; హరిశ్చ.8, భా. 890: చూ, వాంఛ; విశే. 4. వృత్తియందుఁ గసిడి శబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. "కసికాటు" మొ.

కసింద. వై. వి.=కాసమర్దః. రూ-కాగకసిబింద-కసివెంద *: చూ, బలుసు. (దీనియందు క్రిమిసంహారశక్తికలదు.) (దీనిభేదము తీఁటకసింద)

కసిగాటు. దే. విశే. అయిష్టభక్షణము.

కసిడి. దే. విశే. అల్పము; పాండు. 4. ఆ. 42: చూ, స్వల్పము.

కసిపువు. సం. వి. ఉ. పుం 1. అన్నము: చూ, పాదము. (1); 2. వలువ: చూ, వస్త్రము; 3. అన్నవస్త్రములు: చూ, కూడుగుడ్డ; 4. పఱుపు: చూ, శయ్య. 1. (రూ-కశిపువు.)

కసిమసగు. దే. అ క్రి. 1. చెంగలించు; భార. ఉద్యో. 2, ఆ. 189: చూ, విజృంభించు; స. క్రి. 2. ఖండించు; రామా. 5, ఆ. 208: చూ, సెలగు; 3. చంపు. "క. అసురుల మాయోపాయులఁ, గసిమసఁగఁగ." రామా 4, ఆ. 8: చూ, సంహరించు.

కసిమసి. దే. వి. తొట్రుపాటు. "క. విలసనము చేయునోయని, కసిమసిబెగడొందు భూతగణము." భాగ. 7, స్కం. 456: చూ, సంభ్రమము. (రూ-కసిమస-కళవళము-కళవళపాటు-కనుకని-కస్కని-కప్పగము.) (పు-క)

కసిమిరి. దే. వి. దురద. "దానవుండైన నాకీవె చేతులు చేసితీ కసిమిరిం బట్టోర్తుక." ఉ, హరి. 5, ఆ. 19: చూ, విదర్చిక. (రూ-కసినసిమిరి-నసు-నుస.) (పురు-క)

కసియము. వై. వి. 1.=కషాయము. రూ-కసము. కస్సెము: చూ, కషాయము. 2; 2. రూ-కస్సెము. నీటిఊటగలతావు: చూ, స్థానము.1.

కసివారు. దే. వి. సవారిమార్గము:రూ-అసివారు.

కసివెంద. వై. వి.=కాసమర్దః. రూ-కసింద *: చూ, బలుసు.

కసీదా, కసీదు. హిం. వి. వస్త్రముమీఁద పూలుబుట్టాలు కుట్టుట. (శ. ర.)

కసీసము. వై. వి. 1, నలుపు: చూ, వర్ణము. 6; 2. నీలకలధౌత వస్త్రము: చూ, వస్త్రము; వై. విశే. 3. నల్లనిది; ఆము. 4, ఆ. 10: చూ, వర్ణము. 6.

కసు. దే. విశే. వృత్తియందుఁ గసురుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. "కసుగాయ." మొ.

కసుఁగందు. దే. వి. (కసురు + కందు) 1. నలుపు; మై. 1, ఆ: చూ, వర్ణము. 6

2. పసిపాప; పా. 3, ఆ. 38: చూ, శిశువు. (రూ-కందువు-కందు.) (పురు-క)

కసుగందు. దే. అ. క్రి. మిక్కిలివాడు; వై. 4, ఆ. 84; భీ. 4, ఆ. 46.

కసుగందులు. దే. వి. బ. మిక్కిలి వాడుటలు; కళా. 4, ఆ. 108: చూ, పసివాళ్లు.

కసుగాయ. దే. వి. లేతకాయ: చూ, కలాటువు. 2.

కసుగు. దే. అ క్రి. 1. నలఁగు. "ద్వి. పిసిగినఁ గసిగిన పిడనిద్రికొంది, నుసలిన మసలిన." పారిజ్ఞా. 2, భా. 1541: చూ, పీడితమగు; అం. క్రి. 2. నలఁగఁజేయు: చూ, నలఁచు; 3. బాధపెట్టు; పద. 2, భా: చూ, బాధించు; 4. నిర్మలమొనరించు: చూ, రద్దు. 1.

కసుతుఁడు. సం. వి. అ. పుం. బ్రిహ్మకొడుకు: చూ, కజుఁడు.

కసుబా. అన్య. దే. తాలూకాలోని ప్రిధానపట్టణము: చూ, దేశము.

కసుమాలము. వై. విణ.=కశ్మలము. మలినము; కాశీ. 7, ఆ. 206; నిర్వ. 10, ఆ. 122. (ఇక్కడ మలినమనఁగా పాపిష్ఠమని యర్థము); చూ, మలినము. (రూ-కసటు-మసటు-మసడు.) (పురు-క)

కసురు. దే. వి. 1. రూ-కసుగాయ. "పెంపెసనీన పండుకాయ కసుకేమియునైనను నేరి తించు." రా. యు, కాం. (దీనికి వ్యుత్పత్తియం దంత్యవర్ణలోపమును లేత యను నర్థమును గలుగును. "కసుఁగందు, కసుగాయ, కసుగాఁపు ప్రాప వయసుమిటారి." మొ.): చూ, కలాటువు. 2; 2: చూ, రూ-కసరు 2-3-4-5; అ. క్రి. 8: చూ, రూ-కసరు. 6; స. క్రి. 4: చూ, రూ-కసరు. 7.

కసూనుఁడు. సం. వి. అ. పుం. వెన్నునికొడుకు: కపుత్రుఁడు.

కస్పచేరలు. దే. వి. చోళ్ళాయబోదులు.

కస్పము. వై. వి. 1.=కచ్ఛ. రూ-కస్పము, నీళ్లు చిదచిదమనెడునేల: చూ, భూమి. 1; 2.=కషాయః. రూ-కస్సము. ఒగరు: చూ, రసము.

కసేరుక. సం. వి. అ. స్త్రీ. వెన్నెముక: చూ, శల్యము. 1.

కసేరువు. సం. వి. ఉ, పుం. — వై. —

కసేవకుఁడు. సం. వి. అ. పుం. కుత్సితసేవకుఁడు: చూ, సేవకుఁడు. 1.

కసైంధవము. సం. వి. అ. పుం. నీటిగుఱ్ఱము: చూ, హయము.

కసోదరుఁడు. సం. వి. అ. పుం. కుత్సితమైన సోదరుఁడు: చూ, సహోదరుఁడు.

* కస్తి. వై. వి. 1.=కష్ట. పగ; ఉ, రా. 6. ఆ. 251: చూ, దుఃఖము; 2.=కష్ట. ఆపద చూ, విపత్తు. (రూ-కసటు-కిసమస.)

కస్తురి. వై. వి. 1.=కస్తూరి, జింకపొక్కిలి; కళా. సం. వి. అ. న., మృగమదము; 2. కస్తు... చూ, సివఁగి. 2.

కస్తురిపట్టెయలు, వారక... వి. బ. 1. పువ్వువిశేషము. రూ-కస్తురిపట్టెలు: చూ, సంధ్య; 2. ధాన్యవిశేషము; భాను. 1, అ: చూ, ధాన్యము. (రూ-కస్తురిపట్టెలు)

కస్తురిపట్టెలు. వై. వి. బ. — వై —

కస్తురిపసుపు. ద్వ. వి. గంధహరిద్రి: చూ, వర్ణము. 6.

కస్తురిపిల్లి. వై.వి. పునుఁగుపిల్లి: చూ, మార్జాలము.

కస్తురిముల్లచీర. దే. వి. స్త్రీవస్త్ర విశేషము: చూ, వస్త్రము.

కస్తురివీణియ. వై. వి. కస్తూరియుండెడి జింక బొడ్డు, మృగనాభి. "వ. కస్తురివీణియలును, బిల్లిగడ్డలును." భల్లా. 8, ఆ: చూ, మృగమదము.

* కస్తికము: పరికరము

కస్తూరి. సం. వి. ఈ. స్త్రీ. 1.=కస్తురి: చూ, మృగమదము. (వాతరోగులకు మందు. నరముల బలహీనత పోఁగొట్టును.); 2. కస్తురి పిల్లి: చూ, మార్జాలము; 3. ఒకానొక నది: చూ, నది; 4. పల్లము: చూ, రంధ్రము. 1; 5. ఆఁడుదానినుదురు: చూ, లలాటము; అం. 6. గంధములు ఎనిమిదింటిలో నొకటి: చూ, గంధములు; దే. వి. (1) కుక్కపేరు; సా. 1, ఆ. 92: చూ, సివఁగి. 2.

కస్తూరినిగరాలు. ద్వ. వి. బ. ఒకరకము వడ్లు: చూ, ధాన్యము.

కస్తూరిపట్టెలు. ద్వ. వి. బ. —పై.—

కస్తూరిపసుపు. పా: చూ, మామిడిఅల్లము*.

కస్తూరిబెండ. పా: చూ, లతాకస్తూరి*.

కస్తూరిమల్లిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, మృగమదవాస*.

కస్తబ్ధుఁడు. సం.విణ. గర్వితుఁడు: చూ, పొగరుబోతు.

కస్థిరము. సం.వి.అ.న.తగరము: చూ,లోహము.1.

కస్మలము. సం. విణ. రూ-కశ్మలము. కలఁకఁబాఱినది: చూ, మలినము. 3.

కస్యపస్మృతి. అం. మూలస్మృతులు పదుమూఁడింటిలో నొకటి: చూ, మూలస్మృతులు.

కస్సెము. వై. వి.=చూ, రూ-కసెము.

కహకహ. సం. వి. ఆ. స్త్రీ. రాక్షసహాసనమునందగు ధ్వన్యనుకరణము; స్కా. 4, ఆ. 95; కాశీ. 7, ఆ. 29: చూ, హహాహహా.

కహారము. సం. వి. అ. పుం. నిటారీడు: చూ, స్తంభము. 1.

కహల. సం. వి. ఆ. స్త్రీ. నఫిరి, కాహలి: చూ, వీణె.

కహారము. సం. వి. అ. న. 1. తెల్లకలువ*: చూ, పద్మము. 1; 2. రూ-కహారము: చూ, స్తంభము. 1.

కహేల. సం. వి. ఆ. స్త్రీ. జలక్రీడ: చూ, విలాసము. 1.

కహోళుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకముని: చూ, ముని. 1.

కహ్లారము. సం. వి. అ. పుం. మిక్కిలి పరిమళము కల కలువ*: చూ, పద్మము. 1.

కహ్వము. సం. వి. అ. పుం. పక్కికొంగ: చూ, బకము.

కళ. సం. వి. ఆ. స్త్రీ. రూ-కల. 1. ముప్పది కాష్ఠలకాలము, 540 ఱెప్ప పాటులుగల కాలము. (8 సెకనులు.) (కాష్ఠ=$\frac{4}{15}$=18 ఱెప్ప పాటులకాలము.); 2. చంద్రునిలో పదునారవభాగము:కో; 3.పాలు: చూ, భాగము.1; 4. ఉపి: చూ, వడ్డి; 5. స్త్రీరజస్సు: చూ, రేతస్సు. 1; 6. చిత్రపువ్రాయుట లోనగు శిల్పులపని: చూ, శిల్పము; 7. తాళపరిమాణమునందెనిమిది నిమిషములకాలము; 8: చూ, పదియారు; 9. బ. వాత్స్యాయనుఁడు చెప్పిన యఱువదినాలుగు బాహ్యక్రియలు; 10. బ. ఆలింగనము,ముద్దుపెట్టుట మొదలగు నఱువదినాలుగభ్యంతరక్రియలు; 11. చదువు: చూ, విద్య; 12. కూర్పుట: చూ, సంధానము. 1; 13. బలువు: చూ, భారము. 1; న. 14 పురుషునిరేతస్సు: చూ, రేతస్సు.1; పుం. 15.పిన్నవరగోఁగు: చూ, పీలువు; 16. అజీర్ణము: చూ, రోగము. 1; విణ. 17. అవ్యక్తమధురధ్వని: చూ,స్వరము. 2; అం. 18. తాళాధ్యాయములోని కాలప్రాణములు పండ్రెండింటిలో నొకటి: చూ, కాలప్రాణము; చూ, తాళము. 2; దే. వి. (1) సొమ్మ. "గీ. హరియురంబందెఁ గెంపు, సమరసంభ్రమ కళలొందె." చంద్రా. 1, ఆ: చూ, మూర్ఛ; (2) ఉపశాఖ, రెమ్మ. "సీ. దక్షిణహస్త పద్మంబులఁ దాల్చి సలలితంపుఁ బువ్వారు కళలతోడ." పర. 3, ఆ: చూ, శాఖ. 1.

**కళంకము.** సం. వి. అ. పుం: చూ, రూ- కలంకము.

**కళంకిబ్రాహ్మణులు.** పా. నాగపూరుజిల్లాలోఁ గానంబడుదురు. పూర్వాచారము నుద్ధరించు నెన్నికఁగలిగిప్రవర్తించుచుందురు.వీరినితరబ్రాహ్మణులు నింద్యులుగానెంచి కళంకీలను పేరు వ్యాప్తిచేసిరి: చూ, బ్రాహ్మణులు.

**కళంకు.** దే. వి: చూ, రూ- కలంకు. (తద్భవమని పురుషోత్తమకవీయము.)

**కళంబము.** సం. వి. అ. పుం. అమ్ము, రూ-కలంబము: చూ, బాణము 1.

**కళకళము.** సం. వి. అ. పుం.= కోలకోల. రూ- కలకలము: చూ, స్వరము. 2.

**కళకొఁతులు.** పా. తెలివితేటలు.

**కళత్రభావము.** అం. భావములు పండ్రెండింటి లోనొకటి: చూ, భావములు.

**కళత్రము.** సం. వి. అ. న. 1. పెండ్లాము: చూ, భార్య; 2. నితంబము: చూ, పిఱ్ఱ; 3. కోట: చూ, ప్రాకారము.

**కళపెళ.** దే. వి. ఉడుకుటయందగు ధ్వన్యనుకరణము; రసి. 4, ఆ 162: చూ, హుహూహూ.

**కళబుట్టు.** దే. అ. క్రి. మూర్ఛిల్లు: చూ, సొమ్మసిల్లు.

**కళబుట్టుట.** దే. వి. అరసావు: చూ, మూర్ఛ.

**కళభము.** సం. వి. అ. పుం. రూ- కలభము. 1. ఏనుఁగుగున్న: చూ, హస్తి; 2. ముప్పదియేండ్ల ఏనుఁగు: చూ, హస్తి.

**కళమము.** సం. వి. అ. పుం. వరివైరు: చూ, సస్యము.

**కళలు.** అం. 1. శబ్దరత్నాకరములోనివి. — 64 — ఇతిహాసము, ఆగమము, కావ్యము, అలంకారము, నాటకము, గాయకత్వము, కవిత్వము, కామశాస్త్రము, దురోదరము, దేశభాషాలిపిజ్ఞానము, లిపికర్మము, వాచకము, అవధానము, స్వరశాస్త్రము, శాకునము, సాముద్రికము, రత్నశాస్త్రము, రథాశ్వగజకౌశలము, మల్లశాస్త్రము, సూదకర్మము, దోహదము, గంధవాదము, ధాతువాదము, ఖనివాదము, రసవాదము, జలవాదము, అగ్నిస్తంభము, ఖడ్గస్తంభము, జలస్తంభము, వాక్స్తంభము, వయస్తంభము, వశ్యము, ఆకర్షణము, మోహనము, విద్వేషణము, ఉచ్చాటనము, మారణము, కాలవంచనము, పరకాయప్రవేశము, పాదుకాసిద్ధి, వాక్సిద్ధి, ఘుటికాసిద్ధి, ఐంద్రజాలికము, అంజనము, దృష్టివంచనము, స్వరవంచనము, మణిమంత్రౌషధాదిసిద్ధి, చోరకర్మము, చిత్రక్రియ, లోహక్రియ, అశ్మక్రియ, మృత్క్రియ, దారుక్రియ, వేణుక్రియ, చర్మక్రియ, అంబరక్రియ, అదృశ్యకరణము, దూతీకరణము, మృగయ, వాణిజ్యము, పాశుపాల్యము, కృషి, ఆసవకర్మము, ప్రాణిద్యూతకౌశలము; 2. గ్రంథసంజ్ఞాదర్పణములోనివి.— 64.— అక్షరలక్షణ, అలంకార, ఇతిహాస, మీమాంస, తర్కశాస్త్ర, స్త్రీలక్షణ, పురుషలక్షణ, అశ్వలక్షణ, గజలక్షణ, గోలక్షణ, కన్యావాద, విషవాద, బలవాద, రసవాద, ధాతువాద, బ్రహ్మవాద, మృషావాద, ముద్రారక్షక, క్షాత్రకర్మ, భూతశిలాపాత, అశ్వవైద్య, గజవైద్య, పశువైద్య, నరవైద్య, ఇంద్రజాల, మహేంద్రజాల, గోకర్ణ, గజకర్ణ, తృణావధాన, శబ్దావధాన, భూజావధాన, ఘంటావధాన, హస్తచలన, నయనసంజ్ఞ, భాషావిశేష, భ్రమణ, మోహన, విద్వేషణ, ఉచ్చాటన, ఆకర్షణ, అంజన, అదృశ్య, భృగుమత, భేతాళమత, ఆయుధాభ్యాస, వాస్తుశాస్త్ర, శిల్పశాస్త్ర, రథారోహణ, గజారోహణ, అశ్వారోహణ, యోగశాస్త్ర, భరతశాస్త్ర, మోహస్తంభన,

వయస్తంభన, అగ్నిస్తంభన, జలస్తంభన, ఖడ్గస్తంభన, ఘుటికాసిద్ధి, పాదుకాసిద్ధి, మంత్రసిద్ధి, పరకాయ, ప్రవేశ, దూరదృష్టి, దూరశ్రవణంబులు. 3. కళలు. — ఔపరిష్టము, దంతక్షతము, నఖక్షతము, సంప్రవేశనము, గళస్వనము, పురుషలీల, చుంబనము, కౌఁగిలి. (ఇవి అఱువదినాలుగు భేదములయ్యె.) 4. తాళప్రాణములు పదింటిలోనొకటి: చూ, తాళప్రాణములు;(చూ, తాళము. 2.) పా. 5. ద్రుతప్రయుక్తమం గానిశబ్దములు కళలు. (i. విభక్తులలో డు, ము, వు, లు, కూర్చి, కై, పట్టియొక్క సంబోధనములు కళలు; ii. సమాపకక్రియలలోఁ బ్రథమోత్తమపురుష బహువచనంబును, మధ్యమపురుషంబునందుభయవచనంబులును, భూతార్థకబహువచనము కళలు; iii. అసమాపక క్రియలలోఁ గ్వార్థకములు కళలు. ఉ. వచ్చి, రాక, చేసి, చేయక, చూచి, గా దక మొదలైనవి; iv. అర్థకములందుఁగళలు)

కళలుండుస్థలములు. అం. పాడ్యమి మొదలు పదునాఱుదినములలో కళలుండు స్థలములు.— 1 తల, 2 ఎదుబొమ్మ, 3 చేతులు, 4 కుచములు, 5 తొడలు, 6 నాభి, 7 నొసలు, 8 కడుపు, 9 పిఱుఁదు, 10 వీఁపు, 11 చెంకలు, 12 యోని, 13 మోఁకాళ్ళు, 14 పిక్కలు, 15 పాదములు, 16 బొట్టనవ్రేలు. (శుక్లపక్షమున బొట్టనవ్రేలుమొదలుగ నెక్కుచు కృష్ణపక్షమున శిరముమొదలుగ దిగుచుండును.)

కళవరము. దే. వి. మల్లబంధవిశేషము. "గీ. కళవరానకుఁజొచ్చి డొక్కరముహత్తి." ఉ, హరి. 3. ఆ. 69: చూ, మల్లశాస్త్రము.

కళవసము. దే. వి. చర్మము. రూ- కళాసము. "చర్మనామము కళాసము కళవసమన" ఆం, భా, ద్వి. బ్ర. 177: చూ, తోలు. 1.

కళవళపడు. ద్వి. అ. క్రి. (కళవళము + పడు) 1. కలఁతపడు; జై. 6, ఆ. 151; సాన౦. 5, ఆ. 14: చూ, సంక్షోభించు; 2.తొట్రుపడు: చూ, సంభ్రమించు.

కళవళపాటు. ద్వి. వి. (కళవళపడుట) 1. కలఁతపాటు; నీలా. 3, ఆ. 14: చూ, సలసము.2; 2. తొట్రుపాటు. "వేఁడుచుఁబోయిరెంతయుంగళవళపాటుతో.": చూ, సంభ్రమము.

కళవళము. దే. వి. 1. తొట్రుపాటు; కాశీ. 5, ఆ. 66: చూ, సంభ్రమము. 1; 2.కలఁత; హరిశ్చ. 5. ఆ. 72: చూ, సంతాపము.

కళవళించు. దే అ. క్రి. 1. కలఁతపడు; హరి. పూ. 8, ఆ. 176: చూ, సంక్షోభించు; 2. తొట్రుపడు; ఉ, హరి. 5, ఆ.270: చూ, సంభ్రమించు.

కళాంజి. దే. వి. తమ్మపడిగము: చూ, పాత్రము. 6. (కలాచీశబ్దభవమని పురు-కవీయము)

కళాజీవనిక. అం. తంత్రములు అఱువదినాలుగింటిలో నొకటి: చూ, తంత్రములు.

కళానిధి. సం. వి. ఇ. పుం. చందురుఁడు: చూ, చంద్రుఁడు.

కళాపూర్ణోదయము. పా. పింగళిసూరన్న విరచితము. (16 శతాబ్ది)

కళామాంసి. సం. వి. ఈ. స్త్రీ. మృదుఫల *: చూ, ద్రాక్ష.

కళాయి. దే. వి. 1. గంగాళము: చూ, పాత్రము. 6; (నీలిమందుకాచెడు గంగాళము అనిశ.ర.) 2. ఇత్తడిపాత్రములులోనగువానికిఁ బూసెడు సీసపుపూఁత: చూ, పూఁత. 3. (రూ- కలాయి)

కళావతి: చూ, రూ- కలావతి.

కళావర్తి. అం. అనుభావర్తములలో నొకటి: చూ, అనుభావర్తములు.

కళావిలాసము. ప్రా.ఇదినన్నెచోడదేవకవి విరచితగ్రంథము. (12 వ శతాబ్ది)

కళాశాస్త్రము. అం. సుగుణములు ఇరువదియెనిమిదింటిలో నొకటి: చూ, సుగుణములు.

కళాసగందవడి. ద్వ. వి. సున్నములోనగునది: చూ, లేపము.

కళాసము. దే. వి: చూ, రూ-కళేవసము; నై.6, ఆ. 115.

కళాసారము. అం. శివప్రోక్తములగు చతుష్షష్టి తంత్రములలో నొకటి: చూ, తంత్రములు.

కళాసించు. దే. అ. క్రి. నిర్వేదించు; విక్ర.5, ఆ. 61: చూ, వేసరు. 2.

కళాస్థానములు. అం. బొటనవ్రేలికొన, అఱకాలు, మడమ, మోఁకాటిచిప్ప, భగము, బొడ్డు, ఱొమ్ము. చన్ను, చంక, కంఠము, చెక్కిలి, పెదవి, కన్ను, నుదురు, తల. (15)

కళింగ. సం. వి. ఆ. స్త్రీ. 1. అందుది: చూ, స్త్రీ; 2. కర్కటకశృంగి *: చూ, శృంగి; అం. 3. దేశములు ఏఁబదియాఱింటిలో నొకటి: చూ, దేశము.

కళింగకము. సం. వి. అ. పుం. కొడిసెవిత్తులు*: చూ, వత్సకము.

కళింగము. సం. వి. అ. న. 1. కొడిసెకాయ*: చూ, వత్సకము; 2. ఉర్వారుకము *: చూ, పుచ్చ; 3. కూఁకటిమూఁగ: చూ, భృంగరాజము. 3; 4. నెమలియడుగు *: చూ, పూతికరజము; అం. 5: చూ, రూ-కళింగ. 3.

కళీయుఁడు. సం. వి. అ. పుం. కళీయుఁడను సర్పరాజు: చూ, సర్పము.

కళుకు. దే. వి. రూ-కళ్కు. 1. కాంతి; ఆము. ఆ. 98: చూ, వెలుతురు. 1; 2. కిరణము: చూ, మయూఖము. 1; 3. పక్షివిశేషము: చూ, పక్షి; 4. చూర్ణము. కళా.1, ఆ.10: చూ, సుసము.

కళేబరము. సం. వి. అ. న. మేను: చూ, శరీరము.

కళ్కు. దే. వి: చూ, రూ-కళుకు.

కళ్యము. వై. వి.=ఖలీనః. కళ్లెము. "సీ. కళ్యాలఁబదిలంబుగాని గుఱ్ఱంబులఁ గ్రొత్తముట్టునకియ్య కొలుపవు వెరవు," భార. విరా.1, ఆ.95: చూ, వాగె. (కళ్యాలు అని పురుషోత్తమకవీయము.)

కళ్ల. దే. వి. శైత్యముచే గట్టిపడినయుమ్మి;అచ్చ. కిష్కి-ం, కాం. 66 (ఇట్లు పరుషాదిగా కొన్ని దేశములందు వ్యవహారము.): చూ, శ్లేష్మము.

కళ్లము. వై. వి.=ఖలః. రూ-కళ్లాము: చూ, ఖలము. 4.

కళ్లాము. వై వి = —వై —

కళ్లి. దే. వి: చూ, కళ్ల. "కళ్లి తెగిపడుటలేదు" (వాడుక.)

కళ్లియము. వై. వి. = కలికా. రూ-కళ్లెము. "కత్తుల కళ్లియంబొరయఁగా." కవిక. 2, ఆ. 72: చూ, వాగె.

కళ్లె. వై. వి. 1.= —వై.—; దే. వి. 2. కళ్లి: చూ, కళ్ల.

కళ్లెము. వై. వి.=కలికా. రూ-కళ్లియము: చూ, వాగె. "చిక్కుల గుఱ్ఱమునకు కక్కుల కళ్లెము."



## కా

**కా.** సం. వి. ఆ. స్త్రీ. 1. కాకియఱచుటయందగు ధ్వన్యనుకరణము; భాగ. కష్క. 2, ఆ. 79: చూ, హాహాహూహూ; 2. సర్వనామ శబ్దము. ఏ స్త్రీ, ఎవతె: చూ, స్త్రీ; విశే. తె. కుత్సితశబ్దమునకు వృత్తియందువచ్చెడి ఆదేశము. "కాపురుషుఁడు." మొ; దే. అవ్య. (1) కదా; జై. 1, ఆ. 28: చూ, కద. 3; దే. ద్రి. (2) ఇది అవధారణార్థకావ్యయము మీఁద వచ్చినపుడు ఇత్యర్థకమగును; భార. ఆర. 2, ఆ. 14.

**కాంక్ష.** సం. వి. ఆ. స్త్రీ. = కచ్చ్బ. కోరిక: చూ, వాంఛ.

**కాంక్షించు.** సం. స. క్రి. కోరు: చూ, వాంఛించు.

**కాంక్షితప్రియము.** సం. వి. అ. పుం. కాకాండము *: చూ, చెప్పుతట్ట.

**కాంక్షితము.** సం. విశే. కోరఁబడినది.

**కాంగ.** సం. వి. ఆ. స్త్రీ. వస *: చూ, విష.

**కాంగవీనము.** సం. విశే. కొఱ్ఱలుపండునేల: చూ, భూమి. 1.

**కాంగేరుకి.** సం. వి. ఈ. స్త్రీ. నాగబల *: చూ, బీఱ. 2. (రూ-గాంగేరుకి)

**కాంచనకదళి.** సం. వి. ఈ. స్త్రీ. బంగారపుటనఁటి *: చూ, రంభ. 2.

**కాంచనకము.** సం. వి. అ. న. 1. అరిదళము: చూ, హరిదళము; పుం. 2. కాంచేనము *: చూ, దేవకాంచనము.

**కాంచనకారిణి.** సం. వి. ఈ. స్త్రీ. పిల్లపీఁచర *: చూ, శతమూలి.

**కాంచనక్షీరి.** సం. వి. ఈ. స్త్రీ. చిఱుపాల *: చూ, మనుపాల.

**కాంచనగిరి.** సం. వి. ఇ. పుం. బంగరుకొండ: చూ, పర్వతము.

**కాంచనగ్భలము.** సం. వి. అ. పుం. చంపకము*: చూ, సంపెఁగ.

**కాంచనపుష్పకము.** సం. వి. అ. న. ఒకానొక చెట్టు: చూ, అహుల్య.

**కాంచనపుష్పి.** సం. వి. ఈ. స్త్రీ. గణికారిక *: చూ, నెల్లి.

**కాంచనము.** సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1; 2. కింజల్కము: చూ, పక్ష్మము. 4;. పుం. 3. ఉమ్మెత్త *: చూ, హాలాపుష్పము; 4. చంపకము: చూ, సంపెఁగ; 5. = కాంచేనము *: చూ, దేవకాంచనము; 6. అహికేసరము *: చూ, నాగకేసరము; 7. పున్నాగము *: చూ, పొన్న; 8. వటము *: చూ, మఱ్ఱి; 9. అంజూరు *: చూ, మేడి; 10. పసుపు: చూ, వర్ణము. 6.

**కాంచనారము.** సం. వి. అ. పుం. = కాంచేనము *: చూ, దేవకాంచనము.

**కాంచనాలము.** సం. వి. అ. పుం.—పై.—

**కాంచనాహ్వయము.** సం. వి. అ. పుం. 1. అహికేసరము*: చూ, నాగకేసరము; 2. ఉమ్మెత్త *: చూ, హాలాపుష్పము.

**కాంచని.** సం. వి. ఈ. స్త్రీ. పసుపు: చూ, వర్ణము. 6.

**కాంచనీయ.** సం. వి. ఆ. స్త్రీ. కపిలము: చూ, వర్ణము. 6. (పసుపుమీఱిన రొమ్ముఱుపు)

**కాంచి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒంటిపేటగల ఆఁడుదాని మొలనూలు: చూ, భూషణము. 2; 2. గురివెంద *: చూ, తులాబీజము; 3. = కంచి. ఒకానొక పట్టణము: (చూ, కంచి) చూ, దేశము; 4. పుణ్యనగరములు ఏడింటిలో నొకటి: చూ, పుణ్యనగరములు; 5. క్షేత్రములు

ఇరువదినాలుగింటిలో నొకటి: చూ, క్షేత్రములు.

కాంచికము. సం. వి. అ. న. రూ- కాంజికము. పులికడుగు : చూ, శుక్తము. 1.

కాంచీపదము. సం. వి. అ. న. పిఱుఁదు: చూ, పిఱ్ఱి.

కాంచీనము. వై. వి.= కాంచనః *: చూ, దేవకాంచీనము.

కాంచు. దే. స. క్రి. 1. చూచు: చూ, వీక్షించు; 2. సక్తమగు: చూ, ప్రాపించు; 3.నీళ్లాడు: చూ, ప్రసవించు; 4. భాగ్యము పొందు; భార. అర. 2, ఆ. 101.

కాంజి. సం. వి. ఈ. స్త్రీ. 1. పెద్దతుమ్మి *: చూ, తుమికి; 2. = గంజి. పులికడుగు: చూ, శుక్తము. 1.

కాంజిక. సం. వి. ఆ. స్త్రీ. తిప్పతీఁగె *: చూ, సోమవల్లి.

కాంజికము. సం. వి. అ. న: చూ, రూ- కాంచికము.

కాంజికవటకము. సం. వి. అ. పుం. ఒకరకము వడియము: చూ, వడియము.

కాంజీరము. సం. వి. అ. పుం. కింపాకము *: చూ, ముసిఁడి.

కాంటకము. సం. వి. అ. న.ముండ్లసమూహము: చూ, సితాగ్రము.

కాంఠము. సం. విశే. కంఠసంబంధమైనది.

కాండకటుకము. సం. వి. అ. పుం. కాఁకర *: చూ, సుషవి. 1.

కాండకాండకము. సం. వి. అ. పుం. రెల్లు*: చూ, తృణము. 1.

కాండకారము. సం. వి. అ. న. క్రముకము *: చూ, పోఁక.

కాండకీలకము. సం. వి. అ. పుం. లోధ్రము*: చూ, లొద్దుగు.

కాండగుండము సం. వి. అ. పుం. తుంగగడ్డి*: చూ, తృణము. 1.

కాండగోచరము. సం. వి. అ. పుం. ఇనుపచువ్వగల బాణము: చూ, బాణము. 1.

కాండజాత. సం. వి. ఆ. స్త్రీ. తిప్పతీఁగె *: చూ, సోమవల్లి.

కాండని. సం. వి. ఈ. స్త్రీ. సూక్ష్మపర్ణి, రామతులసి *: చూ, తులసి.

కాండతిక్తకము. సం. వి. అ. పుం. నేలవేము*: చూ, భూనింబము.

కాండతిక్తము. సం. వి. అ. పుం.—వై.–

కాండత్రియము. అం. జ్ఞాన - కర్మ - ఉపాసనలు. (లేక విజ్ఞానములు): చూ, త్రియము.

కాండనీలము. సం. వి. అ. పుం. అతువి *: చూ, లొద్దుగు.

కాండపటము. సం. వి. అ. పుం. 1. = గండవడము. అపటి, తెర: చూ, వస్త్రము: 2. – తిసీర: చూ, తెరచాప.

కాండపుంఖ. సం. వి. ఆ. స్త్రీ. తెల్లవెంపలి *: చూ, వెంపలి.

కాండపుష్పా. సం. వి. ఆ. స్త్రీ. మత్స్యాక్షి *: చూ, పొన్నగంటి.

కాండపుష్పము. సం. వి. అ. న. క్షుద్రసుగంధి పుష్పవిశేషము.

కాండపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. మత్స్యాక్షి*: చూ, పొన్నగంటి.

కాండపృష్ఠము. సం. వి. అ. న. కర్ణధనుస్సు: చూ, బాణము. 1. (రూ- కాలపృష్ఠము.)

కాండపృష్ఠుఁడు. సం. విశే. 1. రూ- కాండస్పృష్ఠుఁడు. ఆయుధికుఁడు: చూ, శస్త్రాజీవుఁడు; 2. తల్లిదండ్రులయొద్ద వెలకు కొనిన కొడుకు, క్రీతుఁడు: చూ, పుత్రుఁడు. 1; 3. పరాయికొలమునకు చెందినవాఁడు.

**కాండము.** సం. వి. అ. పుం, న. 1. కావ్యపరిచ్ఛేదము; అమరము, రామాయణము మొదలగు వానిలోని భాగము: చూ, సర్గము. 1; 2. గుంపు: చూ, సమూహము; 3. అమ్ము: చూ, బాణము. 1; 4. జలము: చూ, నీరు; 5. ఆకుల ఈనె: చూ, పర్వ్రీణము. 6.=కాండ. తామర లోనగువాని కాఁడ: చూ, బిసము.1; 7. దారము: చూ, సూత్రము. 1; 8. దుబ్బు: చూ, పైరుదుబ్బు; 9. మోదుగు లోనగువాని చిగురు: చూ, సమిధ; 10. బోదె: చూ, మ్రాను; (బీజాంకురము వృద్ధిపొందినప్పుడు (రాడికల్) అను మొదటివేరు భూమిలోనికి పోవును. (ప్లూమ్యూల్) అను మొదటిశాఖ ఎండను గాలిని వెదకికొనుచు భూమిపైకి వచ్చును. దీనికే ప్రకాండమని పేరు. దీని లోపలి నిర్మాణములు.— ప్రకాండములో నాలుగు భాగములు కలవు. 1 పట్ట లేక త్వ 2 లోపలిపొర, 3 కఱ్ఱభాగము, 4. దంటుభాగము. ఏకబీజదళ వృక్షములలో దవ్వభాగము మధ్యనుండును. ద్విబీజదళవృక్షములలో కఱ్ఱభాగము మధ్యనుండును); 11. గుఱ్ఱము: చూ, హయము; 12 ఏకాంతము: చూ, రహస్యము. 1; 13. అదను: చూ, సమయము. 1; 14. కాకిదొండ *: చూ, దొండ; పుం. 15. ఎలుక: చూ, మూషికము; విణ. 16. కీడ్వఁబడినది: చూ, హీనము. 1.

**కాండములు.** అం. బాలకాండము, అయోధ్యాకాండము, అరణ్యకాండము, కిష్కింధాకాండము, సుందరకాండము, యుద్ధకాండము, ఉత్తరకాండము. (7) (ఉత్తరకాండము అధికము.)

**కాండరుహ.** సం. వి. అ. స్త్రీ. తక్కిలి *: చూ, వైజయంతి. 4.

**కాండర్షి.** సం. వి. ఇ. పుం. వేదకాండము విశేషముగాఅధ్యాపకముచేసిన ముని: చూ, ముని.1.

**కాండవంతుఁడు.** సం. వి. త్. పుం. రూ-కాండీరుఁడు. అమ్ములు ఆయుధములుగాఁ గలవాఁడు: చూ, విలుకాఁడు.

**కాండశర.** సం. వి. ఆ. స్త్రీ. తిప్పతెల్లు*: చూ, బాణము. 1. (రూ-కాండశరము.)

**కాండసంధి.** సం. వి. ఇ. పుం. ముడి: చూ, బుడిపి.

**కాండస్పృష్టుఁడు.** సం. విణ: చూ, కాండపృష్ఠుఁడు.

**కాండహీనము.** సం. వి. అ. న. నాగముస్తె *: చూ, తృణము. 1.

**కాండిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. లంక ధాన్యము: చూ, ధాన్యము; 2. నూఁగుదోస *: చూ, దోస.

**కాండీరము.** సం. వి. అ. పుం. 1. ఉత్తరేను *: చూ, శైఖరికము; 2. ఏనుఁగుపిప్పలి*: చూ, పిప్పలి. 1; 3. లతాప్రభేదము: చూ, లత. 1.

**కాండీరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఉత్తరేను *: చూ, శైఖరికము; 2. మంజిష్ఠ *: చూ, మంజిటి.

**కాండీరుఁడు.** సం. విణ. ధనుర్ధరుఁడు: చూ, విలుకాఁడు (దండమును ధరించినవాఁడు. అని కొందఱు.)

**కాండేక్షువు.** సం. వి. ఉ. పుం. 1. గొలిమిడి*: చూ, మొగబీఱ; 2. తెల్లు*: చూ, తృణము. 1.

**కాండేరి.** సం. వి. ఈ. స్త్రీ. కామదూతిక *: చూ, నాగదంతి.

**కాండేరితము.** సం. విణ. కాండముచేత చెప్పఁబడినది.

**కాండేరుహ.** సం. వి. ఆ. స్త్రీ. తక్కిలి *: చూ, వైజయంతి. 4.

**కాండ్రి.** తె. వి. ఒకరకముగడ్డి: చూ, తృణము. 1.

**కాండ్రికాయ.** వా. ఈపదమును "చేదువుకొనక ముందు కాఁకరకాయ. చేదువుకొనిన పిదప కాండ్రికాయ" అను సామెతయందుపయోగింతురు.

**కాండ్రించు.** వా. అ. క్రి. గట్టిగా గొంతుక చించుకొను.

**కాండ్రు.** దే. వి.పులి కూయుటయందగు ధ్వన్యనుకరణము. స్కా.4,ఆ. 3: చూ,హూూహూూ.

**కాంత.** సం. వి. ఆ. స్త్రీ. 1.=గోతి. కోరఁదగిన ఆఁడుది: చూ, స్త్రీ; 2.=గోతి. ఆఁడుది:చూ, స్త్రీ; 3. అంకోలగిరి *: చూ, ప్రియంగువు; వా. వి. (1) మిక్కిలి కొంచెము. (గోదావరీ మండలమున "కాంత బెల్లముపెట్టుము" అని వాడుక.)(కాంత=కాసంత-కాసింత-కుల్లింత-కూసింత- కూస్తంత- కాస్తంత ఇత్యాదులు తఱచుగా వాడుచుందురు.)

**కాంతకుట్మలము.** సం. వి. అ. పుం. చిల్ల *: చూ, సల్లకి.

**కాంతపక్షి.** సం. వి. న్. పుం. నెమలి : చూ, మయూరము.

**కాంతపుష్పము.** సం. వి. అ. పుం. కాంచీనము*: చూ, దేవకాంచనము.

**కాంతప్రదేశము.** పా. అయస్కాంతము ఇనుప గుండ్లను ఆకర్షించుటయును, ఇతర అయస్కాంతముల నాకర్షించుటయును, వికర్షించుటయును గలదు. ఇవిసమీపమున నున్నప్పుడే ఈకార్యములు కనఁబడుచున్నవి కాని క్రమక్రమముగా దూరము చేసినకొలఁది, ఆకర్షణశక్తి క్రమక్రమముగా తగ్గి తుదకు, కొంతదూరము వచ్చినతరువాత నేమియుఁ గనఁబడదు. ప్రతి అయస్కాంతమునకు తనచుట్టును, అయస్కాంతత్వమును కనఁబఱచు ప్రదేశముండును. ఈ ప్రదేశము లోపలనే దీనిలక్షణములు కనఁబడుచున్నవి. ఈప్రదేశమునకు కాంతప్రదేశమనిపేరు.

**కాంతభస్మము.** పా. శుద్ధిచేసిన అయస్కాంతమునకు నాలుగవపాలు గంధకము పెట్టి జిల్లేడుపాలను మర్దించి పిమ్మట గొమ్మునగోరు పిండి ఆకురసమునను, మోదుగచెక్క రసమునను మర్దించి మూఁడుగజపుటములు పెట్టేది. పిమ్మట అదేప్రకారము మూఁడు గజపుటములు పెట్టిన కాంతము భస్మమగును.

**కాంతభస్మసిందూరము.** పా. కాంతభస్మములో సగము ఇంగిలీకము పెట్టి దూలతామగ వేళ్ళ రసముతో మూఁడుదినములు మర్దించి రొట్టె మన్ను మూసచేసి అందులో యీమర్దించిన కాంతభస్మము పెట్టి అమీఁదను చీలమన్ను ఇచ్చి మూఁడు గజపుటములు పెట్టిన అయస్కాంతము బాలసూర్యునితో సమముగ సిందూరించును.

**కాంతము.** సం. వి. అ. పుం. 1. ఇనుము: చూ, లోహము. 1; 2. ఱాయి: చూ, రాయి. (చంద్రసూర్యాయశ్శబ్దములకును, తత్పర్యాయ శబ్దములకును వెనుకవచ్చునపుడు) ఱాయి. (చంద్రకాంతము, సూర్యకాంతము, అయస్కాంతము మొ. వీనియర్థములు ఆయాయి శబ్దములకడఁజూచునది.); 3.సూదంటుఱాయి: చూ. రాయి; 4. వసంతుడు *: చూ, ఫేనిలము. 2; 5. చూతము *: చూ, మామిడి; 6. ఇల్లు: చూ. సదనము. 1; విణ. 7. సొగసు: చూ, సౌందర్యము.

**కాంతముశుద్ధి.** పా. అయస్కాంతము నిమ్మపండ్ల పులుసులోను కలిలోను, పుల్లచల్లలోను రెండేసిగడియలు నానవేసిన శుద్ధి.

**కాంతలకము.** సం. వి. అ. పుం. తున్నకము *: చూ, నంది.

కాంతలోహము. సం. వి. అ. న. 1. సూదంటు రాయి: చూ, రాయి; 2. కాంతలోహభస్మము. (ఈభస్మము రక్తమును పూరించును)

కాంతవల్లభరసము. పా. కాంతభస్మము 16 భా, ఉక్కురాపిడి 14 భా, మాండూరము 12భా, శుద్ధిచేసిన వెలిగారము 10 భా, శుద్ధిచేసిన మణిశిల 8 భా, శుద్ధిచేసిన కర్పూరశిలాజిత్తు 6 భా, శుద్ధిచేసిన పాదరసము 66 భా, శుద్ధిచేసిన గంధకము 66 భా, యిటులవీనిని కల్వమునందునుంచి నిమ్మపండ్లరసములో మర్దించి ఆర్ద్రమూషలోగాని, గాజుకొప్పెలోగాని నునిచి వాలుకాయంత్రమున యేడు దినములు వండి స్వాంగశీతలమున కల్వమునందునిచి,మర్దించి చూర్ణముచేసి యందర్ధనిష్కప్రమాణమును ప్రత్యహము ప్రాతస్సాయంకాలముల తేనెతో సేవించిన పాండువు, క్షయ, గుల్మము, గ్రహణి, కాసశ్వాసలు, జ్వరము,వాంతులు, ప్లీహోదరము, అరుచి, అగ్నిమాంద్యము, కుష్ఠువు, మూలవ్యాధి, భగంధరము,వాతశూల హరించుటయేగాక కడువీర్యవృద్ధి, అగ్నిదీపనము,మనస్సంతోషము, శరీరముపుష్టి,కాంతి, బలము అనునవి లెస్సగాగలుగును. ఇది విష్ణుదేవునిచే నిర్మింపఁబడిన కాంతవల్లభరసము అనఁబడును. (మాండూరము=ప్రాతచిట్టెము. ఆర్ద్రమూష = ఆవము - మాళిలో నుంచిన మూస.)

కాంతాంఘ్రిదోహదము. సం. వి. అ. పుం.అశోకము *: చూ, హేమపుష్పము.

కాంతాచరణదోహదము. సం. వి. అ. పుం. —పై.—

కాంతాయసము. సం. వి. అ. న. సూదంటు రాయి: చూ, రాయి.

కాంతారకము. సం. వి. అ. పుం. తెలుపుకలసిన పచ్చచెఱకు *: చూ, రసాలము. 3.

కాంతారము.సం.వి.అ.పుం,1:చూ,కాంతారకము; 2. ఇక్షువు: చూ, రసాలము. 3; 3. అడవి: చూ, విపినము; 4. పెరడవి: చూ, విపినము; 5. పోరానిత్రోవ: చూ, మార్గము. 1; 6. దైవికమగు నాపద: చూ, విపత్తు.

కాంతారి. సం. వి. ఈ. స్త్రీ. తెలుపుకలసిన పచ్చచెఱకు *: చూ, రసాలము. 3.

కాంతారుఁడు. సం. వి. అ. పుం. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. బమ్మ:చూ, బ్రహ్మ.1; 3. ముక్కంటి: చూ, శివుఁడు; 4. కాముకుఁడు: చూ, వలపుకాఁడు; 5. వైరాగ్యము గలవాఁడు: చూ, విరాగుఁడు.

కాంతాసమ్మితములు. (కావ్యములు) అం.శాస్త్రములు మూఁడింటిలో నొకటి: చూ, శాస్త్రములు. (కావ్యము=ప్రబంధము)

కాంతాళపడు. ద్వ. అ. క్రి. (కాంతాళము + పడు) ఈర్ష్యపడు: చూ, సూడుకొను. 2.

కాంతాళము. దే. వి. 1. ఈర్ష్య; ఉ. రా. 6, ఆ. 61; విష్ణు. పు. 2, ఆ: చూ, సూడు.1; 2. తాలిమిలేమి; ప్రభా. 3, ఆ. 42: ఓర్వమి; 3. కోపము: చూ, రోషము.

కాంతి. సం. వి. ఇ. స్త్రీ. 1. జిగి: చూ, వెలుతురు. 1; 2. కోరిక: చూ, వాంఛ; 3. రేణుకయను గంధద్రవ్యము: చూ, రాజాగ్వము; పా. 4. ఒకానొకవృత్తము. ఇందొక్కొక్క పాదమునందు త, జ, జ, వ గణములు గలిగి తొమ్మిదింట యతిగల ఏకాదశచ్ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా.— "శాంతుల్ కరి సంఖ్యను। రాజిలఁగా, సంతోషముతోడఁద। బాలుముల్, చింతింపఁబడంబులఁ। జెందగమా, కాంతాహృదయేశ్వర। కాంతియుగుణ.": చూ, వృత్తము. 1; అం. 5. కావ్యగుణములు పదింటిలో నొకటి: చూ, కావ్యగుణములు; 6. రసభావాదులలోని

గుణములు ఇరువదినాలుగింటిలో నొకటి: చూ, గుణములు.

**కాంతికుఁడు.** సం. వి. అ. పుం. ఈఁటె ఆయుధముగా గలవాఁడు: చూ, ఈఁటెకాఁడు.

**కాంతిద.** సం. వి. ఆ. స్త్రీ. కారుగచ్చ*: చూ. సోమరాజి.

**కాంతిదము.** సం. వి. అ. న. పిత్తరోగము: చూ, పిత్తము.

**కాంతిదాయకము.** సం. వి. అ. న. అంకపీకి *: చూ. మ్రానిపసుపు.

**కాంతిమతి.** సం. వి. ఈ. స్త్రీ. అలకాపట్టణము: చూ, దేశము.

**కాంతిరజము.** సం. వి. స్. న. కుంకుమము: చూ, వహ్నిశిఖము. 1.

**కాంతీడితుఁడు.** సం. వి. అ. పుం. కాంతిచేత స్తోత్రము చేయఁబడ్డవాఁడు.

**కాంతుఁడు.** సం. వి. అ. పుం. 1. మగఁడు: చూ, భర్త. 1; 2. అధిపతి: చూ, ప్రభువు. 2; విణ. 3. అందగాఁడు: చూ, సౌందర్యవంతుఁడు.

**కాందవము.** సం. వి. అ. పుం. అట్టు: చూ, భక్ష్యము. (భూరిరంధ్రము)

**కాందవికుఁడు.** సం. విణ. పిండివంటలు చేయువాఁడు, కాందుకుఁడు: చూ, వంటవాఁడు.

**కాందారి.** దే. వి. రూ- కాందారిమాందారి - కాఁదారి- కాఁదారిమాఁదారి- కాం దారిప్రొద్దు. అద్దుమరేయి: చూ, ర

**కాందారిమాందారి.** దే. వి. —పై.—

**కాందారిమాందారిప్రొద్దు.** దే. వి. —పై.—

**కాందిగ్భూతుఁడు.** సం. విణ. భయముచేత పాఱిపోయినవాఁడు: చూ, భయద్రుతుఁడు.

**కాందిశీకుఁడు.** సం. విణ. —పై.—

**కాందుకుఁడు.** సం. విణ: చూ, కాందవికుఁడు.

**కాంపిలము.** సం వి. అ. పుం. బ్రహ్మదత్తుఁడను వాఁడు ఏలుచున్న పట్టణము. (ఇతఁడు కుశబ్రహ్మయొక్క కొడుకైన కుశనాభుని నూఱుగురు కూఁతుండ్రకు పెనిమిటి; విశ్వామిత్రుని మేనత్తలకు మగఁడు): చూ, దేశము.

**కాంపిల్యము.** సం. వి. అ. పుం. 1: చూ, కంపిల్లము *; 2. గుడారోచనియను సుగంధద్రవ్యము: చూ, రాజార్హము.

**కాంపిల్లక.** సం. వి. ఆ. స్త్రీ. గుడారోచనియను సుగంధద్రవ్యము: చూ, రాజార్హము.

**కాంపిల్లము.** సం. వి. అ. పుం. —పై.—

**కాంపీలకము.** సం. వి. అ. పుం. —పై.—

**కాంపీలము.** సం. వి. అ. పుం. —పై.—

**కాంపీల్యము.** సం. వి. అ. పుం: చూ, కాంపిలము.

**కాంపొండువడ్డి.** మి. వి. వడ్డీకివడ్డి, చక్రవడ్డి.

**కాంబలము.** సం. విణ. కంబళిచేతఁ గప్పఁబడినది (రథము): చూ, శకటము. 1. (రూ- కాంబళము.)

**కాంబళము.** సం. విణ. —పై.—

**కాంబవకము.** సం. వి. అ. న. శంఖారావము: చూ, స్వరము. 2.

**కాంబవికుఁడు.** సం. వి. అ. పుం. సంకుపూసలు లోనగునవి చేసి యమ్మెడువాఁడు: చూ, శాంఖికుఁడు.

**కాంబుక.** సం. ని. ఆ. స్త్రీ. శ్వగంధ *: చూ, [illegible]

[illegible] వి. సస్యవిశేషము: చూ, [illegible]. 1.

**కాంభోజము.** సం. వి. అ. పుం. 1. కంభోజమను దేశము, దేశములుఏఁబదియాఱింటిలో నొకటి: చూ, దేశము; 2. కాంభోజదేశపు గుఱ్ఱము: చూ, హయము; 3. కాంభోజదేశపు ఏనుఁగు: చూ, హస్తి; 4. కంభోజము, శంఖములలో

శ్రీవృక్షము: చూ, సంకు. 1; 5. తెల్లచేండ్రి, కదరము*: చూ, వెలిచేండ్రి; 6. పున్నాగ ము*: చూ, పొన్న.

కాంభోజి. సం. వి. ఈ. స్త్రీ. 1. కారుమినుము*: చూ, మినుము; 2. తెల్లచేండ్రి*: చూ, వెలిచేండ్రి; 3. బండిగురి[illegible] చూ, తులాబీజము: 4. [illegible] ము: చూ, స్నా[illegible]ము. 2; 5. [illegible]ంగుడు* చూ, వాతంగిని; [illegible]. కకుజభాషలు ఏడిటిలో నొకటి: చూ, కకుజభాషలు; 7. మాళవకైశికిజవిభాషలు రెండింటిలో నొకటి: చూ, మాళవకైశికిజవిభాషలు. (చూ, భాష. 1.)

కాంభోజిక. సం. వి. అ. స్త్రీ. నల్లదింటెన*: చూ, విష్ణుకాంత.

కాంభోజీ కృష్ణరక్తకము. సం. వి.అ. పుం. గురివెంద*: చూ, తులాబీజము.

కాంసీయము సం. వి. అ. న. కంచు: చూ, లోహము. 1.

కాంస్యకారుఁడు. సం. వి. అ. పుం.=కంచెరి: చూ, స్వర్ణకారుఁడు.

కాంస్యతాళము. సం. వి. అ. పుం. 1. చిటితాళము: చూ, వీణె; అం. 2. వాద్యములు నాలుగింటిలో నొకటి: చూ, వాద్యములు. (కాంస్యతాళాదులు ఘనములు.); 3. ఘనవాద్యములు ఆఱింటిలో నొకటి: చూ, ఘనవాద్యములు.

కాంస్యనీలము. సం. వి. అ. పుం. అంజనవిశేషము: చూ, రసాంజనము.

కాంస్యము. సం. వి. అ. న. 1.=కంచు: చూ, లోహము. 1; 2. బంగారు వెండి లోనగువానిచేఁ జేయఁబడి త్రాగుట కుపయోగపడు పాత్రము: చూ, పాత్రము. 6; 3. కంచుగిన్నె: చూ, పాత్రము. 6; 4.ఝల్లరి. హుడుక్క: చూ, వీణె (పెద్దడోలువంటి వాద్యవిశేషమని కొందఱు.)

కాఁక. దే వి. (రూ-కాఁగుడు- క్రాఁక-క్రాఁగుడు.) 1, జ్వరము; చూ, రోగము. 1; 2. తాపము: చూ, సంతాపము; 3. తపస్సు; [illegible] ?, ఆ. 46: చూ, తపము; 4. కోపము; [illegible] ఆ. 64: [illegible], రోషము; విణ. [illegible]: చూ, ఘుడి. 4. “కాఁక పె[illegible]” మొ,

కాఁక[illegible]. వై. వి.=కాంచి వేళ్లు*: చూ, సుమవి.1, (కాఁకర,బీఱ,దోస,పొట్ల,చిక్కుడు మొదలగు తీఁగల మూలము అవునేతితో తడిపి పాదులను ముల్లులేని కంప సంధానముచేయు నిరంతరము ఫలించును. ఈపాదుల మూలమందును ముక్కుచీమిడి నాలుకగీచిన యుమ్మివేసి తడిపినను, పాలతో తడిపినను గసయుక్తములయినవియును మనోహరములయినవియును ఫలించును.) చూ, ఉపవిద్యలు: (మహావిద్యలు పదునెనిమిదింటిలో నెనిమిదవదగు ఆయుర్వేదమునందలి దోహదశాస్త్రములోఁ జెప్పఁబడియున్నది): చూ, దోహదశాస్త్రము.

కాఁకరవత్తి. వై. వి. బాణసంచు విశేషము: చూ, బాణసంచు.

కాఁకవెలుఁగు. దే. వి. ఉష్ణరశ్మి; రామా. 3, ఆ. 52: చూ, సూర్యుఁడు.

కాఁగ. దే.క్రి. హేత్వర్థకము: చూ, హేతువు.

కాఁగు. దే. వి. (రూ-క్రాఁగు) 1. పెద్దబాన: చూ, పాత్రము. 6; అ. క్రి. 2. తపించు: చూ, సంతాపించు; 3. కోపపడు: చూ, రోషించు.

కాఁగుడు. దే. వి. రూ-క్రాఁగుడు. తపనము: చూ, సంతాపము.

కాఁచెర. వై. వి.=కొళవార. (రూ-కాఁచెర-

కాసర*; అం, భా. ద్వి. వ. 70: చూ, బుడ్డ బుడుసర.

కాఁచి. వై. వి. = కాకమాచి. నల్లబుడుసర*: చూ, వాయసి.

కాఁచు. దే. వి. 1. కవిరి: చూ, గంగ దము; స. క్రి. 2. కాఁగఁజేయు: రూ-కాఁగుచు.

కాఁచుపడియము. ద్వి. వి. కవిరిగుండ: చూ, దంగ డము.

కాఁజేయు. దే. స. క్రి. అగునట్లుఁజేయు: కావించు.

కాఁజీర. వై. వి.=కాళహార*: చూ, కాఁచీర.

కాఁడ. వై. వి. 1.=కాండః. తామరతూఁడు: చూ, బిసము. 1; 2.= కాండః: అసల యీనె: చూ, పర్వరీణము; 3. తొడిమ: చూ, వృంతము; 4. కూరాకు లోనగువాని కాఁడ: కామ.

కాఁడి. దే. వి. 1. కడుగు: చూ, శుక్తము. 1; 2. ఎద్దు మొదలగువాని మెడమీఁదనుంచెడి బండి లోనగువాని యుగము; భార. విరా.5, ఆ. 58: చూ, యుగము. 5.

కాఁడిగట్టు. ద్వి. వి. ఒక్కొరొకరి నేలలకు హద్దుగా నేర్పఱచిన కట్టు: చూ, సీమ. 1.

కాఁడు. దే అప. 1. ఒకానొక పుంప్రత్యయము. "సొగసుకాఁడు, వన్నెకాఁడు." మొ; అ.క్రి. 2.నాటు; జై. 6, ఆ. 85; పాండు.4, ఆ. 48: చూ, మొలవేయు.

కాఁదారి. దే. వి: చూ, రూ-కాందారి; భీ. 1, ఆ. 112.

కాఁదారిమాఁదారి. దే. వి. —వై.—; య.2, ఆ. 88.

కాఁదారిమాఁదారిపాద్దు. ద్వి. వి. —వై.—

కాఁపడము. దే. వి. నొప్పి కలిగినచోట వేఁడి వస్తువులతో నొత్తుట.

కాఁపత. దే. వి. శూద్రస్త్రీ: చూ, స్త్రీ.

కాఁపది, దే. వి. —వై.—

కాఁపు. దే. వి. 1. గేస్తుఁడు. స్వా. 1, ఆ.66: చూ, యజమానుఁడు; 2. పంటపెట్టువాఁడు; భార. సా. 1, ఆ. 81: చూ, హాలికుఁడు; 3. కాలిపుట్టువు; భో. 4, ఆ. 59: చూ, శూద్రుఁడు; 4. కాఁపురము; ఆము. 1,ఆ.10: చూ, విడిమట్టు; వా. 5. చదరంగపు ఎత్తు. "మంచి కాఁపుకాఁచి జంతువును నడపి నాఁడు.": చూ, ఎత్తు. 6.

కాఁపుది. వా: చూ, రూ-కాఁపది.

కాఁపురము. దే. వి. 1. నివాసము: చూ, విడి పట్టు; 2. కుటుంబము; అచ్చ.బాల,కాం.11: చూ, సంసారము. 1.

కాఁపురించు. దే. అ. క్రి. కాఁపురముచేయు: చూ, వసించు.

కాఁపులకల్లను నోముపంట. వా. కాఁపులకు జయప్రదము. "ఒప్పు గాఁపులకల్ల నోము పంట." రసికజన మనోరంజనము.

కాఁబట్టి. దే. అవ్య. (కాఁగా+పట్టి.) హేత్వ ర్థకము: చూ, హేతువు.

కాఁబట్టు. దే.అ. క్రి. (కాఁగా+పట్టు.)కావలసి యుండు. "అది నాకు కాఁబట్టును." "కాఁబ ట్టని కాఁపురము"

కాఁబడు. దే. అ. క్రి (కాఁగా+పడు) ఒప్పిద మగు. "చెలిమికాఁబడుఁగాకటు మాటలాడి నగా." జై. 2, ఆ 61 (స్వార్థమునపడు): చూ, రచించు.

కాఁబోలు. దే.క్రి.(కాఁగా+పోలు).కాఁబోలు.

కాక. సం. వి. ఆ. స్త్రీ. 1. కాఁచి*: చూ, వాయసి; 2. కాకిదొండ*: చూ, దొండ; 3. కాయకొల్లి*: , సోలి; 4.కుక్కు—: చూ, వా మేడి*: చూ, బొమ్మమేడి; 5. కాకజంఘ*: చూ,వెలుసుపంది;దే.అవ్య.(1)అతిరాద్యర్థకము.

"అట్టులకాక. ఉండెమ:గాక." :చూ, దీవన; (2) తక్కనను నర్థమును తెలుపును:చూ.వినా; (3) ఉత్తార్థకము; (4) ఇంతే కొవుండ: చూ, మఱియు.

కాకకంగువు. సం. వి. ఉ. స్త్రీ. చీనకమను ధాన్యము: చూ, ధాన్యము.

కాకకల. సం. వి. ఆ. స్త్రీ. కాకజంఘ*: చూ, వెలమసంది.

కాకకుష్ఠము. సం. వి. అ. న. రూ-కాల కుష్ఠము: చూ, రాజావర్గము.

కాకకృష్ణ. సం. వి. ఆ. స్త్రీ. కంకుష్ఠము *: చూ, స్వర్ణక్షీరిణి.

కాకగతి. అం. పురుషలక్షణాంగములలోని గతి యందలి విశేషము (కాకగతి సుఖకరము): చూ, గతి. (చూ, లక్షణాంగములు.)

కాకగుడము. సం. వి. అ. పుం. తిలలు (బ.): చూ, నువ్వులు.

కాకఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. నిప్పువన్నె గుత్తు లకొనుగు*: చూ, కాదఘ్నము.

కాకచించ. సం. వి. ఆ. స్త్రీ. గురిజే *: చూ, తులాబీజము.

కాకచించి. సం. వి. ఈ. స్త్రీ. —వై.—

కాకచించిక. సం. వి. ఆ. స్త్రీ. —వై.—

కాకచ్ఛదము. సం. వి. అ. పుం. మందపిచ్చుక: చూ, పిచ్చుక.

కాకచ్ఛది. సం. వి. ఇ. పుం. —వై.—

కాకజంఘ. సం. వి. ఆ. స్త్రీ. 1. కాకకల *: చూ, వెలమసంది; 2. కాకిదొండ *: చూ, దొండ; 3. గురిజే*: చూ, తులాబీజము.

కాకజంఘులు. అం. పురుషలక్షణాంగములలోని జంఘల (పిక్కలు) యందలి విశేషము. (కాకజంఘులైన రాజగు): చూ, లక్షణాంగములు.

కాకజంబుక. సం. వి. ఆ. స్త్రీ. నేలనేరేడు *: చూ, నేరేడు.

కాకజంబువు. సం. వి. ఉ. స్త్రీ. —వై.—

కాకణంతి. సం. వి. ఈ. స్త్రీ. గురిజే *: చూ, తులాబీజము.

కాకణంతిక. సం. వి. ఆ. స్త్రీ. —వై.—

కాకణము. సం. వి. అ. న. కుష్ఠభేదము: రూ, మండలము. 3.

కాకణి. సం. వి.ఈ. స్త్రీ. 1.=కాణి. నాలుగు మినపగింజలయెత్తు; 2. ఇరువది గవ్వలు; 3. ఒకగవ్వ; 4. ఒకగజములో నాలవవంతు; 5. ఒక అణాలో నాలవవంతు: చూ, నుద్దు; 6. పండ్రెండు అణాలయెత్తు:కాకిణి -రూ- కాకిని

కాకతాళన్యాయము. } పా. కాకివ్రాలఁగానే
కాకతాళీయము. } అప్రయత్నముగ తాటి పండు పడిన రీతి.

కాకతిందుకము. సం. వి. అ.పుం. కాకితుమికి*: చూ, తుమికి.

కాకతిక్త. సం. వి. ఆ. స్త్రీ. బండిగురివెంద*: చూ, తులాబీజము.

కాకతుండకము. సం. వి. అ. పుం. కమ్మరవాని కొలు: చూ, సందంశకము.

కాకతుండఫల. సం. వి.ఆ. స్త్రీ. కాకిదొండ*: చూ, దొండ.

కాకతుండము. సం. వి. అ. పుం. 1. అగలు: చూ, రాజావర్గము; 2. కాహళమను వాద్య ము: చూ, వీణె; 3. ఒకరకము బాణము: చూ, బాణము. 1.

కాకతుండి. సం. వి. ఈ. స్త్రీ. 1. గురుజే *: చూ, సప్తల; 2. హొన్నిత్తడి: చూ, లోహము. 1.

కాకతుండిక. సం. వి. ఆ. స్త్రీ. 1. గురిజే *:

చూ, తులాబీజము; 2. బండిగురివెంద*: చూ, తులాబీజము.

కాకతో్రిటిబింబన్యాయము. పా. కాకిముక్కున దొండపండుకట్టిన విధము.

కాకదంతపరీక్ష. జా. వ్యర్థవ్యాపారము. కాకికి దంతములుండవు కావున నవి పరీక్షించుట వ్యర్థపని. "సీ. వానినేమడిగెదెవ్వఁడు గాక నీకేమి, యిది కాకదంతపరీక్షసుమ్ము." (కళాపూర్ణోదయము)

కాకదక్షు. సం. వి. అ. స్త్రీ. గురిజె *: చూ, తులాబీజము.

కాకధాతువు. సం. వి. ఉ. పుం. కామంచి *: చూ, తృణము. 1.

కాకధ్వజము. సం. వి. అ. పుం. బడబాగ్ని: చూ, నిప్పు.

కాకధ్వని. సం. వి. ఇ. పుం. కాకికూఁత: చూ, స్వరము. 2.

కాకనచి. సం. వి. ఈ. స్త్రీ. గురిజె *: చూ, తులాబీజము.

కాకనామము. సం. వి. న్. పుం. శ్రీవల్లి *: చూ, బకపుష్పము.

కాకనాస. సం. వి. ఆ. స్త్రీ. కాకిదొండ *: చూ, దొండ.

కాకనాసము. సం. వి. అ. పుం: చూ, వికంటకము *.

కాకనాసిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కాకిదొండ*: చూ, దొండ; 2. కాకచించ*: చూ, తులాబీజము.

కాకపక్షము. సం. వి. అ. పుం. 1. పిల్లజుట్టు: చూ, సిగ. 4; 2. జొనపము: చూ, సిగ. 4; 3. నీరుతుమికి *: చూ, తుమికి.

కాకపదము. సం. వి. అ. పుం. 1. అడ్డముగాను పొడవుగాను ఉండుగీఱలను వజ్రదోషము: చూ, రత్నము. 1; 2. రతిబంధవిశేషము: చూ, రతిబంధము.

కాకపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. పిల్లపెసర*: చూ, పెసర.

కాకపాణి. సం. వి. ఇ. పుం. ముత్తెముయొక్క నల్లనికాంతిదోషము: చూ, ముత్తెము.

కాకపాదము. సం. వి. అ. పుం. 1. అగ్నివృక్షము: చూ, రేఁగు. 1; 2. తాళప్రాణాంగభేదము: చూ, తాళము. 2; అం. 3. తాళాంగములు ఆఱింటిలో నొకటి: (చూ, తాళాంగములు): చూ, అంగప్రాణములు.

కాకపి. సం. వి. ఇ. పుం. కాకపియనుపాము: చూ, సర్పము.

కాకపిండి. సం. వి. ఈ. స్త్రీ. వెలిచె *: చూ, పిండీతకము.

కాకపికన్యాయము. పా. కోవెల కాకులలోఁ బెరిగియుఁ దుదకు వేఱుగఁబోవువిధము.

కాకపిత్త. సం. వి. ఆ. స్త్రీ. కాకతుండి *: చూ, సప్తల.

కాకపీలి. సం. వి. ఈ. స్త్రీ. గురిజె *: చూ, తులాబీజము.

కాకపీలుకము. సం. వి. అ. పుం. కాకితుమ్మికి*: చూ, తుమికి.

కాకపీలువు. సం. వి. ఉ. స్త్రీ. 1. గురిజె *: చూ, తులాబీజము; 2. కాకితుమ్మికి *: చూ, తుమికి; 3. కాకతుండి *: చూ, సప్తల.

కాకపుచ్ఛము. సం. వి. అ. పుం. కోయిల: చూ, పికము.

కాకపుష్టము. సం. వి. అ. పుం.—పై.—

కాకపుష్పము. సం. వి. అ. న. స్థౌణేయము *: చూ, మాచిపత్రి.

కాకఫలము. సం. వి. అ. పుం. నింబ *: చూ, నిమ్మ.

కాకఫలి. సం. వి. ఈ. స్త్రీ. కారముగలిగి పుల్ల గానుండు నిమ్మపండు: చూ, నిమ్మ.

కాకభంజి. సం. వి. ఈ. స్త్రీ. గురుగు *: చూ, సప్తల.

కాకభాండి. సం. వి. ఈ. స్త్రీ. మహాకరంజము *: చూ, శాదఘ్నము.

కాకభీరువు. సం. వి. ఉ. పుం. గుడ్లగూబ: చూ, సకినంపుఁబులుఁగు.

కాకమద్గువు. సం. వి. ఉ. పుం. కూకురుగుండంగి: చూ, దాత్యూహము.

కాకమర్దకము. సం. వి. అ. పుం. ముసిణి *: చూ, ముసిఁడి.

కాకమర్దము. సం. వి. అ. పుం. —పై.—

కాకమల్లి. సం. వి. ఈ. స్త్రీ. అడవిమల్లె *: చూ, మల్లె.

కాకమాచి. సం. వి. అ. స్త్రీ. = కామంచి-కాచి *: చూ, వాయసి.

కాకమాచిక. సం. వి. అ. స్త్రీ. —పై.—

కాకమాత. సం. వి. అ. స్త్రీ. —పై.—

కాకమాలి. సం. వి. ఈ. స్త్రీ. కామంచి *: చూ, తృణము. 1.

కాకము. సం. వి. అ. న. 1. కాకులగుంపు: చూ, వాయసము. 1; 2. రతిబంధవిశేషము: చూ, రతిబంధము; పుం. 3.= కాకి: చూ, వాయసము. 1; 4. కొండగోఁగు *: చూ, పీతపుష్పము; విణ 5. అల్పము: చూ, స్వల్పము.

కాకముద్గ. సం. వి. అ. స్త్రీ. కాకిపెసర *: చూ, పెసర.

కాకమూచి. సం. వి. ఈ. స్త్రీ. కామంచి *: చూ, తృణము. 1.

కాకయవము. సం. వి. అ. పుం. గింజపట్టని ధాన్యము: చూ, ధాన్యము.

కాకరక్త. సం. వి. అ. స్త్రీ. గురిజె *: చూ, తులాబీజము.

కాకరుకము. సం. వి. అ. పుం. గుడ్లగూబ: చూ, సకినంపుఁబులుఁగు.

కాకరుకుఁడు. సం. వి. అ. పుం. మందుమాఁకులచేత అఁడుదానికి వశుఁడైనవాఁడు: చూ, స్త్రీవశీభూతుఁడు. (రూ-కాకరూకుఁడు.)

కాకరుతఫలము. (కాకికూఁతకు ఫలము.) పా. తూర్పు మొదలు ఈశాన్యమువఱకు యెనిమిది దిక్కులయందు కాకులు సూర్యోదయము మొదలు అస్తమయము వఱకు నొక్కొక్క దినమందు 3½- గడియ చొప్పున గుంపులు గూడి కూయుచున్నవై ప్రయాణాదులకుఁ బోవువారికి దిక్కులానురూపఫలములఁ గలుగఁజేయుఁగాన ఉదయానంతరము 3½-గడియవఱకు తూర్పున నుండె నేని ప్రయాణకర్తకు లాభమును 3½ - గడియకు పిమ్మట 3½- గడియ వఱకు ఆగ్నేయంబున నుండె నేని శత్రునాశమును దక్షిణంబున నుండె నేని బంధులాభమును, నైరృతిదిక్కున నుండె నేని ధనమును, పశ్చిమంబున వర్షంబును, వాయువ్యమున సర్వమును, ఉదగ్దిక్కున నుండె నేని ప్రాణహానియు, ఈశాన్యంబున నుండె నేని యల్పభయమును నీక్రమంబున ఫలముల నిచ్చునవియు, కాకమైథున దర్శనమయ్యె నేని తప్పక వ్యాధికరంబగుననియు తెలియవలెను; కాలామృతము. 211 శ్లో.

కాకరుతభీరున్యాయము. పా. పగలు కాకికూఁత విని జడిసి పెనిమిటినిఁ గౌఁగిలించుకొను వెలఁదిరాత్రి నర్మదానదిదాఁటి వెళ్లినరీతి.

కాకరుహ. సం. వి. అ. స్త్రీ. బదనిక *: చూ, వదనిక.

కాకరుహము. సం. వి. అ. పుం. తిలలు: చూ, నువ్వులు.

కాకరూకము. సం. వి. అ. పుం. 1. గుడ్లగూబ: చూ, సకినంపుఁబులుఁగు; 2. అపదేశము: చూ, వ్యాజము. 1.

కాకరూకుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, రూ-కాకరుకుఁడు; విణ. 2. అంగహీనమైనవాఁడు: చూ, దిగంబరుఁడు; 3. భయము కలవాఁడు: చూ, వెఱపరి; 4. పేదవాఁడు: చూ, బీదవాఁడు.

కాకరూటి. సం. వి. ఇ. పుం. సూకరము: చూ, పంది.

కాకలకము. సం. వి. అ. పుం. కుత్తుకయందు పైకిఁగనఁబడు బుడిపి: చూ, గొంతుముడి.

కాకలము. సం. వి. అ. పుం. 1. —పై.—; 2.=కాకితము: చూ, పటపత్రిము.

కాకలి. సం. వి. ఈ. స్త్రీ. సూక్ష్మమైన యవ్యక్తాక్షర మధురధ్వని: చూ, స్వరము 2.

కాకలీద్రాక్ష. సం. వి. ఆ. స్త్రీ. ఒకరకము ద్రాక్ష *: చూ, స్వాదుఫల.

కాకలీమూర్ఛన. అం. గాంధర్వవేదమున రాగాధ్యాయమునందలి అవాంతరభేదములు నాలుగింటిలో నొకటి: చూ, అవాంతరభేదములు.

కాకలీయుత. సం. వి. ఆ. స్త్రీ. సంగీతశాస్త్రములోని మూర్ఛాభేదము: చూ, స్వరము. 2.

కాకలీరవము. సం. వి. అ పుం. కోయిల: చూ, పికము.

కాకలూకము. సం. వి. అ. పుం. 1. గుడ్లగూబ: చూ, సకినంపుఁబులుఁగు; 2. దంభము: చూ, వ్యాజము. 1.

కాకలూకుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, కాకరుకుఁడు; విణ. 2. అంగహీనమైనవాఁడు: చూ, దిగంబరుఁడు; 3. భయపడువాఁడు: చూ, వెఱపరి; 4. పేదవాఁడు: చూ, బీదవాఁడు.

కాకల్యంతరమూర్ఛన. అం. గాంధర్వవేదమున రాగాధ్యాయమునందలి అవాంతరభేదములు నాలుగింటిలో నొకటి: చూ, అవాంతర భేదములు. (అనుబంధములో)

కాకల్యంతరయుక్త. సం. వి. జ్. స్త్రీ: చూ, కాకలీయుత.

కాకవంధ్య. సం. వి. ఆ. స్త్రీ. వంధ్యలు ఆఱింటిలో నొకటి: చూ, వంధ్యలు. (శబ్దార్థకల్పతరువులో 'ద్వాదశవర్షాపత్యస్త్రీయాం' అని కలదు.)

కాకవల్లరి. సం. వి. ఈ. స్త్రీ. ఎక్కుడుఁదీఁగ*: చూ, మానేరు.

కాకశీర్షము. సం. వి. అ. పుం. శ్రీవల్లి *: చూ, బకవృక్షము.

కాకశ్యామ. సం. వి. ఆ. స్త్రీ. నల్లతీఁగె, కృష్ణవల్లి*: చూ, సురలి.

కాకసత్వ. అం. కామశాస్త్రమునందలి ద్వాదశసత్వలలో నొకటి: చూ, ద్వాదశసత్వలు.

కాకసావర్తి. అం. అశ్వశాస్త్రములోని అశుభావర్తములలోనొకటి: చూ, అశుభావర్తములు.

కాకస్ఫూరము. సం. వి. అ. పుం: చూ, కాకమర్దకము *.

కాకస్త్రీ. సం. వి. ఈ. స్త్రీ. కాకఘ్ని *: చూ, నిప్పువన్ని గుత్తులకొనుగు.

కాకస్ఫూర్జము. సం వి. అ. పుం కాకితుమ్మికి *: చూ, తుమ్మికి.

కాకస్వాహ. సం. వి. ఆ. స్త్రీ. గురిజె *: చూ, తులాబీజము.

కాకాంగము. సం. వి. ఆ. స్త్రీ. సురపాది *: చూ, సురపాలి.

కాకాంగ. సం. వి. ఆ. స్త్రీ. కాకిదొండ *: చూ, దొండ.

కాకాంగి. సం. వి. ఈ. స్త్రీ.—పై.—

కాకాంచి. సం. వి. ఈ. స్త్రీ. —పై.—

కాకాండ. సం. వి. ఆ. స్త్రీ.ఒకానొకతీఁగె*: చూ, లత. 1.

కాకాండము. సం. వి. అ. పుం. 1.చెప్పుటట్ట*.

చూ, హంసపాది; 2. పెద్దవేము *: చూ, వేము; 3. కాకితుమ్మికి *: చూ, తుమ్మికి.

కాకాండి. సం. వి. ఈ. స్త్రీ. మహాజ్యోతిష్మతి *: చూ, మానేరు.

కాకాండోల. సం. వి. అ. స్త్రీ. —పై.—

కాకాండోలము. సం. వి. అ. పుం. మాషము*: చూ, మినుము.

కాకాంథము. సం. వి స. పుం. పెద్దవేము *: చూ, వేము.

కాకాకులము సం. విణ. కాకులచే వ్యాకులమైనది.

కాకాక్షిన్యాయము. పా. కాకిచూపువలె నేదే నొకపక్కి కొఱగునదనునది. (కాకికి ఒక కన్ను కనపడును, అదియటు పనికలిగిననటున్న కన్ను కొన్పించును) (దేహళీదీపన్యాయమిట్టిదే)

కాకాఖ్యము. సం. వి. అ. న. కాకికలువ *: చూ, పద్మము. 1.

కాకాదని. సం. వి. ఈ. స్త్రీ. 1. గురిజె *: చూ, తులాబీజము; 2. నల్లకప్పి *: చూ, లవణి; 3. పెద్దకాఁచి *: చూ, వాయసి.

కాకాను. దే. అవ్య. నఞర్థకము: చూ. లేదు. 2.

కాకామ్రము. సం. వి. అ. పుం. ఏఱువంగ *: చూ, వంగ.

కాకాయువు. సం. వి. ఉ. పుం. ఎక్కుడుఁదీఁగె *: చూ, మానేరు.

కాకారి. సం. వి. ఇ. పుం. గుడ్లగూబ: చూ, సకినంపుఁబులుఁగు.

కాకాలము. సం. వి. అ. పుం. బొంతకాకి: చూ, వాయసము. 1.

కాకాసురుఁడు. సం. వి అ. పుం. 1. జయంతుఁడు, ఇంద్రునికొడుకు: చూ, పుత్రుఁడు. 1; 2. కాకాసురుఁడను రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

కాకాహి. సం. వి. ఇ. పుం. కప్ప: చూ. మండూకము. 1.

కాకి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుకాకి: చూ, వాయసము. 1; 2. కాఁచి *: చూ, వాయసి; వై. వి. (1) = కాకము. కాకి: చూ, వాయసము. 1; విణ. (2) అల్పము. "కాకికఁబర." మొ: చూ, స్వల్పము.

కాకికలువ. వై. వి = కాకకైరవ అల్లిపువ్వు*: చూ, పద్మము. 1.

కాకికూఁత. ద్వ. వి. 1. కా, కాకియఱపు: చూ, స్వరము. 2. (కావుకావు అనివాడుక.); 2: చూ, కాకరుతఫలము.

కాకిచిప్ప. ద్వ. వి. నీటియందలి గుల్ల, శంబూక. "క. అక్కడలఁ గాకిచిప్పలు." య. 8, ఆ. 30: చూ, సంకు. 1.

కాకిచెఱకు. ద్వ. వి. తేజనకము, చెఱకువంటి తృణము*: చూ, తృణము. 1.

కాకిచావు. ద్వ. వి. అకస్మికమృత్యువు: చూ, మరణము.

కాకిణి. సం. వి. ఈ. స్త్రీ. 1.=కాణి. కర్షమునందు నాలవపాలు: చూ, గుడ్డు; 2. ఒకపలములో నాలవపాలు: చూ, కాకణి. 6; 3. గవ్వ: చూ, వరాటము; 4. కొలిచెడుకోల; 5. తూనికభాగము; 6 ఎఱ్ఱగురిజె *: చూ, తులాబీజము.

కాకిణీద్వయము. సం. వి. అ. న: చూ, అరవీరసము.

కాకితము. వై. వి.=కాకలము, చూ, పట్టపత్రము. (మూ-కాకిదము- కాగితము- కాగిదము.)

కాకితీపు. దే. వి. మూర్ఛవిశేషము: చూ, మూర్ఛ.

కాకితుమ్మికి. ద్వ. వి. నల్లతుమికి *: చూ, తుమికి.

**కాకిదము.** వై. వి.= కాకలము: చూ. కాకితము. (వా)

**కాకిదొండ.** వై. వి.= కాకతుండఫల, అడవిదొండ*: చూ, దొండ.

**కాకిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకఅణాలో నాలవవంతు, కాని: చూ, దుడ్డు; 2. ఒకపలములో నాలవపాలు: చూ, కాకిణి. 6; 3. గవ్వ: చూ, వరాటము. (రూ-కాకిణి.)

**కాకినేరెడు.** ద్వ. వి. కాకజంబువు, నేలనేరేడు*: చూ, నేరేడు. (రూ-కాకినేరేడు.)

**కాకిపిల్ల కాకికిముద్దు.** లో. ఎవనిపిల్లయందు వానికి ప్రేమ.

**కాకిపెసర.** ద్వ. వి. కాకముద్గ, పిల్లపెసర *: చూ, పెసర.

**కాకిబంగారము.** ద్వ. వి. సీతాభ్రకము: చూ, బేగడ.

**కాకిబాతు.** ద్వ. వి. ఒకవిధమైన అడవిబాతు: చూ, శరారి.

**కాకిమేడి.** ద్వ. వి. బమ్మమేడి *: చూ, బొమ్మమేడి.

**కాకిరొక్కలు.** ద్వ. వి. బ. ఒకరకము వడ్లు: చూ, ధాన్యము.

**కాకిరెల్లు.** ద్వ. వి. కాకిచెఱకు* (దీని పుల్లలను చివ్వి వ్రాయుదురు): చూ, తృణము. 1.

**కాకిలము.** సం. వి. అ. పుం. కంఠమణి: చూ, గొంతుముడి.

**కాకివన్నె.** ద్వ. వి. కాకివన్నెగల పందెపు కోడిపుంజు (వా): చూ, పుంజు.

**కాకివెదురు.** ద్వ. వి. గుందము (గుందము = కాకిచెఱకు) *: చూ, శరము.

**కాకిసొమ్ము.** వై. వి: చూ, కాకితీపు.

**కాకు.** దే. వి. 1. గాసి; రామా. 6, ఆ. 25: చూ, శ్రమము. 1; 2. తిరస్కారము; కాశీ.ఖ, ఆ. 88: చూ, వహేళనము; విరా. 3. పొల్లు: చూ, వ్యర్థము; 4. ఉక్కిరి: చూ, శూన్యము. 1.

**కాకుడు.** సం. వి. అ. పుం. పిచ్చుకకుంటు: చూ, నూరనూతుడు.

**కాకుత్స్థుడు.** సం. వి. అ. పుం. శ్రీరాముడు: చూ, రాముడు.

**కాకుదము.** సం. వి. అ. న. తాలువు: చూ, దవుడ.

**కాకున్నె.** దే. అవ్య. (కాక + ఉన్నె) నిశ్చయార్థకము; భార. అర. 2, ఆ. 165: చూ, నిశ్చయము.

**కాకువు.** (కాకుస్వరము.) సం. వి. ఉ. స్త్రీ. శోకభయాదులచే గలిగెడు ధ్వనివికారము: చూ, స్వరము. 2.

**కాకృత్యము.** సం. వి. అ. న. 1. కూడనిపని: చూ, వ్యలీకము; 2. వగపు: చూ, పశ్చాత్తాపము.

**కాకేందువు.** సం. వి. ఉ. పుం. కాకితుమ్మికి*: చూ, తుమికి.

**కాకేక్షువు.** సం. వి. ఉ. పుం. 1. కత్తి: చూ, రిష్టి. 2: 2. కాకిచెఱకు; రెల్లు (శ. ర) *: చూ, తృణము. 1.

**కాకేమి.** దే. అవ్య. (కాక + ఏమి) మఱియొకదానిలేమిని తెలుపును; "వ. అశుచిభావంబునంగాకేమి యప్పరమపతివ్రతమదీయదృష్టిగోచరగాకున్నదయ్యె." (అశుచిభావంబునంగాకేమి= అశుచిభావముననేయనుట.) భార. ఆది. 1, ఆ. 98: చూ, అ. (1)

**కాకేష్టము.** సం. వి. అ. పుం. నింబము *: చూ, వేము.

**కాకోచి.** సం. వి. ఈ. స్త్రీ. కాకోచియను చేప: చూ, మత్స్యము. 1.

**కాకోచికము.** సం. వి. అ. పుం. —పై.—

**కాకోటి.** సం. వి. ఈ. స్త్రీ. కావడి: చూ, భారయష్టి. (కావడిబద్ద)

కాకోడుంబరము. సం. వి. అ. పుం. బమ్మమేడి*: చూ, బొమ్మమేడి.

కాకోడుంబరిక. సం. వి. ఆ. స్త్రీ. —పై.—

కాకోత్పలము. సం. వి. అ. న. కాకికలువ*: చూ, పద్మము. 1.

కాకోదరము. సం. వి. అ. పుం. 1. పాము: చూ, సర్పము; 2. గుడ్లగూబ: చూ, సకినంపుంబులుఁగు; 3. శీఘ్రము: చూ, వేగము. 3; 4. కాకమర్దకము*: చూ, ముసిఁడి.

కాకోదుంబరిక. సం. వి. ఆ. స్త్రీ. బమ్మమేడి*: చూ, బొమ్మమేడి.

కాకోలము. సం. వి. అ. పుం, న. 1. ఎట్టిపాము విసము. (పుం. అని శ. క. తరువు): చూ, విసము. 1; పుం. 2. బొంతకాకి: చూ, వాయసము. 1; 3. రక్తవర్ణముగల యొకానొక పాము: చూ, సర్పము; అం. 4. నరకములు ఇరువదియొకటింటిలో నొకటి: చూ, నరకములు.

కాకోలి. సం. వి. ఈ. స్త్రీ. 1.= కారుకొల్లి*: చూ, వాయసోలి; 2. తేలుమణి*: చూ, వృశ్చికము. 2.

కాకోలుఁడు. సం. వి. అ. పుం. కుమ్మరి: చూ, చక్రి. 5.

కాక్షము. సం. వి. అ. పుం. 1. కడకన్ను: చూ, నేత్రము. 1; 2. మెల్లకన్ను: చూ, నేత్రము. 1.

కాక్షి. సం. వి. ఈ. స్త్రీ. 1. తొగరి: చూ, సురాష్ట్రజము. 1; 2. తొగరిమన్ను: చూ, సురాష్ట్రజము. 2; 3. అడవితొగరి తీఁగె: చూ, సురాష్ట్రజము. 3.

కాక్షీవకము. సం. వి. అ. పుం. మునగ*: చూ, శిగ్రువు. 1.

కాక్షీవము. సం. వి. అ. పుం. —పై.—

కాగడ. దే. వి. (కాఁగు + గడ): చూ, రూ- కాగడా. (వా)

కాగడా. దే. వి. (కాఁగు + గడ) కొయ్యకేక గుడ్డతోనే యేర్పఱచిన చేతిదివ్వటి. "జగతీ జ్యోతులు కాగడాలు." హంస. 3, అ. 28: చూ, దివిటి.

కాగిరము. అం. ముప్పదిరెండు ఆయుధములలో నొకటి: చూ, బాణము. 1.

కాగిలము. సం. వి. అ. పుం. కాకితము: చూ, పటుపత్రము.

కాగారము. సం. వి. అ. పుం. 1. చెడ్డ ఇల్లు: చూ, గృహము. 1; 2. గాలి ఇల్లు: చూ, గృహము. 1. (ఇట్టిపదములు పెక్కు-లూహ్యంబులు.)

కాగిత పుఅట్టు. ద్వ. వి: చూ, అట్టు. 4.

కాగితము. దై. వి.= కాకిలః: చూ, పటుపత్రము (రూ- కాకిదము)

కాగిస. దే. వి. ఒకగని ముచేఁప: చూ, నుత్యము. 1.

కాఘృణి. సం. వి. ఈ. స్త్రీ. మంట: చూ, నిప్పు. (ఇట్టిపదము లూహ్యంబులు)

కాచకుంభదీపన్యాయము. పా. లాంతరులోని దీపము ఎంతగాలి వేసినను కదలకుండువిధము.

కాచనికము. సం. వి. అ. న. పండ్లముత్తికి: చూ, పండ్లపాఁచి.

కాచపాత్రము. సం. వి. అ. న. గాజుగిన్నె: చూ, పాత్రము. 6.

కాచభాజనము. సం. వి. అ. న. —పై.—

కాచమలము. సం. వి. అ. న. గాజుప్పు: చూ, లవణము. 1.

కాచము. సం. వి. అ. న, పుం. 1. —పై.—; 2.= గాజు. గాజుమన్ను: చూ, భూమి. 1; 3. గాజుపూస: చూ, పూస; 4. కావడి మట్టు: చూ, శిక్యము. 2; 5. కంటిరెప్పలు: చూ, బిడాలము. 2; 6. దుగ్గానిలో నాలవ భాగము; దుగ్గానిలో పదియవభాగము (అని కొందఱు) (దుగ్గాని = రెండుదమ్మిడీలు.

టంకమునకు పదియారుడబ్బులుకనుక ఆలెక్క ప్రకారము ఇక్కడ కానియనఁగా దమ్మిడి) "శ్లో. కాచాయనీచం కమనీయవాచా, ... ప్రతే కుచేలే శ్రితమాకుచేలే." : (తె. ప):— కాసు.

కాచలవణము. సం. వి. అ. న. 1: చూ, కాచమలము; అం. 2. క్షారములు అయిదింటిలో నొకటి: చూ, క్షారములు.

కాచలవణశుద్ధి. పా. ఇది చింతాకురసమున తడిపి యెండబెట్టిన శుద్ధి.

కాచసంభవము. సం. వి. అ. న: చూ, కాచలవణము.

కాచస్థాలి. సం. వి. ఈ. స్త్రీ. పాటల*: చూ, స్థాలి. 2. (రూ-కాలస్థాలి)

కాచహారిణి. సం. వి. ఈ. స్త్రీ. నల్లయుప్పి *: చూ, లవణి.

కాచిఘము. సం. వి. అ. పుం. 1. బంగారు: చూ, లోహము. 1; 2. ఎలుక: చూ, మూషికము.

కాచిఘుఁడు. సం. వి. అ. పుం. తండ్రిలేనివాఁడు.

కాచితము. సం. విణ. కావడి యుట్టియందుంచఁబడిన బిందె కుండలోనగునది: చూ, శిక్యితము.

కాచిమము. సం. వి. అ. పుం: చూ, దేవకులోద్యానము *.

కాచివాచిని. సం. వి. ఈ. స్త్రీ. పొట్టిగుమ్మడి*: చూ, మహాఫలము.

కాచు. దే. అ. క్రి. 1. (కాయ) కాచు; 2. (ఎండ) కాయు; అచ్చ. అర. కాం. 42; స. క్రి. 3. బాధలు తొలఁగించి రక్షించు. "మముం గావుము ప్రోవుము." హరి. పూ. 7, అ: చూ, రక్షించు; 4. ఎదురుచూచు: చూ, ప్రతీక్షించు; 5 ఓర్చు; భార. ఉద్యో. 3. అ. 114: చూ, సహించు; 6. చూచు: చూ, వీక్షించు.

కాచుట. దే. వి: చూ, అపేక్ష. 2.

కాచుమేపరి. దే. వి. మాంసముతినువాఁడు: చూ, మాంసాహారి.

కాచువాఁడు. దే. వి: చూ, రక్షకుఁడు.

కాజి. దే. వి. 1. ఒకరకముచెట్టు; "వెలితమ్మి కాజిపువ్వులు ముడుంగ." పా. 2, అ. 50: చూ, వృక్షము; 2. మహమ్మదీయులఆచారి.

కాటకము. దే. వి. కఱవు: చూ, దుర్భిక్షము.

కాటపాలెబ్రాహ్మణులు. పా. కర్ణూరియు బ్రాహ్మణులలో నొకతెగవారు: చూ, బ్రాహ్మణులు.

కాటవము. సం. వి. అ. న: చూ, కటుత్వము.

కాటా. హి. వి. పెద్దత్రాసు; ధాన్యాదులు తూఁచు పెద్దతక్కెడ: చూ, త్రాసు.

కాటిక. సం. వి. ఆ. స్త్రీ. అడవి: చూ, విపినము.

కాటికాఁపరి. దే. వి. శ్మశానమందు కాఁచువాఁడు.

కాటికిఁగాళ్ళుచాఁచుట. జా. చావసిద్ధముగా నుండుట. "నేనిప్పుడు నిరాశ్రయ నాదరణ నువృద్ధ కాటికిఁగాళ్లుసాఁచుకొనియుంటిని." (నీతిచంద్రిక-విగ్రహము)

కాటిగాఁడు. దే. వి. ఒకరకము పక్షి: చూ, పక్షి.

కాటిపాపఁడు. దే. వి. (కాడు + పాపఁడు) గోపాలకుఁడు: చూ, మహాశూద్రుఁడు.

కాటిపాపలవాండ్రు. దే. వి. బ. జాలవిద్యచేసెడి ఆటవికజనవిశేషము.

కాటిఱేఁడు. దే. వి. (కాడు + ఱేఁడు) ముక్కంటి; కాశీ. 3, అ. 49: చూ, శివుఁడు. (రూ-కాటేఁడు)

కాటు. దే. వి. 1. మాడియడుగంటుట: చూ, అడుగంటుట; 2. కఱచినగాయము; లక్ష్మీ. 4, అ. 48: చూ, నరుకు; 3: చూ, కఱచుట.

కాటుక. దే. వి: చూ, కాఁడు. 1.

కాటుకకంకి. పా. ఒకవిధమైన తెగులువలన చెడిపోయి నల్లఁబడిన జొన్నలోనగువాని వెన్ను.

కాటుకకంటిగుఱ్ఱము. దే. వి. ఇంద్రాయుధమను గుఱ్ఱము: చూ, హయము.

కాటుకకొండ. దే. వి. అంజనపర్వతము: చూ, పర్వతము. (ఇట్లు కాటుకగుబ్బలి మొ)

కాటుకపట్టు. దే. అ. క్రి: చూ, సలుపుపాఱు; స్వా. 3, ఆ. 18.

కాటుకపిట్ట. ద్వి. వి. ఖంజరీటము: చూ, పిచ్చుక.

కాటుకము. సం. వి. అ. న. కటుత్వము, కొటు వము.

కాటుకరాయి. దే వి. సౌవీరాంజనము: చూ, సౌవీరము. 2.

కాటుకఱేకులపాము. దే. వి. పులిపెంజెర: చూ, సర్పము.

కాటులాడు. దే. అ క్రి. (కాటులు + ఆడు) కలహించు; భార. శాం. 1, ఆ. 45: చూ, వాటులాడు.

కాటువోవు. దే. అ. క్రి. (కాటు + పోవు.) అడుగంటు: చూ, శోషించు.

కాటెల్లి. దే. వి. ఒకానొక క్షుద్రదేవత: చూ, మహాలక్ష్మి. 3. (రూ-కాటేటి.)

కాటేటి. దే. వి. —పై.—

కాట్రిగడ. దే. వి. కంపకోట: చూ, ప్రాచీ నము. 1.

కాట్రాయి. వా. వి. అడ్డుగావేసిన రాయి. (పానకములో పుల్లవంటిది.)

కాట్రేఁడు. దే. వి. (కాడు + ఱేఁడు): చూ, రూ-కాటిఱేఁడు; య. 2, ఆ. 3.

కాఠకము. పా. యజుర్వేదమున మహామంత్రి ములుగల యొక భాగము.

కాఠము. సం. వి. అ. పుం. పాషాణము: చూ, రాయి.

కాఠిన్యఫలము. సం. వి. అ. పుం. కపిత్థము *: చూ, వెలఁగ. (పైపెంకు కండకాయ)

కాడు. వై. వి. 1.=కటః. వల్లకాడు: చూ, శ్మశానము; 2. అడవి: చూ, విపినము; 3. చేటు: చూ, రత్తి; 4. మఱపు: చూ, విస్మృతి.

కాడుచేయు. వై. స. క్రి. పాళముచేయు; భీ. 4, ఆ. 80: చూ, పాడుసేయు.

కాడుపడు. వై. అ. క్రి. 1. రూ-కాద్పడు. కలఁతపడు; హరి. ఉ. 9, ఆ. 42; నిర్వ. 4, ఆ.76; చూ, సంక్షోభించు; 2. కనఁబడకపోవు: భార. శాం. 3, ఆ. 158; భీ. 4, ఆ. 53. (ప్రే. కాడుపఱచు): చూ, వమ్మునోవు.

కాద్పడు. వై. అ. క్రి. —పై.—

కాణము. సం. వి. అ. పుం. 1. కాకి: చూ, వాయసము. 1; 2. తెల్లకాకి: చూ, వాయసము. 1; వై. వి. (1).=ఖాదనం. గుఱ్ఱము మొదలగువాని యొక్క-యులవలు లోను గాఁగల భక్ష్యము; భార. ఉద్యో. 1, ఆ.93 చూ, దాణ.

కాణయాచి. దే. వి. 1. చిరకాల వాసస్థానము; రామా. 6, ఆ. 193: రూ-కాణాచి; విన. 2. చిరకాలానుభవము కలది: రూ-కాణాచి.

కాణాచి. —పై.— (1.- విజ. 1, ఆ. 20; 2.- కళా. 3, ఆ. 191.)

కాణాదము. అం. కణాదఋషి ప్రోక్తన్యాయ శాస్త్రము (తర్కము రెండు విధములు;— న్యాయము, కాణాదము.): చూ, తర్కము.

కాణి. వై. వి.=కాకిణి: చూ, దుడ్డు. (రూ-కాని.)

కాణుఁడు. సం. వి. అ. పుం. ఏకాక్షుఁడు: చూ, ఒంటికంటివాఁడు.

కాణుకము. సం. వి. అ. పుం. కాకి: చూ, వాయసము. 1.

కాణ్వులు. పా. మహారాష్ట్ర బ్రాహ్మణులలో నొకతెగ. వీరు శుక్ల యజుర్వేదులలో నొక శాఖవారు. వీరిది శతపథ బ్రాహ్మణము. కాత్యాయన సూత్రము. ప్రథమశాఖీయు లనంబడుదురు: చూ, బ్రాహ్మణులు.

కాత. దే. ద్రి. అగుఁగాక, అంగీకారార్థకము: చూ, సమ్మతి. 1. (ఆశీరర్థమునందు తద్ధర్మార్థక క్రియల కనుప్రయుక్తమగు శబ్దము. "అఖిల భూతములకు నానందమగుఁగాత."మార్క. 8 ఆ. 9: రూ-కావుత.

కాతరుఁడు. సం. విణ. అధీరుఁడు, భయశీలుఁడు (అని కొందఱు): చూ, పిఱికి.

కాతరము. సం. వి. అ. న. కాతలమను చేప: చూ, మత్స్యము. 1.

కాతలము. సం. వి. అ. న. —పై.—

కాతా, ఖాతా. హిం. వి. ఇచ్చి పుచ్చుకోలు లెక్క.

కాతాళము. దే. వి. కోపము; జై. 7, ఆ. 94: చూ, కోపము.

కాతిలలు. సం. వి. అ. న. బ. పొట్టినువ్వులు *: చూ, నువ్వులు.

కాతుపరిక. సం. వి. ఆ. స్త్రీ. —పై.—

కాతృణము. సం. వి. అ. న. కామంచి *: చూ, తృణము. 1.

కాత్యాయనము. అం. 1. బోధాయనాది తొమ్మిది సూత్రములలో నొకటి: చూ, కల్పము; 2. స్మృతులు పదునెనిమిదింటిలో నొకటి: చూ, స్మృతులు. (కాత్యాయన స్మృతి.)

కాత్యాయని. సం. వి ఈ. స్త్రీ. 1. గౌరి:చూ, పార్వతి. 1; 2. సగము వయసుచెల్లి కావి చీరగట్టిన విధవ: చూ, స్త్రీ.

కాత్యాయనీయము. అం. పంచసూత్రములలో నొకటి: చూ, పంచసూత్రములు.

కాత్యాయనుఁడు. సం. వి. అ. పుం. వరరుచి మహర్షి: చూ, ముని. 1.

కాత్స్న్య. సం. వి. ఇ. స్త్రీ. తొవరిమన్ను: చూ, సురాష్ట్రజము. 2.

కాదంబ. సం. వి. ఆ. స్త్రీ. పెద్దబోడతరము *: చూ, ముండరిక.

కాదంబకము. సం. వి. అ. పుం. అమ్ము: చూ, బాణము. 1.

కాదంబము. సం. వి. అ పుం. 1. —పై.— (రూ- కదంబము- కడంబము- కలంబము.), 2. మధురముగాఁ బలుకు హంస: చూ,హంస; 3. చెఱకు:చూ,రసాలము. 3; విణ. 4. కడప చెట్టు సంబంధమైనది.

కాదంబరము. సం. వి. అ. న. 1. పెరుఁగుమీఁది తెట్టు: చూ, మీఁగడ; 2. వాద్యవిశేషము: చూ, వీణె; 3. ఎల్ల: చూ, సీమ. 1; 4. కల్లు: చూ, సుర. 2; 5. కడిమిపూలకల్లు: చూ, సుర. 2; 6. పక్వమైన చెఱకురసమునఁ జేసిన కల్లు, శీధువు: చూ, సుర. 2.

కాదంబరి. సం. వి. ఈ. స్త్రీ. 1. కల్లు: చూ, సుర. 2; 2. ఆఁడుకోయిల: చూ, పికము: 3. ఆఁడుగోరింక: చూ, శారిక. 1; 4. నలువరాణి: చూ, సరస్వతి. 1; 5. ఒకానొక కావ్యము: చూ, కావ్యములు; 6. కాదంబరీ కావ్యకర్త బాణుఁడు: చూ, కావ్యనాటకములు.

కాదంబరీబీజము. సం. వి. అ. న. సురాబీజము.

కాదంబర్యము. సం. వి. అ. పుం. నీరుకడిమి *: చూ, నీపము.

కాదంబిని. సం. వి. ఈ. స్త్రీ. మేఘపంక్తి:చూ, మేఘము. 1.

కాదరి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకనది: చూ, నది; 2. పసుపు: చూ, వర్ణము. 6; 3. లంజె: చూ, వేశ్య.

కాదలి. సం. వి. ఈ. స్త్రీ. అరఁటి*: చూ, రంభ. 2. (రూ-కాదళి.)

కాదా. దే. అవ్య. (కాదు+ఆ): చూ, కద. 3.

కాదాచిత్కము. సం. విణ. ఒకానొకప్పుడు కలుగునది: చూ, కదాచిద్భవము.

కాది. సం. వి. ఈ. స్త్రీ. కకారమును మొదలుఁగాఁగలది. (కాదివిద్య యని మంత్రశాస్త్ర ప్రసిద్ధము)

కాదు. దే. అవ్య. నఞర్థకము: చూ, లేదు. 2.

కాదె. దే. అవ్య. (కాదు+ఎ) కాదా; భార. శాం. 1, ఆ. 79: చూ, కద. 3.

కాదే. దే. అవ్య. (కాదు+ఏ) —పై—; వి, పు. 7, ఆ. 183.

కాదేశాదులు. వ్యా. సూ.- క్రి. పరి.- లాఁతివో సహితము కాదేశాదులు కానంబడియెడి.— లాఁతివో=ముత్తుపరమగునపుడే కాక యితర సందర్భములందును; కాదేశాదులు=కకారాదేశము వర్ణలోపములోనైనవి గలవు: అగుట=కావుట. భావార్థక ప్రత్యయమైన "ట" ముత్తులలోఁ జేరలేదు. ఇట్టి తక్కినవి చూచునది. కావుతను-కాతను; అగుదును-కావుదును; కావునను-కానను; అనవుదును-అనుదును-సావుదును; ఇత్యాదులు. (విషయము తెలియుటకంతయు వివరింపఁబడియె.): చూ, కావుట. 2.

కాద్రవేయుఁడు. సం. వి. అ. పుం. కద్రువ కొడుకు, పాము: చూ, సర్పము.

కాధేనువు. సం. వి. ఉ. స్త్రీ. సుకత: చూ, ధేనువు (ఇత్యాదిపదము లూహ్యంబులు.)

కాన. దే. అవ్య. 1. తెనుఁగు సంబోధనంబున అను ప్రయుక్తమగు శబ్దము. "తలిక్లాన-సామికాన" మొ; దే. క్రి. 2. కనుక: చూ, హేతువు; పై. వి. 3.=కానన. అడవి: చూ, విపినము.

కానఁబట్టు. దే. అ. క్రి. (కానన్+పట్టు) కనఁబడు; రా. యు, కాం. 15: చూ, ప్రత్యక్షమగు.

కానఁబడు. దే. అ. క్రి. —పై—

కాననము. సం. వి. అ. న. 1.=కాన-కోన. అడవి: చూ, విపినము; 2. ఇల్లు: చూ, సదనము. 1:; 3. మనుష్యులు వేసి పెంచినతోఁట: చూ, వనము. 2; 4. బ్రహ్మముఖము.

కాననారి సం. వి. ఇ. పుం. జమ్మి*: చూ, శమి.

కాననివాఁడు. దే. విణ. అంధుఁడు; భాగ. 7, స్కం. 182: చూ, గ్రుడ్డి.

కానపుంజు. ద్వ. వి. గునపనకోడి: చూ, పుంజు.

కానరము. సం. వి. అ. న. కొలుపోతు: చూ, మహిషము.

కానరానడుగులుగలమేటి. దే. వి. పాము: చూ, సర్పము.

కానరానిచుక్క. ద్వ. వి. అభిజిత్తు: చూ నక్షత్రము. 1.

కానరానివాఁడు. దే. వి. 1. అంధుఁడు: చూ, గ్రుడ్డి; 2: కనఁబడనివాఁడు; (సం. ప):— అంతర్హితుఁడు, అగోచరుఁడు, అదృశ్యుఁడు.

కానరేఁగు. దే. వి. ములువెలదు*: చూ, రేఁగు. 1.

కాని. పై. వి. 1.=కాకిణి. ఒకఅణాలో నాలవవంతు; రుక్మాం. 3, ఆ. 45: చూ, దుడ్డు; దే. అవ్య. 2. వికల్పమును తెలుపును. "నేఁడు కాని రేపు కాని వచ్చును.": చూ, వికల్పము. 2; 3. రూ- కానీ. తక్కినదనుసర్థము తెలుపును. భార. ఉద్యో. 2, ఆ. 187: చూ, వినా; వా. 4. లక్ష్యపెట్టకుండుటను తెలుపును.

కానిక. దే. వి. ఉపహారము; భార. అను. 4, ఆ. 488: చూ, లంచము. (రూ- కానిక్క

కానికూడు. జా. తగనికూడు, నీచాన్నము. "కాని కూడు తినినను కడుపునిండవలెను."

కానిత్రోవ. దే. వి. ఆకాశమార్గములేక నక్షత్ర మార్గము: చూ, ఉత్పథము.

కానిపని. దే. వి. చెడ్డపని: చూ, వ్యళీకము. 2.

కానిపించు. దే. అ. క్రి. 1. రూ- కనిపించు; కళా. 2, ఆ. 98: చూ, ప్రత్యక్షమగు; పేరి. 2. కనఁజేయు. —పై.—

కానిమాట. దే. వి. ఊటక మోపిననింద: చూ, నింద. 1.

కానివాఁడు దే. వి. అంతేద: చూ, నిష్ప రూజకుఁడు.

కానిష్టినేయుఁడు. సం వి. అ. పుం. చెల్లెలి కొడుకు: చూ, మేనల్లుఁడు.

కానిస్టేబిలు. అం. రక్షకభటుఁడు.

కానీ. దే. అవ్య. 1. వికల్పమును తెలుపును; ఆము. 2, ఆ. 26: చూ, వికల్పము. 2; 2. వినార్థకము. కాశీ. 2, ఆ. 9: చూ, వినా; 3. అలాగు నేచేయుము అనుటను తెలుపును. "అలాగునే కానీ."

కానీనుఁడు. సం. వి. అ. పుం. 1. కన్యకకొడుకు: చూ, పుత్రుఁడు; 2: చూ, కర్ణుఁడు; 3. వ్యాసుఁడు: చూ, ముని. 1; అం. 4. పుత్రులు పన్నిద్దఱిలో నొకఁడు: చూ, పుత్రులు.

కానీయరా. వా. వి. 1. వెలుపించెడుమాట; 2. అంగీకారమును తెలుపును. (రూ- కానీరా)

కాను. దే. వి. 1. నీళ్ళుకలియని మజ్జిగ: చూ, మజ్జిగ; 2. ఉప్పుగడ్డి*: చూ, తృణము. 1; వా. కాళీభాగము.

కానుక. దే. వి. రూ- కాన్క. ఉపహారము; భాగ. 10, స్కం. ఉ. 770: చూ, లంచము.

కానుగు. దే. వి. రూ- క్రానుగు :* చూ, కాదఘ్నము.

కానుపు. దే. వి. 1. రూ- కాన్పు. ప్రసూతి: చూ, ప్రసవము; 2. రూ- కాన్పు, చూపు; పారి: ఉ. 7, ఆ: చూ, లక్షణము. 3.

కాన్క. దే. వి: చూ, రూ- కానుక.

కాన్పించు. దే. అ. క్రి: చూ, రూ- కానిపించు.

కాన్పు. దే. వి: చూ, రూ- కానుపు.

కాన్యకుబ్జము. సం. వి. అ. న: చూ, రూ- కన్యాకుబ్జము.

కాన్యజ. సం. వి. ఆ. స్త్రీ. నలియను గంధద్రవ్యము: చూ, రాజార్హము.

కాపంతము. దే. వి. కుక్క-నుగ్గాటెడి కొయ్య; అం, భా. ద్వి. కూ. 290.

కాపటికుఁడు. సం. వి. అ. పుం. 1. ఇంద్రజాలికుఁడు: చూ, ప్రాతిహారకుఁడు; 2. సిసువుఁడు: చూ, శిష్యుఁడు; 3. కూరదినుసులను దినుటను విధించువాఁడు.

కాపట్యము. సం. వి. అ. న. జిత్తు, కపటము: చూ, వ్యాజము. 1.

కాపథము. సం. వి. అ. న 1. నీరు వట్టివేరు*: చూ, వట్టివేరు; అం. 2. కుత్సితపుత్రోవ: చూ, మార్గము. 1.

కాపరి. దే. వి. (కాపు + అరి) మనుపరి; భాగ. 10, స్కం. 482: చూ, రక్షకుఁడు.

కాపాడు. దే. అ. క్రి. (కాపు + ఆడు) బాధ లుతొలఁగించి రక్షించు: చూ, రక్షించు.

కాపాడుట. దే. వి. కాపుగడ: చూ, రక్షణము.

కాపాలము. సం. వి. అ. న. 1. అష్టాదశ కుష్ఠులలో నొకటగు వాతికకుష్ఠము: చూ, మండలము. 3; అం. 2. మతములు ఆఱింటిలో నొకటి: చూ, మతములు; 3. అస్త్రములు ఏఁబదిమూడింటిలో నొకటి : చూ, అస్త్రములు.

కాపాలి. సం. వి. ఈ. స్త్రీ. కోమటిది : చూ, వైశ్య.

**కాపాలికుఁడు.** సం. వి. అ. పుం. కాపాలిక మతము గలవాఁడు.

**కాపాలికేయుఁడు.** ఆం. రుద్రులు పదునొకండుగురిలో నొకఁడు: చూ, రుద్రులు.

**కాపి.** ఆం. వి. 1. అచ్చేరుములబంతి: చూ, వఱువడి; 2. నకలు: చూ, ప్రతి. 2; 3. కాఫీగింజ; 4. కాఫీగింజల పొడి పాలలో కలిపి త్రాగెడి ద్రవపదార్థము; (రూ- కాపీ - కాఫీ)

**కాపిలము.** సం. వి. అ. న. 1. కపిలమతము; 2. సాంఖ్యశాస్త్రము; ఆం. 3. ఉపపురాణములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, ఉపపురాణములు.

**కాపిలుఁడు.** సం. వి. అ. పుం. సాంఖ్యశాస్త్రవేత్త.

**కాపిశము.** సం. వి. అ. న. కల్లు: చూ, సుర. 2.

**కాపిశాయనము.** సం. వి. అ. న. —పై.—

**కాపిశాయిని.** సం. వి. ఇ. న.—పై.—

**కాపిశేయము.** సం. వి. అ. పుం. పిసాసము: చూ, భూతము.

**కాపీనసము.** సం. వి అ. పుం. పడిసెము: చూ, రొంప.

**కాపీరైటు.** ఆం. వి. గ్రంథస్వామ్యము.

**కాపు.** దే. వి. 1. కాపుగడ: చూ, రక్షణము; 2. కాయలు కాచుట. "మామిడిచెట్లకాపు తక్కువ."

**కాపుగడ.** దే. వి. కాపు: రా. అ, కాం. 138 పుట: చూ, రక్షణము.

**కాపురుషుఁడు.** సం. వి. అ. పుం. కుత్సితపురుషుఁడు: కాపూరుషుఁడు, గేహేనర్ది.

**కాపూరుషుఁడు.** సం. వి. అ. పుం. —పై.—

**కాపృథ్వి.** సం. వి. ఈ. స్త్రీ. చెడ్డనేల: చూ, భూమి. 1. (ఇట్టిపదము లూహ్యంబులు)

**కాపేయము.** సం. వి. అ. న. 1. కోఁతిబుద్ధి; 2. కోఁతికర్మ; 3. కోఁతులగుంపు; దే. వి. (1) కృపణత: చూ, దయ.

**కాపోతము.** సం. వి. అ. న. 1. పావురముల గుంపు: చూ, పావురము; 2. అంజనవిశేషము: చూ, సౌవీరము.

**కాపోతాంజనము.** సం. వి. అ. న. అంజనవిశేషము: చూ, సౌవీరము.

**కాప్యకరము.** సం. వి. అ. పుం. తన చిత్తమున పాపముంచి మాట్లాడుట. రూ- కాప్యకారము.

**కాప్యకారము.** సం. వి. అ. పుం. —పై.—

**కాఫలము.** సం. వి. అ. పుం: చూ, పినగుమ్మడు *.

**కాఫాలము.** సం. వి. అ. న. చెడుగొడ్డలి: చూ, ముద్గరము.

**కాఫి, కాఫీ.** ఆం. వి: చూ, కాపి. 3 - 4. "కాఫీహోటల్." (వా)

**కాఫీటాకారము.** సం. వి. అ. పుం. ఏనుఁగు పెద్ద కూఁత: చూ, స్వరము. 2.

**కామ.** దే. వి. 1. తామరలోనగువాని కాఁడ; హరి. పూ, 7, ఆ. 51: చూ, బిసము. 1; 2. ఆకులనరము: చూ, పర్వరీణము; 3. కూరాకులోనగువాని కాఁడ: చూ, కాఁడ. 4; 4. తొడిమె: చూ, వృంతము; 5. గొడుగులోనగువాని దండము. హరి. పూ, 7, ఆ. 178; (కనకపు కామతోమరము, పడగ కామ, బంగరు కామకుంచె. మొదలగునవి); 6. మగగుఱి. చూ, శిశ్నము; 7. చేను మొన: చూ, స్తనము. 1.

**కామంగామి.** సం. విణ. న. స్వేచ్ఛాగమనశీలుఁడు: కామగామి. కామచారి.

**కామంచి.** వై. వి. 1.=కామంజిక, కత్తృణము: చూ, తృణము. 1. (రూ- కావంచి); 2. నల్లబుడుసర *: చూ, వాయసి.

**కామంజిక.** సం. వి. ఆ. స్త్రీ.=కామంచి. కత్తృణము *: చూ, తృణము. 1.

**కామందకార్థశాస్త్రము.** పా. దండనీతియను శాస్త్రము: చూ, విద్యలు.

కామంధమి. సం. వి. న్. పుం. కంచేరి: చూ, కాంస్యకారుఁడు. (చూ, స్వర్ణకారుఁడు)

కామకళ. సం. వి. ఆ. స్త్రీ. కలయిక, రతి: చూ, సంయోగము.

కామకళానిధి. పా. కామశాస్త్రమునందలి యొకానొక గ్రంథము.

కామకూటము. సం. వి. అ. పుం. 1. వేశ్యా ప్రియము; 2. వేశ్యావిభ్రమము; 3. బ్రహ్మ రాక్షసనంహతి.

కామకేళి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. సురతము: చూ, సంయోగము; విణ. 2. షిద్గుఁడు:చూ, విటుఁడు.

కామగుణము. సం. వి. అ. పుం. చెలిమి: చూ, స్నేహము. 1.

కామఖడ్గదళ. సం. వి. ఆ. స్త్రీ. బంగరు మొగలి: చూ, మొగలి.

కామగామి. సం. విణ. న్: చూ, రూ- కామం గామి.

కామచారి. సం. విణ. న్. 1. —వై.—; 2. కాముకుఁడు:చూ, వలపుకాఁడు; 3. చట కము: చూ, పిచ్చుక.

కామజంబులు. అం. ద్యూతము, వేఁట, స్త్రీ, పానము, అర్థదూషణము. (5)

కామజానము. సం. వి. అ. పుం. కోయిల: చూ, పికము.

కామజుఁడు. సం. వి. అ. పుం. మరుఁడు: చూ, మన్మథుఁడు.

కామత. సం. వి. ఆ. స్త్రీ. ముయ్యాకుపొన్న *: చూ, పాలపర్ణి.

కామతాత. సం. వి. అ. పుం. వెన్నుఁడు :చూ, విష్ణువు. 1.

కామతాలము. సం. వి. అ. పుం. కోయిల:చూ, పికము.

కామద. సం. వి. ఆ. స్త్రీ. కామధేనువు: చూ, ధేనువు.

కామదుఁడు. సం. విణ. కోరికలనిచ్చువాఁడు.

కామదుఘ. సం. వి. ఆ. స్త్రీ: చూ, కామద.

కామదూతి. సం. వి. ఈ. స్త్రీ. కలిగొట్టు *: చూ, పాలి. 2.

కామదూతిక. సం. వి. ఆ. స్త్రీ. కాండేరి *: చూ, నాగదంతి.

కామదేవుఁడు. సం. వి. అ. పుం. వలపురాయఁ డు: చూ, మన్మథుఁడు.

కామధన్వా. సం. వి. న్. పుం. 1.ముక్కంటి: చూ, శివుఁడు; 2. సన్యాసి: చూ, ముని. 1. (యోగాభ్యాసముచేయు యోగి)

కామధుక్కు. సం. వి. హ్. స్త్రీ: చూ, కామ ధేనువు.

కామధేనువు. సం. వి. ఉ. స్త్రీ.1 కోరినవస్తువు లిచ్చెడి వేల్పుటావు: చూ, ధేనువు; 2. మహా దానములు పదునాఱింటిలో నొకటి: చూ, మహాదానములు.

కామధ్వంసి. సం. వి. న్. పుం. వలరాజు జూఁడు: చూ, శివుఁడు.

కామన. సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ: చూ, వాంఛ.

కామనము. సం. వి. అ. పుం. కంగేలి *: చూ, హేమపుష్పము; విణ. 2. ఇచ్ఛగలది: చూ, వాంఛ; 3. చేకనిది: చూ, హృద్యము.

కామనిక. సం. వి. ఆ. స్త్రీ. కనుపాప: చూ, తారకము.

కామనుఁడు: సం. విణ. 1. ఇచ్ఛగలవాఁడు, స్త్రీ కాముకుఁడు: చూ, వలపుకాఁడు; 2. అందగాఁడు: చూ, సౌందర్యవంతుఁడు.

కామపత్ని. సం. వి. ఈ. స్త్రీ. రతి: చూ, సంయోగము.

కామపాలుఁడు. సం. వి. అ. పుం. బలభద్రుఁడు: చూ, బలరాముఁడు.

కామపీడితుఁడు. సం. విణ. కామాతురుఁడు: చూ, వలపుకాఁడు.

కామప్రదము. సం. వి. అ. పుం కలియిక లాగులు: చూ, రతిబంధము.

కామఫలము. సం. వి. అ. పుం. మహారాజామ్రము*: చూ, మామిడి.

కామమందిరము. సం. వి. అ. న. ఆఁడుగుఱి: చూ, భగము. 12.

కామమహము. సం. వి. అ. పుం. చైత్రపౌర్ణిమ, చిత్తానక్షత్ర యుక్తమగు పున్నమ: చూ, పున్నమ.

కామము. సం. వి. అ. న. 1. కోరిక: చూ, వాంఛ; 2. మత్తు: చూ, మదము. 1; 3. పురుష రజస్సు: చూ, రేతస్సు. 1; పుం. 4. ఇచ్ఛ; చూ, వాంఛ; 5. క్రి. విణ. అ. న. ఇచ్ఛవచ్చినట్లు, అలవోక: చూ, యథేచ్ఛము; అం. 4. పురుషార్థములు నాలుగింటిలో నొకటి: చూ, పురుషార్థములు; 5. రాజముఖ్యగుణములు మూఁడింటిలో నొకటి; (స్వభార్యయందే) కామము: చూ, రాజముఖ్యగుణములు; 6. అరివర్గములు ఆఱింటిలో నొకటి: చూ, అరివర్గములు; 7. హేయగుణములు పదునాఱింటిలో నొకటి: చూ, హేయగుణములు; పా. 8. కామము అనఁగా మనస్సు మొదలగు నింద్రియములచేత కోరఁబడిన విషయానుభవ సుఖమును గోరుట. ఇది మన్మథదైవత్యమై ధర్మార్థములకంటె నిహపరలోక సుఖసాధకమై మోక్షకరంబైయుండును. ("శ్లో. బలం బలవతాంచాహం కామరాగవివర్జితమ్, ధర్మావిరుద్ధోభూతేషు కామోస్మిభరతర్షభ." అని భగవద్గీతలయందు సప్తమాధ్యాయమున ౧౧వ శ్లోకము. ఇట్టి భగవద్వచన ప్రమాణముచేత ధర్మార్థముల ననుసరించిన కామంబు సర్వాభీష్టంబుల నొసంగును. స్వకాంతయందు మంత్రకృతకామకళా విశేషముల వలన పుత్రసంతతి గలుగఁ బరలోకప్రాప్తి సాధకమగు. ఎట్టులనిన.—"పున్నామ్నో నరకాత్త్రాయత ఇతిపుత్రః" అని చెప్పుటచే 'పు.' అనెడు నరకబాధ వలన రక్షించువాఁడు గనుక పుత్రుఁడు. ఈ పుత్రసంతతి వలన పుణ్యలోకము గలుగుననుటకు భారతము ఆదిపర్వము 5 వ ఆశ్వాసమున పాండురాజు కథయును, ఈ పర్వమునందే 2 వ ఆశ్వాసమున జరత్కారుని కథయును ప్రమాణములై యున్నవి. ఎట్లనిన.—పాండురాజు భార్యలతో శతశృంగపర్వతమున తపంబుసలుపుచుండి యొక్కనాఁడు దివ్యవిమానము లెక్కి వచ్చుచుఁబోవుచున్న బృందారక బృందములు నిండియున్న స్వర్గపుర మార్గంబున పుణ్యలోకంబుల కనాయాసంబున నుత్తరాభిముఖులగుచు నరుగు మునులంగాంచి మీ రెచ్చటకరిగెదరనిన వారు నేఁడు అమవస గాన చతుర్ముఖుని పూజించుటకై బ్రహ్మాండములో నుండు మునులును, పితృదేవతలును బోవుచుండిరి, గాన మేమును నక్కార్యంబునకై బోవుచుంటి మనిన నతండు నేను వత్తునని భార్యాద్వయసహితుండై వచ్చుచున్న యతనిం గని మునులిట్లనిరి. ఓ రాజోత్తమా, మీరు సుకుమారులు. ఈ మార్గంబు గిరిగహనములచే దుర్గమంబును, దేవమార్గంబును గాన మీరు రావలదు, నిలువుఁడనిన, నప్పాండురాజు "అపుత్రస్య గతిర్నాస్తి." అను వేదవచనంబున సంతానరహితులైరేని మునులకైనను నీమార్గంబు దుర్గమంబు గాన మునిశాపంబున సంతతిలేని తనకు పుణ్యలోక సుఖంబు లభింపమికిఁ గుంది యమ్మునులం బ్రార్థింప వారు దైవాధిష్ఠితంబగు సంతతి నీకుఁ గలిగి పుణ్యలోక సుఖంబనుభవింతువని

చెప్పినట్లును, జగత్కారుఁడు మునికుమారుని గాంచి యతని పితృదేవతలు నాలుగాశ్రమములలో గృహస్థాశ్రమముముఖ్యమైనదిగాన నీవు యీ యాశ్రమమునొంది సంతానవంతుఁడవై మాకు పుణ్యలోకసుఖం బొసంగుమని చెప్పినట్లు చెప్పఁబడియున్నది. కాశీఖండము 3, 4 ఆశ్వాసములలో విశ్వానరుని కథయందు ఈగృహస్థాశ్రమము ముఖ్యమైనదైనట్లు చెప్పఁబడియున్నది ఇట్టి గ్రంథస్థములగు కథలను విశ్వసించి యీ కామశాస్త్రానుసారంబుగ నిత్యంబులగు కామ్యకర్మంబు లాచరించి స్వభార్యయందు విషయానుభవం బనుభవించుచు పరదారాగమనము మొదలగు నిషిద్ధకార్యముల విడువవలయు. అట్లు విడుచుటవలన పరమేశ్వరార్పణముగ సర్వకర్మకారియైన మనఃప్రసన్నత గలుగుఁగాన, ధర్మావిరోధి కామశాస్త్రము చతుర్థపురుషార్థ సాధకమగుటకు సందియంబులేదు. ఈ శాస్త్రోత్పత్తిక్రమము అర్థవేదభాగములందుఁ జెప్పినరీతిని బ్రహ్మలలాటమునందుఁ బుట్టిన విశాలాక్షుని వలన నేర్పడిన వైశాలాక్షమను దండనీతిశాస్త్రములో నొకభాగమైన కామశాస్త్రము కృతయుగమునందు నందికేశ్వరునిచేత వేయి అధ్యాయములుగ సంగ్రహింపఁబడి త్రేతాయుగములో శ్వేతకేతు మహామునిచే నేనూఱధ్యాయములుగ రచింపఁబడి, ద్వాపరయుగమున బాభ్రవ్య మహామునిచే నూటయేఁబది అధ్యాయములుగ సంక్షేపింపఁబడి, తరువాత దత్తక, చారాయణ, సువర్ణనాభ, ఘోటకముఖ, గోనర్దీయ, ఘోణికాపుత్ర, కూచిమార మునులచేత వైశిక, సాధారణ, యోగిక, కన్యాప్రయుక్తక, భార్యాధికార, పారదారిక, ఔపనిషదికములను సప్తాధికరణములుగ బాభ్రవ్యునిచే నేర్పఱచి చెప్పఁబడిన వాని నొక్కొక్కరొక్కొక్క యధికరణమును మాత్ర మందుకొని కొందఱు విస్తారముగను కొందఱు సంక్షేపముగను సూత్రములను రచించుటవలన నుత్పన్నప్రాయమైన్యా కామసూత్రమును చాణుక్యుఁడే వాత్స్యానయనుఁడను నామాంతరముతో ముప్పదివాలుగధ్యాయములు గల సప్తాధికరణీ శాస్త్రమును రచించెను. ఈ శాస్త్రమునకు వజ్రఖడ్గ ధరాచార్య భాష్యమును భాస్కరనృసింహశాస్త్రి కృతవృత్తియను వ్యాఖ్యానమును బుట్టియున్నవి. పిమ్మట నీగ్రంథము ననుసరించి కొక్కోకము రతిరహస్యము, అనంగరంగము, కామకళానిధి మొదలగు శ్లోకగ్రంథములు పుట్టియున్నవి. ఈ శాస్త్రమందుఁ గల పురుషస్త్రీభేదములు, జాతిభేదములు, దూతీభేదములు, నఖక్షతములు, దంతక్షతములు, చుంబనములు, ఆలింగనములు, చిహ్నములు, అవస్థలు, రతిధ్వనులు, బంధములు మొదలగువాని భేదంబు లాయాపదంబులకడఁ జూచుకొనవలయును.")

కామయిత. సం. విణ. (ఋ-ఈ-ఋ) కాముకుఁడు: చూ, వలపుకాఁడు.

కామరుచి. అం. ధనుర్వేదములోని శస్త్రములలో నొకటి: చూ, శస్త్రములు.

కామరూప. అం. కామశాస్త్రమునందలి కామరూప దేశస్త్రీలలో నొకతె: చూ, స్త్రీ.

కామరూపము. సం. వి. అ. న. ప్రాగ్జ్యోతిషనరము: చూ, దేశము; పుం. 2. కామరూపమను దేశము: చూ, దేశము; విణ. 3. మనోజ్ఞమగు రూపము: చూ, సౌందర్యము; అం. 4. ధనుర్వేదములోని శస్త్రములలో నొకటి: చూ, శస్త్రములు.

కామరూపి. సం. వి. న్. పుం. 1. ఊసరవెల్లి: చూ, సరటము; 2. ఖేచరుఁడు: చూ, విద్యాధరుఁడు.

కామరూపిణి. సం. వి. ఈ. స్త్రీ. అశ్వగంధ *: చూ, పెన్నేరు.

కామరేఖ. సం. వి. ఆ. స్త్రీ. భోగముది: చూ, వేశ్య.

కామల. సం. వి. ఆ. స్త్రీ. = కామెల: చూ, పసరిక.

కామలత. సం. వి. ఆ. స్త్రీ. మగగుఱి; చూ, శిశ్నము.

కామలము. సం. వి. అ. పుం. 1.=కామల: చూ, పసరిక; 2. మరుభూమి: చూ, భూమి. 1; 3. వసంతఋతువు: చూ, మాసద్వయము: (చూ, ఋతువులు.)

కామలుఁడు. సం. విణ. 1 కాముకుఁడు: చూ, వలపుకాఁడు; 2. లంజెకాఁడు: చూ, విటుఁడు,

కామవతి. సం. వి. ఈ స్త్రీ. అంకపీలి*: చూ, మ్రానిపసుపు.

కామవల్లభ. సం. వి. ఆ. స్త్రీ. చెందిరిక: చూ, వెన్నెల.

కామవల్లభము. సం. వి. అ. పుం. ఆమ్రము *: చూ, మామిడి.

కామవృంత. సం. వి. ఆ. స్త్రీ. కలిగొట్టు *: చూ, స్థాలి. 2.

కామవృక్షము. సం. వి. అ. పుం. బదనిక *: చూ, వదనిక.

కామవృద్ధినామము. సం. వి. అ. పుం. పొట్టి కొమ్మలూడలుగల చెట్టు: చూ, హ్రస్వ శాఖాశిఫము.

కామశరము. సం. వి. అ. పుం. ఆమ్రము *: చూ, మామిడి.

కామశాస్త్రము. సం. వి. అ. న. కొక్కోకము మొదలైనవి: చూ, కామము. 8.

కామసఖము. సం. వి. అ. పుం. వసంతఋతువు: చూ, మాసద్వయము: (చూ, ఋతువులు.)

కామసుతుఁడు. మన్మథుని కొడుకు: చూ, విశ్వ కేతువు.

కామాంకుశము, సం. వి. అ. పుం. 1. గోరు: చూ, నఖము; 2. మగగుఱి: చూ, శిశ్నము.

కామాంగము సం. వి. అ. పుం. ఆమ్రము *: చూ, మామిడి.

కామాంతకము. సం. వి. అ. పుం. ఏడుపు:చూ, దుఃఖము.

కామాంతకుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

కామాంధ. సం. వి. ఆ. స్త్రీ. కస్తూరి: చూ, మృగమదము.

కామాంధము సం. వి. అ. పుం. కోయిల: చూ, పికము.

కామాటము. వై. వి.= కర్మఠ: రామా. 8, ఆ. 185: చూ, మోటపని.

కామాటి. వై. విణ.=కర్మఠ.(కామాటము + ఇ) మోటపని చేయువాఁడు.

కామాతురుఁడు. సం. విణ. కామార్తుఁడు: చూ, వలపుకాఁడు.

కామాధిదేవత. సం. వి. ఆ. స్త్రీ. త్రయోదశి తిథి: చూ, తిథి. 1.

కామాయుధము. సం. వి. అ. న. 1. కామదేవాస్త్రము: చూ, బాణము. 1; 2. మహారాజ చూతము *: చూ, మామిడి.

కామాయువు. సం. వి. ఉ. పుం. గరుడుఁడు: చూ, హరివాహనుఁడు.

కామారణ్యము. సం. వి. అ. న. మనోజ్ఞమైన వనము: చూ, వనము. 2.

కామారి. సం. వి. ఇ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

కామార్తుఁడు. సం. విణ: చూ, కామాతురుఁడు.

కామాలిక. సం. వి. ఆ. స్త్రీ.కల్లు: చూ,సుర.2.

కామాళువు. సం. వి. ఉ. పుం: చూ, రక్తకాంచనము *.

కామి. సం. వి. ఇ. పుం. 1. కాముకుఁడు: చూ, వలపుకాఁడు; విణ. 2. —వై.—; వి. ఇ. న. 3. జక్కవ: చూ, చక్రవాకము; 4. పారావతము: చూ, పావురము; ఇ. స్త్రీ. 5. ఇచ్ఛ: చూ, వాంఛ; 6. రతి, మన్మథుని భార్య: చూ, భార్య; ఇ. పుం. 7. లంజెకాఁడు: చూ, విటుఁడు.

కామికము. సం. వి. అ. పుం. 1. కన్నియలేడి: చూ, మహాపశువు; అం. 2. శివప్రోక్తములగు చతుష్షష్టి తంత్రములలో నొకటి: చూ, తంత్రములు.

కామికాగమము. పా. ఆగమములు ఇరువదియెనిమిదింటిలో నొకటి: చూ, ఆగమములు. (చూ, ఉపవిద్యలు)

కామిని. సం. వి. ఈ. స్త్రీ. 1. ప్రియసంగమమునందు మిక్కిలి ఆసగల యాఁడుది: చూ, స్త్రీ; 2. ఆఁడుది: చూ, స్త్రీ; 3. ఆఁడుజక్కవ: చూ, చక్రవాకము; 4. ఆఁడుపావురము: చూ, పావురము; 5. బదనిక *: చూ, వదనిక; 6. అంకోలగిరి *: చూ, ప్రేంకణము.

కామినీశము. సం. వి. అ. పుం. మునగ *: చూ, శిగ్రువు. 1.

కాముఁడు. సం. వి. అ. పుం. మరుఁడు: చూ, మన్మథుఁడు.

కాముక. సం. వి. ఆ. స్త్రీ. గంధపుష్పాలంకారముల యందపేక్షగల యాఁడుది: చూ, స్త్రీ.

కాముకకాంత. సం. వి. ఆ. స్త్రీ. అతిముక్తలత, ఫూలగురివెంద *: చూ, తులాబీజము.

కాముకప్రియము. సం. వి. అ. పుం. కస్తూరిపసుపు *: చూ, వర్ణము. 6.

కాముకము. సం. వి. అ. పుం. 1. ఇరుగుడు *: చూ, శింశుప; 2. వెమ్మి *: చూ, తినాసము; 3. ఫూలగురివెంద *: చూ, తులాబీజము; 4. కంగేలి *: చూ, హేమపుష్పము; విణ. 5. ఇచ్ఛగలది: చూ, వాంఛ.

కాముకి. సం. వి. ఈ. స్త్రీ. సంభోగమునందిచ్ఛగల యాఁడుది: చూ, స్త్రీ.

కాముకుఁడు. సం. విణ. కామయిత: చూ, వలపుకాఁడు.

కామ్యృతి. సం. వి. ఇ. స్త్రీ. చెడ్డచావు: చూ, మరణము. (ఇట్టిశబ్దంబులూహ్యంబులు)

కామృత్తిక. సం. వి. ఆ. స్త్రీ. చెడ్డమన్ను: చూ, భూమి. 1.

కామెల. వై. వి. = కామల: చూ, పసరిక.

కామేశ్వరి. సం. వి. ఈ. స్త్రీ. పరాశక్తి: చూ, మహాలక్ష్మి. 3.

కామేశ్వరుఁడు. సం. వి. అ. పుం. సగుణబ్రహ్మము.

కామేష్టము. సం. వి. అ. పుం. రాచమామిడి *: చూ, మామిడి.

కామోత్సవము. సం. వి. అ. పుం. నూతనదంపతుల కలియిక: చూ, సంయోగము.

కామ్యదానము. సం. వి. అ. న. కోరినది ఇచ్చుట: చూ. ప్రవారణము.

కామ్యము. సం. వి. అ. న. 1. అగ్నిహోత్రాదిః; విణ. 2. కోరఁదగినది: చూ, వాంఛ; పుం. 3. సర్జకము *: చూ, వేఁగిస.

కాయ. దే. వి. 1. చెట్టునఁగాచెడు కాయ: చూ, శలాటువు. 2; 2. కఠినవస్తుసంస్పర్శనముచే హస్తాదులయందు కాచెడు కాయ; భార. విరా. 2, ఆ. 221: (సం. ప):— కిణము, ఖాటి; 3. కంటితెవులు: చూ, బిడాలము. 2; 4. పెసలులోనగువాని పైగోలు: చూ, శింబ; 5. జూదముసందలి సారెలోనగునది: చూ, పాచిక; 6. వీణె సారకాయ; హరి. 2, ఆ. 106; పా. 7. కాయయగురీతి— పుష్ప

రజస్సంపర్కము కాఁగానే పుష్పదళము వాడి పోవును. అప్పుడు పుష్పమునకు గర్భోత్పత్తి యైనదనుకోనవలయును. తరువాత అండాశయము ముదిరి కాయయగుచున్నది. ఈకాయ పక్వమై ఫలమగుచున్నది.

కాయకంటి. దే. వి. (కాయ + కన్ను) రూ-కాయకన్నెటి, కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు.

కాయకన్ను. దే. వి. కాయకాచినకన్ను: చూ, నేత్రము. 1.

కాయకము. దే. వి. జీవనము:చూ, బ్రదుకు. 1.

కాయజలము. సం. వి. అ. న. ఉచ్చ: చూ, మూత్రము.

కాయజుఁడు. సం. వి. అ.పుం.రూ-కామజుఁడు, మరుఁడు: చూ, మన్మథుఁడు.

కాయధాన్యములు. పా. దక్షిణపుగాలిచేఁ బండెడు ఉలవ, పెసర, కంది మొదలగునవి. ఈ తరగతి లోనివానిని పయరలు, అపరాలు అందురు: చూ, ధాన్యము.

కాయపెండలము. దే. వి. ఒకరకను పెండలము *: చూ, సముష్టిల.

కాయబలనము. సం వి. అ. న. కవచము: చూ, బొందడము.

కాయమానము. సం. వి. అ. న. పందిరి: చూ, సదనము. 1.

కాయమానములు. అం. మల్లశాస్త్రములోనివి:— విష్ణుచక్రము, రామబాణము, నాగబంధము, తొలకరిమెఱుపు, అల్లిమత్తు, విస్సందు, హస్తాభరణము, పదఖండనము. ఉరితాడు, లోబిత్తరి, వెలిబిత్తరి, సర్వాంగకళము. (12)

కాయము. సం. వి. అ. పుం. 1. మేను: చూ, శరీరము; 2. గుంపు: చూ, సమూహము; 3. అలవాటు: చూ, స్వభావము; 4. చిహ్నము: చూ, లక్షణము. 1; విణ. 5. ఋషిదేవతాకము, ఋషితర్పణ యోగ్యస్థానము. "స్వల్పాఙ్గుళ్యోర్మూలేకాయమ్." = చిటికెన వేలు దగ్గ్రవేళ్లు వీనిమొదట ఋషితీర్థముండును. పులస్త్యాదిప్రజాపతులు దేవతలుగాఁ గలిగినది. పులస్త్యాదిప్రజాపతులు ఋషులు గనుక అప్రదేశముల వలననే ఋషితర్పణము సేయవలెననుట అని భావము; అ. న. 6. చలిపందిలి: (చూ, పానీయశాలిక.) చూ, సదనము. 1; అం. 7. కరణములు మూఁడింటిలో నొకటి:; చూ, కరణములు (చూ, త్రియము.) దే. వి. (1) బాలింతకిచ్చెడు మందు, స్వర్ణ్య: చూ, మందు. 1.

కాయలరాసి. ద్వ. వి. తప్పవడ్డుగలరాసి,అగాడి, కాయధాన్యము. "కాఁపుకాయలు తోలిపించి వాఁడు." (కాయలు= గట్టిగింజలేని వడ్లు)

కాయవలనము. సం. వి. అ. పుం. కవచము:చూ, బొందడము.

కాయస్థ. సం. వి. అ. స్త్రీ. 1. ఉసిరిక *:చూ, శ్రీఫలి. 1; 2. కరక *: చూ, హరీతకి.(రూ-వయస్థ); 3. దారి: చూ. మార్గము. 1; 4. కారకొల్లి *: చూ, కాయసోలి; 5. తొలసి*: చూ, తులసి; 6. ఆత్మ: చూ, హంసుఁడు.2; 7. కాయతీజాతి.

కాయస్థుఁడు. సం. వి. అ. పుం. 1. లెక్కవ్రాయువాఁడు, కరణము: చూ, పంజికరుఁడు; 2. ఆత్మ: చూ, హంసుఁడు. 2; 3. పరమాత్ముఁడు: చూ, పరమాత్మ; 4. బ్రాహ్మణ స్త్రీయందు క్షత్రియునకు జన్మించినవాఁడు.

కాయావరోహణేశ్వరుఁడు. సం. వి. అ. పుం. నాగపట్టణమునందలిఈశ్వరుఁడు:చూ,శివుఁడు

కాయాసక్తి. సం. వి. ఇ. స్త్రీ. శరీరాభిమానము: కాయేహ.

కాయిక. సం. వి. అ. స్త్రీ. నానాఁటివడ్డి: చూ, వడ్డి.

కాయికము. సం. విణ. 1. శరీరసంబంధమైనది: చూ, శారీరము; అం. 2. కర్మములు మూఁడింటిలో నొకటి: చూ, కర్మములు (చూ, క్రియము); దే. విణ.(1) సారములేనిది: చూ, ఫల్గువు. 2.

కాయికవృద్ధి. అం. ధనవృద్ధులు నాలుగింటిలో నొకటి: చూ, ధనవృద్ధులు.

కాయిదా, ఖాయిదా. హిం. విధి, నిర్ణయము; కవాయిదు; అడితి.

కాయిలా, ఖాయిలా. హిం. తెగులు, రోగము.

కాయు. వై. అ. క్రి.—కాస్. ఎండ వెన్నెల లోనగునది ప్రకాశించు; కళా. 8, అ. 10: చూ, ప్రకాశించు. 1.

కాయుఁడు. సం. వి. అ. పుం. కోమటి: చూ, వైశ్యుఁడు.

కాయుక్తి. సం. వి. ఇ. స్త్రీ. కుయుక్తి: చూ, యుక్తి.

కాయువు. దే. వి. రూ. కాయ్యు. 1. అనురాగము: చూ, స్నేహము, 1; 2. కోరిక: చూ, వాంఛ.

కాయ్యు. దే. వి. —వై.— (అనురాగము— "చ. నీ,కరమునఁ బుచ్ఛమూలమిటు కాయ్యునఁబట్టెదు మేదినీశ్వరా." మార్క. 5. ఆ. 282)

కాయూక. సం. వి. అ. స్త్రీ. పెద్దపేను: చూ, యూకము.

కాయేంధనప్రియము. సం. వి. అ. పుం. అగ్ని: చూ, నిప్పు.

కాయేహ. సం. వి. ఆ. స్త్రీ: చూ, కాయాసక్తి.

కాయోపండో. జా. సఫలమో విఫలమో, అవునో కాదో, "పాలఁతి కాయో పండో పోయిన పనియన్నఁ జిలుకమాటకు నవ్వుసాలపుదేట." (విజయవిలాసము); "చేసినపని కాయరో పండోయనుచునడుగ," (రసికజన మనోరంజనము)

కార. సం. వి. ఆ. స్త్రీ. 1. చెఱసాల: చూ, బంధశాలయము. (చూ, సదనము. 1.); 2. నిర్బంధము: చూ, బలవంతము; 3. కంచెనకత్తె: చూ, కంభళి; 4. కరివె: చూ, వీణాదండము; 5. బంగరుపనికత్తె: చూ, స్వర్ణకారుఁడు.

కారండవము. సం. వి. అ. పుం. కన్నియలేడి: చూ, మహాపక్షము.

కారండవ్యూహుఁడు. సం. వి. అ. పుం. బుద్ధభేదము: చూ, బుద్ధుఁడు. 1.

కారంధమి. సం. వి. న. పుం. 1. కంచు పనివాఁడు: చూ, స్వర్ణకారుఁడు; 2. ధాతువాదమెఱిఁగినవాఁడు: చూ, రసవాది.

కారంభ. సం. వి. ఆ. స్త్రీ. 1. అంకోలగిరి *: చూ, ప్రియంకణము; 2. కుత్సితమైన రంభ: చూ, స్త్రీ.

కారంభము. సం. వి. అ. పుం. వనపిప్పలి*: చూ, పిప్పలి. 1.

కారకదీపకము. సం. వి. అ. న. ఒకానొక అలంకారము. క్రియాగతమైన కార్యగుంభనము. ఉ.— చనిగొందు, వచ్చెదు, చూచెదు, మరలనడిగెడు: చూ, అలంకారము. 8.

కారకలగ్నము కట్టుబెట్లు. పా. లగ్నప్రమాణమును 30 భాగలుగఁ జేయవలెను. గ్రహములన్నింటిలోను ఎక్కువ భాగలనుబొందిన గ్రహము ఆత్మకారకుఁడగును. ఇట్టియాత్మకారకుఁడున్న రాశియే కారకలగ్నమగును.

కారకము. సం. వి. అ. న. 1.కర్మాదిషట్కము; విణ. 2. చేయునది: చూ, వ్యాపారము. 1.

కారకములు. అం. వాక్యంబునఁగర్తకుఁ గ్రియకుఁ గలయన్వయసంబంధమును దెలుపునది కారకము. "Karaka is the name given to the relation subsisting between a noun and a verb in a sentence," ఇది కర్త—కర్మ (కర్మము)—కరణము— సంప్రదాన

ము— అపాదానము— అధికరణము అని యాఱువిధములు. వివరణములాయాపదముల కడఁజూచుకొనవలెను.

కారకనివింద. దే. వి. కసింద *: చూ, బలుసు.

కారకుఁడు. సం. విణ. 1. కర్త, చేయువాఁడు: చూ, పనివాఁడు; పుం. 2. వశిష్ఠుఁడు: చూ, ముని. 1; 3. అగస్త్యుఁడు: చూ, ముని. 1.

కారకుక్షీయము. సం. వి. అ. పుం. శాల్యదేశము: చూ, దేశము.

కారగ్గి. ద్వ. వి. (కారు+అగ్గి) దావానలము, కాఱుచిచ్చు; భార. అశ్వ. 2, ఆ. 163: చూ, నిప్పు.

కారటము. సం. విణ. కాకి సంబంధమైనది.

కారట్టు. ఆం. (క్యారట్టు) (1) రత్నముతూనిక. రతి ఒకక్యారట్టునకు 4 వడ్లగింజలు; (2) బంగారువన్నె; 24 వన్నెలపరిమితి.

కారడవి. ద్వ. వి. చిట్టడవి: చూ, విపినము.

కారడుగు. ద్వ వి. (కారు+అడుగు) 1. రెండవకారు; 2. అల్పధాన్యము: చూ, ధాన్యము.

కారణ. సం. వి. అ. స్త్రీ. కొతియ: చూ, యాతన.

కారణనిబంధనాప్రస్తుతప్రశంస. సం. వి. అ స్త్రీ. ఒకానొక అలంకారము: చూ, హేతువు. 2. (చూ, అలంకారము. 3)

కారణమాల. ఆం. ఒకానొక అర్థాలంకారము.— పూర్వ పూర్వములకుఁ గాని, ఉత్తరోత్తరములకుగాని క్రమముగ నొకదాని కొకటి హేతువులుగ వర్ణించుట. ఉ.—విద్య వలన వినయము, వినయముచే గౌరవము, గౌరవమున ధనము, ధనముచేత ధర్మము, ధర్మము వలన మోక్షము గలుగుచున్నది: చూ, అలంకారము. 3.

కారణము. సం. వి. అ. న. 1. సబబు: చూ, హేతువు; 2. కొల: చూ, వధము; 3. ఉపకరణము: చూ, పనిముట్టు; ఆం. 4. లక్ష్యములు ఆఱింటిలో నొకటి: చూ, లక్ష్యములు.

కారణికుఁడు. సం. విణ. పాత్రాపాత్రములఁ బరిశోధించువాఁడు: చూ, పరీక్షకుఁడు.

కారపుఁజెక్క. దే. వి. (కారము+చెక్క) దాల్చినచెక్క: చూ, తోలు. 1.

కారపుఁబడుగు. ద్వ. వి. (కారము+పడుగు) గట్టి నూలిపడుగు; హంస. 2, ఆ. 11: చూ, మగ్గము.

కారపుకిల్లీ. వా. వి. మసాలావస్తువులు చేరిన తాంబూలము. (రూ-కారాకిల్లీ.)

కారపుమన్ను. ద్వ. వి. ఊసరమృత్తిక: చూ, భూమి. 1.

కారభి. సం. వి ఇ. పుం. ఇల్లిందశ: చూ, మాతులుంగము.

కారభూమణుఁడు. సం. వి. అ. పుం. శాక్యబుద్ధదేవుఁడు: చూ, బుద్ధుఁడు. 1.

కారమిహిక. సం. వి. అ. స్త్రీ. కర్పూరము: చూ, సిరము.

కారము. సం. వి. అ. పుం. 1.=కోరు, కప్పము: చూ, సిస్తు. 1; 2. ఏర్పాటు: చూ, నిజము. 2; 3. మంచుకొండ: చూ, పర్వతము; 4. ఆయత్తము: చూ, యత్నము; 5 కొల: చూ, వధము; ఆం. 6. రసములు ఆఱింటిలో నొకటి: చూ, రసములు; దే. వి. (1.)=క్షారః. ఒజ్జ, ఒజ్జఁదనము, ఒజ్జన, ఒజ్జు, కారము, గాటు, (వా) వజ్జ; (సం. ప) :— కటువు, క్షారము; (2) వస్త్రప్రభావన పదార్థము: చూ, సబ్బు; (3) ఉప్పుమన్ను; భార. శాం. 3 ఆ. 364: చూ, భూమి. 1; 4. నూలుతడిపెడి యొకానొక ద్రవద్రవ్యవిశేషము; 5. బిడ్డలకుఁబోసెడి మందు; చమ. 1, ఆ. 32: చూ, మందు. 1.

కారయిత. సం. విణ. (బు. ఈ. బు.) కర్త: చూ, పనివాఁడు.

కారవల్లి. సం. వి. ఈ. స్త్రీ. కాఁకర *: చూ, సుషవి. 1.

కారవి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఇంగువమ్రాను*: చూ, హింగువు. 1; 2. ఓమము*: చూ, యవాని; 3. నల్లజీలకఱ్ఱ *: చూ, సుషవి. 2; 4. శతపుష్ప *: చూ, సదాప; 5. చిత్తా నక్షత్రము,ముత్తెపుసవతు: చూ,నక్షత్రము. 1.

కారవీచి. సం. వి. ఈ. స్త్రీ. కారవి *: చూ, సదాప.

కారవుఁడు. సం. వి. అ. పుం. పిచ్చుకకుంటు: చూ, సూరసూతుఁడు.

కారవేల్లకము. సం. వి. అ. పుం.= కాఁకర *: చూ, సుషవి. 1.

కారవేల్లము. సం. వి. అ. పుం.= —వై.— (రూ- కారవల్లి.)

కారస్కరము. సం. వి. అ. పుం, ఒకరకము చెట్టు: కొలపీలుకము, కుపీలువు.

కారస్కరాటిక. సం. వి. ఆ. స్త్రీ. శతపది, చెవిఁజొరుపాము: చూ, సర్పము.

కారాకిల్లి. వా. వి: చూ, రూ- కారపుకిల్లి.

కారాకు. దే. వి. (కారు+ఆకు) 1. చెట్టున పండిన ఆకు; భార. భీష్మ. 1. ఆ. 204: చూ, పర్ణము. 1; 2. ఎండాకు: చూ, పర్ణము. 1.

కారాకూరము. దే. విశ. 1. కలఁగినది: చూ, మలినము. 3; జా. 2. చిందఱవందఱ. "సారెకు కేకలువేయుచు, గారాకూరమయి మనసుకళ కళపడఁగన్." (సారంగధరచరిత్ర); "కారా కూరంబులై రాక్షసులహృదయముల్ కొర్వ డన్." ఉ. రా. 1, ఆ. 75.

కారాగారము. సం. వి. అ. న. చెఱ: చూ, బంధనాలయము (చూ, సదనము. 1.)

కారాట. దే. వి. వ్యాపించుట: చూ, వ్యాపనము.

కారామల్లు. దే. వి. బ. తెల్ల అలచందలు: చూ, రాజమాషము.

కారాగుప్తుఁడు. సం.విశ.చెఱయందున్న వాఁడు.

కారాబ్రాహ్మణులు. పా. ఉత్కళ దేశమున వసించు బ్రాహ్మణులలో నొక తెగవారు. వీరు శుక్లయజుర్వేదులు. కాణ్వశాఖీయులు: చూ, బ్రాహ్మణులు.

కారాయిక. సం. వి. ఆ. స్త్రీ. పెద్దకొక్కెర: చూ, బకము.

కారాలుమిరియాలునూఱుట. జా. మిక్కిలి కోపము చేయుట; మొదలు కారము, అందులో మిరియములు గూడ గలిపి నూఱినపక్షమున మఱింత కారముగానుండును. "నోరెఱుఁగని వారిపై కారాలు మిరియాలు నూఱుచు." (ధర్మజరాజసూయము.)

కారావేశ్మ. సం. వి. న్. న. చెఱ: చూ, బంధనాలయము. (చూ, సదనము. 1.)

కారి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఉత్తరప్రత్యుత్తరములు: కారిక; 2. నాఁగటిమేఁడి: చూ, మేఁడితోఁక; 3 ఒకానొకచెట్టు. కార్య.

కారించు. సం. స. క్రి.= కరిక. నొగుల్చు; లక్ష్మి 2, ఆ. 113: చూ, బాధించు.

కారిక. సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, కారి. 1: 2.= కొఱియ. తినుకు: చూ, యాతన; 3. కృతి, చేయుట: చూ, వ్యాపారము. 1; 4. మంగలి పని: చూ, ముండనము; 5. నట్టువుని పెండ్లాము: చూ, భార్య; 6. పద్యము: చూ, వృత్తము.1.

కారికము. దే. విశ. చేలువచేయని క్రొత్తది. (బట్ట): చూ, వస్త్రము.

కారిజేము. వై. వి.= కాలేయము. రూ- కార్జము, కడుపులో నీరుతిత్తిక్రింద నుండెడి మాంస ఖండ విశేషము, కాలఖండము; రుక్మాం. 3, ఆ. 226: చూ, యకృత్తు. (లివర్.)

కారిత. సం. వి. ఆ. స్త్రీ. అడిగినప్పుడిచ్చెడి వడ్డి, ఒడఁబాటు వడ్డి: చూ, వడ్డి.

కారితవృద్ధి. అం. ధనవృద్ధులు నాలుగింటిలో నొకటి: చూ, ధనవృద్ధులు.

కారితుఁడు. సం. విణ. చూ, శిక్షితుఁడు.

కారియ. వై. వి. 1. రూ-కాటియ. నలుపు: చూ, వర్ణము.6; 2.=కారికా. రూ-కాటియ. వగ: చూ, దుఃఖము.

కారియము. వై. వి. 1.=కార్యమ్. కృత్యము, చేఁత: చూ, వ్యాపారము. 1; 2.=కార్యమ్. రూ-కర్జము. పని: చూ, ప్రయోజనము. 1.

కారీషము. సం. వి. అ. న. 1. కరీషముల సమూహము. (కరీషము=ఎఱుపిడక): చూ, పిడక; 2. అథర్వణమంత్రముల సమూహము: చూ, అథర్వణము.

కారు. వై. వి.=కాలః 1. జ్యేష్ఠమాసము మొదలుగ నాలుగేసినెలల కాలము. "ముక్కారు." ఆయతి, (సం. ప):— కందాయము. (ఆం. భా. మున తెలుగున కలదు) చూ, మాసద్వయము; 2. వర్షర్తువు; పాండు. 4, ఆ. 19: చూ, మాసద్వయము: 3. అదను; "ననకారు.": చూ, సమయము. 1; 4. నలుపు; "కారుమొగులు.": చూ, వర్ణము. 6: దే. వి. 5. ఊషరపృథివి; భార. సా. 1, ఆ. 31: చూ, భూమి. 1, 6. అడవి; "కారుచిచ్చు": చూ, విపినము; 7. ఎండకాలమున చేల్లెడు వరిధాన్యము: చూ, ధాన్యము; 8. ముదిమి; "కారాకు": చూ, ముసలితనము; 9. కోరకము, నన; "కారుపిందె"; చూ, మొగ్గ. 1; 10. రూ-కాఱు. పటుకారు: చూ, సందంశకము; వా.11. ధూమశకటభేదము, రహదారిని ఎడ్లు లోనగునవి లాగనక్కఱలేకుండఁగ పోవునది (బస్సు-మోటారు-మోటారుకారు; ట్రామ్ డిసెల్ కారు-రైలు.): చూ, పొగబండి.

కారుండి. సం. వి. ఈ. స్త్రీ. జెలగ: చూ, బుడ్డపిడుఁదు.

కారుకంద. దే. వి. రూ- కాఱుకంద, పసరు వరి *: చూ, నూగణము.

కారుకుఁడు. సం. విణ. వడ్లంగి: చూ, స్వర్ణకారుఁడు.

కారుకొను. ద్వ. అ. క్రి. రూ- కార్కొను-కాఱుకొను, నల్లబాఱు; భార. భీష్మ. 2, ఆ. 169: చూ, సందడించు.

కారుకొమ్ముమెకము. ద్వ. వి. దుప్పి: చూ, పృషతము. 1.

కారుకొల్లి. వై. వి. = కాగోలి *: చూ, వాయసోలి.

కారుకొల్లి. వై. వి.= —వై.—

కారుకోడి. ద్వ. వి. అడవికోడి: చూ, పుంజు. (రూ- కాఱుకోడి)

కారుగచ్చ. ద్వ. వి. వాగుజి *: చూ, సోమరాజి.

కారుగృహము. సం. వి. అ. న. వడ్లవాఁడు పనిచేయుసాల, అన్యాసము: చూ, సదనము. 1.

కారుచిచ్చు. ద్వ. వి. (రూ- కార్చిచ్చు- కాఱుచిచ్చు - కాఱ్చిచ్చు) దావానలము, ఎరగలి: చూ, నిప్పు.

కారుచు. దే. స. క్రి. 1. ఒలుకు; (రూ-కార్చు-కాఱుచు): చూ, పడుము; 2. కాఁజేయు: రూ- కార్చు- కాఱుచు.

కారుజము. సం. వి. అ. పుం. 1. కలుఁగానుగు, కాఱునువ్వు *: చూ, వార్షికము. 1; 2. జగడము: చూ, యుద్ధము; 3. నురుగు: చూ, ఫేనము; 4 గైరికము: చూ, శిలాజిత్తు; 5. నాభి, విషభేదము *: చూ, విషము. 1; 6. అహికేసరము *: చూ, నాగకేసరము; 7. ఏనుఁగుపిల్ల: చూ, హస్తి; 8. శిల్పిచిత్రము. చూ, శిల్పము; 9. పుట్ట: చూ, వల్మీకము.

కారుజీవము. ద్వ. వి. గిలగిచ్చే *: చూ, శణ పుష్పిక.

కారుణికుఁడు. సం. విణ. దయాళువు: చూ, సురతుఁడు.

కారుణ్యము. సం. వి. అ. న. రూ- కరుణ: చూ, దయ.

కారునూవు. దే. వి. జర్తిలము, రూ- కాఱు నువ్వు *: చూ, వార్షికము. 1.

కారుపెసర. దే. వి. 1. ముద్గపర్ణి, పిల్లపెసర *: చూ, పెసర; 2. వనముద్గము *: చూ, పెసర. (రూ- కాఱుపెసర)

కారుపోఁక. ద్వ. వి. శైలపూగము*: చూ, పోఁక.

కారుపోఁతు. దే. వి. కాఱుదున్న: చూ, మహిషము.

కారుబుడమ. దే. వి. తీవ్రగంధము *: చూ, బుడమ.

కారుమినుము. దే. వి. మాషపర్ణి. రూ- కాఱు మినుము *: చూ, మినుము.

కారుమునగ. ద్వ. వి. వనశిగ్రువు*: చూ, శిగ్రువు.

కారువు. సం. వి. ఉ. పుం. 1. విశ్వకర్మ: చూ, పనివాఁడు; విణ. 2. —పై.—; 3. వడ్లంగి, శిల్పి: చూ, స్వర్ణకారుఁడు.

కారుషుఁడు. సం. వి. అ. పుం. 1. కరూషదేశస్థుఁడు: రూ- కారూశుఁడు- కారూషుఁడు; 2. కరూశదేశాధిపతి: రూ- కారూశుఁడు- కారూషుఁడు.

కారూత్తముఁడు. సం. విణ. శిల్పులలో శ్రేష్ఠుఁడు: చూ, స్వర్ణకారుఁడు.

కారూరు. దే. వి. (కారు + ఊరు) అడవిపల్లె; హరి. పూ. 5, ఆ. 148: చూ, దేశము.

కారూశము. సం. వి. అ. పుం. బృహద్గుహా, ఒకానొక దేశము: చూ, దేశము

కారూశుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ- కారుషుఁడు.

కారూషుఁడు. సం. వి. అ. పుం: చూ, కారూశుఁడు.

కారే. వై. వి. = క్షార. ఉప్పుగడ్డి *: చూ, తృణము. 1.

కారేము. దే. వి. మళ్ళకు నీరెత్తెడు తాటిదోన: చూ, తలము. 2.

కారేలకి. ద్వ. వి. (కారు + ఏలకి) ఏలాపర్ణి *: చూ, సన్నరాష్ట్రము.

కారోత్తమము. సం. వి. అ. పుం. కల్లుతేట: చూ, సురామండము.

కారోత్తరము. సం. వి. అ. పుం. 1. సురాగ్రభాగము: చూ, సుర; 2. బావి: చూ, నుయ్యి.

కార్కటుకము. అం. కామశాస్త్రమునందలి ఉత్తానకరణబంధములు నలుబదియొకటింటిలో నొకటి: చూ, ఉత్తానకరణబంధములు.

కార్కటము. సం. వి. అ. న. 1. —పై.—; 2. రతిబంధవిశేషము: చూ, రతిబంధము.

కార్కరకము. సం. వి. అ. పుం. పాలనురుగు: చూ, ఫేనము.

నాలయము. ( ... న. = కఱకుఁదనము,

కారి. సం. వి. ఇ. స్త్రీ. 1 ... ములు: కారిక; 2. ... మేఁడిలోఁక; 3 ఒ... చూ, రూ- కారు

కార్ఖానా, ఖార్ఖానా. హిం. పనిచేయుస్థలము.

కార్చిచ్చు. దే. వి. రూ- కారుచిచ్చు: చూ, నిప్పు.

కార్చు. దే. స. క్రి: చూ, రూ- కారుచు.

కార్ణము. వై. వి. = కాలేయము: చూ, రూ- కాలిజము. (లివర్)

కార్తవీర్యంపువు. సం. వి. ఉ. పుం. జమదగ్ని కొడుకు: చూ, పరశురాముఁడు.

కార్తవీర్యార్జునుఁడు. అం. 1. చక్రవర్తులు ఆఱుగురిలో నొకఁడు: చూ, చక్రవర్తులు; పుం. 2. బాహుసహస్రభృత్తు: చూ, హైహయుఁడు.

కార్తవీర్యుఁడు. సం. వి. అ. పుం. బాహుసహస్రభృత్తు: చూ, హైహయుఁడు.

కార్తస్వరము. సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1; 2. చెడ్డదీనధ్వని: చూ, స్వరము 2.

కార్తాంతికుఁడు. స . వి. అ. పుం. జోస్యుఁడు: చూ, సాంవత్సరుఁడు.

కార్తికము. సం. వి. అ. పుం. కత్తెరనెల: చూ, మాసము. 1. (రూ- కార్తీకము- కార్తికికము- కృత్తికానక్షత్రయుక్తమైన పున్నమగల నెల. శత్రులగెలువ నిశ్చయించినవారికి నుత్సాహముగలదు)

కార్తికి. సం. వి. ఈ. స్త్రీ. విశ్వేదేవులలో భేదము. తద్విశేషములు.— కాలుఁడు. కుపేరుఁడు, కుష్మాండుఁడు, క్రతువు, క్షేత్రపాలుఁడు- క్షు. మొ: చూ, విశ్వేదేవులు.

కార్తికికము. సం వి. అ. పుం: చూ, కార్తికము.

కార్తికేయుఁడు. సం. వి. అ. పుం. కుమారస్వామి: చూ, స్కందుఁడు.

కార్తికేయప్రసువు. సం. వి. ఊ. స్త్రీ. వేఁకయ్యతల్లి: చూ, పార్వతి. 1.

కార్తికోత్సవము. సం. వి. అ. పుం. చంద్రిక: చూ, వెన్నెల.

కార్తీకము. అం: చూ, కార్తికము; మాసములు పండ్రెండింటిలో నొకటి: చూ, మాసములు.

కార్తస్వరా... సం. వి. ఆ. స్త్రీ. 1. భుజంగాక్షి*: చూ, సర్పాక్షి; 2. ఏలాపర్ణి*: చూ, పిరంగిచెక్క.

కార్త్స్న్యము. సం. వి. అ. న. అంతయు: చూ, సర్వము.

కార్తె. వై. వి. 1. = కృత్తికా. కృత్తికానక్షత్రము; భార. అను. 2, అ. 378: చూ, నక్షత్రము. 1; 2. = క్రాంతి. సూర్యుఁడుండు నక్షత్రము; "చిత్తకార్తె, స్వాతికార్తె." మొ: చూ, నక్షత్రము. 1.

కార్దమి. సం. వి. ఇ. పుం. కడలిఱేఁడు: చూ, వరుణుఁడు.

కార్దమికము. సం. విణ. బురదలోనగూడుకొన్నది: కార్దమికి.

కార్దమికి. సం. వి. ఈ. స్త్రీ. —వై.—

కార్దముఁడు. సం. వి. అ. పుం: చూ, కార్దమి.

కార్పటము. సం. వి. అ. పుం. 1. లాక్ష: చూ, లక్క; విణ. 2. చింపిగుడ్డల సంబంధమయినది.

కార్పటికుఁడు. సం. వి. అ. పుం. 1. = కోమటి: చూ, వైశ్యుఁడు; 2. తీర్థము మోసుకొనిపోయెడు బాటసారి: చూ, పాంథుఁడు; 3. పరాయివానిగుట్టు తెలిసినవాఁడు: రూ- కార్పాటకుఁడు.

కార్పణ్యము. సం. వి. అ. న. 1. కృపణత్వము; 2. విషవిశేషము: చూ, విషము. 1.

కార్పాటకుఁడు. సం. వి. అ. పుం. 1. పరాయివానిగుట్టు తెలిసినవాఁడు: చూ, కార్పటికుఁడు. 3; 2. సిసువుఁడు: చూ, శిష్యుఁడు.

కార్పారి. వై. వి. = కార్యకారి: చూ, వ్యవహార్త. 2.

కార్పాసనాసిక. సం. వి. ఆ. స్త్రీ. కదురు: చూ, తక్కువు.

కార్పాసము. సం. వి. అ. పుం, న. 1. రూ- కర్పాసము *: చూ, ప్రత్తి; విణ. 2. నూలిచేత సేయఁబడినది (చీర): చూ, వస్త్రము.

కార్పాసి. సం. వి. ఈ. స్త్రీ గూ- కర్పాసి*: చూ. ప్రత్తి.

కార్పాసిక. సం. వి. ఆ. స్త్రీ. —వై—

కార్బారి. వై. వి. = కార్యకారి, రూ- కార్పారి: చూ, వ్యవహార్త. 2.

కార్ష్ణిఅ. ద్వ. వి. అడవిబీఱ *: చూ, బీఱ. 2.

కార్బురము. సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1; 2. దోషము: చూ, పాపము; 3. జలము: చూ, నీరు. 1; 4. ఆకాశము: చూ, విన్ను; విణ. 5. బంగరుచే జేయఁబడినది.

కార్మణము. సం. వి. అ. న. 1. చిల్లింగి, మూలికలచేతఁజేసెడి యుచ్చాటనాదిక్రియ: చూ, మూలకర్మ: విణ. 2. నెఱవేఱుదాఁకఁ బని చేయునది.

కార్ముఁడు. సం. విణ: చూ, కర్మశీలుఁడు.

కార్ముకము. సం. వి. అ. న. 1. విల్లు: చూ, బాణము, 1; 2. శాస్త్రము: చూ, శాస్త్రములు; పుం. 3. వెదురు *: చూ, వేణువు; 4. పెద్దవేప *: చూ, వేము; 5. తెల్లతుమ్మ*: చూ, విట్ఖదిరము; 6. కులము: చూ, వంగడము; అం. 7. ఇది-చాపము, ధనుస్సు, కోదండము అని త్రివిధము. (ఇది బ్రాహ్మణునకు ఉపనయనకాలమునందు యజ్ఞోపవీతధారణమువలెను క్షత్రియునకు వామభుజాగ్రమందు నార్తరక్షణ దీక్షాపూర్వకముగను ధరింపఁదగినదిగా వేదవిధివాక్యములచేత విధింపఁబడియున్నది.): చూ, బాణము. 1.

కార్ముకుఁడు. సం. విణ: చూ, పనివాఁడు.

కార్య. సం. వి. అ. స్త్రీ. ఒకానొక చెట్టు: చూ, కారి. 3. (చూ, వృక్షము)

కార్యకము. సం. వి. అ. పుం. దూసరతీఁగె *: చూ, వత్సాదని.

కార్యకర్త. సం. వి. ఋ. పుం. ఉత్సాహముచే బనులు చేయువాఁడు: చూ, వ్యవహర్త. 2.

కార్యకారణన్యాయము. పా. కార్యవస్తువుంబట్టి కారణవస్తువు ఉన్నట్లూహించురీతి.

కార్యకారి. సం. వి. న్. పుం: చూ, కార్యకర్త.

కార్యకుశలుఁడు. సం. విణ. —పై.—

కార్యకూటుఁడు. సం. వి. అ. పుం. 1. పిసినిగొట్టు: చూ, లోభి; 2. ఉన్మత్తుఁడు: చూ, వెట్టివాఁడు; 3. ఉన్మాదుఁడు: చూ, మారకుఁడు.

కార్యక్షముఁడు. సం. విణ. తాపములేనివాఁడు: చూ, వేఁడిమిలేనివాఁడు.

కార్యత్రియము. అం. సృష్టి, స్థితి, లయములు, (3): చూ, త్రయము.

కార్యదర్శి. సం. విణ. (న్. ఈ. న్.) (శక్రటరీ) చూ, కార్యకర్త.

కార్యనిబంధనాప్రస్తుతప్రశంస. సం.వి.ఆ.స్త్రీ. ఒకానొక అలంకారము: చూ, హేతువు 2.

కార్యపుటము సం. వి. అ. పుం. 1. అశుచిభావము: చూ, క్షపణము; 2. ఉన్మత్త *: చూ, హాలాపువ్వము.

కార్యప్రద్వేషము. సం. వి. అ. పుం. ఆలస్యము: చూ, విలంబము. 1.

కార్యము. సం. వి. అ. న. 1. = కారియము. కృత్యము: చూ, వ్యాపారము.1; 2.=కర్మము. పని: చూ, ప్రయోజనము. 1; 3. కారణము: చూ, హేతువు; పా. 4. సంపూర్ణఫలప్రాప్తి, ఫలాగమము, ఫలవంతమైనకృత్యము, కార్యము; వా. 5. గర్భాధానము. "మా అబ్బాయి కార్యము. ఆశీర్వాదమునకు తాంబూలమునకు దయచేయండి."(వివాహమందును కార్యమని వాడుక.)

కార్యములుగట్టెక్కించుట. జా. నెఱవేర్చుట. "సమరంబున నరినేలమట్టి కార్యము గట్టెక్కించుకొనువాఁడను."(ధర్మజరాజనూయము)

కార్యసముద్భవుఁడు. పా. స్వపక్షమువారేడుగురిలో నొకఁడు: చూ, అభిభయము.

కార్యసిద్ధి. అం. అంగపంచకములోనొకటి: చూ, అంగపంచకము.

కార్యాధికారి. అం.1.పాత్రులుపండ్రెండుగురిలో నొకఁడు: చూ, పాత్రులు; 2. అకృతపాత్రులలో నొకఁడు: చూ, అకృతపాత్రులు.

కార్యార్థిన్యాయము. పా. కార్యములఁ గోరిన వారికి గర్వమేల? గర్వమువలనఁ గార్యము చెడుననురీతి.

కార్మునగ. ద్వ. వి. రూ- కాఱుమునగ, వనశిగ్రువు *: చూ, శిగ్రువు. 1.

కార్శ్యము. సం. వి. అ. పుం. 1 సర్జము *: చూ, మద్ది; 2. ద్వాదశావస్థలలో నొకటి: చూ, ద్వాదశావస్థలు. (చూ, అవస్థలు)

కార్షకుఁడు. సం. వి. అ. పుం. 1. ఆరకాఁడు: చూ, వ్యవసాయి; 2. ఆకర్షించువాఁడు: చూ, తిగుచువాఁడు.

కార్షాపణము. సం. వి. అ. పుం. 1. పదియాఱు పణముల యెత్తు; 2. కర్షమెత్తు, వెండిటంకము: కార్షికము.

కార్షి. సం. వి. ఈ. స్త్రీ. నీటిపాచి *: చూ, శైవలము. 1.

కార్షికము. సం. వి. అ. పుం. కర్షమెత్తు వెండి టంకము: కార్షాపణము. 2.

కార్షుఁడు. సం. విణ. ఆరకాఁడు: చూ, వ్యవసాయి.

కార్ష్యము. సం. వి. అ. పుం: చూ, రూ- కార్శ్యము. *. 1.

కార్ష్ణి. సం. వి. ఇ. పుం. 1. మరుఁడు: చూ, మన్మథుఁడు; ఈ. స్త్రీ. 2 పిల్లపీచర *: చూ, శతమూలి.

కార్ష్ణ్యము. సం. వి. అ. న. నలుపు: చూ, వర్ణము. 6.

కాఱించు. దే. స. క్రి. ఏఁచు: చూ, బాధించు.

కాఱియ. వై. వి. రూ- కారియ. 1. నలుపు: చూ, వర్ణము. 6; 2.= కారికా. వగ: చూ, దుఃఖము; 3.= కారికా. తినుకు; హరి, ఉ. 1, అ. 168: చూ, యాతన; 4. కష్టము: చూ, దుఃఖము.

కాఱియపడు. వై. అ. క్రి. యాతనపడు; రా. సుం, కాం. 222: చూ, తినుకు.

కాఱియపెట్టు. ద్వ. స. క్రి. యాతనపఱచు; భార. అను. 5, అ. 373.

కాఱు. దే. వి. 1. అజ్ఞానము; భార. అను. 4, అ. 202: చూ, మఱపు. 2; 2. కట్టు, డాగు: చూ, మఱక; 3. (రూ- కారు- పటుకాఱు- పటుకాఱు- పట్టుకాఱు-నీరుకాఱు) కంసాలి పనిముట్టు: చూ, సందంశకము; విణ 4. దట్టము; భార. ఆది. 4, అ. 19: చూ, సాంద్రము. 2; 5 మిక్కిలి కాఱుట: చూ, స్రవణము; దే. అ. క్రి, వై. అ. క్రి. 6.= క్షరణ. వడియు: చూ, స్రవించు; దే. అ. క్రి. 7. ఊఁడు; హరి. పూ, 4. అ. 148: చూ, రాలు.

కాఱుకంద. దే. వి. రూ- కారుకంద *.

కాఱుకొను. దే. అ. క్రి: చూ, రూ- కార్కొను- కారుకొను.

కాఱుకోడి. ద్వ. వి: చూ, రూ- కారుకోడి.

కాఱుచిచ్చు. ద్వ. వి: చూ, రూ- కారుచిచ్చు.

కాఱుచు. దే. స. క్రి: చూ, రూ- కారుచు.

కాఱుమన్ను. దే. వి: చూ, కారుపోతు.

కాఱునువ్వు. దే. వి. జర్తిలము *: చూ, రూ- కారునూవు.

కాఱుపెసర. దే. వి: చూ, కారుపెసర.

కాఱుపోతు. దే. వి: చూ, రూ- కారుపోతు. (రూ- కాఱ్పోతు)

కాఱుమినుము. దే. వి: చూ, రూ- కారుమినుము.

కాఱులు. దే. వి. బ. 1. రూ- కాఱ్గొడ్డము- కఱకులు- కరుకు, కల్ల: అచ్చ. అ. కాం. 80: చూ, వితథము; 2. కష్టపెఱుపుమాట; పర. 3, అ. 294: చూ, పరుషము; 3 హాస్యమగుమాట; భార. ఉద్యో. 3, అ. 107; చూ, వ్యాఖ్యాతము. 2.

కాటినుఁబోతు. ద్వ. వి: చూ, కొరుపోతు.

కాట్రొడ్డము. దే వి. కట్టెవిఱుపుమాట: చూ, పరుషము. (ఆ . భా. ప్రి. వాగ్వ. 117)

కాత్చిచ్చు. ద్వ. వి. 1. దావానలము: చూ, రూ- కొఱుచిచ్చు- కాఱుచిచ్చు; 2. కుక్కుటభేదము: చూ, పుంజు; 3. ఒకానొక వేఁటకుక్క: చూ, కునకము.

కాల. సం. వి. ఆ. స్త్రీ. 1. కలిగొట్టు *: చూ, పాలి. 3; 2. నల్లతీలకఱ్ఱ *: చూ, సువవి.2. 3. నల్లతెగడ *: చూ, సర్వానుభూతి; 4 నీలి *: చూ, రంజని; 5 మంజిష్ఠ*: చూ, మంజిటి.

కాలంకతము. సం. వి. అ. పుం. ఒకానొకచెట్టు: చూ, వృక్షము.

కాలంజరము. సం. వి. అ. పుం. కొండ: చూ, పర్వతము.

కాలంజరి. సం. వి. ఈ. స్త్రీ. గట్రిమాలి: చూ, పార్వతి. 1.

కాలంజరుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

కాలకంటకము. సం. వి. అ. పుం. రూ- కాలకంఠకము. కూకురుగుండంగి: చూ, దాత్యూహము.

కాలకంఠకము. సం. వి. అ. పుం. —పై.—

కాలకంఠము. సం. వి. అ. పుం. 1. —పై—; 2. ఊరఁబిచ్చుక: చూ, పిచ్చుక; 3. నెమలి: చూ, మయూరము; 4. ఏటిగ్రింత: చూ, వ్యాఘ్రాటము; 5. సర్జకము *: చూ, వేఁగిస.

కాలకంఠిక. సం. వి. అ. స్త్రీ. జ్యేష్ఠాదేవి:చూ, పెద్దమ్మ. 1.

కాలకంఠుఁడు. సం. వి. అ. పుం. 1. కఱకంఠుఁడు: చూ, శివుఁడు; 2. జీముఁడు: చూ, యముఁడు.

కాలకందకము. సం. వి. అ. పుం. నీరుపాము: చూ, సర్పము.

కాలకము. సం. వి. అ. పుం. తిలకము: చూ, పుట్టుమచ్చ.

కాలకర్ణి. సం. వి. ఈ. స్త్రీ. కాలకంఠిక: చూ, పెద్దమ్మ. 1.

కాలకర్ణిక. సం. వి. అ. స్త్రీ. —పై.—

కాలకలన. సం. వి. అ. స్త్రీ. కాలముయొక్క యేర్పాటు: చూ, కాలనియతి, కాలనియమము.

కాలకలము. సం. వి. అ. న. కృకము, ముచ్చిలిగుంటమీఁది బుడిపి: చూ, బుడిపి.

కాలకాములు. బం. ఇద్దఱు విశ్వేదేవులు; విశ్వేదేవులు పదుమువురిలో నొకరు: చూ, విశ్వేదేవులు.

కాలకాలుఁడు. సం. వి. అ. పుం.కఱకంఠుఁడు: చూ, శివుఁడు.

కాలకొహము సం. వి. అ. న. ఇనుము: చూ, లోహము. 1.

కాలకిలము. సం. వి. అ. పుం. కోలాహలము: చూ, స్వరము. 2.

కాలకుంతుఁడు. సం. వి. అ. పుం. జీముఁడు. చూ, యముఁడు.

కాలకుంతి. సం. వి. ఈ. స్త్రీ. గచ్చ *: చూ, సోమరాజి.

కాలకుద్ధుఁడు. సం వి. అ. పుం. జీముఁడు: చూ, యముఁడు.

కాలకుష్ఠము. సం. వి. అ. న. కాకకుష్ఠము, కంకుష్ఠమను గజజాత గ్రంథ్యము: చూ, రాజాగము.

కాలకూటము. సం. వి. అ. న. 1. విషభేదము: చూ, విసము. 1; 2. విషవిద్యాతంత్రము: చూ, మాయము. 1; 3. ఆయుర్వేదౌషధము లలో నొకటి. ఇది చేయువిధము—(శుద్ధి

చేసిన) వసనాభి 11 పా, పాదరసము 6 పా, ఇంగిలీకము 7 పా, తాళకము 7 పా, తామ్రభస్మము 8 పా, గంధకము 5 పా, మణిశిల 6 పా, కరకతాడి ఉసిరికలు 8 పా, శొంఠి పిప్పలి, మిరియాలు 3 పా, నేపాళములు 2 పా. పొంగించిన వెలిగారము 4 పా, వీనిని కల్వమందుంచి చిత్రమూలము, తెల్లజిల్లేడు, మునగ, వరగోఁగు, దుట్టుపువేరు, వీని రసముతో ఒక్కొక్కదినము నూరి గురిగింజంత మాత్రలుచేసి అల్లము,శొంఠి మున్నగు అనుపానములతో సేవించిన సన్నిపాతములు క్షయలు మున్నగు రోగములు తగ్గును.

కాలకృత్తు. సం. వి. త్. పుం. సూర్యుఁడు: చూ, సూర్యుఁడు:

కాలక్షేపము. సం. వి. అ. పుం. 1. సర్గప్రతిసర్గాది పంచలక్షణములతోఁ గూడిన బ్రాహ్మాది. ఇవి పదునెనిమిది: చూ, పురాణములు; వా. 2. వృథాగాచేయు నాలస్యము: చూ, విలంబము. 1.

కాలఖంజనము. సం. వి. అ. న: చూ, కారిజేము.

కాలఖండము. సం. వి. అ. న.—పై.—

కాలగుంజి. సం. వి. ఆ. స్త్రీ. నల్లగురివెంద *: చూ, తులాబీజము.

కాలగ్రంథి. సం. వి. ఇ. పుం. ఏఁడాది: చూ, సంవత్సరము.

కాలచక్రము. సం. వి. అ. న. 1. కాలరూపమైన చక్రము:అం. 2.అస్త్రములలో నొకటి: చూ, అస్త్రములు. (దండచక్రము, కాలచక్రము. విష్ణుచక్రము. మొ.)

కాలజము. అం. మేఘములు తొమ్మిదింటిలో నొకటి: చూ. మేఘములు.

కాలజ్ఞము. సం. వి. అ. పుం. 1. కోడి: చూ, కుంజా; 2. కోయిల: చూ, పికము.

కాలజ్ఞుఁడు. సం. వి. అ. పుం. జోస్యుఁడు: చూ, సాంవత్సరుఁడు.

కాలటుక. దే. వి. (కాలు+అటుక) కుండలు దించుటకై రెండు మొసలు ఇరుప్రక్కల గోడలయందుఁ బొదిగి యూఁతగాఁ గొల్లునుంచి యడ్డముగా నమర్చిన మార్గము.

కాలతాళము. సం. వి. అ. పుం. ఉలిమిరి *: చూ, శ్వేతపుష్పము.

కాలత్రయము. అం. భూతకాలము, భవిష్యత్కాలము, వర్తమానకాలము. (3): చూ, త్రయము.

కాలధర్మము. సం. వి. అ. పుం. 1. చావు: చూ, మరణము; 2. కాలముయొక్క ధర్మము.

కాలధూమము. సం. వి. అ. పుం.=కటిదూపము, కచమాలము: చూ, పొగ.

కాలనిర్యాసము. సం. వి. అ. పుం. గుగ్గిలము *: చూ, మహిసాక్షి.

కాలనేమియపనారి. సం. వి. ఇ. పుం. వెన్నుఁడు; (త్రికాండశేషము, స్వర్గ. 31.): చూ, విష్ణువు 1.

కాలనేమిరిపువు. సం. వి. ఉ. పుం. —పై.—

కాలపంచకము. అం. ప్రాతస్సంగమ మధ్యాహ్నపరాహ్ణ సాయంకాలములు. (5)

కాలపత్రి. సం. వి. ఈ. స్త్రీ. గచ్చి *: చూ, సోమరాజి.

కాలపరిమాణము. పా. 1. దీనిలోని మానము.- సెకనులు, నిమిషములు, గంటలు. దినములు, నెలలు, సంవత్సరములు 60. సె = 1 ని; 60ని = 1గం; 24గం=1 ది; 30ది=1 నె; 12నె= 1 సం.(ఇదియే కాలపరిమానము.); 2. కాలపరిమాణమును తెలిసికొనుట.-భూమధ్యరేఖ ఒక వలయము అగుటచే, దానియందు 360 అంశలు గలవు. భూమి తనమిట్టును తిరుగుచుండుటచేత సూర్యుఁడు ఉదయమయి క్రమక్రమ

ముగా ఆకాశముపైకెక్కి తరువాత దిగి అస్తమించిపోయినట్లు మన కగపడుచున్నది. కాబట్టి భూమియందలి ప్రతిస్థానమునందును దినమునకొక సారి ఆకాశమునందు సూర్యుఁడు ఉచ్ఛస్థానము (ఎత్తయినస్థానము)ను పొందుచున్నాఁడు. దీనికే మధ్యాహ్నమని పేరు. ఒక మధ్యాహ్నమునకును మఱియొక మధ్యాహ్నమునకును, మధ్య గడచిపోవు కాలమునకు "సౌరదినము" అని పేరు. సంవత్సరము పొడవునను ఈ సౌరదినపరిమాణము సమానముగా నుండదు. కాని వీని సగటుపరిమాణమును కనుఁగొనినయెడల నది "మాధ్యమసౌరదినము"అగుచున్నది. ఇట్లేర్పడిన దినమును 24 గం. గాను, ఒకగంటను 60 ని. గాను, ఒక నిమిషమును 60 సె. గాను భావించి జనులు వాడుచున్నారు. మనముండు భూమి పూర్ణముగా తన చుట్టును అనఁగా 360 అంశలగుండ 24 గంటలలో తిరుగుచుండుటచేత 1 అంశగుండ, 15 నిమిషములలో తిరుగుచున్నది. ఇట్లు కాలముయొక్క మానము అయినదినము భూభ్రమణమునుబట్టి యేర్పడినను, కాలపరిమాణమును గడియారములను యంత్రముల సాహాయ్యముచే కనుగొనుచున్నాము. ఈ యంత్రముల యందలి ముండ్లు గంటలను, నిమిషములను సూచించును: చూ, కాలప్రమాణము. (చూ, అహఃప్రమాణము. 1.)

కాలపరిమితి. పా. ఆయుష్యము.

కాలపర్ణము. సం వి. అ. పుం. నంది *: చూ, నందివర్ధనము.

కాలపర్ణి. సం. వి.ఈ. స్త్రీ. మయ్యూశుపాన్న*: చూ, పాలపర్ణి.

కాలపాలకము సం వి. అ. న. కంకుష్ఠమృత్తిక: చూ, భూమి. 1.

కాలపాశము. అం. అస్త్రములలో నొకటి: చూ, అస్త్రములు. (ధర్మపాశము, కాలపాశము, వరుణపాశము. మొ.)

కాలపీలుకము. సం. వి. అ. పుం: చూ, కారస్కరము *:

కాలపురుషదానము. అం. షోడశమహాదానములలో నొకటి: చూ, షోడశమహాదానములు.

కాలపురుషుఁడు. సం. వి. అ. పుం. 1. యముని సహాయుఁడు; 2. జ్యోతిశ్శాస్త్రము: చూ, జోస్యము. (చూ, శాస్త్రములు.): 3. ఈశ్వరుఁడే కాలపురుషుఁడు. కాలపురుషునికిని, లగ్నములకును. గ్రహములకును నక్షత్రములకును గల సంబంధమేమి.—కాలపురుషునికి— మే = శిరస్సు, వృష=ముఖము, మి=వక్షస్సు, కర్క = హృదయము, సిం = కుక్షి, కన్య= కటి, తు = వస్తి(నాభిలింగ మధ్యప్రదేశము,) వృశ్చి = వ్యంజనము (పురుషచిహ్నమైన లింగము), ధ = ఊరుగళము, మ = జానుయుగళము, కుం = జంఘాద్వయము, మీ = అంఘ్రిద్వయము; రవి = ఆత్మ, చం = మనస్సు, కు = శక్తి, బు = వాక్కు, గు = జ్ఞానము, శు = ఇంద్రియ సుఖములు; శ = దుఃఖము. నక్షత్రములు ఇరువదియేడిటియొక్క 108 పాదములును పైనచెప్పిన మేషాది పండ్రెండు లగ్నములయి యున్నవి. గనుక నక్షత్రములు కూడ నీశ్వరస్వరూపమే యని గ్రహింపఁదగినది. ఇంగ్లండులోనుంచి శ్రీజార్జి చక్రవర్తి గారు ఆయా యుద్యోగములకు దగిన యధికారుల నేర్పఱిచి వారి మూలకముగ మనకు శుభాశుభముల నిప్పించుచు హిందూ దేశములోనుండు మనలనెట్లు పాలించుచుండిరో యాలాగుననే యీశ్వరుఁడు తన స్వరూపములగు నక్షత్రములను, లగ్నములను, గ్రహములను మనకొఱకు నేర్పఱిచి వారిమూలకముగ మనకు శుభాశుభములను గలుగ

చేయుచున్నాఁడు. (కాలపురుషుఁడు=ఈశ్వరుఁడు.)

కాలపృష్ఠము. సం. వి. అ. న. 1. కర్ణుని విల్లు: చూ, బాణము. 1; 2. విల్లు: చూ, బాణము. 1; 3. ఒకరకము ఇఱ్ఱి: చూ, హరిణము. 1; 4. కంకము: చూ, రాబందు.

కాలపేయి. సం. వి. ఈ. స్త్రీ. నల్లతెగడ *: చూ, సర్వానుభూతి.

కాలప్రకాశిక. సం. వి. ఆ. స్త్రీ. ముహూర్త గ్రంథము.

కాలప్రభాతము. సం. వి. అ. న. శరదృతువు: చూ, మాసద్వయము.

కాలప్రమాణము. సం. వి. అ. న. 1. కాలముయొక్క కొలత:—ఒక మనుష్యునియొక్క పదునెనిమిది ఱెప్పపాట్ల కాలము=కాష్ఠ. ($\frac{4}{15}$ సెకను); ముప్పది కాష్ఠల కాలము=కల (8 సెకనులు); ముప్పది కలలుగల కాలము=క్షణము (4 నిమిషములు); పండ్రెండు క్షణముల కాలము=ముహూర్తము (48 నిమిషములు=రెండుగడియలు); ముప్పది ముహూర్తముల కాలము=అహోరాత్రము=రేయింబగలు=ఒక దినము; ఏడు అహోరాత్రముల కాలము=వారము; పదిహేను అహోరాత్రముల కాలము=పక్షము; రెండు పక్షముల కాలము=నెల; రెండు నెలలకాలము=ఋతువు; మూఁడు ఋతువులకాలము=అయనము; రెండు అయనముల కాలము=సంవత్సరము: చూ, కాలపరిమాణము; 2. వైద్యశాస్త్రమునందలి సప్తవిధ దోషములకు కాలప్రమాణము పదునైదు దినములనియు లేదా యేడు దినములనియు శాస్త్రవేత్తలు వచించియున్నారు.

కాలప్రాణము. అం. గాంధర్వ వేదమునందలి తాళాధ్యాయములోనిది. ఇది పండ్రెండు:- క్షణము, లవణము, కాష్ఠ, నిమేషము, కళ, చతుర్భాగము, అనుద్రుతము, ద్రుతము (బిందువు), లఘువు, గురువు, ప్లుతము, నిశ్శబ్దము, (కాకపదము)

కాలబలనము. సం. వి. అ. న. వర్మము, కవచము: చూ, వారవారణము.

కాలబలము. పా. షడ్బలములు ఆఱింటిలో నొకటి: చూ, షడ్బలములు. (కాలబలము= చంద్ర, శని, కుజులు రాత్రిలు బలిష్ఠులు. రవి, గురు శుక్రులు పగలు బలులు. బుధుఁడు రాత్రింబగళ్లు బలవంతుఁడు. శుక్లపక్షమందు శుభగ్రహములును, కృష్ణపక్షమందు పాపగ్రహములును బలవంతులు, తమ మాసమందును, తమ హోరయందును తమ వారమందును నున్న సూర్యాదిగ్రహంబులు బలవంతులు.)

కాలభృత్తు. సం. వి. త్. పుం. ఒంటిపోఁగు: చూ, బలరాముఁడు.

కాలభాండిక. సం. వి. ఆ. స్త్రీ. మంజిష్ఠ *: చూ, మంజిటి.

కాలమాధవీయము. పా. నిబంధనగ్రంథము.

కాలమానము. సం. వి. అ. పుం. 1. నల్లగగ్గెర *: చూ, కర్ణాసము; వా. 2. కాలముయొక్క స్థితి.

కాలమాలము. సం. వి. అ. పుం: చూ, కాలమానము. 1.

కాలము. సం. వి. అ. పుం. 1. తఱి: చూ, సమయము. 1; (ఈశ్వర స్వరూపము. దీనిచేత లెక్కపెట్టఁబడును. ప్రేరేపింపఁ జేయునది. దీనివలన సుఖదుఃఖములీయఁబడుచున్నవి.) 2. చావు: చూ, మరణము; 3. =కఱ. నలుపు: చూ, వర్ణము. 6; 4. ఎఱ్ఱచిత్రమూలము *: చూ, వహ్నిసంజ్ఞికము; 5. తాడి *: చూ, తాడు. 2; 6. =కారు. చూ, కాలత్రయము; విణ. 7. =కఱ. నల్లనిది: చూ, వర్ణము. 6; అం. 8. తాళప్రా

ణములు పదింటిలో నొకటి: చూ, తాళ ప్రాణములు; (చూ, తాళము. 2); 9. ద్రవ్యములు తొమ్మిదింటిలో నొకటి: చూ, ద్రవ్యములు.

కాలములు. అం. 1. ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము. (3) (ప్రాహ్ణము, అపరాహ్ణము, మధ్యాహ్నము): చూ, త్రయము; 2. గ్రీష్మము, వర్షము, శీతము. (3): చూ, త్రయము; 3: చూ, కాలత్రయము; 4: చూ, కాలపంచకము.

కాలముష్కకము సం. వి. అ. పుం. ముష్కకము *: చూ, మొక్కము. (మొక్కపు చెట్టు.)

కాలమూలము. సం. వి. అ. పుం. ఎఱ్ఱ చిత్రమూలము *: చూ, వహ్నిసంజ్ఞకము.

కాలమేశి. సం. వి. ఈ. స్త్రీ. మంజిష్ఠ *: చూ, మంజిటి.

కాలమేశిక. సం. వి. అ. స్త్రీ. —పై— (రూ-కాలమేషిక.)

కాలమేషి. సం. వి. ఈ. స్త్రీ. 1.—పై—; 2. కారుగచ్చ *: చూ, సోమరాజి; 3. తెల్ల తెగడ *: చూ, సర్వానుభూతి.

కాలమేషిక. సం. వి. అ. స్త్రీ. 1: చూ, రూ-కాలమేశిక; 2. తెల్లతెగడ *: చూ, సర్వానుభూతి.

కాలయాపనము. వా: చూ, కాలక్షేపము. 2.

కాలయుక్తి. సం. వి. ఇ. పుం. ప్రభవాది అఱువది వత్సరములలో నొకటి: చూ, సంవత్సరములు (రూ-కాళయుక్తి.)

కాలరసము. సం. వి. అ. పుం. చూ, మహిషాక్షము *.

కాలరాత్రి. సం. వి. ఇ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2. ఒకానొక రాత్రి: చూ, రాత్రి; 3. భీమరథీనది: చూ, నది.

కాలరి. దే. వి. (కాలు + అరి) 1. కాలిబంటు. (రూ-కాలిబంటు-కాలుమానిసి-కాలువురు-కాల్వురు-కాల్బంటు.): చూ, భటుఁడు. 1; 2. రూ-కాలారి. దారిపన్ను: చూ, సిస్తు. 1; 3. సమాచారమును దెలిసికొని పోయెడు వాఁడు; భార. ఉద్యో. 1, ఆ. 37: చూ, రాయబారి.

కాలరుపాంశము. పా. షడ్వ్యంశములలో నొకటి: చూ, షడ్వ్యంశములు.

కాలలవణము. సం. వి. అ.న. బిడలవణము: చూ, లవణము. 1.

కాలవ. వై. వి.=కుల్య. రూ-కాలువ: చూ, నది.

కాలవలనము. సం. వి. అ. న. కవచము: చూ, వారవారణము.

కాలవిద్రుమసస్యక. సం. వి. అ. స్త్రీ. ఒకరకము తీఁగె *: చూ, లత. 1.

కాలవిలంబము. పా: చూ, కాలయాపనము.

కాలవృంత. సం. వి. అ. స్త్రీ. పాటలి *: చూ, స్థాలి. 2.

కాలవృంతము. సం. వి. అ. న. అడవిఉలవలు: చూ, సరటి.

కాలవృంతి. సం. వి. ఇ. స్త్రీ. పాటలి *: చూ, స్థాలి. 2.

కాలశాకము. సం. వి. అ. పుం. కటివేపాకు *: చూ, బల

కాలశారము. సం. వి. అ. పుం. ఉడుత: చూ, చిక్రోడము.

కాలశాలి. సం. వి. ఇ. పుం కృష్ణశాలి ధాన్యము: చూ, ధాన్యము.

కాలశేయము. సం. వి. అ. న. చల్ల: చూ, మజ్జిగ.

కాలసర్పము. సం. వి. అ. పుం. కృష్ణసర్పము, నల్లత్రాఁచు: చూ, సర్పము.

కాలసారము. సం. వి. అ. న. పీతచందనము: చూ, సుగంధము.

కాలసూత్రము. సం. వి. అ. న. ఇనుపతంతులు గల నరకవిశేషము, నరకములు ఇరువదియొక టింటిలో నొకటి: చూ, నరకములు.

కాలసేయము. సం. వి. అ. న. చేల్ల: చూ, మజ్జిగ.

కాలస్కంధము. సం. వి. అ. పుం. 1. చీకటి మ్రాను *: చూ, తమాలము; 2. తిందుకము*: చూ, తుమికి; 3. సర్జకము *: చూ, వేగిస; 4. పొగడ *: చూ, వకుళము.

కాలస్ఫాలి. సం. వి. ఈ. స్త్రీ. సాటల *: చూ, స్ఫాలి. 2.

కాలహీనము. సం. వి. అ. పుం. లోధ్రము *: చూ, లొద్దుగు.

కాలాంజనము. సం వి. అ పుం. కాలాంజన పర్వతము: చూ, పర్వతము.

కాలాంజని. సం. వి. ఈ. స్త్రీ. పొట్టికొమ్మ లూడలుగల చెట్టు: చూ, వాస్త్రశాఖా శిఫము.

కాలాంతకుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

కాలాంతరము. పా. వేఱుసమయము.

కాలాంశము. పా. షష్ట్యంశములు అఱువదింటి లో నొకటి: చూ, షష్ట్యంశములు.

కాలాక్షరికుఁడు. సం. వి. అ. పుం. కావ్యకర్త: చూ, శిక్షితాక్షరుఁడు.

కాలాగురువు. సం. వి. ఉ. న. నల్లఅగలు: చూ, రాజార్హము.

కాలాగ్న్యంశము. పా. షష్ట్యంశములు అఱువ దింటిలో నొకటి: చూ, షష్ట్యంశములు.

కాలాగ్ని. సం. వి. ఇ. పుం. ప్రళయకాలము నందలి అగ్ని: చూ, నిప్పు.

కాలాగ్నిభైరవము. అం. శివప్రోక్తములగు చతు ష్షష్టితంత్రములలో నొకటి: చూ, తంత్రములు.

కాలాగ్నిరుద్రరసము. పా. శుద్ధిచేసిన పాదరస ము, వసనాభి, గంధకము, అజామోదము, త్రిఫలములు, సర్జక్షారము, యవక్షారము, చిత్రమూలము, సైంధవలవణము, జీలకఱ్ఱ, సౌవర్చలవణము, వాయువిడంగములు, శుద్ధిచే సిన వెలిగారము, త్రికటుకములు వీనినెల్ల సమ భాగములుగ దంచి చూర్ణముచేసి దీనికి సమ ముగ మూఁడుదినములు కలిలో నానఁబెట్టిన విషముష్టివిత్తుల చూర్ణమును కల్పి కల్వమున నిమ్మపండ్లరసముతో ఒకదినము మర్దించి మిరి యపుగింజలంత మాత్రలుచేసి నెయ్యి మిరి యపుచూర్ణము లోనగువాని అనుపానముతో నొసంగిన అగ్నిమాంద్యము, కుక్షివాతము మొదలగు యెనుబదివాతములు, గుల్మము, గ్రహణి హరించును. ఇది పూజ్యపాదునిచే వచింపఁబడినది.

కాలాగ్రజుఁడు. సం. వి. అ. పుం: చూ, మనువు.

కాలాదర్శము. పా. ఒకానొకనిబంధనగ్రంథము.

కాలానుజ. సం. వి. ఆ. స్త్రీ. యమునానది: చూ, నది.

కాలానుజుఁడు. సం. వి. అ. పుం. శని: చూ, రాహువు. 2.

కాలానునాది. సం. వి న్. పుం. 1. తుమ్మెద: చూ, భ్రమరము; 2. ఊరఁబిచ్చుక: చూ, పిచ్చుక; 3. కముఁజు: చూ, రూ- కౌఁజు; 4. చాతకము: చూ, వానకోయిల.

కాలానుశారిబ. సం. వి. ఆ. స్త్రీ. తగరము: చూ, లోహము. 1.

కాలానుసారకము. సం. వి. అ. న. తగరము, నంది *: చూ, నందివర్ధనము.

కాలానుసారి. సం. వి. న్. న. 1. దేవదారుబంక తోఁ జేసిన ధూపద్రవ్యము: చూ, రాజా

ర్హము; 2. మురయనెడు గంధద్రవ్యము: చూ, పల్లకి; ఈ. స్త్రీ. 3. మామెన *: చూ, శారిబ.

కాలానుసార్యకము. సం. వి. అ. న. జాపకమనెడి కొండయందుఁ బుట్టిన నల్లచందనము; నల్లఅగలు *: చూ, రాజార్హము.

కాలానుసార్యము. సం. వి. అ. పుం, న. ఇరుగుడు *: చూ, శింశుప; న. 2. నల్లఅగలు *: చూ, రాజార్హము; 3. అశ్మపుష్పము *: చూ, రాపువ్వు; 4. తగరము, నంది *: చూ, నందివర్ధనము. (గ్రంథి తగరమని అభిధానరత్నమాల)

కాలాపుఁడు. సం. వి. అ. పుం. 1. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; 2. నెమలి: చూ, మయూరము.

కాలాభుఁడు. సం. వి. అ. పుం. 1. నైరృతి: చూ, మూలతోఁడు; 2. జముఁడు: చూ, యముఁడు.

కాలాయసము. సం. వి. అ. న. ఇనుము: చూ, లోహము. 1.

కాలారి. దే. వి. రూ- కాలరి. దారిపన్ను: చూ, సిస్తు. 1.

కాలి. సం. వి. ఈ. స్త్రీ. రూ- కాళి. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2. గౌరీభేదము: చూ, పార్వతి. 1; 3. మట్టుబచ్చలి *: చూ, బచ్చలి; 4. నల్లజీలకఱ్ఱ *: చూ, సుషవి. 2; 5. నీలి *: చూ, రంజని; 6. నఖముచిప్ప: చూ, నఖము; 7. క్రొత్తమబ్బు: చూ, మేఘము. 1; 8. శంతనునిభార్య: చూ, భార్య; న. పుం. 9. పగటిజోతి: చూ, సూర్యుఁడు.

కాలింగము. సం. వి. అ. న. రూ- కాళింగము. 1. ఒకానొకపండు: రూ- కాళింగము, కాలిందకము; పుం. 2. కర్కారుకము *: చూ, పుచ్చ; 3. ఏనుఁగు: చూ, హస్తి.

కాలింగి. సం. వి. ఈ. స్త్రీ. పెద్దదోస *: చూ, దోస.

కాలింగిక. సం. వి. అ. స్త్రీ. తెల్లతెగడ *: చూ, సర్వానుభూతి.

కాలింగుఁడు. సం. వి. అ. పుం. రూ- కాళింగుఁడు. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. కాళింగుఁడను పాము: చూ, సర్పము; 3. మంత్రవిద్య తెలిసినవాఁడు: చూ, మాంత్రికుఁడు; 4. కళింగదేశపు రాజు: చూ, రాజు. 1.

కాలిందకము. సం. వి. అ. న. ఒకరకము పండు: చూ, కాలింగము. 1.

కాలింది. సం. వి. ఇ. పుం. రూ- కాళింది. 1. నీటియావు: చూ, ధేనువు; ఈ. స్త్రీ. 2. యమునానది: చూ, నది; 3. చిఱుతేకు *: చూ, భారంగి; 4. కాకిదొండ *: చూ, దొండ; 5. గింటెన *: చూ, దింటెన; 6. సగరమహారాజు తల్లి: కాళింది; 7. కృష్ణుని అష్టభార్యలలో నొకతె: కాళింది; 8. కాళిందియనునది: చూ, నది.

కాలిందీకర్షణుఁడు. సం. వి. అ. పుం. రూ- కాళిందీకర్షణుఁడు. ఒంటిపోఁగు: చూ, బలరాముఁడు.

కాలిందీభేదనుఁడు. సం. వి. అ. పుం. రూ- కాళిందీభేదనుఁడు. —పై.—

కాలిందీసువు. సం. వి. ఊ. స్త్రీ. 1. సూర్యుని భార్య: చూ, భార్య; 2. యమునితల్లి.

కాలిందీసోదరుఁడు. సం. వి. అ. పుం. జముఁడు: చూ, యముఁడు.

కాలిక. సం. వి. అ. స్త్రీ. రూ- కాళిక. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2. పార్వతీభేదము: చూ, పార్వతి. 1; 3. ద్రుపదరాజుకూఁతురు: చూ, ద్రౌపది; 4. అగ్నిచిత్తు: చూ, బొగ్గు; 5. నలుపు: చూ, వర్ణము. 6;

6. చీకటి: చూ, మేచకము. 1; 7. ఆఁడు కాకి: చూ, వాయసము; 8. నూఁగారు: చూ, రోమరాజి; 9. పొగబంతి: చూ, పొగ; 10. బంగారునందలి దోషము: చూ, లోహము. 1; 11. కల్లు: చూ, సుర. 1; 12. కార్తిమబ్బు: చూ, మేఘము 1: 13. మబ్బుగుంపు: చూ, మేఘము. 1; 14. వెల్లఁబాటు: చూ, వైవర్ణ్యము; 15. తేలు: చూ, వృశ్చికము. 1; 16. పాలలోని పురుగు, క్షీరకీటకము: చూ, పురుగు; 17. వెలవడ్డి: చూ, వడ్డి. 18. జటామాంసి *: చూ, మాంసి. 1; 19. తేలుకొండి *: చూ, వృశ్చికము. 2; 20. పటోలి *: చూ, పొట్ల; 21. కాళికాదేవి: చూ, మహాలక్ష్మి. 3.

కాలికంచేము. దే. వి. బాలక్రీడా విశేషము: చూ, బాలక్రీడ.

కాలికము. సం. వి. అ. న. 1. నల్లఅగలు: చూ, రాజావర్తము; 2. అగ్నిచిత్తు: చూ, బొగ్గు.

కాలికవృద్ధి. అం. ధనవృద్ధులు నాలుగింటిలో నొకటి: చూ, ధనవృద్ధులు.

కాలితనయము. సం. వి. అ. పుం. దున్నపోతు: చూ, మహిషము.

కాలితొట్రుపాటు. దే. వి. ఉద్ఘాతము: చూ, కాలుజాఱుట.

కాలిత్రోవ. దే. వి. (కాలు + త్రోవ) ఒకఁడు నడిచిపోఁదగిన దారి: చూ, మార్గము. 1.

కాలిదాసుఁడు. సం. వి. అ. పుం. కాళిదాసకవి: చూ, రఘుకారుఁడు. (రూ- కాళిదాసుఁడు)

కాలిదాసుఁడు. సం. వి. అ. పుం. —పై.— "రఘుకారః కాళిదాసో మేధారుద్రశ్చ కోటిజిత్." త్రి. శే. 186. (రూ- కాళిదాసుఁడు)

కాలినడ. దే. వి. (కాలు + నడ) రూ- కాల్నడ: చూ, పాదచారము.

కాలిని. సం. వి ఈ. స్త్రీ. ఆర్ద్రానక్షత్రము: చూ, నక్షత్రము. 1.

కాలిపామర. దే. వి. మల్లయుద్ధములోని మెలఁకువ: చూ, మల్లశాస్త్రము.

కాలిపుట్టువు. దే. వి (కాలు + పుట్టువు) అడుగుపుట్టువు: చూ, శూద్రుఁడు.

కాలిబంటు. ద్వ వి. (కాలు + బంటు) పదాతి. రూ- కాల్బంటు: చూ, భటుఁడు. 1.

కాలిబోను. దే. వి. (కాలు + బోను) మృగముల కాళ్లు తగులుకొన నొడ్డియుండెడి యురితో సంఘటితమైన మ్రాను; స్వా. 4, ఆ. 37: చూ, బోను.

కాలియ. వై. వి. = కాళికా. పిశాచము; మార్క. 1, ఆ. 286: చూ, భూతము.

కాలియొబ్రాహ్మణులు. పా. కభూరియొబ్రాహ్మణులలో నొక తెగవారు: చూ, బ్రాహ్మణులు. (చూ, కభూరియొబ్రాహ్మణులు)

కాలిసంకెల. జా. అడ్డగింత, నిరోధము. "తరుణీతనుగంధము కాలిసంకెలై నెరయఁగనిల్చి." (కువలయాశ్వ చరిత్ర.)

కాలీకము. సం. వి. అ. పుం. కొంగ: చూ, బకము (రూ- కలీకము.)

కాలీచి. సం. వి. ఈ. స్త్రీ. 1. =కచ్చేరి. న్యాయవిచారణస్థలము: చూ, సభ. 2; 2 =కచ్చేరి. యముని కొలువుసావడి. త్రి. శే.: చూ, సభ. 2. ఆం. 3. బాలురు చదువుకోటు: చూ, పాఠశాల. (రూ- కాలేజి.) (చూ, సదనము. 1.)

కాలీదాసుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ- కాలిదాసుఁడు.

కాలీపతి. సం. వి. ఇ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

కాలీయకము. సం. వి. అ. న. 1. పీతవర్ణసుగంధికాష్ఠము: చూ, రాజావర్తము; 2. దారుహరిద్ర *: చూ, మ్రానిపసుపు.

**కాలీయము.** సం. వి. అ. న. 1. నల్లఅగలు, జాప కపర్వతమునఁ బుట్టిన కృష్ణచందనము: చూ, రాజార్హము; పుం. 2. కాళీయసర్పము: చూ, సర్పము.

**కాలీశుఁడు.** సం. వి. అ. పుం. 1. ముక్కంటి: చూ, శివుఁడు; 2. నీటిఱేఁడు: చూ, వరుణుఁడు.

**కాలు.** దే. వి. 1. అడుగు: చూ, పాదము. 1; 2. ¼ భాగము: చూ, పాతిక; 3. మంచేపుఁగోడు లోనగునది. "కంచటికాలు నమ్మఁదగుకైమువు." శై. 5, అ. 85: చూ, మంచపుకోడు; అ. క్రి. 4. దగ్ధమగు: చూ, మండు.

**కాలుఁడు.** సం. వి. అ. పుం. 1. జెముఁడు: చూ, యముఁడు; 2. దేవగణ విశేషము: చూ, దేవతావిశేషము. 3. ముక్కంటి: చూ, శివుఁడు; 4. శని: చూ, రాహువు. 2.

**కాలుకొను.** దే. స. క్రి. కాలూఁదు: రూ-కాల్కొను, కాలుకొలుపు.

**కాలుకొలుపు.** దే. పే్రి. —పై.—

**కాలుగదల్చుట.** జా. నడచుట, వెళ్లుట. "తమరు కొసంత కాలుగదల్చినంతన గొంతటివారును." (ధర్మజరాజనూయము.)

**కాలుచు.** దే స. క్రి. రూ-కాల్చు: చూ, దహించు.

**కాలుచ్చులు.** దే. వి. బ. తేళ్లు మొదలగువానిని పట్టుటకు నుపయోగమగు రజ్జుసాధనము: చూ, వాగుర.

**కాలుజాఱుట.** ద్వ. వి: కాలితొట్రుపాటు; (సం.ప):-ఉద్ఘాతము. ("కాలుజాఱినను నోరుజాఱినను కూడిరానేరవు.")

**కాలుత్రొక్కుకొనివచ్చుట.** జా. వెంబడివచ్చుట. "మీకునుమాకును నీవైరంబెక్కడనుండి కాలుతొ్రక్కుకొని వచ్చెనో యెఱుఁగను." (ధర్మజరాజనూయము.)

**కాలుదువ్వుట.** జా. కయ్యమునకు సిద్ధపడుట.- ఆఁబోతు పోట్లాడునపుడు కాలిచే నేల త్రవ్వును. అందువలన రెండవదానికి రోషమెక్కును. "దవ్వుదవ్వుగానిలిచి చివ్వకుఁగాలుదువ్వుచు." (ధర్మజరాజనూయము.)

**కాలుదివియ.** ద్వ. వి. కాగడా: చూ, దివిటి.

**కాలుదువ్వు.** దే. అ. క్రి. (కాలు + త్రువ్వు.) కారణము లేక యుద్ధమునకు యత్నించు: రూ-కాల్దువ్వు.

**కాలుద్రొక్కు.** దే. వి. (కాలు + త్రొక్కు) 1. రూ-కాల్ద్రొక్కు. పెండ్లి: చూ, వివాహము; అ క్రి. 2. రూ-కాల్ద్రొక్కు. కదియు: చూ, సమీపించు.

**కాలుబలము.** మి. వి. పదాతిసేన, మంది: చూ, భటుఁడు. 1. (రూ-కాల్బలము.)

**కాలుమడి.** దే. వి. రూ-కాల్మడి, ఉచ్చ: చూ, మూత్రము.

**కాలుమడుచు.** దే. అ. క్రి. మూత్రవిసర్జనము చేయు: రూ-కాల్మడుచు.

**కాలుమానిసి.** ద్వ. వి. పదాతి; భార. ద్రోణ. 3, అ. 48: చూ, భటుఁడు. 1.

**కాలువ.** వై. వి. 1 =కుల్య. రూ-కాలవ-కాల్వ; ఆము. 6, అ. 8: చూ, నది; 2. రూ-కాల్వ. పరంపర; భార. భీష్మ. 3, అ. 234: చూ, వెల్లి. 4.

**కాలువురు.** దే వి. బ, రూ-కాల్వురు పదాతి: చూ, భటుఁడు. 1.

**కాలుష్యము.** సం. వి. అ. న. రూ-కలుషము. కలఁక: చూ, పాపము. 1.

**కాలెండరు.** ఆం. తారీఖుల సూచిక. (రూ-కేలెండరు.)

**కాలేజము.** సం. వి. అ. న.=కాలిజము: చూ, యకృత్తు. (లివర్.)

**కాలేజి, కాలేజీ.** ఆం. పెక్కుమంది బాలురు చేరి చదువుచోటు: చూ, పాఠశాల. (చూ, సదనము.1.)

**కాలేయకము.** సం. వి. అ. న. 1. పీతవర్ణ సుగంధకాష్ఠవిశేషము: చూ. రాజార్హము; 2. జాపకము. నల్లఅగలు: చూ, రాజార్హము; 3. అంకపీలి *: చూ, మ్రానిపసుపు; 4. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము.

**కాలేయము.** సం. వి. అ. న. -పై.- (3. కస్తురి పసుపు అని కొందఱు.)

**కాలేయుఁడు.** సం. వి. అ. పుం. 1. కొలకే యుఁడనెడు రాక్షసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; 2. పార్వతికొడుకు: చూ, పుత్త్రుఁడు. 1.

**కాల్కొను.** దే. స. క్రి: చూ, రూ-కాలుకొను; రా. కిష్కిం, కాం. 468.

**కాల్చు.** దే. స. క్రి: చూ, రూ-కాలుచు.

**కాల్ద్రివ్వు.** దే. అ. క్రి: చూ. రూ-కాలుద్రవ్వు; భార, శాం. 3, ఆ. 15.

**కాల్ద్రొక్కు.** దే. వి; అ. క్రి: చూ, రూ-కాలు ద్రొక్కు.

**కాల్నడ.** దే. వి: చూ, రూ-కాలినడ; భార. భీష్మ. 1, ఆ. 154.

**కాల్పకము.** సం. వి. అ. పుం. అంకపీలి *: చూ, మ్రానిపసుపు.

**కాల్పము.** సం. వి. అ. పుం. —పై.—

**కాల్బంటు.** ద్వి. వి: చూ, రూ-కాలిబంటు.

**కాల్బంట్లు.** ఆం. చతురంగములు నాలుగింటిలో నొకటి: చూ, చతురంగములు.

**కాల్బలము:** చూ, కాలుబలము.

**కాల్మడి.** దే. వి: చూ, రూ-కాలుమడి; హరి. పూ. 6, ఆ. 5.

**కాల్మడుచు.** దే. అ. క్రి: చూ, రూ-కాలు మడుచు.

**కాల్యా.** సం. వి. ఆ. స్త్రీ. కట్టుటకు ఈడు వచ్చిన యావు: చూ, ధేనువు.

**కాల్యకము.** సం. వి. అ పుం. 1. కచోరము *: చూ, షడ్గ్రంథ; 2. దారుహరిద్ర *: చూ, మ్రానిపసుపు.

**కాల్యము.** సం. వి. అ. న. 1. రూ-కల్యము. తెల్లవాఱుఁగడ: చూ, వేగుజాము; విణ. 2. తరుణమునకుఁదగినది: చూ, కల్యము. 9.

**కాల్వ.** వై. వి.=కుల్య: చూ, రూ-కాలువ.

**కాల్వుఁరు.** దే. వి. బ: చూ, రూ-కాలువురు.

**కావంచి.** వై. వి=కామంజిక *: చూ, రూ-కామంచి.

**కావటి.** సం వి. ఈ. స్త్రీ:=కావడి: చూ, స్కంధాటిక.

**కావడి.** వై. వి.=కావటి: —పై.—

**కావడించు.** వై. స. క్రి కావడియందెత్తు "వ. నంజుడులుచేవడిం బ్రివడింపక కావడించి ప్రొద్దు స్తమించునంతకు." పాండు. 3, ఆ. 87.

**కావడిబద్ద.** ద్వి. వి: చూ, కావటి.

**కావడిమట్టు.** ద్వి. వి. ఉట్టి: చూ, శిక్యము. 1.

**కావరము.** సం. వి. అ. న. 1. నాఁచు *: చూ, శైవలము; దే. వి. (1) క్రొవ్వు: చూ మదము 1. (రూ-కండకావరము- కావలము.); (2) గర్వము: చూ, హంకారము.

**కావరి.** దే. వి. రూ-కావరుఁడు. దుర్మదుఁడు: చూ, వ్యాధుఁడు 2.

**కావరించు.** దే. అ. క్రి. క్రొవ్వు: చూ, మదించు.

**కావరుఁడు.** దే. వి: చూ, రూ-కావరి; భార. ఆర. 6, ఆ. 62.

**కావలము.** దే. వి. 1. క్రొవ్వు: చూ, మదము. 1; 2. దోసము; వి, పుం. 3, ఆ. 185: చూ, పాపము.

కావలయు. దే. అ. క్రి. (కొక + వలయు) అగుట యావశ్యకమగు. "అపని యిప్పుడు కావలయును."; 2. కోరఁదగినదియగు. "ఆయిల్లు కట్టుటకింక నూఱు రూపాయలు కావలయును."; 3. అవు. "వాఁడు నీకేమి కావలయును" (ఏమి =ఏవిధమైనబంధువు.)

కావలి. దే. వి, ఏలుబడి; ఉ, హరి. 2, ఆ. 128: చూ, రక్షణము.

కావలికాఁడు. దే. విణ. కాచువాఁడు: చూ, రక్షకుఁడు.

కావలిబొట్టు. ద్వ.వి.(రూ-కావిరిబొట్టు-కావు.) బిడ్డలకు రక్షగానుంచెడు నల్లని తిలకము: చూ, బొట్టు. 1.

కావా. దే. వి. అశ్వమండలగతి. "క. కావా తిరిగెడు మారుని, మావులు నానపుడునికట మండలగతులక్." భద్రా. 4, ఆ.

కావారము. సం. వి. అ. న. నాఁచు *: చూ, శైవలము.

కావారి. సం. వి. ఈ. స్త్రీ. మొగలాకు లోనగు వానితో నేర్పఱుపఁబడిన గొడుగు: చూ, ఛత్రము.

కావి దే. వి. 1. ఎఱుపు: చూ, వర్ణము. 6; 2. బ. కాషాయవస్త్రము; (శ. ర.): చూ, వస్త్రము.

కావించు. దే. స. క్రి: చూ, కాఁజేయు; భార, అర. 2, ఆ. 253.

కావిగొను. దే. అ. క్రి. (కావి + కొను) ఎఱ్ఱ నగు; స్వా. 2, ఆ 71: చూ, పల్లటిల్లు.

కావిగోఁచిదారి ద్వ.వి. సన్యాసి; చూ,ముని. 1.

కావిచీర. దే. వి. కాషాయవస్త్రము: చూ, వస్త్రము.

కావితాలుపు. దే. వి: చూ, కావిగోఁచిదారి.

కావిరి. దే. వి. వలుపు; ఉ, హరి. 5, ఆ. 210: చూ, వర్ణము. 6.

కావిరిబొట్టు. ద్వ. వి: చూ, రూ- కావలిబొట్టు; భాగ. 10, స్కం. పూ. 297.

కావిఱాయి: దే. వి. కఠినిక, ఎఱ్ఱని సుద్దఱాయి: చూ, రాయి.

కావు. దే. వి. 1. అఱచుట ఏడ్చుట లోనగు వానియందగు ధ్వన్యనుకరణము; పాండు. 1, ఆ. 145: చూ, హాహా; 2. కాకికూఁత: చూ, స్వరము. 2; 3. పాఁతఱ లోనగువాని మైకప్పు; స్వా. 4, ఆ. 60; 4. కావలిబొట్టు: చూ, బొట్టు. 1; 5. కొదు. నష్టార్థకము: చూ, లేమి. 2; 6. కుమ్మరివాని ఆమమ్మవా ఆమము-రూ-ఆవము; (సం. ప.):-ఆవ్వదియు:

కావుట. దే. వి. 1. ఒప్పిదమగుట. "ఇక్ష్వ కావుచెలింగి." భార. ఆది 1, : చూ, భార. శాం. 6, ఆ. 385: చూ, పా. 2. అగుట=కావుట.-భావార్థక : చూ, యమైన 'ట' ముత్తులలోఁ జేరలేదు: కొజేశాములు.

కావుత. దే. ద్రి: చూ, కాత. "శుభప్రతి గావుతక్." స్వా. 1, ఆ. 2.

కావున. దే. ద్ర. హేతువును దెలుపునది."ఘన విభజించియదుగ." స్వా. 1, ఆ. 67: హేతువు.

కావుపాఁతఱ. దే. వి. ధాన్యముంచెడి కుండ: చూ, భాండము. 8.

కావులగలాఁడు. దే. వి. సన్యాసి; సాంబ. మాన, 7: చూ, ముని. 1.

కావులు. దే. వి. బ. యతిశాటీలు : చూ, వస్త్రము.

కావృకము. సం. వి. అ. పుం. 1. కోడి: చూ, పుంజు; 2. పచ్చని తుంగముస్తె *: చూ, తృణము. 1; 3. చక్రవాకపక్షి: చూ, చక్రవాకము; 4 కలికౌరమనుపక్షి: చూ, పీత మస్తకము.

కావేరి. సం. వి. ఈ. స్త్రీ. 1. కవేరుఁడను రాజుకూఁతురు, కావేరీనది: చూ, నది; 2. భోగముదాన: చూ, వేశ్య; 3 పసుపు: చూ, వర్ణము. 6; అం. 4. గంగలు అయిదింటిలో నొకటి: చూ, గంగలు. (చూ, నది.)

కావేషము. వా. వి. పగ: చూ, విరోధము. 1. "కావేషములు పెరిగి కచ్చేరీలకెక్కిరి."

కావేషి. వా.వి.—వై.—"కావేషీలు కొంపలు తీయుచున్నవి."

కావ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. పూతనయనురాక్షసి: చూ, రాక్షసి. 1: 2. తెలివి: చూ, బుద్ధి.

కావ్యకర్త. సం. వి. ఋ. పుం. కాలాత్కురికుఁడు: చూ, శక్తితాత్కురుఁడు.

కావ్యగీతప్రయత్నము. పా. నాయకస్వరూపము లలో నొకటి: చూ, నాయకస్వరూపములు.

కావ్యగుణములు. అం. శ్లేషము, ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యము, సమత, అర్థవ్యక్తి, నము, ఔదార్యము, కాంతి, ఓజము, సమాధి. (10)

కావ్యచారము. సం. వి. అ. పుం: చూ, చంద్రరేణువు.

కావ్యదోషములు. పా. ఇవి పదఅర్థగతములై దోషములలో నిండియుండును. పదగతములు వాక్యగతములు నని పదదోషములు ద్వివిధము.— అందుపద దోషములు. 17. అప్రయుక్తము (కవులు ప్రయోగింపనివి) అపుష్టార్థము (ప్రస్తుతోప యోగములేని ప్రయోగము) నేయార్థము (తన కేసంకేతమైనది) అసమర్థము (అప్రసిద్ధము) నిరర్థకము (పదపూర్ణము) గ్రామ్యము (వ్యాకరణనిషిద్ధమైన పామరభాష) చ్యుతసంస్కారము (వ్యాకరణ దూష్యము) గూఢార్థము (అర్థము తెల్లడికానిది) అన్యార్థము (వేఱర్థమిచ్చునది) అశ్లీలము (సిగ్గుగల్గించునది) అప్రతీతము (శాస్త్రపురాణాదులలోని మాటలు వాడుట) అప్రయోజకము (విశేషము లేకుండుట) క్లిష్టము (దూరాన్వయము) సందిగ్ధము (సందేహార్థమిచ్చునది) విపరీతధీప్రదము (విరుద్ధార్థము దోపించునది) అవిమృష్టవిధేయము (అప్రధానవర్ణనము) పరుషము (శ్రుతికటువు) (చూ, అర్థదోషములు); (పద, వాక్య, అర్థ దోషములు అని మతియొక గ్రంథము)

కావ్యనాటకములు. పా. అధ్యాత్మరామాయణము- విశ్వామిత్రుఁడు; అనర్ఘరాఘవనాటకము- మురారి; అభిజ్ఞాన శాకుంతలనాటకము- కాళిదాసు; అమరుగము- అమరుగుఁడు; ఉత్తరరామచరిత్ర-భవభూతి; ఉపమాన చింతామణి- గంగేశోపాధ్యాయుఁడు; ఋతుసంహారము- కాళిదాసు; కర్పూరమంజరి- కవికల్పద్రుమము- ఓపదేవుఁడు; కాదంబరి- బాణుఁడు; కావ్యాదర్శము- దండి; కావ్యప్రకాశిక- మమ్మటభట్టు; కిరాతార్జునీయము- భారవి; కుమారసంభవము- కాళిదాసు; కువలయానందము- అప్పయదీక్షితులు; కృష్ణకర్ణామృతము-లీలాశుకుఁడు; కృష్ణవిజయము-కుమారాయుధుఁడు;గంగాలహరి-జగన్నాథపండితరాయఁడు;గీతగోవిందము, చంద్రాలోకము- జయదేవుఁడు; చిత్రమీమాంస- అప్పయదీక్షితులు; చోరపంచాశత్తు- బిల్హణుఁడు; దశకుమారచరిత్రము- దండి; దశరూపకము- ధనంజయుఁడు; నరకాసురవ్యాయోగము - ధర్మసూరి; నలోదయము- కాళిదాసు; నాగానందనాటకము - శ్రీహర్షుఁడు; నాట్యప్రదీప- సుందరమిశ్రుఁడు; నైషధము - శ్రీహర్షుఁడు; పంచతంత్రము - విష్ణుశర్మ; పండితరాయశతకము- పండితరాయఁడు; పుష్పబాణవిలాసము- కాళిదాసు; ప్రతాపరుద్రీయము- విద్యానాథుఁడు; ప్రసన్నరాఘవ

నాటకము-జయదేవుఁడు; ప్రియదర్శిక నాటిక- శ్రీహర్షుఁడు; భట్టికావ్యము-భట్టి; భాగవతము- వ్యాసముని; భాట్టరహస్యము- ఖండదేవుఁడు; భారతము- వ్యాసముని; భారతచంపు- లక్ష్మణ కవి; భోజచరిత్ర- వల్లాలుఁడు; మాధవచంపు- భట్టాచార్యుఁడు; మాలతీమాధవీయము- భవభూతి; మహానాటకము- హనుమంతుఁడు; మహావీరచరిత్ర-భవభూతి; ముద్రారాక్షసము- విశాఖదత్తుఁడు; మేఘసందేశము- కాళిదాసు; మృచ్ఛకటిక- శూద్రకుఁడు; యాదవరాఘవపాండవీయము - చిదంబరుఁడు; రఘువంశము - కాళిదాసు; రత్నావళినాటకము- శ్రీహర్షుఁడు; రసతరంగిణి- రసమంజరి- భానుకర మిశ్రుఁడు; రామాయణచంపు - భోజుఁడు; రామాయణము- వాల్మీకముని; వసంతతిలక భాణము- వరదాచార్యులు; వాసవదత్త- సుబంధుఁడు; విక్రమోర్వశీత్రోటకము- కాళిదాసు; విశ్వగుణాదర్శము - వేంకటాధ్వరి; విద్వన్మనోతరంగిణి - భట్టాచార్యులు; వేణీసంహారము- భట్టనారాయణుఁడు; శృంగార భూషణము- బాణుఁడు; శిశుపాలవధ; మాఘుఁడు; శివభద్రము- కవివరుఁడు; సాహిత్య రత్నాకరము- వారణాశిబ్రహ్మభట్టు; సాహిత్యదర్పణము- విశ్వనాథుఁడు; సాహసాంకము- పరిమళుఁడు; సూర్యశతకము- మయూరుఁడు; అభిరామమణి- కావ్యప్రదీపిక- కుసుమాంజలి- చండకౌశిక నాటకము- చంద్రశేఖరచంపు- నాట్యలోచన- నాట్యశేఖరము- నాటకావతారము- నాటకరత్నకోశము- నాట్యవిలాసము- రాజముకుట - రూపచింతామణి మొదలగు కావ్యనాటకములు మఱికొన్ని గలిగి యుండెను.

**కావ్యపాకములు.** అం. ద్రాక్షాపాకము, నారికేళపాకము, కదళీపాకము. (3) (పాకత్రయము): చూ, త్రయము.

**కావ్యప్రకాశిక.** పా. ఈగ్రంథకర్త మమ్మటభట్టు: చూ, కావ్యనాటకములు.

**కావ్యము.** సం. వి. అ. న. 1. = కబ్బము, కవికృతగ్రంథము, కృతి: చూ, పుస్తకము; 2. కావ్యము- విశ్వశ్రేయస్కరము; 3. కావ్యము- కవికల్పితమైనది. దీనికి గ్రంథము, కతియని పేర్లు. గద్యకావ్యము, పద్యకావ్యము, మిశ్రకావ్యము నని కావ్యము ముత్తెఱంగులు. వచనకావ్యము, గద్యకావ్యము. ఇది పద్యకావ్యమువలె ఛందోబద్ధముగాదు గాని తక్కిన సకలలక్షణములు గలిగియుండును. (నీతిచంద్రిక మొ) గణయతిప్రాసనియమము గలది పద్యకావ్యము (తిక్కనసోమయాజి నిర్వచనోత్తర రామాయణము మొ) గద్యపద్యములు కలిసియున్నది మిశ్రమ[ఇది] ... (మనుచరిత్ర మొ); 4. కావ్యము- ...: చూ, ..., శ్రవ్యము నని ద్వివిధము. దృశ్యము (చూడఁదగినది) నాటకము (మురారి- శాకుంతలములోనగునవి) శ్రవ్యము (వినఁదగినది) రామాయణాది గ్రంథములు. మఱియు నిందు ఉపాఖ్యానము, ఇతిహాసము, శాస్త్రము, పురాణము, ప్రబంధము నని పెక్కుభేదములున్నవి; 5. కావ్యము మఱలఁ ద్రివిధము.— కాంతాసమ్మితము (ప్రబంధము) సుహృత్సమ్మితము (పురాణము) ప్రభుసమ్మితము (వేదము); 6. నాటికలు పదునెనిమిదింటిలో నొకటి ఇది దేవమనుష్యమిళితము. కావ్యము.— ఒక అంకము, ప్రణయకథ. మధ్యమధ్యపాటగలది. ఇత్యాది.

**కావ్యములు.** అం. రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, భారవి, మాఘము. (5)

**కావ్యరీతులు.** అం వైదర్భి, గౌడి, పాంచాలి. (3)

**కావ్యలింగము.** అం. అర్థాలంకారములలో నొకటి. కార్యముచేఁ గారణమును కారణముచేఁ గార్యమును సమర్థించుట. వాక్యార్థహేతు

కము, పదార్థహేతుకము ననిద్వివిధము. ఉ.— మదనుఁడయోడుమువు. నామది బ్రిలోచనుఁడుండె: చూ, అలంకారము. 8.

కావ్యవృత్తులు. అం. కైశికి, ఆరభటి, సాత్త్వతి, భారతి. (4): చూ, వృత్తులు.

కావ్యస్వరూపము. పా. దోషరహితము, గుణాన్వితము, ధ్వని, రస,రీతి, వృత్తి, పాక, శయ్య, శబ్దార్థాలంకారభరితమును కలసి కావ్యస్వరూపమందురు.

కావ్యాదర్శము. పా. ఈగ్రంథకర్త దండి: చూ, కావ్యనాటకములు.

కావ్యార్థాపత్తి. అం. అర్థాలంకారములలో నొకటి. కైముతి(ఇంకేల) న్యాయమునవర్ణించుట. ఉ.—వనితనీమొగమునకు శశియోడె: పద్మములనింకఁజెప్పనేల ! : చూ, అలంకారము. 8.

కావ్యుఁడు. సం. వి. అ. పుం. శుక్రుఁడు; భార. ఆది. 6, అ. 119: చూ, రాహువు. 2.

కాశ. సం. వి. అ. స్త్రీ. కాశతృణము*: చూ, తృణము. 1.

కాశకము. సం. వి. అ. పుం. వెలుఁగు: చూ, వెలుతురు. 1.

కాశకుశావలంబనన్యాయము. పా. దర్భదొరకనిచో రెల్లు దర్భగాఁ బెట్టుకొనినవిధము.

కాశగర్భము. సం. వి. అ. పుం. అశ్వలాయనదర్భ *: చూ, తృణము. 1.

కాశమర్దము. సం. వి. అ. పుం: చూ, రూ- కాసమర్దము *.

కాశము. సం. వి. అ. పుం, న. 1.కుందు రెల్లు*: చూ, శరము. (చూ, తృణము. 1.) 2. అశ్వలాయనదర్భ *: చూ, తృణము. 1; 8.కాశియనుపుణ్యక్షేత్రము(చూ,కాశి): చూ,దేశము; అ. పుం.4. వెలుఁగు: చూ, వెలుతురు. 1; 5. తుంగము: చూ, తుమ్మె; 6. దర్భ: చూ, దర్భ;అం. 7. దర్భలు పదింటిలో నొకటి: చూ, దర్భలు.

కాశహర. సం. వి. అ. స్త్రీ. = కాఁచెర-కాసర *: చూ, బుడ్డబుడుసర.

కాశాల్మలి. సం. వి. ఇ. స్త్రీ. పిన్నబూరుగ *: చూ, శాల్మలి.

కాశి. సం. వి. ఇ. స్త్రీ. అం. 1. వారణాసి, ఎఁబదియాఱు దేశములలో నొకటి: చూ, దేశము; 2. పుణ్యనగరములు ఏడింటిలో నొకటి: చూ, పుణ్యనగరములు; 8. క్షేత్రములు ఇరువదినాలుగింటిలో నొకటి (చూ, కాశీ క్షేత్రము) చూ, క్షేత్రములు; 4. అలసట: చూ, శ్రమము.1;న్.విణ. 5.కాశరోగ యుక్తుఁడు.

కాశికిఁబోయినను గర్మముమానదు. లో. చేసిన కర్మ అనుభవింపకతప్పదు.

కాశిరాజు. సం. వి.అ. పుం. కాశిరాజనుఋషి: చూ, ముని. 1. (త్రి. శే.)

కాశీక్షేత్రము. పా. ఇదియొక పుణ్యక్షేత్రము. ఇందలి దైవములు.— సాక్షివినాయక,విశ్వనాథ సంధ్యాఆరతి, మహాకాళి, దుర్గాదేవి, అన్నపూర్ణ, కాలభైరవ, కాశీ విశ్వనాథ, పంచముఖీ పరమేశ్వర, దండిరాజగణేశ, విశ్వనాథశయనఆరతి, వందేకాశీ, కాశీవిశాలాక్షి శనిదేవ, దండపాణి, మొదలగువారు.

కాశీనాథుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి చూ, శివుఁడు.

కాశీరాజు సం. వి. అ. పుం. దివోదాసుఁడు: చూ, రాజు. 1.

కాశీవిశాలాక్షి: అం. అక్షులు ముగ్గురిలోనొకతె: చూ, అక్షులు.

కాశూల. సం. వి. అ. స్త్రీ. భోగముదాన: చూ, వేశ్య.

**కాశేక్షువు.** సం. వి. ఉ. పుం. కందు రెల్లు *: చూ, శరము. (చూ, తృణము. 1.)

**కాశ్మద్విపము.** సం. వి. అ. పుం. గుమ్మడు *: చూ, మహాఫలము.

**కాశ్మరి.** సం. వి. ఈ. స్త్రీ. —వై.— (రూ-కాష్మరి - కాశ్మర్యము - కామ్మర్యము - కాశ్వరి.)

**కాశ్మీరజన్మము.** సం. వి. న్. న. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము.

**కాశ్మీరజ.** సం. వి. ఆ. స్త్రీ. అతివస *: చూ, విష.

**కాశ్మీరజము.** సం. వి. అ. న. 1. కుష్ఠభేదము: చూ, మండలము; 2. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము; 3: చూ, పుష్కరమూలము.

**కాశ్మీరజామృత.** సం. వి. ఆ. స్త్రీ. మృదుఫల, ద్రాక్ష *: చూ, స్వాదుఫల.

**కాశ్మీరము.** సం. వి. అ. న. 1. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము; 2. మెట్టతామరదుంప*: చూ, పద్మము. 1; 3: చూ, పుష్కరమూలము *; 4. కొండయులి, తాయిలొలిచెడియులి: చూ, వృక్షాదనము. 1; అం. 5. ఏఁబదియాఱు దేశములలో నొకటి (రూ - కశ్మీరము): చూ, దేశము.

**కాశ్మీరి.** సం. వి. ఈ. స్త్రీ. ద్రాక్ష, గోస్తని*: చూ, స్వాదుఫల.

**కాశ్యపము.** సం. వి. అ. పుం. 1. కాశ్యపమను చేప: చూ, మత్స్యము. 1; 2. మృగవిశేషము: చూ, మృగము. 1; పా. 3. గోత్రవిశేషము: చూ, గోత్రములు: (చూ, ప్రవర.)

**కాశ్యపసగోత్రము.** అం. గోత్రములలో నొకటి: చూ. గోత్రములు. (చూ, ప్రవర) (రూ-కశ్యప- కస్యపస- కాశ్యప- కాశ్యపము)

**కాశ్యపి.** సం. వి. ఇ. పుం. 1. అనూరుఁడు: చూ, సూరసూతుఁడు; 2. గరుడుఁడు: చూ, హరివాహనుఁడు; ఈ. స్త్రీ. 3. పుడమి: చూ, భూమి. 1.

**కాశ్యపుఁడు.** సం. వి. అ. పుం. అనూరుఁడు: చూ, సూరసూతుఁడు; 2. కణాదముని: చూ, ముని. 1.

**కాశ్యపేయుఁడు.** సం. వి. అ. పుం. సూరుఁడు: చూ, సూర్యుఁడు.

**కాశ్వరి.** సం. వి. ఈ. స్త్రీ. రూ-కాశ్మరి *: చూ, మహాఫలము.

**కాషాయము.** సం. వి. అ. పుం.=కాసె. 1. కావిచీర: చూ, వస్త్రము; విణ. 2. కాషాయవర్ణముచే నెఱ్ఱనైనది: చూ, వర్ణము. 6.

**కాషాయమోహిని.** సం. వి. ఈ. స్త్రీ. నలువరాణి: చూ, సరస్వతి.

**కాషాయవల్లభ.** సం. వి. ఆ. స్త్రీ. —వై.—

**కాషాయి.** సం. వి. ఈ. స్త్రీ. కాషాయవర్ణముచేత నెఱ్ఱనైనది: చూ, వర్ణము. 6.

**కాష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. 1. పదునెనిమిది ఱెప్పపాట్ల కాలము; తాళమానాష్టలవకాలము: చూ, తాళము 2; 2=కడ.దిక్కు: చూ, హరిత్తు; 3. అడవిమామెన*: చూ, శారిబ; 4. మేర: చూ, సీమ; 5. దారుహరిద్ర *: చూ, మ్రానిపసుపు; 6. అతిశయము: చూ, హెచ్చు. 2; 7. తెడ్డు: చూ, దర్వి. 1; 8. కొమ్మపనస *: చూ. పనస. 2; 9. ఉనికి: చూ, స్థానము. 1; 10. గౌరవము: చూ, మర్యాద.

**కాష్ఠకదళి.** సం. వి. ఈ. స్త్రీ. కొమ్మఅరఁటి*: చూ, రంభ. 2.

**కాష్ఠకము.** సం. వి. అ. న. అగరు: చూ, రాజార్హము.

**కాష్ఠకారి** సం. వి. ఈ. స్త్రీ. కందురీఁగ: చూ, మక్షిక.

**కాష్ఠకీటము.** సం. వి. అ. పుం. నుసిపురుగు: చూ, పురుగు.

కాష్ఠకుట్టము. సం. వి. అ. పుం. ఒకానొక పక్షి: చూ, పక్షి.

కాష్ఠకుంభి. సం. వి. ఈ. స్త్రీ. పాదిరి*: చూ, స్థాలి. 2.

కాష్ఠకుద్దాలము. సం. వి. అ. పుం. కఱ్ఱగుద్దలి: చూ, ముద్గరము.

కాష్ఠశోష్ఠ. సం వి. అ. స్త్రీ. మామెన*: చూ, శారిబ.

కాష్ఠజంబువు. సం. వి. ఊ. స్త్రీ. నేలనేరేడు*: చూ, నేరేడు.

కాష్ఠతంతువు. సం. వి, ఉ. పుం. ఆరుద్ర పురుగు: చూ, పట్టుపురుగు.

కాష్ఠతక్షకుఁడు. సం. వి. అ. పుం. రథకారుఁడు; వడ్లవాఁడు: చూ, స్వర్ణకారుఁడు.

కాష్ఠదారువు. సం. వి. ఉ. పుం. దేవకాష్ఠము: చూ, సూక్ష్మదారువు.

కాష్ఠద్రువు. సం. వి. ఉ. పుం. పలాశము*: చూ, మోదుగు.

కాష్ఠధాత్రీఫలము. సం. వి. అ. న. ఉసిరికె*: చూ, శ్రీఫలి. 1.

కాష్ఠధృక్కు. సం. వి. క్. పుం. బడబాగ్ని: చూ, నిప్పు.

కాష్ఠపాటల. సం.వి. ఆ. స్త్రీ. తెల్లకలిగొట్టు*: చూ, స్థాలి. 2.

కాష్ఠపాటలి. సం. వి. ఇ. స్త్రీ. —వై.—

కాష్ఠమఠి. సం. వి. ఇ. స్త్రీ. సాద, చితి: చూ, శ్మశానము.

కాష్ఠమల్లము. సం. వి. అ. పుం. పాడె: చూ, శవయానము,

కాష్ఠము. సం. వి. అ. న. 1. కఱ్ఱ,కొయ్య:చూ, వంటచెఱకు;వా.2.వల్లకాఁడు:చూ, శ్మశానము.

కాష్ఠలేఖకము. సం. వి. అ. పుం. ఘుణము: చూ, పురుగు.

కాష్ఠలోహి. సం. వి. న్. పుం. వాతర్ధి. లోహయుక్తముద్గరము: చూ, ముద్గరము.

కాష్ఠవల్లిక. సం. వి. ఆ. స్త్రీ. 1. ఖట్వ*: చూ, సుకాష్ఠ; 2. కటుకరోహిణి*: చూ, కఱలాదని. 1.

కాష్ఠశారిబ. సం. వి. ఆ. స్త్రీ. తెల్లసుగంధిపాల*: చూ, శారిబ.

కాష్ఠాంబువాహిని. సం. వి. ఈ. స్త్రీ. కాష్ఠముచే చేయఁబడిన అంబువాహిని; ద్రోణి: చూ, పశోడము.

కాష్ఠీల. సం. వి. ఆ. స్త్రీ. కదళి*: చూ, రంభ. 2.

కాష్ఠీలము. సం. వి. అ.పుం. 1. రాజార్కము*: చూ, జిల్లేడు; 2. ఉచ్చింత*: చూ, కుండ. 6.

కాస. వై. వి. = కచ్ఛ. దట్టి; చూ, వస్త్రము. (ఇది ఎదంతముగా వాడుక.)

కాసకందము. సం. వి. అ. పుం. కొంకణదేశపు ఆలువ: చూ, పంది. (చూ, సూకరము.)

కాసఘ్నము. సం. వి. అ. పుం. తౌళసి*: చూ, తులసి.

కాసఘ్ని. సం. విశే. ఇ. 1. కంఠ సల్లెరు పొంద లగునవి నలిపిన పులప; ఈ. స్త్రీ. 2. కసింద*: చూ, బలుసు.

కాసజిత్తు. సం. వి. త్. స్త్రీ. చిఱుతేఁకు*: చూ, భారంగి.

కాసనాశిని. సం. వి. ఈ. స్త్రీ. కర్కటకశృంగి*: చూ, శృంగి.

కాసనుత్తు. సం. వి. త్. పుం. చేఁదిపొట్ల*: చూ, పొట్ల.

కాసందీబటిక. సం. వి. ఆ. స్త్రీ. వేళవారవిశేషము: చూ, సంభారము.

కాసమర్దకము. సం. వి. అ. పుం.=కసింద*: చూ, బలుసు.

కాసమర్దనము. సం. వి. అ. పుం. చేఁదిపొట్ల*: చూ, పొట్ల.

కాసమర్దము. సం. వి. అ. పుం. 1. =కసింద*: చూ,బలుసు; 2. గుల్మభేదము*: చూ,పొద.2.

కాపము. సం. వి. అ. పుం. ఉక్కసః చూ, దగ్గు.
కాసర. వై. వి. = కౌశవార*: చూ, రూ- కాఁచేర.
కాసరకూసర. జా. చెదుట; నెఱవేఱకపోవుట.
కాసరము. సం. వి. అ. పుం. ఎనుపోతు: చూ, మహిషము.
కాసరవడ్లు. దే. వి. బ. శాలిధాన్యము: చూ, ధాన్యము.
కాసలనాటిబ్రాహ్మణులు. పా. వీరినే కౌసలేయులు, కోసలేయులు అని అందురు. వీరు శుక్లయజుర్వేదులు. ప్రథమశాఖీయులనియు, వాజసనేయులనియు అందురు: చూ, బ్రాహ్మణులు. (రూ- కోసలనాటి బ్రాహ్మణులు)
కాసా. దే. వి. దాసీపుత్రుఁడు.
కాసారము. సం. వి. అ. పుం. 1. కొలను: చూ, సరస్సు. 1; 2. బ. కొఱ్ఱలు: చూ, ధాన్యము.
కాసారి. సం. వి. ఇ. పుం. కసింద*: చూ, బలుసు.
కాసాలువు. సం. వి. ఉ. పుం: చూ, కాసకందము.
కాసించు. వై. స. క్రి. కౌసెగాఁకట్టు. "ద్వి. కడుమైలపేలికి గాసించు." హరిశ్చం. 2, భా. 1381.
కాసియ. వై. వి. రూ- కాసె.1.= కచ్చ. దట్టి: చూ, వస్త్రము; 2. గ్రాకౌరుఁడు: చూ, ఱాతిపనివాఁడు.
కాసీఁడు. వై. వి. గ్రావకారుఁడు; పర. 5, ఆ. 48: చూ, ఱాతిపనివాఁడు.
కాసీసభస్మము. పా: చూ, అన్నభేదిభస్మము.
కాసీసము. సం. వి. అ. న.= కసీసము. మయిలుతుత్తము: చూ, రసాంజనము.
కాసు. వై. వి. 1. = కాకణి- కౌచ. 1. దుగ్గానిలో నాలవభాగము; దుగ్గానిలో పదియవభాగము (అని కొందఱు) అఱపైన అని పురుషోత్తమకవీయము: చూ, కౌచము. 6; దుగ్గాని= రెండుదమ్మిడ్లు. టంకమునకు పదియారు డబ్బులు కనుక అతెక్కప్రకారము ఇక్కడ కానియనఁగా దమ్మిడీఅని శబ్దరత్నాకరము) ;2. పసుపైనుకూసాయల విలువగల బంగారునాణెము(వాడుక)(కాసుధర తఱచుగా మాఱుచుండును.)"కమసాలి కాసులపేరు చేసెను." ;3. ధనము: చూ, విత్తము. 1.
కాసువీసము. జా. కొంచెము. (పైసలో 80 వ వంతు అని ఉపన్యాసదర్పణము) "కాసువీస మేని వసూలుచేయ శక్యముకాదయ్యె." (ధర్మజరాజనూయము)
కాసువు. సం. వి. ఉ. పుం, న. 1. కుత్సితవాక్యము: చూ, వ్యాఖ్యాతము. 2; 2. శక్తియను నాయుధవిశేషము: చూ, బాణము. 1; ఊ. స్త్రీ. 3. మతి: చూ, బుద్ధి; 4. తెవులు: చూ, రోగము. 1; 5. కాంతి: చూ, వెలుతురు. 1; 6. మాట: చూ, వ్యాఖ్యాతము. 2.
కాసె. వై. వి. రూ- కాసియ. 1.=కచ్చ. దట్టి: చూ, వస్త్రము; 2. గ్రావకారుఁడు: చూ, ఱాతిపనివాఁడు; 3. ఱాయిలోలుచుపని.
కాసెకట్టు. వై. అ. క్రి. కచ్చెకట్టు: చూ, దట్టీగట్టు.
కాసెకోక. వై. వి. దట్టి: చూ, వస్త్రము.
కాసెనిల్కడ. దే. వి. మల్లశాస్త్రములోని విన్నాణములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, విన్నాణములు.
కాసెయులి. దే. వి. (కాసె + ఉలి.) ఱాయి తొలిచెడి ఉలి, టంకము: చూ, వృషదనము. 1.
కాసెవాఁడు. దే. వి: చూ, ఱాతిపనివాఁడు.
కాసెపోయు. దే. అ. క్రి. (కాసె + పోయు) (వస్త్రమును) నోఁచివరలు వెనుకకుదోపు.

కాహల. సం. వి. అ. స్త్రీ. నఫిరి. కాహళ వాద్యము: చూ, వీణె.

కాహలజఙ్ఘ. సం. వి. అ. స్త్రీ, సుఖలక్షణముఁ గల యాఁడుది: చూ, స్త్రీ.

కాహలప్రియ. సం. వి. అ. స్త్రీ. గోరింక: చూ, శారిక.

కాహళా. సం. వి. అ. స్త్రీ. 1.= కాళియ: చూ, కాహల; 2. ఒకానొక అప్సర స్త్రీ: చూ, వేలుపులు. 2.

కాహళజంఘులు. అం. స్త్రీలక్షణాంగములందలి జంఘల (పిక్కలు) యందలి విశేషము. (కాహళజంఘులైనను గజజంఘులైనను సుఖవతి యగు): చూ, స్త్రీ లక్షణాంగములు.

కాహళము. సం. వి. అ. పుం. 1. కోడి: చూ, పుంజు; 2. శబ్దమాత్రము, సద్దు: చూ, స్వరము. 2; 3. పిల్లి: చూ, మార్జాలము; 4. బృహడ్ఢక్క, కాహళవాద్యము: చూ, వీణె; 5. పక్కి: చూ, పక్షి; న. 6. అతిశయము: చూ, హెచ్చు. 2; 7. కష్టము: చూ, దుఃఖము; 8. అవ్యక్తవాక్యము: చూ, స్వరము. 2; విణ. 9. పామరోక్తి: చూ, స్వరము.2; 10. ఎండినది: చూ, శుష్కము. 2; 11. పెల్లయినది, అతిశయించినది: చూ, హెచ్చు. 2; 12. చెడ్డది, ఖలము: చూ, పాపము. 1; (తెనుఁగు కావ్యములందు వాద్యమను నర్థమందును తఱుచుగ ఇది పుంలింగముగాఁ గానఁబడుచున్నది. "సీ. పణవమర్దళశంఖపటహకాహళవేణుభేరీధ్వనుల మిన్నుపిక్కటిలఁగ." భాగ. 10, స్కం. పూ. 1740. పె.); అం. 13. పంచమహావాద్యములలో నొకటి: చూ, పంచమహావాద్యములు.

కాహళాపుష్పము. సం. వి. అ. పుం. ఉమ్మెత్త*: చూ, హాలాపుష్పము.

కాహళి. సం. వి. ఈ. స్త్రీ. 1. = కాళియ, నఫిరి, కాహళవాద్యము: చూ, వీణె; 2. యౌవనస్త్రీ, తరుణి: చూ, స్త్రీ; 3. వాయించెడి యొకానొక కుండ: చూ, వీణె: (చూ, భాండము.) 3; 4. దుర్మార్గుఁడు: చూ, వ్యాఘుఁడు; అం.5. సుషిరవాద్యములు పదింటిలో నొకటి: చూ, సుషిరవాద్యములు.

కాహళిక. సం. వి. అ. స్త్రీ. నఫిరి: చూ, వీణె. (రూ- కాహళి)

కాహళికుఁడు. సం. వి. అ. పుం. కాహళియూఁదువాఁడు: పర. 5, ఆ. 91.

కాహి. సం. వి. ఈ. స్త్రీ. కొడిసె*: చూ, వత్సకము.

కాళంజి. దే. వి. = కలాచి, తమ్మపడిగము: చూ, పాత్రము. 6. (రూ- కాళాంజి - కళాంజి- కళాసిక)

కాళయుక్తి. సం. వి. ఇ. పుం. ప్రభవాదియఱువది సంవత్సరములలో నొకటి: చూ, సంవత్సరములు.

కాళహస్తి. పా: చూ, కాళేశ్వరము.

కాళాంజి. దే. వి. = కలాచి: చూ, రూ- కాళంజి.

కాళి. సం. వి. ఈ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి.1; 2.పార్వతీభేదము: చూ, పార్వతి.1; (ఆదిశక్తులలో నొకతె: చూ, ఆదిశక్తులు); 3.కాళిక: చూ, బొగ్గు; 4.నల్లజీలకఱ్ఱ*: చూ, సువవి. 2. పా. వి.(1)మనుష్యాదులులేనిచోటు.

కాళింగము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగు: చూ, హస్తి; 2. నేలగుమ్మడి *: చూ, భూమికర్కారువు.

కాళింగి. సం. వి. ఈ. స్త్రీ: చూ, పుచ్చె*. (నక్కదోసతీఁగె అని విశ్వకోశము)

కాళింగుఁడు. సం. వి. అ. పుం. పాము: చూ, సర్పము.

కాళింది. సం. వి. ఈ. స్త్రీ. 1. యమునానది: చూ, నది; 2. నీటియావు: చూ, ధేనువు.(రూ-కాళింది); అం. 3. భిన్నషడ్జకజభావములు పదునేడింటిలో నొకటి: చూ, భావ.

కాళిందీభేదనుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ-కాళిందీభేదనుఁడు.

కాళిక. సం. వి. అ. స్త్రీ. 1.= కాళియ: చూ, కాళిక; 2. నల్లజీలకఱ్ఱ *: చూ, సుషవి. 2.

కాళికాదేవి. తం. దిక్పాలభార్యలు ఎనమండుగురిలో నొకతె: చూ, దిక్పాలభార్యలు.

కాళికాపురాణము. అం. ఉపపురాణములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, ఉపపురాణములు. (కాళీపురాణము)

కాళిదాసుఁడు. సం. వి. అ. పుం: చూ, కాళిదాసుఁడు.

కాళియ. వై. వి. = కావాళిక. బూరగొమ్మ, నఫిరి; రకాండం. 2, అ. 108: చూ, పీత.

కాళీపురాణము. అం: చూ, కాళికాపురాణము.

కాళీయుఁడు. సం. వి. అ. పుం. కాళీయుఁడను సర్పము: చూ, సర్పము.

కాళి. వై. వి.=చూ, రూ-కాళియ.

కాళ్లజెఱ్ఱి. దే. వి. చెవిజొరు పాము: చూ, సర్పము.

కాళ్లు పట్టుకొనుట. జా. బ్రతిమాలుకొనుట. "పొట్టకై యటిహీనుని కాళ్లుపట్టుకొని కష్టపుజీవనము జీవించుటకంటె." (నీతిచంద్రిక-విగ్రహము.)

# కి.

కి. దే. అవ. షష్ఠీవిభక్తియందు వచ్చెడు ప్రత్యయము: కు, యొక్క, లో, లోపల.

కిమ్. సం. విశే. మ్. 1. జ్ఞావేచ్ఛ, ఊహా: చూ, యోచన; 2. అడుగుట: చూ, ప్రశ్నము; 3. దూఱు: చూ, నింద. 1; 4. రీతి: చూ, విధము 1; అవ్య. 5. అడుగుట: చూ, ప్రశ్నము; 6. దూఱు: చూ, నింద. 1; 7. అదిరో యిదిరో యను సందియము; 8. మఱియొక పక్షము; 9. కొంచెము: చూ, స్వల్పము; 10. మరల: చూ, వెండియు; 11. ఎక్కుడు, అతిశయము: చూ, హెచ్చు. 2; 12. కారణము: చూ, హేతువు; 13. కాదనుట: చూ, లేదు. 2.

కింకృత్తే. వి. 1. కోపము; భార. ద్రో. 3, మేని పనూలుకోపము. (రూ-కింకిరి-కినుక-(ధర్మజరాజనూరా కినుక.); 2. పశువులను కాసువు. ... చంపెడి ఒకరకము తెగులు: చూ, ...రోగము.

కింకనీరు. వా. వి. శిశువులు పొరపెట్టినపుడు దృష్టిదోషము పోవుటకై మూఁడు బొగ్గులు వేసి తీయు పారాణినీళ్లు, (పారాణి=పసుపు సున్నము కలిపినది.)

కింకర. సం. వి. అ. స్త్రీ. దాసి: చూ, దానిసె.

కింకరి. సం. వి. ఈ. స్త్రీ. —వై.—

కింకరుఁడు. సం. వి. అ. పుం. 1. పరిచారకుఁడు: చూ, సేవకుఁడు; విశే. 2. కూలివాఁడు: చూ, సంబళకాఁడు.

కింకిణము. సం. వి. అ. పుం. రూ-కింకిణి, పాంజేబు: చూ, భూషణము. 2.

కింకిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. —వై.—; 2. చిఱుగంట: చూ, భూషణము. 2; 3. కొనరేఁగు *: చూ, రేఁగు. 1; 4. గిలక *: చూ, ఘంటారవ.

కింకిర. సం.వి.అ. స్త్రీ. నెత్తురు: చూ, రక్తము. 1

కింకిరము. సం. వి. అ. పుం. 1. కోయిల: చూ, పికము; 2. తుమ్మెద: చూ, భ్రమరము. 1; 3. గుఱ్ఱము: చూ, హయము; న. 4. ఏనుఁగు గండస్థలము: చూ, చెంప. 2. (చూ, హస్తి.)

కింకిరాటము. సం. వి. అ. పుం. రూ-కింకరాతము *: చూ, వన్నె. 15.

కింకిరాటుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ-కింకిరాతుఁడు.

కింకిరాతము సం. వి. అ. పుం. 1. కొండగోనుఁగు*: చూ, పీతపుష్పము; 2. పచ్చపువ్వుల పెద్దగోరంట *: చూ, మహాసహ; 3. రూ-కింకరాటము *: చూ, వన్నె. 15.

కింకిరాతుఁడు. సం. వి.అ. పుం. మరుఁడు: చూ, మన్మథుఁడు. (రూ-కింకిరాటుఁడు.)

కింకిరి. సం. వి. న. పుం. 1. కొవరేఁగు *: చూ, రేఁగు. 1; దే. వి. (1) కోపము; ఉ. హరి.4, ఆ. 68: చూ, రోషము; (2) అపవాదము: చూ, నింద. 1.

కింకిరిపడు. ద్వ. అ. క్రి. 1. కోపగిల్లు. "క. అతఁడెంత రేఁగితిట్టిన,మతిఁగింకిరిపడక." మార్క.2, ఆ. 158: చూ, రోషించు; 2. అసహ్యపడు; పారిజ. 2, భా. 1583: చూ, రోఁతపడు.

కింకిరిపాటు. ద్వ. వి. 1. కోపపడుట: చూ, రోషము; 2. అసహ్యపడుట: చూ, రోఁత.2.

కింకిరుఁడు. సం. వి. అ. పుం. మదనుఁడు: చూ, మన్మథుఁడు.

కింగిరి. దే. విణ. అల్పము: చూ, స్వల్పము.

కించ. సం. అవ్య. 1. కడఁక: చూ, యత్నము; 2. విశేషము, ఇంతేకాదు: చూ, హెచ్చు.2; 3. సాంతము: చూ, వెరసి. 2.

కించన. సం. అవ్య. అసాకల్యము.

కించనము. సం. వి. అ. పుం. ఏనుఁగుచెవిఆకు, హస్తికర్ణదళము: చూ, హస్తికర్ణపలాశము.

కించిత్తు. సం. అవ్య.=కించు. ఇంచుకంత: చూ, స్వల్పము.

కించిదర్థకములు. పా. ఇంచుక, కొంచెము, కొంత.

కించిలికము. సం. వి. అ.పుం. రూ-కించులుకము, మీఁదిగాలి: చూ, వాయువు.

కించులికము. సం. వి. అ. పుం. మహీలత, ఎఱ్ఱవానపాము: చూ,సర్పము.(రూ-కించులిపము.)

కించులిపము. సం. వి. అ. పుం. —పై.—

కించులుకము. సం. వి. అ. పుం. 1. —పై.—; 2. మీఁదిగాలి. రూ - కించిలికము: చూ, వాయువు; అం. 3. వాయువులు ఎనిమిదింటిలో నొకటి: చూ, వాయువులు.

కించు. పై. విణ. అల్పుఁడు: చూ, హీనుఁడు. (రూ-క్రించు-క్రించుఁడు.)

కింజ సం. వి. ఆ. స్త్రీ. వింటినారియొక్క శబ్దము: చూ, స్వరము. 2.

కింజము. సం. వి. అ. న. 1. అకరువు: చూ, పద్మము. 4; 2. పుష్పపరాగము: చూ, పుప్పొడి; 3. నాగకేసరపుష్పము: రూ-కింజలము-కింజల్కము.

కింజలము. సం. వి. అ. పుం. —రూ-పై.—

కింజల్కము. సం. వి. అ. పుం. —రూ-పై.—

కింజుఁడు. సం. విణ. నిరర్థకజన్మము కలవాఁడు: చూ, నిష్ప్రయోజకుఁడు.

కింతనువు. సం. వి. ఉ. పుం. లూత: చూ, సాలెపురుగు.

కింధి. సం. వి. న. పుం. గుఱ్ఱము: చూ,హయము.

కింపచానుఁడు. సం. విణ. 1. రూ - కింపచాన్నుఁడు. అతిలోభి: చూ, లోభి; 2. పిసినిగొట్టు: చూ, లోభి.

కింపచాన్నుఁడు. సం. విణ. —పై.—

కింపచుఁడు. సం. విణ. —పై.—

కింపాకము. సం. వి. అ. పుం. కొంచీరము, విషముష్టి *: చూ, ముసిఁడి.

కింపాకుఁడు. సం. వి. అ. పుం. 1. నిరర్థకుఁడు: చూ, నిష్ప్రయోజకుఁడు; విణ. 2. మూఢుఁడు: చూ, మూర్ఖుఁడు; 3. మాతృశాసితుఁడు.

కింపురుషము. సం. వి. అ. పుం. 1. మనుష్య ముఖమున్ను పక్షిశరీరమున్ను గలిగిన దేవతావిశేషపుజాతి: చూ, దేవతాభేదము; అం. 2. భారత వర్షములు తొమ్మిదింటిలో నొకటి: చూ, వర్షములు. (రూ-కింపూరుషము = కింపురుష లోకము.)

కింపురుషుఁడు. సం. వి. అ. పుం. అశ్వముఖమును నరశరీరముగల దేవయోని విశేషము: చూ, దేవతాభేదము.

కింపూరుషము. అం: చూ, రూ-కింపురుషము. 2.

కింభర. సం. వి. ఆ. స్త్రీ. నలియను గంధద్రవ్యము: చూ, రాజార్హము.

కింవదంతి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. జనులాడుకొను మాట, వానుడి: చూ, వ్యాఖ్యాతము. 2.

కింవా. సం. అవ్య. 1: చూ, అథవా; 2. వికల్పార్థకము: చూ, వికల్పము. 9.

కింశారువు. సం. వి. ఉ. పుం. 1. అమ్ము: చూ, బాణము. 1; 2. వరిముల్లు: చూ, సితాగ్రము; 3. రాపులుఁగు: చూ, రాబందు.

కింశుక. సం. వి. ఆ. స్త్రీ. ఎక్కుడుఁదీఁగె *: చూ, మానేరు.

కింశుకము. సం. వి. అ. పుం. 1. పలాశము *: చూ, మోదుగు; (దీనిమొగ్గ అంగారితము.); 2. పాముయొక్క కుబుసము: చూ, సీదరము. 3; 3. అవిక: చూ, వస్త్రము. (చొక్క అని కొందఱు); 4. కవచము: చూ, బొందడము; 5. తున్నము *: చూ, నంది.

కింశులుకము. సం. వి. అ. పుం. పలాశవృక్ష విశేషము *: చూ, మోదుగు.

కింస్తుఘ్నము. అం. బవాదికరణములలో నొకటి: చూ, కరణము. 2.

కింస్విత్తు. సం. అవ్య. 1. అడుగుట: చూ, ప్రశ్నము; 2. ఊహ: చూ, యోచన.

కికిక. దే. వి. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హాహాహా. (రూ-కికాకిక.)

కికాకిక. దే. వి. —పై—; కళా. 1, అ. 40.

కికి. సం. వి. న్. పుం, ఈ. స్త్రీ. చాషము: చూ, పాలపిట్ట.

కికింకిరి. దే. వి. 1. కోపవికారము: కిసరు; 2. అసహ్యము: చూ, రోఁత. 2.

కికిదివి. సం. వి. ఇ. పుం: చూ, కికి. (రూ- కికీదివి- కికీదీవి)

కికీదివము. సం. వి. అ. పుం. —పై—

కికీదివి. సం. వి. ఇ. పుం. 1. —పై—; 2. శివుని నుదుటియందుండు కన్ను, ఎఱ్ఱగన్ను: చూ, నేత్రము. 1.

కికీదీవి. సం. వి. ఇ. పుం. రూ- కికీదివి: చూ, పాలపిట్ట.

కికురించు. దే. స. క్రి. మోసపుచ్చు; స్వా. 3, అ. 129: చూ, వచించు. (రూ- కికురుపెట్టు- కికురువోడుచు- కిక్కురించు- కిక్కురుపెట్టు)

కికురింత. దే. వి. 1. మోసము: చూ, వంచన; 2. వంచనకరణము. (రూ- కికురింపు- కిక్కురింపు- కికురు- కిక్కురు- కిక్కురింత)

కికురింపు. దే. వి. —పై—

కికురు. దే. వి. —పై—

కికురుపెట్టు. దే. స. క్రి. (కికురు + పెట్టు) మోసపుచ్చు; రామా. 3, అ. 145: చూ, వంచించు.

కికురువోడుచు. దే. స. క్రి. (కికురు + పొడుచు) —పై—; భాగ. 10, స్కం. పూ. 481.

కిక్కస. సం. వి. ఆ. స్త్రీ, బ. గర్భిణీస్త్రీలకు స్తనములు మొదలగు ప్రదేశములందుండు రేఖలు, కండూరేఖలు: చూ, కండూరేఖలు; (1) కోరివంటి తృణము, నదము *: చూ, తృణము. 1.

కిక్కసకసవు. దే. వి. కిక్కసః: చూ, తృణము. 1.

కిక్కిరిసికొను. దే. అ. క్రి. ఇఱుకైన తావులో కూర్చుండు: ఇఱికికొను. (వా)

కిక్కురించు. దే. స. క్రి: చూ, రూ- కికురించు; రా. యు, కాం. 267.

కిక్కురింత. దే. వి: చూ, రూ- కికురింత

కిక్కురింపు దే. వి. —పై.— (రూ- కికురింపు.)

కిక్కురు. దే. వి: చూ, రూ- కికురు.

కిక్కురుమనకుము. జా. మాటలాడకుము, నోరెత్తకుము.

కిక్కురువెట్టు. దే. స. క్రి: చూ, రూ- కికురువెట్టు; రసి. 3, ఆ. 90.

కిక్కురువోడుచు. దే. స. క్రి: చూ, రూ- కికురువోడుచు.

కిక్కస. దే. వి. 1. బలాత్కారము: చూ, బలవంతము; 2. మిక్కిలి కదియిక; పా. 3 ఆ. 38.

కిఖి. సం. వి. ఇ. స్త్రీ. 1. చిన్ననక్క, గుంటనక్క: చూ, సృగాలము; ఇ. పుం. 2. కోతి: చూ, వానరము.

కిగ్గాడి. వై. విణ. 1. అంబేద. కళా. 3, ఆ. 133: చూ, నిష్ప్రయోజకుడు; 2.= కీకట. క్షుద్రుడు: చూ, వ్యాధుడు 2. (రూ- కిగ్గాడీ- కీగాడి)

కిగ్గాడీ. వై. విణ. —పై.— (కీగాడి)

కిచిడీ. దే. వి: చూ, రూ- కిచ్చిడి.

కిచకిచ. దే. వి. పక్షులులోనగువాని కూంతయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

కిచకొట్టు. దే. అ. క్రి. కూయు; రా. కిష్కిం, కాం. 199: చూ, శబ్దించు.

కిచకిచకొట్టు. దే. అ. క్రి. —పై.—

కిచ్చిడి. దే. వి. 1. నానావస్తువులు చేర్చి వండిన చిత్రాన్న విశేషము, కలవంటకము: చూ, పాదము. (1); వా. 2. కిచిడీ అనియు పిచికసన్నములు అనియు పిచికసాంబఅనియూ పిలువఁబడు ఒకరకము వడ్లు: చూ, ధాన్యము.

కిట. పా. వీణె మృదంగము మొదలగు వాద్యములలో నొకటి. (తక- ధిమి- కిట- ఝణు మొ.): చూ, స్వరము. 2.

కిటకిట. దే. వి. 1. వీణె మొదలగువాని బిరడ త్రిప్పుటయందగుధ్వన్యనుకరణము; వైజ. 1, ఆ. 118: చూ, హూహూ; వా. 2. ఇద్దఱు (లేక) పెక్కురు ఎడములేకుండఁగ కిక్కిఱియుట. "మనుష్యులు కిటకిటలాడుచు కూర్చున్నారు."

కిటి. సం. వి. ఇ. పుం. పంది చూ, సూకరము.

కిటికి. దే. వి. రూ- కిటికీ: చూ, గవాక్షము.

కిటికీ. దే. వి. —పై.—

కిటిభము. సం. వి. అ. పుం. కేశకీటము, పేను: చూ, యూకము.

కిటుకు. దే. వి. 1. కపటము; వి, పు 7, ఆ. 94: చూ, వ్యాజము. 1; 2. గుట్టు; కళా. 5, ఆ. 38: చూ, మర్మము. 1.

కిట్టమి దే. వి. పగ: చూ, విరోధము. (రూ- గిట్టమి.)

కిట్టము. సం. వి. అ. న. శరీరమునుండి వెలువడు మలసామాన్యము. (ఇవి పండ్రెండు.— క్రొవ్వు, రేతస్సు, నెత్తురు, మెదడు, గులిమి, మూత్రము, విష్ఠ, చీమిడి, తెమడ, కన్నీరు, కంటిపుసి, చెమట): చూ, మలము. 1.

కిట్టవర్జితము. సం. వి. అ. న. శుక్రము: చూ, రేతస్సు. 1.

కిట్టాలము. సం. వి. అ. పుం. 1. రాగిగాజు: చూ, భూషణము. 2; 2. రాగిపాత్రము: చూ, పాత్రము. 6; 3. ఇనుపచిట్టెము: చూ, మండూరము.

కిట్టికోల. దే. వి. ఇఱికించుటకుగానొక కట్టు

కొనలఁజేర్చి కట్టి చిన్నకోలలతో నేర్పఱుపఁబడిన సాధనము.

కిట్టిబము. సం.వి.అ.న. ఉప్పునీళ్ళు: చూ. నీరు. 1.

కిట్టు. దే. అ. క్రి, స. క్రి. చేరు; భార. ద్రో. 1, ఆ. 888; భార. అర. 1, అ. 102: చూ, సమీపించు.

కిట్టుబడి. వా. వి. గిట్టుబడి.

కిణము. సం. వి. అ. పుం. 1. కఠినవస్తుసంస్పర్శముచే హస్తాదులయందుఁ గాచెడి కాయ; 2. గాయపుకాయ; 3. యోన్యర్శమను మూలవ్యాధి: చూ, రోగము. 1.

కిణ్వాలయము. సం. వి. అ. న. పెళ్ళెము, పిల్లము *: చూ, సురవర్తి.

కిణి. సం. వి. ఇ. స్త్రీ. ఉత్తరేణి *: చూ, శైఖరికము.

కిణితము. సం. వి. అ. న. వాయుదేవుని విల్లు: చూ, బాణము. 1.

కిణిహి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఉత్తరేను *: చూ, శైఖరికము; 2.= గినియ. తెల్లగినియ*: చూ, శిరీషపత్రి; 3.= గినియ. నల్లగినియ *: చూ, శిరీషపత్రి.

కిణ్వము. సం. వి. అ. న. 1. పెళ్లెము, పిల్యము*: చూ, సురవర్తి; 2. రూ- కణ్వము. కల్లుతీయు పదార్థము, సురాబీజము: చూ, సుర. 2; 3. తెలికపిండి: చూ, పిణ్యాకము; 4. దోషము: చూ, పాపము. 1.

కిత. దే. వి. దేవతార్పణమునకై కళ్ళమున నొకదెసఁబోసెడు మూఁడు దోసిళ్ళరాసి.

కితకిత. వా. వి. చక్కిలిగింత.

కితవము. సం. వి. అ. పుం. 1. ఉమ్మెత్త *: చూ, హాలాపుష్పము; 2. చండాయను గంధద్రవ్యము: చూ, రాజార్హము.

కితవుఁడు. సం. వి. అ. పుం. 1. జూదమాడువాఁడు: చూ, పందెకాఁడు; విణ. 2. మోసగాఁడు: చూ, వంచకుఁడు. 1; 2. మదించినవాఁడు: చూ, మత్తుఁడు.

కితాబు. వా. వి. బిరుదు, గౌరవచిహ్నము.

కితువు. సం. వి. ఉ. పుం. నాట్యమందలి పదునాలుగంకములలో నొకటి: చూ, నాటకము. 1.

కిత్త. దే. వి. చేతనాచేతనాగ్ని: చూ, నిప్పు. (రూ- కిత్తు.)

కిత్తనార. దే వి చాగనార, కాటుగుడ్డ.

కిత్తలి. దే. వి. నాగరంగజాతియము *: చూ, కర్కారాంకము.

కిత్తి. వై. వి. అగ్ని; ఆం, భా. ప్ర. స్వ. 48: చూ, నిప్పు.

కిత్తు. దే. వి: చూ, రూ- కిత్త.

కిదుకు. దే. అ. క్రి. 1. బిడ్డలు నిద్రలేచునపుడాలస్యముచే నొకవిధముగా మూలుగు; భాగ. 10, స్కం. పూ. 225. చూ, స్వరము. 2; 2. బిడ్డలు తల్లిదండ్రులులోనగు వారినేదేని కావలసి పీడించునపుడొకవిధముగామూలుగు; పారిజా. 1, భా. 2341: చూ, స్వరము. 2.

కినియు. దే. అ. క్రి. 1. కోపించు: చూ, రోషించు. (రూ- కినుపడు- కిన్కడు- కింకిరిపడు) 2. చేరు; హంస. 2, ఆ. 47: చూ, సమీపించు.

కినుక. దే. వి. కోపము; భార. ద్రో. 3, ఆ. 225: చూ, రోషము. (రూ- కిన్క- కినుకము- కినుపు)

కినుకకాఁడు. దే. విణ. కోపముగలవాఁడు: చూ, రోషణుఁడు.

కినుకము. దే. వి. కోపము: చూ, రోషము.

కినుపు. దే. వి. —పై—; కాశీ. 4, ఆ. 148.

కినుపడు. ద్వ. అ. క్రి. (కినుపు + పడు) రూ- కిన్వడు. కోపపడు; భార. విరా. 4, ఆ. 218: చూ, రోషించు.

కిన్క. దే. వి: చూ, రూ- కినుక.

కిన్నర. సం. వి. అ. స్త్రీ. = కిన్నెర. ఒకరకమువీణె: చూ, వీణె.

కిన్నరసత్వం. అం. కామశాస్త్రములోని ద్వాదశసత్వలలో నొకటి: చూ, ద్వాదశసత్వలు.

కిన్నరాంశము. అం. మత్స్యాంశములలో నొకటి చూ, మత్స్యాంశములు.

కిన్నరి. సం. వి. ఈ. స్త్రీ. 1. = కిన్నెర. ఒక రకము వీణె: చూ, వీణె; 2. కిన్నర స్త్రీ: చూ, స్త్రీ.

కిన్నరుఁడు. సం. వి. అ. పుం. 1. అశ్వముఖమును నరశరీరముగల దేవయోని విశేషము. (చూ, కింపురుషుఁడు): చూ, దేవతావిశేషము.

కిన్నరేశుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు.

కిన్నరేశ్వరుఁడు. సం. వి. అ. పుం.—పై.—

కిన్ను. సం. అవ్య. 1. అడుగుట: చూ, ప్రశ్నము; 2. సందియము: చూ, సంశయము; 3. ప్రాఁతది: చూ, పురాతనము; 4. పూజ్యము: చూ, మహితము; 5. చెప్పరానిది: చూ, అవాచ్యము.

కిన్నెర. పై. విణ. = కిన్నెర. ఒకరకము వీణె; సై. 1, ఆ. 5: చూ, వీణె.

కిన్వడు. ద్వ. అ. క్రి: చూ, రూ- కినువడు; హరి. పూ. 9, ఆ. 85.

కిఫాయతు. హిం. వి. లాభము.

కిమర్థకము. సం. అవ్య. ఏమి.

కిమస్తుఘ్నము. అం. కరణములు పదునొకండింటిలో నొకటి: చూ, కరణములు.

కిమిల. సం. వి. ఆ. స్త్రీ. విశేషసంతానముగల యాఁడుది: చూ, స్త్రీ.

కిమీరము. సం. వి. అ. పుం. నారింజే *: చూ, శర్కరాంకము.

కిము. సం. అవ్య. 1. వికల్పాత్మక సంశయము, ఇదేవో అదేవో: చూ, సంశయము; 2. చక్కఁగా తెలియుట, సంభావన, గౌరవము: చూ, సన్మానము; 3. విమర్శ: చూ, విచారణ; 4. మనోవ్యాపారము: చూ, సంకల్పము; 5. నిద్దుర: చూ, స్వప్నము. 2.

కిముడు. దే. విణ. అల్పము; ఆం. భా. తృ. వి. 16: చూ, స్వల్పము.

కిముత. సం. అవ్య. 1. నిర్భరము, పెల్లు, అతిశయము: చూ, హెచ్చు. 2; 2. అదోయిదో యను సంశయము: చూ, సంశయము; 3 అడుగుట: చూ, ప్రశ్నము

కిమ్మతు. వా. వి. వెల. రూ-కిమ్మత్తు.

కిమ్మీరము. సం. వి. అ పుం. 1. రూ- కిర్మీరము, చిత్రవర్ణము: చూ, వర్ణము. 6; 2. నారదబ్బ *: చూ, శర్కరాంకము; విణ. 3. చిత్రవర్ణముగలది: చూ, వర్ణము. 6.

కిమ్మీరుఁడు. సం. వి. అ. పుం. కిమ్మీరుఁడను రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

కియదేతిక. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉత్సాహము: చూ, సంతోషము; 2. ప్రయత్నము: చూ, యత్నము.

కియదేహిక. సం. వి ఆ. స్త్రీ. పౌఢిమ: చూ, సామర్థ్యము. 1.

కియూహము. సం. వి. అ. పుం. ఎఱ్ఱనిగుఱ్ఱము: చూ, హయము.

కియ్య. దే. వి. (క్రిందు + య) ఒకయుత్తరము క్రిందియాకారము: రూ- కియ్యము- కియ్యవడి.

కియ్యము. దే. వి. —పై.—

కియ్యవడి. దే. వి. —పై.—

కిరంజి. సం. వి. ఇ. పుం. 1. కరతలము: చూ, హస్తము; 2. నీలమణి దోషము: చూ, రత్నము. 1.

కిరకుఁడు. సం. వి. అ. పుం. లేఖకుఁడు, రూ- కిరికుఁడు: చూ, వ్రాఁతకాఁడు.

కిరణపృథక్కరణము. పా. పట్టకముగుండ వస్తువులను చూచునప్పుడు వస్తువులుపైకి లేచినటు

లనో క్రిందికిదిగినట్టులనో కనఁబడుటయేగాక దానిచుట్టును వింతవింతరంగులు కానవచ్చును. అవి ఊదా, నీలిమందువర్ణము, నలుపు, ఆకుపచ్చ, పసుపు, నారింజపండువర్ణము, ఎఱుపు యేడురంగులుగలిగియుండును. ఈసప్తవర్ణములును, సూర్యుని తేజమందు మిళితమై తెల్లగానుండును. ఈ తెల్లని కిరణములు పట్టకముమీఁద పడినప్పుడు దానియందలి వివిధవర్ణకిరణములు, వేఱువేఱుగా వంగుటచేత అవితిరిగి మిళితమగుటకు వీలులేక, వివిధవర్ణములుగా గోడమీఁదఁబడుచున్నవి. ఇట్లు తెలుపురంగు మొదలైన మిశ్రవర్ణములను వివిధవర్ణములుగా విభజించుటకు పృథక్కరణమని పేరు.

కిరణమాలి. సం. వి. న్. పుం. వెలుఁగుఱేఁడు: చూ, సూర్యుఁడు.

కిరణము. సం. వి. అ. పుం. 1. వెలుఁగు: చూ, మయూఖము. 1; అం. 2. ఆగమములు ఇరువదియెనిమిదింటిలో నొకటి: చూ, ఆగమములు. (చూ, ఉపవిద్యలు)

కిరణావళి. అం. పంచమపాడవజాంతర భావలు మూఁడింటిలో నొకటి: చూ, పంచమపాడవజాంతరభావలు: (చూ, భావ. 1 )

కిరము. సం. వి. అ. పుం. రూ- కిరి. వరాహము: చూ, సూకరము.

కిరాటుఁడు. సం. వి. అ. పుం కోమటి: చూ, వైశ్యుఁడు.

కిరాత. సం. వి. ఆ. స్త్రీ. మందాకిని: చూ, నది.

కిరాతకము. సం. వి. అ. పుం. నేలవేము *: చూ, భూనింబము.

కిరాతతిక్తము. సం. వి. అ. పుం. —పై.—

కిరాతార్జునీయము. పా. ఈగ్రంథకర్త భారవి.

కిరాతాసి. సం. వి. న్. పుం. గరుడుఁడు: చూ, హరివాహనుఁడు.

కిరాతి. సం. వి. ఈ. స్త్రీ. 1. కిరాతస్త్రీ: చూ, స్త్రీ; 2. గౌరి: చూ, పార్వతి. 1; 3. గంగ: చూ, నది: 4. కుంటెనకత్తె: చూ, శంభలి.

కిరాతుఁడు. సం. వి. అ. పుం. నెమిలి పింఛము ధరించి అడవియందు తిరిగెడుబోయ: చూ, వ్యాధుఁడు. 1.

కిరాణా. వా. వి. చిల్లరదినుసులు. రూ-కిరానా.

కిరాయి. వా. వి. బాడుగ, కూలి.

కిరి. సం.వి.ఇ.పుం. వరాహము: చూ, సూకరము.

కిరికము. సం. వి. అ. పుం. కపటజాదము: చూ, వ్యవహారము. 4; 2 దేవతలయొక్క డేఁదము: చూ, హృదయము. 2; 3. దేవాలయము: చూ, వేలుపుటెంకి.

కిరిసుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ- కిరసుఁడు.

కిరిటి. సం. వి. న్. న. 1. హింతాలఫలము: చూ, హింతాలము; ఇ. పుం. 2. కోడి: చూ, పుంజో (రూ- కిరీటి)

కిరీటధారణసమయము. పా. గ్రహసమయములు ఇరువదియేడింటిలో నొకటి; సుఖము, గజారోహణము మొదలగునవి గలుగును: చూ, గ్రహసమయములు.

కిరీటము. సం. వి. అ. పుం, న. ఒకవిధమైన రాజుల తలపాగ; సార్వభౌముని బొమిడికము: చూ, సీసకము. 1.

కిరీటి. సం. వి. న్. పుం. 1.= క్రీడి. అర్జునుఁడు: చూ, విజయుఁడు. 1; 2. కోడి: చూ, పుంజో. (రూ- కిరిటి)

కిరీటిక. సం. వి. ఆ. స్త్రీ. జీవకమను పేరుగల గ్రంథ్యము: చూ, రాజార్హము.

కిరీటిపచ్చ. వై. వి.= గారుడ. 1. మరకతము; వసు. 4, ఆ. 78; విజ. 8, ఆ. 26: చూ, రత్నము. 1; 2. నీలము: చూ, రత్నము. 1,

**కిరుడెసు.** వై. వి. = గృధ్రసి. రొండిలోని వాతరోగము; అం, భా. ద్వి. మ. 126: చూ, రోగము. 1.

**కిరుసు.** దే. వి. ఇరుప్రక్కల వాదరగలిగి వాటమైన కత్తి; కళా. 7, అ. 12: చూ, కత్తి 2.

**కిర్మి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పలాలము, గింజలేని వరిపోచేలోనగునది, మోడు: చూ, తృణము. 1; 2. ఇల్లు: చూ, సదనము. 1; 3. స్వర్ణపుత్తలిక: చూ, పుత్తలిక; 4. లోహపుత్తలిక: చూ, పుత్తలిక.

**కిర్మీరజిత్తు.** సం. వి. త్. పుం. భీమసేనుఁడు: చూ, వృకోదరుఁడు.

**కిర్మీరత్వక్కు.** సం. వి. చ్. స్త్రీ. నాగరంగము*: చూ. శర్కరాంకము.

**కిర్మీరభిత్తు.** సం. వి. ద్. పుం: చూ, కిర్మీరజిత్తు.

**కిర్మీరము.** సం. వి. అ. పుం. 1. నాగరంగ*: చూ, శర్కరాంకము; 2. కర్బూరవర్ణము: చూ, వర్ణము 6.

**కిర్మీరసూదనుఁడు.** సం. వి. అ. పుం: చూ, కిర్మీరజిత్తు.

**కిర్మీరుఁడు.** సం. వి. అ. పుం: చూ, రూ-కిమ్మీరుఁడు.

**కిర్లి.** దే. వి. మల్లశాస్త్రములోని విన్నాణములు ముప్పదిరెండింటిలో నొకటి; అం, భా. ద్వి. షు. 209: చూ, విన్నాణములు. (రూ- కిర్లము - కిల్లి- కర్లి- కల్లి) (పురుషోత్తమకవీయము)

**కిఱకిఱ.** దే. వి. 1. రథనేమి ధ్వని: చూ, హూహూ.

**కిఱుఁజెప్పు.** దే. వి. రూ- కిఱ్ఱుఁజెప్పు; వై. 8, అ. 126: చూ, పాదుక.

**కిఱుకు.** దే. వి. 1. మోసము: చూ, వంచన. (రూ- క్రిక్కు- కుక్కి); 2. త్రిప్పు; వై. 6, అ. 284: చూ, విహారము.1; విశే. 3. తక్కువైనది: చూ, హీనము. 1.

**కిఱుకుపాడుచు.** దే. స. క్రి. తిరుగు; భాగ. 10. స్కం. పూ. 756: చూ, సంచరించు.

**కిఱుదు.** దే. విశే. తక్కువైనది. చూ, హీనము.1. "కిఱుదు నేల."

**కిఱ్ఱు.** దే. వి. ధ్వన్యనుకరణవిశేషము: చూ, హూహూ.

**కిఱ్ఱుఁజెప్పు.** దే. వి: చూ, రూ- కిఱుఁజెప్పు. (ఇట్లు కిఱ్ఱుమెట్టు)

**కిఱ్ఱుగానుగు.** దే. వి. ఒకానొక బాలక్రీడ: చూ, బాలక్రీడ.

**కిల.** సం. అవ్య. 1. వార్త, లోకవాదము: చూ, సమాచారము. 2; 2. సంభవించుననుట: చూ, సంభావ్యము; 3. ఉచితముకానిది: చూ, అనుచితము; 4. కారణము: చూ, హేతువు; 5 కల్ల: చూ, వితథము; 6. అక్రమము: చూ, ఆగ్రహము. 3; 7. తలఁపు: చూ, స్మృతి. 1; 8. ఊరడించుట: చూ, సమాశ్వాసము.

**కిలకించితము.** సం. వి. అ. న, స్త్రీ. రూ- కిలికించితము. 1. రోషాశ్రుహర్ష భీత్యాదుల సంకరరూపమగు స్త్రీయొక్క శృంగారచేష్టా విశేషము: చూ, హావము; అం. 2. శృంగార చేష్టలు పదునెనిమిదింటిలో నొకటి: చూ, శృంగారచేష్టలు.

**కిలకిల.** సం. వి. అ. స్త్రీ. 1. హర్షధ్వని: చూ, స్వనము. 2: దే. వి. (1) నవ్వుటయందగు ధ్వన్యనుకరణము; వసు. 6, అ. 74; య. 5, అ. 81: చూ, హూహూ.

**కిలకిలఁబలుకు.** దే. అ. క్రి: చూ, కిలకిలలాడు.

**కిలకిలలాడు.** దే. అ. క్రి. (కిలకిలలు + ఆడు) కిలకిలధ్వనిచేయు; నీలా. 2, అ. 81: చూ, శబ్దించు.

**కిలకొట్టు.** దే. అ. క్రి. మ్రోఁగు, చెలఁగు: చూ, శబ్దించు.

**కిలాటము.** సం. వి. అ. పుం. 1.పాలవిఱుగుడు: చూ, పాలు. 1; 2. జున్ను: చూ, పాలు.1; (పాలు కాచేగా మిగిలినగడ్డయని హారావళి)

**కిలాటి.** సం. వి. ఈ. స్త్రీ. 1. -పై.-; న్.పుం. 2. వెదురు: చూ, వేణువు.

**కిలాతము.** దే. వి. గుఱ్ఱము; య. 2, ఆ. 89: చూ, హయము.

**కిలారము.** దే. వి. ఘోషము, పసులమంద. రూ- కీలారము: చూ, ధేనువు.

**కిలారి.** దే. వి. (కిలారము + ఇ) రూ- కీలారి. ఆవులఁగాపరి, గొల్లవాఁడు: చూ, మహాశూద్రుఁడు.

**కిలారించు.** దే. అ. క్రి. కిలకిలమని మ్రోఁగు: చూ, శబ్దించు.

**కిలారుచు.** దే. అ. క్రి. 1.—పై.—; 2. బొబ్బరించు: చూ, శబ్దించు. (రూ- కిలార్చు)

**కిలార్చు.** దే. అ. క్రి. —పై.—

**కిలార్థకములు.** పా. కద- కదా- కాదా- కా.

**కిలాసఘ్నము.** సం. వి. అ. పుం.ఒకరకముచెట్టు: చూ, వృక్షము.

**కిలాసము.** సం. వి. అ. న. 1. దేహమునందు గలిగెడి యొకదినుసుపొడ: చూ, సిధ్మము; 2. సిబ్బెముగలది: చూ, సిధ్మము.

**కిలాసి.** సం.విణ.(న్. ఈ.న్.) సిబ్బెముగలవాఁడు: చూ, సిధ్మలుఁడు.

**కిలింజకము.** సం. వి. అ. పుం. కటము: చూ, చాఁప.

**కిలింజము.** సం. వి. అ. పుం, న: చూ, సూక్ష్మదారువు *.

**కిలికించితము.** సం. వి. అ. న: చూ, రూ- కిలకించితము. (రూ- కిలికించితము)

**కిలిమము.** సం. వి. అ. న. దేవదారువు*: చూ, సూక్ష్మదారువు.

**కిల్బము.** సం. వి. అ. న. దోసము: చూ, పాపము. 1.

**కిల్బి.** సం. వి. ఇ. పుం. గుఱ్ఱము:చూ,హయము.

**కిల్బిషము.** సం. వి. అ. న. 1. దోసము: చూ, పాపము. 1; 2. తప్పు: చూ, నేరము; 3. తెవులు: చూ, రోగము.1; 4.నల్లత్రాఁచు విషము: చూ, విసము. 1.

**కిల్లాకు.** ద్వ. వి. (కిల్ల + ఆకు) చీటి; కువల. 2, ఆ. 24; కళా. 7, ఆ. 24: చూ, పుస్తోణి. (రూ- ఉల్లాకు- కిల్లాకుచీటి - కిళాకుచీటి- కిళ్లాకుచీటి) (పురుషోత్తమకవీయము)

**కిల్లాకుచీటి.** ద్వ. వి. —పై.—

**కిల్లాడి.** హా. వి. మాయ, దగా.

**కిల్వి.** సం. వి. న్. పుం. గుఱ్ఱము:చూ,హయము.

**కివకివ.** దే. వి. ధ్వన్యనుకరణవిశేషము: చూ, హహాహహా.

**కివ్వు.** దే. అ. క్రి. తునుఁగు: చూ, మడియు.

**కిశలము.** సం. వి. అ. పుం, న. చిగురు: చూ, విద్రుమము.

**కిశలయము.** సం. వి. అ. పుం, న. —పై.—

**కిశోరము.** సం. వి. అ. పుం. గుఱ్ఱపుపిల్ల: చూ, హయము; 2. తైలపర్ణి, చిల్లమడ్డి *: చూ, సల్లకి; 3. లూత: చూ, సాలెపురుగు; 4. చాగ *: చూ, ప్రివ; విణ. 5. విడువఁబడినది: చూ, సముజ్ఝితము.

**కిశోరుఁడు.** సం. వి. అ. పుం 1. వేఁడివేలుపు: చూ, సూర్యుఁడు; విణ 2. యౌవనావస్థకలవాఁడు: చూ, శిశువు.

**కిష్కుచతుష్కతము.** సం. వి. అ. న నూఱుబారల దూరము: చూ, నల్వము.

**కిష్కింధ.** అం. కాండలు ఆఱింటిలో నొకటి: చూ, కాండలు.

**కిష్కింధము.** సం. వి. అ. పుం. ఓఢ్రదేశమునందలి యొకానొకకొండ: చూ, పర్వతము.

కిష్కింధాధిపుఁడు. సం. వి. అ. పుం. వాలి తమ్ముఁడు, సుగ్రీవుఁడు: చూ, వానరము.

కిష్కింధి. సం. వి. ఈ. స్త్రీ. కిష్కింధ పర్వతమునందలి గుహ: చూ, రంధ్రము. 1.

కిష్కింధ్య. సం. వి. అ. స్త్రీ. —పై.—

కిష్కింధ్యము. సం. వి. అం. పుం: చూ, రూ- కిష్కింధము.

కిష్కువు. సం. వి. ఉ. స్త్రీ. 1. జేన: చూ, వితస్తి; 2. ప్రకోష్ఠము: చూ, ముంజేయి; 3. రెండుజేనలకొలఁది హస్తము: చూ, మూర.1; పుం. 4. నిందితుఁడు: చూ, వ్యాఁధుడు. 2.

కిస. దే. వి. నెమలికూఁత: చూ, స్వరము. 2. (రూ- కేక- కేకిస- కేస) (పురు- క)

కిసమస. దే. వి. వ్యథ; విజ 3, అ. 87: చూ, దుఃఖము.

కిసము. సం. వి. అ. న. చిగురు: చూ, కిసలము.

కిసరు. దే. వి. 1. కోపవికారము; ఆము. 4, అ. 175: చూ, కికెంకిరి. 1; 2. అంటుసోఁకుట వలన పసిబిడ్డలకు కలిగెడిదోషము.

కిసలము. సం. వి. అ. న: చూ, కిసము. (రూ- కిసాలయము- కిసాలము-కిసలయము-కిసము)

కిసలయము. సం. వి. అ. న. —పై.—

కిసాలము. సం. వి. అ. న. —పై.—

కిసాలయము, సం. వి. అ. పుం, న. —పై.—

కిసాలున. దే. వి. ధ్వన్యను కరణము: చూ, హూహూ.

కిసిమిసిపండు. నా. వి. లఘుద్రాక్షాఫలము.

కిసుక. పై. వి.=కృషి: చూ, వ్యవసాయము.

కిసుమిను. దే. వి: చూ, లఘుద్రాక్ష *.

కిస్తి. హిం. వి. 1. వంతుచొప్పున చెల్లించు ద్రవ్యము, వాయిదా; వా. వి. 2. లంకణము. "వాఁడుజ్వరముచేకిస్తీలు చెల్లించుచుండెను."

కిస్తీబంది. హిం. వి. వాయిదాల యేర్పాటు.

కిస్మసుపండుగ. వా. వి. క్రీస్తుజన్మదినోత్సవము.

కిళ్ళి. వా. వి. పరిమళద్రవ్యములతోఁ గూడిన తాంబూలము. (రూ-కిళ్ళీ) (చూ, జారాకిళ్ళి)

# కీ.

కీఁక. పై. వి. 1 =ఘీంకారః రూ-గీఁక. ఏనుఁగు కూఁత, బృంహితము: చూ, స్వరము. 2; 2. నెమలి కూఁత: చూ, స్వరము. 2. (ఆంధ్రపదాకరము)

కీఁచేట్లాడు. దే. అ. క్రి. (కీఁచు + ఆటలు + ఆడు) కలహించు: చూ, వాటులాడు.

కీఁచు. దే. వి. 1. ధ్వన్యనుకరణవిశేషము; భో. 5, అ. 94: చూ, హూహూ; 2. అర్తధ్వని: చూ, స్వరము. 2.

కీఁచుతలగడ. దే. వి. అదిమినపుడు కీఁచుకీఁచను నట్లు లోపల విల్లుపెట్టి కుట్టినతలగడ: చూ, లోడు.

కీఁచుబిళ్ళ. దే. వి. —పై.—

కీఁచుబుఱ్ఱ. దే. వి. —పై.—

కీఁచుతాఁజు. దే. వి. ముగుగు కుమ్మరపురుగు: చూ, యమకీటకము. (చూ, పురుగు)

కీకటము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము: చూ, హయము; 2. మగధదేశము. చూ, దేశము; స్త్రీ. 3. కల్లు: చూ, సుర. 2; విశే. 4. పిసినివాఁడు (శ.ర): చూ, లోభి; 5. పేదవాఁడు (శ.ర): చూ, బీదవాఁడు; రూ- కీకటుఁడు)

కీకటుఁడు. సం. వి. అ. పుం. —4. 5. పై.—

కీకశాశ్యము. సం. వి. అ. పుం. పక్షి: చూ, పక్షి. (రూ- కీకసాస్యము)

కీకసము. సం. వి. అ. న. 1. ఎముక: చూ, శల్యము. 1; పుం. 2. నులిపురుగు : చూ, పురుగు.

కీకసాత్మజుఁడు. సం. వి. అ. పుం. నైరృతి: చూ, మూలకేఁడు.

కీకసాస్యము. సం. వి. అ. పుం: చూ, రూ-కీకశాస్యము.

కీకి. సం. వి. ఇ. పుం: చూ, పాలపిట్ట.

కీకిదివి. సం. వి. ఇ. పుం. రూ- కికిదివి, కీకీదివి. —వై.—

కీగాడి. వై. వి. = కీకట. రూ- కిగ్గాడి- కిగ్గాడీ. క్షుద్రుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

కీచకజిత్తు. సం. వి. త్. పుం. భీమసేనుఁడు: చూ, వృకోదరుఁడు.

కీచకభిత్తు. సం. వి. ద్. పుం. —వై.—

కీచకము. సం. వి. అ. పుం. 1. గాలితాఁకున మ్రోగెడు వెదురు: చూ, వేణువు; 2. ఒకానొక చెట్టు: చూ, వృక్షము.

కీచకారాతి. సం. వి. ఇ. పుం: చూ, కీచకజిత్తు.

కీచకుఁడు. సం. వి. అ. పుం. 1. కీచకుఁడను రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; 2. అధముఁడు: చూ, హీనుఁడు; 3. నలుఁడు: చూ, బాహుకుఁడు.

కీచనిషూదనుఁడు. సం. వి. అ. పుం: చూ, కీచకజిత్తు.

కీటకము. సం. వి. అ. పుం. 1. కీటము: చూ, పురుగు; (కీటకములు వాని రెక్కల భేదములను బట్టి ఉద్భిజ్జములవలెనే కొన్ని యనులోమములుగ విభాగింపఁబడుచున్నవి. 1. కోలియాప్టరములు:-- కోశములవలె సమర్చఁబడియుండు రెక్కలుగలవి. ఉ.- బరిణె పురుగులు. బొద్దింకలు; 2. హైమెనాప్టరములు:- రేకులవంటి రెక్కలు గలవి. ఉ.- తేనెటీఁగలు, చీమలు, తుమ్మెదలు; 3. లెపిడాప్టరములు:-పొలుసు రెక్కలుగలవి.- ఉ. సీతాకోకచిలుకలు; దీపపు పురుగులు; 4: డిప్టరములు:-రెండు రెక్కలుగలవి. ఉ.-ఈఁగలు; 5. హెమిప్టరములు:-సగము రెక్కలుగలవి. ఉ.-నల్లులు; 6. ఆర్థాప్టరములు:-నిడివి రెక్కలు గలవి. ఉ.- మిడుతలు; 7. న్యూరాప్టరములు:--నాడులుగల రెక్కలు గలవి. ఉ.- తూనీఁగలు.); 2.ధరణి: చూ,భూమి.1; విణ. 3. కఠినము: చూ, బెడిదము; 4. నిష్ఠురమైనది.

కీటకుఁడు. సం. విణ. నిష్ఠురుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

కీటఘ్నము. సం వి. అ. పుం. గంధకము, అంగడి మందుదినుసు: చూ, సౌగంధికము. 4.

కీటజ. సం. వి. ఆ. స్త్రీ. లక్కు: చూ, లక్క.

కీటపాది. సం. వి. ఈ. స్త్రీ. హంసపాదిక *: చూ, హంసపాది.

కీటపాదిక. సం. వి. ఆ. స్త్రీ. —వై.—

కీటమణి. సం. వి. ఇ. పుం. మిడుఁగుఱుఁబురువు: చూ, పట్టుపురుగు. (చూ, పురుగు)

కీటమాత. సం. వి. ఆ. స్త్రీ. హంసపాదిక *: చూ, హంసపాది.

కీటమారి. సం. వి. ఈ. స్త్రీ. —వై.—

కీటమాలిక. సం. వి. ఆ. స్త్రీ. —వై.—

కీటరాజము. సం. వి. అ. పుం. కుమ్మరి పురుగు: చూ, యమకీటకము. (చూ, పురుగు.)

కీటు. దే. వి. 1. ఉపేక్ష: చూ, మందెమేలము.1; 2. గోడపెట్టునపుడొక తడవ యుంచెడు మట్టిపొడవు, మట్టిముద్దల పొడవు (రమారమి 3 అడుగుల ఎత్తు). గోడలోని భాగము: చూ, మఱుఁగుగోడ.

కీడు. వై. వి. 1. కపటు, దోసము; మార్క. 3, ఆ. 315; భార. అశ్వ 1, ఆ. 153: చూ, పాపము. 1; 2. అపకారము: చూ, హాని. 2; 3. అపరాధము; లక్ష్మి. 4, ఆ. 118: చూ, నేరము; 4. ఆపద: చూ, విపత్తు; 5. అశుభము, చెవుగుఱుతు; భార. స్త్రీ. 2, ఆ. 58: చూ, లక్షణము. 1; విణ. 6. అధమము; భార. అశ్వ. 4, ఆ. 218: చూ, హీనము. 1; 7. చెవుగుఱుతు గలది, అశుభకరము. "కీడే కురువంశమున కితనిరాక." భార. ఉద్యో. 3, ఆ. 171: చూ, లక్షణము. 1;

3. = కీడు. చెడ్డది; భార. ఉద్యో. 3, ఆ. 285: చూ. దుష్టము.

కీడుపడు. వై. అ. క్రి. రూ-కీడ్పడు. తక్కువపడు: చూ, లోపించు.

కీడుపాటు. వై. వి. 1. తక్కువపాటు; భార. విరా. 1, ఆ. 103: చూ, లోపము. 2; 2. చావుగుఱుతు, అశుభము: చూ, లక్షణము. 1. (రూ-కీడ్పాటు.)

కీడెంచిమేలెంచుట. జా. దోషము గ్రహించి మేలు తెలిసికొనుట. ఉదా.-ఎంతనుగీడెంచి మేలెంచుట మంచిదిగాన నిటుల నీకు వినిపించితి. (ధర్మజరాజసూయము.)

కీడేరము. సం. వి. అ. పుం. చిత్తికూర *: చూ, భండీరము.

కీడ్పడు. వై. అ. క్రి: చూ, రూ-కీడుపడు.

కీడ్పాటు. వై. వి: చూ, రూ-కీడుపాటు.

కీత. దే. వి. 1. తక్కువ: చూ, లోపము. "కీత నేల." మొ; 2. లోకువ: చూ, వెలితి. 2; వా. 3. హుళక్కి; "నీకుకీత-నీపనికీత.": చూ, శూన్యము. 1.

కీతు. దే. వి. కొబ్బరియాకులచాప: చూ, చాప.

కీదృక్షుడు. సం. విశే. ఏలాటివాడు: రూ-కీదృశుడు; (తె. ప):— ఎటువంటివాడు.

కీదృశము. సం. విశే: చూ. ఏలాటి.

కీదృశుడు. సం. విశే: చూ, రూ-కీదృక్షుడు.

కీనము. సం. అవ్య. 1. గొప్పతనము: చూ, యోగ్యత; 2. ఆశ్చర్యము: చూ, వింత. 1; 3. పాలించేడము: చూ, రక్షణము; 4. సంతసము: చూ, సంతోషము; 5. జలము: చూ, నీరు. 1.

కీనాశము. సం. వి. అ. పుం. ఏకాంతము: చూ, రహస్యము.

కీనాశుడు. సం. వి. అ. పుం. 1. జముడు: చూ. యముడు; 2. రక్కసుడు: చూ, రాక్షసుడు. 1; విశే. 3. ఒంటినున్నవోకింపెడువాడు; 4. దున్నెడువాడు: చూ, వ్యవసాయి; 5. పిసినివాడు: చూ, లోభి. 1; 6. పేదవాడు: చూ, బీదవాడు; 7. కటికివాడు, కుత్సితుడు: చూ, వ్యాధుడు. 2.

కీనీరునేల. దే. వి. నీరుముంపు నేల: చూ, భూమి. 1.

కీయాహము. సం. వి. అ. పుం. గేదెదూడ: చూ, మహిషి.

కీరకము. సం. వి. అ. పుం. 1. ఒకానొకచెట్టు: చూ, వృక్షము; 2. ప్రాపణము: చూ, లాభము. 1.

కీరకుడు. సం. వి. అ. పుం. క్షపణకుడు, బౌద్ధమతస్థుడు: చూ, బుద్ధుడు. 1.

కీరము. సం. వి. అ. పుం. 1. అంబాలము *: చూ, మామిడి; 2. చిలుక: చూ, శుకము; 3. పల్లె: చూ, దేశము; న. 4. సంజోడు: చూ, మాంసము; 5. కాశ్మీరదేశము: చూ, దేశము.

కీరవర్ణకము. సం. వి. అ. న. స్థౌణేయమను పేరుగల సుగంధద్రవ్యము: చూ, రాజార్హము.

కీరితి. వై. వి. = కీర్తి; హంస. 1, ఆ. 15: చూ, యశస్సు.

కీరిష్టువు. సం. వి. అ. పుం. అక్షోటము *: చూ, శీతపుష్పము.

కీరేష్టము. సం. వి. అ. పుం. 1. ఆమ్రము *: చూ, మామిడి; 2. అఖోటము *: చూ, పోక; 3. జలమధూకము *: చూ, మధూకము.

కీర్ణకోశము. సం. వి. అ. పుం. భగవిశేషము: చూ, భగము. 12.

కీర్ణము. సం. విశే. 1. కప్పబడినది: చూ, ప్రచ్ఛన్నము; 2. చిమ్మబడినది: చూ, విపులము; 3. నొప్పింపబడినది: చూ, వేధితము; 4. విడువబడినది: చూ, సముజ్ఝితము.

కీర్తన. సం. వి. ఆ. స్త్రీ. 1. కీర్తి: చూ, యశస్సు: వా. వి. 2. రాగము: చూ, స్వరము. 2.

కీర్తనము. సం. వి. అ. న. 1. పొగడిక: చూ, స్తోత్రము; అం. 2. భక్తిలక్షణములు తొమ్మిదింటిలో నొకటి: చూ, భక్తిలక్షణములు.

కీర్తనీయము. సం. విణ. పొగడఁదగినది: చూ, స్తుత్యము.

కీర్త్స్యగౌడబ్రాహ్మణులు. పా. గౌడులలో నొకతెగవారు. యజుర్వేదులు. హిరణ్యకేశీయసూత్రము కలవారు: చూ, బ్రాహ్మణులు.

కీర్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. = కీరితి: చూ, యశస్సు; 2. విరివి: చూ, విస్తారము. 1; 3. తేట: చూ, స్పష్టము; 4 అడుసు: చూ, బురద; 5. తావు: చూ, స్థానము. 1; 6. అనుగ్రహము: చూ, సాశతము. 2; అం. 7. ఐశ్వర్యములు ఏడింటిలో నొకటి; చూ, ఐశ్వర్యములు.

కీర్తించు. సం. స. క్రి. పొగడు; భార. ఆది. 3, ఆ. 20: చూ, స్తుతించు.

కీర్తితము. సం. విణ. పొగడఁదగినది : చూ, స్తుత్యము.

కీర్తితాళము. అం. జన్యతాళములు నూటయొకటింటిలో నొకటి: చూ, జన్యతాళములు.

కీర్తిప్రతాపసుభగత్వము. అం. నాయకస్వరూపములు అయిదింటిలో నొకటి: చూ, నాయకస్వరూపము.

కీర్తిబంధము. అం కామశాస్త్రమునందలి ఉద్ధితకరణ బంధములలో నొకటి: చూ. ఉద్ధితకరణబంధములు. (చూ, బంధములు.)

కీర్తిభాజుఁడు. సం. విణ. జ. కుంభసంభవుఁడు: చూ, ద్రోణుఁడు.

కీర్తిమంతుఁడు. సం. వి. త. పుం. వసుదేవుని పెద్దకొడుకు: చూ, పుత్రుఁడు. 1.

కీర్తిశేషుఁడు. సం. వి. అ. పుం. కీర్తిని భూమియందు వదలి శరీరమును చాలించినవాఁడు. "రాముఁడు కీర్తిశేషుఁడయ్యె."

కీర్మి. సం. వి. ఇ. స్త్రీ. 1. పలాశము *: చూ, మోదుగు; 2. కొమ్మ: చూ, శాఖ; 3. చిన్నసూరకత్తి: చూ, రిష్టి. 2.

కీర్షంతబ్రాహ్మణులు. పా. మహారాష్ట్రులలో నొకతెగవారు. ఋగ్వేదులు. ఐతరేయబ్రాహ్మణమునకుఁ జేరినవారు. ఆశ్వలాయన సూత్రమువారు. వీరు గోమాంచల నది సమీపమున పంచక్రోశ శేశమందు నివసించియున్న పన్నిద్దరు బ్రాహ్మణుల సంతతివారనియు సహ్యాద్రి కాండమునఁ జెప్పియున్నది: చూ, బ్రాహ్మణులు.

కీల. సం. వి. ఆ. స్త్రీ. మోఁచేతిదెబ్బ.

కీలక. సం. వి. అ పుం. ప్రభవాది యఱువది వత్సరములలో నొకటి: చూ, సంవత్సరములు. (రూ- కీలకము)

కీలకము. సం. వి. అ. పుం. 1. —పై.—; 2. శివకము, పసులఁగట్టెడు గూటము: చూ, స్తంభము; 3. అగ్ని: చూ, నిప్పు; అం. 4. సంయుతహస్తములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, సంయుతహస్తములు; దే. వి. (1) జీవస్థానము: చూ, మర్మము. 1. (రూ- కీలు- కిటుకు)

కీలము. సం. వి. అ. న. 1. జలము: చూ, నీరు. 1; పుం. 2. మంట: చూ, నిప్పు; 3. మొఁరడు, స్థాణువు: చూ, వృక్షము; 4. గసిక, శంకువు: చూ, మేకు; 5. చిల్లకోల, తోమరము: చూ, సర్వెల; 6. కూర్పరము: చూ, మోఁచేయి; 7. = కిల్ల. లేశము: చూ, స్వల్పము. (ఇది కడపటియర్థముతక్క తక్కినయర్థములయందు ఆకారాంత స్త్రీలింగము అగును.) పా. 3. స్త్రీ. కేసరము. (స్టైల్)

కీలరి. వై. విశే. (కీలు + అరి) కీలెఱిఁగినవాఁడు: చూ, మర్మజ్ఞుఁడు.

కీలసంస్పర్శము. సం. వి. అ. పుం. ఒకానొక చెట్టు: చూ, వృక్షము.

కీలాగ్రము. పా. (స్త్రీగార్థ) (కీలాగ్ర మెప్పుడును జిగురుగానుండి పుప్పొడిని పట్టుకొని యుండును. ఒకప్పుడు గాలివలన వచ్చిన పుప్పొడి రేణువులనాపుటకై కీలాగ్రమందు నీఁకలవలె నుండును. ఉ.— పరి. భాప్రాయి మొ)

కీలాధి. సం. వి. ఇ. పుం. కడలి: చూ, సముద్రము.

కీలారము. దే. వి: చూ, రూ- కిలారము; భో. 6, ఆ. 313.

కీలారి. దే. వి: చూ, రూ- కిలారి; భార. వి రా. 1, ఆ. 100.

కీలాలము. సం. వి. అ. న. 1. నెత్తురు: చూ, రక్తము. 1; 2. జలము: చూ, నీరు.1; 3.పాముపడిగెభాగము: చూ, సర్పము; 4 కెంపు: చూ. రత్నము. 1; 5. తేనె: చూ, మధువు.5.

కీలాలపుఁడు. సం. వి. అ. పుం. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

కీలి. సం. వి. న్. పుం. అగ్ని: చూ, నిప్పు.

కీలించు. సం. స. క్రి. తగుల్చు: చూ, పెట్టు.5.

కీలితము. సం. విశే. కట్టఁబడినది: చూ, సితము.

కీలితుఁడు. సం. విశే. చౌర్యాద్యపరాధమున బొండకొయ్య మొదలగుదానిచేతఁ గట్టువడిన వాఁడు: చూ, సంయతుఁడు.

కీలు. వై. వి. 1. కపటము: చూ, వ్యాజము. 1; 2. కీలకము; వై. 8, ఆ. 139: చూ, మర్మము. 1; 3. ఉపాయము; భో. 6, ఆ. 108: చూ, తెరవు; 4. = కీల. ఎముక కీలు, కులభ్రమణ యిటునటు వంగుట తిరుగుటలోనగు వాని కనుకూలముగా నేర్పఱచినమట (శేక) సంధి. (జాయింటు); విజ. 1, ఆ. 106: చూ, మాటు; (ఇందుకు సంబంధించిన శాస్త్రపరిభాషాపదములు—సంస్కృతమున.- సంధి, అక్షకాంసఫలకసంధి, గుల్ఫసంధి, ప్రితరసంధి, చూడావలయదంతమాడసంధి, ఉదూఖలసంధి, ఉఖలా ముసలకసంధి, కరకూర్చాన్తరీయసంధి, కరతలసంధి, ఖల్లకోరసంధి, పరశుకాప్రమకశేరుకసంధి, శిరోగ్రీవసంధి, కూర్పరసంధి, సందంశకోరసంధి, దళనోదూఖలసంధి, శ్రోణిసంధి, పాదతలసంధి, పశ్చిమకపాలచూడావలయసంధి, పశ్చిమకపాల దంతచూడాసంధి, కరాంగుళిసంధి, ప్రకోష్ఠాన్తరీయసంధి, పరస్పరకోరసంధి, గ్రీవసీవనీసంధి, అంససంధి, అక్షకోరసన్ధి, పాదకూర్చాన్తరీయసంధి, జానుముండసంధి. జంఘానుజంఘాస్థిసంధి, చక్రకోరసంధి. ఇత్యాది. మఱియు తెనుఁగున.—బంతిగిన్నె కీలు,బొంగరపుకీలు, మడతబందుకీలు,జారెడుకీలు. మొ); 5. మ్రింగులోనగువాని వైపూసెడి యొకానొక ద్రవద్రవ్యము. "తాటిపట్టెలకు కీలుపూసినారా?." పల్లపరమగుచో దీనియుత్వము నకు వికల్పముగా లోపమువచ్చును. కీల్పొమర్థ మొ.)

కీలుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు:

కీలుకత్తి. వై. వి. మడతకత్తి: చూ, కత్తి. 2.

కీలుకాఁడు. వై. వి. తారి, దారి; భార. ద్రో. 3, ఆ. 62: చూ, సూత్రధారుఁడు.

కీలుకొను. ద్వ. అ. క్రి. 1. తగులు; వై. 3, ఆ 42: చూ, లంకించు. 1; 2. నాటు; భార. కర్ణ. 1, ఆ. 27: చూ, మొలవేయు. (ప్రే. కీలుకొలుపు.)

కీలుగంటు. ద్వ. వి. బాలుగాముడిచిన కొండు కలదూముడి. రూ-కీల్గంటు. ధమ్మిల్లము: చూ, వేనలి. (ఇట్లు కీలుజెడ- కీల్జడ; కీలుముడి- కీల్ముడి.)

**కీలుగుడ్డ.** వా. వి. కీలురంగు వేసిన బట్ట.

**కీలుపడు.** వై. అ. క్రి: తగులు; (ప్రే. కీలు పఱచు.—"ఎ, గీ. యౌవనలీలా వికాసహాస, హేలనాదులఁ జిత్తంబు గీలుపఱచి." భాగ. 5, స్కం. 1, ఆ. 17.): చూ, లంకించు. 1.

**కీలుబొమ్మ.** ద్వ. వి. 1. సూత్రధారి యనఁబడు స్త్రీ: చూ, స్త్రీ; వా. 2. ఎముకతో నమర్పఁబడిన బొమ్మ. (రూ-కీల్బొమ్మ.)

**కీలెఱిఁగి వాఁతఁబెట్టినట్లు.** లో. సంధి తెలిసికొని రక్షవేసినట్లు.

**కీల్గంటు.** ద్వ. వి: చూ, రూ-కీలుగంటు.

**కీల్బొమ్మ.** ద్వ. వి: చూ, రూ-కీలుబొమ్మ.

**కీవాడ.** దే. వి. ఊరుచుట్టునుండు పొలిపొలము: చూ, భూమి. 1.

**కీళ.** సం. వి. ఆ. స్త్రీ. చేక్కురకేళీ అరఁటి *: చూ, రంభ. 2.

**కీళపర్ణము.** సం. వి. అ. పుం. ఉత్తరేణి*: చూ, శైఖరికము.

**కీళపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. —వై.—

**కీళము.** సం. వి. అ. పుం. 1. కోఁతి: చూ, వానరము; 2. దిక్కుల నడిమిచోటు: చూ, దిగంతరము; 3. పక్కి: చూ, పక్షి; విశే. 4. దిసమొలది.

**కీళవల్లి.** సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరేణి *: చూ, శైఖరికము.

**కీశుఁడు.** సం. వి. అ. పుం. 1. యుద్ధమందు నేర్పరి: చూ, సమర్థుఁడు; 2. వెలుఁగు ఱేఁడు: చూ, సూర్యుఁడు.

**కీస.** వా. అవ్య. కొంచెము; కాశీ. 5. ఆ. 214: చూ, స్వల్పము. "కీసవాటా వచ్చినది."

**కీసబత్తీస.** వా. వి. ఒకరకము అరఁటి: చూ, రంభ. 2.

**కీసర.** దే. వి. 1. తిత్తిలోనగువాని లోపలిపొర; హంస. 4. ఆ. 156: చూ పొర. 4; విశే. 2. అల్పము. "కీసరపాలు." మొ.

**కీసరబాసర.** వా. వి. అర్థముగాని భాష.

# కు.

**కు.** సం. వి. ఊ. స్త్రీ. 1. పుడమి: చూ, భూమి. 1. (ఇది తెనుఁగున వ్యస్తముగాఁ బ్రయోగింపఁబడదు.— కుతలము. కుధరము ఇత్యాది సమస్త పదములు ప్రయోగింపఁబడును.); 2. సారాయి: చూ, సుర. 1; విశే. 3. వృత్తియందుఁ గుత్సితశబ్దమునకు వచ్చు నాదేశము. "కుజనుఁడు, కుతర్కము" మొ; అవ్య. 4. అల్పము: చూ, స్వల్పము. "కోష్ణంకవోష్ణమ్."; 5. దోషము: చూ. పాపము. "త్యజేత్కుజనసంగతిమ్."; 6. దూఱు: చూ, నింద. 1. "కుభోజనమ్."; 7. వారణము; చూ, నిరోధము 1; దే. అప. (1) షష్ఠీవిభక్తి యందు వచ్చెడు ప్రత్యయము. "రామునకు-సోమునకు." మొ: చూ, కి; వా. క్రి. (2) ఈ ధాతువుయుష్మదర్థములఁ గువర్ణకంబయగు. ఉదా.—ఈకు, నీకు. మీకు. యుష్మదర్థమనఁగా 'నీవు' అను నర్థముగలది. ఈకి, నీకి, మీకి యనుట తప్పు. (3) ఉకార ఋకారంబులకు "కు" షష్ఠిపరమగుచో నగాగమంబు తఱచుగనగు. ఉదా —రామునకు- గురువునకు; ధాతృనకు-నేతృనకు. తఱచుగ ననుటచే బచ్చుకు-ఉత్సవముకు, వంతుకు ఇత్యాది మహాకవి ప్రయోగంబు లెక్కడనేనిఁ గలవు.

**కుంక.** దే. వి. బాలవిధవ, రండ: (చూ, విధవ) చూ, స్త్రీ. (రూ-కుంకి.)

**కుంకటి.** వై. వి. రూ-కూఁకటి. 1. జుట్టు: చూ, సిక. 4; 2. పిల్లజుట్టు: చూ. సిక. 4; విశే. 3 ప్రధానము: చూ, శ్రేష్ఠము. "కుంకటివేరు." మొ.

**కుంకటివేరు.** ద్వ. వి. తల్లివేరు. రూ-కూఁకటివేరు: చూ, వేరు. 1. (ద్విబీజదళ వృక్షములకు మాత్రము కుంకటివేరు ఉండును.

ఉదా.—మఱ్ఱి, మామిడి, చిక్కుడు, తుమ్మ, ఆవ. మొ.)

కుంకుడు. దే. వి: చూ, ఫేనిలము. 2.*

కుంకుడుఁబురువు. దే. వి. ఒకానొక యొఱ్ఱపురుగు: చూ, పురుగు.

కుంకుమపువ్వు. మి.వా.వి (కుంకుమము + పువ్వు.) అగ్నిశిఖ యను అంగడిదినుసు: చూ, వహ్నిశిఖము. 1. (రూ-కుంకుమపూవు.)

కుంకుమప్రియము. సం. వి. అ. పుం. వేళ్ళయందు కాయలుకాచు మేడి *: చూ, మేడి.

కుంకుమము. సం. వి.అ. న: చూ, కుంకుమపువ్వు.

కుంకుమాంశ. పా. ఏగ్రహంబునకైనను షోడశ వర్గ చేయఁగా ఎనిమిది వర్గంబులు స్వవర్గంబులు వచ్చెనేనిఁ గుంకుమాంశయగును.

కుంకుమము. వై. వి. 1.=కుంకుమమ్. నుదుటఁ బెట్టుకొను రాగద్రవ్యవిశేషము చెందిరము: చూ, సిందూరము. 1; 2: చూ, కుంకుమపువ్వు.

కుంగని. సం. వి.ఈ. స్త్రీ. మహాజ్యోతిష్మతి*: చూ, మానేరు.

కుంచనము. సం. వి. అ. న. కంటిరెప్పలు: చూ, బిడాలము. 2.

కుంచఫల. సం వి. ఆ. స్త్రీ. గుమ్మడి *: చూ, మహాఫలము.

కుంచము. సం.వి.అ.పుం. 1.=కుంచేము. నాలుగు మానికెలు, ¼ తూము. ½ ఇరుస: చూ, ప్రస్థము 2; 2. చామరము: చూ, సురటి; 3 బ. పాలిండ్లు: చూ, స్తనము.

కుంచి. సం. వి. ఇ. పుం. అష్టముష్టిపరిమాణము.

కుంచిక. సం. వి. ఆ. స్త్రీ. 1. బీగముతీసెడు వంకర యినుపకమ్మి. కుంచెకోల: చూ, బీగము; 2. గురివెంద *: చూ, తులాబీజము; 3. నల్లజీలకఱ్ఱ*: చూ,సుషవి.2; 4. మెంతికూ: చూ, మెంతి; 5. ఒకానొకచేఁప: చూ, మత్స్యము. 1.

కుంచిత. అం. గాంధర్వవేదములోని భావాధ్యాయప్రమేయమునందలి సంచారి భావమునఁ బుట్టిన దృష్టులు ఇరువదింటిలో నొకటి: చూ, సంచారిభావమునఁ బుట్టిన దృష్టులు. (రూ-కుంచితము.)

కుంచితము. సం. వి. అ. న. 1. ఒక విధమగు నిద్దుర: చూ, స్వప్నము. 2; 2. ఒక విధమగు తెప్పపాటు అనఁగా కనుఱెప్ప వంచుట; 3. గ్రంథితగరము: చూ, లోహము. 1; 4. క్రిందిపక్క తాను దీర్ఘముగాఁ జాచుట; విణ. 5. వంకరైనది: చూ, వంకర; అం. 6. మల్లశాస్త్రమునందలి ప్రచారములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, ప్రచారములు, 7. గండక్రియలు ఆఱింటిలో నొకటి: చూ, గండక్రియలు; 8. చరణక్రియలు ఆఱింటిలో నొకటి: చూ, చరణక్రియలు; 9. కరణములు నూటయెనిమిదింటిలో నొకటి: చూ, కరణములు.

కుంచియ. వై. వి. రూ-కుంచె. 1. = కుంచిక. చామరము; క శా. 8, ఆ. 230: చూ, సురటి; 2. సాలెవాఁడు పడుగు సరిచేసెడు సాధనము: చూ, మగ్గము; 3. చిత్రపు వ్రాసెడు తూలిక: చూ, లేఖిని; 4. కుచ్చు, పట్టు లోనగువాని కుచ్చు: చూ, జడగంటు; 5. కుచ్చె యుడినబట్ట: చూ, వస్త్రము; 6. కుంచెకోల. రూ-కుంచె: చూ, బీగము; 7. గొడకు కుస్సుముక్కొట్టెడు గుట్ట: చూ గుట్ట. 4.

కుంచులిక. సం. వి. ఆ. స్త్రీ. కంచులిక: చూ, వస్త్రము.

కుంచె. వై. వి.=కుంచిక: చూ, రూ-కుంచియ (కుచ్చు - పా.1, ఆ.24; సాలెవాఁడు పడుగు సరిచేసెడు సాధనము.- హంస. 2, ఆ. 11; చామరము.- పాండు. 2, ఆ. 172.)

కుంచెకోల. ద్వ. వి. కుంచిక: చూ, బీగము.

కుంచేము. వై. వి.=కుంచము: చూ, ప్రస్థము. 2.

కుంచు. దే. క్రి. క్రిందగఁజేయు; కవిక. 2, ఆ. 101.

కుంజకంబళి. అం. తంత్రములు అఱువదినాలుగింటిలో నొకటి: చూ, తంత్రములు.

కుఁజము. సం. వి. అ. పుం, న. 1. పొదరిల్లు: చూ, సదనము. 1; 2. కంటికిక్రింది మొదలు చెక్కిళ్లపార్శ్వము, హనువు: చూ, పార్శ్వము. 2; 3. ఏనుఁగుకటునురలు: చూ, పార్శ్వము. 2; 4. ఏనుఁగుకొమ్ము: చూ, పల్లు.1; (చూ, హస్తి); పుం. 5. కొండ: చూ, పర్వతము.

కుంజర. సం. వి. ఆ. స్త్రీ. 1. ఏఱుబొజి *: చూ, సుభిక్ష; 2. పాటల *: చూ, స్థాలి. 2; 3. ఆఁడుఏనుఁగు: చూ, హస్తి.

కుంజరక్షారమూలము. సం. వి. అ. న. మూలకము *: చూ, ముల్లంగి.

కుంజరపిప్పలి. సం. వి. ఈ. స్త్రీ. గజపిప్పలి *: చూ, పిప్పలి. 1.

కుంజరము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగు: చూ, హస్తి; 2. కేశము: చూ, వెండ్రుక. 1; 3. ఉత్తరపదమైనచో శ్రేష్ఠము: చూ, శ్రైష్ఠ్యము; 4. గచ్చేమాను *: చూ, గచ్చ.7. (రావి అని కొందఱు.)

కుంజరాక్షి. సం. వి. ఈ. స్త్రీ. గచ్చే *: చూ, సోమరాజి.

కుంజరారాతి. సం. వి. ఇ. పుం. సెరబము: చూ, శరభము. 1. (ఇది విచార్యము)

కుంజరాలుకము. సం. వి. అ. న. ఒకరకము అనబ *: చూ, సొఱ.

కుంజరాశనము. సం. వి. అ. పుం. పిప్పలము *: చూ, రావి.

కుంజరి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడేనుఁగు: చూ, హస్తి.

కుంజరుఁడు. సం. వి. అ. పుం. 1. ఇనుఁడు: చూ, సూర్యుఁడు; 2. నలువ: చూ, బ్రహ్మ.1; 3. కుంజరుఁడను ముని: చూ, ముని. 1.

కుంజలము. సం. వి. అ. న. పులియఁబెట్టిన కడుగునీరు: చూ, శుక్తము. 1.

కుంజవల్లరి. సం. వి. ఈ. స్త్రీ. కుంజిక *: చూ, నికుంజికామ్ల.

కుంజిక. సం. వి. ఆ. స్త్రీ. 1. నల్లజీలకఱ్ఱ *: చూ, సుషవి. 2; 2. కుంజవల్లరి *: చూ, నికుంజికామ్ల.

కుంట. వై. వి. 1. = కుండమ్. కొలను: చూ, సరస్సు 1; 2. రూ-గుంట. పల్లము: చూ, రంధ్రము; 3. చెఱువు: చూ, సరస్సు. 1; 4. ఒక ఘనగజము. (ఒక గజము పొడవు- ఒకగజము వెడల్పు- ఒక గజము లోతు (లేక) ఎత్తుగల ప్రదేశమును కుంట అందురు.) "చెఱువు ఎన్నికుంటలు త్రవ్వెరి."

కుంటకము. సం. విణ. క్రొవ్వినది: చూ, స్థూలము. 2.

కుంటదూలము. దే. వి. కడదూలమునకును గోడకును నడ్డముగానుండు చిన్న దూలము: చూ, రూ-గుంటదూలము.

కుంటనేల. దే. వి. పదియాఱుబారల పొడవు వెడల్పుగల నేల: చూ, భూమి. 1.

కుంటముక్కు. దే. వి. ఒకానొక చేఁప: చూ, మత్స్యము. 1.

కుంటి. దే. విణ. రూ-కుంటు. 1. కాలువిఱిగినవాఁడు, ఖంజుఁడు; భార. అర. 1, ఆ. 301: చూ, సూరసూతుఁడు; 2. కుంటి, పంగువు, స్వభావమునఁ గాలులేనివాఁడు; కా. 5, ఆ.179: చూ, సూరసూతుఁడు; (రూ-కుంటు-కుంటుపిచ్చుక-పిచ్చుకకుంటి-పిచ్చుకకుఁటు-పిచ్చుగుంటు.); 3. పంగుత్వము, కుంటు; చూ, సొట్టు.

కుంటికత్తె. వై. వి. తార్చునట్టి స్త్రీ; అం, పదా. 2-66: చూ, కంభళి. (రూ-కుంటెన కత్తియ- కుంటెనకత్తె- కుంటెనకత్తియ- కుంటెనకత్తె.)

కుంటిగాము. ద్వ. వి. కనిగ్రహము: చూ, రాహువు. 2.

కుంటిది. వా. వి. పంగుస్త్రీ: చూ, పిచ్చుక కుంటిది.

కుంటెనకత్తియ. వై.వి.=కుట్టని: చూ, రూ-కుంటికత్తె (రూ-కుంటెనకత్తె.)

కుంటు. దే. విశ: చూ, రూ- కుంటి. 1-2-3; 4. కాలునేలఁ జక్కఁగామోపక నడచు; భో. 5, ఆ. 31: చూ, కుంటుగించు.

కుంటుగించు. దే. అ. క్రి: చూ, కుంటు. 4.

కుంటుపడు. ద్వ. అ. క్రి. 1.కుంటియగు; భార, అను. 4, ఆ. 285: చూ, పొట్టపడు; 2.చెడు; కై. 4, ఆ. 101: చూ, నశించు; 3. తగ్గు; రామా. 8, ఆ. 153: చూ, సుర్కు. 9; 4. తెగు; రాఘ. 4, ఆ. 169: చూ, భేదిల్లు.2.

కుంటుపిచ్చుక. దే. విశ. కాలులేనివాఁడు; పాండు. 5, ఆ. 261: చూ, నూరనూతుఁడు.

కుంటువాఱు. దే. అ. క్రి. (కుంటు + వాఱు) బలహీనమగు; అచ్చ. బాల, కాం. 42:చూ, వలియు.

కుంటెన. వై. వి. 1. రూ- కుంటెనకాఁడు-కుంటెనీఁడు. తార్చెడువాఁడు; రాజ. 2, ఆ. 70: చూ, దూతుఁడు; 2. కుంటెనకుచ్చులు. ఈడ్పులనెడు చెవినగ:చూ, భూషణము. 2. (కుంటేళ్లు అనివాడుక)

కుంటెనకత్తియ. వై. వి.= కుట్టని. తార్చునట్టి స్త్రీ. రూ- కుంటెనకత్తె: చూ, కంభళి.

కుంటెనకాఁడు. వై. వి.=కుట్టన. తార్చువాఁడు; విక్రి. 8. ఆ. 54. (స్వార్థమునకాఁడు): చూ, దూతుఁడు. (రూ-కుంటెనీఁడు.)

కుంటెనకుచ్చులు. వై. వి. బ. ఈడ్పులనెడు చెవినగ: చూ, భూషణము. 2. (కుంటేళ్ళు అని వాడుక.)

కుంటెనముడి. ద్వ. వి. తాటాకుల పుస్తకమునకు నడుమనుండెడు దారపుముడి.

కుంటెనీఁడు. వై. వి. (కుంటెన + ఈఁడు) = కుట్టన: విక్రి. 7, ఆ. 124: చూ, రూ- కుంటెనకాఁడు.

కుంఠకుఁడు. సం.విశ.=గొంటు: చూ,మూఢుఁడు.

కుంఠనము. సం. వి. అ. న. మొక్కపోవుట.

కుంఠము. సం. వి. అ. పుం. 1. మొనఁబోయిన యాయుధము: చూ, బాణము. 1; 2. పొరపాటు: చూ, ప్రమాదము; 3. వజ్రము:చూ, రత్నము. 1; 4 పాము: చూ, సర్పము; 5. ఖర్వము: చూ, హ్రస్వము. 2.

కుంఠితము. సం. విశ. మొక్కపోయినది: చూ, సంకుచితము.

కుంఠుఁడు. సం. వి. అ. పుం. 1. అవివాహితుఁడు: చూ, పెండ్లిలేనివాఁడు; 2. తెలివిలేనివాఁడు: చూ, మూఢుఁడు; 3. అలసుఁడు: చూ, సోమరి;(వికృతి- గొంటు అని పురు-క.)

కుండ. వై. వి.= కుండీ. 1. మట్టిపాత్రము:చూ, భాండము. 8; 2. మేడమీఁదికలశము; య. 1. ఆ. 78: చూ, భాం ము. 8; 3. గుండ్రని కుండ; అం, భా.ద్వి. 246:చూ,భాండము.8; 4. ఘటము: చూ, భాండము. 8; 5. తైలాదిపాకపాత్రము: చూ, పాత్రము. 6; 6.ఇరుసుతగిలించెడు బండి కంటెనడిమిగుబ్బ; భార. కర్ణ. 8, ఆ. 350; బ. 7. ఏనుఁగు కుంభస్థలము; అచ్చ. బాల, కాం. 20: చూ, హస్తి; (వృత్తియందు పాత్రమాత్రపరము. "కంచు కుండ - బంగరుకుండ." వెం); వా. 8. స్ఫోటకపు పొక్కు.

కుండంగము. సం. వి. అ. పుం. పొదరిల్లు: చూ, పదనము. 1. (చెట్లచేత మూయఁబడినతావు)

కుండఁగి. దే. వి. కొండెముచ్చు: చూ, వానరము. (రూ- కొండంగి)

కుండకబ్రాహ్మణులు. పా. మహారాష్ట్రబ్రాహ్మణులలో నొకతెగ. వీరు బ్రాహ్మణునివలన బ్రాహ్మణజారిణియందు కలిగినవారు. వీరిలో ఆపస్తంబసూత్రులును ఆశ్వలాయన సూత్రీయులునుగూడ కలరు: చూ, బ్రాహ్మణులు.

కుండకీటుడు. సం. వి. అ. పుం. 1. చెడిపోయిన బ్రాహ్మణస్త్రీ కొడుకు: చూ, పుత్రుఁడు. 1; 2. దాసిని కామించినవాఁడు: చూ, వలపుకాఁడు; 3 చార్వాకవచనవాక్యము లెఱింగినవాఁడు.

కుండగోఁకరి. ద్వ. విణ. (కుండగోఁకు + అరి) వంటవాఁడు; ద్వి. సళ. 2, భా. 299: చూ. సూపకారుఁడు.

కుండగోలకము. సం. వి. అ. న. పులియఁబెట్టిన కడుగునీరు: చూ, శుక్తము. 1.

కుండగోలదాల్పు. ద్వ. వి. సన్యాసి: చూ, ముని. 1.

కుండపాయ్యము. సం. వి. అ. పుం. జేష్ఠము: చూ, యజ్ఞము.

కుండపోఁగులు. ద్వ. వి. బ. కుండల విశేషము; నీలా. 3, ఆ. 49: చూ, భూషణము. 2.

కుండబిరుసులు. దే. వి. బాణసంచులోని విశేషము: చూ, బాణసంచు.

కుండమార్చు. ద్వ. స. క్రి. ఒకటినిచ్చి మఱియొకటిని బుచ్చుకొను.

కుండమార్పు. ద్వ. వి. ఒకటినిచ్చి మఱియొకటిని బుచ్చుకొనుట; కా. 5, ఆ. 19: చూ, వినిమయము. 1.

కుండము. సం. వి. అ. న. 1. వంటకుండ: చూ, భాండము. 3; 2. కలశము: చూ, భాండము 3; 3. తైలాదిపాకపాత్రము: చూ, పాత్రము. 6; (ఈ యర్థములందిది ఆకారాంత స్త్రీలింగము నగు.); 4. గుడిలోనిగుంట, స్వర్గతటాకము: చూ, సరస్సు. 1; 5. హోమగుండము: చూ, నిప్పు; 6. తూనికగుండు: చూ, పడికట్టు; 7. దాఁచుకొన్న సొమ్ము: చూ, విత్తము. 1: (చూ, లిబ్ధి.2); పుం. 8. కొండ: చూ, పర్వతము.

కుండరాశి. వై. వి =సంభరాశి: చూ, రాశి. 2.

కుండలచ్ఛదము. సం. వి. అ. న. అటకమామిడి*: చూ, మామిడి.

కుండలము. సం. వి. అ. న. 1. పోఁగు (యజ్ఞము చేసినవారు ధరించు కర్ణభూషణము.): చూ, భూషణము 2; 2. = గుండ్రము: చూ, వర్తులము; 3 త్రాడు: చూ, సూత్రము. 1.

కుండలి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఉప్పి *: చూ, లవణి (నల్లఉప్పి అని కొందఱు); 2. తిప్పతీఁగ *: చూ, సోమవల్లి; 3. గొండ్లి; భార. విరా. 1, ఆ. 240: చూ, నృత్యము; న్. పుం. 4. పాము: చూ, సర్పము; 5. నెమలి: చూ, మయూరము; 6. నీటికోఁడు: చూ, వరుణుఁడు; 7. కోవిదారము *: చూ, దేవకాంచనము; 8. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు; విణ. 9. పోఁగులుగలవాఁడు, యజ్ఞముచేసినవాఁడు; అం. 10: చూ, ఉద్ధతము. 2. (కుండలీనృత్యము.)

కుండలించు. సం. స. క్రి: చూ, సున్నచుట్టు.

కుండలి నాగబంధము. పా. శబ్దాలంకారములలో నొకటి: చూ, హేతువు. 2.

కుండలీకరణము. సం. వి. అ. న: చూ, సున్నచుట్టుట.

కుండలీనృత్యము. అం. కుండలి: చూ, ఉద్ధతము. 2.

కుండల్యాది. పా. ఒకానొక లేహ్యము: చూ, లేహ్యములు.

కుండానుఁగు. ద్వ. వి. (కుండ + అనుఁగు): చూ, గోరతు *.

కుండాశి. సం. విణ. న్: చూ, భగభక్షకుఁడు.

కుండి. సం. వి. ఈ. స్త్రీ. 1. కమండలువు, గిండి: చూ, పాత్రము. 6; 2. వంటకుండ: చూ, భాండము. 3; దే. వి. (1) నలుచేదరపు నూయి: రూ- కుండియ: చూ, సరస్సు. 1.

కుండిక. సం. వి. ఆ. స్త్రీ. రసాతలము. పాతాళలోకములలో నొకటి: చూ, లోకము. 1.

కుండికామతము. అం. శివప్రోక్తములగు చతుష్షష్టి తంత్రములలో నొకటి: చూ, తంత్రములు.

కుండినము. సం. వి. అ. పుం. కుండినమనుపట్టణము: చూ, దేశము.

కుండినుఁడు. సం. వి. అ. పుం. కుండినుఁడను ముని: చూ, ముని. 1.

కుండియ. దే. వి. నలుచేదరపు నూయి. రూ- కుండె: చూ, సరస్సు. 1.

కుండీ. దే. వి. —పై.—

కుండీరుఁడు. సం. వి. అ. పుం. 1. మానిసి: చూ, మనుష్యుఁడు; విణ. 2 బలవంతుఁడు: చూ, లావరి.

కుండుఁడు. సం. వి. అ. పుం. గూఢజుఁడు, మగఁడుండఁగ అంకుమగనికిఁ బుట్టినకొడుకు: చూ, పుత్రుఁడు. 1.

కుండె. దే. వి: చూ, రూ- కుండియ.

కుండెవల. దే. వి. ఒకరకమువల: చూ, వల. 1.

కుండ్రిణాచి. సం. వి. ఇ. స్త్రీ. తెల్లబల్లి: చూ, బల్లి.

కుంతము. సం. వి. అ. పుం. 1. = కొంతము, ఈఁటె: చూ, బాణము. 1; 2. కోపభావము: చూ, కోపము; 3. అడవి గోధుమలు, గవేధుకము: చూ, ధాన్యము; అం. 4. దిక్పాలాయుధములు ఎనిమిదింటిలో నొకటి: చూ, దిక్పాలాయుధములు; 5 ఆయుధములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, బాణము. 1.

కుంతలపక్షము. సం. వి. అ. పుం. కేశసమూహము: చూ, వెండ్రుక. 1.

కుంతలము. సం. వి. అ. పుం. 1. కేశము: చూ, వెండ్రుక. 1; 2. జవము: చూ, వేగము, 3; 3. నాఁగలి. చూ, లాంగలము; 4. పాము: చూ, సర్పము; 5. = కొంతము. కుంతాయుధము: చూ, బాణము. 1; 6. యవలు: చూ, ధాన్యము; అం. 7. దేశములు ఏఁబదియాఱింటిలో నొకటి: చూ, దేశము.

కుంతలవర్ధనము. సం. వి. అ. పుం. గుంటగలగర*: చూ, భృంగరాజము. 1.

కుంతలిక. సం. వి. ఆ. స్త్రీ. కవ్వముగుత్తి: చూ, పాలిక.

కుంతలోశీరము. సం. వి. అ. న. నూఁగుదోస*: చూ, దోస.

కుంతాలము. సం. వి. అ. పుం. = కోదాడు*: చూ, శ్రీతాళము.

కుంతాళి. సం. వి. ఇ. స్త్రీ. = —పై.— (ఒకరకము తాటిచెట్టు)

కుంతి. సం. వి. ఈ. స్త్రీ. 1. = గొంతి, పాండవుల తల్లి, పాండురాజు భార్య: చూ, భార్య; 2. రేణుకమను గంధద్రవ్యము: చూ, రాజార్హము; 3. గుగ్గిలపుఁజెట్టు: చూ, మహిసాక్షి; 4. అందుగు*: చూ, సల్లకి.

కుంతీభోజము. సం. వి. అ. పుం. అమ్లపంపర*: చూ, పంపరపనస.

కుంతీభోజుఁడు. సం. వి. అ. పుం. ఒకానొక రాజు: చూ, రాజు. 1.

కుంథనము. సం. వి. అ. పుం. మూలుగుట: చూ, మూలుగు. 1.

కుంథువు. సం. వి. ఉ. పుం. 1. బౌద్ధవిశేషము: చూ, బుద్ధుఁడు; 2. జినచక్రవర్తి విశేషము: చూ, రాజు. 1.

కుంద. వై. వి. 1. = గుంధ. కంబము: చూ, స్తంభము; 2. అట్టవాసకము *: చూ, కూంట పుష్పము.

కుందకము. సం. వి. అ. పుం. 1. కుందురుష్కమను గ్రంథ్యము: చూ, రాజార్హము; దే. వి. (1) అభ్యంతరము: చూ, మండలము. 1; (2) లోటు: చూ, లోపము. 2.

కుందనము. దే. వి. అపరంజి: చూ, లోహము.1.

కుందమము. సం. వి. అ. పుం. పిల్లి: చూ, మార్జాలము.

కుందము. సం. వి. అ. పుం, న. 1. మాఘ్యము*: చూ, మొల్ల; పుం. 2. కుబేరుని నిధి: చూ, లిబ్బి 2; 3. బండికంటితిరుగుడు: చూ, బండికన్ను; 4. కుందురుష్కమను గ్రంథ్యము: చూ, రాజార్హము; 5. కత్తులకుఁబట్టు సాన చూ, సాన; 6. పువ్వు: చూ, సుమము; అం.7. నిధులు తొమ్మిదింటిలోనొకటి: చూ, నిధులు; 8. జన్యతాళములలో నొకటి: చూ, జన్యతాళములు. (చూ, తాళము. 2.)

కుందరము. సం. వి. అ. పుం. ఒకరకము తృణము *: చూ, తృణము. 1.

కుందరుకి. సం. వి.అ.పుం: చూ, రూ-కుందురుకి.

కుందరువు. సం. వి. ఉ. పుం: చూ, రూ-కుందురువు.

కుందహితము. సం.వి. అ. పుం. వాయులోకము: చూ, లోకము. 1.

కుందారము. సం. వి. అ. పుం. పంది: చూ, సూకరము.

కుంది. దే. వి. దీపముంచు ప్రమిదె:చూ, ప్రమిదె. (చూ, పాత్రము. 6.) (బాయిలోనగువానిచే జేయఁబడిన పాత్రమని కొందఱు) (రూ-కుందియన-కుందెన.)

కుందికాల్లు. దే. వి. బ. బాలక్రీడా విశేషము :చూ, బాలక్రీడ.

కుందిని. సం. వి. ఈ. స్త్రీ. 1 తామరతీఁగ * :చూ,బిసము. 1; (చూ, పద్మము. 1.);2.పద్మ సమూహము: చూ, పద్మము. 1.

కుందియన. దే. వి: చూ, రూ-కుంది; వి, పు 7, ఆ. 125.

కుందు. దే. అ. క్రి. 1. శోకము: చూ, దుఃఖము; 2. వగ: చూ, దుఃఖము; 3. తక్కువ; సై. 7, ఆ. 115: చూ, వెలితి; అ. క్రి. 4. ఏడ్చు; భార. ద్రో. 2, ఆ. 324: చూ, శోకించు; 5. క్రుంగు; భార. అర. 4, ఆ. 94: చూ, క్రుక్కు. 4; 6. దుఃఖించు: చూ, క్రుక్కు. 5; 7. తగ్గు; భార. విరా. 3, ఆ. 132: చూ, స్రుక్కు. 9; 8. కాలు చేక్కఁగా నేల వానించినడచు: చూ, వెల్లు. 3.

కుందుఁడు. సం. వి. అ. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

కుందురము. సం. వి. అ. పుం. 1. కుందురుష్కమను గ్రంథ్యము: చూ, రాజార్హము; అం. 2. దర్భలు పదింటిలో నొకటి: చూ, దర్భలు.

కుందురుకము. సం. వి. అ. పుం: చూ, కుందురము. 1.

కుందురుకి. సం. వి. ఈ. స్త్రీ. రూ-కుందరుకి. అందుగు *: చూ, సల్లకి.

కుందురువు. సం. వి. ఉ. పుం. రూ-కుందరువు. కుందురము: చూ, రాజార్హము.

కుందుటెల్లు. దే. వి. ఇక్ష్వారిక *: చూ, శరము. (చూ, తృణము. 1.)

కుందువు. సం. వి. ఉ. పుం. కుందురువు: చూ, రాజార్హము.

కుందెన. దే. వి. 1. రూ-కుంది: చూ, ప్రమిదె; 2. వడ్లుదంపుగుంట; భల్లా. 4, ఆ: చూ, లోలగుంట; 3. ఒకానొకచెట్టు: చూ, వృక్షము.

కుండెనకొమ్ము. దే. వి. కుంటేటికొమ్ము: చూ, శకశృంగము.

కుండెనగిజి. దే. వి. ఒకానొక బాలక్రీడ: చూ, బాలక్రీడ.

కుండెనగుడి. దే. వి.—వై.—; కాశీ. 3, ఆ.38.

కుండెలు. దే. వి. చెవులపోతు. రూ- కుందేలు; భార. ఆది. 6, ఆ. 187: చూ, శశము.

కుంటేటికొమ్ము. దే. వి. (కుందేలు + కొమ్ము) 1. కుండెనకొమ్ము: చూ, శశశృంగము; విణ.2. హుళక్కి: చూ, శూన్యము. 1.

కుంటేటివల. దే. వి. కుందేళ్ళనుపట్టు వల: చూ, వల. 1.

కుందేలు. దే. వి: చూ, రూ- కుండెలు.

కుంద్రుణ. సం. వి. అ. స్త్రీ. తెల్లబల్లి: చూ, బల్లి.

కుంపటి. దే.వి. చేలికాచుకొనుటలోనగువానికై నిప్పుకలుంచెడు పాత్రము, హసంతి; ద్వి. రా. అర. 153: చూ, పొయ్యి.

కుంపె. దే. వి. తాంబూలపాత్రము,రూ-కంపె, కుప్పె: చూ, పాత్రము. 6.

కుంపెన. దే. వి. చెవినగ, అంటుజోడు: చూ, భూషణము. 2.

కుంపెరుగు. దే. వి.(కుండ + పెరుగు) అడుగు పెరుగు, ద్రప్సము; ఆం, భా. ద్వి. వై. 259 :చూ, పెరుగు. 1.

కుంపిణి. ఆం. వి. ఆంగ్లేయ ప్రభుత్వము వారు.

కుంబ. సం. వి. ఆ. స్త్రీ. 1. దుప్పటి, స్థూల శాటకము: చూ, వస్త్రము; 2. యజ్ఞశాలకు జుట్టు నిడిన అతిగహనమైన వెలుగు: చూ, ప్రాచీనము. 1.

కుంభ. సం. వి. ఆ. స్త్రీ. బోగముది:చూ, వేశ్య.

కుంభకము. సం. వి. అ. పుం. 1. కుండ: చూ, భాండము. 8; 2. ఊపిరి బిగబట్టి చేయు ప్రాణాయామము: చూ, కుంభకాద్విత్రయము; ఆం. 3. నాడీక్రియలుమూడింటిలో నొకటి :చూ, నాడీక్రియలు. (రూ- కుంభము)

కుంభకర్త్రి. సం. వి. ఈ. స్త్రీ. కలశములను జేసెడు ఆడుది: చూ, స్త్రీ.

కుంభకాదిత్రయము. ఆం. రేచకము, పూరకము, కుంభకము. (8):చూ,త్రయము;(కుంభకము- రూ-కుంభము.)

కుంభకారజాతి. ఆం. జాతులుపదునెనిమిదింటిలో నొకటి: చూ, జాతులు.

కుంభకారి. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, కుంభకర్త్రి; 2. కులుత్థాంజనము:చూ,రసాంజనము; 3. అడవి ఉలవలు: చూ, సరటి; 4. మణిసిల: చూ, రాయి; 5. కుమ్మరస్త్రీ: చూ, కుమ్మరత.

కుంభకారిక. సం. వి. ఆ. స్త్రీ. అడవి ఉలవలు : చూ, సరటి.

కుంభకారుడు. సం. వి. అ. పుం. = కుమ్మర :చూ, మృత్కారుడు.

కుంభచ్ఛేదము. సం. వి. అ. పుం. అంకుశము :చూ, సృణి.

కుంభజము. సం. వి. అ. పుం అశ్వత్థము*: చూ, రావి.

కుంభజుడు. సం. వి. అ. పుం. 1. గురువు:చూ, ద్రోణుడు; 2. అగస్త్యుడు: చూ, ముని. 1.

కుంభతుంబి. సం. వి. ఈ. స్త్రీ. అలాబుప్రభేదము *: చూ, సొర.

కుంభదాసి. సం. వి. ఈ. స్త్రీ. కుట్టిని: చూ, శంభలి.

కుంభదీపికాన్యాయము. పా. కుండలోబెట్టిన దీపము పైకిc గాన్పింపకుండినను లోపలనె వెలుగుచుండుననుటి.

కుంభద్రోణముగా. జా. అపరిమితముగా. కడవలతోc దూములతో దిమ్మరించినట్లు. "అకాలవర్షంబు గురియింపc బంపు మెఘుళ్ళగముల్గc

బగళులు రేలు కుంభద్రోణములు గాఁగ." (పారవిలాసము); "పాథోధరశ్రేణి కుంభద్రోణమ్ములు గుర్తిమ్మరించె విమలాంభఃపూరధారావళిన్." (పాండురంగ); "కుంభద్రోణములుగాఁగ వానగురిసెన్ ఘోరాంబుధారాకృతిన్." (వైజయంతి)

కుంభబీజకము. సం. వి. అ. పుం. గుత్తినెమిలడుగు :చూ, పూతికరజము.

కుంభము. సం. వి. అ. న 1. గుగ్గిలము *: చూ, మహిషాక్షి; 2. దంతి: చూ, ముకూలకము; 3. తెల్లతెగడ *: చూ, సర్వానుభూతి; పుం. 4. రూ- కుంభి. కుండ: చూ, భాండము. 3; 5. ఏనుఁగు కుంభస్థనము: చూ, హస్తి; (ఏనుఁగు కుంభస్థనమునకుదిగువనున్న ప్రదేశము అని అమరుఁడు); 6. కుండెఁడు; 7. వేయిపండ్లు; 8. కుంభకప్రాణాయామము: చూ, రూ- కుంభకము. 3; 9. అన్నపురాసి: చూ, సాదము. 1; 10. కుంభరాశి: చూ, రాశి. 2; 11. = గుబ్బ :చూ, మేకుతల; అం. 12. రాసులు పంద్రెండింటిలో నొకటి: చూ, రాసులు.

కుంభయోని. సం. వి. ఇ. పుం. 1. తుమ్మి * :చూ, తుమికి; 2. ద్రోణాచార్యుఁడు: చూ, ద్రోణుఁడు; 3. అగస్త్యుఁడు: చూ, ముని. 1; 4. వసిష్ఠుఁడు: చూ, ముని. 1.

కుంభల. సం. వి. ఆ. స్త్రీ: చూ, ముండితిక *.

కుంభశాల. సం. వి. ఆ. స్త్రీ. కుంభనిర్మాణాది గృహము: చూ, సదనము. 1.

కుంభసంధి. సం. వి. ఇ. పుం. కుంభస్థనముల సంధిప్రదేశము: చూ, అరత్నము. 1.

కుంభసంభవుఁడు. సం. వి. అ. పుం. 1. అగస్త్యుఁడు: చూ, ముని. 1; 2. ద్రోణాచార్యుఁడు: చూ, ద్రోణుఁడు.

కుంభాండము. సం. వి. అ. పుం. గుమ్మడి * :చూ, మహాఫలము.

కుంభాండి. సం. వి. ఈ. స్త్రీ. —పై—

కుంభాండుఁడు. సం. వి. అ. పుం. బాణాసురుని మంత్రి: చూ, మంత్రి. 1.

కుంభారతి. మి. గ్రా. వి. ఆరాత్రికా విశేషము :చూ, అళిఘారతి.

కుంభి. సం. వి. ఇ. స్త్రీ. 1. పినగుమ్మడు * :చూ, మహాఫలము; ఈ. స్త్రీ. 2. కలిగొట్టు* :చూ, స్ఫాలి. 2; 3. నేలకలిగొట్టు*: చూ, స్ఫాలి. 2; 4. నీరుప్రిబ్బ *: చూ, ప్రిబ్బలి; 5. తీఁగపాఁచి *: చూ, శైవలము; 6. పంటకుండ: చూ, భాండము. 3; న్. పుం. 7. ఏనుఁగు: చూ, హస్తి; 8. కుమ్మరి: చూ, చక్రి. 5; 9. మొసలి: చూ, మత్స్యము. 1; 10. గుగ్గిలము *: చూ, మహిషాక్షి.

కుంభించు. సం. స. క్రి. (ఊపిరి) బిగఁబట్టు :చూ, బిగఁబట్టు.

కుంభిక. సం. వి. ఆ. స్త్రీ. 1. నీటిపాఁచి* :చూ, తృణము. 1; 2. కలిగొట్టు*: చూ, స్ఫాలి. 2.

కుంభికము సం. వి. అ. పుం, స్త్రీ. వారిపర్ణి * :చూ, శైవలము.

కుంభిని. సం. వి. ఈ. స్త్రీ. 1. నేల: చూ, భూమి. 1; 2. ఆఁడేనుఁగు: చూ, హస్తి.

కుంభిపాకి. సం. వి. ఈ. స్త్రీ. పినగుమ్మడు* :చూ, మహాఫలము.

కుంభిలము. సం. వి. అ. పుం. శాలమనుచేప :చూ, మత్స్యము. 1.

కుంభిలుఁడు. సం. వి. అ. పుం. 1. చోరుఁడు :చూ, ముచ్చు. 1; 2. పరుల శ్లోకభావముల హరించువాఁడు: చూ, ముచ్చు. 1; 3. కన్నపుదొంగ: చూ, ముచ్చు. 1; 4. భార్యతోడఁ బుట్టినవాఁడు: చూ, శ్యాలుఁడు.

కుంభీకము. సం. వి. అ. పుం. 1. పున్నాగము*

:చూ, పొన్న; 2. కుంభిక, తీఁగపొంచి *:చూ, తృణము. 1.

కుంభీనసము. సం. వి. అ. పుం. 1. పాము: చూ, సర్పము; 2. విషజ్వాలలు క్రక్కెడుపాము :చూ, సర్పము.

కుంభీనసి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుపాము :చూ, సర్పము; 2. లవణాసురునితల్లి.

కుంభీపాకము. అం. నరకములు ఇరువదియొకటింటిలో నొకటి: చూ, నరకములు.

కుంభీరమక్షిక. సం. వి. అ. స్త్రీ. ఘూణి, నీరుపట్టెఁగ: చూ, మక్షిక.

కుంభీరము. సం. వి. అ. పుం. 1. మొసలి:చూ, మత్స్యము. 1; (కాలుమొసలి అనికొందఱు); 2. పాము: చూ, సర్పము.

కుంభీరుఁడు. సం. వి. అ. పుం. దొంగ: చూ, ముచ్చు. 1.

కుంభీలము. సం. వి.అ. పుం. 1. ఒకానొక చేఁప: చూ, మత్స్యము. 1; 2. కాలుమొసలి: చూ, మత్స్యము. 1; అం. 3. నరకములు ఇరువదియొకటింటిలో నొకటి: చూ, నరకములు.

కుంభీలుఁడు. సం. వి. అ. పుం. దొంగ: చూ, ముచ్చు. 1.

కుంభుఁడు. సం. వి. అ. పుం. 1. కుంభకర్ణుని కుమారుఁడు. ఒకానొక రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; 2. వైశికుఁడు, బహువేశ్యోపభోగరశికుఁడు: చూ, విటుఁడు.

కుంభోలూఫలకము. సం. వి. అ. న. గుగ్గిలము* :చూ, మహిసాక్షి. (కుంభోలూఖలకము అని కొందఱు.)

కుకర. సం. వి. ఈ. స్త్రీ. చేల్లరాఁడు: చూ, దండవిష్కంభము.

కుకరుఁడు. సం. విశ. 1. కుణి, ఈచేఁబోయిన చేయిగలవాఁడు: చూ, కోణి; 2. చెడ్డవరిశీయరాజు: చూ, రాజు. 1.

కుకీలము. సం. వి. అ. పుం. కొండ: చూ, పర్వతము.

కుకుందరము. సం. వి. అ. న. 1. పిఱుఁదిమీఁది గుంత: చూ, గుంత. 2; 2. ఒకానొక చెట్టు: చూ, కుక్కరదుగ్రు.

కుకుసుఁడు. సం. విశ: చూ, రూ- కూకుదుఁడు.

కుకుభ. సం. వి. అ. స్త్రీ. ఎఱ్ఱాకులతోఁటకూర: చూ, శాకము. 1.

కుకురము. సం. వి. అ. పుం. 1. సితావరము*: చూ, శాకము. 1; 2 గండివనము *: చూ, స్థౌణేయము; 3 కుక్క: చూ, శునకము; 4. ఏఁబదియాఱుదేశములలో నొకటి: చూ, దేశము.

కుకురుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకరాజు: చూ, రాజు. 1.

కుకూటి. సం. వి. న్. పుం. బూరుగు *: చూ, శాల్మలి.

కుకూలము. సం. వి. అ. న. 1. వసినాటినగుంటు; పుం. 2. ముర్మురము, కుమ్ము: చూ, నిప్పు; 3. కవచము: చూ, బొందడము: అం. 4.అగ్ని భేదములు నాలుగింటిలో నొకటి: చూ, అగ్నులు.

కుకోలము. సం. వి. అ. న. కోలి. బదరి *:చూ, రేఁగు.

కుక్క. వై. వి. 1.= కుర్కుర. వేపి: చూ, శునకము; విశ. 2 కుత్సితము, నికృష్టము, కీడ్వఁబడినది, అధమము: చూ, హీనము. 1.

కుక్కగొడుగు. ద్వ. వి. ఛత్రాకము *: చూ, పుట్టగొడుగు. (ఇది ఋతురక్తమును, మూత్రమును జారీచేయును)

కుక్కగొడుగులు. పా. బూజులో నొకజాతి యైనను కుక్కగొడుగుల కాకారముగలదు. ఇవి తెల్లఁగాను, మృదువుగానునుండి లావైన ప్రకాండముతోఁ జిన్న గొడుగును బోలియుం

డును ముదిరిన కుక్కగొడుగును దెచ్చి కాగి తముమీఁద చిదిమినయెడల నల్లని చూర్ణము రాలును. ఈచూర్ణములో స్త్రీ పురుషబీజము లుండును. దీనివలననే కుక్కగొడుగులసంతతి వృద్ధియగుచున్నది.

కుక్కతొలసి. వై. వి. = కుర్కురతులసి, ఫణిర్జకము *: చూ, తులసి.(దీని ఆకురొుక్క పసరు తామర పోఁగొట్టును)

కుక్కతోఁకఁబట్టుకొని గోదావరినియీఁదుట.లో. ఉదా.— క్రొత్తవాని సాహాయ్యంబునఁ బ్రత్యయంబునిడికడఁది మార్తురఁబరిమార్తుమంటు శునకవాలంబుఁ బట్టుకొని కడలి గడవఁగడగుట. (నీతిచంద్రిక- విగ్రహము) (శునకవాలము = కుక్కతోఁక)

కుక్కపాల. ద్వ. వి. వటపత్రిక *: చూ, విశల్య 5.

కుక్కబూరుగు. ద్వ. వి. ఒకానొకబూరుగు *: చూ, శాల్మలి.

కుక్కముల్లు. ద్వ. వి. ఒకానొకరోగము: చూ, రోగము. 1.

కుక్కమూతిపిందె. ద్వ. వి. కాపుడిగినప్పుడు గలిగెడు పిందె: చూ, శలాటువు. 2.

కుక్కమేడి. ద్వ. వి. కాకోదుంబరిక *: చూ, బొమ్మమేడి.

కుక్కవాయింట. ద్వ. వి. శ్వానబర్బర *: చూ, వాయింట. (దీనిపసరు చెవిలోపోసిన పోటు, చీము తగ్గును)

కుక్కవావింట. ద్వ. వి. —పై.—

కుక్కి. దే. వి. 1. పల్లము: చూ, రంధ్రము, 1; 2. త్రాళ్ళువదలి పల్లముపడిన మంచము; శ్లో. 5. ఆ. 288: చూ, మంచము; 3. చిన్నమంచము: చూ, మంచము; విణ. 4. మిక్కిలి ళోఁతుగలది: చూ, ళోఁతు. 2.

కుక్కినపేను. వా. వి. గోటితో నొక్కినపేను. "కుక్కినపేనువలె అణఁగియున్నాఁడు."

కుక్కివడు. ద్వ. అ. క్రి. (కుక్కి + పడు) పల్లముపడు; వి, పు. 4, ఆ. 815.

కుక్కు. దే. స. క్రి. (గోరుతోపేను) నొక్కు; (బట్టలు పెట్టెలో) నొక్కు; (గొంతుకలో ముద్ద) నొక్కు మొ: చూ, పిసుకు. 1.

కుక్కుట. అం. మల్లశాస్త్రములోని గతులు పండ్రెండింటిలో నొకటి: చూ, గతులు.

కుక్కుటకము. సం. వి. అ. పుం. 1.గంపపులుఁగు: చూ, బెళగువ్వ; 2. కోడి: చూ, పుంజు.

కుక్కుటధ్వజుఁడు. సం. వి. అ. పుం. కుమారస్వామి: చూ, స్కందుఁడు.

కుక్కుటపుదండ. అం. మల్లశాస్త్రములోని దండలు పండ్రెండింటిలో నొకటి: చూ, దండలు.

కుక్కుటమంటపము. సం. వి. అ. పుం. ముక్తిమండపము: చూ, సదనము. 1.

కుక్కుటమర్దకము. సం. వి.అ.పుం. గొడసాల*: చూ, దేవగంధ.

కుక్కుటమస్తకము. సం. వి. అ. న. చవ్యము*: చూ, విప.

కుక్కుటము. సం. వి. అ. పుం. 1.= కోడి:చూ, పుంజు; 2. అడవికోడి: చూ, పుంజు: 3.గంపపులుఁగు: చూ, బెళగువ్వ; 4. కపటము: చూ, వ్యాజము. 1; 5. కుక్క: చూ, శునకము; బ. 6. మిణుఁగురులు: చూ, నిప్పు; అం. 7. తిర్యక్కరణబంధములు రొునిమిదింటిలో నొకటి: చూ, తిర్యక్కరణబంధములు; 8. దండలు పండ్రెండింటిలో నొకటి: చూ, దండలు; 9. ఆసనములుముప్పదింటిలోనొకటి: చూ, ఆసనములు.

కుక్కుటాండభస్మము. పా. పొదిగిన కోడిగ్రుడ్డు డిప్పలోని పొరలమార్ణము 8భా, ఇంగిలీకము

1 భా, తముల పాకులరసముతోనూరి బిళ్ళచేసి 25 పిడకలతో, పుటము వేసి నిమ్మపండ్ల రసముతో సూర్యపుటము బెట్టవలెను. అప్పుడు సిందూరించును. ఇది శిశువులకు జ్వరము, కఫము, దగ్గు మున్నగునవి తగ్గించును.

కుక్కుటాండము. సం. వి. అ. పుం. వ్రీహివిశేషము: చూ, ధాన్యము.

కుక్కుటాభము. సం. వి. అ. పుం. కుక్కుటతుల్యావనచరమను పాము: చూ, సర్పము.

కుక్కుటాహి. సం. వి. ఇ. పుం. —పై.—

కుక్కుటి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుకోడి, పెట్ట: చూ, పుంజు; 2. అసత్యపునడక; 3. బూరుగు*: చూ, శాల్మలి.

కుక్కుటుఁడు. సం. వి. అ. పుం. నేర్పరి: చూ, సమర్థుఁడు; 2. కిరాతపుత్రుఁడు. 3. శూద్రిపుత్రుఁడు. (విశ్వకోశము.)

కుక్కుడు. దే. వి. అదుముడు: చూ, పీడనము.

కుక్కుదుఁడు. సం. వి. అ. పుం. సాలంకృతకన్యాదాత: రూ-కూకుదుఁడు.

కుక్కుభము. సం. వి. అ. పుం. 1. గంపకులుఁగు: చూ, బెళగువ్వ; 2. అడవికోడి: చూ, పుంజు.

కుక్కురద్రువు. సం. వి. ఉ. పుం. ఒకానొక చెట్టు: చూ, కుకుందరము. 2.

కుక్కురము, సం. వి. అ. న. 1. స్థౌణేయమను గ్రంథ్యము, గండివనము*: చూ, రాజార్హము; 2.. కౌకపుష్పము*: చూ, మాచిపత్రి; పుం. 3. రూ-కుర్కురము.= కుక్క: చూ, శునకము; 4. దశార్హదేశము: చూ, దేశము.

కుక్షము. సం. వి. అ. పుం. జఠరము: చూ, భ్రూణము. 1. (చూ, కడుపు)

కుక్షి. సం. వి. ఇ. పుం, స్త్రీ. 1. —పై.—; 2. నీలమణియొక్క తెల్లగాఁ బైకగయు రేఖారూపదోషము: చూ, రత్నము, 1; అం. 3. పురుషలక్షణాంగములు ఏఁబది యొనిమిదింటిలో నొకటి: చూ, లక్షణాంగములు. (చూ, కడుపు). 4. స్త్రీలక్షణాంగములు ఏఁబది యొనిమిదింటిలో నొకటి: చూ, స్త్రీలక్షణాంగములు. (చూ, కడుపు)

కుక్షింభరి. సం. విణ. ఇ. ఉదరంభరి: చూ, పొట్టకూటివాఁడు.

కుక్షిస్థమక్షికాన్యాయము. పా. కడుపులోఁబడిన యీఁగ తినినయన్నమంతయు వెడలఁగ్రక్కించిన రీతి.

కుక్షిస్ఫురణావర్తి. అం. అశ్వశాస్త్రములోని అశుభావర్తములలో నొకటి: చూ, అశుభావర్తములు.

కుక్ష్యావర్తి. అం. —పై.—

కుఖనకము. సం. వి. అ. పుం. 1. ఎలుక: చూ, మూషికము; 2. పంది: చూ, సూకరము.

కుచండిక. సం. వి. ఆ. స్త్రీ. చోఁగ*: చూ, స్రివ.

కుచందనము. సం. వి. అ. న. 1. ఎఱ్ఱగందము: చూ, వాసన; 2. ఎఱ్ఱగందము*: చూ, పత్రాంగము. 1; 3. కుష్ఠము: చూ, మండలము. 3; 4. బుపజేత్తిరి*: చూ, భూర్జము; 5. కుంకుమము: చూ, వహ్నిశిఖము. 1.

కుచఫలము. సం. వి. అ. పుం. దాడిమము.*: చూ, దానిమ్మ.

కుచమర్దనము. సం. వి. అ. న. ఒకరకము బాహ్యరతి: చూ, రతిబంధము.

కుచము. సం. వి. అ. పుం. చన్ను: చూ, స్తనము.

కుచములు. అం. చుంబనస్థానములు తొమ్మిదింటిలో నొకటి: చూ, చుంబనస్థానములు.

కుచరుఁడు. సం. విణ. 1. తిన్నఁగా నడువనేరని వాఁడు; 2. పరుల దోషమును చెప్పువాఁడు, నికృష్టపుమాటలాడువాఁడు: చూ, కువాదుఁడు.

కుచాంగేరి. సం. వి. ఈ. స్త్రీ. చుక్రిక *: చూ, పులిచింత.

కుచాననము. సం. వి. అ. న. చూచుకము: చూ, స్తనము.

కుచాలింగనము. సం. వి. అ. న. ఆలింగనములు పదునాలుగింటిలో నొకటి: చూ, ఆలింగనములు (చూ, సంశ్లేషము. 1.)

కుచాశ్లేషము. అం. జాతస్మరాలింగనములు యెనిమిదింటిలో నొకటి: చూ, ఆలింగనములు.

కుచికము. సం. వి. అ. పుం, న. అంధాహి అను చేఁప: చూ, మత్స్యము. 1.

కుచేల. సం. వి. అ. స్త్రీ. చిఱుబొద్ది *: చూ,

కుచేలము. సం. వి. అ. పుం. = కుచ్చెలిగంత. చినిఁగినబట్ట: చూ వస్త్రము; బైరాగులబొంత (అని కొందఱు.)

కుచేలి. సం. వి ఈ. స్త్రీ: చూ, కుచేల *. విద్ధకర్ణి.

కుచేలోపాఖ్యానము. పా. ఈగ్రంథమునకుకర్త గట్టు ప్రభువు. (18 శతాబ్ది)

కుచ్చి. దే వి. చిన్నగుడిసె: చూ, సదనము. 1.

కుచ్చితము. వై. విశ. = కుత్సితము, కీడ్వఁబడినది: చూ, హీనము. 1.

కుచ్చితుఁడు. వై. విశ. = కుత్సితుఁడు. చెనఁటి: చూ, వ్యాధుఁడు. 2.

కుచ్చిళ్ళు. వై. వి. బ. గుచ్చీరూ- కుచ్చెళ్లు. వలిభము: చూ, పింజె. 4.

కుచ్చె. వై. వి. 1. —వై.— (బ. కుచ్చెళ్ళు) (రూ- కుచ్చెల- కచ్చె); 2. కెంపులతోఁ జేసినపని.

కుచ్చెతీయు. ద్వ. స. క్రి. (రత్నములను) సానఁబట్టు.

కుచ్చెల. దే. వి. 1. ఎనిమిది గొఱ్ఱులకొలఁది; 2. కంకులతోడి జొన్నచొప్ప లోనగువాని ప్రోవు; 3. కుచ్చె: చూ, పింజె. 4.

కుచ్చెలి. దే. వి: చూ, రూ- కుచ్చేలి *.

కుచ్చెళ్ళు. వై. వి. బ. = గుచ్చీ: చూ, రూ- కుచ్చిళ్ళు; 2. ఒకరకము బాలికాక్రీడ: చూ బాలికాక్రీడ.

కుచ్చేలి. దే. వి. ఒకదినుసు కూరాకు *: చూ, ఘోలి.

కుచ్చేలిగంత. వై. వి. = కుచేల. రూ- కుచ్చేలి బొంత; పర. 1, ఆ. 181: చూ, వస్త్రము; సన్యాసులులోనగువారు ధరించెడు బొంత. (అని కొందఱు)

కుచ్చేలి. బొంత. వై. వి.= —వై.—; య. 8, ఆ. 56. (రూ- కుచ్చెలి- గుచ్చేలి)

కుచ్చు. వై. వి. = గుచ్ఛము. గుత్తి: చూ, పూగుత్తి; 2. టెక్కెపుగుడ్డకొక్క- క్రింది కొన కుచ్చు: చూ, జల్లి. లి. జడగంటు; చూ, భూషణము. 2; బ. 4. కొనచెవినగ: చూ, భూషణము. 2; 5. స్త్రీలజడయందుఁ జేర్చియల్లుకొనెడి నగ: చూ, భూషణము. 2.

కుచ్చుమీను. వై. వి. మిక్కిలిపుచ్ఛముగల చేఁప, గండోలము: చూ, మత్స్యము. 1.

కుచ్చులమెకము. వై. వి. (కుచ్చులు + మెకము) చమరీమృగము: చూ, పవరపుమెకము.

కుజ. సం. వి. అ. స్త్రీ. 1. కాత్యాయనీదేవి: చూ, పార్వతి. 1; 2. శ్రీరాముని భార్య: చూ, సీత.

కుజంభలుఁడు. సం. వి. అ. పుం. చెంపి దోఁచుకొను దొంగ, పగటిదొంగ. (అని కొందఱు): చూ, ముచ్చు. 1.

కుజంభిరుఁడు. సం. వి. అ. పుం. —వై.—

కుజంభిలుఁడు. సం. వి. అ. పుం. —వై.—

కుజనుఁడు. సం. వి. అ. పుం. కుత్సితపురుషుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

కుజపుట. సం. వి. అ. స్త్రీ. కృష్ణవల్లి, కురలి *: చూ, తాంబూలవల్లిక.

కుజప్రియము. సం. వి. అ. పుం. విద్రుమము: చూ, రత్నము. 1.

కుజము. సం. వి. అ. పుం.1. చెట్టు: చూ, వృక్షము; 2. కుజయనుదుర్గతి: చూ, నరకము.

కుజలము. సం. వి. అ. న. పులికడుగు: చూ, శుక్తము. 1.

కుజవారము. సం. వి. అ. పుం. మంగళవారము: చూ, వారము. 1.

కుజాష్టమభృగుషట్కదోషము. పా. అనఁగా- అంగారకుఁడు వివాహలగ్నమునకు రెనిమి దింటనుండిన మృత్యుప్రదుఁడనియు, నిదియే కుజాష్టదోషంబనియు, మఱియు, నీశుభలగ్న మునకు ఆఱెంట శుక్రుఁడుండిన భృగుషట్క దోషమనియు దీనికిఁ బైనఁజెప్పిన ఫలమనియు కుజ శుక్రులు గ్రహయుద్ధమందు శత్రువుచేత జయింపఁబడినను, తిరస్కరింపఁబడినను, శత్రు క్షేత్రముల నీచక్షేత్రములను పొందినను అస్త మానమును బొందియుండినను బలగహితులగుట వలన దోషములేదని కొందఱియభిప్రాయ మైన నాయభిప్రాయము గ్రంథకర్తకు నత్యా శ్చర్యమగుననియభిప్రాయము. కాలామృతము. 77. శ్లో॥

కుజుఁడు. సం. వి. అ. పుం. 1. అంగారకుఁడు: చూ, రాహువు. 2; (కుజునకు స్వవర్గములు 3, శుభవర్గములు 11, పాపవర్గములు 5; కుజ దశ ఏడువత్సరములు; కుజునికి మిత్రులు= గురు, చంద్ర, రవులు; శత్రువు=బుధుఁడు; సములు= శుక్ర, శనులు ఇత్యాది; 2. నరకాసురుఁడు: చూ, మహీసుతుఁడు.

కుజ్జికము. సం. వి. అ పుం. కుజ్జికమను చేఁప: చూ, మత్స్యము. 1.

కుజ్ఝటి. సం. వి. ఈ. స్త్రీ. పొగమంచు: చూ, హిమము.

కుటంకకము. సం. వి. అ. పుం. ఇంటికప్పు: చూ, పటలము.

కుటంగకము. సం. వి. అ. పుం. వృక్షలతాదులు గల యడవి: చూ, విపినము.

కుటంనటము. సం. వి. అ. న. 1. రూ- కుటన్న టము. మండుగము *: చూ, శోణకము; 2. తుంగముస్తె *: చూ, ముస్తకము.

కుటకము. సం. వి. అ. పుం. చేల్లరాడు: చూ, దండవిష్కంభము.

కుటచము. సం. వి. అ. పుం. = కొడిసె, రూ- కుటజము *: చూ, వత్సకము. (ఇది వర్షర్తు వునఁ బూచును)

కుటజము. సం. వి. అ. పుం. 1.= —పై.— (రూ- కూటజము); 2. అగిసె *: చూ, శుక నాసము; 3. ద్రోణము *: చూ, తుమికి.

కుటజుఁడు. సం. వి. అ. పుం. 1. అగస్త్యుఁడు: చూ, ముని. 1; 2. కుంభజుఁడు: చూ, ద్రోణుఁడు.

కుటన్నటము. సం. వి. అ. న: చూ, రూ- కుటం నటము.

కుటపము. సం. వి. అ. పుం. 1. ఇంటితోఁట :చూ, వనము. 2; 2. మానెడు; (విశ్వకోశ ము): చూ, సేరు.

కుటపుఁడు. సం. వి. అ. పుం. కుటపుఁడనుముని: చూ, ముని. 1.

కుటమంగళము. సం. వి. అ. పుం. అరుణాశ్వము: చూ, హయము.

కుటము. సం. వి. అ. పుం, న. కుండ: చూ, భాండము. 3; పుం. 2. గుడిసె: చూ, సద నము. 1. (గృహమనివిశ్వకోశము); 3. చెట్టు: చూ, వృక్షము; 4. అంచు: చూ, చెంగు.

కుటరము. సం. వి. అ. పుం. చేల్లరాడు: చూ, దండవిష్కంభము. (రూ- కంఠరము)

కుటరాజము. సం. వి. అ. పుం. మెఱుఁగుజెట్టి: చూ, సర్పము.

కుటరి. సం. వి. ఈ. స్త్రీ. 1. చేల్లరాడు: చూ, దండవిష్కంభము; 2. కవ్వపుగుత్తి: చూ, మంథానము.

కుటరుణ. సం. వి. ఆ. స్త్రీ. త్రివృత *: చూ, సర్వానుభూతి.

కుటరువు. సం. వి. ఉ. పుం. 1. డేరా: చూ, సదనము. 1; 2. ఎండ్రికాయ: చూ, పీత; 3. పిట్ట: చూ, పక్షి.

కుటలము. సం. వి. అ. న. ఇంటికప్పు: చూ, పటలము. (ఇంటిచూరుఅని హారావళి)

కుటహారిక. సం. వి. ఆ. స్త్రీ. దాసి: చూ, పరిచారిక.

కుటాక. దే. వి. ఒకానొకపక్షి: చూ, పక్షి.

కుటారము. సం. వి. అ. న. సంభోగము: చూ, సంయోగము; 2. గొంగడి: చూ. రల్లకము.

కుటి. సం. వి. ఇ. పుం. 1. చెట్టు: చూ, వృక్షము; 2. ఒడలు: చూ, శరీరము; ఇ. స్త్రీ. 3. =కోటి. ఆయుధపుఅంచు: చూ, వాదర; 4. బొడప: చూ, బుడిపి; ఇ. పుం, స్త్రీ. 5. గుడిసె: చూ, సదనము. 1; 6. సభాగృహము, గుడిసె (అని కొందఱు): చూ, సదనము. 1; (రూ- కుటిక-కుటీరము); ఈ. స్త్రీ. 7. నీళ్ళు మోసెడు పనికత్తె: చూ, పరిచారిక; 8. మురయను గంధద్రవ్యము: చూ, రాజార్హము; 9. వివిధవర్ణముల పూలగుత్తి: చూ, పూగుత్తి.

కుటిక. సం. వి. ఆ. స్త్రీ. = గుడిసె. సభాగృహము(అని కొందఱు.): చూ, సదనము. 1.

కుటిచరము. సం. వి. అ. పుం. జలసూకరము: చూ, సూకరము.

కుటితము. సం. విశే. వంకరైనది: చూ, వంకర.

కుటిరము. సం. వి. అ. న. రూ- కుటీరము = గుడిసె: చూ, సదనము. 1.

కుటిల. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొకయేఱు: చూ, నది; విశే. 2. వంకరైనది: చూ, వంకర.

కుటిలకేశము. సం. వి. అ. పుం. ప్రాశస్త్యలక్షణము: చూ, లక్షణము. 1.

కుటిలము. సం. విశే. వంకరైనది: చూ, వంకర.

కుటిలిక. సం. వి. ఆ. స్త్రీ. మంగలవాఁడు వెండ్రుకలూడదీసెడు సాధనము: చూ, తండసము.

కుటిలుఁడు. సం. వి. అ. పుం. అస్పృశ్యుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

కుటీచకము. సం. వి. అ. పుం. గాడిద: చూ, రాసభము.

కుటీచకుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొకయతి: చూ, ముని. 1; 2. వంకరదారిఁ బోవువాఁడు; 3. పుత్రాన్నముచే జీవించువాఁడు; (త్రి. శే): చూ, పుత్రాన్నాదుఁడు.

కుటీచరకుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకయతి: చూ, ముని. 1.

కుటీచరము. సం. వి. అ. పుం. ఎండ్రికాయ; (త్రి. శే.): చూ, పీత.

కుటీరము. సం. వి. అ. పుం, న. 1. = గుడిసె, రూ- కుటిరము: చూ, సదనము. 1; పుం. 2. కంబడి: చూ, రల్లకము; 3. రథము: చూ, శకటము.

కుటుంగకము. సం. వి. అ. పుం. 1. వృక్షలతాదులు గల గృహము: చూ, సదనము 1; 2. వృక్షములు లతలుగల యడవి: చూ, విపినము; 3. ఇంటికప్పు: చూ, పటలము.

కుటుంబము. సం. వి. అ. పుం. పెండ్లాము బిడ్డలు లోనగువారు: చూ, సంసారము. 1.

కుటుంబి. సం. వి. న్. పుం. 1. కుటుంబపోషకుఁడైనవాఁడు; విశే. 2. అరకాఁడు: చూ, వ్యవసాయి.

కుటుంబిని. సం. వి. ఈ. స్త్రీ. పురంధ్రి: చూ, స్త్రీ.

కుటుఁడు. సం. వి. అ. పుం. రూ- కూటుఁడు: చూ, ఱాతిపనివాఁడు.

కుటువు. సం. వి. అ. పుం, న. గృహము: చూ, సదనము.

కుట్టకుఁడు. సం. విణ. రూ-కుట్టాకుఁడు. భేదించువాఁడు: చూ, నఱకువాఁడు.

కుట్టడము. దే. వి. కుట్టుపని.

కుట్టనము. సం. వి. అ. న. ఛేదనము: చూ, నఱుకుఁడు.

కుట్టని. సం. వి. ఈ. స్త్రీ. కుంటెనకత్తె: చూ, శంభళి.

కుట్టమితము. సం. వి. అ. న. దంతపీడనాదులచేఁ గోపభావమభినయించినను లోపల మిక్కిలి యానందమును పొందునట్టి స్త్రీలయొక్క శృంగారచేష్టా విశేషము: చూ, హారము. (రూ-కుట్టిమితము.)

కుట్టాకుఁడు. సం. విణ: చూ, రూ-కుట్టకుఁడు.

కుట్టారము. సం. వి. అ పుం. కొండ: చూ, పర్వతము.

కుట్టారుగలు. దే. వి. బ. (కుఱుచే + ఆరుగలు) కొఱ్ఱివవిశేషము. మూఁడు నెలలకుఁ బండు కుఱుచేయారుగలు: చూ, ధాన్యము.

కుట్టావలు. దే. వి. బ (కుఱుచే + ఆవలు) ఒక రకము ఆవాలు: చూ, సర్షపము.

కుట్టి. సం. వి. ఇ. పుం. కోవిదుఁడు: చూ, విద్వాంసుఁడు.

కుట్టినతేలు, కుట్టకున్న కుమ్మరపురువు. లో. ఉదా.—అస్మదీయశాంతికి ఫలంబుతోడనఁ గలిగె. కుట్టినందేలండ్రు. కుట్టకున్నం గుమ్మరి పుర్వండ్రుగాదే. (నీతిచంద్రిక-మిత్రభేదము.)

కుట్టిమము. సం. వి. అ. పుం, న. 1. చాతికట్టనపునేల, నెలకట్టు: చూ, భూమి. 1; పుం. 2. దాడిమము *: చూ, దానిమ్మ.

కుట్టిమితము. అం. రూ-కుట్టమితము. శృంగారచేష్టలు పదునెనిమిదింటిలో నొకటి: చూ, శృంగారచేష్టలు.

కుట్టియ. దే. వి. గుదస్థానము. రూ-కుట్టె: చూ, ముడ్డి.

కుట్టిహారిక. సం. వి. అ. స్త్రీ. దాసి: చూ, పరిచారిక.

కుట్టీరము. సం. వి. అ. పుం. కొండ: చూ, పర్వతము.

కుట్టు. దే. వి. 1. శూలరోగము, కొంచెము కడుపునొప్పి (అని కొందఱు): చూ, శూల; 2. కుట్టుఁడు: చూ, మాసిక. 1; 3. కుట్టుట: చూ, స్యూతి. 1; 4. ప్రాయ్యలో క్రిక్కిరిసి యుండు బూడిదె లోనగునది: చూ, భస్మము; స. క్రి. 5. ఆకులుకుట్టు: చూ, పొడుచు. 8; 6. గుడ్డకుట్టు: చూ, పొడుచు. 9; 7. తేలు లోనగునవి కుట్టు; భార. అర. 1, ఆ. 251. చూ, పొడుచు. 6; 8. చీమకుట్టు: చూ, పొడుచు: 10. (నల్లికుట్టు, దోమకుట్టు మొ)

కుట్టుకొడ. ద్వ. వి. కుట్టుపోఁగులు: చూ, భూషణము. 2.

కుట్టుడాకు. దే. వి. (కుట్టుడు + ఆకు) పుల్లియ: చూ, విస్తరి.

కుట్టుడు. దే. వి. కుట్టుట, రూ-కుట్టు.

కుట్టుతేలు. దే. వి. 1. క్షుద్రుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 2. ముల్లు: చూ, సితాగ్రము.

కుట్టుపనివాఁడు. వా. వి: చూ, కుట్రువాఁడు.

కుట్టుపోఁగులు, దే. వి. ఉంగరమువంటి వట్టి పోఁగులు: చూ, భూషణము. 2.

కుట్టుపోయు. దే. స. క్రి. కుట్టు.

కుట్టుసురు. దే. వి. (కుఱుచే + ఉసురు) కొఱప్రాణము, కొంచెముమిగిలియున్న ప్రాణము: చూ, ప్రాణము. 6.

కుట్టె. దే. వి: చూ, రూ- కుట్టియ.

కుట్మము. సం. వి. అ. న. వన: చూ, మొగ్గ. 1.

కుట్మలము. సం. వి. అ. న. 1. నరకవిశేషము: చూ, నరకములు; పుం. 2. అరవిరిమొగ్గ: చూ, మొగ్గ. 1. (రూ- కుడ్మలము)

కుట్రి. దే. వి. 1. కుచ్ఛితము: చూ, హీనము.1; 2. మోసము: చూ, వంచన.

కుట్రిపువాఁడు. దే. వి. కుట్టుపనిచేయువాఁడు: చూ, సూచికుఁడు.

కుఠరము. సం. వి. అ. పుం. 1. చేల్లరాడు,రూ- కుటరము: చూ, దండవిష్కంభము; 2. తుంగ ముస్తె *: చూ, ముస్తకము.

కుఠము. సం. వి. అ. పుం. రూ- కుటము. చెట్టు: చూ, వృక్షము.

కుఠాకువు. సం. వి. ఉ. పుం. ఒకానొక పిట్ట: చూ, పక్షి.

కుఠాటంకము. సం. వి. అ. పుం; న. చెట్టు: చూ, వృక్షము.

కుఠారము. సం. వి. అ. పుం. 1. —పై—; 2.= గొడ్డలి, స్వధితి: చూ, ముద్గరము.

కుఠారి. సం. వి. న్. పుం. జమదగ్ని కొడుకు: చూ, పరశురాముఁడు.

కుఠారువు. సం. వి. ఉ. పుం. 1. చెట్టు: చూ, వృక్షము; 2. కోఁతి: చూ, వానరము; 3: చూ, శస్త్రకారుఁడు.

కుఠి. సం. వి. ఇ. పుం. 1. కొండ: చూ, పర్వతము; 2. చెట్టు: చూ, వృక్షము.

కుఠికము. సం. వి. అ. పుం. మృత్ఫలి, కుష్ఠము: చూ, మండలము. 3.

కుఠేరకము. సం. వి. అ. పుం. 1. నల్లగగ్గెర *: చూ, పర్ణాసము; 2. గగ్గెర *: చూ, పర్ణాసము.

కుఠేరజము. సం. వి. అ. పుం. 1-2. —పై—: 3. తెల్లతొళసి *: చూ, తులసి.

కుఠేరువు. సం. వి. ఉ. పుం.చామరవాతము: చూ, వాయువు.

కుడక. దే. వి. 1. నారికేళ పేళము: చూ, కొబ్బెర. 2; 2.గంధము మొదలగునవి యుంచు పాత్రి: చూ, పాత్రము. 6.

కుడపము. సం. వి. అ. పుం. మానిక: చూ, సేరు. 1. (రూ- కుడవము)

కుడవము. సం. వి. అ. పుం. —పై—

కుడి. సం. వి. ఇ. పుం. 1. దేహము: చూ, శరీరము; దే. వి. (1) అపసవ్యము. "కుడికన్ను- కుడికాలు- కుడిచేయి- కుడిప్రక్క." మొ: చూ, వలపల; (2) కుడుపు; పంచ. నా. 4. ఆ. 100: చూ, సాపాటు.

కుడిచికూర్చుండుట. జా. తీరికగానుండుట. "ఆ గోపాలుఁడు కుడిచికూర్చుండలేక చెట్లుగొట్టి పైన వేసికొనెను." (ధర్మజ); కుడిచికూర్చుండి కొఁదెచ్చు కొంటిమొకటి." ప్రభావతీ ప్రద్యుమ్నము.

కుడితి. దే. వి. కడుగు: చూ, శుక్తము. 1.

కుడినీరు. ద్వి. వి. త్రాగఁదగినజలము. "కుడినీరు మేడలు." వసు. 4, ఆ. 72: చూ, నీరు. 1.

కుడిపి వై. వి. = కురూపి; భో. 5, ఆ. 841: చూ, కురూపి.

కుడిభుజమగుట. జా. తోడుపాటుగుట. "కుడి భుజమైరమ్మ గొబ్బున నెనుపోతు, కానకల జేతునూకాలతల్లి." (కవిచకోర చంద్రోదయము)

కుడిమిగాఁడు. దే. వి. రూ-కుడిమివాఁడు: చూ, వ్యాళగ్రాహి.

కుడిమివాఁడు. దే. వి. —పై—

కుడియడుగుపసువడి. దే. వి. 1. మల్లశాస్త్రము లోని పరువళ్ళు పండ్రెండింటిలోనొకటి: చూ, పరువళ్లు; 2. విసరులు పదునాలుగింటిలోనొకటి: చూ, విసరులు.

కుడివరదండ. అం. మల్లశాస్త్రములోని దండలు పండ్రెండింటిలో నొకటి: చూ, దండలు.

కుడివరభృంగి. అం. —పై—

కుడీశము. సం. వి. అ. పుం. = గుడి. కుడీశమను చేఁప: చూ, మత్స్యము. 1.

కుడిసుడిగలబొడ్డు. అం. ఉత్తమస్త్రీ సామాన్య లక్షణములలో నొకటి: చూ, ఉత్తమస్త్రీ సామాన్యలక్షణములు.

కుడుంగము. సం. వి. అ. పుం. 1. పొదరిల్లు: చూ, కుదనము. 1; 2. ఒకానొక చేప: చూ, మత్స్యము. 1.

కుడుక. దే. వి. తక్కెడతట్ట: చూ, స్యూనము.

కుడుక్క. అం. అనద్ధవాద్యములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, అనద్ధవాద్యములు.

కుడుక్కకము. సం. వి. అ. పుం. తాళప్రాణభూతమైన యొకానొక కళ: చూ, తాళము. 2.

కుడుచు. దే. స. క్రి. రూ-కుడ్చు. 1. అనుభవించు; భార. శల్య. 1, ఆ. 37. (దిగులు కుడిచి ఇత్యాదులయందు దిగులుబొంది యని యర్థము); 2. త్రావు. "చన్నుగుడిచెను.": చూ, త్రాగు; 3. తిను; భార. ఆది. 5, ఆ. 228: చూ, భుజించు.

కుడుపము. సం. వి. అ. పుం. 1. చర్మాచ్ఛాదిత వాద్యములలో నొకటి: చూ, వీణె; 2. మానిక: చూ, సేరు. 1.

కుడుపరి. దే. విణ. (కుడుపు + అరి) 1. అనుభవించువాఁడు; 2. భుజించువాఁడు; అచ్చ. అర, కాం. 114: చూ, తినువాఁడు.

కుడుపు. దే. వి. 1 భోజనము; భార. అను 2, ఆ. 89: చూ, సాపాటు; 2. అనుభవము; విజ్ఞా. వ్య, కాం: చూ, భుక్తి. 2; ప్రే. 3. కుడువఁజేయు.

కుడుము. దే. వి. మోదకము: చూ, భక్ష్యము.

కుడుములతిండికాఁడు. దే. వి. విఘ్నారి: చూ, వినాయకుఁడు. 1.

కుడువఁబోవుచుఁగూరలచేవులడుగనేల. లో.

ఉ.— "ఏరీతినింతమిక్కిలి।
చేరికగానాడితనిరొ పిడుఁడుచూడం।
గారారె కుడవఁబోవుచుఁ।
గూరంజేవులడుగనేల కోమలియనియెన్."
(కళా పూర్ణోదయము)

కుడుహాలంచి సం. వి. ఈ. స్త్రీ. క్షుద్రకారవేల్లము*: చూ, కుమవి. 1.

కుడ్చు. దే. స. క్రి: చూ, రూ- కుడుచు.

కుడ్మలము. సం. వి. అ. పుం. అరవిరిమొగ్గ: చూ, మొగ్గ. 1. (రూ- కుట్మలము)

కుడ్యకము. సం. వి. అ. న. గోడ: చూ, మఱుఁగుగోడ.

కుడ్యకారుఁడు. సం. వి. అ. పుం. గోడ పెట్టువాఁడు: చూ, తాపీవాఁడు.

కుడ్యచ్ఛేద్యము. సం. వి. అ. న. ఖానికము, కన్నపుగత్తి: చూ, రిష్టి. 2.

కుడ్యమత్సి. సం. వి. ఈ. స్త్రీ. గౌళి: చూ, బల్లి

కుడ్యమత్స్య. సం. వి. ఆ. స్త్రీ. —పై.—

కుడ్యము. సం. వి. అ. న. 1.= గోడ: చూ, మఱుఁగుగోడ; 2. అంగరాగము: చూ, పూఁత. 3

కుణంజము. సం. వి. అ. పుం. ఒకానొకచెట్టు: అరణ్యవాస్తుకము, కుణంజరము, కుణంజి.

కుణంజరము. సం. వి. అ. పుం—పై —

కుణంజి. సం. వి. ఇ. పుం. —పై.—

కుణకము. సం. వి. అ. పుం.=కున్న-కున్నఁడు-కూన, పిల్ల, భాగ. 5, స్కం. 1, ఆ. 105: చూ, శిశువు.

కుణపము. సం. వి. అ. పుం. 1. పీనుఁగు: చూ, శవము; 2. అస్త్రవిశేషము: చూ, బాణము. 1; పుం. విణ. 3. దుర్గంధము: [illegible], వాసన.

కుణపి. సం. వి. ఈ. స్త్రీ. 1. పీతిగోరువంక: చూ, విట్సారిక; 2. దుర్గంధము: చూ, వాసన; 3. పీనుఁగు: చూ, శవము.

కుణాలము. సం. వి. అ. పుం. కుణాలమను దేశము; చూ, దేశము.

కుణి. సం. వి. ఇ. పుం. 1. నది *: చూ, నంది వర్ధనము; విణ. 2. రూ-కూణి. పొట్టిచేతుల వాఁడు: చూ, కోణి. (పీలచేతులవాఁడని విశ్వకోశము)

కుణిందము. సం. వి. అ. పుం. నాదము: చూ, స్వరము. 2.

కుణుంజము. సం. వి. అ. పుం. నెంచెలికూర *: చూ, వనవాస్తుకము.

కుణుంబము. సం. వి. అ. పుం. కొయ్యతోఁటకూర *: చూ, మారిషము.

కుణుఁడు. సం. వి. అ. పుం. రూ- కూణుఁడు. ఇనుఁడు: చూ, సూర్యుఁడు.

కుతకుత. దే. వి. ఉడుకుటయందగు ధ్వన్యనుకరణము. (తుకతుకయనుమాఱుగూపము): చూ, హాహా.

కుతటకము. సం. వి. అ. పుం. 1. పచ్చపెద్ద గోరంట *: చూ, మహాసహ; 2. పచ్చపువులు గోరంట *: చూ, మహాసహ.

కుతనువు. సం. వి. ఉ. పుం. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు.

కుతపము. సం. వి. అ. పుం. 1. ద్రోణము. కుడుపము: చూ, వీణె; 2. చిన్నసిద్దె: చూ, సిద్దె; 3. ఆవు: చూ, ధేనువు; 4. అగ్ని: చూ, నిప్పు; 5. దర్భ *: చూ, తృణము. 1; 6. నువ్వు *: చూ, నువ్వులు; 7. మేఁకబొచ్చుపుటి, కంబళి: చూ, రల్లకము; 8. పదియాఱు వత్సరముల ఏనుఁగు: చూ, నాస్తి; 9. పగటియందు పదునాలుగు గడియలమీఁద పదునాలుగడియల నడిమికాలము. పగటిని పదునేను పాళ్లుచేసి అందెనిమిదవపాలు (అని అమరము) 10. చెడుతపము; (ఇట్లు—వెకు—అర్థములుగలవి. కుతర్కము, కుతంత్రము, కుతీర్థము, కుతూలము, కుతృష్ణ, కుతార్యత్రికము. ఇత్యాదులువ్యాంబులు)

కుతపుఁడు. సం. వి. అ. పుం. 1. తోడఁబుట్టినదాని కొడుకు: చూ, మేనల్లుఁడు;2. ఇనుఁడు: చూ, సూర్యుఁడు; 3. పాఱుఁడు: చూ, బ్రాహ్మణుఁడు; 4. అతిథి: చూ, విందు; 5. బాల్యుఁడు: చూ, శిశువు.

కుతస్త్యము. సం. విణ. అసభ్యము. (మాట), పామరోక్తి: చూ, వ్యాఖ్యాతము. 2.

కుతాకువు. సం. వి. ఉ. పుం. 1. ఓర్వలేనివాఁడు: చూ, సూడుకాఁడు; 2. దురాచారుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 3. పాము: చూ, సర్పము.

కుతి. దే. వి. శోకము; అం, భా. ప్ర. 185: చూ, దుఃఖము. (రూ- కుతికలపాటు-కుతిల-కుతిలపాటు- కుతిలము)

కుతిక. దే. వి. రూ- కుత్తిక- కుత్తుక- కుతుక; వి, పు. 7, ఆ. 11: చూ, మెడ.

కుతికంటు. దే. వి. (కుతిక + అంటు) బంగారు తీఁకుతోఁ బట్టెగా మెడకంటియుండునట్లు చేసి యుంచుకొనెడు స్త్రీభూషణవిశేషము; హంస. 2. ఆ. 190. (కూనపూసలకుతికంటు-నాకబలికుతికంటులోనగునవి)రూ-కుత్తికంటు :చూ, భూషణము. 2.

కుతికలపాటు. దే. వి. 1. విచారము: చూ, సంతాపము; 2. బాధ: చూ, దుఃఖము.

కుతినీ. దే. వి. ఒకదినుసుపట్టు; రసి. 5, ఆ. 148: చూ, పట్టము. 2.

కుతిల. దే. వి. బాధ; పారిజ్ఞ. 4, ఆ. 191: చూ, దుఃఖము.

కుతిలపడు. ద్వ. అ. క్రి. గాసిల్లు; పాండు. 3, ఆ. 20; (ప్రే. కుతిలపఱుచు) : చూ, బాధపడు.

కుతిలపాటు. దే. వి. కుతిలపడుట. య. 1, ఆ. 95: చూ, దుఃఖము.

కుతిలపెట్టు. దే. స. క్రి. నొప్పించు; భార. శాంతి. 2. ఆ. 89: చూ, బాధించు.

కుతిలము. దే. వి. శోకము: చూ, దుఃఖము.

కుతుంబకము. సం. వి. అ. పుం. ద్రోణము *: చూ, తుమికి.

కుతుక. దే. వి. రూ- కుత్తుక; రాజ. 3, ఆ. 190: చూ, మెడ.

కుతుకము. సం. వి. అ. న. 1. అనుభవింపని కోరికయందలి యాస, తమి, అపూర్వవస్తువును కోరుట: చూ, వ్యసనము; 2. కోరిక: చూ, వాంఛ; 3. ఆనందము: చూ, సంతోషము. (రూ- కౌతుకము- కుతూహలము- కౌతూహలము.)

కుతుపము. సం. వి. అ. పుం. 1. చిన్నసిద్దె: చూ, సిద్దె; 2. గడప: చూ దేహళి.

కుతుపు. సం. వి. ఊ. స్త్రీ. పెద్దసిద్దె: చూ, సిద్దె.

కుతూహలము. సం. వి. అ. న. 1. కోరిక: చూ, వాంఛ; 2 ఆనందము: చూ, సంతోషము; 3. నాయికకు మనోజ్ఞమైన వస్తువును చూచుటయందుఁగల లోలత్వము, అపూర్వ వస్తువును గోరుట. (అని అమరము): చూ, వ్యసనము; విణ 3. మేలుతరము: చూ, శ్రైష్ఠ్యము; 4. ఆశ్చర్యము: చూ, వింత. 1; అం. 5. శృంగారచేష్టలు పదునెనిమిదింటిలో నొకటి: చూ, శృంగారచేష్టలు.

కుతృణము. సం. వి. అ. న. నీటిపాఁచి *: చూ, శైవలము.

కుతేర. వా. గొంతుకవఱకు "వానికి నామీఁద కుతేరకోపము కలదు" (గోదావరీమండలమున వాడుక)

కుత్కీలము. సం. వి. అ. పుం. 1. కొండ; జై. 1, ఆ. 191; (కుకీలముఅని కొందఱు): చూ, పర్వతము; 2. తామరతూఁడు: చూ, బిసము.1; 3. సానులముంగిట మొలచిన తీఁగె *: చూ, వృక్షము.

కుత్తిక. దే. వి: చూ, రూ- కుతిక.

కుత్తికంటు. దే. వి: చూ, రూ- కుతికంటు.

కుత్తు. సం. వి. త్ పుం. 1. కొడుకు: చూ, పుత్త్రుఁడు. 1; 2. కుత్సితుఁడు : చూ, వ్యాధుఁడు. 2.

కుత్తుక. దే. వి: చూ, రూ- కుతిక.

కుత్తుకగంనువాఁడు. దే. వి. కఱకంఠుఁడు; ఆంధ్ర. ప. సుర. 10: చూ, శివుఁడు.

కుత్తుకబంటి. దే. వి. కంఠముపర్యంతము.

కుత్రము. సం. వి. అ. న. గోపము: చూ, మండపము.

కుత్స. సం. వి. ఆ. స్త్రీ. దూఱు: చూ, నింద.1.

కుత్సనము. సం. వి. అ. న. —పై—

కుత్సల. సం. వి. అ. స్త్రీ. నీలి *: చూ, రంజని.

కుత్సగోత్రము. అం. గోత్రములలో నొకటి: చూ, గోత్రములు; (చూ, ప్రవర)

కుత్సించు. సం. అ. క్రి. 1, అసహ్యపడు; కాశీ. 4. ఆ. 18: చూ, గోఁతపడు; స. క్రి. 2. దూఱు: చూ, నిందించు.

కుత్సితము సం. వి. అ. న. 1. కుష్ఠమనుమందు: చూ, మందు. 1; విణ. 2. =కుత్సితము.కీడ్పఁబడినది: చూ, హీనము, 1.

కుత్సితుఁడు. సం. విణ.= కుచ్ఛితుఁడు. జాత్యాచారాదులచేతనిందితుఁడు:చూ, వ్యాధుఁడు.2

కుత్సీరము. సం. వి. అ. న. వడ్డిబ్రతుకు: చూ, వృద్ధిజీవిక.

కుథము. సం. వి. అ. పుం. 1. పవిత్రము, దర్భ: చూ, తృణము. 1; 2. ఏనుఁగుమీఁదఁ బఱచెడి యెఱ్ఱకంబళి, చిత్రికంబళము. (అని కొందఱు) ఈయర్థమునం దాకారాంత స్త్రీలింగమును గలదు): చూ, రల్లకము; 3 అల్లికజేడ: చూ, వేసలి. 1.

కుథరము. సం. వి. అ. పుం. 1. రూ-కుదరము. గుట్టము:చూ, గాయము; 2. ఒకానొకపక్కి: చూ, పక్షి.

కుశాకువు. సం. వి. ఉ. పుం. 1. కోఁతి: చూ, వానరము; 2. రూ- కుషాకువు. ఇనుఁడు: చూ, సూర్యుఁడు; 3. రూ- కుషాకువు.అగ్ని: చూ, నిప్పు; 4. పరాయివానిని తపింపఁజేయు వాఁడు: చూ, హింసకుఁడు (కుశాకుఁడు అని పురు- కవీయము)

కుదప. దే. వి. 1. నీళ్ళుకట్టి అడుసుగాదున్నుట: చూ, రొంపిదుక్కి; 2. పెరుఁగుచిదప. రూ- కుదుప: చూ, పెరుఁగు. 1; 3. పెరుఁగుకడ్డ. రూ- కుదుప: చూ, పెరుఁగు. 1.

కుదరము. సం. వి. అ. పుం. = గుఱ్ఱము. రూ- కుధరము: చూ, హయము.

కుదవ. దే. వి. ఉపనిధి. చెప్పక మాపకయుంచిన యిల్లడ, రూ- కుదువ: చూ, వాడిక.

కుదించు. దే. ప్రే. కుదియించు, కుదియఁజేయు, కుదుచు; జై. 6, ఆ. 245.

కుదికిలఁబడు. దే. అ. క్రి. ముఖముపైకెత్తుకొని ముడ్డి నేలమోవ గొంతుకూర్చుండు; రంగ. రా. 409: చూ, కుదికిలు.

కుదికిలు. దే. అ. క్రి.—పై.—(చదికిలువంటిది) ఉ, హరి. 3, ఆ. 64.

కుదియఁజేయు. దే. ప్రే: చూ, కుదించు.

కుదియించు. దే. ప్రే. —పై. —

కుదియు. దే. అ. క్రి. 1. అడఁగు; భార.విరా. 2, ఆ. 47: చూ, ముక్కు. 4; 2. క్రుంగు; భార. అశ్వ. 3, ఆ. 72: చూ, మ్రుంగు; 3. తగ్గు; అను. 4, ఆ. 208:చూ,బ్రుక్కు.9; 4. మరలు, నివర్తిల్లు; మార్క. 3, ఆ. 371: చూ, వట్రిల్లు.

కుదిర. వై. వి. = కుదరః. గుఱ్ఱము : చూ, హయము. (రూ- కుదిరము)

కుదిరించు. దే. ప్రే: చూ, కుదురుచు.

కుదిరిక. దే. వి. 1. అమరిక, రీతి: చూ, విధము; 2. నిలుకడ: చూ, పాదు; 3. నిశ్చింత:చూ, మదిమది; 4. అందము: చూ, సౌందర్యము.

కుదిలిక. దే. వి. కుదులుట.

కుదుకనగోలు. దే. వి. మోసము; హరిశ్చ. 2, భా. 1829: చూ, వంచన.

కుదుచు. దే. ప్రే: చూ, కుదించు. య. 2, ఆ. 24.

కుదుప. దే. వి. 1. దుర్మాంసపిండము: చూ, మాంసము; 2. మోసము; నిర్వ. 7, ఆ. 84: చూ, వంచన; 3. రూ- కుదప. పెరుఁగుకడ్డ: చూ, పెరుఁగు. 1; 4. పెరుఁగుచిదప. రూ- కుదప: చూ, పెరుఁగు. 1.

కుదుపు. దే. వి. 1. స్వభావమునఁ గాలులేని వాఁడు; కాశీ. 5, ఆ. 291; భీ. 5, ఆ. 22: చూ.పంగువు; వా. 2. ఇటునటు ఊఁపు.

కుదురు. దే. వి. 1. రీతి:చూ, విధము. 1; 2.అగసాలెవాని కుంపటి; నీలా. 3, ఆ. 3: చూ, ప్రొయ్యి; 3. నిలుకడ : చూ, పాదు; 4. నిశ్చింత: చూ, మదిమది; 5. కుండలోన గునవి కుదిరిక గానిలుచుట కేర్పఱచినపీఠము: చూ, మట్టు. 3; 6. అవాపము; రామా. 4, ఆ. 148: చూ, పాదు. 1; 7. ఆశ్రయము; భార. విరా. 2, ఆ. 122: చూ, ప్రాపు. 2; 8. అందము: చూ, సౌందర్యము; అ. క్రి. 9. అనుకూలమగు: చూ, సరిపడు. 2; 10. స్థిరమగు: చూ, స్థిరపడు; 11. స్వస్థమగు: చూ, రక్కొను. (రోగముని వారణమగు)

కుదురుకొను. దే. అ. క్రి. కదలకనిలుచు, నెలకొను; విక్రి. 2, ఆ, 70: చూ, మట్టుపడు. (ప్రే. కుదురుకొలుపు)

కుదురుచు. దే. ప్రే. కుదురఁజేయు: కుదిరించు- రూ- కుదుర్చు.

కుదురుపడు. ద్వి. అ. క్రి. రూ- కుదుర్పడు. 1 నెలకొను: చూ, మట్టుపడు; 2. తిరపడు జై. 7, ఆ. 88: చూ, స్థిరపడు. (ప్రే. కుదురుపఱచు)

కుదురుపాటు. ద్వ. వి. కుదురుపడుట: రూ- కుదుర్పాటు.

కుదుర్చు. దే. ప్రే: చూ, రూ- కుదురుచు.

కుదుర్పడు. ద్వ. అ. క్రి: చూ, రూ-కుదురుపడు.

కుదుర్పాటు. ద్వ. వి: చూ, రూ-కుదురుపాటు.

కుదులు. దే. అ. క్రి. చలించు: చూ, చలించు.

కుదువ. దే. వి. 1. అగావు, అధి: చూ, తాకట్టు; 2. కుదవ: చూ, వాడిక.

కుదువపెట్టు. దే. స. క్రి: చూ, తాకట్టుంచు.

కుద్దాలము. సం వి. అ. పుం. 1. = గుద్దలి.రూ- కూద్దాలము: చూ, ముద్గరము; 2. రూ- కుద్దాలము, కాంచనము*: చూ, యుగపత్రిక ము.

కుద్యము. సం. వి. అ. పుం. రూ-కుడ్యము: చూ, మఱుంగుగోడ.

కుద్రము. సం. వి. అ. న. ఒకరకము ఇల్లు: చూ, సదనము. 1.

కుద్రవము. సం వి. అ. పుం. బ. అళ్లు. రూ- కోద్రవము: చూ, ధాన్యము.

కుధరము. సం. వి. అ. పుం. కొండ: చూ, పర్వతము

కుధ్రము. సం. వి. అ. పుం. 1. —వై.—; 2 చంద్రకాంతమణి: చూ, రత్నము. 1.

కునఖము. సం. వి. అ. న. ఒకానొక క్షుద్ర రోగము: చూ, రోగము. 1.

కునటుగంధిని. సం. వి. ఈ. స్త్రీ. త్రివృత *: చూ, సర్వానుభూతి.

కునటి. సం. వి. ఈ. స్త్రీ. 1. మణిశిల, నెపాళి, నేపాళదేశపు మణిశిల (అని కొందఱు): చూ, రాయి; 2. ధాన్యాకము, ఒకరకము సస్యము: చూ, సస్యము.

కునష్టి. వా. వి.=కొనటి, కుంటి:చూ, పంగుపు.

కునళి. సం. వి. ఈ. స్త్రీ. కాకనామము *: చూ, బకపుష్పము.

కునహము. సం. వి. అ. పుం. 1. చండయను గ్రంధ్యము: చూ, రాజార్హము; 2. ఆకాశము: చూ, విన్ను.

కునాభి. సం. వి. ఇ. పుం. 1. వాతమండలి: చూ, వాయువు; 2 నిధి: చూ, లిబ్బి. 2.

కునాళకము. సం. వి. అ. పుం. 1. తీఁట కిసింద *: చూ, సముద్రాంత; 2. పిన్నరేగటి దూలగొండి *: చూ, స్వల్పదురాలభ.

కునికిపడు. ద్వ. అ. క్రి. తూఁగిపడు: చూ, నిద్రించు.

కునికిపాటు. ద్వ. వి. తూఁగిపడుట : చూ, ప్రమీల.

కునుకు. దే. అ. క్రి. తూఁగు: చూ, నిద్రించు.

కునుష్టు. వా. వి: చూ, కునష్టి. (రూ- కునుష్టు)

కున్న. వై. వి. = కుణకః: చూ, రూ- కూన. (విద్ద.— లక్ష్మీ. 5, అ. 27)

కున్నఁడు. వై. వి. = కుణకః. బాలుఁడు:చూ, శిశువు.

కున్నసము. సం. వి. అ. న. 1. గాజుచిప్ప: చూ, పాత్రము. 6; 2. పెద్దకుండ: చూ, భాండము. 3.

కున్నారము. సం. వి. అ. న. గాజుచిప్ప: చూ, పాత్రము. 6.

కుపసము. వై. వి. = కూర్పాసః. రూ- కుప్పసము. 1. పాముపొర: చూ, సీదరము. 3; 2. అవికె: చూ, వస్త్రము; 3. అరచేట్టు; కాశీ. 7, అ. 40: చూ, వస్త్రము; 4. నిడుచేట్టు: చూ, వస్త్రము.

కుపితుఁడు. సం. విణ. రూ-కోపితుఁడు, కోపి: చూ, రోషణుఁడు.

కుపిని. సం. వి. న్. పుం. జాలరి: చూ, వల తేఁడు. (పడవ నడపువాఁడని తిక్కాండ శేషము)

కుపీలువు. సం. వి. ఉ. పుం. 1. ఒకానొక చెట్టు:చూ, కారస్కరము; 2. తిందుకము*: చూ. తుమికి.

కుప్రాయము. సం. విశ. కుత్సితము: చూ, హీనము. 1.

కుప్రాయుఁడు. సం. విశ. జాత్యాచారాదులచేత నిందితుఁడు, కుత్సితుఁడు: చూ, వ్యాధుఁడు2.

కుపోదకి. సం. వి. ఈ. స్త్రీ. ఉపోదకి *: చూ. బచ్చలి.

కుప్ప. దే. వి. 1. వడ్లరాసి: చూ, రాశి; 2.వంపుఁబడిన వ్రేళ్లుగల పుడిసిలి: చూ, పట్టిలి.

కుప్పఁగూర. దే. వి. కుప్పవడుట; భార. అశ్వ. 1, ఆ. 31; నిర్వ. 5, ఆ. 88: రూ- కుప్పనఁగూర.

కుప్పతిప్పలు. జా. సమృద్ధి. "అట్టినీవిత్తరి కుప్పతిప్పలుగా మోత్రల దుముకులాడుచు సస్యభక్షింపనోల్లక." (నీతిచంద్రిక-సంధి)

కుప్పితిలు.. దే. అ. క్రి. కుప్పగాఁజేయు; జై. 5, ఆ. 57: చూ, రాసిపడు.

కుప్పనఁగూర. దే. వి: చూ, రూ- కుప్పఁగూర; భార. కర్ణ. 2, ఆ. 298; భో. 7, ఆ. 125.

కుప్పము. దే. వి. 1. గ్రామము: చూ, దేశము; 2. చెంబడివారిపల్లె: చూ, దేశము.

కుప్పవడు. దే. అ. క్రి: చూ, కుప్పతిలు.

కుప్పవేత. వా. వి. కోసినపసల నొకచోటచేర్చి బొంగరమువలెవేసిన రాశి. (దక్షిణాదిని కోసినవెంటనే నూర్పుట వాడుక)

కుప్పసము. వై. వి.= కూర్పాసః: చూ. రూ- కుప్పసము. (అరచేట్ట.— ఆము. 6, ఆ. 6; నిడుచేట్ట — రా. యు, కాం; ఆవిక.— ఆము. 5, ఆ. 104; పాముయొక్క పైతోలు.— జై. 6, ఆ. 42).

కుప్పి. దే. వి. 1. అవాక్పుష్పి *: చూ, సదాప; 2. పింగాణిచిప్ప: చూ, పాత్రము. 6; 3.గాజుగిన్నె: చూ, పాత్రము. 6. (రూ-కుప్పియ-కుప్పె.)

కుప్పించు వై. అ. క్రి. = గుంభ. ఊపిరిపట్టు; రామా. 6, ఆ. 93.

కుప్పింపు. దే. వి. ఉంకింపు: చూ, లంఘు.

కుప్పిగంతుకొను. ద్వ. అ. క్రి. దుముకు; భో, 7, ఆ. 39. చూ, లంఘించు.

కుప్పిగంతులు. ద్వ. వి. బ. బాలక్రీడావిశేషము; వి, పు. 7, ఆ. 202: చూ, బాలక్రీడ.

కుప్పీలు. దే. వి. బ. 1. ఒకానొక బాలికాక్రీడ: చూ, బాలికాక్రీడ; అం. 2. పాదక్రియలలో నొకటి: చూ, పాదక్రియలు.

కుప్పియ. వై. వి= కూపి. రూ- కుప్పె. 1. పింగాణిచిప్ప: చూ, పాత్రము. 6; 2. గాజుగిన్నె: చూ, పాత్రము. 6; 3. గొడుగు మీఁదిగుబ్బ: చూ, గుబ్బ. 2; 4. ఇత్తడి లోనగువానితోఁజేసి యెద్దుకొమ్ముకొనఁదగిల్చెడు గుబ్బ; 5.స్త్రీ శిరోభూషణము: చూ, భూషణము. 2; 6. తాంబూలపాత్రము: చూ.పాత్రము.6 7. జాడి: చూ, భాండము.3; 8. కత్తియొఱయొక్క మొదటకట్టెడిభూష: చూ, అరడా.

కుప్పె. వై. వి. = —వై.— (గాజుగిన్నె.— పా. 2, ఆ. 53; స్త్రీ శిరోభూషణము.— హంస. 1, ఆ. 276;)

కుప్పెంట. దే. వి: చూ, హరితమంజరి*. (పీనస-పిచ్చి తగ్గించును)

కుప్పెకోల. ద్వ. వి. క్షుద్రకము; భార. ద్రో. 3, ఆ. 270: చూ, రిష్టి. 2. (చూ, బాణము.1)

కుప్యము. సం. వి. అ. న. వెండిబంగారుఁదక్క తక్కిన రాగి కంచు మొదలైన లోహము: చూ, లోహము. 1.

కుప్రియుఁడు. సం విశ. జఘన్యజుఁడు: చూ శూద్రుఁడు.

కుబరము. సం. వి. అ. పుం. రూ- కూబరము. పోలుకఱ్ఱ: చూ, యుగంధరము.

కుబుసము. వై. వి. 1. పాముపొర: చూ, నిర్మోకము. 3; 2. అరచేట్టు: చూ, వస్త్రము: 3. తలుపునకుఁ గ్రిందుమీఁదుల నుంచెడు కూవేము: చూ, ఱోలుమాను.

కుబేరకము. సం. వి. అ. పుం. నంది *: చూ, నందివర్ధనము.

కుబేరము. సం. వి. అ. పుం. 1. —పై—; 2. కుంకుమము: చూ, వహ్నిశిఖము.

కుబేరశిఖ. అం. శిఖలు అయిదింటిలో నొకటి: చూ, శిఖలు.

కుబేరాంశము. అం. షష్ట్యంశములలో నొకటి: చూ, షష్ట్యంశములు.

కుబేరాక్షము. సం. వి. అ. పుం. బాలక్రీడా విశేషము; పాండు. 4, ఆ. 134: చూ, బాలక్రీడ.

కుబేరాక్షి. సం. వి. ఈ. స్త్రీ. 1. కలిగొట్టు*: చూ, స్థాలి. 2; 2. తీఁగెకానుగు *: చూ, శాదఘ్నము; 3. గచ్చ *: చూ. సోమరాజి.

కుబేరాచలము. సం. వి. అ. పుం. కైలాసము: చూ, పర్వతము.

కుబేరుఁడు. సం. వి. అ. పుం. 1. నవనిధుల కధిపతి, ధనదుఁడు: చూ, శ్రీదుఁడు; 2. కోమటి: చూ, వైశ్యుఁడు; విణ. 3. కుమ్మరవాఁడు: చూ, మృత్కారుఁడు; అం. 4. దిగధిపతులలో నొకఁడు: చూ, దిగధిపతులు.

కుబ్జ. సం. వి. ఆ. స్త్రీ. 1. పొట్టియావు: చూ, ధేనువు; 2. పటోలి *: చూ, పొట్ల.

కుబ్జకంటకము. సం. వి. అ. పుం. తెల్లతుమ్మ*: చూ, విట్ఖదిరము.

కుబ్జకము. సం. వి. అ. పుం. 1. తినిశము *: చూ, వంజులము. 2; 2. ఒకానొక చెట్టు: చూ, వృక్షము.

కుబ్జపుష్పం. సం. వి. ఆ. స్త్రీ. నల్లతీఁగె *: చూ, తాంబూలవల్లిక.

కుబ్జపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. సప్తల *: చూ, విరజాజి.

కుబ్జము. సం. వి. అ. పుం. 1. గజవిశేషము: చూ, హస్తి; 2. పుష్పవృక్షవిశేషము *: చూ, వృక్షము; 3. ఉత్తరేణి *: చూ, శైఖరికము; 4. ఖడ్గము: చూ. రిష్టి. 2.

కుబ్జిక. సం. వి. ఆ. స్త్రీ. 1. వీణాతంత్రులవలనఁ బుట్టిన స్వరభేదము: చూ, స్వరము. 2; 2. సప్తల *: చూ, విరజాజి; 3. = గొజ్జెంగి: చూ, గొజ్జఁగి.

కుబ్జుఁడు. సం. విణ. = గుజ్జు. మఱుగుజ్జు, గడు లుఁడు: చూ, వామనుఁడు. (ఱొమ్మునగాని వీఁపునగాని కణితిగలవాఁడు.)

కుబ్రము. సం. వి. అ. న. 1. వనము: చూ, విపినము; 2. కుండలము: చూ, భూషణము. 2; 3. తంతువు: చూ, సూత్రము. 1; 4. శరణము: చూ, రక్షణము; 5. బండి: చూ, శకటము. 1.

కుమడియొబ్రాహ్మణులు. పా: చూ, కపూరిజెల్లు బ్రాహ్మణులు.

కుమరము. అం. దేశములు ఏఁబదియాఱింటిలో నొకటి: చూ, దేశము.

కుమార. సం. వి. ఆ. స్త్రీ. కుమారినది: చూ, నది.

కుమారకము. సం. వి. అ. పుం. తిక్తశాకము *: చూ, శ్వేతపుష్పము.

కుమారకుఁడు. సం. వి. అ. పుం. కుమారస్వామి: చూ, స్కందుఁడు.

కుమారజీవము. సం. వి. అ. పుం. అక్షఫలము *: చూ, పుత్రజీవి.

కుమారపాలుఁడు. సం. వి. అ. పుం. శాలివాహనుఁడను రాజు: చూ, రాజు. 1.

కుమారబ్రాహ్మణులు. పా. మైథిలలో నొక తెగ వారు. వీరిలో సామవేదులు కొందఱును శుక్లయజుర్వేదులు కొందఱును కలరు: చూ, బ్రాహ్మణులు. (చూ, మైథిలులు.)

కుమారభృత్య. సం. వి. ఆ. స్త్రీ. గర్భవతిచర్య. (సం. ప):—గర్భిణ్యావేక్షణము. బాలతంత్రము. (త్రికాండశేషము.)

కుమారము. సం. వి. అ. న. 1. చొక్కపు బంగారు: చూ, లోహము. 1; పుం. 2. గుఱ్ఱపుపిల్ల: చూ, హయము; 3. చిలుక: చూ, శుకము; 4. అవురుగడ్డి, వీరణము *: చూ, తృణము. 1; 5. ఊలిమిరి *: చూ, శ్వేతపుష్పము.

కుమారయువు. సం. వి. ఉ. పుం. యువరాజు: చూ, రాజు. 1.

కుమారలలిత (తిలక). పా. ఒకానొక వృత్తము. ఇది ఒక్కొక్క పాదమునకు జగణ సగణ గురువులు గలదై ఏడవ ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా.—"సుమాయుధనిభాంగా, రమాహృదయనాథా, కుమారలలితా వృత్తమొప్పు జసగాప్తిగా.": చూ, వృత్తము. 1.

కుమారవాహిని. సం. వి. న్. పుం. నెమలి: చూ, మయూరము.

కుమారవ్యాకరణము. అం. వ్యాకరణములు తొమ్మిదింటిలో నొకటి: చూ, వ్యాకరణములు.

కుమారసంభవము. అం. 1. ఇది కాళిదాస విరచితము: చూ, కావ్యనాటకములు: 2. కావ్యములయిదింటిలో నొకటి: చూ, కావ్యములు.

కుమారసువు. సం. వి. ఊ. స్త్రీ. 1. గంగ: చూ, నది; 2. గౌరి: చూ, పార్వతి. 1.

కుమారస్వామి. సం. వి. న్. పుం =కొమరుసామి: చూ, స్కందుఁడు.

కుమారారామము. అం. ఆరామము లయిదింటిలో నొకటి: చూ, ఆరామములు.

కుమారి. సం. వి. ఈ. స్త్రీ. 1.=కొమరిత: చూ, పుత్రిక. 1; 2. కన్య, పెండ్లికాని ఎనిమిదేండ్ల పడుచు: చూ, స్త్రీ; 3. దుర్గ: చూ, పార్వతి1; 4 సీతా వి: చూ, సీత; 5. కుమారీనది: చూ, నది; 6. జంబూద్వీపము: చూ, లంక. 1; 7. నల్లపిచ్చుక అఁడు ఊరపిచ్చుక (అని కొందఱు): చూ, పిచ్చుక; 8. కలబంద *: చూ, కలబంద; 9. చేమంతి *: చూ, సేమంతి; 10. పిన్నగోరంట *: చూ, మహాసహ; 11. సప్తల *: చూ, విరజాజి.

కుమారిక. సం. వి. ఆ. స్త్రీ. 1. బొండుమల్లె *: చూ, వృత్తమల్లిక; 2.= కూఁతురు: చూ, పుత్రిక. 1; 3. కుమారికాతీర్థము.

కుమారిత. వై. వి.=కుమారి: చూ, పుత్రిక. 1.

కుమారిలు. దే. అ. క్రి. కుములు; పా. 1;అ.114: చూ, పాపులు.

కుమారుఁడు. సం. వి. అ. పుం. 1 = కొమరుసామి. రూ- కుమారస్వామి: చూ, స్కందుఁడు; 2.= కొమరుఁడు, కొడుకు: చూ, పుత్రుఁడు. 1; 3. బాలుఁడు. (ఎనిమిదేండ్లలోపు బాలుఁడు): చూ, శిశువు: 4. (నాటకోక్తియందు) యువరాజు: చూ, రాజు.1; 5. ప్రెగడ: చూ, మంత్రి. 1; 6. గుఱ్ఱమును రక్షించెడివాఁడు: చూ, అశ్వపాలకుఁడు; 7. పూర్వజైనవిశేషము: చూ, బుద్ధుఁడు. 1.

కుమారోపవాహము. సం. వి. అ. పుం. కోడి: చూ, పుంజు.

కుమాలకము. సం. వి. అ. పుం. సౌవీరదేశము: చూ, దేశము.

కుమి. దే. వి. రూ- కుమ్మి, ఒకరకము పాణక; అం, భా. ద్వి. వై. 240: చూ, పంటసాల.

కుముఖము. సం. వి. అ. పుం. పంది: చూ, సూకరము.

కుముటు. దే. వి. 1. ఓకరకై కంఠబిలమున నెత్తు వికారము: చూ, వాంతి; 2. కాసరోగము: చూ, దగ్గు; అ. క్రి. 3. ఓకరకై కంఠబిలమున వికారమెత్తు. డోకు: చూ, వెడలఁగొట్టు.

కుముత్తు. సం. విణ. ద్. 1. పిసినిగొట్టు: చూ, లోభి; 2. సంతోషము లేనివాఁడు: చూ, కుముదుఁడు.

కుముద. సం. వి. ఆ. స్త్రీ. 1. గుమ్ముడు *: చూ, మహాఫలము; 2. పేఁకు *: చూ, మహాఫలము; 3. ఆఁడుయేనుఁగు: చూ హస్తి; 4. ధాతకి *: చూ, సుభిక్ష; 5. చూ, కాలపర్ణి *.

కుముదక్రియ. అం. క్రియాంగములు పండ్రెండింటిలో నొకటి: చూ, క్రియాంగములు. (చూ, అంగము. 9)

కుముదబాంధవము. సం. వి. అ. పుం. కర్పూరగము: చూ, సిగము.

కుముదబాంధవుఁడు. సం. వి. అ. పుం. కలువవిందు: చూ, చంద్రుఁడు.

కుముదము. సం. వి. అ. న. 1. ఎఱ్ఱతామర*: చూ, పద్మము. 1; 2. రూ- కుముద్వంతము, తెల్లకలువ *: చూ, పద్మము. 1; 3. బ్రహ్మజటయను ఓషధి *: చూ, బ్రహ్మజట; 4. కనుగ్రుడ్డుచుట్టు నుండెడి తెల్లనిభాగము: చూ, నేత్రము. 1; పుం. 5. నైరృతి దిక్కునందలి యేనుఁగు. దిగ్గజము: చూ, హస్తి; 6. కుముదమను పాము: చూ, సర్పము; 7. నిర్జలభూమి: చూ, భూమి. 1; 8. శివుని శంఖము: చూ, శంకు. 1; 9. గాలి: చూ, వాయువు; 10. పీనుఁగు: చూ, శవము.

కుముదవతి. సం. వి. ఈ. స్త్రీ. 1. కుముద్వతీనది: చూ, నది; 2. కలువలగుంపు: చూ, పద్మము. 1.

కుముదవర్ణి. అం. అశ్వశాస్త్రమునందలి అనువర్ణములు పండ్రెండింటిలో నొకటి: చూ, అనువర్ణములు.

కుముదాత్ముఁడు. సం. వి. అ. పుం. ఒకానొక పితృదేవత: చూ, యముఁడు.

కుముదాధారము. సం. వి. అ. పుం. వాయులోకము: చూ, లోకము. 1.

కుముదాయితుఁడు. సం. వి. అ. పుం. వేఁడివేలుపు: చూ, సూర్యుఁడు.

కుముదావాసము. సం. వి. అ. పుం. కుముదప్రాయదేశము: చూ, దేశము.

కుముది. సం. వి. ఈ. స్త్రీ. 1. పినగుమ్ముడు *: చూ, మహాఫలము; 2. పేఁకు*: చూ, మహాఫలము. (కొన్ని నిఘంటువులలో రెంటియందును భేదము గాన్పింపదయ్యె.)

కుముదిక. సం. వి. ఆ. స్త్రీ. — పై. — (=గుమ్ముడు.)

కుముదిని. సం. వి. ఈ. స్త్రీ. 1. తెల్లకలువతీఁగె *: చూ, పద్మము. 1; కుముదములుగల దేశము (అని కొందఱు.); 2. కలువలుండే కొలను: చూ, సరస్సు. 1; 3. కలువలగుంపు: చూ, పద్మము. 1.

కుముదినీపతి. సం. వి. ఇ. పుం. చందురుఁడు: చూ, చంద్రుఁడు.

కుముదుఁడు. సం. వి. అ. పుం. 1. కుముదుఁడను కోఁతి: చూ, వానరము; 2. కుముదుఁడను రక్కసుఁడు: చూ. రాక్షసుఁడు. 1; 3. యముని కొడుకు: చూ, పుత్రుఁడు. 1; 4. సంతసము లేనివాఁడు: చూ, కుముత్తు. 2.

కుముదేశుఁడు. సం. వి. అ. పుం. చందురుఁడు: చూ, చంద్రుఁడు.

కుముద్వంతము. సం. విణ. (త్. ఈ. త్) తెల్లకలువలు తఱచుగాఁ గలది (దేశము): చూ, దేశము.

**కుముద్వతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. రూ-కుముద వతి- కుముదిని. కుముదవతీ నది: చూ, నది; 2. కలువలగుంపు: చూ, పద్మము 1; 3. కలువ లుండు సరస్సు: చూ, సరస్సు. 1; 4. తెల్ల కలువతీగె *: చూ, పద్మము. 1. కుముద ములుగల దేశము (అని కొందఱు ); 5. కుశుని పెండ్లాము: చూ, భార్య. 1; అం. 6. శ్రుతులు ఇరువదిరెండింటిలో నొకటి: చూ, శ్రుతులు.

**కుములు.** దే. అ. క్రి. లోలోపలఁ దపించు, కుమ రిలు: చూ, పొవులు.

**కుమోదకుఁడు.** సం. వి. అ. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు.

**కుమ్మ.** దే. వి. 1. ఉమకనిప్పు: చూ, నిప్పు; 2. నీరుపోసిన నిప్పు: చూ, నిప్పు; 3. జ్వాల లేని నిప్పు: చూ, నిప్పు.

**కుమ్మక్కు.** వా. వి. 1. గూడుపుఠాణి, రహ స్యపు ఆలోచన; 2. దొమ్మి.

**కుమ్మర.** వై. వి. 1 =కుంభకార. కుండలు చేసి జీవించెడు జాతి "కుమ్మరవాఁడు, కుమ్మరది."; 2. నలుపు: చూ, వర్ణము. 6.

**కుమ్మరగువ్వ.** ద్వ. వి. ఖంజరీటము: చూ, పిచ్చుక.

**కుమ్మరచెట్టు.** ద్వ. వి. కుమ్మరపొనిక *: చూ, కృష్ణముంజము.

**కుమ్మరత.** ద్వ. వి. కుమ్మరది. (సం. ప):— కులాలి, కుంభకారి.

**కుమ్మరపురుగు** వై. వి. ఒకానొక పురుగు: చూ, ఘుమకీటము (మూర్ఛలకు, బాలపాపచిహ్న లకు మంచిది.)

**కుమ్మరపొనిక.** ద్వ. వి: చూ, కుమ్మరచెట్టు *.

**కుమ్మరపొలిక.** ద్వ. వి. రూ- —వై.—

**కుమ్మరవాఁడు.** దే. వి. కుమ్మరి: చూ, మృత్క రుఁడు.

**కుమ్మరసారె.** దే. వి కులాలచక్రము.

**కుమ్మరసారెచుక్క.** ద్వ. వి. విశాఖ: చూ, నక్షత్రము. 1.

**కుమ్మరసారెలు.** దే. వి. బాలక్రీడా విశేషము: చూ, బాలక్రీడ.

**కుమ్మరి.** వై. వి. (కుమ్మర + ఇ) కుమ్మరవాఁడు: చూ, మృత్కరుఁడు.

**కుమ్మరించు.** దే. ప్రే. కుమ్మరిలఁజేయు.

**కుమ్మరింపు.** దే. వి. మల్లశాస్త్రములోని విన్నా ణములు ముప్పదిరెండింటిలో నొకటి: అం, భా. ద్వి. ఖ. 209: చూ, విన్నాణములు.

**కుమ్మరిలు.** దే. అ. క్రి. 1. నీళ్లు లోనగునవి కుండలోనగువానియందుండి పడు; 2. డొల్లు; హరి. పూ. 5, ఆ. 150: చూ, రాలు.

**కుమ్మి.** దే. వి: చూ, రూ-కుమి; పాండు. 4, ఆ. 149.

**కుమ్ము.** వై. స. క్రి. 1. పొట్టునిప్పు. కుకూలము: చూ, నిప్పు; స. క్రి. 2. నలియఁగొట్టు; 3. రూ-క్రుమ్ము: చూ, పొడుచు; వా. వి. 4. జగడము; "కొంపలోకుమ్ము పెట్టినవాఁడు"

**కుమ్ముదిగుడుచు.** వా. స. క్రి. మంటినికుమ్మి దిమ్మిసతో అణఁగగొట్టు.

**కుమ్ముసుద్ది.** ద్వ. వి. సంకేత వృత్తాంతము: చూ, సమాచారము. 2.

**కుమ్మె.** దే. వి. క్రుమ్ముడు; సా. 2, ఆ. 230: చూ, పోటు. 4.

**కుమ్మెబ్రాహ్మణులు.** పా. శైవబ్రాహ్మణుల లోని కర్ణాటకులలో నొకతెగవారు: చూ, బ్రాహ్మణులు.

**కుమ్మెలువోవు** దే. అ. క్రి గాయమగు; శశాం. 4, ఆ. 169.

**కుయి.** దే. వి. (రూ-కుయ్యి- కూఁక- కూఁత- కూయి.) 1. మొఱ; ఆము. 2, ఆ. 48: చూ, స్వరము. 2; 2. కావలి; రుక్మాం.2, ఆ. 101: చూ, రక్షణము.

**కుయ్యి.** దే. వి. —వై.—(మొఱ —భాగ. 1, ఆ. 280.) (కుంయి అని ఉచ్చారణ)

కురంకరము. సం. వి. అ. పుం. బెగ్గురు: చూ, సారసము.

కురంకురము. సం. వి. అ. పుం. మగబెగ్గురు, పుష్కరము; (హారావళి): చూ, సారసము.

కురంగనయన. సం. వి. ఆ. స్త్రీ. లేడికన్నుల వంటి కన్నులుగల యాఁడుది: చూ, స్త్రీ; 2. అతివ: చూ. స్త్రీ.

కురంగనాభి. సం. వి. ఇ. పుం. కస్తూరి: చూ, మృగమదము.

కురంగపాణి. సం. వి. ఇ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

కురంగమము. సం. వి. అ. పుం. 1. జింక: చూ, హరిణము. 1; 2. హరిణభేదము: చూ, హరిణము. 1.

కురంగము. సం. వి. అ. పుం. 1-2 —పై.—; 3. కోఁతి: చూ, వానరము.

కురంగిక. సం. వి. ఆ. స్త్రీ. ముద్గపర్ణి *: చూ, పెసర.

కురంజి. అం. స్త్రీ రాగములు ఇరువదినాలుగింటి లో నొకటి: చూ, స్త్రీ రాగములు.

కురంజీసోమము. వా. వి. ఓమము *: చూ, కురాసాని యోమము.

కురంటు. దే. వి. దగ్గఱ: చూ, సమీపము. 1.

కురంటక. సం. వి. ఆ. స్త్రీ. తుమ్మి *: చూ, తుమికి.

కురంటకము. సం. వి. అ. పుం. 1. = గోరంట. పచ్చగోరంట *: చూ, మహాసహ; (పచ్చ పువ్వుల ములుగోరంట, పచ్చపువ్వుల పెద్దగోరంట అని కొందఱు) 2. పచ్చచేమంతి *: చూ, సేమంతి.

కురంటి. సం. వి. ఈ. స్త్రీ. 1. కొయ్యబొమ్మ: చూ, సాలభంజిక; ఇ పుం. 2. పచ్చపూవుల ములుగోరంట *: చూ, మహాసహ.

కురండకము. సం. వి. అ. పుం: చూ, కురంటక *.

కురండనాళి. సం. వి. న్. పుం. కార్పాసము *: చూ, ప్రత్తి.

కురండనాళిని. సం. వి. ఈ. స్త్రీ—పై.—

కురండము. సం. వి. అ. పుం. బుడ్డ: చూ, వట్టవాఁపు.

కురక. సం. వి. ఆ. స్త్రీ. అంగుగు *: చూ, సల్లకి.

కురకటము. సం. వి. అ. న. = గుంగుగుకూర *: చూ, హస్తిని.

కురకము. సం. వి. అ. పుం. ఎఱ్ఱనిముక్కును కాళ్ళునుగల పెన్నడపులుఁగు: చూ, పెన్నడపులుఁగు.

కురచిల్లము. సం. వి. అ. పుం. ఎండ్రికాయ: చూ, పీత.

కురటుఁడు. సం. వి. అ. పుం. చర్మకారుఁడు: చూ, మాదిగ.

కురపము. సం. వి. అ. పుం.=కోడపము. గుజ్జము దోమెడుఁ గోడపము: చూ. కోడపము.

కురము. దే. వి. పశువులకుఁగలిగెడు శీతరోగము, మనుష్యులకుఁ గలిగెడు శీతరోగము (అని కొందఱు): చూ, రోగము. 1. (చూ, రొంప)

కురరము. సం. వి. అ. పుం. 1. ఉత్క్రోశము: చూ, పెన్నడపులుఁగు; 2. టిట్టిభము: చూ, లకుముకి; 3. గోరువంక: చూ, శారిక. 1.

కురరి. సం. వి. ఈ. స్త్రీ. 1.=కురుమ, ఆఁడు గొఱ్ఱె: చూ, మేషము. 1;2. ఆఁడులకుముకి: చూ, లకుముకి.

కురలబ్రాహ్మణులు. పా. పంచగౌడులలోని సరస్వతులలో మొదటి తెగవారు: చూ, కవూరియె బ్రాహ్మణులు. (చూ, బ్రాహ్మణులు)

కురలము. సం. వి. అ. పుం. 1. నుదుట చలించే ముంగురులు: చూ, వెండ్రుక. 1; 2. కురరము: చూ, లకుముకి.

కురవ. దే. వి. కొండదారి. రూ- కురువ: చూ, మార్గము. 1.

కురవకత్తులు(గు. దే. వి. ఖంజనము, మంద పిచ్చుక: చూ, పిచ్చుక.

కురవకము. సం. వి. అ. పుం. 1. ఎఱ్ఱగోరంట*; (దీనికి దోహదక్రియ ఆలింగనము): చూ, మహాసహా; 2. ఎఱ్ఱచేమంతి*: చూ, సేమంతి (ఎఱ్ఱపువ్వుల పెద్దగోరంట, ఎఱ్ఱపువ్వులములు గోరంటఅని కొందఱు); 3. అహిచ్ఛత్రము*: చూ, పుట్టగొడుగు; 2 వసంతకడిమి *: చూ, నీపము.

కురవము. సం. వి. అ. పుం. 1. తిలకము*: చూ, నువ్వులు; 2. కుత్సితపుధ్వని: చూ, స్వరము. 2.

కురస. సం. వి. అ. స్త్రీ. ఎద్దునాలిక *: చూ, గోజిహ్వ.

కురసము. సం. వి అ. పుం. మద్యభేదము: చూ, సుర. 1.

కురళము. అం. గమకములు పదునైదింటిలో నొకటి: చూ, గమకములు.

కురాళము. దే. వి. 1. అశ్వాద్యాచ్ఛాదనవస్త్రము: చూ, వస్త్రము; 2. కాయమాన విశేషము: చేపారము- రూ- చేప్పరము- చేపరము.

కురాసాని. దే. వి. కురసాన్నదేశము: చూ, దేశము.

కురాసానియోమము. దే. వి. ఓమము *: చూ, యవాని. (నరముల బలహీనతను పోఁగొట్టును)

కురి. సం. వి. ఈ. స్త్రీ. తృణధాన్యము : చూ, ధాన్యము

కురిచీ. దే. వి. రూ- కుర్చీ; రసి. 1, చూ అ.61:, పీఁట.

కురిడి. దే. వి. లోపలనీరింకినకొబ్బెర: చూ, కొబ్బెర. (రూ- కురిడీ- కుర్డి)

కురిడీ. దే. వి —పై.—

కురిమిడి. దే. వి. మడిచుట్టువేసిన కట్ట, గనిమ: చూ, సేతువు. 1.

కురిమిడిగట్టు. దే. వి. —పై.—

కురియు. దే. స. క్రి. 1. గుప్పించు. తొలుకు, వానకురియు: చూ, వర్షించు; అం. ప్రే 2. కురియించు; హరి. పూ. 4, అ. 161.

కురీరము. సం. వి. అ. న. మైథునము: చూ, సంయోగము.

కురు. దే. వి. తొడ: చూ, సక్థి.

కురుంబ. సం. వి. అ స్త్రీ. ఏనుఁగు తుమ్మి *: చూ, తుమికి.

కురుంబము. సం. వి. అ. పుం. 1. గుంపు: చూ, సమూహము; 2. చేఁపలవల: చూ, వల. 1.

కురుంబి. సం. వి. ఈ. స్త్రీ. సింహపిప్పలి *: చూ, సైంహలి.

కురుంబిక. సం. వి. అ. స్త్రీ: చూ, కురుంబ.

కురుజు. దే. వి. 1. దూలముమీఁది గుజ్జు: చూ, గుజ్జు. 5; 2.మంచియ; విజ 2 అ. 89: చూ, మంచె; 3. పొట్టివాఁడు: చూ, వామనుఁడు.

కురుక. దే. వి. నిద్ర: చూ, స్వప్నము. 2. (రూ- కురుకు- కూరుకు- కూరుకుపాటు- కూర్కు- కూర్కుపాటు- గురుక- గుఱక)

కురుకందకము. సం. వి. అ. న. మూలకము *: చూ, ముల్లంగి.

కురుకము. సం. వి. అ. పుం. చెముడుకాకి: చూ, వాయసము. 1.

కురుకుంచిత. సం. వి. అ. స్త్రీ. బంధుమిత్ర సంభావణము: చూ, వ్యాఖ్యాతము. 2.

కురుక్షేత్రము. సం వి. అ. పుం. 1. ఏఁబదియాఱు దేశములలో నొకటి, వినశనము: చూ, దేశము. (చూ, కురువు. 3.); 2 కౌరవులదేశము: చూ, దేశము.

కురుచి. దే. వి. చిన్నకంట్లము.

కురుజా. దే. వి. 1. ఒకానొక డేగ: చూ, శ్యేనము; 2 ఈఁకలురాల్చినపక్షి, అణుజా: చూ. గూఁటిగువ్వ; (చూ. పక్షి); 3. గోనెకొట్టు:

మధుపు. ౬; 4. బాణపుపంచమవక; హాంస 3. ఆ. 29: చూ, బాణసంచు.

**కురుజాతేనె.** దే. వి ఒకరకముతేనె : చూ. మధుపు. 5.

**కురుటకము.** సం. వి. అ. పుం. గురుగు *: చూ, హాస్తిని.

**కురుకుబ్రాహ్మణులు.** పా. పంచగౌడులలోని సారస్వతులలో రెండవ తెగవారు: చూ, ఆచార్య అను బ్రాహ్మణులు. (అమ్చిలు అను బంధములో చూడుము)

**కురుప.** దే. వి గొల్లతుర్పున్నాటు కంబళినేయు గొల్ల: చూ. మేకలకాపరి.

**కురుపగొల్ల.** ద్వ. వి. దేహముందు నిసుపు బొమ్మలగల గొల్ల: చూ, దేహము. 1.

**కురుపిల్లము.** సం. వి. అ. పుం. ఎండ్రికాయ. చూ, సీత.

**కురుపు.** దే. వి: చూ, రూ- కురుపు.

**కురుబిల్వకము.** సం. వి. అ. పుం. 1. ఒకరకము వడ్లు: చూ, ధాన్యము; 2. ఆడవిపురులవలు: చూ, సగటి.

**కురుబిల్వము.** సం. వి. అ. పుం. పద్మరాగమణి: చూ, రత్నము. 1.

**కురుబిస్తము.** సం. వి. అ. పుం. పలమెత్తుబంగారము రూ- కురువిస్తము: చూ, లోహము 1.

**కురుమ.** దే. వి. గొల్లతుర్పున్నాటు, కంబళినేయు గొల్లజాతి.

**కురుమగొల్ల.** దే. వి: చూ, కురుపగొల్ల.

**కురుమవాడు.** దే. వి: చూ, కురుప.

**కురుమాడు.** దే. వి ఇంటిపార్శ్వభాగముల కప్పు: రూ- కురుమాడు.

**కురుమాపు.** దే. వి. కొంచెపుమాపు.

**కురుమిండ.** దే. వి. క్షుద్రజలచరము : చూ, మత్స్యము. 1.

**కురురాజు.** సం. వి. అ. జ్. పుం. దుర్యోధనుడు: చూ, రాజు. 1.

**కురుల.** వై. వి = కురళ-కురుళ. 1. ముంగురులు. భార. విరా. 2, ఆ. 156; కళా. 1, ఆ. 26: చూ, వెండ్రుక. 1; 2. కేశము. య. 4, ఆ. 89: చూ, వెండ్రుక. 1.

**కురువ.** దే. వి కొండమీది కాలిత్రోవ. రూ- కురవ: చూ, మార్గము. 1.

**కురువడ్లు.** దే. వి. ఒకరకమువడ్లు : చూ, ధాన్యము.

**కురువర్షము.** అం. వర్షములు తొమ్మిదింటిలో నొకటి: చూ, వర్షములు.

**కురువిందము.** సం వి. అ. పుం 1. నుటించిన కోయిల కండ్లవంటి రొమ్జునికెంపు. (ఇది కాలపు రమునందు పుట్టినది. పసుపుదాళు కలది. మధ్యమజాతిరత్నము): చూ, రత్నము. 1. (చూ, మాణిక్యము); 2. మాణిక్యము: చూ, రత్నము. 1; 3. అద్దము: చూ, ముకురము; 4. ఇంగిలికము: చూ, హింగుళము; 5. నిడుముస్తె *: చూ, తృణము. 1; 6. వ్రీహివిశేషము: చూ, ధాన్యము; 7. మాషము: చూ, మినుము; న. 8. కాచలవణము: చూ, లవణము. 1.

**కురుశిల్లము.** సం. వి అ. పుం. పద్మరాగమణి: చూ, రత్నము. 1.

**కురువిస్తము.** సం. వి. అ. పుం: చూ, రూ- కురుబిస్తము.

**కురువు.** అం. 1. భారతవర్షములు తొమ్మిదింటిలో నొకటి: చూ, వర్షములు; 2. ఏబదియారు దేశములలో నొకటి, కురుక్షేత్రము: చూ, దేశము; సం. వి. ఉ. న. 3. దుర్యోధనుడు: చూ, కురురాజు; 4. అన్నము: చూ, సాదము. (1); 5. కరంట కారిక *: చూ, వాదకుడు.

కురువేరు. ద్వ. వి. (కురులు + వేరు) రూ- కుఱువేఱు*: చూ, హ్రీబేరము. (చలువచేయును)

కురువేరుదంటనారి. ద్వ. వి. మన్మథుని నాలవ వింటియొక్క నారి. వేంక. ఆం. 9: చూ, మౌర్వి. 1.

కురుళము. సం. వి. అ. పుం. ముంగురులు. (వైజయంతి నిఘంటువు): చూ, వెండ్రుక. 1.

కురూపి. సం. విణ.= కుడిపి. వికారస్వరూపము గలది: అనాకారి, కుడిపి.

కురూప్యము. సం. వి. అ. న. రంగము: చూ, లోహము. 1.

కుర్కురము. సం. వి. అ. న. 1. స్థౌణేయమను గ్రంథ్యము, గండివనము: చూ, రాజార్హము; పుం. 2, కుక్క: చూ, శునకము.

కుర్చిక. సం. వి. ఆ. స్త్రీ. సూచి: చూ, సూది.

కుర్చీ. దే. వి: చూ, రూ- కురిచీ.

కుర్ణజము. సం. వి. అ. పుం. కులంజనము*: చూ, కులంజము.

కుర్దనము. సం. వి. అ. న. కందుకాదిక్రీడ: చూ పరిహాసము. (రూ- కూర్దనము - కర్దనము - ఖుర్దనము)

కుర్పరము. సం. వి. అ. పుం. రూ - కూర్పరము: చూ, మోఁచెయి.

కుర్పాసకము. సం. వి. అ. పుం, న. 1. అరచట్ట, రూ- కుర్పాసము: చూ, వస్త్రము; 2. ఱవిక: చూ, వస్త్రము.

కుర్పాసము. సం. వి. అ. పుం. —పై.—

కుర్వంతుఁడు. సం. విణ. భృత్యుఁడు: చూ, సేవకుఁడు.

కుర్వాణుఁడు. సం. వి. అ. పుం. 1. —పై.—; 2. పనివాఁడు: చూ, సమర్థుఁడు; విణ. 3. చేయువాఁడు, చేయించువాఁడు. (అని విశ్వకోశము)

కుఱఁగట. దే. వి. దగ్గఱ: చూ, సమీపము(రూ- కుఱఁగలి-కురంటు)

కుఱఁగలి. దే. వి. —పై.—; జై. 1, ఆ. 57.

కుఱకుఱ. దే. విణ. అల్పము. రామా. 7, ఆ. 42: చూ, స్వల్పము.

కుఱినువ్వులు. దే. వి. బ. ఒకరకముతిలలు. రూ- కుఱునువ్వులు: చూ, నువ్వులు.

కుఱు దే. విణ. వృత్తియందుఁ గుఱుచశబ్దము నకు మీఁదివర్ణములోపింపఁగా మిగిలినరూపము. (ఉదా.— కుఱుగద్దియ, కుఱుగనుపు, కుఱుగతి, కుఱుగేలు, కుఱూమాపు మొ. అచ్చు పరమగుచో ఱకారమునకు టకారద్వయమా దేశంబగు. కుట్టాసగ, కుట్టుముక, కుట్టుసుఱు, కుట్టూపిరి, కుట్టూరుపు మొ.)

కుఱుకు. దే. వి. (ప్రా.వు.) భార. ద్రో. 4, ఆ. 88: చూ, రాశి. 1.

కుఱుగడ. ద్వ. వి. (కుఱుచ + గడ) దండము; జై. 5, ఆ. 20: చూ, వేత్రము. 1.

కుఱుచ. దే. వి. హ్రస్వస్వరము: చూ, స్వరము. 2; 2.=కూర్పాస. పొట్టిచొక్కాయ: చూ. వస్త్రము; 3. పొట్టివాఁడు: చూ, వామనుఁడు; విణ. 4. పొట్టి: చూ, హ్రస్వము. (కొన్నియెడల వృత్తియందంత్యవర్ణలోపము: చూ, కుఱు.)

కుఱుచఁదనము. దే. వి. 1. కుబ్జత్వము: చూ, పొఱడు; 2. వామనత్వము.

కుఱుచపడు. ద్వ. అ. క్రి. తగ్గు: చూ, క్రుక్కు. 9.

కుఱుచేలు. దే. వి. బ. నాట్యవిశేషము. వసు. 5, ఆ. 75: చూ, నృత్యము.

కుఱునువ్వులు. దే. వి. బ: చూ, రూ- కుఱి నువ్వులు.

కుఱుపు. దే. వి. రూ- కురుపు: చూ, వ్రణము.

కుఱుమట్టము. దే. విణ. మిక్కిలి వంగినది, వినతము, వినమ్రము. భాగ. 8, స్కం. 538: చూ, వేల్లితము. 2.

కుఱుమాడు. దే. వి: చూ, రూ- కురుమాడు.

కుఱువు. దే. వి. తొడ; పాండు. 5 ఆ. 186: చూ, సక్థి.

కుఱువేరు. ద్వ. వి: చూ, రూ-కురువేరు *.

కుఱ్ఱ. దే. వి.1. కొడుకు. అచ్చ. బాల,కాం. 25: చూ, పుత్త్రుడు. 1; 2. బిడ్డడు: చూ. శిశువు; 3. బాలుడు. భాగ. 7, స్కం.870: చూ, శిశువు; 4. కోడె,ఎనుపోతు: చూ, మహిషము.

కుఱ్ఱడు. దే.వి: చూ.రూ-కుఱ్ఱ.1-2-3 (బిడ్డడు.- పర. 1, ఆ. 189.)

కుఱ్ఱి. దే. వి. పాడియావు. భార.ఆది.7,ఆ.102: చూ, ధేనువు.

కుఱ్ఱు. దే. అ. క్రి. కూయు: చూ, శబ్దించు.

కులంజనము. సం. వి. అ. పుం: చూ కుర్జము*.

కులంజము. సం. వి. అ. పుం. —పై.—

కులంభరుడు. సం. వి. అ. పుం. చోరుడు: చూ, ముచ్చు. 1.

కులకము. సం. వి. అ. న. 1. ఒక క్రియతో ముగియుపద్యములసమూహము.రూ-కుళకము 2. కోతిపొట్ల *:చూ, పొట్ల; పుం. 3. పుట్ట చూ, వల్మీకము; 4. కాకితుమ్మిక *: చూ, తుమికి; 5. నాకము:చూ, స్వర్గము; 6. హరిత సర్పము: చూ, సర్పము; 7. రూ-కులుకము. నాలుకపై పాచి:చూ, రసనామలము.

కులకర్కటి. సం.వి ఈ. స్త్రీ. చీనాకర్కటి*: చూ, దోస.

కులకుడు. సం. విశే. 1. మేదరవాడు: చూ, మేదరి; 2. శిల్పికులప్రధానుడు: చూ, [illegible] కారుడు; 3. కులమునకుపెద్దవాడు: రూ- కులికుడు.

కులకుల. దే. వి. ఒకానొక ధ్వన్యనుకరణము: చూ, హుళాహుళా.

కులక్కము. సం. వి. అ. పుం. కరతాళి: చూ, స్వరము. 2.

కులత్థయ. సం. వి. ఆ. స్త్రీ. దూలగొండి *: చూ, కూశకించి.

కులఘ్నాంశము. అం. వష్ట్యంశములలోనొకటి: చూ, వష్ట్యంశములు.

కులచూడామణి. అం. శివప్రోక్తములగు చతు ష్షష్టితంత్రములలో నొకటి: చూ, తంత్రములు.

కులజుడు. సం. వి. అ. పుం. కులీనుడు: చూ, సజ్జనుడు.

కులట. సం. వి. ఆ. స్త్రీ. 1. అంకుటాలు: చూ, అంకులాడి; 2. భిక్షమెత్తుకొనెడి పతివ్రత: చూ, స్త్రీ; 3. నేలయుసిరిక * : చూ, భూమ్యాలకి.

కులటి. సం. వి. ఈ. స్త్రీ. మణిసిల: చూ,రాయి.

కులత్థ. సం. వి. ఆ. స్త్రీ. అడవి యులవలు : చూ, సరటి.

కులత్థము. సం. వి. అ. పుం. రూ- కులుత్థము. ఉలవలు : చూ, సరటి.

కులత్థిక. సం వి. ఆ. స్త్రీ. 1: చూ. కులత్థ; 2 కుళుత్థాంజనము: చూ, రసాంజనము.

కులదేవత. సం. వి. అ. పుం. ఇలువేలుపు: చూ, గృహదేవత.

కులధర్మములు. అం. ధర్మశాస్త్రములోని ధర్మ ములు అయిదింటిలో నొకటి: చూ. ధర్మ ములు.

కులధారకుడు. సం. వి. అ. పుం. రూ- కులా ధారకుడు. కొడుకు: చూ, పుత్త్రుడు. 1.

కులనాశము. సం. వి. అ. పుం. ఒంటె: చూ, లొట్టిపిట్ట.

కులపతి. సం. వి, ఇ. పుం. 1. కులస్వామి; 2. గోత్రప్రధానుడు; 3. కులనాథుడు. (ఇట్లు కులేశ్వరుడు)

కులపర్ణ. సం. వి. ఆ. స్త్రీ. కాకనాశిక *: చూ, దొండ.

కులపర్వతము. సం. వి. అ. పుం. ప్రధానపర్వతము: చూ, పర్వతము.

కులపర్వతములు అం. హిమవంతము, వింధ్యము, నిషధము, మాల్యవంతము. పారియాత్రము, గంధమాదనము, హేమకూటము. (7) (చూ, పర్వతము)

కులపాలకము. సం. వి. అ. న. చేపలవల: చూ, వల. 1.

కులపాలిక. సం. వి. ఆ. స్త్రీ. 1. తల్లిదండ్రులచే నిచ్చి పెండ్లిచేయఁబడిన స్త్రీ: చూ, స్త్రీ; 2. వ్యభిచారముచేయక తనకులమును మానమును కాపాడుకొను స్త్రీ: చూ, స్త్రీ; 3. బిడ్డలుగల స్వజాతిపెండ్లాము: చూ, భార్య.

కులమదము అం. 1. మదములు ఎనిమిదింటిలో నొకటి: చూ, మదములు; 2. మదములు మూఁడింటిలో నొకటి: చూ, మదములు.

కులమిత్రుఁడు. పా. వైశ్యుఁడు శూద్రస్త్రీని వివాహము చేసికొనినయెడల ఆ స్త్రీయందు పుట్టినవాఁడు కులమిత్రుఁడనంబడును.

కులము. సం. వి. అ. న. 1.= కొలము. వంశము: చూ, వంగడము. "బ్రాహ్మణకులము."; 2. (సంతతియొక్క మూలపురుషుని తెలుపునది) గోత్రము: చూ, వంశము, 3; 3 కొలను: చూ, సరస్సు. 1; 4. ఇల్లు: చూ, సదనము 1; 5. రేఁగుపండు: చూ, రేఁగు; 6. తెగ: చూ, సమూహము; 7. ఒడలు: చూ, శరీరము. (సామాన్యదేహములలో నొకటిఅని త్రికాండశేషము); 8. ఊరు: చూ, దేశము; 9. తళ్లోలపుట్టు *: చూ, వైజయంతి; 10. చేఁతిపాట్లు: చూ, పాట్లు; అం. 11. పాశములు తొమ్మిదింటిలో నొకటి: చూ, పాశములు.

కులమువారు. అం. 1. అకృతసాక్షులు అయిుగురిలో నొకరు: చూ, అకృతసాక్షులు; 2. సాక్షులు పదునొకండుగురిలో నొకరు: చూ, సాక్షులు.

కులవలము. సం. వి. అ. న. కలిలము: చూ, రేతస్సు. 1.

కులశేఖరాళ్వారు. అం. ఆళ్వారులు పండ్రెండుగురిలో నొకరు: చూ, ఆళ్వారులు.

కులశ్రేష్ఠి. సం. వి. న్. పుం. 1. మేదరివాఁడు: చూ, మేదరి; 2. శిల్పికులప్రధానుఁడు: చూ, స్వర్ణకారుఁడు.

కులశ్రేష్ఠుఁడు. సం. వి. అ. పుం —పై.—

కులసంభవుఁడు. సం. విణ. బీజ్యుఁడు. మంచి వంశమునందుఁ బుట్టినవాఁడు: చూ, సజ్జనుఁడు.

కులసము. సం. వి. అ. పుం. గొప్పబట్ట: చూ, వస్త్రము

కులసారము. అం. శివప్రోక్తములగు చతుష్షష్టి తంత్రములలో నొకటి: చూ, తంత్రములు.

కులసౌరభము. సం. వి. అ. న. ఇంద్ర *: చూ, మరువము.

కులస్త్రీ. సం. వి. ఈ. స్త్రీ: చూ, కులపాలిక.

కులహాండకము. సం. వి. అ. పుం 1. నీళ్ళసుడి: చూ, సుడి 1; 2. ఆరణి: చూ, సుడి. 1.

కులాంకురుఁడు. సం. వి. అ పుం. గ్రామ దేవత: చూ. మూలదేవుఁడు.

కులాచలము. సం. వి. అ. పుం. కులాద్రి: చూ, పర్వతము.

కులాటము. సం. వి. అ పుం. క్షుద్రమత్స్యభేదము: చూ, మత్స్యము. 1.

కులాధారకుఁడు. సం. వి. అ. పుం. కొడుకు: చూ, పుత్రుఁడు 1.

కులాయము. సం. వి. అ. పుం. 1. = గూఁడు. నీడము, పిట్టగూఁడు: చూ, సదనము. 1; 2. చోటు: చూ. స్థానము. 1; 3. ఒడలు: చూ, శరీరము.

కులాయస్థము. సం. వి. అ. పుం. పిట్ట: చూ, పక్షి.

కులాయిక. సం. వి. ఆ. స్త్రీ. పిట్టగూఁడు: చూ, సదనము. 1.

కులాలకీటన్యాయము. పా. కుమ్మరపురుగు మంటిలోఁ దూరముండినను పుట్టి యంటుకొనునరీతి.

కులాలము. సం. వి. అ. పుం. 1. గంపపులుఁగు: చూ, బెళగువ్వ; 2. అడవికోడి: చూ, పుంజు; న. 3. చెట్టుతొఱ్ఱ: చూ, రంధ్రము. 1; పుం. 4. ఉముకనిప్పు: చూ, నిప్పు; 5. ఏఱుమద్ది*: చూ, మద్ది; 6. గుగ్గులువు *: చూ, మహిసాక్షి.

కులాలి. సం. వి. ఈ. స్త్రీ. 1. అడవియులవలు: చూ, సరటి; 2. కనుపాలవిత్తులు, కుళుత్థాంజనము: చూ, గసాంజనము; 3. కుమ్మరది: చూ, కుమ్మరిత.

కులాలుఁడు. సం. వి. అ. పుం. కుమ్మరవాఁడు: చూ, మృత్కారుఁడు.

కులాహకము. సం. వి. అ. పుం. 1. తొండ: చూ, సరటము: 2. ఒకరకముచెట్టు: చూ, వృక్షము.

కులాహము. సం. వి. అ. పుం. ఇంచుక పసుపు రంగు: చూ, వర్ణము. 6.

కులాహలము. సం. వి. అ. పుం. క్షుద్రవృక్షవిశేషము: చూ, వృక్షము.

కులి. సం. వి. ఇ. పుం. 1. = కేలు. చేయి: చూ హస్తము; ఈ. స్త్రీ. 2. అప్పశి *: చూ, వాఁకుడు*; 3. పత్ని: చూ, భార్య; 4. జ్యేష్ఠభగిని: చూ, జ్యేష్ఠ 4; న్. పుం. 5. కోవిదారము*: చూ యొక్క పత్రికము; 6. తమ్ముఁడు పెండ్లియాడినవాఁడైయుండఁగా పెండ్లిలేని పెద్దవాఁడు.

కులింగకము. సం. వి. అ. పుం. ఊరపిచ్చుక: చూ, పిచ్చుక.

కులింగదష్ట్రిక. సం. వి. క. స్త్రీ. గచ్చ*: చూ, సోమరాజి.

కులింగము. సం. వి. అ. పుం. 1. చటకము: చూ, పిచ్చుక; 2. కాకి: చూ, వాయసము.

కులింగి. సం. వి. ఈ. స్త్రీ. కర్కాటకశృంగి*: చూ, శృంగి.

కులికము. సం. వి. అ. పుం. 1. కులికమనుపాము: చూ, సర్పము; 2. ఒకానొకచెట్టు: చూ, వృక్షము.

కులికుఁడు. సం. వి. అ. 1. పేదరివాఁడు: చూ, పేదరి; 2. కులసత్తముఁడు: చూ, సజ్జనుఁడు; 3 శిల్పికులప్రధానుఁడు: చూ, స్వర్ణకారుఁడు; 4: చూ, కులకుఁడు. 3.

కులిపి. దే. వి. మేఁకలుకాచు వాఁడు: చూ, మేఁకలఁగాపరి.

కులిగము. సం. వి. అ. పుం. ఎండ్రకాయ: చూ, పీత.

కులిశనాయకము. సం. వి. అ. పుం. శృంగారబంధవిశేషము: చూ, రతిబంధము.

కులిశము. సం. వి. అ. పుం, న. 1. వజ్రాయుధము: చూ, బాణము. 1; పుం. 2. కులిశమను చేఁప: చూ, మత్స్యము. 1; 3. వజ్రము: చూ, రత్నము. 1.

కులిశాంకుశ. సం. వి. అ. స్త్రీ. బౌద్ధవిద్యాదేవీవిశేషము: చూ, బుద్ధుఁడు. 1

కులిశాసనుఁడు. సం. వి. అ. పుం శాక్యముని: చూ, ముని.1.

కులీనకము. సం. వి. అ. పుం. వనముద్గము*: చూ, పెసర.

కులీనత. సం. వి. అ. స్త్రీ. మంచికులమునఁ బుట్టుట. (తె. ప.):— ఇలుకడి-రూ-ఇల్వడి.

కులీనసము. సం. వి. అ. న. జలము: చూ. నీరు 1.

కులీనుఁడు. సం. వి. అ. పుం. మంచికులమునఁ బుట్టినవాఁడు: చూ, సజ్జనుఁడు.

కులీరము. సం. వి. అ. పుం. 1. ఒకానొకచేఁప: చూ, మత్స్యము. 1; 2. ఎండ్రకాయ: చూ, పీత; 3. అలంతము: చూ, పెలంపుచెంత.

కులీరశృంగి. సం. వి. ఈ. స్త్రీ. కులుంగి*: చూ, శృంగి.

కులీశము. సం. వి. అ. పుం. కులిశమను చేఁప: చూ, మత్స్యము. 1

కులుంగి. సం. వి. ఈ. స్త్రీ. కర్కాటకశృంగి*: చూ, శృంగి.

కులుఁడు. సం. వి. అ. పుం: చూ, కులికుఁడు.

కులుకము. సం. వి. అ. న. రూ- కులకము, నాలుకముఱికి: చూ, రసనామలము.

కులుకు. దే. వి. 1. శృంగారపుకుదిలిక. అం, భా. ప్రి. 130; "కులుకులాఁడి." పొ: చూ, విహాసము; 2. వణఁకుట; పర. 4, ఆ. 101: చూ, లోలము; అం. ప్రే. 3. కుదిలించు. య. 4, ఆ. 25; అ. కి. 4. శృంగారముగ కుదులు: చూ, సలించు; స కి. 5. అలఁచు. హన. 1, ఆ. 10: చూ, పూయు; 6. ఒలుకు. కాశీ. 3, ఆ. 118: చూ, పోయు; 7. చేల్లు. పర. 4, ఆ. 227: చూ, పెదచేల్లు; 8. వేయు. సా. 2, ఆ. 54: చూ, విసరు. 8.

కులుకులాఁడి. దే. వి. (కులుకులు + ఆఁడి) కులుకుగల స్త్రీ: చూ, స్త్రీ.

కులుక్కగుంజ. సం. వి. ఆ. స్త్రీ. ఉలాగ్ని: చూ, తోఁకచుక్క.

కులుత్థము. సం. వి. అ. పుం. రూ- కుళుత్థము: చూ, సరటి.

కులుత్థిక. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉలవ *: చూ, సరటి; 2. కులుత్థాంజనము: చూ, రసాంజనము. (రూ- కుళుత్థిక.)

కులుప. దే. వి. ఉలుపడ: చూ, శోఫ.

కులుపుటాయి. దే. వి. రాజావర్తపుటాయి: చూ, రత్నము. 1.

కులోడ్డీశము. అం. శివప్రోక్తములగు చతుష్షష్టి తంత్రములలో నొకటి: చూ, తంత్రములు.

కుల్మలము. సం. వి. అ. న. దోషము: చూ, పాపము. 1.

కుల్మాభిషుతము. సం. వి. అ. పుం. పులియఁబెట్టిన కడుగునీరు: చూ, శుక్తము. 1. (కుల్మాషము-అభిషుతము అని రెండు పేళ్లుగా కొందఱు)

కుల్మాషము. సం. వి. అ. న.= రూ- కుల్మాసము. 1. —పై—; పుం. 2. కాఱుమినుములు: చూ, మినుము; (గోధూమవిశేషమని శబ్దరత్నాకరము.); 3. అలచేందలు: చూ, రాజమాషము; 4. కురువిందము, మదించిన కోయిల కండ్లవంటి యెఱ్ఱనికెంపు: చూ, రత్నము 1; 5. ఓవరధాన్యము: చూ, ధాన్యము; 6. తెల్లముది మేఁకపోతు: చూ, మేషము. 1; 7. గుగ్గిళ్లు: చూ, పొరి.

కుల్మాసము. సం. వి. అ. న. —పై.—

కుల్య. సం. వి. ఆ. స్త్రీ. 1.=కయ్య. నదినుండి త్రవ్వినకాలువ: చూ, నది; 2. తూముకాలువ: చూ, నది; 3. కులస్త్రీ: చూ, స్త్రీ; 4. తిప్పతీఁగె *: చూ, సోమవల్లి.

కుల్యము. సం. వి. అ. న. 1. ఎముక: చూ, శల్యము. 1; 2. పృష్ఠము: చూ, వెనుక. 1; 3. ఎనిమిది ద్రోణముల పరిమితి; నాలుగు కుంచములకొలఁది(అనికొందఱు): చూ, తూము. 3; 4. ఆమిషము: చూ. మాంసము. 1; 5. చేట: చూ, శూర్పము. 1; విణ. 6. మంచికులమునఁ బుట్టినది; 7. కులమునకు హితమైనది.

కుల్యుఁడు. సం వి. అ. పుం. 1. పెద్దడు: చూ, మంత్రి; 2. గౌరవింపఁదగిన మనుష్యుఁడు; 3. సత్కులసంభవుఁడు: చూ, సజ్జనుఁడు; 4. కులమునకు యిష్టుఁడు.

కుల్లస్సు. వా. వి. 1. దోషము; "దానియందలి కుల్లస్సు బయలుపడినది."; 2. రహస్యము. "వాని వ్యవహారమందలికుల్లస్సు తెలిసినది." (రూ- ఖుల్లస్సు.)

కువ. దే.వి.రూ-కువ్వ-కుప్ప- కూటువ-కూటువు; భార. ఆది. 6, ఆ. 88: చూ, రాశి. 1.

కువంగము. సం. వి. అ. న. సీసకము: చూ లోహము. 1.

కువకాలుక. సం. వి. అ. న, ఘోలీశాకము *: చూ, చేఁతరాసి.

కువజ్రికము. సం. వి. అ. న. వైక్రాంతమణి; చూ, రత్నము. 1.

కువము. సం. వి. అ. పుం. 1. కలువపువ్వు: చూ, పద్మము.1; 2. నల్లఁగలువ*: చూ, పద్మము.1;

కువరము. సం. వి. అ. పుం. తువరము, ఒగరు: చూ, రసము. 5.

కువలము. సం. వి. అ. న. కలువపువ్వు: చూ, పద్మము. 1; 2. కలువ*: చూ. పద్మము. 1; 3. నల్లఁగలువ*: చూ, పద్మము. 1; 4. రేఁగు పండు: చూ, రేఁగు; 5. ముత్యము: చూ, రత్నము. 1. (చూ, ముత్తెము.); పుం. 6. రూ-కువలి. గొల్లి *: చూ, రేఁగు. (తి). అని శబ్దరత్నాకరము.)

కువలయప్రియుఁడు. సం. వి. అ. పుం. చేందురుఁడు: చూ, చంద్రుఁడు.

కువలయము. సం. వి. అ. న. 1. కలువ *: చూ, పద్మము.1; 2. నల్లఁగలువ* చూ, పద్మము.1; (రూ- కువలము-కువము- కువాలయము-కువాలము-కువేలము-కూవలము); 3: చూ, భూవలయము; 4. మోసపుకడియము: చూ, భూషణము. 2.

కువలయానందము. అం. ఈగ్రంథమునకు కర్త అప్పయ్యదీక్షితులు: చూ, కావ్యనాటకములు.

కువలాయికము. సం. వి. అ. పుం. ఒకరకము హంస: చూ, హంస.

కువలాయితము. సం. వి. అ. పుం. చిందపిట్ట: చూ, పిన్నగ్రద్ద.

కువలి. సం. వి. ఈ. స్త్రీ. బదరి*: చూ, రేఁగు.

కువాడము. వై. వి. = కపట. కువాట. రూ-కువ్వాడము- కువాళము, కపటము: చూ, వ్యాజము. 1.

కువాదుఁడు. సం. విణ. రూ-కుపాదుఁడు పరుల దోషమును పలుకువాఁడు, నిక్కృష్టపు మాటలాడువాఁడు (అని కొందఱు.): చూ, కుచేరుఁడు 2.

కువాహులము. సం. వి. అ. పుం. ఒంటె: చూ, లొట్టిపిట్ట.

కువాళము. వై. వి. 1. = కపట: చూ, రూ-కువాడము; దే. వి. 2. వాహనము లోనగువాని గవుసెన; అం. భా. ద్వి. మ 159: చూ, వస్త్రము.

కువిందుఁడు. సం.వి. అ. పుం. తంతువాయుఁడు: చూ, సాలెవాఁడు.

కువేణి. సం. వి. ఈ. స్త్రీ. మత్స్యధాని, చేఁపల బుట్ట: చూ, వల. 1.

కువేరకము. సం. వి. అ. పుం. నంది *: చూ, నందివర్ధనము.

కువేరాక్షి. సం. వి. ఈ. స్త్రీ. పాటలి*: చూ, పాటలి. 2.

కువేరాచలము. సం. వి. అ. పుం. కైలాసపర్వతము. (ఇట్లు కువేరాద్రి.)

కువేరుఁడు. సం. వి. అ. పుం: చూ, దేవతావిశేషము.

కువేలము. సం. వి. అ. న. 1. కలువ *: చూ, పద్మము.1; 2. కలువపువ్వు: చూ, పద్మము.1

కువ్వ. దే. వి: చూ, రూ-కువ.

కువ్వాడము. వై. వి: చూ, రూ-కువాడము.

కువ్వాళము. వై. వి. —వై.—

కుశ. సం. వి. అ. స్త్రీ. 1. త్రాడు: చూ, పాశము. 1; 2. గుఱ్ఱపుకళ్లెము: చూ, వాగె; 3. తియ్యదోస*: చూ, దోస; 4. కొండమామిడి*: చూ, మామిడి.

కుళపము. సం. వి. అ. పుం. పానపాత్రము: చూ, పాత్రము. 6.

కుళపుష్పము. సం. వి. అ. న. స్థౌణేయమను గ్రంథ్యము : చూ, రాజార్హ్వము.

కుళము. సం. వి. అ. న. 1. నీళ్లు: చూ, నీరు. 1; పుం, న. 2. = కొన్న, పవిత్రము, దర్భ *: చూ, తృణము. 1; పుం. 3. కుళద్వీపము: చూ, లంక. 1; 4. ద్వీపములు ఏడింటిలో నొకటి: చూ, ద్వీపములు; 5. పలుపు: చూ, వల్లె. 2; న. 6. పొగడుట: చూ, స్తోత్రము; 7. గణనము: చూ, సంకల్పము; 8. ఉదుంబరము*: చూ, మేడి; అం. 9. దర్భలు పదింటిలో నొకటి: చూ, దర్భలు.

కుళలప్రశ్నము. సం. వి. అ. పుం. క్షేమమును అడుగుట: చూ, స్వాగతము.

కుళలము. సం. వి. అ. న. 1.=కుసులు. క్షేమము: చూ, శుభము. 1; 2. తనివి: చూ, సాహిత్యము; 3. పుణ్యము: చూ, పుణ్యము; విశే. 4 నేర్పరి; (శబ్దరత్నాకరము): చూ, సమర్థుడు; 5. నేర్పు (అమరము): చూ, సామర్థ్యము; వా. విశే. 6 చిన్నది. "మాయిల్లు కుళలము"; 7. ఇఱుకైనది. "మాయిల్లు కుళలమగుటచే గూర్చుండుటకైనను స్థలము చాల నిదయ్యె."

కుళలవులు. సం. వి. అ. పుం. బ. శ్రీరాముని పుత్రులు, కవబిడ్డలు (ఏకో క్తిచే కుళలవులు.): చూ, యమళశిశువులు.

కుళలి. సం. వి. ఈ. స్త్రీ. అశ్మంతకము*: చూ, పాలిందిరము.

కుళలుడు. సం. విశే. నేర్పరి: చూ, సమర్థుడు (రూ- కుళలవంతుడు.)

కుళస్థలము. సం. వి. అ. న. కాన్యకుబ్జదేశము: చూ, దేశము.

కుళస్థలి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఎద్దునాలిక *: చూ, దార్విక; 2 అంతర్వేదియనుపుణ్యక్షేత్రము: చూ, భూమి. 1.

కుశాకరము. సం. వి. అ. పుం. అగ్ని: చూ, నిప్పు.

కుశాక్షము. సం. వి అ. పుం. కోతి: చూ, వానరము (కుశాక్షుడు.)

కుశామ్లిక. సం. వి. అ. స్త్రీ. కొండమామిడి *: చూ, మామిడి.

కుశారణి. సం. వి. ఇ పుం. దుర్వాసుడు: చూ, ముని. 1.

కుశాలి సం. వి. న్. పుం. 1. చెయ్యి చూ. హస్తము: విశే 2. కుత్సితుడు: చూ, వ్యాధుడు. 2.

కుశాల్మలి. సం. వి. ఇ. పుం. పన్నబూరుగు *. చూ, శాల్మలి.

కుశి. సం. వి. ఈ. స్త్రీ. 1. కఱ్ఱు. (ఇనుముతో జేసిన వస్తువు): చూ, కఱుగోల. 2; న్. పుం. 2. వాల్మీకిముని: చూ, ముని. 1.

కుశింశప. సం. వి. అ. స్త్రీ. పచ్చయిఱుగుడు. కపిలశింశుప *: చూ, శింశుప.

కుశింశుప. సం. వి. అ. స్త్రీ. కంపిఱుగుడు, భస్మగర్భ*: చూ, శింశుప.

కుశిక. సం. వి. అ స్త్రీ గవేధుక, అడవిగోధుమలు: చూ. ధాన్యము.

కుశికము. సం. వి. అ. పుం. 1. ఆగొవికారము; 2. కల్కము. నూనెమడ్డి: చూ, మడ్డి. 2; 3. మస్తిష్కము: చూ, మెదడు; 4. తాడి*: చూ, శ్రీతాళము; 5. ఏపె *: చూ, మద్ది.

కుశికుడు. సం. న్. అం. పు. కుశికమహాముని: చూ, ముని. 1; 2. విశ్వామిత్రుని తండ్రి.

కుశీదము సం. వి. అ. న. 1. రక్తచందనము: చూ, సుగంధము; 2. వడ్డిబ్రదుకు: చూ, వృద్ధిజీవిక.

కుశీలము. సం. వి. అ. పుం. 1. మూతుక వ్యాపారము; 2. కూౖరసర్పము: చూ, సర్పము; 3. తేలు: చూ, వృశ్చికము; 4. కొండ: చూ, పర్వతము.

కుశీలవుఁడు. సం వి. అ. పుం. 1. చారణుఁడు, నానాదేశ సంచారకుఁడైన నట్టువుఁడు: చూ, నర్తకుఁడు; 2. చారణుఁడు, నానాదేశ సంచారకుఁడైన బట్టువాఁడు: చూ, వంది; 3 వాల్మీకి: చూ, ముని. 1; 4. భిక్షుకుఁడు: చూ, యాచకుఁడు; 5. పాటకాఁడు: చూ, సీకారి.

కుశీలవులు. సం. వి. అ. పుం. బ: చూ, కుశలవులు. (ఏకోక్తిచే కుశీలవులు.)

కుశీవశుఁడు. సం. వి అ. పుం. వాల్మీకి: చూ, ముని. 1.

కుశుఁడు. సం. వి. అ. పుం. 1. శ్రీరాముని పెద్ద కొడుకు; న. 2. వేదము చదివినవాఁడు; 3. విశ్వామిత్రునితాత; విణ. 4. పాపిష్ఠుఁడు; చూ, పాపాత్ముఁడు; 5. మదించినవాఁడు: చూ, సోమరి; 6. జాత్యాచారాదులచే నిందితుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

కుశూలము. సం. వి. అ. పుం. 1. ఊకపొనలము: చూ, నిప్పు; 2. ధాన్యపుకొట్టు: చూ, పంటసాల.

కుశేశయము. సం. వి. అ. న. 1. తామరపువ్వు: చూ, పద్మము. 1; 2. బెగ్గురు: చూ, సారసము; పుం. 3. కొండ: చూ, పర్వతము; 4. కొండగోఁగు *: చూ, పీతపుష్పము.

కుషకము. సం. వి. అ. పుం. రూ- కుషికము. కృమకము: చూ, కఱుగోల. 2.

కుషలము. సం. విణ. కుశలము: చూ, శుభము.1.

కుషాకువు. సం. వి. ఉ. పుం. 1. కోఁతి: చూ, వానరము; 2. రూ- కుధాకువు. ఇనుఁడు: చూ, సూర్యుఁడు; 3. అగ్ని: చూ, నిప్పు; పుం, విణ. 4. అన్యుని సంకటపెట్టువాఁడు: చూ, హింసకుఁడు.

కుషికము. సం. వి. అ. న. ఫాలము, నాఁగటికఱ్ఱు: చూ, కఱుగోల. 2.

కుషీదము. సం. వి. అ. న. వడ్డిబ్రదుకు: చూ, వృద్ధిజీవిక.

కుష్ఠకము. సం. వి. అ. న. సత్తు, సీసము. చూ, లోహము. 1.

కుష్ఠకావర్త. అం. అశుభావర్తములలో నొకటి: చూ, అశుభావర్తములు.

కుష్ఠగంధ. సం. వి. ఆ. స్త్రీ. బల్య *: చూ, పెన్నేరు.

కుష్ఠగంధి. సం. వి. ఇ. న. ఏలవాలుకము *: చూ, దోస.

కుష్ఠఘ్నము. సం. వి. అ. పుం. 1. పెద్దలేఁకు*: చూ, కాకోటము; 2 చెండ్రి: చూ, విట్ఖదిరము; 3. లఘుడము, సన్నపాకుల ఎఱ్ఱగన్నేరు *: చూ, హయమారకము; 4. చేఁతిపొట్ల *: చూ, పొట్ల; 5. హింతాలి. కుష్ఠమసుహుందు: చూ, మందు. 1.

కుష్ఠఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. 1. విడంగము *: చూ, వాయువిళంగము; 2. కాకోదుంబరిక *: చూ, బొమ్మమేడి.

కుష్ఠనాశనము. సం. వి. అ. పుం. 1. వారాహీకంద *: చూ, సూరణము; 2. తెల్లావాలు*: చూ, సర్షపము; 3. క్షీరీశ *: చూ, క్షీరకుంచుకి.

కుష్ఠనాశిని. సం. వి. ఈ. స్త్రీ. కారుగచ్చ *: చూ, సోమరాజి.

కుష్ఠసుత్తు. సం. వి. ద్. స్త్రీ. అడవిప్రత్తి *: చూ, ప్రత్తి.

కుష్ఠము. సం. వి. అ. న. 1. = కుష్టు. పులుము: చూ, మండలము. 3; 2. =కోష్టు. చెంగల్వకోష్టు *: చూ, పారిభావ్యము; 3. మంచి

పాసన: చూ, వాసన; పుం. 4. విష భేదము: చూ, విసము. 1.

కుష్ఠసూదనము. సం. వి. అ. పుం. ఆరగ్వధము*: చూ, రేల.

కుష్ఠహంత. సం. వి. ఋ. పుం. హస్తికంద *: చూ, ముల్లంగి.

కుష్ఠహంత్రి. సం. వి. ఈ. స్త్రీ. వాకుచి *: చూ, మందు. 1.

కుష్ఠహారి. సం. వి. ఈ. స్త్రీ. పాఁచి *: చూ, శైవలము.

కుష్ఠహృత్తు. సం. వి. ద్. పుం. చేంద్ర *: చూ, విట్ఖదిరము.

కుష్ఠారి. సం. వి. ఇ. పుం. 1.___పై.___; 2. కుష్ఠ*: చూ, విట్ఖదిరము; 3. పటోలము *: చూ, పొట్ల; 4. గంధకము *: చూ, చందనము.

కుష్ఠి. సం. విశే. న్. కుష్ఠరోగి.

కుష్ఠరోగముగలజాతకుఁడు. పా. 1. షష్ఠాధిపతి సప్తమమందుండి కేతుసంబంధము గలిగినపుడును(శుభగ్రహసంబంధము లేకుండవలెను); 2. చంద్రబుధలగ్నాధిపతులు రవి రాహువులతో గలిసినను, లేక వారి యంశలయందున్నను నల్లకుష్ఠును; 3. చంద్రబుధలగ్నాధిపతులు కుజశనులతోఁగలిసినను, వారి యంశలయందున్నను; 4 షష్ఠాధిపతి బుధ, చంద్ర, శుక్రులతోఁ గూడి లగ్నమందుండి, లగ్నాధిపతి షష్ఠమమందున్నను శ్వేతకుష్ఠును; 5. షష్ఠాధిపతి రవితోఁగూడి, లగ్నమందున్న రక్తకుష్ఠును; 6. షష్ఠాధిపతి శనితోఁగూడిలగ్నమందున్న నల్లకుష్ఠును; 7. కారకాంశరాశికి నాల్గవ స్థానమందు చంద్రుఁడుండి శుక్రునిచేఁ జూడఁబడినయెడల తెల్లకుష్ఠును; 8. కారకాంశరాశికి నాల్గవ స్థానమందు చంద్రుఁడుండికుజుఁడు చూచిన యెడల పెద్దకుష్ఠును; 9. కారకాంశరాశికి నాల్గవస్థానమందున్నఁ జంద్రునికేతువు చూచిన నల్లకుష్ఠును; 10. లగ్నమున చంద్రుఁడును, శనికుజులు ద్విద్వాదశములలోనునుండి యా చంద్రుఁడు రవిచేఁ జూడఁబడినపుడును; 11. చంద్రుఁడుగాని, బుధుఁడుగాని లగ్నాధిపతియై రాహుకేతువులతోఁగూడి శనిచేఁ జూడఁబడినపుడును; 12. రవి, చంద్ర, బుధ, శుక్రులు కలిసియుండి లగ్నాధిపతికిఁ బాప సంబంధమున్నపుడును కుష్ఠు గలిగియుండును.

కుష్మలము. సం. వి. అ. న. కత్తిరించుట: చూ, ఛేదనము.

కుష్మాండము. సం. వి. అ. పుం. 1. గుమ్మడి*: చూ, మహాఫలము; 2. భ్రూణము: చూ, శిశువు.

కుష్మాండి. సం వి. ఈ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2. గుమ్మడు *: చూ, మహాఫలము.

కుష్మాండికము సం. వి. అ. పుం. గుమ్మడు *: చూ, మహాఫలము.

కుష్మాండుఁడు. సం. వి. అ. పుం. దేవతాగణ విశేషము: చూ, దేవతావిశేషము.

కుసలము. సం. వి. అ. న. రూ- కుశలము: చూ, శుభము. 1.

కుసి. దే. వి. 1. గండియందుఁ జొప్పించుటకు గాను సన్నగాఁ జెక్కిన మంచెపుపట్టెలోనగు వాని చివర; (శబ్దరత్నాకరము); ఆం, భా. ద్వి. 164: కూచము, కొస; 2. వగ: చూ, దుఃఖము.

కుసింబి. సం. వి. ఈ. స్త్రీ. కందిపొట్టు: చూ, శింబి.

కుసిగుంపులు. దే. వి. బ. బాధ: చూ, శ్రమము. 1.

కుసితము. సం. వి. అ. పుం. జనపదము: చూ, దేశము.

కుసిని. అవ్య. దే. వి. వంటయిల్లు: చూ, సదనము. 1.

కుసినివాఁడు. అన్య. దే. వి. హీనజాతులకువంటచేయువాఁడు.(వాడుక): చూ, సూపకారుఁడు.

కుసిలించు. దే. అ. క్రి. అతృప్తిచే దుఃఖించు: కునులు.

కుసిలింత. దే. వి. అతృప్తిచే దుఃఖించుట.

కుసీదకుఁడు. సం. విణ. వడ్డికిచ్చి జీవనముచేయువాఁడు: చూ, వార్ధుషికుఁడు.

కుసీదము. సం. వి. అ. న. వడ్డికిచ్చి జీవనము చేయుట: చూ, వృద్ధిజీవిక.

కుసీదికుఁడు. సం. విణ: చూ, కుసీదకుఁడు.

కుసీదుఁడు. సం. విణ. —పై.—

కుసుంబపువ్వు. వై. వి. = కుసుంభ. కుసుంభా పుష్పము: చూ, వహ్నిశిఖము. 2. (కఫము తగ్గించును.)

కుసుంబా. వై. వి. = —పై.—

కుసుంబాపిండి. వా. వి. దీనియందు 5 భా, నత్రజని, 1¼ స్ఫురత్పంచామ్ల జనిదమునుకలవు.

కుసుంభకము. సం. వి. అ. పుం. పీతదారువు *: చూ, మ్రానిపసుపు.

కుసుంభము. సం. వి. అ. న. 1. =కుసుమ: చూ, కుసుంబపువ్వు; 2. బంగారు: చూ, లోహము.1; న. 3. లత్తుక: చూ, లక్క; 4. కుసుంబా పూవురంగు: చూ, వర్ణము. 6; పుం. 5. కమండలువు: చూ, పాత్రము. 6.

కుసుంభరాగము. సం. వి. అ. పుం. బయటికిమాత్రము విశేషముగాఁ గనఁబడి లోపలబొత్తిగా లేని అనురాగము. (చూ, పూర్వరాగము): చూ, త్రియము.

కుసుమ. దే. వి. 1.రూ-కుసుము. ఆర్తవము: చూ, ముట్టు. 1; 2= కుసుంభము. కుసుంబపువ్వు; కాశీ. 7, ఆ. 5: చూ, వహ్నిశిఖము. 2; 3. కుసుంభవర్ణము; హై. 8, ఆ. 5: చూ, చెందిరిక; 4. ఒకానొక చెట్టు: చూ, వృక్షము; 5. సస్యకోసు మము: చూ, సస్యము.1; 6. పుందు సందలి మొలక: చూ, వ్రీణము; బ. 7. వడ్లు; ఆము. 1, ఆ. 66: చూ, ధాన్యము.

కుసుమగర్భకము. సం. వి. అ. పుం. పూలుముడిచిన కొప్పు: చూ, వేనలి.

కుసుమపురము. సం. వి. అ. న. ఒకానొకనగరము: చూ, దేశము.

కుసుమపూవు. వై. వి. = కుసుంభపుష్పము: చూ, వహ్నిశిఖము. 2.

కుసుమపూరాజనాలు. దే. వి. బ. కుసుమవడ్లు: చూ, ధాన్యము.

కుసుమవిచిత్రము. పా. ఒకానొకవృత్తము. ఇందొక్కొక్క పాదమునందు న, య, న, య, గణములు గలిగి ఏడింటయతిగల ద్వాదశచ్ఛందస్సునందుఁబుట్టిన వృత్తము. ఉదా.—“కుతలములోనం । గుసుమవిచిత్రం,బతిశుభదంబై । యగయతులన్నం,దతనయ మొప్పున్,నయలినుమాలై, సతతము విద్వజ్జనులనుతింపఁగ.” చూ, వృత్తము. 1.

కుసుమాంజనము. సం. వి. అ. న. రీతిపుష్పము: చూ, రసాంజనము.

కుసుమాకరము. సం. వి. అ. పుం. మాఘమాసము: చూ, మాసము. 1.

కుసుమాత్మకము. సం. వి. అ. న. కుంకుమము చూ, వహ్నిశిఖము. 1.

కుసుమాధిపము. సం. వి. అ. పుం. చంపకము: చూ, సంపెఁగ.

కుసుమాధిరాట్టు. సం. వి. జ్. పుం. —పై.—

కుసుమాయుధుఁడు. సం. వి. అ. పుం. మదనుఁడు: చూ, మన్మథుఁడు.

కుసుమార్ద్రాద్రి. పా. ఒకానొక లేహ్యము: చూ, లేహ్యములు.

కుసుమాలుఁడు. సం. వి. అ. పుం. పగటిదొంగ; (వాకారావళి): చూ, ముచ్చు. 1.

కుసుమాసవము. సం. వి. అ. పుం. తేనె: చూ, మధువు. 5.

**కుసుమితలతావేల్లిత.** సా. ఒకానొకవృత్తము. ఈవృత్తమునందు మ, త, న, య, య, య, గణములు గలిగి పదునెండవయింట యతిగల అష్టాదశచ్ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా.— "వేమారెన్నంగాఁగుసుమితలతా- వేల్లితన్మత్తరయాయల్, శ్రీమార్తాండ శ్రాంతియుఁగుదిరినం -జెన్నుమీరున్నరిత్రిక్, గామేపల్లీశుంగక కవసనం- గంజ నేతుగ్రిక్ శుభాంగుక్, గోమద్బాలుంగాలయవనహరుం- గుంజరేందాద్రిత్రినాశుక్." చూ, వృత్తము. 1.

**కుసుము.** వై. వి. రూ-కుసుక. అర్తవము: చూ, ముట్టు. 1.

**కుసుమేషువు.** సం. వి. అ. పుం. మదనుఁడు: చూ, మన్మథుఁడు.

**కుసులి.** దే. వి. పొట్టివాఁడు: చూ, వామనుఁడు.

**కుసులు.** దే. అ. క్రి: చూ, కుసిలించు. (శబ్దరత్నాకరము); వై. వి.= కుశల, సుఖముఅని పురుషోత్తమకవీయము)

**కుసువు.** సం. వి. ఊ. పుం. కించులుకము: చూ, సర్పము.

**కుసూలము.** సం. వి. అ. పుం. 1. రూ- కుశూలము. వ్రీహ్యాగారము: చూ, పంటసాల; అం. 2. ఆయుధములు ముప్పదిరెండింటిలోనొకటి: చూ, ముప్పదిరెండాయుధములు: (చూ, బాణము. 1.)

**కుసృతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. నికృతి, కుత్సితభావము: చూ, వ్యాజము. 1; 2. శాంబరి, ఇంద్రజాలము మొదలైన మాయ: చూ, మాయము. 1.

**కుస్తు.** వై. వి.= కుష్ఠము: చూ, మండలము. 3. (దేశ్యమని శబ్దరత్నాకరము)

**కుస్తరించు.** దే. స. క్రి. 1. ఊరడించు; భీ. 3, ఆ. 10: చూ, సమాశ్వాసించు; 2. సమాధానపఱచు; విక్ర. 6, ఆ. 38; 3. దిద్దు; కాశీ. 7, ఆ. 47: చూ, సవరించు; 4. చేఱుచు; య. 1, ఆ. 77: చూ, పటుతరించు.

**కుస్తిమ్కము.** సం. వి. అ. పుం. 1. అరఁటిచెట్టు యొక్క మూలము: చూ, రంభ. 2; 2. కస్తూరి పూఁత: చూ, పూఁత. 3; 3. ముట్టుదాని కౌఁగిలింత: చూ, సంశ్లేషము.

**కుస్తిష్కుఁడు.** సం. వి. అ. పుం. పగవాని చాఁపుఁడు.

**కుస్తుంబరి.** సం. వి. ఈ. స్త్రీ. = కొత్తిమిరి. ధాన్యాకము *: చూ, వితున్నకము. 1.

**కుస్తుంబురువు.** సం. వి. ఉ. న. = కొత్తిమిరి. —వై.—

**కుస్తుభుఁడు.** సం. వి అ. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

**కుహకజీవి.** సం. విణ. న్. మాయాజీవి: చూ ప్రాతిహారకుఁడు.

**కుహకము.** సం. వి. అ. పుం. మోసము: చూ, వంచన.

**కుహకస్వనము.** సం. వి. అ. పుం. 1. కుక్కుటము: చూ, పుంజు; 2. అడవికోడి: చూ, పుంజు.

**కుహకస్వరము.** సం. వి. అ. పుం. —వై.—

**కుహణము.** సం. వి. అ. పుం. కాహళము, బూరఁ: చూ, వీణె.

**కుహణుఁడు.** సం. వి. అ. పుం. జారుఁడు: చూ, అంకుమగఁడు.

**కుహన.** సం. వి. ఆ. స్త్రీ. అర్థాపేక్షచేతనగు కపటచర్య: చూ, కూహన.

**కుహనము.** సం. వి. అ. పుం. 1. ఎలుక: చూ, మూషికము; 2. పాము: చూ, సర్పము; విణ. 3. ఈర్ష్యగలది: చూ, కూడు. 1; న. 4. ఒకరకముకుండ: చూ, భాండము. 3; 5. గాజుగిన్నె: చూ, పాత్రము. 6; 6. ఉండ: చూ, గోళము. 2.

కుహనుఁడు. సం. వి. అ. పుం. 1. ముక్కంటి: చూ, శివుఁడు; విణ. 2. అసహనుఁడు: చూ, ఓర్వలేనివాఁడు; 3 అన్నాదులకొఱకై డంబముగా ధ్యానమౌనవ్రతాదుల ధరించి వేసముతోఁదిరుగు టక్కరి సన్యాసి: చూ, ముని.1.

కుహరము. సం. వి. అ. న. 1. గుహ. చూ, రంధ్రము. 1; 2. తొఱ్ఱ: చూ, రంధ్రము. 1; 3. బెజ్జము: చూ, రంధ్రము. 1; 4. ఇంద్రజాలాదిమాయ: చూ, మాయము. 1; 5. ఇంటిచూరు. చూ, చెలిసె; 6. మొగము: చూ, వదనము. 2; 7. చెవులు: చూ, శ్రోత్రము; 8. కంఠధ్వని: చూ, స్వరము. 2; 9. కుత్తుక: చూ, మెడ; 10. దగ్గఱ: చూ, సమీపము.1; పుం. 11. తెల్లతుమ్మ *: చూ, విట్ఖదిరము; 12. కుహరమను పాము: చూ, సర్పము.

కుహరి. సం. వి. న్. పుం. గాగడీఁడు: చూ, ప్రాతిహారకుఁడు.

కుహరితము. సం. విణ. 1. రతికూజితము: చూ. స్వరము. 2;పుం. 2.రూ-కుహూరుతము.కోకిలధ్వని: చూ, స్వరము. 2; 3. ధ్వని: చూ, స్వరము. 2.

కుహరుఁడు. సం. వి. అ. పుం.కుహరుఁడను రాజు: చూ, రాజు. 1.

కుహళి. సం. వి. అ. స్త్రీ.రూ-కుహళి-కూహళి. కాళ్లె; జై. 5, ఆ. 142: చూ, వీణె.

కుహళి. సం. వి. ఈ. స్త్రీ. పూగపుష్పిక, వివాహసంబంధమగు పువ్వుతాంబూలము: చూ, పోకపాత్తి.(చూ, పోఁక)

కుహళి. సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ- కుహళి. (అ, పా. ప్ర. నాట్య)

కుహువు. సం. వి. ఉ. పుం. 1. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు. 1: ఊ. స్త్రీ. 2. చంద్రకళ కానరాని యమవస: చూ, సూర్యేందుసంగమము: 3. కోకిలధ్వని: చూ, స్వరము. 2.

కుహూకంఠము. సం. వి. అ. పుం. కోయిల చూ, పికము.

కుహూముఖము. సం. వి. అ. పుం. —పై.—

కుహూరవము. సం. వి. అ. పుం.—పై.—

కుహూవు. సం. వి ఊ. స్త్రీ: చూ, రూ-కుహువు. 2-3; 3. మంచుకొండ యందుఁ బుట్టిన కుహూనది: చూ, నది.

కుహేళిక. సం. వి. ఆ. స్త్రీ. హిమాని, మాడమంచు: చూ, హిమము.

కుళాయ. వై. వి.= ఖోలకః. రూ- కుళ్ళాయ. టోపి, పటురచితమకుటము. ఉ, రా. 5, ఆ. 270: చూ, వస్త్రము. (రూ-కుళాయి-కుళ్లా-కుళ్ళాయ- కుళ్ళాయి)

కుళాయి. వై. వి. = —పై.—

కుళింగము. సం. వి. అ. పుం. అడవి పిచ్చుక: చూ, పిచ్చుక.

కుళీరము. సం. వి. అ. పుం. ఎండ్రకాయ: చూ, కీత.

కుళుత్థము. సం. వి. అ. పుం: చూ, రూ- కులుత్థము.

కుళుత్థాంజనము. సం. వి. అ. న. కనుపాలవిత్తులు: చూ, రసాంజనము.

కుళుత్థిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-కులుత్థిక.

కుళుప్రు. దే. వి. బంగరముఁబోదిగెడు విశాలమగుమణివిశేషము: చూ, రత్నము. 1.

కుళ్ళా. వై. వి. = ఖోలకః. టోపి: చూ,రూ-కుళాయ.

కుళ్ళాయ. వై. వి. = —పై.— పా. 2, ఆ. 16.

కుళ్ళాయి. వై. వి. = —పై.—

కుళ్లు. దే. అ. క్రి: చూ, రూ- కుళ్లు.

కుళ్లుపోతు. దే. విణ. కుళ్లగించు స్వభావము కలవాఁడు. వేమన.1147: చూ,రూ-కుళ్లుపోతు.

---

# కూ

కూ. సం. వి. అ. స్త్రీ. 1. పుడమి: చూ, భూమి. 1: దే. అవ్య. (1) పిలువఁగా పామరజనులెచ్చరించుకొనుటయందుగచ్చుధ్వని; (2) బాలబాలికలు ఆటలయందొకరి నొకరు పిలుచుకొనుట యందు వచ్చుధ్వని; (3) ఏకాంతస్థలములకుఁ బోవువారలొకరినొకరు పిలుచుకొనుటయందు వచ్చుధ్వని; (4) పొగబండినిలుచుటయందును, పోవుటయందును వెలువరించు ధ్వనివిశేషము; "పొగబండి 'కూ' అని కూయుచున్నది."

కూఁక. దే. వి. అఱపు: చూ, స్వరము. 2. (రూ- కూఁత)

కూఁకట. దే. వి. నెమలిసిగ: చూ, సిక. 1.

కూఁకటి. వై. వి. = కూకట. 1. జుట్టు; భార అర. 6, ఆ. 250: చూ, సిక. 4; 2. పిల్లజుట్టు; కాశీ. 4, ఆ. 69: చూ, సిక. 4; విఱ. 3. ప్రధానము; కళా. 1, ఆ. 26: చూ, శ్రైష్ఠ్యము.

కూఁకటిపుల్గు. ద్వ. వి. ధూమ్యాటము: చూ, భృంగరాజము.

కూఁకటిగుడ్డంగి. ద్వ. వి. కాకమద్గువు: చూ, దాత్యూహము.

కూఁకటిగువ్వ. ద్వ. వి. భరద్వాజము: చూ, వ్యాఘ్రాటము.

కూఁకటిముక్కు. ద్వ. వి. రూ- కూఁకటిమూఁగ: చూ, భృంగరాజము.

కూఁకటిమూఁగ. ద్వ. వి. —పై.—

కూఁకటివేరు. ద్వ. వి: చూ, రూ- కుంకటివేరు.

కూఁకటివేళ్ళతోఁ బెల్లగించుట. జా. సమూలముగా నాశనము చేయుట. "అతని రాజధానిం గూఁకటివేళ్ళతోఁ బెల్లగించి పేరులేకుండ నేలమట్టము గావింతు." (నీతిచంద్రిక-సంధి)

కూఁకరించు. దే. అ. క్రి. కూకలువేయు.

కూఁకలు. దే. వి. బ: చూ, మందలింపులు.

కూఁకు. దే. అ. క్రి. అస్తమించు; ఆం, భా. తృ. 96: చూ, నింగివడు. (రూ- క్రుంకు)

కూఁత. దే. వి. 1. కూయుట; ఆం, భా. ప్ర. 115: చూ, స్వరము. 2; 2. కంఠధ్వని: చూ, స్వరము. 2; 3. మృదంగాది ధ్వని: చూ, స్వరము. 2.

కూఁతక్రాదువు. దే. వి. శంఖము: చూ, సంకు. 1.

కూఁతనేల. దే. వి. (రూ- కూఁతపట్టు- కూఁత పట్టునేల- కూఁతవేటు) క్రోను: చూ, పరువు. 2. (రెండువేల విండ్లుపట్టుకొలఁది, క్రోశము)

కూఁతపట్టు. దే. వి. —పై.—

కూఁతపట్టునేల. దే. వి. —పై.—

కూఁతవాటు. దే. వి. చక్రియుధము: చూ, బాణము. 1.

కూఁతవేటు. దే. వి: చూ, రూ- కూఁతనేల; హరిశ్చ. 3, ఆ. 65.

కూఁతు. దే. వి. రూ- కూఁతురు: చూ, పుత్రిక. 1.

కూఁతుకూఁతురు. దే. వి. దౌహిత్రి: చూ, మనుమరాలు.

కూఁతుకొడుకు. దే. వి. దౌహిత్రుఁడు: చూ, మనుమఁడు.

కూఁతుబిడ్డ. దే. వి. దేవగంగ: చూ, నది.

కూఁతురు. దే. వి: చూ, రూ- కూఁతు.

కూఁతురుబుడమ. దే. వి. నూఁగుదోస *: చూ, దోస. (పైత్యశాంతి, మేహశాంతి, రక్తవమనము కట్టును)

కూకీ. దే. వి. ఒకరకము పావురము (బ్రహస్వాంతమని కొందఱు): చూ, పావురము.

కూకీపలుకు. దే. వి. రతికూజితము (చూ, కూజితము. 2; కూజితములు): చూ, స్వరము. 2.

కూకు. దే. వి. అమితు; ఆం, భా. ద్వి. ద్వి. 172: చూ, పొలవిఱుఁగుడు.

కూకుదుఁడు. సం. విశ. వధుని సత్కరించి యలం

కృతురాలగు కూఁతునిచ్చువాఁడు : చూ, రూ- కుకుదుఁడు.

కూఁకురుగుండఁగి. దే. వి. రూ-కూఁకటిగుడ్డంగి: చూ, దాత్యూహము.

కూఁకురుగుండె. దే. వి. రూ—పై.—

కూకుదు. సం. వి. ఊ. స్త్రీ. ఎనిమిదేండ్లవయసుఁ బెండ్లిలేని పడుచు: చూ, స్త్రీ.

కూచము. సం. వి. అ. పుం. చన్ను : చూ, స్తనము.

కూచి. దే. విశే. 1. యుద్ధయాత్రకు సైనికులు హెచ్చరిక పడుటకై యుద్ధవాద్యములను వాయించుట; 2. వాఁడి: చూ, వాలు. 6.

కూచిక. సం. వి. ఆ. స్త్రీ. కలము: చూ, లేఖిని.

కూచిమారముని. అం. సప్తాధికరణములలో నొక టగు ఔపనిషదికమును రచించినవాఁడు. (చూ, ఔపనిషదికము) : చూ, ముని. 1. (చూ, సప్తాధికరణములు-కామశాస్త్రము)

కూచిమారుఁడు. అం. పురుషజాతులు నాలుగింటి లో నొకతరగతివాఁడు: చూ, పురుషజాతులు.

కూచేము. దే. వి. 1. గూటము: చూ, త్రోలు మ్రాను; 2. కంబము: చూ, స్తంభము; 3. పట్టికాగ్రము: చూ, కుసి. 1.

కూజితము. సం. వి. అ. న. 1. పక్షి ధ్వని: చూ, స్వరము. 2; 2. కూఁకీపలుకు, స్త్రీపురుషుల రతికాలమున కలిగెడు కంఠధ్వని : చూ, స్వరము. 2.

కూజితములు (లేక) పలుకులు. అం. (రతికూజితములు)= నెమలి- హంస- లకుముకి- కోకిల- పావురము. (5)

కూజో. వా. వి. ఒకరకము మూతిపొడవుగల పాత్రము: చూ, పాత్రము. 6.

కూటకము. సం. వి. అ. న. 1. = గొడగ. ఏడి కోలలేని నాఁగలి: చూ, లాంగలము. 1; 2. ఫాలము: చూ, కఱుగోల; పుం. 3. పండ్రికలకొప్పు: చూ, వేనలి; 4. కికీదివి: చూ, పాలపిట్ట; 5. కమ్మరవాని సమ్మెట: చూ, సమ్మెట

కూటకృత్తు. సం. వి. త్. పుం. 1. ముక్కంటి: చూ, శివుఁడు; 2. కరణము: చూ, పంజీకరుఁడు; 3. ఉమ్మెత్త * : చూ, హాలాపుష్పము.

కూటజము. సం. వి. అ. పుం. రూ- కుటజము. కొడిసె *: చూ, వత్సకము.

కూటతానములు. అం. గాంధర్వవేదమునందలి రాగాధ్యాయములోని తానములు మూఁడింటి లో నొకటి: చూ, తానములు.

కూటపాలకము. సం. వి. అ. పుం. పిత్తజ్వరము: చూ, రోగము. 1.

కూటపుష్పము. సం. వి. అ. పుం. 1. కూటపుష్పమను చెట్టు : అట్టహాసకము; (తె. ప.):— కుంద; 2. కుందము *: చూ, మొల్ల.

కూటపూర్వము. సం. వి. అ. పుం. త్రిదోష జ్వరము: చూ, రోగము 1. (ఏనుఁగులయొక్క త్రిదోషజ్వరమని కొందఱు)

కూటమి. దే. వి. 1. కూడిక: చూ, సంయోగము; 2. సురతము: చూ, సంయోగము.

కూటము. సం. వి. అ. పుం, న. 1. అమ్ము: చూ, బాణము. 1; 2. ఆకాశములోనగునవి; 3. కపటము: చూ, వ్యాజము. 1; 4. కఱ్ఱు: చూ, కఱుగోల; 5. కొండకొమ్ము: చూ, శిఖరము; 6. గవను, పెద్దవాకిలి: చూ, సదనము. 1; 7. గారడము: చూ, మాయము. 1; 8. ఏడుపు: చూ, దుఃఖము; 9.=కూటువ. ప్రోగు: చూ, రాశి. 1; 10. బొంకు: చూ, వితథము; 11. కూటయంత్రము: చూ, బోను; 12. సంపెట: చూ, సమ్మెట; పుం. 13. ఇల్లు: చూ, సదనము. 1; 14. విఱిగినకొమ్ముగలఎద్దు: చూ, వృషభము. 1; 15. పుట్ట: చూ, వల్మీకము;

16. లెక్కకలియకూడడము: చూ, సంకలనము; 17. కానెపుంలి: చూ, వృషాదనము; పుం న.18. కష్టపడిచేయవలసినపనిని కష్టపడకచేయునట్లు ఏర్పఱచిన సాధనవిశేషము: చూ, యంత్రము. "అచ్చుకూటము." వెం; 19. నిక్కము: చూ, నిజము.2; 20. ఇనుపగుదియ: చూ, ముద్గరము;21. దోషము: చూ, పాపము.1; దే. వి. (1) రూ- కూటామ. కొలుపుకూటము; భార. ఉద్యో. 3, ఆ.152;చూ,సభ 2; (2) చావడి, చవికె. రూ- కూటాము: చూ, సదనము 1.

కూటయంత్రము. సం. వి. అ. న. వ్యాఘ్రాదులను పట్టెడిబోను; గాలము (అని కొందఱు): చూ, బోను.

కూటయుద్ధము. సం. వి. అ పుం. ఒకరకము యుద్ధము: చూ, యుద్ధము.

కూటవార్తాకి. సం. వి. ఈ. స్త్రీ. కప్పురపువంగ*: చూ, వంగ.

కూటశాల్మలి. సం. వి. ఇ. స్త్రీ. కొండబూరుగు, రోచనము *: చూ. వారిజము.

కూటసాక్షి. సం. విశ. న్. మిథ్యాసాక్షి:చూ, సాక్షి (ఇట్లు కూటసాక్ష్యము, కూటకృతి కూటవాది, కూటాగారము ఇత్యాదులూ హ్యాంబులు.)

కూటస్థము. సం. విశ. 1. ఎల్లకాలము నొక్కరూపయియుండెడినది (ఆకాశాదికము); న. 2. వ్యాఘ్రనఖమనుగంధద్రవ్యము: చూ, రాజార్ద్రము.

కూటస్థుఁడు. సం. వి. అ. పుం. అన్వయుఁడు: చూ, మూలపురుషుఁడు.

కూటాగారము. సం. వి. అ. న. 1. మేడమీఁది యిల్లు: చూ, సదనము. 1; 2. ఇంటికప్పు: చూ, సదనము. 1.

కూటామ. దే. వి: చూ, రూ- కూటము.

కూటాయువు సం. వి. ఉ. పుం. గుగ్గిలము *: చూ, మహిసాక్షి.

కూటికుండ. దే. వి. అన్నపుకుండ: చూ, భాండము. 3.

కూటినీళ్లు. దే. వి. పుల్లనీళ్లు: చూ, శుక్తము. 1.

కూటిముత్తెము. ద్వి. వి. మనుష్యులచేఁ జేయఁబడునట్టి ఒకరకము ముత్యము: చూ, ముత్తెము.

కూటిసారా. దే. వి. అన్నమునఁబుట్టినసారాయి చూ, సుర. 2.

కూటు. దే. వి. ధాన్యమునుంచుటకు వెంటితోనేర్పఱచెడు గరిసె: చూ, పంటసాల.

కూటుఁడు. సం. వి. అ. పుం. కాయి తొలుచువాఁడు, కాసీఁడు: చూ, కాతిపనివాఁడు.

కూటువ. దే. వి. (రూ- కూటువు- కూట.) 1. పోగు; రసి. 3, ఆ. 80: చూ, రాశి. 1; 2. దండు; ఆం, పదా. సర. 111: చూ, సేన.1; 3. ప్రాణిసమూహము: చూ, సమూహము

కూటువమూక. దే. వి. పోగ్త్సాహపఱచి అక్కడక్కడ వెదకి తెచ్చిన పిఱికిబలము; భార. ఉద్యో. 2, ఆ. 208; దశ. 4, ఆ. 117:చూ, సేన. 1

కూటువు. దే. వి: చూ, రూ-కూటువ. (గుంపు. అచ్చ. అర. కాం. 26)

కూడ. దే. ద్రి. సహితమనునర్థమును దెలుపునది; వి, పు. 7, ఆ. 1098: చూ, సైతము.

కూడఁబడు. దే. అ. క్రి. (కూడన్ + పడు) చేరు; హరి. 5, ఆ. 280: చూ, సమీపించు.

కూడఁబెట్టు. దే. స. క్రి. (కూడన్ + పెట్టు) చేర్చు; విక్ర. 2, ఆ.168: చూ,సంగ్రహించు.

కూడముట్టు. దే. స. క్రి. తఱుముకొనిపోవు: చూ, వెంబడించు.

కూడలి. దే. వి. రెంటిమూఁటికూడిక. "కూడలి త్రోవ.": చూ, సంభేదము. 1.

కూడలితాయి. దే. వి. ఎల్లతాయి. (ఇది పాద్దు తెలుపును): చూ, గాయి.

కూడలివాయి. ద్వ. వి. రెండు పంచేలు చేరడు మూల నేర్పఱచిన నీటిదారి

కూడిక. దే. వి 1. చేరిక: చూ. సంయోగము; 2. కూడుకొన్న శబ్దార్థములయొక్క భావకర్మములు: చూ. సాహిత్యము. 1.

కూడు. దే. వి. 1. అన్నము: చూ. సాదము. 1; అం. పే౯. 2. కూడఁబెట్టు. "లెక్కఁగూడు-మతిఁగూడు.": చూ, సంగ్రహించు; అ.క్రి. 3. అతుకు: చూ, సంధించు; 4. అనువుపడు. యుక్తమగు; భార. శాం. 1. ఆ. 251: చూ, సరిపడు 2; స క్రి. 5. పొందు: చూ, ప్రాప్తించు.

కూడుగుడ్డ. దే. వి. అన్నవస్త్రములు. కళిపుపు చూ, సాదము. (1)

కూడుదల దే. వి. మిగులు: చూ, లాభము. 1.

కూడ్యము. సం. వి. అ. న. రూ- కుడ్యము = గోడ: చూ, మఱుఁగుగోడ.

కూణి. సం. విఽ. ఇ: చూ, రూ- కుణి. 2.

కూణిక. సం. వి. ఆ. స్త్రీ. కొమ్ముబూర: చూ, వీణె.

కూతము. సం. వి. అ. న. అభిప్రాయము: చూ, స్మృతి. 1.

కూత్తముఁడు. సం. వి. అ. పుం. భూమిలోను త్తముఁడు. (ఇట్లు కూత్తారణము, కూత్తీర్ణము, కూత్తుంగము, కూత్పల్లము ఇత్యాదులూహ్యంబులు.)

కూదరుఁడు. సం. వి. అ. పుం. కుత్సితమైన కడుపుగలవాఁడు. (ఇట్లు కూద్గతము, కూదయము, కూదంతము ఇత్యాదులూహ్యంబులు)

కూద్దాలము. సం. వి. అ. పుం: చూ, రూ-కుద్దాలము. 1-2.

కూన. వై. వి.= కుణకః. 1. రూ- కున్న- కుట్టి. పిల్ల. ఆం. భా. ద్వి. 99: చూ, శిశువు; 2. రూ- కున్న- కుట్టి. బిడ్డ. అచ్చ. బాల, శాం. 76: చూ. శిశువు.

కూనగుంత. వై. వి. మీట మొదలుఅగెడు పల్లము; హంస. 1; ఆ. 193.

కూనమ్మ. వా. వి. నమువ సేరనిది. (ఆఁడుది) "కుంటికూనమ్మ."

కూనలమ్మ. వా. వి. పిల్లలతల్లి. "కూనలమ్మకూనలూ మ్యావు అని అఱచుచున్నది."

కూని-కూనీ. వా. వి. హత్య.

కూనేగారివైద్యము. పా. కూనేదొరగారు తెచ్చిన ప్రకృతిశాస్త్రచికిత్స. (తొట్టివైద్యము.)

కూన్నతుఁడు. సం. వి. అ. పుం. భూమియందు న్నతుఁడైనవాఁడు. (ఇట్లు కూన్నమ్రుఁడు, కూన్నామము, కూన్నేత, కూన్నేయుఁడు. ఇత్యాదులూహ్యంబులు.)

కూపకము. సం. వి. అ. పుం. 1. ఆఁడుదాని పిఱుఁదులమీఁది గుంటలు: చూ, గుంత. 2; 2. చెలమ: చూ, సరస్సు. 1; 3. ఓడకంబము: చూ, స్తంభము. 1; 4. చేతిసిద్దె: చూ, సిద్దె.

కూపకూర్మన్యాయము. పా. నూతిలో ను న్న తాఁబేలు ఆనూయియే సమస్త ప్రపంచమని యూహించినవిధము.

కూపఖననన్యాయము. పా. కొంపలంటుకొనిన తరువాత నూయి త్రవ్వనారంభించిన విధము.

కూపగండము. సం. వి. అ. పుం. విధవాలక్షణము: చూ, లక్షణము. 1.

కూపమండూకన్యాయము. పా. నూతిలోని కప్ప ఆనూయియే సమస్త ప్రపంచమనుకొను విధము. (కూపస్థమండూకన్యాయము)

కూపము. సం. వి. అ పుం. 1. బెజ్జము: చూ, రంధ్రము. 1; 2. పిఱుఁదిమీఁది గుంత: చూ, గుంత. 2; 3. ఓడకంబము: చూ, స్తంభము. 1;

4. చెలమ: చూ, సరస్సు. 1; 5 ఉదపానము: చూ, నుయ్యి; అం. 6. సప్తసంతానములలో నొకటి: చూ, సంతానములు.

కూపాంగము. సం. వి. అ. పుం. గగురుపాటు: చూ, రోమాంచలము.

కూపాండక. సం. వి. అ. స్త్రీ ఉసిరిక *: చూ, శ్రీఫలి.

కూపారము. సం. వి. అ. పుం. కడలి: చూ, సముద్రము.

కూపాలయము. సం. వి. అ. పుం. 1. కమఠము: చూ, తాబేలు; 2. గుడిసె: చూ, సదనము.1.

కూపి. సం. వి. ఈ. స్త్రీ: చూ. కుప్పియ.1-2.

కూపిక. సం. వి. అ. స్త్రీ. నీటినడిమి కొండ: చూ, పర్వతము.

కూపీ. వా. వి. గుట్టు, రహస్యము. (రూ-కూబీ)

కూపెట్టు దే. అ. క్రి. (కూయి + పెట్టు) 1.అఱచు; కాశీ.7, అ: చూ, శబ్దించు. 2. మొఱయిడు. ఆము. 4, అ. 204: చూ, రోదించు.

కూబరము. సం. వి. అ. పుం. 1. బండినొగ: చూ, రూ- కుబరము; 2. ఏనుగు: చూ, హస్తి; 3. కపోణి: చూ, మోచేయి; విశే. 4.= కొమరు. మనోజ్ఞము: చూ. హృద్యము.

కూబరద్రుపు. సం. వి. ఉ. పుం. తినిశము *: చూ, వంజులము.

కూబరి. సం. వి. న్. పుం. రథము: చూ, శకటము.

కూమము. సం. వి. అ. న. సరోవరము: చూ. సరస్సు. 1.

కూయి. దే. వి. 1. రూ- కుయి- కుయ్యి. మొఱ. భార. విరా. 2, అ. 177: చూ, స్వరము.2. 3. రూ- కుయి- కుయ్యి. కావలి భార. విరా. 5, అ 284: చూ, రక్షణము.

కూయు. దే. అ. క్రి. 1. అఱచు: చూ, శబ్దించు; 2. మొఱపెట్టు: చూ, రోదించు.

కూర. వై. వి. 1. శాకము: చూ, వ్యంజనము.1; 2. ఆకు పువ్వు కాయలోనగు భేదములచే పది విధములుగలది: చూ, శాకము. 1.

కూరకాడ దే. వి. కూర: చూ, శాకము. 1. (తోటకూర కాడలోనగునవి)

కూరనార. దే. వి. — వై. —

కూరటు. దే. వి. పొరలుట: చూ. లుంఠనము.

కూరసల్లి. దే. వి. సెల్లి *: చూ, శ్రీపర్ణము. 1.

కూరపసుపు. దే. వి. కూరలోవేయుపసుపు: చూ, వర్ణము. 6.

కూరము. సం. వి.అ.న అస్థము: చూ, పాదము.(1)

కూరముక్క. దే. వి. కూరలోని తునుక.

కూరముక్కు. దే. వి. ఒకరకము చేప: చూ, మత్స్యము. 1.

కూర్పరము సం. వి. అ. పుం. కపోణి: చూ, మోచేయి.

కూరాకు. దే వి. కాచినకలి: చూ, శుక్తము 1

కూరిచి. దే అవ్య. రూ- కూర్చి గురించి. ఉద్దేశార్థమునందు ద్వితీయావిభక్తితో చేరివచ్చునది. "రామునిగూరిచి, సోమునిగూరిచి."

కూరిమి. దే. వి. రూ- కూర్మి. చెలిమి: చూ, స్నేహము. 1.

కూరు. దే అ. క్రి. 1. కలుగు. భార. భీష్మ 2, అ. 364: చూ, పుట్టు 2; 2. దూసుకొనిపోవు. భార. ఉద్యో. 3, అ. 268: చూ, దుస్సిపోవు; స. క్రి. 3. పొందు. హరి. ఉ 9, అ. 44: చూ, ప్రాప్తించు.

కూరుకు. దే. వి. 1. రూ- కూర్కు..నిద్దుర. భాగ. 10, స్కం. పూ. 1714: చూ, స్వప్నము. 2; అ. క్రి 2 కునికిపడు; వై. 8, అ. 116: చూ, నిద్రించు. (ఇక్కడ కూరుకుటయనగా మందముగా నడుచుట అనియర్థము)

కూరుకుపాటు. దే. వి: చూ, రూ- కురుక- కూర్కుపాటు.

**కూరుకువాఁడు.** దే. వి. రూ- కూర్కువాఁడు: చూ, నిద్రాళువు.

**కూరుకొను.** దే. అ. క్రి. 1. చొచ్చు, రూ- కూర్కొను: చూ, సోఁకు. 4; అం. ప్రే. 2. రూ- కూర్కొను. చొప్పించు, క్రుక్కు: చూ, చొప్పఱచు.

**కూరుచు.** దే. అ. క్రి. 1. రూ- కూర్చు, ప్రియపడు: చూ, సంధించు. 2; ప్రే. 2. రూ- కూర్చు. కూడఁబెట్టు: చూ, సంగ్రహించు.

**కూరుచుండు.** దే. అ. క్రి. (కూర్చి + ఉండు) ఆసీనుఁడగు. రూ- కూర్చుండు. కాశీ. 5, అ. 40: చూ, వేంచేయు.

**కూరుచుండుట.** దే. వి. ఉపదేశము: చూ, స్థితి. 2.

**కూరుచున్నవాఁడు.** దే. వి. రూ- కూర్చున్నవాఁడు: చూ, ఉపవిష్టుఁడు.

**కూరుపరి.** దే. విశే. (కూరుపు + అరి) ఘటకుఁడు. కూర్పున్నట్టివాఁడు. రూ- కూర్పరి: చూ, సంధాయకుఁడు.

**కూరుపు.** దే. వి. రూ- కూర్పు. ఘటన: చూ, సంధానము. 1

**కూరుమొన.** దే. వి. యుద్ధసన్నద్ధసేన: చూ, సేన. 1.

**కూర్కు.** దే. వి: చూ, రూ- కూరుకు.

**కూర్కుపాటు.** దే. వి: చూ, రూ- కునుకు-కూరుకుపాటు.

**కూర్కువాఁడు.** దే. వి: చూ, రూ- కూరుకువాఁడు.

**కూర్కొను.** దే. అ. క్రి: చూ, రూ- కూరుకొను. (చొచ్చు.— రామా. 3, అ. 98; క్రుక్కు.— భార. స్త్రీ. 1, అ. 142)

**కూర్చ.** సం. వి. ఆ. స్త్రీ. 1. తనయాలు: చూ, భార్య; 2. కళము: చూ, తృణము. 1; 3. కపటము: చూ, వ్యాజము. 1; 4. పీఠము: చూ, పీఁట.

**కూర్చకుఁడు.** సం. వి. అ. పుం. బట్టలుకుట్టు శిల్పిజాతివాఁడు: చూ, సూచికుఁడు.

**కూర్చకేసరము.** సం. వి. అ. పుం. కొబ్బరి *: చూ, నారికేళము.

**కూర్చపర్ణిక.** సం. వి. ఆ. స్త్రీ. దూసరితీఁగ *: చూ, వత్సాదని.

**కూర్చము.** సం. వి. అ. పుం, న. 1. దర్భపిడికిలి: చూ, పిడికిలి; 2. కనుబొమల నడుము: చూ, భ్రూమధ్యము; 3. పెరిగిన మీసగడ్డములు: చూ, శ్మశ్రువు; 4. మెచ్చు: చూ, స్తోత్రము; 5. మోసము: చూ, వంచన; 6. కఠినము: చూ, బెడిదము; 7. కపటము: చూ, వ్యాజము. 1; పుం. 8. జెండాకుచ్చులు: చూ, పతాక; 9. దంభము: చూ, హంకారము; 10 పొగడిక: చూ, స్తోత్రము.

**కూర్చశీర్షము.** సం. వి. అ. పుం. జీవకమనెడి గంధద్రవ్యము *: చూ, రాజార్హము.

**కూర్చశేఖరము.** సం. వి. అ. పుం: చూ, కూర్చకేసరము. *.

**కూర్చావర్తి.** అం. అశ్వశాస్త్రమునందలి అశుభావర్తములలో నొకటి: చూ, అశుభావర్తములు.

**కూర్చి.** సం. వి. ఈ. స్త్రీ. 1. చిత్తరువు వ్రాయు పోగర: చూ, వైధనిక; అవ్య. 2: చూ, రూ- కూరిచి.

**కూర్చిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. కుంచెకోల: చూ, బీగము; 2. జున్ను. (ఇది ద్వివిధము.— దధికూర్చిక, తక్రకూర్చిక): చూ, పాలు. 1; 3. చిత్తరువువ్రాసెడు తూలిక: చూ, లేఖని; 4. ముకుళము: చూ, మొగ్గ. 1; 5. సూచి: చూ, సూది; 6. బట్టలకుట్టు, బట్టముడి (అని కొందఱు): చూ, తున్నవాయము; 7. కనుబొమ: చూ, భ్రూవు; 8. గడ్డము: చూ, చిబుకము; 9. తలపుకీలు: చూ, పోఁకముడి; 10. బంక: చూ, మ్రానిబంక.

**కూర్చు.** దే. అ. క్రి: చూ, రూ- కూరుచు.

**కూర్చుండఁబడు.** ద్వ. అ. క్రి.(కూర్చుండన్ + పడు) కూర్చుండు, (స్వార్థమునపడు) భార. భీష్మ. 1, అ 188: చూ, వేంచేయు.

**కూర్చుండు.** దే. అ. క్రి: చూ, రూ- కూరుచుండు. (వ్యాకరణవిషయము — ధాతువులలోనగువానికి ధాతువులచేరి ప్రత్యేకార్థములుగలవగునవి శబ్దపల్లవంబులనఁబడు. 'కూరుచు + ఉండు' కూరుచు అను ధాతువునకు ఉండు అనుధాతువు చేర్పఁగా నేర్పడిన 'కూర్చుండు' అను శబ్దమునకు ఆధాతువుల యర్థంబునకంటె భిన్నమైన యర్థమున్నది. కావున "కూరుచుండు" అనునది శబ్దపల్లవము. "కూర్చొను" యనునది యపశబ్దము. మేలుకొను అనుచోట మేలుఅనునదిధాతువుగాదు. మేలుకొనుఅనునది భిన్నార్థముగలదై శబ్దపల్లవమయ్యెడి.— ఇట్లు నిలుచుండు - పరుండు- పన్నుండు- అఁకొను- ఈఁకొను-ఈయకొను- ఇయ్యకొను- రక్కొను-(త్రెక్కొను-మేకొను- మయికొను- మేలుకొను- మేలుకను- మేలు కాంచు- అలవడు - ఏటుపడు- చొప్పడు- వెలఁవడు- తలపోయు- వాసపోవు-ఆపోవు- కొంపోవు- కొనిపోవు- విజయంచేయు- విజయముచేయు- విచ్చేయు - వేంచేయు- అందిచ్చు లోనైనవి శబ్దపల్లవంబులు.)

**కూర్దనము.** సం. వి. అ. న. స్త్రీ పురుషులవనవిహారము. రూ- కుర్దనము. కందుకాదిక్రీడ: చూ, విలాసము, 1.

**కూర్దని.** సం. వి. ఈ. స్త్రీ. చైత్రశుద్ధ పౌర్ణమి: చూ, పున్నమ.

**కూర్పకుఁడు.** సం. వి. అ. పుం. కుట్రపువాఁడు: చూ, శాఠికుఁడు.

**కూర్పరము.** సం. వి. అ. పుం. 1. రూ- కుర్పరము: చూ, మోఁచేయి; 2. జానువు: చూ, మోఁకాలు; 3. మండ: చూ, పీలమండ.

**కూర్పరి.** దే. వి. 1. రూ-కూరుపరి: చూ, సంధాయకుఁడు; 2. మౌర్వీమధ్యతంతుబంధము: చూ, మౌర్వి. 1; విణ. 3. సంధానముచేయునది. (విశేష్యమని కొందఱు)

**కూర్పాసకము.** సం. వి. అ. పుం, న. 1. = కుఱుచ. అరచేట్టు, గొంతుక మొదలుపాదముల దాఁక వేసికొనుచొక్కాయ.(అనికొందఱు): చూ, వస్త్రము; 2.= కుబుసము: చూ, అవిక. (చూ, వస్త్రము.)

**కూర్పాసము.** సం. వి. అ. పుం.1-2.—పై.—; 3. కవచము: చూ, వారవారణము.

**కూర్పు.** దే. వి: చూ, రూ- కూరుపు.

**కూర్మకము.** అం. ఉత్తానకరణబంధములు నలుబదియొకటింటిలో నొకటి: చూ, ఉత్తానకరణబంధములు.

**కూర్మపృష్ఠకము.** సం. వి. అ. న. మూఁకుడు: చూ, పాత్రము. 6.

**కూర్మపృష్ఠము.** సం. వి. అ. పుం. 1. తెల్లపెద్ద గోరంట *: చూ, మహాసహ; 2. తాఁబేలు వెనుకప్రక్క.

**కూర్మము.** సం. వి. అ. పుం. 1. కమఠము: చూ, తాఁబేలు: అం. 2. ఉపవాయువులు అయిదింటిలో నొకటి: చూ, ఉపవాయువులు.(చూ, వాయువు); 3. అవతారములు పదింటిలో నొకటి: చూ, అవతారములు; 4 పురాణములు పదునెనిమిదింటిలో నొకటి. (6000 శ్లోకములు కలది): చూ, పురాణములు; 5.సంయుతహస్తములు ఇరువదినాలుగింటిలో నొకటి: చూ, సంయుతహస్తములు.

**కూర్మమోహము.** అం. మోహచతుష్టయమునందీయఁబడిన మతాంతరములు మూఁడింటిలో నొకటి: చూ, మోహచతుష్టయము.

కూర్మరాట్టు. సం. వి. జ్. పుం. 1. ఆదికూర్మమగు విష్ణువు: చూ, విష్ణువు. 1; 2. గుజ్జువుముఖముగల చేప: చూ. మత్స్యము. 1.

కూర్మాంగన్యాయము. పా తాఁబేలు తన తల కాళ్లు మొదలగునవి లోపలకులాగుకొని భద్రపఱచుకొను విధము

కూర్మావతారము. అం: చూ, కూర్మము. 3. (చూ,అవతారములు) (ఇందులవృత్తాంతము.— పూర్వము అమృతమును సంపాదించుటకు దేవతలును రాక్షసులును గలిసి పాలసంద్రమును దఱచిరి. అందుకు మందరగిరియను పర్వతముఁ గవ్వముగఁ జేసికొనిరి. వాసుకియనుపామును దాడ్రుగఁజేసికొనిరి. అప్పుడు అందు అమృతము పుట్టెను. ఆబరువైన గిరిసముద్రమున మునుఁగకుఁడుటకు శ్రీమహావిష్ణువే తాఁబేలయి కొండక్రిందనుండి తనవీఁపున దానిమోసెను దీనినే కూర్మావతారమందురు.)

కూర్మిక. సం. వి. ఆ. స్త్రీ. వీణయొక్క తంతులనుండి పుట్టు స్వరాళిక్రియమైన యొకానొక క్రియ: చూ, స్వరము. 2.

కూలంకష. సం. వి. ఆ. స్త్రీ. ఏఱు: చూ, నది.

కూలంకషము. సం. వి అ. పుం. మున్నీరు: చూ, సముద్రము.

కూలఁబడు. ద్వ. అ. క్రి. (కూలన్ + పడు) కూలు,పడు. రామా. 8. ఆ. 61: చూ, దొరలు (స్వార్థమున పడు)

కూలకము. సం. వి. అ. పుం, న. 1. స్తూపము, మట్టిమొదలగు వానిదిబ్బ: చూ, భూమి. 1; 2. ఎడగడ్డ: చూ, తీరము; పుం. 3. లక్కజనించుకొండ. కృమిపర్వతము: చూ, పర్వతము.

కూలదిక్కు. సం. వి. శ్. స్త్రీ. చెలియలికట్టు: చూ, తీరము.

కూలము. సం. వి. అ. న. 1. దరి: చూ, రోధస్సు; 2. గుంటు. పల్లము: చూ, రంధ్రము. 1; 3. స్తూపము, మట్టిలోనగువాని దిబ్బ: చూ. భూమి. 1; 4. మూఁకవెనుక: చూ, సేన. 1; 5. కొండకొమ్ము, కూటము: చూ, శిఖరము; 6.= కొలకు, తటాకము: చూ, సరస్సు. 1.

కూలవతి. సం. వి. ఈ. స్త్రీ. ఏఱు: చూ, నది.

కూలహంటకము. సం. వి. అ. పుం. నీళ్ళసుడి: చూ, సుడి. 1.

కూలహాలము. సం. వి. అ. పుం. శ్రావణి *: చూ, బోడతరము.

కూలి. దే. వి. 1. పనిచేసినదానికిఁగా నిచ్చెడు ధనము. వేమన. 1168: చూ, వేతనము; 2. పన్ను. మార్క. 5. ఆ. 138: చూ, సిస్తు. 1.

కూలివాఁడు. దే. వి. జీతగాఁడు: చూ, సంబళకాఁడు.

కూలు. దే. వి. 1. లవిత్రమూలము: చూ, లవిత్రము; అ. క్రి. 2. పడు: చూ, కూలఁబడు; 3. చచ్చు. భార. ఉద్యో. 2, ఆ. 271: చూ. మరణించు.

కూలుచు. దే. ప్రే. రూ-కూల్చు. 1. పడఁజేయు; 2. చంపు: చూ, మరణించు.

కూల్చు. దే. ప్రే. —పై.— (పడఁజేయు.— భార. సభా. 2. ఆ. 296 )

కూవరము. సం. వి. మనోజ్ఞము: చూ హృద్యము.

కూవరి. సం. వి. న్. పుం. రథము: చూ, శకటము. 1.

కూవలము. సం. వి. అ. న. అనేక రంగులుగల కలువపువ్వు: చూ, పద్మము. 1.

కూశ్మాండకము. సం. వి. అ. పుం. రూ-కూష్మాండకము *: చూ, మహాఫలము.

కూశ్మాండము. సం. వి. అ. పుం. —పై.—

కూష్మాండకము. సం. వి. అ. పుం. —పై.—

కూష్మాండము. సం. వి. అ. పుం. 1.—పై.—; 2. ఒకానొక పిచాచము: చూ, భూతము;

3. ఘ్రాణము, ఘ్రాణవిశేషము (అనికొందఱు): చూ, శిశువు; అం. 4. ఘృతములలో నొకటి: చూ, ఘృతములు.

కూష్మాండస్తేయన్యాయము. పా° గుమ్మడికాయల దొంగయనిన బుజము తడవిచూచుకొనెననిన రీతి.

కూష్మాండి. సం. వి. ఈ. స్త్రీ. గౌరి: చూ, పార్వతి. 1.

కూష్మాండుఁడు. సం. వి. అ. పుం. దేవతాగణవిశేషము: చూ, దేవతావిశేషము.

కూసము. వై. వి.= కూర్పాస: చూ, రూ- కుప్పసము- కుబుసము.

కూసలేఁగుట. జా. వా. సర్పకంచుకముతో సమమగుట. "వాని వ్యవహారమంతయుఁ కూసలేఁ ఆయెన్." (కోసలేఁగుట అనికొందఱు)

కూసువిద్య. వా. వి. అలవాటయినపని "అభ్యాసము కూసువిద్య."

కూహకుఁడు. సం. విశే. 1. ఈర్ష్యాళువు: చూ, గూడుకాఁడు; 2. మోసకాఁడు: చూ, వంచకుఁడు 1.

కూహన. సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ- కుహన.

కూళ. వై. విశే = క్రూర. రూ- కూళఁడు. కుత్సితుఁడు రసి. 3, అ. 89. వేమన. 1164: చూ, వ్యాధుఁడు. 2.

కూళతనము. దే. విశే. కుచ్ఛితము: చూ, హీనము. 1.

కూళుఁడు. వై. విశే. 1. = క్రూర. కుత్సితుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 2 మూఢుఁడు: చూ, మూర్ఖుఁడు.

కూళ్ళాపిడలు. దే. వి. ఒకరకపుపిండివంట: చూ, భక్ష్యము.

# కృ

కృ. సం. అవ్య. ఎక్కడ: చూ, యత్ర. 1.

కృంతత్రము. సం. వి. అ. న. నాఁగలి: చూ, లాంగలము. 1.

కృంతనము. సం. వి. అ. న. కత్తిరించుట: చూ, ఛేదనము.

కృకణము. సం. వి. అ. పుం. 1. కక్కెర, పిన్నకక్కెర (అనికొందఱు): చూ, బకము; 2. క్రిమి: చూ, పురుగు.

కృకము. సం. వి. అ. పుం. కంఠనాళము: చూ, బొండుగ; 2. కంఠము: చూ, మెడ; 3. ముచ్చిలిగుంటమీఁది బుడిపి: చూ, బుడిపి.

కృకరము. సం. వి. అ. పుం. 1. ఉపవాయువులు అయిదింటిలో నొకటి: చూ, ఉపవాయువులు. (చూ, వాయువు); 2. కక్కెర, పిన్నకక్కెర (అనికొందఱు- రెండు నొకటియే యనికొందఱు): చూ, బకము; 3. చవ్యమను మందుదినుసు: చూ, రాజాగ్వము; 4. కరవీరము*: చూ, హయమారకము:

కృకరుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

కృకల. సం. వి. ఆ. స్త్రీ. కొండి*: చూ, పిప్పలి. 1.

కృకలాశము. సం. వి. అ. పుం. రూ- కృకలాసము. 1. ఊసరవెల్లి: చూ, సరటము; 2. తొండ: చూ, సరటము.

కృకలాసము. సం. వి. అ. పుం. —వై.—

కృకలాసుఁడు. సం. వి. అ. పుం. గర్వగ్రస్తుఁడు: చూ, పొగరుఁబోతు.

కృకవాకుధ్వజుఁడు. సం. వి. అ. పుం. కుమారస్వామి: చూ, స్కందుఁడు.

కృకవాకువు. సం. వి. ఉ. పుం. 1. కోడి: చూ, పుంజు; 2. విశాకరమనుగ్రామకోడి: చూ,

పుంజో; 3. మైలచాయతొండ: చూ, సరటము; 4. తొండ: చూ. సరటము; 5. నెమలి: చూ, మయూరము.

కృకాటిక. సం. వి. అ. స్త్రీ. పెడతల. పెడతల యందలి మచ్చలిగుంట (అనికొందఱు): చూ, పెడతల.

కృకాలాసము. సం. వి. అ. పుం: చూ, రూ- కృకలాసము.

కృకరము. సం. వి. అ. పుం. చిల్లమడ్డి*: చూ, సల్లకీ.

కృఛ్రము. సం. వి. అ. న. 1 కసటు: చూ. పాపము. 1; 2. బాధ: చూ. దుఃఖము; 3. సాంతపనాదికము; దీనియందలి కృఛ్రము- అర్ధకృఛ్రములను గుఱించి యిదివఱకు వ్రాయఁబడియె. మిగత కృఛ్రములను వివరములును కొంతవఱకు నిచ్చట తెలుపఁబడును.— 1. కృఛ్రాతికృఛ్రము:— ఇరువదియొక్క దినములు పాలుత్రాగియుండుట; 2. చాంద్రాయణ వ్రతము:— వ్రతారంభమగు బహుళ పాడ్యమినాఁడు పదునాలుగు కబళములు భుజించి విదియ మొదలుకొని క్రమముగ దినమునకొక కబళమువంతున తగ్గించుకొనుచువచ్చి అమవసనాఁడు యేమియుఁదినక ఉపవసింపవలయును. శుక్ల పాడ్యమినాఁడు ఒకకబళము భుజించి విదియ మొదలుకొని ఒక్కొక్క కబళమువంతున యెక్కువగ భుజించుచు పూర్ణిమతో వ్రతము సమాప్తినొందింపవలయును. ఇట్లు ఒకనెల ఆచరించుట చాంద్రాయణవ్రతము: కబళము= కోడిగ్రుడ్డంత పరిమాణము. అంతకంటె యెక్కువగా గ్రహించినయెడల పుణ్యలోకప్రాప్తిగాని పాపనివారణముగాని కలుగఁజాలదు; 3. తప్తకృఛ్రము:— మూఁడుదినములు వేఁడినీరును, మూఁడుదినములు వేఁడిపాలును, మూఁడుదినములు వేఁడినేయియును త్రాగి మూఁడుదినములు నేమియుఁ త్రాగక తినక ఉపవసించుట తప్తకృఛ్రమనంబడును. ఆఱుపలములనీరును, మూఁడుపలముల పాలును, ఒకపలము నేయియు త్రాఁగవలయును; 4. త్రిరాత్రికృఛ్రము:— మూఁడుదినములుపవసించుట; 5. పరాకకృఛ్రము:— ఇతరచింతలు లేక నియమాన్వితుఁడై పండ్రెండుదివసము లుపవసించుట; 6. ప్రాజాపత్యకృఛ్రము:— మూఁడు దినములు ఉదయమునందు భుజించి మూఁడుదినములు సాయంకాలమునందు భుజించి మూఁడు దినములయాచితముగ లభించిన దానినిభుజించి మూఁడుదినములేమియుఁదినక ఉపవసించుట— ప్రాజాపత్యకృఛ్రమునకు ప్రత్యామ్నాయములు చెప్పఁబడుచున్నవి:— 1. దేవ్యయుతము ఒక ప్రత్యామ్నాయము. దేవ్యయుతమనఁగా పదివేలపర్యాయములు గాయత్రిని జపించుట; 2. ప్రాణాయామశతద్వయము రెండవ ప్రత్యామ్నాయము. అనఁగా ఇన్నూఱుపర్యాయములు ప్రాణాయామములుచేయుట; 3. పుణ్యతీర్థమునందు అనార్ద్రశిరస్స్నానము పండ్రెండు పర్యాయములు చేయుట మూఁడవప్రత్యామ్నాయము. అనార్ద్రశిరస్స్నానము అనఁగా ఒకపర్యాయము స్నానముచేసి తల యాఱినతరువాత మరలస్నానముచేయుట. ఇటుల పండ్రెండుపర్యాయములు చేయుట; 4. రెండామడ దూరమందున్న పుణ్యతీర్థమునకు యాత్రార్థముపోవుట యీనాలుగున్నూ కృఛ్రమునకు ప్రత్యామ్నాయములు; 7. సాంతపనకృఛ్రము:— గోమూత్రము, గోమయము, గోక్షీరము, పెరుగు, నెయ్యి, కుశోదకము వీనిని క్రమముగ ఒక్కొక్క దినమునందు భుజించి యేడవనాఁ డేమియు తినక ఉపవసించుట సాంతపనకృఛ్రమనంబడును; ఇంకను

పాదకృచ్ఛ్రము. త్రిపాదకృచ్ఛ్రము మున్నగు
అంతర్భాగములను అందులకు ప్రాయశ్చిత్త
ములను (శేషించికలవు కొంతవఱకుతా
వులందు చూడనగును; పంచగవ్యమును అందలి
వివరణముం గూడనిచ్చుట అనవసరమైనను విష
యమొక చోటనే సుబోధకముగనుండుటకు
వివరింపఁబడును.—పంచగవ్యము:— గోమూ
త్రము, గోమయము, గోక్షీరము, గోదధి,
గోఘృతము, కుశోదకము అను నీయాఱుచేరిన
దానికి నామము. ఇది పవిత్రమైనది. పాప
ములశోధించును. కృష్ణవర్ణముగలగోవుయొక్క
మూత్రమును, శ్వేతవర్ణముగల గోవుయొక్క
గోమయమును, తామ్రవర్ణముగలగోవుయొక్క
పాలును, రక్తవర్ణముగల గోవుయొక్క పెరు
గును, కపిలవర్ణముగల గోవుయొక్క నేతిని
పంచగవ్యమునకు గ్రహింపవలయును. ఇటుల
ప్రత్యేకవర్ణములుగల గోవులు లభింపనియెడల
గోమూత్రాది యైదుద్రవ్యములను కేవలకపిల
వర్ణముగలగోవుయొక్కసంబంధములేనివానినే
గ్రహింపవలయును. గోమూత్రమును ఒక
పలమును, గోమయమును అంగుష్ఠార్ధమును,
గోక్షీరము యేడుపలములును, గోదధిని మూఁ
డుపలములును, గోఘృతమును ఒకపలమును.
కుశోదకమును ఒకపలమును పంచగవ్యము
నిమిత్తము గ్రహింపవలయును; గాయత్రీ
మంత్రముతో గోమూత్రమును. "గంధద్వా
రాందురాధర్షాం" అను మంత్రముతో గోమ
యమును, 'ఆప్యాయస్వ' అనుమంత్రముతో
క్షీరమును. దధిక్రావ్ణో అకారిషం' అను మం
త్రముతో పెరుగును, 'శుక్రమసి' అనుమంత్ర
ముతో ఆజ్యమును, 'దేవస్యత్వా' అనుమంత్ర
ముతో కుశోదకమును గ్రహించి వీనినన్నిటిని
అగ్ని సన్నిధిని ఉంచవలయును. ఈద్రవ్య
షట్కమును"ఆపోహిష్ఠా"అను ఋక్కుతో
గలిపి "మానస్తోకే" అనియెడి మంత్రముతో
అభిమంత్రింపవలయును. ఈపంచగవ్యమును
యేడింటికి తక్కువకాకట్టియు, కొనలుకలిగి
నట్టియు, చిలుకరంగు కలిగినట్టియు, దర్భల
తోగ్రహించి యథాశాస్త్రముగ పంచగవ్య
మును హోమము చేయవలయును. "ఇరావతీ.
ఇదంవిష్ణుర్విచక్రమే, మానస్తోకే, శమగ్నిరగ్ని
భిః" అనెడి మంత్రచతుష్టయముతో హోమ
మొనర్చి హోమముచేయఁగా మిగిలిన పంచ
గవ్యమును బ్రాహ్మణులు త్రాగుదురు. ఆపం
చగవ్యముంచిన పాత్రమునందు గోమూత్రాది
కమును కలుపుట. యెత్తుట మున్నగునవియ
న్నియు ప్రణవపూర్వకముగనే ఆచరింపవల
యును. ప్రజ్వలించునట్టి యగ్నిహోత్రము
ఎండినట్టి కట్టెలనెటులదహించునో
ఆవిధముగా బ్రహ్మకూర్చము(పంచగవ్యము)
యొక్క ప్రాశనము సకలప్రాణులదేహమునం
దుండు త్వగస్థిసంబంధమగు పాపజాలమును
దహించును. లోకత్రయమునందుండు దేవతలు
ఈపంచగవ్యము నధిష్ఠించియున్నారు. కావున
ఇయ్యది పవిత్రముగుచున్నది. వరుణుఁడు
గోమూత్రమునందును, గోమయమునందు అగ్ని
యును, దధియందువాయువును, క్షీరమునందు
చంద్రుఁడును, నేతియందు సూర్యుఁడును ప్రవే
శించియున్నారు. కావునపంచగవ్యముసర్వదేవ
తామయము. అని పరాశరస్మృతి మున్నగునవి
చెప్పుచున్నవి.): చూ, కృచ్ఛ్రాతికృచ్ఛ్రము,
చాంద్రాయణవ్రతము, తప్తకృచ్ఛ్రము, త్రిరా
త్రకృచ్ఛ్రము, పరాకకృచ్ఛ్రము, ప్రాజాపత్య
కృచ్ఛ్రము. సాంతపనకృచ్ఛ్రము, పంచగవ్యము.

కృచ్ఛ్రాతికృచ్ఛ్రము. పా. ఇరువదియొక్క దిన
ములు పాలుత్రాగియుండుట. అన్నకు పెండ్లి
కాకయున్నప్పుడు అతనియనుమతి లేకయే
పెండ్లాడిన తమ్మునకు (పరివేత్త) పిల్లనిచ్చిన

కన్యాదాతకు యీపాప్రాయశ్చిత్తము విధింపఁబడి యున్నది: చూ, కృచ్ఛ్రము.

కృఘాౄ్రి. సం. వి. ఇ. పుం: చూ, బిల్వాంతర*.

కృఘాౄ్రిగ్ధము. పా: చూ, అగ్రకృచ్ఛ్రము.

కృణువు. సం. వి. ఉ. పుం. చిత్రికారుఁడు: చూ, చిత్రికరుఁడు.

కృతకము. సం. విణ. 1. మనుష్యులచేఁ జేయఁబడినది: చూ, కృత్రిమము; (తె. ప):— ఏలి; 2. బిడాలవణము: చూ, లవణము. 1.

కృతకర్మ. సం విణ. (న్. ఈ. న్.) నేర్పరి: చూ, సమర్థుఁడు.

కృతకర్ముఁడు. సం. విణ. —సై—

కృతకాద్రి. సం. వి. ఇ. పుం. క్రీడించుటకొఱకు నేర్పఱుపఁబడిన కొండ, చేతిగట్టు: చూ. పర్వతము.

కృతకృత్యుఁడు. సం. విణ. నెఱవేఱిన పనిగలవాఁడు: చూ, సుకృతి. 1.

కృతకోటి. సం. వి. ఇ. పుం. 1. కాశ్యపముని: చూ, ముని. 1; 2. ఉపవర్షముని: చూ, ముని. 1.

కృతగంధ. సం. వి. ఆ. స్త్రీ. కుందారి *: చూ, దుష్టావేశ.

కృతఘ్నుఁడు. సం. విణ. చేసిన మేలు మఱచినవాఁడు.

కృతచ్ఛిద్ర. సం. వి. ఆ. స్త్రీ. కోశాతకి *: చూ, బీఱ. 2.

కృతజిజ్ఞము. సం. వి. అ. పుం. గర్భాండము *: చూ, పుత్రజీవి.

కృతజ్ఞము. సం. వి. అ. పుం. కుక్క: చూ, శునకము.

కృతజ్ఞుఁడు. సం. విణ. చేసిన మేలుతలఁచువాఁడు: చూ, శుభంకరుఁడు.

కృతత్ర. సం. వి. ఆ. స్త్రీ. త్రాయమాణ *: చూ, వార్షికము. 1.

కృతత్రాణ. సం. వి. ఆ. స్త్రీ. కలుఁగానుగు*: చూ, వార్షికము. 1.

కృతపడు. మి. అ. క్రి. (కృతము + పడు) 1. కడచు. భార. కర్ణ. 1, ఆ. 226: చూ, గతించు; 2. విడఁబడు. మార్క. 1, ఆ. 97: చూ, విరియు. 5.

కృతపుంఖుఁడు. సం. విణ. గుఱితప్పక యేయువాఁడు: చూ, నూటికాఁడు. 2.

కృతఫలము. సం. వి. అ. న. తక్కలిపండు: చూ, వైజయంతి.

కృతమాల. సం. వి. ఆ. స్త్రీ. మలయపర్వతమునఁబుట్టిన కృతమాలయనునది: చూ, నది.

కృతమాలకము. సం. వి. అ. పుం. 1. నల్లగుడ్లగూబ: చూ, సకినంపుఁబులుఁగు; 2. రేల*: చూ, రేల.

కృతమాలము. సం. వి. అ. పుం. ఆరగ్వధము *: చూ, రేల.

కృతము. సం. వి. అ. న. 1. యుగములు నాలుగింటిలో మొదటిది: చూ, యుగములు; 2. జాతకగ్రంథములంబట్టి— కృతయుగంబున గర్భాధానలగ్నమే జన్మలగ్నము. (చూ, జన్మలగ్నసమయము.); క్రి. విణ. 2. పెల్లు: చూ, హెచ్చు. 2; విణ. 3. చేయఁబడినది: చూ, వ్యాపారము 1; 4. నొప్పింపఁబడినది: చూ, హింసితము.

కృతముఖుఁడు. సం. విణ. 1. నేర్పరి: చూ, సమర్థుఁడు; 2. కృతపుంఖుఁడు: చూ, నూటికాఁడు. 2.

కృతమూలకము. సం. వి. అ. పుం. నల్లగుడ్లగూబ: చూ, సకినంపుఁబులుఁగు.

కృతయుగము. అం: చూ, కృతము. 1-2.

కృతలక్షణుఁడు. సం. విణ. గుణములఁ జేతఁబ్రసిద్ధిఁ జెందినవాఁడు: చూ, సరస్వంతుఁడు. 3.

కృతవేదన. సం. వి. ఆ. స్త్రీ. చేఁబీఱ *: చూ, బీఱ 2.

కృతశ్రిమము. సం. విణ. మహోత్సాహము: చూ, సంతోషము.

కృతసాక్షులు. అం. లిఖితుఁడు, స్మారితుఁడు, యదృచ్ఛాభిజ్ఞుఁడు, గూఢుఁడు, ఉత్తరుఁడు.5

కృతసాపత్నిక. సం. వి. అ. స్త్రీ. మొదటి పెండ్లాము: చూ, భార్య.

కృతహస్తుఁడు. సం. వి. అ. పుం. 1. గురితప్ప కయేయువాఁడు: చూ, సూటికాఁడు. 2; 2. నేర్పరి: చూ, సమర్థుఁడు.

కృతాంత. సం. వి. ఆ. స్త్రీ. రేణుక యనుగంధ ద్రవ్యము: చూ, రాజార్హము.

కృతాంతజనకుఁడు. సం. వి. అ. పుం. ఇనుఁడు: చూ, సూర్యుఁడు.

కృతాంతము. సం. వి. అ. న. 1. అశుభకర్మము: చూ, రుశతి; 2. భాగ్యము: చూ, సంపత్తి; 3. స్థిరమైనపక్షము చూ, సిద్ధాంతము. 1.

కృతాంతుఁడు. సం. వి. అ. పుం. 1. జేముఁడు: చూ, యముఁడు; 2. ధూర్తుఁడు : చూ, వ్యాధుఁడు.2.

కృతార్థుఁడు. సం. విణ. ధన్యుఁడు: చూ, సుకృతి.1.

కృతాలయము. సం వి. అ. పుం. కప్ప: చూ, మండూకము. 1.

కృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఇరువది: చూ, వింశతి; 2. వాగ్విషయకర్మ: చూ, ఉత్తర ప్రత్యుత్తరములు; 3. ప్రయత్నము : చూ, యత్నము; 4. వర్గగణితము : చూ, వర్గు; 5. చేయుట: చూ, వ్యాపారము.1; 6. నొప్పించుట: చూ, దుఃఖము; 7. ప్రబంధము: చూ, పుస్తకము; న. పుం. 8. చేదువరి: చూ, విద్వాంసుఁడు; విణ. 9. ధన్యుఁడు: చూ, సుకృతి. 1; 10 నేర్పరి: చూ, సమర్థుఁడు; అం. 11. ఛందస్సులు ఇరువదియాఱింటిలో నొకటి: చూ, ఛందస్సులు; 12. సప్తసంతానములలో నొకటి: చూ, సంతానములు. (చూ, ప్రబంధము) (చూ, కావ్యము)

కృతికరుఁడు. సం. వి అ. పుం. రావణుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

కృతికర్త. పా. గ్రంథము విరచించినవాఁడు, కవి: (చూ, కవులు):— కవులు యేడువిధములైరి. వివేకి, వాచక, రోచిక, అర్థిక, శిల్పిక, భూషణార్థి, మార్దవానుగులు. (వివేకి గణయతి ప్రాస శబ్దార్థజాని; అనుప్రాసబంధనియ మాగులనెఱింగి చెప్పువాఁడు వాచకుఁడు; మృదుమధురముగ గపితి రచించువాఁడు రోచికుఁడు; మితశబ్దములలో విపులార్థమిముడ్చువాఁడు అర్థికుఁడు; యమకాదుల జెప్పువాఁడు శిల్పకుఁడు; అలంకారములఁ బొందుపఱచెడివాఁడు భూషణార్థి: మృదుపదములలోనె విరళార్థమును గనముసుజూపువాఁడు మార్దవానుగుఁడు.) (చూ, కావ్య నాటకములఁ కావ్యము)

కృతిపతి. సం. వి. ఇ. పుం గ్రంథమునఁకితమందిన వాఁడు.

కృతిభర్త. స. వి. ఋ. పుం— వై.—( స్త్రీలింగమందు.— కృతిభర్త్రి.)

కృతుఁడు. సం. వి. అ. పుం. కడుపుకూటివాఁడు: చూ, జిఘత్సువు.

కృత్తము. సం. విణ. 1. ఛేదింపఁబడినది: చూ, ఛేదితము; 2. కోయఁబడినది: చూ, వృష్ణము.

కృత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. చర్మము: చూ, తోలు. 1; 2. ఒకానొక దేవత: చూ, వేలుపు; 3. చెట్టుపైపట్ట: చూ, పట్ట. 1; 4. బుజపత్రి *: చూ, భూర్జము; 5. కత్తిరించడము: చూ, ఛేదనము.

కృత్తిక. సం. వి. అ. స్త్రీ. = కత్తెర- కార్తి. (ఆఱు నక్షత్రములు కలిసి మంగలికత్తివలె నుండును) ఇరువదియేడు నక్షత్రములలో నొకటి: చూ, నక్షత్రము. 1. (కృత్తియని విశ్వకోశము); 2. = కిత్తి- కిత్తు. అగ్ని: చూ, నిప్పు.

కృత్తికాసుతుఁడు. సం. వి. అ. పుం. కుమారస్వామి: చూ, స్కందుఁడు.

కృత్తివాసుఁడు. సం. వి. స. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

కృత్నువు. సం. వి. ఉ. పుం. శిల్పి: చూ. స్వర్ణకారుఁడు.

కృత్యా. సం. వి. ఆ. స్త్రీ. 1. చేయుట: చూ, వ్యాపారము. 1; 2. ఒకానొక దేవత: చూ, వేలుపు; 3. రచించినముగ్గు: చూ, రంగవల్లి.

కృత్యము. సం. వి. అ. న. 1. పని: చూ, వ్యాపారము. 1; విశే. 2. ధనాదులచే భేదింపఁదగినది. (శత్రుగృహాది)

కృత్యుఁడు. సం. విశే. కుపితుఁడు: చూ, రోషణుఁడు.

కృత్రిమ. సం. వి. ఆ. స్త్రీ. 1. గజపిప్పలి*: చూ, పిప్పలి. 1; 2. రసవాదమువలనఁ జేసిన వెండి: చూ, లోహము. 1.

కృత్రిమకము. సం. వి. అ. పుం. తురుష్కమను గంధద్రవ్యము: చూ, రాజావర్తము.

కృత్రిమధూపకము. సం. వి. అ. పుం. అనేక పరిమళవస్తువులు కూర్చిచేసినధూపద్రవ్యము: చూ, వాసన.

కృత్రిమము. సం. వి. అ. న. 1. కృత్రిమపు ఉప్పు, బిడాలవణము- కాచలవణము (అనికొందఱు): చూ, లవణము. 1; 2. చిల్లమడ్డి *: చూ సల్లకి; పుం. 3. జవాదియను గంధద్రవ్యము: చూ. రాజావర్తము; 4. తురుష్కమను గంధద్రవ్యము: చూ, రాజావర్తము; 5. శైలము: చూ, రసాంజనము; 6. రతిబంధవిశేషము: చూ, రతిబంధము; విశే. 7. మనుష్యులచేఁ జేయఁబడినది. ఏలి: చూ, కృతకము.1.

కృత్రిముఁడు. సం. విశే. 1: చూ, కపటి. 1; 2. క్రీతుఁడు: చూ, పుత్రుఁడు. 1; అం. 3. పుత్రులు నలుగురిలో నొకఁడు: చూ, పుత్రులు; 4. పుత్రులు పండ్రెండుగురిలో నొకఁడు: చూ, పుత్రులు.

కృత్సము. సం. వి. అ. న. జలము: చూ, నీరు.1.

కృత్స్నము. సం. వి. అ. న. 1. కడుపు: చూ, భ్రూణము. 1; 2. జలము: చూ, నీరు. 1; విశే 3. అంతయు: చూ, సర్వము.

కృదంతము. పా. ధాతువులవలనఁగలుగు నామవాచకములు కృదంతములు.

కృదరము. సం. వి. అ. న. ధాన్యాదిగృహము: చూ, పంటసాల; (చూ, సదనము. 1)

కృద్ధ. అం. గాంధర్వవేదమునందలి భావాధ్యాయప్రమేయములోని దృష్టులు యెనిమిదింటిలో నొకటి: చూ, దృష్టులు.

కృప. సం. వి. ఆ. స్త్రీ. 1. కనికరము: చూ, దయ; 2. దయారసము: చూ. కరుణము.2

కృపణధనన్యాయము. పా. లోభివాని సొమ్ము పరుల పాలగునను విధము.

కృపణము. సం. వి. అ. పుం. 1. కీటకము: చూ, పురుగు; విశే. 2. కుటిలమైనది.

కృపణుఁడు. సం. విశే. 1. పిసినిగొట్టు: చూ, లోభి; 2. కుత్సితుఁడు: చూ, వ్యాధుఁడు.2.

కృపాణకము. సం. వి. అ. పుం. కత్తి- పెద్దకత్తి: చూ, రిష్టి. 2.

కృపాణము. సం. వి. అ. పుం. —పై.—

కృపాణి. సం. వి. ఈ. స్త్రీ. 1. —పై.—; 2. కత్తెర: చూ, బాణము. 1.

కృపాణిక. సం. వి. ఆ. స్త్రీ పెద్దకత్తి: చూ, రిష్టి. 2.

కృపాద్వైతుఁడు. సం. వి. అ. పుం. బుద్ధదేవుఁడు: చూ, బుద్ధుఁడు.

కృపాళువు. సం. విశే. ఉ. కనికరముగలవాఁడు: చూ, దయాళువు.

కృపి. సం. వి. ఈ. స్త్రీ. ద్రోణుని పెండ్లాము: చూ, భార్య. 1.

కృపీటకము. సం. వి. అ. న. కడుపు: చూ, భూర్జిణము. 1.

కృపీటము. సం. వి. అ. న. 1. —పై—; 2. జలము: చూ, నీరు. 1; 3. అడవి: చూ, విపినము; 4. చిదుగు: చూ, సమిధ.

కృపీటపాలము. సం. వి. అ. న. 1 ఓడతెడ్డు, కేనిపాతము: చూ, పీలి. 2; పుం. 2. కడలి: చూ, సముద్రము; 3. గాలి: చూ, వాయువు.

కృపీటయోని. సం. వి. ఇ. పుం. అగ్ని: చూ, నిప్పు.

కృపీసుతుఁడు. సం. వి. అ. పుం. అశ్వత్థామ: చూ, ద్రోణాయనుఁడు.

కృపుఁడు. సం. వి. అ. పుం. ద్రోణునిమఱఁది; (వ్యాసమహర్షి యనివిశ్వకోశము)

కృమి. సం. వి. ఇ. పుం. 1. కీటకము: చూ, పురుగు; 2. చెట్లమీఁది నల్లపుఁగు: చూ, పురుగు; 3. లత్తుక: చూ, లక్క.

కృమికంటకము. సం. వి.అ న.1.క్రిమిఘ్నము*: చూ, వాయువిళంగము; 2. చిత్రమూలము*: చూ, వహ్నిసంజ్ఞికము; 3. ఉదుంబరము *: చూ, మేడి.

కృమిఘ్న. సం. వి. అ. స్త్రీ. పసుపు: చూ, వర్ణము. 6.

కృమిఘ్నము. సం. వి. అ. పుం. 1. విడంగము: చూ, వాయువిళంగము; 2. నీరుల్లి *: చూ, పలాండువు; 3. లశునము *: చూ, వెల్లుల్లి; 4. పారిభద్రము *: చూ, నూతిమ్మదారువు; 5. జీడి. *: చూ, భల్లాతకి.

కృమిఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. విడంగము*: చూ, వాయువిళంగము.

కృమిజ. సం. వి. అ. స్త్రీ. లత్తుక: చూ, లక్క.

కృమిజగ్ధము. సం. వి. అ. న. అగురు: చూ, రాజార్హము.

కృమిజము. సం. వి. అ. న. —పై—

కృమిరిపువు. సం. వి. ఉ. పుం. విడంగము *: చూ, వాయువిళంగము.

కృమిశుక్తి. సం. వి. ఇ. స్త్రీ. జలశుక్తి: చూ, సంకు. 1.

కృమిశైలకము. సం. వి. అ. పుం పుట్ట: చూ, వల్మీకము.

కృమీలకము. సం. వి. అ. న. వనముద్గము *: పెసర.

కృవి. సం. వి. ఇ. పుం. తంతువాయుఁడు: చూ, సాలెవాఁడు

కృశనము. అం. శస్త్రములలో నొకటి: చూ, శస్త్రములు (చూ, బాణము. 1.)

కృశము. సం. విశ. 1. అల్పము: చూ, స్వల్పము; 2. బక్కచిక్కినది: చూ, బక్క; 3. సన్నము: చూ, సూక్ష్మము. 4.

కృశమైనకడుపు. పా. ఉత్తమస్త్రీ సామాన్య లక్షణములలో నొకటి. (పుత్రభోగభాగ్య సుఖములనుభవించును): చూ, ఉత్తమ స్త్రీ సామాన్యలక్షణములు.

కృశాంగి. సం. వి. ఈ. స్త్రీ. 1. అంకోలగిరి *: చూ, ప్రియంగువు; విశ. 2. బక్కచిక్కినది. (ఆఁడుది): చూ, స్త్రీ.

కృశానురేతసుఁడు. సం. వి. స్.పుం.ముక్కంటి: చూ, శివుఁడు.

కృశానువు. సం. వి. ఉ. పుం. అగ్ని: చూ, నిప్పు.

కృశాశ్వి. సం. వి. న్. పుం. మేళముకట్టుకొని జీవించువాఁడు: చూ, శైలూషుఁడు.

కృశించు. సం. అ. క్రి. 1. బక్కచిక్కు: చూ, సాటుసాటుపోవు; 2. సన్నగిల్లు: చూ, సన్నవాఱు.

కృషకము. సం. వి. అ. పుం. రూ- కృషికము. ఫాలము: చూ, కఱుగోల.

కృషకుఁడు. సం. వి. అ. పుం. దున్నువాఁడు: చూ, వ్యవసాయి. (రూ- కృషికుఁడు- కర్షకుఁడు- కార్షకుఁడు- కార్షికుఁడు)

కృపాణుఁడు. సం. వి. అ. పుం. —వై.—

కృపాణువు. సం. వి. అ. పుం: చూ, కృశానువు.

కృషి. సం. వి. ఇ. స్త్రీ. 1.=కరిసనము, కిసుక: చూ, వ్యవసాయము: అం. 2. మనుజవృత్తులు నాలుగింటిలో నొకటి: చూ, మనుజవృత్తులు; 3 అర్థవేదములోని అష్టవర్గములో నొకటి: చూ, అష్టవర్గము; 4. చతుష్షష్టి విద్యావిభాగములలోని అర్థవేదము. (యజుర్వేదోపవేదము) కృషియనఁగా.—భూమినిసున్ని పైఁబెట్టుటకు నిర్ణయసింధువు, సస్యానందము, రెట్టమతశాస్త్రము మొదలగు గ్రంథములు గలవనియు, వానియందు వర్షలక్షణాదులుఁ దెలుపఁబడియున్నవనియు, వాణిజ్యము వ్యవహారము చేయునప్పుడు ధాన్యాదులఁ గొనుకాలము, విక్రియకాలము, లాభవిధి, విక్రియనిషేధవస్తు వివరణములు గలవనియు దెలుపఁబడియున్నవి.) చూ, ఉపవిద్యలు.

కృషికము. సం. వి. అ. పుం, న: చూ, రూ—కృషకము.

కృషికుఁడు. సం. వి. అ. పుం. 1. సున్నువాఁడు: చూ, వ్యవసాయి; విణ. 2. దున్నుకొని జీవించువాఁడు: చూ వ్యవసాయి.

కృషిబలుఁడు. సం. విణ. దున్నుకొని జీవించువాఁడు: చూ, వ్యవసాయి.

కృషీవలము. సం. విణ. కాకిదొండ *: చూ, దొండ.

కృషీవలుఁడు: చూ, కృషికుఁడు.

కృష్ణరుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

కృష్టము. సం. విణ. 1. సీత్యము ఒకసారి దున్నఁబడినది (నేల): చూ, భూమి. 1; 2. ఈడువఁబడినది.

కృష్టపచ్యము. సం. విణ. వ్రీహిధాన్యము: చూ, ధాన్యము.

కృష్టపాక్యము. సం. విణ: చూ, కృష్టపచ్యము.

కృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1.దుక్కి: చూ, కృషి.1; పుం. 2. చేదువరి: చూ, విద్వాంసుఁడు.

కృష్ణ. సం. వి. ఆ. స్త్రీ. 1. కృష్ణానది: చూ, నది; 2. యమునానది: చూ, నది; 3. ద్రౌపది: చూ, స్త్రీ; 4. ద్రాక్ష *: చూ, స్వాదుఫల: 5 నీలి *: చూ, రంజని; 6. కొండి *: చూ, పిప్పలి. 1; 7. జీలకఱ్ఱ నల్లజీలకఱ్ఱ (అనికొందఱు)*: చూ, సుషవి; 8. కృష్ణతులసి*: చూ, తులసి; 9. నల్లగలిజేరు *; చూ, వర్షకేతువు; 10. గుమ్ముడు*: చూ, మహాఫలము; 11. అశోక *: చూ, శమలాదని. 1; 12. మామెన *: చూ, శారిబ; 13. నల్లావాలు *: చూ, సర్షపము; 14. పర్పటి, ఉత్తరదేశపు సుగంధి ద్రవ్యము: చూ, రాజార్హము; 15. కాకోలి *: చూ, వాయసోలి; 16. కాసుగచ్చ*: చూ, సోమరాజి; 17. గుగ్గు *: చూ, హస్తిని.

కృష్ణకందము. సం. వి. అ. న. ఎఱ్ఱకలువ *: చూ, పద్మము. 1.

కృష్ణకర్ణామృతము. సా. ఈగ్రంథములీలాశుకుఁడు వ్రాసెను: చూ, కావ్యనాటకములు.

కృష్ణకర్ముఁడు సం. విణ. (న్. ఈ. న్) దురాచారుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

కృష్ణకల్యాణము. సా. ఈ గ్రంథమునకు కర్త అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి (19 శతాబ్ది)

కృష్ణకాంభోజి. సం.వి.ఈ. స్త్రీ. నల్లగురివెంద*: చూ, తులాబీజము.

కృష్ణకాకము. సం. వి. అ. పుం. బొంతకాకి: చూ, వాయసము. 1.

కృష్ణకాష్ఠము. సం. వి. అ. న. కాలాగురువు: చూ, రాజార్హము.

కృష్ణకోహలుఁడు. సం. వి. అ. పుం. జూదరి చూ, పందెకాఁడు.

కృష్ణగంధ. సం. వి. ఆ. స్త్రీ. 1. మునగ*: చూ, శిగ్రువు. 1; 2. కంకుష్ఠము*: చూ, స్వర్ణక్షీరిణి.

కృష్ణగర్భము. సం. వి. అ. పుం. కట్ఫలము*: చూ, మహాఫలము.

కృష్ణచంచుకము. సం వి. అ. పుం. చణకము*: చూ, సెనగలు.

కృష్ణచూడిక. సం. వి. ఆ. స్త్రీ. గురివెంద*: చూ, తులాబీజము.

కృష్ణచూర్ణము. సం. వి. అ. న లోహమలము: చూ, లోహము. 1.

కృష్ణజన్మఖండము. పా. ఈ గ్రంథము గోపీనాథ వేంకటకవి రచించెను. (19 శతాబ్ది.)

కృష్ణజట. సం. వి. ఆ. స్త్రీ. జటామాంసి*: చూ, మాంసి. 1.

కృష్ణజన్మస్థానము. వా. వి. బంధనాలయము. 1; 2. శ్రీకృష్ణుఁడు పుట్టినచోటు.

కృష్ణజీరకము. సం. వి. అ. పుం. నల్లజీలకఱ్ఱ*: చూ, సుషవి. 2.

కృష్ణతండులు. సం. వి. ఆ. స్త్రీ. త్రిపుట*: చూ, బొల్లిబూసర.

కృష్ణతామ్రము. సం. వి అ. న. గోశీర్ష చందనము: చూ, వాసన.

కృష్ణతారము. సం. వి. అ. పుం. జింక: చూ, హరిణము. 1.

కృష్ణతాలము. సం. వి. అ. పుం. తమాలము*: చూ, శ్వేతపుష్పము.

కృష్ణతాలుని సం. వి. ఈ. న. ద్వి. దారిద్ర్యవతి యొక్క లక్షణము: చూ, లక్షణము. 1.

కృష్ణతులసి. సం. వి. ఈ. స్త్రీ. నల్లతొళసి*: చూ, తులసి.

కృష్ణత్రివృత. సం. వి. ఆ. స్త్రీ. నల్లతెగడ*: చూ, సర్వానుభూతి.

కృష్ణదేహము. సం. వి. అ. పుం. తుమ్మెద: చూ భ్రమరము. 1.

కృష్ణద్వైపాయనుఁడు. సం. వి. అ. పుం. వేదవ్యాసుఁడు: చూ, ముని: 1.

కృష్ణధుత్తూరకము. సం వి. అ. పుం. నల్ల ఉమ్మెత్త*: చూ, హాలాపుష్పము.

కృష్ణనామకము. సం. వి. అ. న. బిడాలవణము: చూ, లవణము. 1.

కృష్ణనింబము. సం. వి. అ. పుం. కరివేప*: చూ, బల.

కృష్ణపక్షచతుర్దశి. అం. పర్వములు అయిదింటిలో నొకటి: చూ, పర్వములు.

కృష్ణపక్షతిథులు. అం: చూ, తిథులు.

కృష్ణపక్షము. సం. వి.అ. పుం. 1. కటిపక్కము: చూ, పక్షము 1; అం. 2. పక్షములు రెండింటిలో నొకటి: చూ, పక్షములు.

కృష్ణపక్షాష్టమి. అం. పర్వములు అయిదింటిలో నొకటి: చూ, పర్వములు.

కృష్ణపర్ణము. సం. వి. అ. పుం. పెద్దమ్రాను*: చూ, శ్వసనము.

కృష్ణపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. కొలతులసి*: చూ, తులసి.

కృష్ణపాకఫలము. సం. వి. అ. పుం. కలివె*: చూ, సామ్లపుష్పఫల (కృష్ణపాకఫల అని కొందఱు.)

కృష్ణపాకము. సం. వి. అ. పుం. —పై.—

కృష్ణపాకి. సం. వి. ఈ. స్త్రీ. నల్లగురిగింజ*: చూ, తులాబీజము.

కృష్ణపింగళ. సం. వి. ఆ. స్త్రీ. గౌరి: చూ, పార్వతి. 1.

కృష్ణపిండీతకము. సం. వి. అ.పుం. నల్లమంగ*: చూ. శ్వసనము.

కృష్ణపిండీరము. సం. వి. అ. పుం. —పై.—

కృష్ణపిపీలి. సం. వి. ఈ. స్త్రీ. నల్లచీమ: చూ, పిపీలిక.

కృష్ణపులంగవము. సం. వి. అ. పుం. పెద్దకండచీమ: చూ, పిపీలిక.

కృష్ణపుష్పము. సం. వి. అ. పుం: చూ. కృష్ణధత్తూరకము*.

కృష్ణపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. అంకోలగిరి *: చూ, పేరింకణము.

కృష్ణపుష్పిక. సం. వి. అ. స్త్రీ: చూ, కృష్ణపుష్పము.

కృష్ణఫల. సం. వి. ఆ. స్త్రీ. కొరుగచ్చ*: చూ, సోమరాజి.

కృష్ణఫలపాకము. సం. వి. అ. పుం. ఓంకపండు: చూ, సాన్లపుష్పఫల.

కృష్ణఫలము. సం. వి. అ. న. 1. తక్కోలల *: చూ, వైజయంతి; పుం. 2. ఓంకపండు: చూ. సాన్లపుష్పఫల; 3: చూ, ఏలకిపండు. 2.

కృష్ణఫలి. సం. వి. ఈ. స్త్రీ: చూ. కృష్ణఫల*.

కృష్ణబర్బరకము. సం. వి. అ. పుం. చిలుతేకు*: చూ, బాగంగి

కృష్ణబీజము. సం. వి. అ. న. 1. కాలింగము *: చూ, పుచ్చ; పుం. 2. కుంకుము *: చూ, ఫేనిలము. 2; 3. ఎఱ్ఱమునగ* : చూ, శిగ్రువు. 1.

కృష్ణభూపాలీయము. పా. ఈగ్రంథమునకు కర్త చంద్రికవి. (19 శతాబ్ది)

కృష్ణభూమి. సం. వి. ఇ. స్త్రీ. నల్లనేల: చూ, భూమి. 1

కృష్ణభూమిజ. సం. వి. ఆ. స్త్రీ. గోమూత్రిక*: చూ, తృణము. 1.

కృష్ణభేద. సం. వి. ఆ. స్త్రీ. రూ-కృష్ణభేది, కటుకరోహిణి *: చూ, కటులాదని. 1.

కృష్ణభేది. సం. వి. ఈ. స్త్రీ. —పై.—

కృష్ణభోజిపుండు. సం. వి. అ. పుం. జూదమాడెడివాఁడు: చూ, పందెకాఁడు.

కృష్ణమల్లిక. సం. వి. ఆ. స్త్రీ. నల్లగగ్గెర*: చూ, పర్ణాసము.

కృష్ణము. సం. వి. అ. న. 1. ఇనుము: చూ, లోహము. 1; 2. మరీచము: చూ, మిరియము; 3. దోషము: చూ. పాపము. 1; 4. నీలాంజనము: చూ, సౌవీరము. 2; 5. కాలాగురువు: చూ, రాజార్హము; పుం. 6. నలుపు: చూ, వర్ణము. 6; 7. కాకి: చూ, వాయసము. 1; 8. కోకిలము: చూ, పికము; 9. దున్న: చూ, మహిషము; 10. కృష్ణపక్షము: చూ. పక్షము. 1; 11. నల్లని కనుపుగల పుందడిచ్చుక: చూ, పిచ్చుక; 12. ఓంక *: చూ, సాన్లపుష్పఫల; 13. ఏనుఁగు: చూ, హస్తి; 14. (యజ్ఞమునకుఁ దగిన చిత్రవర్ణముగల) ఇఱ్ఱి: చూ, హరిణము. 1; 15. శూద్రజాతి: చూ, వర్ణము. 7; విణ. 16 నల్లనిది: చూ, వర్ణము. 6.

కృష్ణముద్గము. సం. వి. అ. పుం. నల్లపెసర *: చూ, పెసర.

కృష్ణమూర్తి. పుం. చూ, కృష్ణావతారము.

కృష్ణమూలి. సం. వి. ఈ. స్త్రీ. నల్లసుగంధిపాల *: చూ, శారిబ.

కృష్ణమూలిక. సం. వి. ఆ. స్త్రీ. నల్లగగ్గెర *: చూ, పర్ణాసము.

కృష్ణరక్తకము. సం. వి. అ. పుం. గురివెంద *: చూ, తులాబీజము.

కృష్ణరక్తిక. సం. వి. ఆ. స్త్రీ. —పై.—

కృష్ణరాయవిజయము. పా. ఈగ్రంథకర్త కుమారధూర్జటి(16 శతాబ్ది.)

కృష్ణరుహా. సం. వి. ఆ. స్త్రీ. కృష్ణవల్లి*: చూ, సురలి. (సురలి)

కృష్ణరేఖ. సం. వి. ఆ. స్త్రీ. హాస్యలక్షణము; చూ, లక్షణము. 1.

కృష్ణల. సం. వి. ఆ. స్త్రీ. గురిజె. ఎఱ్ఱగురిజె (అని కొందఱు)*: చూ, తులాబీజము.

కృష్ణలకము. సం. వి. అ. పుం. —పై.—

కృష్ణలము. సం. వి. అ. న. సీతిక, మూఁడుయవల యెత్తు వెండి: చూ, లోహము. 1.

కృష్ణలవణము. సం. వి. అ. న. 1. సౌవర్చలవణము: చూ, లవణము. 1; 2. కాచలవణము: చూ, లవణము. 1.

కృష్ణలోహము. సం. వి. అ. న. ఇనుము: చూ. లోహము. 1.

కృష్ణలోహమయము. సం.వి.అ. పుం. చిట్టెము: చూ, లోహము. 1.

కృష్ణలోహితము. సం. వి. అ. పుం. 1. నలుపు మించఁగలసిన యెఱుపు, ధూమ్రము: చూ, వర్ణము. 6; విశే. 2. నలుపుమించేఁగలసిన యెఱుపుగలది, ధూమ్రము: చూ, వర్ణము.6.

కృష్ణవక్త్రుఁడు. సం. వి. అ. పుం. కోఁతి: చూ, వానరము.

కృష్ణవర్త్మ. సం. వి. న్. పుం. 1. అగ్ని: చూ, నిప్పు; 2 శుక్రాచార్యుఁడు: చూ, వ్యాధుఁడు.2; 3. తలగాము, రాహుగ్రహము: చూ, రాహువు. 1.

కృష్ణవల్కలము. సం. వి. అ. పుం. ఏపె*: చూ, మద్ది.

కృష్ణవల్లి. సం. వి. ఈ. స్త్రీ. 1. కమ్మెరాకు తీఁగె, నల్లతీఁగె*: చూ, సుగలి (సురలి); 2. మామెన*: చూ, శారిబ.

కృష్ణవల్లిక. సం. వి. ఆ. స్త్రీ. —పై—

కృష్ణవిజయము. పా. ఈ గ్రంథమునకు కర్త.- కుసుమాయుధుఁడు: చూ, కావ్యనాటకములు.

కృష్ణవృక్షము. సం. వి.అ.పుం. అగరుమ్రాను *: చూ, చందనము

కృష్ణవృంత. సం. వి. ఆ. స్త్రీ. 1. కలిగొట్టు*: చూ, స్థాలి. 2; 2. కాకిమినుము*: చూ, మినుము; 3 పెద్దమున్నఁడు*: చూ, శ్రీపర్ణి

కృష్ణవృంతిక. సం. వి. ఆ. స్త్రీ. 1. గుమ్మడి*: చూ, మహాఫలము; 2. పేటికావృక్షము: చూ, పేటిక.

కృష్ణవేణి. సం. వి. ఈ. స్త్రీ. 1. కృష్ణవేణి యను నది: చూ, నది; అం. 2. గంగలు నాలుగింటిలో నొకటి: చూ, గంగలు (రూ-కృష్ణవేణ)

కృష్ణవేణ. సం. వి. ఆ. స్త్రీ. —పై—

కృష్ణవ్రీహి. సం. వి. ఇ. పుం. ఒకరకము వ్రీహిధాన్యము: చూ, ధాన్యము.

కృష్ణశారము. సం. వి. అ. పుం. 1. యజ్ఞమునకుఁ దగిన చిత్రవర్ణపులేఁడు (రూ-కృష్ణసారము): చూ, హరిణము. 1; 2. ఇరుగుడు*: చూ, శింశుప; 3. చెముడు *: చూ, స్నుహి.

కృష్ణశాలి. సం. వి. ఇ. పుం ఒకరకము శాలిధాన్యము: చూ, ధాన్యము.

కృష్ణశింశుప. సం. వి. ఆ. స్త్రీ నల్లఇరుగుడు*: చూ, శింశుప.

కృష్ణశిగ్రువు. సం. వి. ఉ. పుం. శోభాంజనము *: చూ, శిగ్రువు. 1.

కృష్ణశీర్షక. సం. వి. ఆ. స్త్రీ. గురివెంద*: చూ. తులాబీజము.

కృష్ణశీర్షకము. సం. వి. అ. న. అగరువు: చూ, రాజార్హము.

కృష్ణశృంగము. సం. వి. అ. పుం. గున్నపోతు: చూ. మహిషము.

కృష్ణసఖి. సం. వి. ఈ. స్త్రీ. జీలకఱ్ఱ*: చూ, సుషవి. 2.

కృష్ణసర్పము. సం. వి. అ. పుం. 1. నల్లత్రాఁచు: చూ, సర్పము; 2. కేతకి *: చూ, మొగలి.

కృష్ణసర్పరాజు. సం. వి. అ. పుం. కర్కోటకమను మొదటిరకము పాము: చూ, సర్పము.

కృష్ణసర్షపము. సం. వి. అ. పుం. నల్లావలు *: చూ, సర్షపము.

కృష్ణసార. సం. వి. ఆ. స్త్రీ. ఇరుగుడు *: చూ, శింశుప.

కృష్ణసారకము. సం. వి. అ. పుం. 1. వెదురు: చూ, వేణువు; 2. ఇంగుడు*: చూ, శింశుప; 3. చెముడు *: చూ, స్నుహి; 4. యాజ్ఞమునకుఁ దగిన చిత్రవర్ణపులేడి: చూ, హరిణము.1.

కృష్ణసారథి. సం వి. ఇ. పుం. అర్జునుడు, ఏఱుమద్ది *: చూ, మద్ది.

కృష్ణసారము. సం. వి.అ. పుం: చూ, రూ-కృష్ణసారము.

కృష్ణస్కంధము. సం. వి. అ. పుం. కాలస్కంధము*: చూ, తమాలము.

కృష్ణహయము. సం. వి. అ. పుం.సూర్యాశ్వము: చూ, హయము.

కృష్ణాంగన. అం. దిక్పాలపట్టణములు తొమ్మిదింటిలో నొకటి: చూ, దిక్పాలపట్టణములు. (చూ, దేశము.)

కృష్ణాంగము. సం. వి. అ. న. విషవిద్యాతంత్రవిశేషము: చూ, మాయము. 1.

కృష్ణాంజని. సం. వి. ఈ. స్త్రీ. కాలాంజని *: చూ, హ్రిస్వశాఖాశిఫము.

కృష్ణాగురువు. సం. వి. అ. న. నల్లఅగిలు: చూ, రాజార్హము.

కృష్ణాచలము. సం. వి. అ. పుం. రైవతపర్వతము: చూ, పర్వతము.

కృష్ణానది. సం. వి. ఈ. స్త్రీ. కృష్ణాజిల్లాయందు ప్రవహించుచున్న నది: చూ, నది.

కృష్ణాభ. సం. వి. ఆ స్త్రీ: చూ, కృష్ణాంజని*.

కృష్ణాభ్యుదయము. పా. ఇది మండపాక పార్వతీశ్వర కవి రచించెను. (19శతాబ్ది.)

కృష్ణామాహాత్మ్యము. పా. ఈ గ్రంథమునకు కర్త తాతంభట్టు గురుమూర్తిశాస్త్రి (19 శతాబ్ది.)

కృష్ణామిషము. సం. వి. అ. న: చూ, కృష్ణలోహము.

కృష్ణామ్లము సం. వి. అ. పుం. చింత *: చూ, తింత్రిణి.

కృష్ణాయసము. సం. వి అ. న. —వై.—

కృష్ణార్చి. సం. వి. స్. పుం. అగ్ని: చూ, నిప్పు.

కృష్ణార్జకము. సం వి. అ. పుం. 1. నల్లగగ్గెర*: చూ, పర్ణాసము; 2.నల్లతులసి*: చూ,తులసి.

కృష్ణార్జునచరిత్రము. పా. ఈ గ్రంథమునకు కర్త మంత్రిప్రెగడ సూర్యప్రకాశ కవి (19 శతాబ్ది.)

కృష్ణార్జునసంవాదము. పా. ఈ గ్రంథమునకు కర్త వెలిచెరుకల వేంకటరామ ప్రధాని. (19 శతాబ్ది.)

కృష్ణార్పణము. పా. శ్రీకృష్ణభగవానునికి సమర్పణము. "నీవు చేసిన సతి కృష్ణార్పణము"

కృష్ణాలువు. సం. వి. ఉ. పుం. నీలాలువు, నల్లకంద *: చూ, సూరణము.

కృష్ణావతారము. అం. ఇదియొక అవతారము (ఇందుల వృత్తాంతము.—కంసుఁడను రాజు తన చెల్లెలగు దేవకిని భావయగు వసుదేవునికి ఇచ్చియుండెను. వారలకుఁ బుట్టు కొడుకే తన్నుఁ జంపునని తెలిసికొనెను. అందువలన దేవకికిఁబుట్టిన బిడ్డలనందఱను జంపుమండెను. దేవకీదేవి యొక్క యెనిమిదవ కొడుకు శ్రీకృష్ణుఁడు. ఇతఁడు పుట్టఁగానే వసుదేవుఁడు వ్రేపల్లెలో గొల్లలరాజగు నందుని యింటనితనిదాఁచెను. క్రమముగ శ్రీకృష్ణుఁడు పెరిగి పెద్దవాఁడయ్యెను. తరువాతఁ గంసునిఁ జంపి తన తల్లిదండ్రులఁ జెఱవిడిపించెను. ఈము. ఇది దశావతారములలోఁ జేరియుండదు.)

కృష్ణావాసము. సం. వి. అ. పుం. అశ్వత్థము *: చూ, రావి.

కృష్ణిక. సం. వి. ఆ. స్త్రీ. 1. నల్లావలు *: చూ, సర్షపము; 2. తవిఁదలను వడ్లు: చూ, ధాన్యము; 3. నల్లపిచ్చుక: చూ, పిచ్చుక.

కృష్ణుఁడు. సం. వి. అ. పుం. 1.=కన్నయ్య. (చూ, కృష్ణావతారము) వెన్నుఁడు (అన్నిటినిఁ జేయువాఁడు, దైత్యులను నలిపివేయువాఁడు, కృష్ణవర్ణుఁడు. గీత నుపదేశించిన శ్రీకృష్ణభగవానుఁడు. మొ): చూ, విష్ణువు.1; 2. వేదవ్యాసుఁడు: చూ, ముని. 1; 3. అర్జునుఁడు (పాండవమధ్యముఁడు): చూ, విజయుఁడు. 1; 4 అగ్నిహోత్రుఁడు: చూ, నిప్పు.

కృష్ణేక్షువు. సం. వి. ఉ. పుం. నల్లచెఱకు *: చూ, రసాలము. 3.

కృష్ణోదుంబరిక. సం. వి. అ. స్త్రీ. కాకోదుంబరిక *: చూ, బొమ్మమేడి.

కృష్య. సం. వి. అ. స్త్రీ. 1. తాళ(ప్రాణకళా విశేషము: చూ, తాళము, 2; అం. 2.తాళాధ్యాయములోని దేశీయక్రియలు యెనిమిదింటిలో నొకటి: చూ, దేశీయక్రియలు.

కృసరము. సం. వి. అ. న. 1. పులగము: చూ, సాదము. (1); 2. శ్రాద్ధమున నిమంత్రితులకు అభ్యంజనకాలమందు కలిపియిచ్చెడు నువ్వులు బెల్లము. (నువ్వులపులగ మని హారావళి)

## కౢ

కౢప్తకీల. సం. వి. అ. స్త్రీ. వ్యవస్థాపత్రము, పట్టోలికా: చూ, పట్టా.

కౢప్తధూపము. సం. వి. అ. పుం. అందుగుబంకతోఁజేసిన ధూపద్రవ్యము, సిల్హకము: చూ, రాజార్హము.

కౢప్తము. సం. విణ. ఏర్పాటుచేయఁబడినది: చూ, స్థితము. 3.

కౢప్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఏర్పాటు : చూ, నిజము. 2; 2. కల్పనము: చూ, సంగ్రహము.

కౢప్తికుఁడు. సం విణ. క్రీతుఁడు: చూ, పుత్రుఁడు 1.

## కె

కె. దే.విణ. వృత్తియందు కెంపుశబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (దీనికి పరుష సరళములు పరమగునపుడు నుగాగమమును తదితరములుపరమగునపుడు మీఁదిదానికి ద్విత్వమునువచ్చును. కెంగేలు. కెంజెడ, కెంజాయ కెంజిగి. కెంజిగురు, కెందలిరు, కెందళుకు, కెందామర, కెందోవ, కెంబట్టు, కెంబువ్వు, కెంబెదవి, కెన్నురువు. కెమ్మొగ్గ. కెమ్మోవి. మొ.)

కెంగటు. దే. వి. తాళబీజము. రూ- గెంగటు. ఆం. భా. ద్వి. 78: చూ, తేగ.

కెంజాయ. దే. వి. ఎఱుపు. వేం, ఆం. 83: చూ, వర్ణము. 6.

కెంజిగురు. దే. వి. ఎఱ్ఱనిచిగురు.

కెందమ్మి. ద్వ. వి. (కెంపు+తమ్మి) ఎఱ్ఱదామర *: చూ, పద్మము.

కెందామర. ద్వ. వి. —పై.—

కెందొగ. ద్వ. వి. ఎఱ్ఱగలువ*: చూ, పద్మము.1.

కెంపు. దే. వి. 1. ఎఱుపు. భార. విరా. 2, ఆ. 318: చూ, వర్ణము. 6; 2. పద్మరాగమణి: చూ, రత్నము. 1; 3. అధరమందలి దంతక్షతము: చూ, దంతక్షతములు; విణ. 4.ఎఱ్ఱనిది. చము. 1, ఆ. 86: చూ, వర్ణము. 6. (ఈయర్థమున వృత్తియందుఁగొన్నియెడల నంత్యవర్ణలోపము. కెం.)

కెంపుకంటి. దే. వి. (కెంపు+కన్ను) కోయిల: చూ, పికము.

కెంపుకనులపులుఁగు. దే. వి. —పై.—. సాంబ, తిర్య. 7.

కెంపుగాతు. ద్వ. వి. అంగారకుఁడు. రూ- కెంపుగాము: చూ, రాహువు. 2.

కెంపుగాము ద్వ. వి. —పై.—

కెంపురా. ద్వ. వి. ఇనుఁడు. ఆం, పదా. సుగ.21: చూ. సూర్యుఁడు.

కెంపుసవతు. ద్వ. వి. స్వాతి: చూ, నక్షత్రము. 1

కెడ. దే. వి. నైపు. భాగ. ద్రోణ. 4. ఆ. 308: చూ, పార్శ్వము. 1 (రూ- కెడను- కెలఁకు- కెలను- కెలవు- కెళవు.)

కెడను. దే. వి. —పై.—

కెడపు. దే. ప్రే. 1. పడఁజేయు. జై. 3, ఆ. 109; 2. త్రోయు. రామా. 4, ఆ. 50; 3. చంపు. "నిర్మూలంబుగ శత్రులం గెడపి." ద్వా. 8. ఆ: చూ, మరణించు.

కెడయిక. దే. వి. 1. పడుట: చూ, పతనము; 2. చావు: చూ, మరణము.

కెడయు. దే. అ. క్రి. 1. పతనమగు. ఉ, హరి. 2. ఆ. 181: చూ, పడు. 5; 2. చచ్చు: చూ, మరణించు: 3. భేదమగు ఆం. భా. త్రి. 85: చూ, వేఱుపడు; స. క్రి. 4. ఉద్దేశించు: చూ, నిశ్చయీకరించు.

కెడవు. దే. వి. పడుట: చూ, పతనము.

కెమ్మోవి. దే.వి.ఓష్ఠము. సాంబ. దేవ. 51: చూ. పెదవి.

కెమ్మోవిగుటి. దే. వి. పలునొక్కు. సాంబ.దేవ. 51: చూ, దంతక్షతము.

కెరకొట్టు. దే. అ. క్రి. (కెరలు + కొట్టు) కలకలకూయు: చూ, కిలకిలలాడు.

కెరలియాడు. దే. అ. క్రి. (కెరలి + ఆడు) చెలరేఁగు. ఉ, హరి. 5, ఆ. 42: చూ, విజృంభించు. (కెరలువొడుచు- కెరయు - కెరలు- కేరు- కేరించు)

కెరలు. దే. అ క్రి. 1. అతిశయించు. "కెరలు క్రొవ్వుల." స్వా. 6, ఆ. 85: చూ, ముమ్మరించు; 2. ఆగ్రహించు. స్వా. 6, ఆ. 47: చూ, రోషించు: 3. కూయు. స్వా. 3, ఆ. 111: 4: చూ, శబ్దించు; 5. చెలరేఁగు. హరి. ఉ. 7, ఆ. 42: చూ, విజృంభించు; 6. పోట్లు పడు. రా. యు, కాం. 408. పొరటు: చూ, సంభ్రమించు.

కెరలుచు. దే. ప్రే. కెరలఁజేయు.

కెరలువొడుచు. దే. అ. క్రి. (కెరలు + పొడుచు) 1. వృద్ధిఁబొందు. భాగ. 5. స్కం.1.ఆ.106: చూ. వర్ధిల్లు; 2. చెలరేఁగు. భాగ. 8, స్కం. 295: చూ, విజృంభించు.

కెరసనాయిలు. నా. వి. మట్టినూనె : చూ, తైలము. (ఆం. కెరొసిన్ ఆయిల్)

కెరసనాయిలునీళ్లు. పా. ఇది కీటకాదులను ఊపిరిఁదిరుగనీయక చంపును.— (1/4 సేను సబ్బును, 2 శేర్లయుడుకు మంచినీళ్ళలో గరగించి దీనికి 4 శేర్లు కిరసనాయిలు చేర్చి రెండును కవ్వముతో కలియునట్లు చిలికి యీ మిశ్రణము నుండి అవసరమగుదానికి 5 రెట్లు నీరుకలిపి చల్లవలెను)

కెగ్గము. వై. వి. కేగజమనుపక్షి. రూ- కేగజము- కేగ్గము: చూ పక్షి.

కెర్ల. దే. వి. తాపము: చూ, సంతాపము.

కెర్లి: చూ, రూ- కిర్లి.

కెలఁకు. దే. వి. 1. దిక్కు. భార. అర. 3, ఆ. 297: చూ, హరిత్తు; 2. ప్రక్క: చూ, పార్శ్వము. 1; స. క్రి. 3. కలపెట్టు. ఆము. 6, ఆ. 36; 4. ఉన్మూలించు. "భగుని కన్నులు కెలఁకె." కాశీ. 7, ఆ. 95: చూ, భేదిల్లు. 2.

కెలను. దే. వి. 1. దిక్కు: చూ, హరిత్తు; 2. ప్రక్క: చూ, పార్శ్వము. 1. (రూ- కెలఁకు- కెలవు- కెళవు)

కెలయు. దే. అ. క్రి. చెలరే[illegible] రా. అర. కాం. 166. పొరటు: చూ, విజృంభించు.

కెలవు. దే. వి. 1. వైపు: చూ, పార్శ్వము. 1; 2. అనురాగము. కాశీ. 3, ఆ. 144: చూ, స్నేహము. 1.

కెలసము. దే. వి. 1. అరసము: చూ, సంతోషము; 2. ఉత్సాహము: చూ, యత్నము; 3. కాంక్ష: చూ, వాంఛ; 4. పని. భార. ఆర. 6, ఆ. 30; భార. ఆర. 5, ఆ. 228: చూ, వ్యాపారము. 1.

కెల్లగించు. దే. స. క్రి. 1. పెల్లగించు: చూ, భేదిల్లు. 2; 2.పురికొలుపు: చూ, ప్రేరేపించు.

కెల్లి. పా: చూ, రూ- క్రిల్లి- కెల్లి.

కెళకుళి. వై. వి. = ఖేలాకూలమ్. క్రీడబావి, క్రీడాసరస్సు: చూ, సరస్సు. 1. (రూ-కెళాకుళి- కెళాకూళి- కేళకుళి- కేళకూళి- కేళాకుళి- కేళాకూళి)

కెళగు. దే. వి. ఆర్తవము. ఆం, పదా. సర. 68: చూ, ముట్టు. 1.

కెళవు. దే. వి. 1. వైపు: చూ, పార్శ్వము. 1; 2. దూరము. జై. 5, ఆ 58; ఆము.5, ఆ.26: చూ, విప్రకృష్టము.

కెళాకుళి. వై. వి. = : చూ, రూ-కెళకుళి రసి. 8, ఆ. 117.

కెళాకూళి. వై. వి. = —వై.—

## కే.

కే. దే. వి. ధ్వన్యనుకరణము. హరి. పూ. 5, ఆ. 215: చూ, హాహూ. (రూ- కేక)

కేందుకము. సం. వి. అ. పుం. 1. కప్ప: చూ, మండూకము. 1; 2. గాలవము *: చూ, లొద్దుగు.

కేందువు. సం. వి. ఉ. పుం. తిందుకము *: చూ, తుమికి.

కేంద్రము-కేంద్రస్థానములు. పా. 1. జన్మలగ్నమునకు 1-4-7-10 స్థానములు కేంద్రములనఁబడును. జన్మలగ్నమె యొకటవకేంద్రమగుచున్నది. వీనికి కంటకములనియు పేరుగలదు; 2. రాశ్యుదయము:చూ, లగ్నము: 3. గోళము యొక్క మధ్యప్రదేశమునకు కేంద్రము (లేక) కేంద్రస్థానము అనిపేరు. •

కేక. సం. వి. ఆ. స్త్రీ. 1.=కేస. నెమలికూఁత: చూ, స్వరము. 2; దే. వి. (1) పెద్దకూఁత, రూ- కే: చూ, స్వరము. 2.

కేకయము. సం. వి. అ. పుం. 1. దేశములు ఏఁబదియాఱింటిలో నొకటి: చూ, దేశము; 2. స్త్రీలు కాళ్ళనుధరించు అందియ: చూ, భూషణము. 2.

కేకయి. సం. వి. ఈ. స్త్రీ: చూ, కైకేయి.

కేకయుఁడు. సం. వి. అ. పుం. కేకయదేశపు రాజు: చూ, రాజు 1.

కేకరము. సం. వి. అ. పుం 1. కడకన్ను:చూ, నేత్రము. 1; 2. మెల్లకన్ను:చూ, నేత్రము.1.

కేకరాక్షన్యాయము. పా. మెల్లకంటివాఁడు ఒకనివైపు చూచుచుండ నుఱియొకనివైపుఁ జూచుచున్నట్లు గాన్పించువిధము.

కేకరించు. సం. స. క్రి. 1. కటాక్షించు. హరి. పూ. 7, ఆ. 196: చూ, చూపు; దే. అ. క్రి. (1) కేకలువేయు: చూ, శబ్దించు; (2) సకిలించునట్లు శబ్దించు: చూ, శబ్దించు.

కేకరింత. దే. వి. 1.కేకలువేయుట; 2. సకిలించునట్లు శబ్దించుట. ఆము. 5. ఆ. 60.

కేకరుఁడు. సం. వి. అ. పుం. వలిదుఁడు: చూ, మెల్లకంటివాఁడు.

కేకలబండి. వా. వి. రైలు: చూ, పొగబండి. (చూ, కమ్మిలపైబండి.) (చప్పుడుతోఁగూడినది.)

కేకాలము. సం. వి. అ. పుం. నెమలి: చూ, మయూరము.

కేకావలము. సం. వి. అ. పుం. —పై.—

కేకి. సం. వి. న్. పుం. —పై.—

కేకిశిఖ. సం. వి. ఆ. స్త్రీ. బర్హిపర్ణి *: చూ, పూతికరజము.

కేకిస. దే. వి. నెమలికూఁత. ఆం, పదా. 5-33: చూ, స్వరము 2.

కేకిసలు. దే. వి. బ. 1: చూ, చేప్పట్లు; 2. నతి. హంస. 4, ఆ. 218; బహు. 2. ఆ. 41: చూ, నమస్కారము; 3. నతివిశేషము: చూ, నమస్కారము.

కేసుందకము. సం వి. అ. పుం కుడుము: చూ, భక్ష్యము.

కేసుందము. సం. వి. అ. పుం. —పై.—

కేకేయి. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-కైకేయి.

కేజు. దే. వి. 1. అడుసు: చూ, బురద; వా. వి. 2 దావా. రూ- కేసు.

కేటుతాడ్రుడు. దే. వి. యమపాశము. నీలా. 1, ఆ. 22: చూ, సూత్రము. 1.

కేటుభ. సం. వి. ఆ. స్త్రీ. గౌరి: చూ, పార్వతి 1.

కేటాయించు. వా. క్రి. వేఱుపఱుచు. (రూ- ఖేటాయించు)

కేటులాగు. వా. వి. రూ- కేట్లాగు. అమ్మకము నకు సిద్ధపఱచిన పాత్రములు లోనగువాని పట్టిక.

కేట్లాగు. వా. వి. —పై.—

కేడ. దే. వి. ధూర్తుఁడు: చూ, వ్యాధుఁడు. 2

కేడము. పై. వి. = ఖేటకము. డాలు: చూ, హారిగ. (రూ- కేడియము- కేడెము- కేవడము- కేళము)

కేడి. వా. వి. ప్రాత నేరస్థుఁడు. "కేడీలరిజిస్టరు." (రూ- కేడీ- కేళీ)

కేడించు. దే. అ. క్రి. 1. తొలఁగు: చూ, విరియు. 5; స. క్రి. 2. అలక్ష్యముచేయు: చూ, రూ- క్రేడించు; 3. ఎడఁబాయు. ఆం. భా. త్రి. 85: చూ, వేఱుపడు. (కేటాయించు అని వాడుక.)

కేడియము. పై. వి.= ఖేటకము. డాలు. రూ- కేడెము: చూ, హారిగ.

కేడెము. పై. వి. = —పై.—

కేణిక. సం. వి. ఆ. స్త్రీ. డేరా: చూ, సదనము. 1.

కేతకము. సం. వి. అ పుం. = గేఁగి *: చూ, మొగలి.

కేతకి. సం. వి. ఈ. స్త్రీ. 1. = —పై.—(ఇది శివపూజకనర్హము.); 2. జాజి *: చూ, మాలతి; పా. 3. ఒకానొక తైలము: చూ, తైలము.

కేతకీకుసుమన్యాయము. పా. మొగలిపూ సుగంధముగలదియైనను ముండ్లచేత కోసికొనశక్యము కాదు అనెడి విధము.

కేతనము. సం. వి. అ. న. 1. టెక్కెము: చూ, సిడము; 2. గుఱుతు: చూ. లక్షణము. 1; 3. ఇల్లు: చూ, సదనము. 1; 4. పిలుచుట, బ్రాహ్మణుల నిమంత్రణముచేయుట. (అని కొందఱు): చూ, సంబోధనము.

కేతుధరము. సం. వి. అ. పుం. గాలి: చూ, వాయువు.

కేతుధరుఁడు. సం. వి. అ. పుం. టెక్కెముపట్టువాఁడు: చూ ధ్వజధరుఁడు.

కేతుప్రియము. సం. వి. అ. న. వైడూర్యము: చూ, రత్నము. 1.

కేతుభము. సం. వి. అ. పుం. మబ్బు: చూ, మేఘము. 1.

కేతుమతి. పా. ఒకానొక వృత్తము.— ఇందు బేసిపాదములందు స, జ, స, గురువులును, సరిపాదంబుల భ, ర, న, గగములును గల్గి

ఏడింటఁగుఱిగల వృత్తము. ఉదా.— "జతచే కులన్న- జనగముల్, భాతిసరిజ భరే- ఘనగ గంబుల్- యతిశైలసంఖ్య. సమరఁగా." చూ, వృత్తము. 1.

కేతుమాలము. అం. వర్షములు తొమ్మిదింటిలో నొకటి: చూ, వర్షములు.

కేతురత్నము. సం. వి. అ. న. వైడూర్యము: చూ, రత్నము. 1.

కేతువు. సం. వి. ఉ. పుం. కేతువనునొకగ్రహము: చూ, రాహువు. 2. (చూ. ఆశ్లేషాభవము) కేతువునకు శుభవర్గములు 13, పాపవర్గములు 3; కేతుదశావత్సరములు యేడు.) ఇత్యాది; 2. టెక్కెము: చూ, సిడము; 3. గుఱుతు: చూ, లక్షణము. 1; 4. అగ్ని: చూ, నిప్పు; 5. కాంతి: చూ, వెలుతురు. 1; 6. దుమగతికేతువు: చూ, తోఁకచుక్క; 7. తక్కెల *: చూ, వైజయంతి; అం. 8. గ్రహములు తొమ్మిదింటిలో నొకటి: చూ, గ్రహములు.

కేదంతి. సం. వి. ఇ. పుం. అనిరుద్ధుఁడు: చూ, విశ్వకేతువు.

కేదరము. సం. వి. అ. పుం. 1. తుమ్మ *: చూ, విట్ఖదిరము; 2 రూ- కేదారము. ఊడుపుమడి: చూ, భూమి. 1. (చూ, రూ- కేదారము)

కేదారకటుక. సం వి. ఆ. స్త్రీ. కటుకరోహిణి*: చూ, శకులాదని. 1.

కేదారము. సం. వి. అ. పుం, న. 1. వరిమడి: చూ, భూమి. 1; (కైదారకము - కైదార్యము- కేదారికము); 2. వరిపండునేల, ఊడుపుమడి: చూ, భూమి. 1. (కైదారము- కైదార్యము- కేదారికము); పుం. 3. కొండ: చూ, పర్వతము; 4. కేదారపర్వతము: చూ, పర్వతము; 5. కుదురు: చూ, పాదు. 1; 6. కాశీపట్టణమునందలి పుణ్యక్షేత్రములలో నొకటి. (కేదారఘట్టమని వాడుక.)

కేదారశృంగము. సం. వి. అ న. బోదారసింగి *: చూ, మూర్ధజకరంజము.

కేదారుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు. (కార్తికమాసములో పున్నమముందొక శుక్రవారంబునగాని పున్నమనాఁడుగాని కేదారేశ్వరుని వ్రతమాచరింతురు)

కేనతి. సం. వి. ఈ. స్త్రీ. మన్మథునిభార్య: చూ, భార్య.

కేనారము. సం. వి. అ. పుం. 1. కుంభీపాకమను నరకము: చూ, కుంభీపాకము. (నరకములు ఇరువదియొకటింటిలో నొకటి: చూ, నరకములు); 2. చెక్కిలి, పుఱ్ఱెప్రదేశము (అనికొందఱు): చూ, లెంప. 2; 3. సంధి: చూ, బుజ్జగింత. (ఇది విచార్యము)

కేనారుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

కేనిపాతకము. సం. వి. అ. పుం. చుక్కాను; ఓడతెడ్డు (అని కొందఱు): చూ, పీలి. 2.

కేనిపాతనము. సం. వి. అ. పుం. —పై.—

కేనిపాతము. సం. వి. అ. పుం. —పై.—

కేమము. సం. వి. అ. న. పులిపిరికాయ: చూ, వ్రణము. 1.

కేముకము. సం. వి. అ. పుం. ఒకానొక చెట్టు: చూ, వృక్షము.

కేయూరబాహుచరిత్రము. పా. ఈగ్రంథమునకు కర్త మంచనకవి. (13 శతాబ్ది)

కేయూరము. సం. వి. అ. న. 1. భుజకీర్తులు: చూ, భూషణము. 2; పుం. 2. ఒకానొక రతిబంధము: చూ, రతిబంధము.

కేరజము. వై. వి. — గేరజ్జః. రూ- కేరిజము- కేర్జము- కర్జము: చూ, పక్షి.

కేరడము. దే. వి. 1. ఉపేక్ష. హరి. పూ. 1, ఆ. 180: చూ, మందెమేలము. 1; 2. తిరస్కారము. ఉ. హరి. 5, ఆ. 376: చూ, వక్రోక్తి

నము; 3. తిరస్కారపుమాట. ఉ. రా. 1, ఆ. 89: చూ, వ్యాఖ్యాతము. 2; 4. వంకర మాట. కా. 2, ఆ. 21: చూ, వ్యాఖ్యాతము 2; 5. ఒయ్యారము: చూ, విలాసము; 6. ఎగతాళి: చూ, పరిహాసము.

కేరడములుచే. దే. వి. ధూర్తుఁడు : చూ, వ్యాధుఁడు. 2.

కేరడములుచే దనము. దే వి. ధూర్తత్వము: చూ, నీచుతనము.

కేరడించు. దే. స. క్రి. వక్రము చేయు. వసు. 5, ఆ. 76: చూ, వంకరపోవు.

కేరలము. సం. వి. అ. న. 1. చిత్రతండులము *: చూ, వాయువిళంగము: 2. దేశములు ఏఁబది యారింటిలో నొకటి: చూ, దేశము. (రూ- కేరళము)

కేరలి. సం. వి. ఈ. స్త్రీ. 1. జ్యోతిర్గ్రంధ విశేషము, ఒకరకము వేఁపుకుపిండి: చూ, సాదను. (1); 2. అహోరాత్రము: చూ, రోజు.

కేరించు. దే. అ. క్రి. చెలరేఁగు; య. 5, ఆ. 76: చూ, విజృంభించు.

కేరింత. దే. వి. అలరింత: చూ, హాస్యము. 1.

కేరిజేము. వై. వి. = గేగడ్డ. రూ- కేరజేము: చూ, పక్షి.

కేగు. దే. అ. క్రి. 1. ఉత్సహించు. రుక్మి. 2, ఆ. 16: చూ, యత్నించు; 2. చెలరేఁగు. కళా. 6. ఆ. 195: చూ, విజృంభించు: 3. కుతూహలపడు. రుక్మి. 5, ఆ. 26: చూ, సంతోషించు; స. క్రి. 4. అనాదరించు. అచ్చ. అర. కాం. 32: చూ. తిరస్కరించు; 5. అపహసించు. పా. 4, ఆ. 67: చూ, వెక్కిరించు.

కేరుపు. దే. వి. జృంభణము: చూ, విజృంభణము.

కేర్జము. వై. వి. = గేరడ్డ. రూ- కేరజేము: చూ, పక్షి.

కేల. సం. వి. ఆ. స్త్రీ. 1. పోఁచేతిపోటు: చూ, పోటు. 4; 2. గసిక: చూ, మేకు: 3. మంటు: చూ, నిప్పు.

కేలకుఁడు. సం. వి. అ. పుం. కత్తి వాయిపైన ఆడెడువాఁడు: చూ, ప్లవకుఁడు.

కేలాసము. సం. వి. అ. పుం. కైలాసము చూ, పర్వతము.

కేలి. సం. వి. ఇ. పుం. స్త్రీ: చూ, రూ- కేళి.

కేలికము. సం. వి. అ పుం. అశోకము *: చూ, హేమపుష్పము.

కేలికల. సం. వి. ఆ. స్త్రీ. సరస్వతీ దేవియొక్క వీణె: చూ, వీణె.

కేలికళావతి. సం. వి. ఈ. స్త్రీ. మన్మథునిభార్య: చూ, భార్య.

కేలికిలము. సం. వి. అ. పుం. గుమ్ముడు*: చూ, మహాఫలము.

కేలికీర్ణము. సం. వి. అ. పుం. ఒంటె: చూ, లొట్టిపిట్ట.

కేలికుంచిక. సం. వి.ఆ. స్త్రీ. భార్యతోఁబుట్టువు: చూ, శ్యాలిక.

కేలికోశుఁడు. సం. వి. అ. పుం. నటుఁడు: చూ, శైలూషుఁడు.

కేలివృక్షము. సం. వి అ. పుం. కదంబము*: చూ, నీపము.

కేలు వై. వి. = కులి. కులికి 1. చేయి: చూ, హస్తము; 2. తొండము. భార. అర. 6, ఆ. 229: చూ, శుండము.

కేలుదమ్మి. వై. వి. పద్మమువంటి హస్తము: చూ, హస్తము.

కేలుపట్టు. వై. వి. పాణిగ్రహణము: చూ, వివాహము. (రూ- కేల్పట్టు)

కేలుమొగుట. వై. వి. చేమోడ్పు: చూ, నమస్కారము. (రూ- కేలుమొగుపు- కేలుమొగ్గ- కేలుమోడుపు- కేలుమోడ్పు- కేల్మొగుట-

కేల్మొగుడ్చు-కేల్మోడుపు- కేల్మొడ్చు- కేల్మో డుపు-కేలోమ్మడ్చు)

కేలుమొగుపు. వై. వి. —పై.—

కేలుమొగ్గ. వై. వి. —వై.—

కేలుమోడుపు. వై. వి. —వై.—

కేలుమోడ్చు. వై. వి. —వై—

కేల్పట్టు. వై. వి: చూ, రూ- కేలుపట్టు.

కేల్మొగుట. వై. వి: చూ, రూ- కేలుమొగుట.

కేల్మొగుడ్చు. వై. వి. —వై.—

కేల్మోడుపు. వై. వి. —వై.—

కేల్మోడ్చు. వై. వి. —వై.—

కేలోమ్మడుపు. వై. వి. —వై.—

కేలోమ్మడ్చు. వై. వి. —పై—

కేవ. దే. వి. దగ్గఱ. అం, భా. తృ. 242: చూ, సమీపము. 1.

కేవడము. వై. వి: చూ, రూ- కేడెము. స్వా. 4, ఆ. 28.

కేవరి. దే. వి. (కేవు + అరి) కేవు పుచ్చుకొను వాఁడు. చూ, సుంకరి.

కేవలద్రవ్యము. సం. వి. అ. న. మరిచము: చూ, మిరియము.

కేవలము. సం వి. అ. న. 1. నిర్ణయింపఁబడినది: చూ, స్థితము. 3; 2. జ్ఞానవిశేషము: చూ, బుద్ధి; విణ.3. అంతః చూ, సర్వము; 4.ఒకటి: చూ, వంచి.

కేవలి. సం. వి. న్. పుం. 1. బుద్ధదేవుఁడు: చూ, బుద్ధుఁడు. 1; 2. శాక్యబుద్ధదేవుఁడు: చూ, బుద్ధుఁడు. 1; 3. జైన విశేషము: చూ, బుద్ధుఁడు. 1.

కేవలుఁడు. సం. వి. అ. పుం. పరమాత్మ: చూ, హంసుఁడు.

కేవు. దే. వి. ఓడకిచ్చెడు కూలి: చూ, తరపణ్యము.

కేశకలాపము. సం. వి. అ. పుం 1. వెండ్రుకలముడి: చూ, ముడి. 3; 2. వెండ్రుకలసమూహము: చూ, వెండ్రుక. 1.

కేరంరము. సం. వి. అ.పుం. 1. కరఫలము: చూ, గొజపము; 2. ఒకరకము చెట్టు *: చూ, రసాలము. 3.

కేశకీటము. సం. వి. అ. పుం. పేను: చూ, యూకము.

కేశఖండనము. పా. పుట్టినవెండ్రుకలు తీయుట. ఇందుకు కాలనిర్ణయము.— పుత్రవిషయమై పుట్టినదిమొదలు సరినెలలైన 2-4-6 నెలలయందుగా, స్త్రీవిషయమైబేసినెలలైన 3-5-7 నెలలయందును, ఉభయులకు నుత్తరాయణమందును, పూర్వాహ్ణమందును, అశ్వి- మృ- పున- పుష్య- హ- చి- స్వా- శ్ర- ధ- శత- రేవతినక్షత్రముల యందును, సోమ-బు-గు- శుక్రవారములయందును, 3-8-13-30-తిథులు వదలి మిగత తిథులయందును కేశఖండనము చేయవలెను. కాలామృతము. 20. శ్లో.

కేశగర్భకము. సం. వి. అ. పుం. కబరి: చూ, వేనలి.

కేశఘ్నము. సం. వి. అ. న. పేనుకొఱుకుట: చూ, బట్టతల.

కేశచ్ఛిత్తు. సం. వి. ద్. పుం. నాపితుఁడు: చూ, మంగలి.

కేశటము. సం. వి. అ. పుం. 1. భాగము: చూ, మేషము. 1; 2 అంటు పేను: చూ, యూకము; 3. దుండిగము *: చూ, శోణకము; 4. కామదేవునియొక్క శోషణమను బాణము: చూ, బాణము. 1.

కేశటుఁడు. సం. వి. అ. పుం. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. తోడఁబుట్టినవాఁడు, భ్రాత: చూ, సహోదరుఁడు.

కేశనామము. సం. వి. న్. న: చూ, రూ- కేశాంబునామము *.

కేశపక్షము. సం. వి. అ. పుం. కేశసమూహము. (రూ- కేశపాశము - కేశహస్తము) : చూ, బెందుర్క. 1.

కేశపద్ధతి. సం. వి. ఇ. స్త్రీ. పాపట : చూ, సీమంతము. 1.

కేశపల్లి. సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరేను *: చూ, శైఖరికము.

కేశపాశము. సం. వి. అ. పుం: చూ, రూ- కేశపక్షము.

కేశపాశి. సం. వి. ఈ. స్త్రీ. సిగ, మొగవాని జొట్టు. (అని కొందఱు): చూ, సిగ. 4.

కేశబంధము. సం. వి. అ. పుం. 1. (పువ్వులు ముడిచిన) కొప్పు: చూ, వేణి; అం. 2. నృత్త హస్తములు ఇరువదితొమ్మిదింటిలో నొకటి: చూ, నృత్తహస్తములు.

కేశభువు. సం. వి. ఊ. పుం. ముక్కంటి చూ, శివుడు.

కేశమథని. సం. వి. ఈ. స్త్రీ. జమ్మి *: చూ, శమి.

కేశమార్జకము. సం. వి. అ. న. కంకతము: చూ, ప్రసాధని.

కేశమార్జనము. సం. వి. అ. న. —పై—

కేశము. సం వి. అ. పుం. 1.తలవెండ్రుక: చూ, వెండ్రుక. 1; 2. కురువేరు *: చూ, హ్రీబేరము.

కేశముష్టి. సం. వి. ఇ. పుం. 1. విషముష్టి*: చూ, ముసిడి; 2. మహానింబము *: చూ, వేము; 3: చూ, తేనెమాను.

కేశముష్టిక. సం. వి. ఆ. స్త్రీ. విషముష్టి *: చూ, ముసిడి.

కేశముష్టికము. సం. వి. అ. పుం. పెద్దవేము *: చూ, వేము.

కేశరంజనము. సం. వి. అ. పుం. గుంటగలగర *: చూ, భృంగరాజము. 1.

కేశరంజని. సం. వి. ఈ. స్త్రీ. చిన్నగోరంట *: చూ, మహాసహా.

కేశరము. సం. వి. అ. పుం, న. రూ- కేసరము. 1.అకరువు: చూ, పక్ష్మము. 4; 2. బిసవిశేషము: చూ, బిసము. 1; 3. అహికేసరము *: చూ, నాగకేసరము; 4. పొగడ *: చూ, వకుళము; 5. పున్నాగము *: చూ, పొన్న; 6. = కోసజూలు, సింగములోనగువాని మెడ మీది వెండ్రుక: చూ, వెండ్రుక. 1; న. 7. ఇంగువ *: చూ, హింగువు. 2; 8. వింజామరము: చూ, సురటి; 9.లవంగపుపువ్వు: చూ, లవంగపువ్వు.

కేశరామ్లము. సం. వి. అ. పుం. మాదీఫలము *: చూ, మాతులుంగము.

కేశరి. సం. వి. న్. పుం. రూ-కేసరి. 1. సింగము: చూ, సింహము; 2. గుఱ్ఱము: చూ, హయము; 3 పున్నాగము *: చూ, పొన్న; 4. అహికేసరము *: చూ, నాగకేసరము.

కేశరుహా. సం. వి. ఆ. స్త్రీ. భద్రదంతిక *: చూ, విశల్య. 5.

కేశరూప. సం. వి. ఆ. స్త్రీ. వృక్షోపరిస్పృక్షము, బదనిక: చూ, వదనిక.

కేశవము సం. వి. అ. పుం. పున్నాగము*: చూ, పొన్న.

కేశవర్ధని. సం. వి. ఈ. స్త్రీ. 1. సహదేవి *: చూ, ముత్తవపులగము; వా. 2. వెండ్రుకలు పెరుగు తైలము. (దుకాణములలో విక్రయమునకు దొరకును.)

కేశవాయుధము. సం. వి. అ. న. 1.రథాంగము: చూ, బండికన్ను; పుం. 2. ఆమ్రము*: చూ, మామిడి.

కేశవాలయము. సం. వి. అ. పుం. అశ్వత్థము *: చూ, రావి.

కేశవావాసము. సం. వి. అ. పుం. —పై—

కేశవుఁడు. సం. వి. అ. పుం. 1.రూ—కేశవుఁడు-కేశి. వెన్నుఁడు: చూ,విష్ణువు. (కేశవాయస్వాహా=ప్రవర్తియందు, బ్రహ్మ విష్ణు రుద్రస్వరూపులుగాను లయమందొక పరమాత్మగానుండుటయేస్వభావముగాఁగలవస్తువే కేశవుఁడు. అట్టి వస్తువు నాపాపములను భస్మీకరించుఁగాత! అనిభావము:చూ, ఓమ్);2.ఎనిమిదేండ్లబాలుఁడు: చూ,శిశువు; విణ. 3.మంచితలవెండ్రుకలు కలవాఁడు: చూ, సుకేశుఁడు.

కేశవేశము. సం. వి. అ. పుం. కొప్పు:చూ,వేనలి.

కేశహంత్రిఫల. సం. వి. ఆ. స్త్రీ. జమ్మి *: చూ, శమి.

కేశహంత్రి. సం. వి. ఈ. స్త్రీ. —పై—

కేశహస్తము. సం. వి. అ. పుం: చూ, కేశపక్షము.

కేశాంతజములు. అం:చూ, ఆగంతుకములు.(అనుబంధములో చూడుము.)

కేశాంబునామము. సం. వి. న్. న. కురువేరు *: చూ, హ్రీబేరము.

కేశాకర్షణశక్తి. పా. మనమొక గుడ్డ పేలికనుగాని, అద్దుడుకాగితమునుగాని, మఱియే సచ్ఛిద్రపదార్థమునుగాని యొకచివరనీటిలో బెట్టినయెడల తన నీటిమట్టముకంటె కొంత పైకెక్కఁబాఱును. దీపపువత్తి చమురును పైకి లాగుకొనుట చూచుచున్నాము. ఇట్లు ద్రవపదార్థమును పైకి లాగుకొనుశక్తి కేశాకర్షణశక్తి (Capillarity) అనఁబడును.

కేశాకేశి. సం. అవ్య. సిగపట్లు పోట్లాట: చూ, యుద్ధము.

కేశారుహా. సం. వి. ఆ. స్త్రీ: చూ, కేశవర్ధని*.

కేశార్హా. సం. వి. ఆ. స్త్రీ. పెద్దనీలి *: చూ, రంజని.

కేశాహ్వము. సం. వి. అ. పుం. కురువేరు*:చూ, హ్రీబేరము.

కేశి. సం. వి. న్. పుం. 1. ఒకానొక రాక్షసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; 2. ప్రచేతసుఁడు: చూ, వరుణుఁడు. 1; 3. కురువేరు*: చూ, హ్రీబేరము; 4. వెన్నుఁడు : చూ, విష్ణువు. 1; 5. సింగము: చూ, సింహము: విణ. 6. మంచి తలవెండ్రుకలు గలవాఁడు; చూ, సుకేశుఁడు; ఈ. స్త్రీ. 7. నఖముచిప్ప: చూ, నఖము; 8. నీలి *:చూ,రంజని; 9.చిప్పగడ్డి*: చూ, తృణము. 1; 10: చూ, అజలోమ *. 11. జటామాంసి * చూ, మాంసి. 2; 12. పిల్లపీచర *: చూ, శతమూలి.

కేశిక. సం. వి. ఆ. స్త్రీ. పిల్లపీచర *: చూ, శతమూలి.

కేశికుఁడు. సం. విణ. మంచి తలవెండ్రుకలుగలవాఁడు: చూ, సుకేశుఁడు.

కేశిని. సం వి. ఈ. స్త్రీ. 1. కట్లతీఁగె *:చూ, పర్యంకపాలిక; 2. పద్మపుతీఁగె *: చూ, శంకిని; విణ. 3. మంచి తలవెండ్రుకలుగలది. (ఆఁడుది): చూ, స్త్రీ.

కేశిసూదనుఁడు. సం. వి. అ. పుం శ్రీకృష్ణుఁడు. చూ, విష్ణువు. 1.

కేశిహానుఁడు. సం. వి. న్. పుం. —పై—

కేశుఁడు. సం. వి. అ. పుం. 1. నీటిఱేఁడు: చూ, వరుణుఁడు; 2. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

కేశ్యము. సం. వి. అ. న. 1. కృష్ణాగురువు: చూ, రాజార్హము; పుం. 2. గుంటగలగర *: చూ, భృంగరాజము.

కేస. దే. వి. = కళ. నెమలికూఁత. అం, భా.ద్వి. 96: చూ, స్వరము. 2.

కేసర. సం. వి. ఆ. స్త్రీ. కార్పాసము *: చూ, ప్రత్తి.

కేసరపూరకము. సం. వి. అ. పుం. ఫుల్లమాదీఫలము *: చూ, మాతులుంగము.

**కేసరబ్రాహ్మణులు.** పా. పంచగౌడులందలి సారస్వతులలోని మూఁడవతెగవారు: చూ. బ్రాహ్మణులు. (చూ, ఆమగోత్ర బ్రాహ్మణులు.)

**కేసరము.** సం. వి. అ. పుం. న: చూ. రూ- కేళరము.

**కేసరవరము.** సం. వి. అ. న. కుంకుమము: చూ, వహ్నిశిఖము. 1.

**కేసరాంజనము.** సం. వి. అ. పుం. గుంట గలగర *: చూ, భృంగరాజము.

**కేసరామ్లము.** సం. వి. అ. పుం. బీజపూరము *: చూ, మాతులుంగము.

**కేసరి.** సం. వి. న్. పుం. 1. సింగము: చూ, సింహము; 2. గుఱ్ఱము: చూ. హయము; 3. పున్నాగము*: చూ, పొన్న; 4. అహికేసరము*: చూ, నాగకేసరము. 5. హనుమంతుని తండ్రి: చూ, వానరము; 6. మాదీఫలము *: చూ, మాతులుంగము; 7. రక్తశిగ్రువు *: చూ, మునగ; వై. వి. (1) = ఖేచరః. ఖేచరమను మృగము: చూ, ఖేచరము; (2) ఒకరకము వరిపైరు. చూ, సస్యము; (3) బ. కేసరి యను వడ్లు: చూ, ధాన్యము.

**కేసరిక.** సం. వి. ఆ. స్త్రీ. సహదేవి *: చూ, ముత్తవపులగము.

**కేసరిజుఁడు.** సం. వి. అ. పుం. ఆంజనేయుఁడు: చూ, వానరము.

**కేసు.** వా. వి. 1. అచ్చుకూర్పు అక్షరములు గల గళ్లతొట్టె; 2. దావా (చూ, కేజు.) " కేసు వాయిదా వేసిరి. "

**కేళకుళి.** వై. వి. = ఖేలాకులమ్. క్రీడాసరస్సు. కవిక. 2, ఆ. 57: చూ, రూ- కేళకుళి.

**కేళకూళి.** వై. వి.= -పై.-. విక్ర. 5, ఆ. 19: భీమ. 3. ఆ. 190.

**కేళాకుళి.** వై. వి.= —పై.—

**కేళాకూళి.** వై. వి.= —పై.—

**కేళి.** సం. వి. ఇ. పుం, స్త్రీ = కేళిక. గేలి రూ- కేలి. 1. పురుషులు స్నేహమున స్త్రీలులోనగువారిని గద్దించుట కొట్టుట పరిహసించుట మొదలుగాఁగలది; 2. ఆట: చూ, విలాసము. 1; 3. ప్రియునితోడి విహారమునందలి నాయికయొక్క క్రీడ: చూ, విలాసము. 1; 4. స్త్రీపురుషులు వినోదమునిమిత్తమైయాడెడు చతురంగము మొదలైన యాట: చూ, విలాసము. 1; 5. పుడమి: చూ, భూమి. 1; వా. 6. ప్రాంతదొంగ, కేడి "నిన్న కేళీల రిజస్టరులో చేర్చినారు."

**కేళిః.** వై. వి.= కేళి. శరీర హస్త నేత్రాభినయములచేత భావమును తెలుపుచు నాడెడు ఆట. రామా. 2, ఆ. 181: చూ, నృత్యము.

**కేళికీలుఁడు.** సం. విణ. నవ్వించువాఁడు: చూ, హాస్యగాఁడు.

**కేళిముఖము.** సం. వి. అ. న. పరియాచకము: చూ, పరిహాసము.

**కేళిశీలుఁడు** సం. విణ: చూ, కేళికీలుఁడు.

**కేళీలు.** పా. సస్యమునందు అక్కడక్కడఁ గనఁబడు సామాన్యపు మొక్కలు (Sports.)

## కై

**కై.** దే. అవ్య. 1. చతుర్థీవిభక్తియందు వచ్చెడు ఒక ప్రత్యయము: కొఱకు; వై. వి. 2.=కర. చేయి. రూ-కయి. ఉ. రా. 6, ఆ. 56: చూ, హస్తము; 3. తొండము. రూ-కయి: చూ, శుండము; (దేశ్యుని శబ్దరత్నాకరము); వా. 4. కోపము చూపుటయందగు ధ్వన్యనుకరణము. "మాట్లాడిన 'కై' అని మీఁదపడెదవు. నీతో మాటలాడు టెట్లు: చూ, హూహూ (రూ-కయి-కయ్యి.)

కైక. వై. వి.=కైకేయి. రూ- కయిక. అచ్చ అ, శాం. 49; వేమన. 1167: చూ, కైకేయి.

కైకట్టు. ద్వ. వి: చూ, రూ-కయికట్టు.

కైకయి. సం. వి.ఈ. స్త్రీ: చూ, రూ-కైకేయి.

కైకలవాఁడు. దే.వి: చూ,రూ-కయికోలవాఁడు.

కైకానుక. దే. వి: చూ, రూ- కయికానుక. రామా. 2, ఆ. 5; య. 1, ఆ. 104.

కైకుండికము. సం. వి. అ. న. కుడుములరాసి: చూ, భక్ష్యము.

కైకేయి. సం వి. ఈ. స్త్రీ. = కయిక- కైక. కేకయరాజుకూఁతురు, దశరథుని భార్య. భరతునితల్లి: కేకయి-కేకేయి-కైకయి; (తె.ప):- కయిక-కైక.

కైకొను. దే. అ. క్రి: చూ, రూ-కయికొను. (పూను.-ఉ, హరి.4, ఆ. 96; లక్ష్యపెట్టు - భార. శాం. 3, ఆ. 178.)

కైకొలుపు. దే. ప్రే: చూ, రూ-కయికొలుపు. భో. 4, ఆ. 74.

కైకోల. దే. వి: చూ, రూ-కయికోల.

కైకోలవాఁడు. దే. వి: చూ, రూ-కయికోల వాఁడు.

కైకోలు. దే. వి: చూ, రూ-కయికోలు. (అంగీకారము.—భాగ. 8, స్కం. 192; గ్రహణము.-కా. 1, ఆ. 5.)

కైచాఁపులు. దే. వి. బ: చూ, రూ-కయిచాఁపులు. హంస. 4, ఆ. 218.

కైజీతకాఁడు. దే. వి. కంబలాయుధసేవి. ఆం, భా. ద్వి. 185: చూ, గురిమాసి.

కైజీతము. ద్వ. వి: చూ, రూ-కయిజీతము.

కైజో. దే. వి: చూ, రూ-కయిజో. చంద్రా. 2, ఆ. 58.

కైజోమొర. దే. వి. హయశిరఃకంపము.

కైజోటు. దే. అ. క్రి: చూ, రూ-కయిజోటు.

కైజో. వై. వి.=కపింజల. చూ, రూ-కయిజో (దేశ్యమని శబ్దరత్నాకరము.)

కైటజము. సం. వి. అ. పుం. కుటజము*: చూ, వత్సకము.

కైటభ. సం.వి. ఆ. స్త్రీ. గౌరి: చూ, పార్వతి.1.

కైటభజిత్తు. సం. వి. త్. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు 1.

కైటభహానుఁడు. సం. వి. న్. పుం. —పై.—

కైటభారి సం. వి. ఇ. పుం. —పై.—

కైటభి సం. వి. ఈ. స్త్రీ. దుర్గ: చూ, పార్వతి.1.

కైటభుఁడు సం. వి. అ. పుం. కైటభుఁడను రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

కైటర్యము. సం. వి. అ. పుం. 1. కట్ఫలము *: చూ, పినగుమ్ముడు; 2. నింబము*: చూ, వేము; 3. మహానింబము *: చూ, వేము; 4. ఉమ్మెత్త*: చూ, హాలాపువ్వము.

కైతికము. సం. వి. అ. పుం. కొండనిమ్మ *: చూ. నిమ్మ.

కైడర్య. సం. వి. ఆ స్త్రీ. 1. నల్లగినియ*: చూ, శుకనాసము. 1; 2. కటివేము*: చూ, బల.

కైడర్యము. సం. వి అ. పుం. 1. కటివేము *: చూ,బల; 2. కట్ఫలము*: చూ, పినగుమ్ముడు; 3. నెమలియడుగుమాని *: చూ, పూతికరజము; 4. గుమ్ముడు *: చూ, మహాఫలము.

కైడువు. దే. వి: చూ, రూ-కయిడువు.

కైత. వై. వి.=కవితా: చూ, రూ-కయిత.

కైతకము. సం. వి. అ. న. 1. కేతకీపువ్వము: చూ, మొగలి (గేదంగిపువ్వు); 2. తిక్కకటుకము*: చూ, శకులాదని. 1.

కైతట్టు. దే. వి. గిండి: చూ, పాత్రము. 6.

కైతము. వై. వి.=కవితా: చూ, కైత.

కైతవము. సం. వి. అ. న. 1. కపటము: చూ, వ్యాజము. 1; 2. జూదము: చూ, ద్యూతవహారము. 4; 3. వైదూర్యమణి: చూ, రత్నము.1

కైతవాపహ్నుతి. అం. అలంకారములలో నొకటి: చూ, హేతువు. 2.

కైతాళము. మి. వి. చేతితో వాయించు కంచు తాళము: చూ, వీణ.

కైదండ. దే. వి: చూ, రూ-కయిదండ.

కైదారకము. సం. వి. అ. న. కేదారముల సమూహము (కేదారము = వరిమడి) (రూ-కైదారికము-కైదార్యము.); చూ, భూమి. 1.

కైదారము. సం. వి. అ. న. 1. —పై.—; పుం. 2. శాలిధాన్యము: చూ, ధాన్యము.

కైదారికము. సం. వి. అ. న: చూ, కైదారకము.

కైదారిణము. సం. వి. అ. న. —పై.—

కైదార్యము. సం. వి. అ. న. —పై.—

కైది. దే. వి: చూ, ఖైది.

కైను. దే. వి: చూ, రూ-కయిను.

కైదువ. దే. వి. రూ-కైదువు. 1. ఆయుధము: చూ, బాణము. 1; 2. కత్తి: చూ, రిష్టి. 2.

కైదువు. దే. వి. —పై—. రూ-కయిదువు. భార. ద్రో. 5, అ. 51; పాండు. 4, అ. 71

కైనితము. పా. కైనితము అను ఖనిజము మట్టియొక్క పొటాసియము యెరువు. ఇందు 13% వఱకు పొటాష్ ఉండును. (పొటాష్‌యెరువు కాండ వృద్ధిని కలిగించును.)

కైపదము. వై. వి. = కవిపద. భో. 2, అ. 50: చూ, రూ-కయిపదము.

కైపాల. ద్వ. వి. 1. మంగలికత్తి: చూ, పాడపము. 2; వై. వి. 2. = కక్షపాల. బైరాగుల జోలె: చూ, పాత్రము. 6 (రూ-కకపాల-కక్కపాల)

కైపు. దే. వి: చూ, రూ-కయిపు. (అందము.- రామా.2, అ. 07; విజృంభణము.-వేమన1170; పాండు. 4, అ. 19; విధము.-రామా. 6, అ. 108.)

కైఫీయతు. హిం. వి. సమాధానము: చూ, కయిఫీయతు.

కైముడి. ద్వ. వి: చూ. రూ-కయిముడి.

కైముతికన్యాయము. పా. అధికులుపొందు బాధలకంటె అల్పులు పొందు బాధలెక్కువ కావను రీతి

కైమోడుపు. ద్వ. వి: చూ, రూ-కయిమోడుపు. పాంచ. 4 అ. 218 (రూ- కైమోడ్పు-కయిమోడుపు- కయిమోడ్పు)

కైరదుఁడు. దే. వి: చూ, రూ- కయిరదుఁడు.

కైరవడి. వై. వి. = భాదిరవటుక: చూ, రూ-కయిరవడి.

కైరవము. సం. వి. అ. పుం. 1. కేతకి *: చూ, మొగలి; 2.= కలువ *: చూ, పద్మము. 1

కైరవి. సం. వి. న. పుం. 1. చందమామ: చూ, చంద్రుఁడు; ఈ. స్త్రీ. 2. చంద్రిక: చూ, వెన్నెల; 3. మెంతి *: చూ, మేంథి; 4. వేఁపుడుపిండి: చూ, సాదము. (1)

కైరవిణి. సం. వి. ఈ. స్త్రీ. కలువలుండుకొలను: చూ, సరస్సు. 1.

కైరవుఁడు. సం. వి. అ. పుం. 1. వైరి: చూ, శత్రువు. 1; 2. కితవుఁడు: చూ వంచకుఁడు.1.

కైరాతతండులము. సం. వి.అ. పుం.విడంగము*: చూ, వాయువిళంగము.

కైరాతము సం. వి. అ. న. 1. నేలవేము*: చూ, భూనింబము; 2. శంబరచందనము: చూ, వాసన.

కైరాతుఁడు. సం. వి. అ. పుం. బలవంతుఁడు: చూ, లావరి.

కైరాలము. సం. వి. అ. న. విడంగము *: చూ, వాయువిళంగము.

కైరాలి. సం. వి. ఈ. స్త్రీ. భోగముది: చూ, వేశ్య.

కైలాగు. దే. వి: చూ, రూ- కయిలాగు.

కైలాటకాఁడు. దే. విశే. (కైలాటము + కాఁడు): చూ, రూ—కయిలాటకాఁడు.

కైలాటము. దే. వి. 1. మాయోపాయము. కాశీ. 6, ఆ. 141: చూ, రూ—కయిలాటము; 2. నతివిశేషము: చూ, నమస్కారము; 3. కుత్సితము: చూ, హీనము. 1.

కైలాసనాథుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు.

కైలాసనికేతనుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ. శివుఁడు.

కైలాసమందిరుఁడు. సం. వి. అ. పుం. —పై.—

కైలాసము. సం. వి. అ. పుం. కుబేరుని యునికిపట్టు, కుబేరుని పట్టణము; ఈశానుఁడుండు వెండి కొండ: చూ, పర్వతము.

కైలాసౌకసుఁడు. సం. వి. స్. పుం. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు.

కైలు. దే. వి: చూ, రూ—కయిలు.

కైవడి. వై. వి. = కైవర్తి: చూ, రూ—కయివడి. (దేశ్యమని శబ్దరత్నాకరము)

కైవడిముస్తె. వై. వి. = కైవర్తీముస్తకమ్: చూ, రూ—కయివడిముస్తె: చూ, ముస్తకము.

కైవర్తము. సం. వి. అ. న. = కైవడిముస్తె * —పై.—

కైవర్తముస్తకము. సం. వి. అ. న. = —పై.—

కైవర్తముస్తకము. సం. వి. అ. న. —పై.—

కైవర్తి. సం. వి. ఈ. స్త్రీ. = కయివడి—కైవడి—పై.— (తుంగ అని కొందఱు)

కైవర్తిక. సం. వి. ఆ. స్త్రీ. —పై.—

కైవర్తిముస్తకము: చూ, రూ—కైవర్తముస్తకము.

కైవర్తీముస్తకము. —పై.—

కైవర్తుఁడు. సం. వి. అ. పుం. జాలరి, పడవ నడుపువాఁడు. (అని కొందఱు): చూ, పల్లెఁడు

కైవలము. సం. వి. అ. న. విడంగము *: చూ, వాయువిళంగము.

కైవల్యము. సం. వి. అ. న. 1. ముక్తి: చూ, మోక్షము. 1; 2. విమయేచ్ఛారహితత్వము: చూ, వైరాగ్యము; 3. ఏకాంతము: చూ, రహస్యము. 1.

కైవల్యుఁడు. సం. విశే. గొప్పవాఁడు: చూ, హెమాహెములు. (మోక్షార్హుఁడనునర్థముగా వాడెదరు)

కైవళి. వై. వి. = కైవర్తి: చూ, రూ—కయివళి. (దేశ్యమని శబ్దరత్నాకరము)

కైవసము. దే. వి. అధీనము. చూ, వశము. 1.

కైవారపుచేతులు. దే. వి. బ. ఒకానొకనతి: చూ, నమస్కారము.

కైవారము. సం. వి అ. న. 1. వందిస్తోత్రము. సై. 7. ఆ. 89: చూ, స్తోత్రము; దే. వి. వై. వి. (1): చూ, రూ—కయివారము.

కైవారముసేయు. ద్వ. స. క్రి: చూ, రూ—కయివారముసేయు.

కైవారి. సం. వి. న్. పుం. బట్టువాఁడు. పారి. పూ. 1, ఆ. 4: చూ. వంది.

కైవు. దే. వి: చూ, రూ—కయివు. (ఉన్మాదము.— ఉ. హరి. 2, ఆ. 750)

కైవ్రాలు. దే. అ. క్రి: చూ, రూ—కయివ్రాలు. (ఒఱగు—విక్రి. 4. ఆ. 89; పత్తులులోనగునవి క్రిందికిదిగు.—ఉ. రా 3, ఆ. 103; కాశి.—ఆము. 4. ఆ. 85)

కైవ్రాలుచు. దే. ప్రే: చూ, రూ—కయివ్రాలుచు.

కైశికము. సం. వి. అ. న. 1. వెండ్రుకలసమూహము: చూ, వెండ్రుక. 1; పుం. 2. శృంగారరసము: చూ, రసములు.

కైశికి. అం. 1. కావ్యవృత్తులు నాలుగింటిలో నొకటి: చూ, వృత్తులు; 2. ఒక కావ్యవృత్తి.— "మృదువయిశృంగారకరుణరసములను దెలుపు అర్థరచన. ఇందు టవర్గము తప్ప శకారము

మొదలు మకారము దనుకనుండు నక్షరములు పూర్ణాను స్వారపూర్వకముగాఁ గలదియు, దీర్ఘములులేని రేఫణకారములును, సమాసము లేకపోవుటగాని. కొలఁది సమాసములుండుట గాని గలదియు, మధురపదములతో సంబంధ ముకలఁగునట్టిది యునగు మాధుర్యము గలిగి యుండును.ఉదా.—అలతాంగులు మందమం దయానంబుల నందెము నింపుఁగొలుపమెలంగు చు, లతాంతంబుల పువ్వులఁగోరులం జిదు ముచు. మందహాసంబులు ముఖారవిందంబుల నంగరింప, చిలుకపలుకుల సకిలించు మృదుతర వచన రచనవిశేషంబుల నన్యోన్యంబు గరగిం చుచు, సంచరించుచుండిరి" (ఉపన్యాసదర్ప ణము.); 3. అంశములు అఱువది మూఁడింటి లో శుద్ధజాతులు యేడున్నూగాక మిగత జాతులుపదునొకటింటిలో అఱవదియగు యీ కైశికి అఱువిధంబులుగలదై యున్నది: చూ, అంశములు. (ఇది గాంధర్వ వేదమునందలి రాగాధ్యాయములోనిది); 4. పంచమజభావ లుపదింటిలోనొకటి.(చూ.పంచమజభావలు): చూ, భావ. 1.

**కైశికుఁడు.** సం. వి. అ. పుం. చేందమామ:చూ, చంద్రుఁడు.

**కైశ్యము.** సం. వి. అ. పుం. 1. పెద్దబేకు *: చూ, శాకోటము; 2. తలవెండ్రుకల గుంపు: చూ, వెండ్రుక. 1.

**కైశోరము.** సం. వి. అ. న. పండ్లు మొలచినది మొదలు మూఁడేండ్లవఱకుగల వయస్సు: చూ, వయస్సు. 1.

**కైశ్యము.** సం. వి. అ. న. తలవెండ్రుకల గుంపు, కొప్పు (అని కొందఱు): చూ, వెండ్రుక.1.

**కైసన్న.** వై. వి. పిలుపు: చూ, సంబోధనము.

**కైసరుఁడు.** వై. వి. = కపీశ్వరః: చూ, రూ-కయి సరుఁడు.

**కైసాటిచుక్క.** ద్వ. వి: చూ, రూ- కయిసాటి చుక్క.

**కైసేఁత.** ద్వ. వి: చూ రూ- కయిసేఁత.

**కైసేతకాఁడు.** ద్వ వి. అలంకరింపఁబడినవాఁడు: చూ, భూషితుఁడు.

**కైసేయు.** ద్వ. స. క్రి: చూ, రూ-కయిసేయు. (అలంకరించు.— విక్రి. 4, ఆ. 192; పూజించు.— భీ. 4, ఆ. 203)

**కైసేయువాఁడు.** ద్వ. వి. అలంకర్త : చూ, అలంకరిష్ణువు.

## కొం.

**కొంకగొనుగు.** దే. వి కొండగోఁగు: చూ, పీత పుష్పము.

**కొంకణము.** అం. దేశములు ఏఁబదియాఱింటిలో నొకటి. వేమన. 1172: చూ. దేశము. (రూ- కోఁకణము)

**కొంకణసబ్రాహ్మణులు.** పా. వీరిని చిత్రపావ నులందురు. పరశురామమూర్తిఅఱువదియుందిని పవిత్రులుగాఁజేసి బ్రాహ్మణత్వమునీయఁగా బ్రాహ్మణులైనట్లు సహ్యాద్రి కాండమునఁ జెప్పఁబడియున్నది: చూ, బ్రాహ్మణులు.

**కొంకనక్క.** ద్వ. వి. చిన్నజాతినక్క, శిఖి. భార. అశ్వ. 2, ఆ. 117: చూ, సృగాలము.

**కొంకర.** దే. వి. వంపు: చూ, వేల్లితము. 2.

**కొంకరలువోవు.** దే. అ. క్రి. (కొంకరలు + పోవు) శైత్యాదులచేతఁ గాళ్ళుచేతులులోనగు నవి నిగిడికొను. రామా. 7, ఆ. 258: చూ, వంకరవోవు.

**కొంకి.** దే. వి. రూ- క్రొంకి. 1. వంపుచీల: చూ, రూ- క్రొంకి; 2. అందనిపండ్లులోనగు వానిఁ గోయుటకు ఉపయుక్తముగా వంకర చిల్లదోపినకోల: క్రొంకి, దోఁటి: బ. 8.ముబి

లిగుంతకుఁ బార్శ్వములమందెడి యెముకలు: చూ, కల్యము. 1; 4. మోఁకాలిచిప్పకు లోతట్టు రెండుప్రక్కలనుండెడియెముకలు: చూ, కల్యము. 1. (కొంకివేళ్ళు= కొంకివలెనుండు వేళ్లు.)

కొంకిపురుగు. వా వి. మనుజునిశరీరమునఁ బ్రవేశించి హింసించు ఒకానొక పురుగు. (నులిపురుగువంటిది): చూ, పురుగు.

కొంకు. దే. వి. 1. భయము: చూ, వెఱపు: 2: చూ, వెనుదీయుట. విక్రి. 3, ఆ. 97; 3. జంకు: చూ, సంకోచము. 8; అ. క్రి. 4. జంకు. విక్రి. 7, ఆ. 127: చూ, భయపడు; 5. వెనుకదీయు: చూ, వెనుదీయు. 1; 6 మోమోడు: చూ, సంకోచించు

కొంకుపాటు. ద్వ. వి. 1. భయపడుట. కవిక. 4, ఆ. 107; 2. సంకోచపడుట. హంస. 3. ఆ. 220, 3. జాఱుపాటు: చూ, స్ఖలనము. 2.

కొంకువోవు. దే. అ. క్రి. (కొంకు + పోవు) కాళ్లుచేతులు నిగుడుకొను; భార. శాం. 3, ఆ. 318: చూ, వంకరపోవు. (రూ- కొంకరలువోవు- కొరవోవు)

కొంగ. వై. వి. = క్రుంక్. క్రౌంచము: చూ, బకము.

కొంగకాళ్ళవాఁడు. ద్వ. విశే. నిడుపుమోఁకాళ్లవాఁడు: చూ, ఊర్ధ్వజానువు. 1.

కొంగవాలు. వై. వి. = కృజ్వాల. మాదిగకత్తి. య. 2, ఆ. 10: చూ, రిష్టి. 2.

కొంగు. దే. వి: చూ, చెంగు.

కొంగుపసిఁడి. జా. కొంగుబంగారు. సులభము గానభీష్టమునుదీర్చునది. "కోప మొకింతలేని బుధకోటికిఁగొంగుపసిఁడి." (విజయవిలాసము)

కొంగుమాయు. దే. అ. క్రి: చూ, సమర్తాడు.

కొంగోడువడు. ద్వ. అ. క్రి. (కొంగోడు + పడు) అవనతమగు: చూ, వ్రాలు. 3.

కొంగోడువోవు. దే. అ. క్రి. (కొంగోడు + పోవు) —పై.—

కొంచించు. దే. అ. క్రి. రూ- కొంచు. రసి. 5, ఆ 189: చూ, సంకోచించు.

కొంచియము. వై. విశే.= కించిత్. రూ- కొంచెము. 1= కుంచక. న్యూనత: చూ, వెలితి. 2: విశే 2. అల్పము. కాశీ. 3, ఆ. 140: చూ, స్వల్పము.

కొంచెకత్తె. వై. వి. (కొంచెము + కత్తె) 1. సామాన్యకాలు: చూ, స్త్రీ: 2. అల్పురాలు: చూ, స్త్రీ.

కొంచెకాఁడు. ద్వ. విశే. (కొంచెము + కాఁడు) 1. అల్పుఁడు: చూ, హీనుఁడు; 2. సాధారణుఁడు: చూ, సామాన్యుఁడు.

కొంచెకొంచెము. వై. వి. (కొంచెము + కొంచెము) ఇంచించుక: చూ, స్వల్పము.

కొంచెతనము. వై. వి. (కొంచెము + తనము) అల్పభావము. అచ్చ. అర, కాం. 28: చూ, సన్నఁదనము.

కొంచెపడు. వై. అ. క్రి. (కొంచెము + పడు) 1. తక్కువపడు. భో. 6, ఆ. 191: చూ, లోపించు. 2; 2. సన్నగిల్లు: చూ, సన్నవాఱు.

కొంచెము. వై. వి, విశే: చూ, రూ-కొంచియము (న్యూనత.— భాగ. 1, స్కం. 95)

కొంచే. వై. వి = క్రౌంచః. 1. క్రౌంచపర్వతము: చూ, పర్వతము; 2. కొంగ. భార. భీష్మ. 2, ఆ. 30: చూ, బకము.

కొంచేగుబ్బలి. ద్వ. వి క్రౌంచపర్వతము: చూ, పర్వతము. (ఇట్లు కొంచేమల)

కొంచేదీవి. వై. వి. = క్రౌంచద్వీపము : చూ, లంక. 1.

కొంచేమలఁగొట్టిన జాణఁడు. ద్వ. వి. కుమారస్వామి. అం, భా. స్వ. 44: చూ, స్కందుఁడు.

కొంచేముగ్గరము. ద్వ. వి. క్రౌంచవ్యూహము.

కొంచెసారము. వై. వి.=క్రౌంచస్వరము. మధ్యమస్వరము: చూ, స్వరము. 2.

కొంచు. దే. వి. 1. మలినస్వేదము. ఆం, భా. ప్ర. నా. 140: చూ, స్వేదము; వై. అ. క్రి. 2. జంకు. భార. ఆది. 5, ఆ. 166: చూ, సంకోచించు. (రూ- కొంచించు - కొంజొ- కొంగు)

కొంజొ. వై. అ. క్రి. రూ- కొంచు. భాగ. 10. స్కం. పూ. 1317: చూ, సంకోచించు.

కొంట. దే. వి. కొనుట. (అనుప్రయుక్తమైన కొను ధాతువునకును రూపమిట్లైయుండునది. కనుఁగొంట- కయికొంట- పయికొంట. మొ)

కొంటె. దే. విణ. అకార్యశీలుఁడు. భో. 5, ఆ. 881: చూ, వ్యాఘుఁడు 2.

కొంటెతనము. దే. వి: చూ, పైశున్యము.

కొంటెపనులు. దే. వి. బ: చూ, ఆగడులు.

కొండ. వై. వి.= కుండ. మల: చూ, పర్వతము.

కొండంగి. వై. వి. = కుండగ: చూ, రూ- కుండఁగి (రూ- కొండెంగ, కుండంగి, కొండముచ్చు.)

కొండకంది. ద్వ. వి. 1. సస్యవిశేషము: చూ, సస్యము; బ. 2. కొండకందులను ధాన్యము: చూ, సురాష్ట్రజము.

కొండకసింద. వై. వి. ఒకరకము కసింద *: చూ, బలుసు. (దీనివేరుయొక్క కషాయముజ్వరమును, మన్యపుజ్వరమును తగ్గించును)

కొండకాకి. వై. వి. అద్రికాకము: చూ, వాయసము. 1.

కొండకాలువ. వై. వి. ఝురము: చూ, నది.

కొండకావిరాయి. దే. వి. ఇంగిలికము: చూ, హింగుళము.

కొండకొన. వై. వి. కొండకొమ్ము: చూ, శిఖరము. 1.

కొండకొమ్ము. ద్వ. వి. —పై.—

కొండకోఁతి. ద్వ. వి. బాలక్రీడావిశేషము: చూ. బాలక్రీడ.

కొండకోట. ద్వ. వి. వరణాకారమైన కోట: చూ, పర్వతము.

కొండకోలు. ద్వ. వి. కొద్దియగుట.

కొండగీఁడు. ద్వ. వి. కొండెము చెప్పువాఁడు: చూ, తంటులమారి. 1.

కొండగుద్దలి. వై. వి. రాళ్లు పెకలించుగుద్దలి: చూ, ముద్గరము.

కొండగుఱుతు. ద్వ. వి. సామాన్యలక్షణము: చూ, లక్షణము. 1.

కొండగోనుగు. ద్వ. వి. అక్షోటము *: చూ, మృదుద్రుమము.

కొండగొఱియ. వై. వి.=కుండకురరి. గాడిదవంటి మృగము, రోహిషము: చూ, మేషము 1. (రూ- కొండగొఱ్ఱియ- కొండగొఱ్ఱె)

కొండగోఁగు. ద్వ. వి: చూ, కొండగోనుగు *.

కొండగోను. ద్వ. వి. —పై.—

కొండగోల. ద్వ. వి. ఒకానొకమృగము: చూ, మృగము.

కొండచేఱియ. ద్వ. వి. తటము: చూ, చేఱియ.

కొండచిలువ. ద్వ. వి. కొండపాము, అజగరము: చూ, సర్పము. (కొండచెలవ అని వాడుక)

కొండచీమ. ద్వ. వి. ఉద్దీపకము: చూ, పిపీలిక.

కొండచూలి. ద్వ. వి. గట్రాచూలి. భాగ. 9, స్కం. 514: చూ, పార్వతి. 1. (ఇట్లుకొండరాచూలి)

కొండజొన్న. వై. వి.= కుండజూర్ణ. 1. ఒకరకము సస్యము: చూ, సస్యము; బ. 2. జొన్నలను ధాన్యము: చూ, ధాన్యము.

కొండతంగేడు. ద్వ. వి. శైలగోశ్రేణి*: చూ. తంగేడు.

కొండతలక్రిందఁబెట్టుకొని రాళ్ళకుపరువెత్తినట్లు. లో. తనకోరిక దగ్గఱనే ఫలించుచుండఁగా అది తెలిసికొనక దూరమేగినవిధము. (ఉయ్యా

లలోని బిడ్డంగానక ఊరంతయు వెదకుట వంటిది)

**కొండతేనె.** ద్వ. వి. కొండయందుఁబుట్టిన తేనె: చూ, మధువు. 5.

**కొండతిత్తిమ్మరి.** ద్వ. వి. కోఁతి. (ఇట్లు తిప్పతిమ్మరి, మలతిమ్మరి మొ): చూ, వానరము.

**కొండనడుము.** ద్వ. వి: చూ, కొండచేతియ.

**కొండనాలుక.** ద్వ. వి. 1. చిఱునాలుక, గళశుండిక: చూ, రోగము. 1; 2. తాలూర్ధ్వనూత్నజిహ్వా: చూ, రసన.

**కొండపగతుఁడు.** ద్వ. వి. ఇంద్రుఁడు: చూ వేలుపుఱేఁడు.

**కొండపగులు.** ద్వ. వి: చూ, లోయ.

**కొండపలుకు.** ద్వ. వి. పర్వతబిలమునందలి ప్రతిధ్వని: చూ, స్వరము. 2.

**కొండపిండి.** వై. వి. నగభేది. ఆం, భా. ద్వి. వ. 65: చూ, పిండికొండ. (మూత్రాశ్మరి, మూత్రకృచ్ఛ్రము పోఁగొట్టును)

**కొండపిండికొట్టుట.** జా. దుర్ఘటమైన కార్యము సాధించుట. "మేము ముగ్గురము పనికి మొగ్గితిమేని గొండపిండి కొట్టనేర్తుము." (ధర్మజరాజనూయము)

**కొండప్రత్తి.** వై. వి. ఒకరకము ప్రత్తి *: చూ, ప్రత్తి.

**కొండబూరుగు.** ద్వ. వి. కూటశాల్మలి *: చూ, వారిజము.

**కొండబెండ.** ద్వ. వి. 1. తస్కరి *: చూ, షడ్గ్రంథ; 2. కచ్చూరకము *: చూ, షడ్గ్రంథ.

**కొండమల్లయ్య.** ద్వ. వి. ముక్కంటి: చూ, శివుఁడు.

**కొండమల్లె.** వై. వి. =కుందమల్లికా. గిరిమల్లిక*: చూ, వత్సకము.

**కొండమామిడి.** ద్వ. వి. కోశామ్రము *: చూ, మామిడి.

**కొండమారేడు.** ద్వ. వి. గంధగర్భము *: చూ. మారేడు.

**కొండము.** వై. వి. =కుండమ్. గుండము; నిప్పులగుండము. ఆం, భా. ద్వి. వై. 241: చూ, నిప్పు.

**కొండముచ్చు.** ద్వ. వి. గోలాంగూలము, నల్లని మూఁతిగల కోఁతి. వేమన. 1180: చూ, వానరము. (రూ- కొండమ్రుచ్చు - కొండముసువ)

**కొండముసువ.** ద్వ. వి. —వై.—

**కొండమ్రుచ్చు.** ద్వ. వి. —వై.—

**కొండయల్లుఁడు.** ద్వ. వి. (కొండ + అల్లుఁడు): చూ, కొండమల్లయ్య.

**కొండయూట.** ద్వ. వి: చూ, సెలయూట.

**కొండరాచేరాలి.** ద్వ. వి: చూ, కొండచేరాలి.

**కొండఱెక్కలుఁగొట్టినదణి.** ద్వ. వి. ఇంద్రుఁడు. సాంబ. దే. 11: చూ, వేలుపుఱేఁడు.

**కొండఱేఁడు.** ద్వ. వి. హిమవంతుఁడు. భోజ. 5, ఆ. 191: చూ, పర్వతము.

**కొండల్లము.** వై. వి. =కుండోల్ల. (కొండ + అల్లము) తృణపుష్పిక *: చూ, శృంగబేరము.

**కొండవాఁడు.** ద్వ. వి. కొండబోయ: చూ, వ్యాధుఁడు. 1.

**కొండవీటిజంగము.** ద్వ. వి: చూ, కొండమల్లయ్య. ఆం, సం. దేవ. 6.

**కొండసిక.** వై. వి. పర్వతశృంగము: చూ, శిఖరము.

**కొండాటము.** దే. వి. ఆనందము. వీర. 1, ఆ. 201: చూ, సంతోషము.

**కొండాడు** దే. అ. క్రి. పొగడు: చూ, స్తుతించు.

**కొండి.** దే. వి. 1. తేలుతోఁక: చూ, వాలము. 1; 2. ఱెక్కతలుపునకు అంచులయందుఁ గొట్టెడు తేలు తోఁకవంటి యినుపగొళ్ళెము. (రూ- కొండె): చూ, గొళ్ళెము.

కొండిక. వై. విశే. = కుణక. రూ- కొండొక. 1. చిన్న. య. 4, ఆ. 127; పాండు. 2, ఆ. 60: చూ, స్వల్పము; 2. బాలుఁడు: చూ, శిశువు; 3. బాలిక: చూ, స్త్రీ.

కొండికనాఁడు. ద్వ. వి. బాల్యకాలము.

కొండికవాఁడు. ద్వ. వి. బాలుఁడు. సాంబ. మాన. 5: చూ, శిశువు.

కొండియ. దే. వి. రాజులలోనగువారు మొగ ముతట్టు వేసికొనెడు వెండ్రుకలముడి (రూ- కొండె: చూ, ముడి. 3. కొండెసిగ అనివాడుక)

కొండియము. వై. వి. = కుండకీట. 1. రూ. కొండెము, చాడి: చూ, తంటా; 2. పిశునత్వ ము: చూ, పైశున్యము. (దేశ్యమని శబ్దరత్నా కరము)

కొండియుఁడు. వై. విశే. = కుంటకీట. (రూ- కొండీఁడు. కొండెముచెప్పువాఁడు. భార. శాం. 3, ఆ. 469: చూ, సూచకుఁడు 1. (దేశ్యమని శబ్దరత్నాకరము)

కొండీఁడు. వై. విశే. —పై—. మార్క. 2 ఆ 96.

కొండె. దే. వి. 1. తేలుతోఁక: చూ, వాలము. 1; 2: చూ, రూ- కొండియ.

కొండెంగ. వై. వి. = కుండగః: కొండ యందుండెడి నల్లకోఁతి. హరిశ్చ. 2, భా. 1059: చూ, వానరము.

కొండెకత్తె. ద్వ. విశే. (కొండెము + కత్తె) కొండెము చెప్పునది (ఆఁడుది): చూ, స్త్రీ.

కొండెకానితనము. దే. వి. కొండెతనము: చూ, పైశున్యము.

కొండెగాఁడు. దే. విశే. (కొండెము + కాఁడు): చూ, రూ- కొండియుఁడు,

కొండెము. దే. వి: చూ, రూ- కొండియము. (తంటా.— అచ్చ. బాల, కాం. 21)

కొండెవల. దే. వి. చేఁపలఁబట్టుటకు ఒకఁడు వేసెడు వల: చూ, వల. 1.

కొండొక. వై. విశే. 1. రూ- కొండిక. చిన్న. రాఘు. 1, ఆ. 71: చూ, స్వల్పము; 2. కొంచెము. "కొండొక సేపు.": చూ, స్వల్పము; 3 రూ- కొండిక. బాలుఁడు. భార. స్త్రీ. 2, ఆ 84: చూ, శిశువు.

కొండ్రె. దే. వి. నుర్ఁవించియున్న నచోలు. కాశీ. 4 ఆ. 299: చూ, గొంట్రు.

కొండ్రెదువ్వు. దే. వి. నాఁగలి: చూ, లాంగ లము. 1.

కొంత. వై. స. (కొంచెము + అంత) ఇంచుక కొలఁది. "కొంతదవ్వు.": చూ, స్వల్పము.

కొంతము. వై. వి. = కుంతము. అస్త్రలము: చూ, బాణము. 1.

కొందఱు. వై. స. (కొంత + వారు) కొంతశబ్ద మునకు మహాన్మహత్ర్యర్థక బహువచనరూపము: చూ, అపరము. 8.

కొందలపడు. ద్వ. అ. క్రి. (కొందలము + పడు) కలఁతపడు: చూ, సంక్షోభించు.

కొందలపాటు. ద్వ. వి. కలఁత, కొందలపడుట: చూ, సంతాపము.

కొందలము. దే. వి. 1. —పై—. భార. విరా. 4, ఆ. 172; 2. వగ: చూ, దుఃఖము.

కొందలించు. దే. అ. క్రి. కలఁతపడు: చూ, సంక్షోభించు.

కొందు. దే. స. క్రి. నజ్జుగనలుచు (నజ్జు = అణువు)

కొంప. దే. వి. 1. లొంప, చిన్న ఇల్లు: చూ, సదనము. 1; 2. ఇల్లు. సానం. 5, ఆ. 211; వేమన. 1190: చూ, సదనము. 1. (నిందవెం దలగు సమయములయందే యిదిప్రయోగింపఁ బడును)

కొంపచెఱుపు. దే. వి: చూ, నిర్వ్యాజశత్రుఁడు

కోరవాయి. ద్వి. వి. కోష్ఠశీర్ష స్థమగు వాయువు. ఆం, భా. ద్వి. ను. 125: చూ, వాయువు.

కోరవోవు. దే. అ. క్రి. (కోర + పోవు) కొంక రలుపోవు. విక్రి. 1, అ. 200: చూ, వంకర పోవు.

కోరసిగ. ద్వ. వి: చూ, కోరకొండె. రామా. 2, అ. 110.

కోరా. దే. విణ. కారికము, అనాహతము: చూ, వస్త్రము (కోరామల్లు- కోరాసైను అని వాడుక.)

కోరాడ రామచంద్రశాస్త్రి. పా. వీరు ఘన వృత్తము మున్నగు గ్రంథములను విరచించిరి. కోనసీమయందలి నడవపల్లి వాస్తవ్యులు. శిష్టు కృష్ణమూర్తి కవికి సమకాలికులు.

కోరాడు. దే. స. క్రి. (కోరి + ఆడు) 1. కోరు. ఏనుఁగు లోనగునవి కొమ్ములతో నేలఁబొడిచి దుమ్మెత్తి పైకిఁజల్లు. ఆము. 4, ఆ. 158; ఉ. హరి. 6, ఆ. 9: చూ, నంకు; 2. కోరు, పంది ముట్టెతో నేలకెల్లగించు: చూ, బొడ్డ గించు; 3. కోరు, దుమ్ము లోనగువాని నెత్తి పైకిఁజల్లు. రామా. 1, ఆ. 206: చూ, కోర్రాడు; 4. కోరు, తుతిచేయు: చూ, సెలగు.

కోరాబంగారు. దే. వి. మట్టుపుబంగారు: చూ, లోహము. 1.

కోరామల్లు. వా. వి: చూ, కోరా.

కోరాము. వా. వి: చూ, కోఱము. 1. (రూ- కోఱాము.)

కోరింద. దే. వి. రూ-కోరింద. 1. లక్కగలిగెడి యొకానొక తీఁగె, జతూక *: చూ, ముచ పత్ర; 2. కోరిందపాద: చూ, ముచపత్రి (కోరిందదగ్గునకు మంచిది.)

కోరిందపూసలు. దే. వి. ఆటవికులు ధరించు గాజుపూసలు.

కోరిక. గే. వి. 1. ఇచ్ఛ: చూ, వాంఛ; 2. కోరుట. భార. శాం. 6, ఆ. 284: చూ, వాంఛ; 3. దేవతాదులవలన పొందఁబడిన కోరిక: చూ, వరము. 3; విణ. 4. అభీష్టము. ఉ. రా. 7, ఆ. 121: చూ, వాంఛ.

కోరికలీరికలెత్తుట. జా. కోరికలభివృద్ధినొందుట. "ఉపవాసాయాసంబులచే గ్రుక్కుచుఁ గోరిక లీరికలెత్త బిడ్డలంగని." (ధర్మజరాజనూ యము.)

కోరికలుడుగుట. అం. నియమములు పదింటిలో నొకటి: చూ, నియమములు.

కోరికి. దే. వి. రూ-కోర్కి- కోరిక. భార. ద్రో. 1. ఆ. 1092: చూ, వాంఛ.

కోరికె. దే. వి. —పై.— (రూ- కోర్కె- కోరికి—కోర్కి—కోరిక.)

కోరు. వై. వి. 1.=కారః. ధనేతర వస్తురూప మైన కప్పము. రామా. 3, ఆ. 38: చూ, సిస్తు. 1; 2. బందకము: చూ, తాకట్టు; స. క్రి. 3. ఇచ్ఛించు: చూ, వాంఛించు; 4: చూ, కోరాడు (1-2-3-4 అర్థములు.)

కోరుట. అం. దశావస్థలలో నొకటి: చూ, దశావస్థలు.

కోరుటు. వా. వి: చూ, కోర్టు.

కోరువాఁడు. ద్వ. వి. ఆశంసిత, ప్రియవస్తువును కోరువాఁడు: చూ, వాంఛితుఁడు.

కోర్కి. దే. వి: చూ, రూ. కోరికి.

కోర్టు. అం. వి. న్యాయసభ, కోరుటు.

కోఱ. వై. వి. = ఖురః. 1. పందికోఱ: చూ, పల్లు. 1; 2. పాముకోఱ: చూ, పల్లు. 1; 3. కోఱపల్లు, దంష్ట్ర. హరి. పూ. 4, ఆ.148: చూ, పల్లు. 1.

కోఱడము. దే. వి. 1. అపహాస్యము. నిర్వ. 5, ఆ. 77: చూ, పరిహాసము; బ. 2. అపహాస్య వచనము. నిర్వ. 3, ఆ. 99: చూ, వ్యాఖ్యా తము. 2; 3. బాధ: చూ, దుఃఖము.

కోఱము. వా. వి. కొబ్బెరకోరెడు పనిముట్టు (రూ-కోరము-కోరాము-కోఱాము.)

కోఱాము. వా. వి. —పై.—

కోఱుడుపాఱ. వా. వి. అవదారణ విశేషము: చూ, ముద్గరము (రూ-గోఁకుడుపాఱ- దోఁకుడుపాఱ-దోఁకుడుఁబాఱ.)

కోల. సం. వి. ఆ. స్త్రీ. 1. చవ్యమను గంధద్రవ్యము*: చూ, రాజార్హము; 2. పిప్పలితీఁగ*: చూ, పిప్పలి. 1; 3. బదరి*: చూ, రేఁగు; దే. వి. (1) మగగుఱి: చూ, శిశ్నము; (2) శరము. హరి. ఉ.4, ఆ. 155: చూ, బాణము. 1; (3) వంటకట్టె. భార విరా. 1. ఆ. 211: చూ, వంటచెఱకు; (4) దండము. భార. అశ్వ. 3, ఆ. 105: చూ, వేత్రము. 1; బ. (5) ఉత్సవాదులలో దేవునికిఱుప్రక్కలను వెలిగింపఁబడు దీపములు; (కోలలసంబరము); విణ. (6) కోలన, దీర్ఘము; " కోలనిమ్మ. " మొ: చూ, పొడవు. 2.

కోలంబకము. సం. వి. అ. పుం. వీణయొక్క సర్వాంగము: చూ, వీణ.

కోలక. సం. వి. ఆ. స్త్రీ. ఊడుగు*, దాని ఫలము (అని కొందఱు): చూ, మహాయమళపత్రిక.

కోలకంఠుఁడు. సం. వి. అ. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

కోలకందము. సం. వి. అ. పుం. మహాకందము*: చూ, వెల్లుల్లి.

కోలకము. సం. వి. అ. న. 1. తక్కోలము*: చూ, వైజయంతి; 2. మరీచము: చూ, మిరియము; 3. ఇనుపగొలుసుతో కుట్టిన కుళ్లాయి: చూ, వస్త్రము; 4. పుట్ట: చూ, వల్మీకము; 5. ఊడుగు*: చూ, మహాయమళపత్రిక: 6. బహువారము*: చూ, శ్లేష్మాతకము.

కోలకర్కటిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, మధుఖర్జూరిక*.

కోలకోఁతులు. దే. వి. బ. కోఁతికొమ్మచ్చి యను ఒకానొక బాలక్రీడ: చూ, బాలక్రీడ.

కోలగ్గెర. దే. వి. కాళ్లకు దారమును పెనఁచి యెద్దులను మూటకట్టుగా కట్టెడు కట్టు. ఆము. 6, ఆ. 27.

కోలచర్బితము. అం. కామశాస్త్రమునందలి దంతక్షతములు ఏడింటిలో నొకటి: చూ, దంతక్షతములు.

కోలచర్వితము. అం. —పై.—. (కోలదర్వితము అని కొందఱు.)

కోలజెముడు. దే. వి. యామళకంటకము*: చూ, స్నుహి.

కోలజొన్న. దే. వి: చూ, ఔద్దానలము.

కోలదబ్బ. దే. వి. ఒకరకము దబ్బ*: చూ, శర్కరాంకము.

కోలదళము. సం. వి. అ. పుం. నలియనెడు గంధద్రవ్యము*: చూ, రాజార్హము. (రేఁగాకు పేరుగలది.)

కోలదివియ. ద్వ. వి. వెలుతురుకట్టెల దివటీ. భార. విరా. 3, ఆ. 4: చూ, దివటీ. (రూ-కోలదివ్వె.)

కోలన. వా. విణ. దీర్ఘము: చూ, పొడవు. 2.

కోలనాసిక. సం. వి. ఆ. స్త్రీ. బంకిణి*: చూ, రంభ. 2.

కోలనిమ్మ. దే. వి. పొడవునిమ్మ*: చూ, నిమ్మ.

కోలపాల. దే. వి. అర్కపుష్పిక*: చూ, చిత్రపత్రిక.

కోలపుచ్ఛము. సం. వి. అ. న. రాపులుఁగు: చూ, రాబందు.

కోలపొన్న. దే. వి. అంఘ్రిపర్ణి*: చూ, పృశ్నిపర్ణి.

కోలఫల. సం. వి. ఆ. స్త్రీ. గొమ్మనగొట్టుపిండి*: చూ, భూతిక.

కోలము. సం. వి. అ. న. 1. రేఁగుపండు: చూ, రేఁగు; పుం. 2. పంది: చూ, సూకరము; 3. తెప్ప: చూ, వహోడము; 4. ఒడి: చూ, వస్త్రము; 5. ఉత్సంగము: చూ, క్రోడము; 6. గాఁగిలి: చూ, సంశ్లేషము; 7. తలత్రిప్పి: చూ, శల్యము. 1; 8. నఖముచిప్ప: చూ, నఖము; దే. వి. (1) వేషము. అను. 4, ఆ. 96: చూ, వేసము.

కోలమూలము. సం. వి. అ. న. పిప్పలిమూలము*: చూ, పిప్పలి. 1.

కోలమెఱుఁగు. దే.వి. విరావళి,నిలువు మెఱుఁగు. హరి. పూ. 7, ఆ. 160: చూ, విద్యుత్తు 1. (చూ, ఎలెక్ట్రిసిటీ.)

కోలలవారు. దే.వి. బ. వేత్రధరులు. ఉ, హరి. 8, ఆ. 27.

కోలవల్లి. సం. వి. ఈ. స్త్రీ. 1. గజపిప్పలి*: చూ, పిప్పలి. 1; 2. చవ్యమను గ్రంధ్యము*: చూ, రాజార్హ్వము. (రూ-కోలవల్లిక.)

కోలవల్లిక. సం. వి. అ. స్త్రీ. చవ్యమను గ్రంధ్యము*: చూ, రాజార్హ్వము. (రూ-కోలవల్లి.)

కోలవస. ద్వ. వి. జటిల*: చూ, మాంసి. 1.

కోలాంచము. సం. వి. అ. పుం. కోలాంచమను దేశము: చూ, దేశము.

కోలాట. వా. వి. రూ-కోలాటము: చూ, వ్యంజకము. 1.

కోలాటకమ్మ. దే. వి. ఒకరకము కమ్మ. కళా.7, ఆ. 66: చూ, భూషణము. 2.

కోలాటము. దే. వి. (కోల+ఆట) చేతులఁ గోలలుంచుకొని యాడెడియాట: చూ, కోలాట. (చూ, ఉద్ధతము.)

కోలాహలము. సం. వి. అ. పుం. 1. కలకలము: చూ, స్వరము. 2; 2. ఒకానొక కొండ: చూ, పర్వతము; అం. 3. గాంధర్వవేదము నందలి రాగాధ్యాయములోని రాగాంగములు పదమూఁడింటిలో నొకటి: చూ, రాగాంగములు; 4. టక్కజభావలు ఇరువదియొకటింటిలో నొకటి: చూ. టక్కజభావలు (చూ, భావ. 1.)

కోలి. సం. వి. ఈ. స్త్రీ. 1. బదరి*: చూ, రేఁగు; 2. గంగరేఁగు*: చూ, లికుచము; 3. చూ, గృధ్రనఖి; 4: చూ, కపికోలి*.

కోలు. దే. వి. 1. కొల్ల. భార. భీష్మ. 3,ఆ.280: చూ, తలపాటు. 2; 2. అనుప్రయుక్తమైన కొను ధాతువునకు భావార్థక రూపము. "ఇచ్చు కోలు-పుచ్చుకోలు." మొ; విశే. 3. పెద్ద. "కోలుపులి-కోలుమొసలి- కోలుమూఁపులు." మొ: చూ, పొడవు. 2; క్రి. విశే. 4. మిక్కిలి. "కోలుమసఁగు.": చూ, హెచ్చు. 2.

కోలుకాఁడు. దే. వి. 1. నియమించెడి యధికారి. పంచ. నా. 1, ఆ. 254: చూ, న్యాయాధిపతి; 2. కావలివాఁడు: చూ,రక్షకుఁడు; 3. సుంకరి క్రిందిబంటు: చూ, సేవకుఁడు.

కోలుకొను. దే. అ. క్రి. రూ- కోల్కొను. 1. ఉత్సహించు: చూ, యత్నించు; 2. తేఱుకొను: చూ, తెల్కొను; 3: చూ, వర్ధిల్లు.

కోలుతల. దే. వి. రూ- కోల్తల. ఎదుటనిలిచి యుద్ధము చేయుట: చూ, యుద్ధము; 2. (యుద్ధ) సన్నాహము: చూ, యుద్ధము; 3. ఉత్సాహము: చూ, యత్నము.

కోలుపడు. ద్వ.అ.క్రి. రూ-కోల్పడు. 1.చెడు: చూ, నశించు; 2. అగపడు: చూ, ప్రత్యక్షమగు; స. క్రి. 3. పోఁగొట్టుకొను: చూ, భంగించు (ప్రే-కోలుపఱుచు.)

కోలుపాటు. ద్వ. వి. రూ-కోల్పాటు. 1. చేటు: చూ, హాని. 2; 2. పోఁగొట్టుకొనుట: (రూ-కోల్పాటు-కోలుపోక-కోల్పోక.)

కోలుపోక. దే. వి. రూ-కోల్పోక. పోఁగొట్టుకొనుట. భార. ద్రో. 3, ఆ. 13: రూ-కోలుపాటు-కోల్పాటు.

కోలుపోవు. దే. అ. క్రి. 1. చెడు. భార. విరా. 2, ఆ. 262: చూ, నశించు; స. క్రి. 2. పోఁగొట్టుకొను; మార్క. 6, ఆ. 11: చూ, భంగించు (ప్రే. కోలుపుచ్చు.)

కోలె. దే. వి. 1. వెన్నుకోసినకాఁడ. భార. ఆది. 3, ఆ. 118; ద్ర. 2: చూ, రూ-కొలె. భార. విరా. 1, ఆ. 74.

కోలెంఠము. సం. వి. అ. పుం. గాడిదె: చూ, రాసభము.

కోలెముక. దే. వి. (కోల + ఎముక.) రూ-కోలెమ్ము. కశేరుక: చూ, శల్యము. 1.

కోలెమ్ము. దే. వి. -పై.- (రూ-కోలెమ్ముక.)

కోలెమ్ముక. దే. వి. —పై.—

కోల్కొను. దే. అ. క్రి: చూ, రూ-కోలుకొను. (ఉత్సహించు.-భార. ఉద్యో. 4, ఆ. 90; తేఱుకొను.-శై. 7, ఆ. 19; వర్ధిలు.-పాండు. 4, ఆ. 19.)

కోల్తల. దే. వి: చూ, రూ-కోలుతల. (ఎదుట నిలిచి యుద్ధముచేయుట.- భార. శల్య. 1, ఆ. 337; యుద్ధసన్నాహము.-భార. విరా. 3, ఆ. 188; అచ్చ. యు, కాం. 237.)

కోల్పడు. ద్వ. అ. క్రి: చూ, రూ-కోలుపడు. (చెడు.-భార. కర్ణ. 3, ఆ. 24; అగపడు.- హరి. పూ. 8, ఆ. 103; పోఁగొట్టుకొను.- భార. అర. 3, ఆ. 325; భార. ఉద్యో. 2, ఆ. 162.)

కోల్పాటు. ద్వ. వి: చూ, రూ-కోలుపాటు. (చేటు.-భార. కర్ణ. 3, ఆ. 275; పోఁగొట్టుకొనుట.-రా. అర, కాం. 1, ఆ. 21.)

కోల్పులి. దే. వి. పులి: చూ, శార్దూలము. 1.

కోల్పోక. దే. వి: చూ, రూ-కోలుపోక.

కోల్య. సం. వి. ఆ. స్త్రీ: చూ, పిప్పలి. 1*.

కోవ. దే. వి. 1. బిడ్డలకు గొంతునందుఁ గలిగెడి వ్యాధి: చూ, రోగము. 1; 2. పుట్టచివర: చూ, కోమ. 1; వా. 3. ముత్యాలకోవ, హారములో నొకభాగము (అని కొందఱు); 4. వంశానుక్రమము.

కోవరము. దే. వి. శత్రువులెత్తివచ్చుటను దెలిసికొనుటకై యుంచు కావలి. రూ-కోవురము: చూ, రక్షణము.

కోవా. వా. వి. పంచదార కలిపిన పాలముద్ద: చూ, భక్ష్యము, (కోవాబిళ్లలు-దూద్ పేడా అనియు వాడుక.)

కోవి. వా.వి. 1. సస్యాదినాళము. రూ-క్రోవి-క్రోల-క్రోలు: చూ, నాళము. 5; 2. నాళము: చూ, లాడము.

కోవిదారము. సం. వి. అ. పుం. కాంచనము*: చూ, యుగపత్రికము.

కోవిదుఁడు. సం. వి. అ. పుం. చేదువరి: చూ, విద్వాంసుఁడు.

కోవు. దే. వి. అరుపునందగు ధ్వన్యనుకరణము. కాశీ. 2, ఆ. 35: చూ, హూహూ.

కోవురము. దే. వి: చూ, రూ-కోవరము. స్వా. 3, ఆ. 54.

కోవెల: చూ, రూ-కోగెల-కోయిల. (గుడి:- ఉ, రా. 7, ఆ. 26; కోకిలము:-య. 2, ఆ. 49.)

కోశకారము. సం. వి. అ. పుం. ఒకరకము చెఱకు*: చూ, రసాలము. 3; 2. కొబ్బరి*: చూ, నారికేళము; 3. కన్ను: చూ, లోచనము; 4. నమ్మదుంప *: చూ, సుపుష్పము; 5. పట్టుపురుగు: చూ, పురుగు.

కోశదివ్యము. అం. దివ్యములయిదింటిలో నొకటి: చూ, దివ్యములు. (దివ్యప్రమాణభేదమునకు పేరు. 'దివ్యరోః' అనుదానికి 'దీవ్యరోః'

అని పఠించి ప్రకాశించువానికిని పేరు అని కొందఱు.)

**కోశపదము.** ఆరూఢ మెనిమిదివిధములు. అందులో నిది యొకటి: దీని నే కోశారూఢమందురు: చూ, ఆరూఢము.

**కోశఫల.** సం. వి. ఆ. స్త్రీ. 1. రాజకోశాతకి*: చూ, బీఱ. 2; 2. ములుదోస*: చూ, దోస; 3. తక్కోలపుపండు: చూ, వైజయంతి.

**కోశఫలము.** సం. వి. అ. న. 1. తక్కోలము*: చూ, వైజయంతి; 2. తక్కోలపుపండు: చూ, వైజయంతి.

**కోశము.** సం. వి. అ. పుం, న. రూ-కోషము. 1. కత్తియొఱ: చూ, నిచోళము; 2. గ్రుడ్డు: చూ, పేశీకోశము; 3. పేసలు లోనగువాని పైపొట్టు: చూ, బరడు; 4. జోజికాయబరడు: చూ, బరడు; (పైపెంకు కండకాయలన్నియు నిందుఁజేరును. ఉదా.— మారేడు- వెలగ- ఆనబ మొ.); 5. బొక్కసము. "కోశాగారము": చూ, పంటసాల; 6. పాత్రము, పాత్రములగుంపు, నిఘంటువు (అని కొందఱు) "కోశపానాచార్య.": చూ, పుస్తకము; 7. శాస్త్రము: చూ, శాస్త్రములు; 8. కరఁగి పోసిన వెండి బంగారముల ముద్ద: చూ, లోహము. 1; 9. దేహము: చూ, శరీరము; 10. సొగసు: చూ, సౌందర్యము; 11. యోని లోపలితావు: చూ, భగము. 12; 12. వట్ట: చూ, వృషణము; 13. మగగుఱి: చూ, శిశ్నము; 14. పూమొగ్గ: చూ, మొగ్గ. 1; 15. ఇల్లు: చూ, సదనము. 1; 16. జాతిఫలము: చూ, జాజికాయ; 17. కడుపు: చూ, భ్రూణము. 1; 18, చషకము: చూ, పాత్రము. 6; 19. యోని: చూ, భగము.12; పుం. 20. నెమలితోఁక మొదలు; 21. కడుపునకు నడిమిభాగము; 22. సప్తాంగములలో నొకటి: చూ, సప్తాంగములు. (చూ, అంగము. 9.)(ఇందు కొన్ని పుంలింగములనియు, కొన్ని నపుంసకలింగములనియు, కొన్ని పుం, న. లింగములనియు భిన్నాభిప్రాయములు కానఁబడుచున్నవి.)

**కోశములు.** అం. తత్వవిషయమున పంచకోశములు.— అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, ఆనందమయము. (5)

**కోశలము** సం. వి. అ. పుం. రూ-కోసలము. అయోధ్యాపట్టణము: చూ, దేశము.

**కోశాంగము,** సం. వి. అ. న. ఇక్కటము: చూ, ఖరచ్ఛదము.

**కోశాతకి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆవడ*: చూ, బీఱ. 2; 2. ఉత్తరేను*: చూ, శైఖరికము; 3. పటోలిక*: చూ, పొట్ల; 4. బదరి*: చూ, రేఁగు; 5. బడబాగ్ని: చూ, వహ్ని.

**కోశాత్ఫలము.** సం. వి. అ. పుం. స్థౌణేయమను గ్రంధద్రవ్యము*: చూ, రాజార్హము.

**కోశామ్రము** సం. వి. అ. పుం. కొండమామిడి, తుమ్మెదమామిడి (అని కొందఱు)*: చూ, మామిడి.

**కోశారూఢము.** అం: చూ, కోశపదము.

**కోశావర్తి.** అం. అశ్వశాస్త్రమునందలి అనుభావర్తములలో నొకటి: చూ, అనుభావర్తములు.

**కోశి.** సం. వి. ఈ. స్త్రీ. రూ-కోషి. మీఁగాలు సగము కప్పియుండు ఇనుపపాదరక్ష: చూ, పాదుక.

**కోశిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. మల్లెతీఁగ*: చూ, మొల్ల; 2. బిచ్చగానిగిన్నె: చూ, పాత్రము. 6. (రూ-కోషిక.)

**కోశిల.** సం. వి. ఆ. స్త్రీ. ముద్గపర్ణి*: చూ, పెసర.

కోశోపమఫలము. సం. వి. అ. న. రేల*: చూ, ఱేల.
కోషకము. సం. వి. అ. పుం. 1. గుడ్డు: చూ, పేశికోశము. 2. వట్టు: చూ, వృషణము.
కోషకారము. సం. వి. అ. పుం. 1. చెఱకు*: చూ, రసాలము. 3; 2. ఒకరకము చెఱకు*: చూ, రసాలము. 8; 3. ఒకరకము కీటకము: చూ, పురుగు.
కోషచంచువు. సం. వి. ఉ. పుం. బెగ్గురు: చూ, సారసము.
కోషఫల. సం. వి. ఆ. స్త్రీ. పీతఘోష*: చూ, మృదుద్రుమము.
కోషఫలము. సం. వి. అ. న: చూ, కోశఫలము.
కోషము. సం. వి. అ. పుం, న: చూ, రూ- కోశము.
కోషల. సం వి. ఆ. స్త్రీ. అయోధ్యాపట్టణము: చూ, కోశలము.
కోషశాయిక. సం. వి. ఆ. స్త్రీ. ఛురిక: చూ, రిష్టి. 2.
కోషాతకము. సం. వి. అ. పుం. కేశము: చూ, వెంట్రుక. 1.
కోషాతకి. సం. వి. ఈ. స్త్రీ. బదరి*: చూ, రేగు.
కోషి. సం. వి. ఈ. స్త్రీ. చూ, రూ- కోశి.
కోషిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-కోశిక.
కోష్టు. వై. వి.=కుష్ఠ. చెంగల్వకోష్టు*: చూ, పారిభావ్యము. (వీర్యపుష్టిచేయును. దగ్గు కుష్ఠు నివారించును.)
కోష్ట్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. రూ-క్రోష్ట్రి. ఆడునక్క: చూ, సృగాలము; 2. నల్లనేల గుమ్మడు*: చూ, భూమికర్కారువు; 3. నీటిపిప్పలి*: చూ, పిప్పలి. 1.
కోష్ఠము. సం. వి. అ. పుం. 1. లోకడుపు: చూ, భాండము. 1; 2. సామగ్రులుంచెడుకొట్టు: చూ, పంటసాల; 3. ఇంటిలోపలియిల్లు: చూ, సదనము. 1; 4. గాదె: చూ, పంటసాల; విశ. 5. తనకుసంబంధించినది: చూ, స్వకీయము.
కోష్ణజలము. సం. వి. అ. న. 1. అత్తెసరు: చూ, నఖంపచము; 2. ఇంచుక వేడినీరు: చూ, నీరు. 1.
కోష్ణము. సం. వి. అ. న. 1. ఇంచుక వేడి: చూ, మందోష్ణము (చూ, వేడిమి.) విశ. 2. ఇంచుక వేడిమికలది: చూ, మందోష్ణము. (చూ, వేడిమి.)
కోసము. వా. అవ్య. నిమిత్తమును దెలుపునది. "దానికోసము-వానికోసము."
కోసల. సం. వి. ఆ. స్త్రీ. కోసలపురి: చూ, దేశము.
కోసలనాటి బ్రాహ్మణులు. పా: చూ, రూ- కాసలనాటిబ్రాహ్మణులు.
కోసలము. సం. వి. అ. పుం. 1. ఏఁబదియాఱు దేశములలో నొకటి: చూ, దేశము; 2. అగ్ని: చూ, వహ్ని.
కోసలాత్మజ. సం. వి. ఆ. స్త్రీ. కౌసల్యాదేవి, దశరథుని పెద్దభార్య, శ్రీరామునితల్లి: కౌశల్య-రూ-కౌసల్య.
కోసలేయులు. వా. వి. బ: చూ, కోసలనాటి బ్రాహ్మణులు.
కోసలోత్తర. సం. వి. ఆ. స్త్రీ. కోసలోత్తర దేశస్త్రీ: చూ, స్త్రీ.
కోసు. వై. వి.=క్రోశః. రెండువేలవిండ్ల పట్టు కొలఁది: చూ, పరువు. 2
కోసుగడ్డ. వా. వి. (కాలిఫ్లవర్) శరీరమంతను శుభ్రపఱచు దుంప.
కోస్తా. వా. వి. సముద్రతీరప్రాంత ప్రదేశము.
కోహకము. సం. వి. అ. పుం. దేహమణంచు కొన్న పిల్లి: చూ, మార్జాలము.
కోహటకుఁడు. సం.వి. అ. పుం. దొమ్మరవాఁడు: చూ, వంశనర్తి.

కోహాటికుఁడు. సం. వి. అ. పుం. —వై.—

కోహళము. సం. వి. అ. పుం. 1. కాహళ, కాహళమనువాద్యము: చూ, వీణ; 2. బజారు మాట: చూ, వ్యాఖ్యాతము. 2; 3. మద్యభేదము: చూ, సుర. 2.

కోహళీయము అం. భరతశాస్త్రగ్రంథములలో నొకటి: చూ, భరతశాస్త్రగ్రంథములు.

కోహళుఁడు. సం.వి. అ. పుం. 1. నాట్యశాస్త్రప్రవర్తకుఁడైన కోహళుఁడను ముని: చూ, ముని. 1; అం. 2. శాస్త్రప్రవర్తకులలో నొకఁడు: చూ, శాస్త్రప్రవర్తకులు.

కోహహో. దే. వి. పరిహాసమునందగు ధ్వన్యనుకరణము. ఆము. 4. ఆ.35: చూ, హహాహహా.

కోశి. దే. విణ. 1. ఆశ్చర్యమునొందినవాఁడు. అం, భా. తృ. వి. 9: చూ, విలక్షుఁడు; 2. పిఱికి: చూ, వెఱపరి.

కోశితనము. దే. వి భయశీలత్వము: చూ, వెఱపు.

## కౌ.

కౌ. దే. వి. వృత్తియందు కౌనుశబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలినరూపము. "కౌఁదీఁగ." వెం: చూ, రూ-కవును.

కౌంకము. సం. వి. అ. పుం. కౌంకమను దేశము: చూ, దేశము.

కౌంకిణము. సం. వి. అ. పుం. రూ-కొంకణము: చూ, దేశము.

కౌంచము. సం. వి. అ. పుం. క్రౌంచపర్వతము: చూ, పర్వతము.

కౌండిన్యము. సం. వి. అ. పుం. 1. పెద్దతుమ్మి*: చూ, తుమికి; 2. వైఖానసాది తొమ్మిది సూత్రములలో నొకటి: చూ, కల్పసూత్రములు.

కౌండిన్యస. అం. గోత్రములలో నొకటి. ప్రవరం. వశిష్ఠ (వాశిష్ఠ) మైత్రావరుణ, కౌండిన్య: చూ, గోత్రము: (చూ, ప్రవరము.)

కౌండిన్యుఁడు. సం. వి. అ. పుం. విష్ణుగుప్తుఁడు, కౌండిన్యుఁడను ఋషి: చూ, ముని. 1.

కౌంతి. సం. వి. ఈ. స్త్రీ. రేణుకయను గంధద్రవ్యము *: చూ, రాజార్హము.

కౌంతికుఁడు. సం. విణ. ఈఁటెకాఁడు: చూ, ప్రాసికుఁడు.

కౌంతేయము. సం. వి. అ. పుం ఏఱుమద్ది *: చూ, మద్ది.

కౌఁగిలి. వై. వి. 1=: చూ, రూ-కవుఁగిలి. అం.2: చూ, కళలు. 3. (చూ; గళస్వనము.)

కౌఁగిలించు. వై. స. క్రి: చూ, రూ-కవుఁగిలించు.

కౌఁగిలింత. వై. వి: చూ, రూ-కవుఁగిలింత.

కౌఁగిలింపు. వై. వి: చూ, రూ-కవుఁగిలింపు.

కౌఁజో. వై. వి.=కపింజలః. రసి. 1, ఆ. 115: రూ-కంజో- కముఁజో- కయిజో- కవుఁజో- కైజో-కయిదు-కైదు; (సం. ప):—కపింజలము, కలానువాది- రూ- కాలానునాది.

కౌకృత్యము. సం. వి. అ. న. 1. అకార్యము చేయుట; 2. పశ్చాత్తాపపడుట: చూ, పశ్చాత్తాపము.

కౌక్కుటకందలము. సం. వి. అ. పుం. కొండచిలువ: చూ, సర్పము.

కౌక్కుటికుఁడు. సం. వి. అ. పుం. 1. కపటము కలవాఁడు: చూ, కపటి; 2. చేరువ చూచుచుఁ బోయెడివాఁడు.

కౌక్షింభర్యము. సం. వి. అ. న. పొట్టపోసికొను వానితనము.

కౌక్షేయకము. సం. వి. అ. పుం. కత్తి: చూ, రిష్టి. 2.

కౌచు. దే. వి: చూ, రూ-కవుచు.

కౌటకుఁడు. సం. వి. అ. పుం. మృగపక్ష్యాదులనుజంపి విక్రయించి జీవించువాఁడు: చూ, వైతంసికుఁడు.

కౌటజము. సం. వి. అ. పుం. కొడిసె*: చూ, వత్సకము.

కౌటతక్షుఁడు. సం. వి. అ. పుం. స్వతంత్రముగా పనిచేయు వడ్లంగి: చూ, స్వర్ణకారుఁడు.

కౌటిలికుఁడు. సం. వి. అ. పుం. 1. అగసాలె: చూ, స్వర్ణకారుఁడు; 2. దుష్టుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

కౌటిల్యము. సం. వి. అ. న. వంకరతనము (రూ-కుటిలము.)

కౌటిల్యుఁడు. సం. వి. అ. పుం. వాత్స్యాయనముని: చూ, ముని. 1.

కౌడు. వై. వి. 1. = కపటము: చూ వ్యాజము. 1; 2. మోసము: చూ, వంచన. (రూ-కవుడు.)

కౌణపదంతుఁడు. సం. వి. అ. పుం. భీష్ముఁడు: చూ, శాంతనవుఁడు.

కౌణపుఁడు. సం. వి. అ. పుం. నైరృతుఁడు: చూ, మూలకోఁడు.

కౌతుకము. సం. వి. అ. న. 1. తమి, తహతహ, అనుభవింపని కోరికయందలి యాశ: చూ, వాంఛ; 2. కోరిక: చూ, వాంఛ; 3. పెండ్లియందు చేతఁగట్టుకొనెడు తోరము: చూ, వ్రతసూత్రము; 4. ఉత్సవము: చూ, పండుగ. 2; 5. స్త్రీపురుషులపరిహాసము: చూ, పరిహాసము; 6. పైపైవచ్చినమేలు: చూ, శుభము. 1; 7. ఆనందము: చూ, సంతోషము; 8 పాటలోనగు సుఖము: చూ, సంతోషము; 9. పెండ్లి: చూ, వివాహము; 10. దేవేంద్రునితేరు: చూ, శకటము. 1.

కౌతూహలము. సం. వి. అ. న. తమి: చూ, కౌతుకము. 1. (వై. 6, ఆ. 8.)

కౌదవ్రికము. సం. వి. అ. న. సౌవర్చలవణము: చూ, లవణము. 1.

కౌద్రవీణము. సం. విణ ఆర్కపండునది (పొలము): చూ, భూమి 1.

కౌను. దే. వి: చూ, రూ-కవును. (వింటినడుము.- "చ. పిడికెఁడు కౌనుఁగొప్పుఁగని పేర్మిఁ దివ్రికవ్రిసమాంగిఁ జేసితేఁ, బిడికెఁడు కౌనుఁ గొప్పుఁబయిఁజేర్చు గుణంబును గంటినంచు." ఆము. 1, ఆ. 9. (వృత్తియందిది పూర్వపదంబగునపుడును వర్ణంబునకు వికల్పంబుగ లోపంబగు. "ఆసదు కౌఁదీఁగ యల్లాడుచుండ." భార. విరా. 4, ఆ. 26. నూఁగిజగాకవున్, లేఁగుబ్రినునుంగవున్ అని ఉత్తరపదముగానుండునపుడు అంత్యోకారంబునకు లోపము గలుగ కొందఱు చెప్పియున్నారు; శ. ర.)

కౌపము. సం. వి. అ. న. నూతినీరు: చూ, సలిలము.

కౌపీనము. సం. వి. అ. న. 1. = గోణము. గోఁచి: చూ, బొట్టము; 2. అకార్యము: చూ, వ్యలీకము. 2; 3. స్త్రీపురుషుల గుఱి: చూ, భగము 12; పుం. 4. కదలుట: చూ, లోలము; 5. ఎలుపు: చూ, వర్ణము. 6; 6. మనస్సు: చూ, హృదయము.

కౌమోదకి. సం. వి. ఈ. స్త్రీ. విష్ణువుయొక్కగద: చూ, బాణము. 1. (రూ-కౌమోదకీ.)

కౌబేరము. సం. వి అ. న. 1. చెంగల్వకోష్టు*: చూ, పారిభాద్యము; 2. పాలుపిండి కలిపి వండినపిండివంట: చూ, భక్ష్యము.

కౌమారము. సం. వి. అ. న. 1. బాల్యమునకు అవవివయోవస్థ (మూఁడవయేడు మొదలు ఎనిమిదేండ్లవఱకునైన ప్రాయము): చూ, వయస్సు. 1; అం. 2. అవస్థలు నాలుగింటిలో నొకటి: చూ, అవస్థలు.

కౌమారి. అం. 1. బ్రాహ్మ్యాది సప్తమాతృకలలో నొకతె: చూ, మాతృకలు; 2. దుర్గ: చూ, పార్వతి. 1.

కౌమారీభైరవతంత్రము. అం. శివప్రోక్తములగు చతుష్షష్టితంత్రములలో నొకటి: చూ, తంత్రములు.

కౌముదము. సం. వి. అ. పుం. కార్తికమాసము: చూ, మాసము. 1.

కౌముది. సం. వి. ఈ. స్త్రీ. 1. రూ-ముది. చంద్రిక: చూ, వెన్నెల; 2. ఉత్సవము, కార్తికోత్సవము (అని కొందఱు): చూ, పండుగ. 2; 3. ఒకానొక గ్రంథము. "సిద్ధాంతకౌముది."; పా. 4. ఒకానొక వృత్తము. ఇదిఒక్కొక్క పాదమునందు న, త, త గురువులతోఁగూడి ఆఱింట యతి గలిగి పదవఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా.—"మునినుతా కౌ - ముదీవృత్త మొ, ప్పును నతాంగం- బులఁ గొ వడ్యతిఁగా, దునిమెఁ బాల- స్యు భూపుత్రి కై, కినుక రావ- క్షితీశుండనఁగా."

కౌముదీచారము. సం. వి. అ.పుం, న. ఆశ్వయుజ పూర్ణిమ, శరత్కాలపూర్ణిమ: చూ, పున్నమ.

కౌముదీద్రువు. సం. వి. ఉ. పుం. దీపపుస్తంభము, శిఖాతరువు: చూ, స్తంభము. 1.

కౌముదీపతి. సం. వి. ఇ. పుం. చంద్రుఁడు: చూ, చంద్రుఁడు.

కౌముదీవృక్షము. సం. వి. అ. పుం: చూ, కౌముదీద్రువు.

కౌమోదకి. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-కౌమోదకి.

కౌమోది. సం. వి. ఈ. స్త్రీ. —పై.—

కౌయ. దే. వి. 1. క్షుద్రజలచరము: చూ, మత్స్యము. 1; 2. చేఁపమీఁదిపొలుసు: చూ, శల్కము. 3.

కౌరవులు. పా. కురురాజుయొక్క సంతతి.

కౌరవ్యము. సం. వి. అ. పుం దేవయోని సర్ప విశేషము: చూ, సర్పము.

కౌరవ్యుఁడు. సం. వి. అ. పుం. కౌరవేయుఁడు, కురువంశజుఁడు.

కౌరు. దే. వి. వర్ణాధిక్యము, రూ-కవురు. హంస 3, ఆ. 193: చూ, వర్ణము. 6.

కౌగులు. దే. వి. బ. నాట్యగతిభేదము: చూ, నాటకము. 1.

కౌర్ప్యము. సం. వి. అ పుం. వృశ్చికరాశి: చూ, రాశి. 2.

కౌర్మము. సం. వి. అ. న. రతిబంధవిశేషము: చూ, రతిబంధము.

కౌలకేయుఁడు. సం.వి. అ.పుం అసతీపుత్రుఁడు: చూ, పుత్రుఁడు. 1.

కౌలటినేయుఁడు. సం. వి. అ. పుం. భిక్షుకియైన పతివ్రతకొడుకు: చూ, పుత్రుఁడు. 1. (రూ-కౌలటేయుఁడు.)

కౌలటేయుఁడు. సం. వి. అ. పుం. 1. —పై.—; 2. రూ-కౌలటేరుఁడు. ఱంకుటాలి కొడుకు: చూ, పుత్రుఁడు. 1.

కౌలటేరుఁడు. సం. వి. అ. పుం. —పై.—

కౌలవ. అం. బవాదికరణములుపదునొకటింటిలో నొకటి: చూ, కరణము. 14. (చూ, కరణములు. 2.)

కౌలికుఁడు. సం.వి.అ. పుం: చూ, పాషండుఁడు.

కౌలీనము. సం. వి. అ. న. 1. గొప్పవంశమునందలి పుట్టుక; 2. స్త్రీపురుషుల గుటి: చూ, భగము. 12; 3. పశుపక్ష్యాదుల జగడము: చూ, యుద్ధము; 4. జగడము: చూ, యుద్ధము; 5. నిందింపఁదగినపని: చూ, ప్రయోజనము. 1; 6. అపవాదము: చూ, నింద. 1

కౌలీర. సం. వి. ఆ. స్త్రీ. కర్కటశృంగి*: చూ, శృంగి.

కౌలు. దే. వి. పట్టా. రూ-కవులు. రాజులు లోనగువారు ప్రజలు లోనగువారికిచ్చునట్టి యొడంబడిక, అభయ పత్రిక. "కౌలు కదపాలు.": చూ, ముచ్చిలికా.

కౌలుఁడు. సం. వి. అ. పుం. కౌలమతస్థుఁడు: చూ, అన్వయికుఁడు.

కౌలుత్థీనము. సం. విణ. ఉలవలుపండునది(నేల). రూ-కౌళుత్థీనము: చూ, భూమి. 1.

కౌలేయకము. సం. వి. అ. పుం. 1. కుక్క: చూ, శునకము; విణ. 2. మంచికులమునఁ బుట్టినది.

కౌలేయకుఁడు. సం. వి. అ. పుం. 1. కులీనుఁడు: చూ, సజ్జనుఁడు; 2. ఇంద్రుఁడు: చూ, వేలుపుఱేఁడు; 3. మిక్కిలి స్త్రీలోలుఁడు: చూ, వలపుకాఁడు.

కౌలేయుఁడు. సం. విణ. కులీనుఁడు: చూ, సజ్జనుఁడు.

కౌల్యుఁడు. సం. విణ. —పై.—

కౌశక. సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రమిద: చూ, ప్రమిదె (చూ, పాత్రము. 6); 2. గిన్నె: చూ, పాత్రము. 6.

కౌశము. సం. వి. అ. న. కాన్యకుబ్జము: చూ, దేశము.

కౌశలము. సం. వి. అ. న. నేర్పరితనము: చూ. సామర్థ్యము. 1: (రూ-కౌశల్యము.)

కౌశలి. సం. వి. ఈ. స్త్రీ. 1. కుశలప్రశ్నము: చూ, స్వాగతము; 2. వర్తమానము: చూ, సందేశము.

కౌశలేయుఁడు. సం. వి. అ. పుం. శ్రీరాముఁడు: చూ, రాముఁడు.

కౌశల్య. సం. వి. ఆ. స్త్రీ: చూ. కోసలాత్మజ.

కౌశల్యము. సం. వి. అ. న: చూ, రూ-కౌశలము.

కౌశాంబి. సం. వి. ఈ. స్త్రీ. వత్సపట్టణము: చూ, దేశము.

కౌశికప్రియుఁడు. సం. వి. అ. పుం. శ్రీరాముఁడు: చూ, రాముఁడు.

కౌశికఫలము.సం. వి. అ. పుం. కొబ్బరి*: చూ, నారికేళము.

కౌశికము. సం. వి. అ. పుం. 1. గుగ్గిలము*: చూ, మహిసాక్షి; 2. గుడ్లగూబ: చూ, సకి సంప్రుఁబులుఁగు; 3. నకులము: చూ, ముంగిస; 4. అశ్వకర్ణము*: చూ, మద్ది; 5. ఖజాంజీ. మొదలగు బొక్కసమునకు అంగము; అ. 6. శృంగారరసము, రసములు తొమ్మిదింటిలో నొకటి: చూ, రసములు.

కౌశికస. అం. గోత్రములలో నొకటి: చూ, గోత్రములు. ప్రవరము- వైశ్వామిత్ర, అఘమర్షణ, కౌశిక: చూ, గోత్రము. 18.

కౌశికాత్మజుఁడు. సం. వి. అ. పుం. అర్జునుఁడు: చూ, విజయుఁడు.

కౌశికాయుధము. సం. వి. అ. న. ఇంద్రధనుస్సు: చూ, బాణము. 1.

కౌశికారాతి. సం. వి. అ. పుం. కాకి: చూ, వాయసము 1.

కౌశికి. సం. వి. ఈ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2. కౌశికి యను గోదావరీనది: చూ, నది; 3. కౌశికి యను గ్రంథము; 4. అడవిలోని యిల్లు: చూ, సదనము 1; 5. పిల్లి యొక్క వమనము: చూ, వాంతి.

కౌశికీపతి. సం. వి. ఇ.పుం. ఈశానుఁడు, ఈశానరుద్రుఁడు: చూ, శివుఁడు.

కౌశికుఁడు. సం. వి. అ. పుం. 1. విశ్వామిత్రుఁడు: చూ, ముని 1, 2. ఇంద్రుఁడు: చూ, వేలుపుఱేఁడు; 3. నిఘంటువు తెలిసినవాఁడు; 4. పాములవాఁడు: చూ, వ్యాళగ్రాహి; 5. కుమ్మరివాఁడు: చూ, మృత్కారుఁడు; 6. సామవేదమును జెప్పెడి ఋత్విక్కు: చూ, యజ్ఞకర్త.

కౌశికోజ్యము సం. వి. అ.పుం. శాఖోటు*: చూ, బరివెంక.

కౌశీతకి. సం. వి. ఈ. స్త్రీ. అగస్త్యుని పెండ్లాము, రూ-కౌషీతకి: చూ, భార్య 1.

కౌశేయము. సం. వి. అ. పుం. కౌశేయమను మేఘము: చూ, మేఘము. 1; 2. కౌశేయమను బాణము: చూ, బాణము. 1; విణ. 3. రూ- కౌషేయము. పట్టుది (చీర): చూ, వస్త్రము.

కౌశికుఁడు. సం. వి. అ. పుం. విశ్వామిత్రుఁడు, రూ-కౌషికుఁడు: చూ, ముని. 1.

కౌషికి. సం. వి.ఈ. స్త్రీ.1: చూ, రూ. కౌశికి. 2 గౌరి: చూ, పార్వతి. 1.

కౌషీతకము. అం. వైఖానససూత్రములు తొమ్మిదింటిలో నొకటి: చూ, కల్పసూత్రములు.

కౌషీతకి. సం.వి.ఈ. స్త్రీ: చూ, రూ- కౌశీతకి.

కౌషేయము. సం. విణ: చూ, రూ- కౌశేయము. 3.

కౌసలి. అం. భిన్నపంచమిజవిభావ: చూ, భావ1. (చూ, భిన్నపంచమిజవిభావ )

కౌసల్య. సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-కౌశల్య.

కౌసల్యాజని. సం. వి. ఇ. పుం. శ్రీరాముఁడు: చూ. రాముఁడు.

కౌసల్యాపరిణయము. పా. ఈగ్రంథమునకు కర్త శ్రీపాద వేంకటాచల కవి. (19వ శతాబ్ది)

కౌసల్యుఁడు. సం. వి. అ. పుం. కౌసల్యుఁడను రాజు: చూ, రాజు. 1.

కౌసీద్యము. సం. వి. అ. న. 1. కుసీదభావము; 2 ఆలస్యము: చూ, విలంబము. 1; 3 కునికిపాటు: చూ, ప్రమీల.

కౌసు. దే.వి. నంజుడు: చూ, మాంసము;

కౌంసుభము. సం. వి. అ. న. 1. కుసుమధాన్యము: చూ, ధాన్యము; పుం. 2. అడవికుసుంబపువ్వు: చూ, వహ్నిశిఖము. 2. విణ. 3 కుసుంబాపువ్వు చేత సెట్టబడినది: చూ, వర్ణము. 6;

కౌసుంభి. సం. విణ.—3. వై.—

కౌసుమము. సం. వి. అ. న. 1. పూఁదేనె: చూ, మకరందము; 2. కుసుమధాన్యము: చూ, ధాన్యము.

కౌసుమేపరి. దే వి. పలలాసి. (ఆం. భా. త్రి. 6.)

కౌసృతికుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రజాలము మొదలగు గారడీ విద్యలు చేయువాఁడు: చూ. ప్రాతిహారకుఁడు.

కౌస్తుభము. సం. వి. అ. పుం. విష్ణు వక్షస్థలము నందలి మణి: చూ, రత్నము. 1.

కౌస్తుభవక్షుఁడు. సం. వి. అ. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

కౌళుత్థీయము. సం. విణ. రూ- కౌలుత్థీయము: చూ, భూమి. 1.

## క్న

క్నుయి. సం. వి. ఇ. పుం. చిందపిట్ట; చూ, పిన్నగ్రద్ద.

## క్యూ

క్యూకర్బిటములు. పా. ఇందలిజాతులు సామాన్యముగా తీఁగెలుగానుండి ప్రాఁకుట కనుకూలమగు నులితీఁగెలు గలిగియుండును. అండాశయములును కింజల్కములును వేఱువేఱు పుష్పములందుండును. ఇందలి ముఖ్యజాతులు.- గుమ్మడి, కాఁకర, బూడిదగుమ్మడి, అనప, పొట్ల. బీఱ మొ.

క్యూసెకు. పా. ఇదియొక నీటి పరిమాణము. ఒక సెకను కొక ఘనపుటడుగు పాఱుటకు మానముగ (యూనిట్) తీసికొందురు. ఈ పరిమాణమునకు 'క్యూసెకు' అని పేరు.

# క్ర

క్రంగు. దే. వి. క్రేంగుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హహాహా.

క్రంచేఱ. దే. దర్రి. క్రి. విశ. శీఘ్రముగా, ఝడితి త్యర్థకము: చూ, వేగము.3. (రూ-క్రంచేర.)

క్రంత. వై. వి. 1. సందుత్రోవ. భాగ. 10, స్క-ం. 1717: చూ, మార్గము. 1; 2=రంధ్ర-గర్త. చిల్లి. వై. 2. ఆ. 68: చూ, రంధ్రము. 1; దే. వి. 3. పెండ్లికొడుకువారు పెండ్లికూఁతునకుఁ దీసికొనిపోయెడి ప్రధాన ద్రవ్యము. ఆము. 6, ఆ. 130. 4. దచ్చే. పారిజా 2, భా. 648: చూ, సభ. 2.

క్రందనము. సం. వి. అ న. 1.=క్రందు ఆర్పు, ఆర్తకంఠధ్వని: చూ, స్వరము. 2; 2=క్రందు. ఏడ్పు, ధ్వనియుక్తరోదనము: చూ, స్వరము. 2; 3.=క్రంగు. యుద్ధమందలి భటులమ్రోఁత: చూ, స్వరము. 2; 4. పిలుపు: చూ, సంబోధనము; పుం. 5. పిల్లి: చూ, మార్జాలము.

క్రందితము. సం. వి. అ. న. 1. ఏడ్పు, మొఱ పెట్టి ఏడ్చుట: చూ, స్వరము. 2; 2. పిలుపు: చూ, సంబోధనము.

క్రందిలు. వై. అ క్రి. రూ-క్రందిల్లు. మ్రోఁగు: చూ, శబ్దించు.

క్రందిల్లు వై. అ. క్రి.—వై.— వీర. 4, ఆ.62.

క్రందు. వై. వి. 1.=క్రందన. మ్రోఁత. భార. శాం. 4,ఆ.412: చూ,స్వరము 2;2=క్రందన. అతిగాఢరణధ్వని: చూ, స్వరము. 2; 3. సందడి: చూ, స్వరము. 2: 4. ఉపద్రవము. పారి. పూ. 8, ఆ 182: చూ, విపత్తు; 5. అతిశయము: చూ, హెచ్చు. 2; 6. తఱచు. భార. ద్రో. 3, ఆ. 6: చూ, మొత్తము; అ. క్రి.7. మ్రోఁగు: చూ, శబ్దించు; 8. ఆఘోషించు. భార. అను, 4, ఆ. 263: చూ,విలపించు.

క్రందుకయ్యము. ద్వ.వి. దొమ్మియుద్ధము. భార. భీష్మ. 2, ఆ. 380: చూ, యుద్ధము.

క్రందుకొను. ద్వ. అ. క్రి. 1. అతిశయించు. జై. 7. ఆ. 74: చూ, ముమ్మరించు; 2. తఱచేగు. భార. అర. 4, ఆ. 406: చూ, దండడించు. (ప్రే. క్రందుకొలుపు.)

క్రంప. దే. వి. 1. రూ-కంప: చూ, ముండ్లపొబ్బు; 2. కంటకాదిభారము: చూ,ప్రాచీనము.1.

క్రకచ. సం. వి. ఆ. స్త్రీ. కేతకి*: చూ, మొగలి.

క్రకచచ్ఛదము. సం. వి. అ. పుం. —వై.—

క్రకచపత్రము. సం. వి. అ. పుం. పాలటేఁకు, తేఁకు (అని కొందఱు)*: చూ. బూరుగి.

క్రకచపాదము. సం.వి. అ. పుం. తొండ: చూ, సరటము.

క్రకచపృష్ఠి సం. వి. ఈ. స్త్రీ. అంపపుతోఁక చేఁప, కవయి యను చేఁప: చూ,మత్స్యము. 1.

క్రకచము. సం. వి. అ. పుం. 1.=కరగసము. రంపము: చూ, అంపము; 2. కరీరము*: చూ, వెదురుచురు; అం. 3. = కరగసము. ధనుర్వేదమునందలి ముప్పదిరెండాయుధములలో నొకటి: చూ, ముప్పదిరెండాయుధములు (చూ, బాణము. 1.)

క్రకచాగకము సం. వి.అ. పుం. గుజ్జుపుకొరడా: చూ, మునికోల. 2.

క్రకణము. సం. వి అ పుం.విష్ణుక్రకర: చూ, బకము.

క్రకరము. సం. వి. అ. పుం. 1.=క్రకర. —వై.—; 2. రంపము: చూ, అంపము; 3. కరీరము*: చూ, వెదురుచురు.

క్రకరుఁడు. సం. వి. అ. పుం. పేదవాఁడు: చూ, బీదవాఁడు.

క్రక్కస. వై వి. ణ.=కర్కశ. కఠినము. వై. 5, ఆ. 116: చూ, బెడిదము.

క్రక్కు. దే. వి. 1. కడుపునవికారమెత్తి తిన్నది వెడల నుమియుట: చూ, వాంతి; 2. కక్కు తెవులు: చూ, వాంతి; స. క్రి. 3. కడుపున వికారమెత్తి తిన్నది వెడలనుమియు: చూ, వెళ్లగొట్టు.

క్రక్కుడు. దే. వి: చూ, క్రక్కు.

క్రక్కున. దే. ద్రి. క్రి. విశే: చూ, క్రంచెఱ. (రూ-గ్రక్కన-గ్రక్కున-క్రచ్చెఱ-క్రన్న.)

క్రక్కర. వై. వి. = క్రకరః: చూ, రూ- కక్కర.

క్రచ్చ. దే. వి. కాంక్ష: చూ, వాంఛ. (రూ- క్రచ్చు- కచ్చు)

క్రచ్చెఱ. దే. ద్ర. క్రి. విశే. (క్రచ్చు + అఱ) క్రంగఱ. భార. ఉద్యో: 1, ఆ. 176; రా. యు, కాం. 1447: చూ, వేగము. 3; 2. నిష్కల్మషముగా. భార. ఆర 7, ఆ. 367.

క్రచ్చు. దే. వి. 1. కాంక్ష: చూ, వాంఛ; 2. మాలిన్యము: చూ, మలినము; 3. పేనినత్రాడు లోనగువానియందుపయుక్తము నితృణాదుల యంశము; స. క్రి. 4. చు కొను. రామా. 5 ఆ. 199: చూ, వేష్టించు.

క్రచ్చుకొను. దే. స. క్రి. చుట్టుకొను. వసు. 4, ఆ. 57: చూ, వేష్టించు.

క్రతుచతుష్టయము. అం. ప్రథమచష్టోమము, ద్వితీయోక్థ్యము, తృతీయాతిరాత్రము, జ్యోతిష్టోమము. (4)

క్రతుదక్షులు అం. వీరు విశ్వేదేవులు పదిమంది లోనివారు: చూ, విశ్వేదేవులు.

క్రతుధ్వంసి. సం. వి. న్. పుం. జన్నపుగొంగ: చూ, శివుఁడు.

క్రతుపశువు. సం. వి. ఉ. పుం. గుఱ్ఱము: చూ, హయము.

క్రతుపావకము. సం. వి. అ. పుం. యజ్ఞవహ్ని: చూ, వహ్ని. 1.

క్రతుపురుషుఁడు. సం. వి. అ. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు.

క్రతుభుజుఁడు. సం. వి. జ్. పుం. జన్నపుదిండి, దేవత: చూ, వేలుపు.

క్రతురాజము. సం. వి. అ. పుం. రాజసూయయజ్ఞము: చూ, యజ్ఞము.

క్రతువు. సం. వి ఉ. పుం. 1. జన్నము, యూపస్తంభముగల యజ్ఞము. (అని కొందఱు): చూ, యజ్ఞము; 2. సప్తఋషులలో నొకఁడు. (చూ, ఋషి): చూ, ముని. 1; 3. విశ్వేదేవవిశేషము: చూ, దేవతావిశేషము; 4 కుచాగ్రము: చూ, స్తనము; 5. బూడిదె: చూ, భస్మము; 6. పెసరపప్పు: చూ, సూపము; అం. 7. బ్రహ్మలు తొమ్మండుగురిలో నొకఁడు: చూ, బ్రహ్మ. 1.

క్రతూత్తమము. సం. వి. అ. పుం: చూ, క్రతురాజము.

క్రథనకము. సం. వి. అ. న. సితాగురువు: చూ, రాజార్హము.

క్రథనము సం వి. అ. న. కోల: చూ, వధము.

క్రన్న. దే. ద్రి. క్రి. విశే. 1. ఝడిత్యర్థకము, క్రంచఱ; భార. సభా. 2, ఆ. 268: చూ, వేగము. 3; 2. పశ్చాదర్థకము. భార. సభా. 2, ఆ. 208: చూ, పిమ్మట; 3. పునరర్థకము. భార. ఆది. 3, ఆ. 168; చూ, వెండియు.

క్రన్నన. దే. ద్రి. శీఘ్రముగా, ఝడిత్యర్థకము ఆం. భా. త్ర. 71; చూ, వేగము. 3.

క్రమకుఁడు. సం. వి. అ. పుం. స్త్రీ. వేదమునందు క్రమాంతముఁ జదివినవాఁడు.

క్రమచ్ఛదము. సం. వి. అ. పుం: చూ, బిల్లేడు*:

క్రమణము. సం. వి. అ. న. అడుగిడుట: చూ, పాదము. 1.

క్రమభ్రష్టము. అం. (అక్రమము) (శబ్దహీనము) క్రమముదప్పుట. వాక్యదోషములు యిరువదినాలుగింటిలో నొకటి: చూ, వాక్యదోషములు. ఉదా.—మొదటివరుసను దప్పించి దానికి భిన్నముగఁ దరువాత వ్రాయుట. రామభరతలక్ష్మణశత్రుఘ్నులు. కైకేయీసుమిత్రాకౌసల్యానందనులు. ఇట్లు క్రమము దప్పించి వ్రాయరాదు. రామభరతలక్ష్మణశత్రుఘ్నులే వరుసఁ జెప్పఁబడిరో యావరుసన వారితల్లుల పేర్లఁ జెప్పవలయును. ముందు వెనుక చెప్పుటచేఁ గ్రమము భంగమయ్యెను. రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు కౌసల్యా కైకేయీసుమిత్రా నందనులని చెప్పవలయును.

క్రమపూరకము. సం. వి. అ. పుం. అటికము*: చూ. బకపుష్పము.

క్రమము. సం. వి. అ. పుం. 1. సౌరిది: చూ, విధము. 1; 2. అడుగిడుట: చూ, పాదము.1; 3. అఱుముట: చూ,తలపాటు. 2; 4. బలిమి: చూ, శక్తి. 1; 5. వడఁకు: చూ. లోలము; 6. వేదములోని క్రమము; 7. వేదశాస్త్రములచేత నిర్ణయింపఁబడిన విధి: 8. అంజె: చూ, పాదము. 1; అం. 9. క్రమాలంకారము; (చూ, అలంకారము. 3): చూ, హేతువు. 2; 10. సంచారీవర్ణగతాలంకారములు ఇరువదియైదింటిలో నొకటి: (చూ, అలంకారము. 3): చూ, సంచారీవర్ణగతాలంకారములు.

క్రమరేచితము. అం. స్థాయీవర్ణగతాలంకారములు ఏడింటిలో నొకటి: (చూ, అలంకారము.3): చూ, స్థాయీవర్ణగతాలంకారములు.

క్రమశీర్షము. సం.వి. అ. న. ప్రాకారగృహము: చూ, సదనము. 1.

క్రమి. సం. వి. ఇ. పుం: చూ, రూ- కృమి.

క్రమించు. సం. స. క్రి. 1. అతిక్రమించు; అని. 8 ఆ. 14: చూ, దాఁటు. 6; 2. ఆక్రమించు. భాగ. షష్ఠ. 1, ఆ. 10: చూ, మొఁగరించు.

క్రమికంటకము. సం. వి. అ. న 1. చిత్రాంగము: చూ, నిష్ఠ్పసంజ్ఞికము; 2. విడంగము*: చూ. వాయువిళంగము; 3. ఉదంబరము *: చూ, మేడి.

క్రమిఘ్నము. సం. వి. అ. న. విడంగము *: చూ, వాయువిళంగము.

క్రమిజ. సం. వి. ఆ. స్త్రీ: చూ. లక్క.

క్రమిజము. సం. వి. అ. న. అగురు: చూ, రాజార్హము.

క్రమిశత్రువు. సం. వి. ఉ. పుం. విడంగము *: చూ, వాయువిళంగము.

క్రముకము. సం. వి. అ. న. 1. పోఁకపండు: చూ, పోఁక; 2. తమ్మలము, తాంబూలము బీడీ: చూ, వీడియము; పుం. 3. పూగము*: చూ, పోఁక; 4. ఎఱ్ఱలొద్దుగు *: చూ, లొద్దుగు; 5. గంగరావి *: చూ, రావి; 6. నాగముస్తె*: చూ, వత్సకము; 7. కార్పాసము*: చూ, ప్రత్తి; 8. ప్రత్తికాయ: చూ, ప్రత్తి.

క్రముకి. సం. వి. ఈ. స్త్రీ పూగము *: చూ, పోఁక.

క్రమేలకము. సం. వి. అ. పుం. ఒంటె: చూ, లొట్టిపిట్ట.

క్రమేలము. సం. వి. అ. పుం. —వై.—

క్రమ్మట. దే. ద్రి. క్రి. విశే. రూ- క్రమ్మఱ- క్రన్న. పునరర్థకము మరల. ఆం, భా.తృ.69: చూ, వెండియు.

క్రమ్మరిలు. దే. అ. క్రి. (రూ-క్రమ్మఱఁబడు- క్రమ్మఱిల్లు-క్రమ్మఱు) మరలు, నివర్తిల్లు. ఆం, భా. తృ. 114: చూ, వటిరిల్లు.

క్రిమ్మఱి. దే. ద్వి. క్రి. విణ: చూ, క్రిమ్మఱు.
క్రిమ్మఱఁబడు. దే. అ. క్రి. (క్రిమ్మఱ్ + పడు): చూ. రూ-క్రమ్మరిలు. భార. ఉద్యో. 3, ఆ. 393 (స్వార్థమునపడు.)
క్రిమ్మఱిలు. దే. అ. క్రి -పై- (రూ-క్రిమ్మఱిల్లు)
క్రిమ్మఱిల్లు. దే. అ. క్రి -పై-: (పాండు. 4 ఆ. 80.)
క్రిమ్మఱు. దే. అ. క్రి. — పై. —; (భార. అర. 6. ఆ. 327.)
క్రిమ్మఱుచు దే. ప్రే. క్రిమ్మఱఁజేయు. భార. అర. 3, ఆ. 170: చూ, మరలించు.
క్రిమ్ము. దే. అ. క్రి. 1. వ్యాపించు భార. అర. 3, ఆ. 113; రా. అర. 2, ఆ. 393: చూ, వ్యాపించు; 2. పైకొను. భార. స్త్రీ. 2, ఆ. 64: చూ, క్రిమ్ముదెంచు.
క్రిమ్ముదల. దే. వి క్రిమ్ముట.
క్రిమ్ముదెంచు. దే. అ. క్రి. (క్రమ్ము + తెంచు) పైకొను. భార. విరా. 2, ఆ. 70: చూ, క్రిమ్ము. 3. (స్వార్థమున తెంచు.)
క్రయము. సం. వి. అ. పుం. 1. ఖరీదు: చూ, వెల. 1; 2. (వెలయిచ్చి) కొనుట: చూ, పణము.
క్రయవిక్రయము. సం. వి. అ. పుం. కొనుట అమ్ముట: చూ, వాణిజ్యము.
క్రయవిక్రయములు చేసి తిరుగఁబడుట. అం. వివాదములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, వివాదములు.
క్రయవిక్రయికుఁడు. సం. వి. అ. పుం. (సరకును) కొని యమ్మెడువాఁడు: చూ, వర్తకుఁడు.
క్రయారోహము. సం. వి అ. పుం. 1. అంగడి: చూ, దుకాణము; 2. అంగడివీధి: చూ, మార్గము. 1.
క్రయించు. సం. స. క్రి. (సరకును వెలయిచ్చి) కొను: చూ, విలుచు.
క్రయికుఁడు. సం. వి. అ. పుం. (సరకును వెలయిచ్చి) కొనువాఁడు: చూ, విలువకాఁడు.
క్రయ్య. వై. వి.=క్రల్య. కాలువ. రా. యు, కాం. 698: చూ నది. (దేశ్యమని శబ్దరత్నాకరము.)
క్రయ్యఁబడు. ద్వ. అ. క్రి. (క్రయ్యక్ + పడు) కలయు: చూ, కలచు (స్వార్థమునపడు.)
క్రయ్యము. సం విణ. కొనుటకు అంగడియందు పఱపఁబడినది (సరకు): చూ, దుకాణము.
క్రయ్యు. దే. అ. క్రి: చూ, క్రయ్యఁబడు (రూ-క్రియ్యు-క్రియ్యు.)
క్రల్లపడు. ద్వ. అ. క్రి. ఎండు. "తరుతెల్లఁ గ్రల్లపడఁగా." పారి. ప్ర. 6, ఆ. 37: చూ, మిడుకు. 8.
క్రవ్యదుఁడు. సం. వి. అ. పుం. రక్కసుఁడు. రూ-క్రవ్యాదుఁడు: చూ, రాక్షసుఁడు. 1.
క్రవ్యము. సం. వి. అ. న. పొల: చూ, మాంసము.
క్రవ్యాత్తు. సం. వి. ద్. పుం. 1. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; 2. మాంసము తినువాఁడు: చూ, మాంసభక్షకుఁడు.
క్రవ్యాదుఁడు. సం. వి. అ. పుం. —పై.—
క్రవ్యాశి. సం. వి. న్. పుం. —పై.—
క్రష్ట. సం. విణ. బు. కర్షకుఁడు: చూ, వ్యవసాయి.

## క్రా.

క్రాంత. సం. వి. అ. స్త్రీ. బృహతి*. చూ, వాకుడు.
క్రాంతము. అం. ఆకాశమండలములు పదింటిలో నొకటి: చూ, ఆకాశమండలములు.
క్రాంతి. సం. వి. ఇ. స్త్రీ. 1. అడుగిడుట: చూ, పాదము. 1; 2. ఆక్రమణము: చూ, పురి. 4; 3. నడవడి: చూ, వర్తనము. 1; 4. గీఱ: చూ, రేఖ. 3; పా. 5. = కాన్తి. నక్షత్రములు భూమియందు మనమున్నచోటి మధ్యాహ్నరేఖను దాటుటకు "క్రాంతి" (ట్రాన్సిట్) అనిపేరు.

క్రాంతికము. అం. చుంబనములు పదునైదింటిలో నొకటి: చూ, చుంబనములు.

క్రాంతిపాతములు. పా. క్రాంతివృత్తము ఖగోళ మధ్యరేఖను గలియు రెండు స్థానములకు క్రాంతిపాతములని పేరు. (సూర్యుఁడు మార్చి 21 తేదీయందును, సెప్టెంబరు 23 తేదీ యందును యీ స్థానములయందుండును.)

క్రాంతిమండలపువంపు. పా. సూర్యఘటిని పరిశీలించుటవలన దక్షిణాయన ప్రారంభమందు సూర్యునికి ఉత్తరమున $23\frac{1}{2}$ అంశలు పతనమును, ఉత్తరాయణ ప్రారంభమందు దక్షిణమున $23\frac{1}{2}$ అంశలు పతనమును ఉండుట స్పష్టమగును. ఈ కోణము సూర్యుని క్రాంతి వలయమునకును, ఖగోళమధ్యరేఖకును మధ్య గలది. కాఁబట్టి క్రాంతివలయము యొక్క వంపు $23\frac{1}{2}$ అంశలు అని తెలియుచున్నది.

క్రాంతివృత్తము. పా. సంవత్సరమున కొకసారి సూర్యుఁడు ఆకాశమునందు ప్రయాణముచేయు వలయాకార మార్గమునకు క్రాంతివృత్తమని పేరు.

క్రాంతువు. సం. వి. ఉ. పుం. పక్షి: చూ, పక్షి

క్రాఁక. దే. వి: చూ, రూ-కాఁక.

క్రాఁగు. దే. అ. క్రి: చూ, రూ-కాఁగు. 2-3. (తపించుటకు.—భార. శాం. 1, ఆ. 23.)

క్రాఁగుడు. దే. వి: చూ. రూ-కాఁగుడు.

క్రాఁచు. దే. ప్రే: చూ, రూ-కాఁచు. 2.

క్రాసుఁగు. దే. వి: చూ, రూ-కాసుఁగు*

క్రాయకుఁడు. సం. వి. అ. పుం. క్రయికుఁడు. చూ, విలువకాఁడు

క్రాయు. దే. స. క్రి. 1. ధ్వనిపూర్వకముగా కళ్లెలోనగువానిని కంఠమునుండి నోటికిఁ దెచ్చికొను. కాశీ. 4, ఆ. 269: 2. ఉమియు. ఆము. 4, ఆ. 31: చూ, తూపాడుచు; 3. క్రక్కు: చూ, వెళ్లగొట్టు.



క్రార. దే. వి. (క్రయ్యు + ర.) (జిడ్డైన యొక యక్షరముతో) కలయు రేఫము: రూ-క్రార వడి, గిలుక.

క్రారవడి. దే. వి. —పై.— (స్వార్థమునవడి.)

క్రాలు. దే అ. క్రి. 1. ఒప్పు. ఆం, భా. తృ. 33: చూ, సమ్మతించు; 2. (టెక్కుము) అల్లలాడు. రా. అ, కాం. 52: చూ, చలించు; 3. గిరగిరఁదిరుగు. భార. ద్రో. 5, ఆ. 317: చూ, వేష్టించు; 4. చెదరు. భాగ. 6, స్కం. 425: చూ, వెల్లివిరియు; 5. సంచలించు. రా. అర, కాం. 187 పొరటు: చూ, చలించు; 6. తొట్రుపడు. భార. ద్రో. 4, ఆ. 29: చూ, సంభ్రమించు; 7. మెలఁగు. వి, పు. 7, ఆ. 339: చూ, వర్తించు; 8. ప్రవర్తిల్లు. నిర్వ. 6, ఆ. 6: చూ, వర్తించు.

క్రాలుగంటి. దే. వి. (క్రాలు + కన్ను) 1. చలించునట్టి కన్నులుగల ఆఁడుది: చూ, స్త్రీ; 2 ఆఁడుది: చూ, స్త్రీ.

క్రాలుగచ్చే. దే. వి. కలుగచ్చే*: చూ, సోమరాజి.

క్రాసుపరీక్ష. పా. అడ్డుసవాలు.

క్రాస్టాఫ్. ఆం. వి. ఆఫ్‌సెట్టుకొలత యొక్క మార్గమును చూపు సమకోణపుగిల్ల.

# క్రి.

క్రి. దే. విణ. వృత్తియందుఁ గ్రిందుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము (దీనికి పరుషసరళములు పరములగునప్పుడు నుగాగమమును తదితరములు పరములగునప్పుడు పరవర్ణకమునకు ద్విత్వమును వచ్చును. ఉదా.—క్రి దల, క్రియ్యాట మొ.) (ఇది దీర్ఘాంతమునగు: చూ, క్రీ.)

క్రించు. వై. విణ =కించిత్. అల్పుఁడు. రూ-క్రించుఁడు-క్రించు. భాగ. 9, స్కం. 116: చూ, హీనుఁడు.

క్రించుఁడు. వై. విణ.- రూ-వై.-. ఉ. రా. 8, ఆ. 96.

క్రింద. దే. అవ్య. అధస్సంజ్ఞ. ఆం, భా. తృ. 67: చూ, దిగువ.

క్రిందల. దే. వి. (క్రింద + తల) క్రిందగుతల. పాండు. 2. ఆ. 29.

క్రిందపడఁజేయుట. జా. జయించుట. "సీ. కినుక మీఱునసంతగిరి క్రిందుపడఁజేసె." పా. 1. ఆ. 28.

క్రింది నేల. పా. వి. సామాన్యముగ పైనేల 8 అంగుళముల లోఁతువఱకును గలది. దానికి క్రింది భాగమంతయు 'క్రింది నేల' అనఁబడును.

క్రిందు. దే. వి. 1. అధోభాగము. ఆము 4, ఆ. 177: చూ, దిగువాటు; 2. గతకాలము. "క్రింద జరిగినవన్ని పోనీ యిఁక జరగవలసినది యోచింపుము" (వృత్తియందు అంత్యవర్ణలోపము: చూ, క్రి-క్రీ.)

క్రిందుపడు. ద్వ. అ. క్రి. అడుగుపడు ఉ, రా. 8, ఆ. 88: అడుగుపడు, క్రిందుపడు; (మి.ప):-అధమమగు. (ప్రే. క్రిందుపఱచు.)

క్రిందుపఱచు. ద్వ. ప్రే. అధఃకరించు, తక్కువపఱచు (అనికొందఱు.)

క్రిందుపఱచుట. ద్వ.వి.తక్కువపఱచుట:(సం.ప):- అధఃకరణము, అధఃకారము.

క్రిక్క. దే. వి. బట్టువాఁడు. వేంక. ఆం. 32: చూ, పాఠకుఁడు.

క్రిక్కిఱించు. దే. అ. క్రి. రూ-క్రిక్కిఱియు. ఎడము లేక వ్యాపించు. జై. 8, ఆ. 127: చూ, వ్యాపించు.

క్రిక్కిఱియు. దే. అ. క్రి. 1. —వై.— భార. విరా. 3. ఆ. 216 (కొన్నిచోట్ల వృత్తియందంత్యవర్ణలోపము "క్రిక్కిఱి చేస్నుదోయి." మొ.) స. క్రి. 2. అతు. ఆం, భా. తృ. 119: చూ, ప్రాపించు.

క్రిక్కు. దే. వి: చూ, రూ క్రిఱుకు.

క్రిమి. సం. వి.ఇ. పు. 1. రూ-క్లిమి. కీటకము: చూ, పురుగు; 2. చెట్లమీఁది నల్లపురుగు: చూ, పురుగు; 3. లక్షుక: చూ, లక్క; 4. లూత: చూ, సాలెపురుగు.

క్రిమికంటకము. సం. వి. అ. న. 1. ఎలుకచెవి *: చూ, భల్లాతకి; 2. అంజూరు *: చూ, మేడి; 3. విడంగము *: చూ, వాయువిళంగము.

క్రిమిఘ్న. సం. వి. ఆ. స్త్రీ. ధూమ్రపత్రిక *: చూ, పొగచెట్టు.

క్రిమిఘ్నము. సం.వి. అ. పుం. 1. విడంగము*: చూ, వాయువిళంగము; 2. పలాశము *: చూ, మోదుగు.

క్రిమిఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. క్రొలుగచ్చ *: చూ, సోమరాజి.

క్రిమిజ. సం. వి ఆ. స్త్రీ. లక్షుక: చూ లక్క.

క్రిమిజము. సం. వి. అ. న. అగురువు: చూ, రాజార్హము.

క్రిమిజిత్తు. సం. వి. ద్. పుం. విడంగము*: చూ, వాయువిళంగము.

క్రిమిద్రుమవు. సం.వి. ఉ. పుం. తుమ్మెదమామిడి *: చూ, మామిడి.

క్రిమినల్ లా. ఆం. వి. నేరములకు సంబంధించిన చట్టము.

క్రిమిలూనము. సం. వి. అ. పుం. 1. ఈఁగ: చూ, మక్షిక; 2. పిల్లిమొంగము.

క్రిమిశాత్రవము. సం. వి. అ. పుం. చేంద్రి *: చూ, విట్ఖదిరము.

క్రిమిశైలము. సం. వి. అ. పుం. పుట్ట: చూ, వల్మీకము.

**క్రియ.** సం. వి. ఇ. స్త్రీ. 1. ధాత్వర్థకము (వ్యాపారావబోధకము క్రియ. ఉదా.— 'చంపెను' అనునది యొక వ్యాపారమును గుఱించి బోధించును గనుక క్రియ: చూ, క్రియలు; 2. చేయుట (చూ, కర్మ. 1): చూ, విధి; 3. చేష్ట, చేత: చూ, వ్యాపారము. 1; 4 పని: చూ, ప్రయోజనము. 1; 5 ఆరంభము: చూ, యత్నము; 6. పూజ: చూ, సపర్య; 7. ఉపాయము: చూ, వెరవు; 8. చికిత్స: చూ, వైద్యము; 9. పాపపరిహారార్థముచేసెడు కర్మము: చూ, ప్రాయశ్చిత్తము; 10. వ్యవహారమునందు నిశ్చయమును బుట్టించునట్టి లిఖితము, సాక్ష్యములోనగునది: 11. ఖైదు. (చూ, బంధనాలయము): చూ, సదనము. 1 (శిక్షను అనుభవించు స్థలము అని వాడుక; శిక్షఅనఁగా జరిమానా అనియును ఖైదు అనియును రెండర్థములను వాడుక.); 12. రీతి. భార. సౌ. 1. అ. 168; చూ, విధము. 1; 13. తాళప్రాణ విశేషము. (చూ, అంగము. 9): చూ, తాళము. 2; 14. స్త్రీపురుషులకు సంతోషకరమగు విలాసము, వేడుక: చూ, విలాసము. 1; 15. మేష రాశి: చూ, రాశి. 2; అం. 16. తాళప్రాణములు పదింటిలో నొకటి: చూ, తాళప్రాణములు (చూ, తాళము. 2.).

**క్రియము.** సం. వి. అ. పుం. మత్స్యాక్షి *: చూ, పొన్నగంటి; వా. 2. అష్టకము. "క్రియదస్తావేజు." (క్రియమును క్రియామని వాడుచున్నారు.)

**క్రియలు.** అం 1. క్రియలు.—తత్సమములు, అచ్ఛికములు అని రెండువిధములు; సంస్కృత ధాత్వాదులకు 'ఇంచు' చేర్పఁగానైనవి తత్సమ క్రియలు; మిగిలినవి అచ్ఛికములు; క్రియలు.-సకర్మకము, అకర్మకము, సమాపకక్రియ, అసమాపకక్రియ, క్రియాకాంక్షా సమాపకములు, నామాకాంక్షాసమాపకములు, వర్తమానార్థకము, భూతార్థకము, భవిష్యదర్థకము, తద్ధర్మాద్యర్థకము, ఆశీరాద్యర్థకము, శత్రర్థకము, తుమున్నాద్యర్థకము, అనంతర్యార్థకము, చేదాద్యర్థకము మొదలయినవి. క్రియలు కర్త్రర్థకము, కర్మార్థకము అని ద్వివిధము. అవి ప్రేరణమందును, ఆత్మనేపది మున్నగు వానియందును వర్తించుచుండును. అం. 2. మణి, మంత్రము, ఔషధము అని క్రియలు త్రివిధము: చూ, త్రియము.

**క్రియాంగము.** అం. గాంధర్వవేదములోని రాగాధ్యాయమునందలి అష్టాదశపదార్థములలో నొకటి: చూ, అష్టాదశపదార్థములు.

**క్రియాంగములు.** అం. భావక్రియ. స్వభావక్రియ, శివక్రియ, మకరక్రియ, త్రినేత్రక్రియ, కుముదక్రియ, హనుక్రియ, టమిక్రియ, ఇంద్రక్రియ, నాగకృతి. ధాన్యకృతి. విజయక్రియ. (12.) (చూ, అంగము. 9.)

**క్రియాకాంక్షాసమాపకము.** వా. క్త్వార్థకము లోనగు క్రియలు క్రియాకాంక్షాసమాపకములు. ఉదా.— హనుమంతుఁడు లంకఁ జొచ్చి సీతను జూచెను. ఇచటఁ జొచ్చి యనునది యసమాపక క్రియ. 'లంకఁజొచ్చి' యనఁగానే 'ఏమిచేసెను' అను ప్రశ్నము రాగా (సీతను) జూచెను అని ప్రత్యుత్తరము. ఈ 'జూచెను' క్రియగావున నది క్రియాకాంక్షా సమాపకము.

**క్రియాకారము** సం. వి. అ. పుం. పట్టుదల: చూ, ప్రతిజ్ఞ. 1.

**క్రియాకారుఁడు.** సం. వి. అ. పుం. క్రొత్త శిష్యుఁడు: చూ, శిష్యుఁడు.

**క్రియాకాలములు.** అం. భూతకాలము, భవిష్యత్కాలము, వర్తమానకాలము. (3): చూ, త్రియము.

క్రియానాంది. అం. నాంది శుద్ధనాంది, క్రియానాంది యని ద్వివిధము. వానిలో నిదియొకటి. (అక్షతలు, పుష్పములు దోయిలించి సభ్యుల మీఁదఁజల్లుచు మంగళగీతముఁబాడుట క్రియానాంది.)

క్రియావంతుఁడు. సం. విణ. (త్. ఈ. త్) పని యందు బూన్కిగలవాఁడు.

క్రియావతి. సం. వి. ఈ. స్త్రీ. పనిని నెఱవేర్చు ఆఁడుది: చూ, స్త్రీ.

క్రియావాది. సం. వి. న్- పుం. ప్రమాణవాది.

క్రియాశక్తి. అం. శక్తులు అయిదింటిలో నొకటి: చూ, శక్తులు.

క్రియేంద్రియము. సం. వి. అ. న. కర్మేంద్రియము.

క్రియ్యు. వై. అ. క్రి. = కృశ్. కృశించు. భాగ. 10, స్కం. పూ. 707: చూ, సాటు సాటువోవు.

క్రిస్టమస్ సెలవులు. వా. వి. బ. డిశెంబరు నెల తుదివారపు దినములు.

క్రిస్టియను. వా. వి: చూ, క్రైస్తవుఁడు.

## క్రీ

క్రీ. తె. విణ. వృత్తియందుఁ గ్రిందుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. ("ఉదా.—క్రీఁగడుపు, క్రీఁదొడ, క్రీనీడ, క్రీయూట" శా. ఇక్కడ దీర్ఘాంతము గాన నిందున్న యును పరవర్ణమునకు ద్విత్వమును రాదయ్యె. చూ, క్రి.)

క్రీఁగడుపు. ద్వ. వి. (క్రిందు + కడుపు) పొత్తి కడుపు: చూ, వస్తి. 2. (చూ, కడుపు.)

క్రీఁదొడ. దే. వి. (క్రిందు + తొడ) తొడకు లోపలిభాగము: చూ, తొడ.

క్రీడ. సం. వి. ఆ. స్త్రీ. 1. గొండిలి. అల్లాటు: చూ, విలాసము. 1: 2. ఎగతాళి: చూ, పరిహాసము; 3. దూఱు: చూ, నిందు. 1

క్రీడనము. సం. వి. అ. న. ఖేల: చూ, విలాసము. 1.

క్రీడము సం. వి. అ పుం. 1. తాళప్రాణకళా విశేషము: చూ, తాళము. 2; 2. క్రీడ: చూ, పరిహాసము.

క్రీడాకిరాతుఁడు. సం. వి.అ. పుం.ముక్కంటి: చూ, శివుఁడు.

క్రీడాతాళము. అం. జన్యతాళములు నూటనొక టింటిలో నొకటి: చూ, జన్యతాళములు.

క్రీడాదురము. సం వి. అ. పుం. అచ్చనకాయలు: చూ, బాలిక్రీడ.

క్రీడాద్యూతము. సం. వి. అ. పుం. పందెమువేసి యాడెడు ద్యూతము: చూ, వ్యవహారము. 4.

క్రీడాద్యూతుఁడు. సం. వి.అ. పుం. ఖరీఖలుఁడు. పందెమువేసి యాడెడువాఁడు: చూ, పందెకాఁడు.

క్రీడాభిరామము. పా. ఈ గ్రంథమునకు కర్త వల్లభరాయకవి (15 శతాబ్ది)

క్రీడారత్నము. సం. వి. అ. న. 1. రతి (మహా సుఖమునిచ్చు సంభోగము): చూ, రతిబంధము; 2. కూడిక: చూ, సంయోగము.

క్రీడారథుఁడు. సం. వి. అ. పుం. క్రీడార్థరథుఁడు.

క్రీడాస్థానము. సం. వి. అ.న. చూ, నాట్యశాల.

క్రీడి. వై. వి.=కిరీటి. అర్జునుఁడు: చూ, విజయుఁడు. 1.

క్రీడించు. సం. అ. క్రి. ఆట్లాడు: చూ, చేరలాడు.

క్రీడిచెలితేరు. దే. వి. గరుత్మంతుఁడు: చూ, హరివాహనుఁడు, (సాంబ. దేవ. 15.)

క్రీడిత. అం. భావాధ్యాయ ప్రమేయములోని భూచారులు పదునాలుగురిలో నొకఁడు: చూ, భూచారులు.

క్రీతకేశ. సం. వి. ఆ. స్త్రీ. నీలిః: చూ, రంజని.

క్రీతకుఁడు. సం. వి. అ. పుం. తల్లిదండ్రులయొద్ద వెలకుఁగొన్న కొడుకు: చూ, పుత్త్రుఁడు. 1.

క్రీతానుశయము. అం. ధర్మశాస్త్రమునందలి వ్యవహారపదములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, వ్యవహారపదములు.

క్రీతుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, క్రీతకుఁడు; అం. 2. పుత్త్రులు పదునెనిమిదిమందిలో నొకఁడు: చూ, పుత్త్రులు.

క్రీనీరునేల. దే. వి: చూ, రూ-కీనీరునేల.

క్రీవాడ. ద్వ. వి. (క్రిందు + వాడ) పాటిపొలము: చూ, భూమి. 1.

## క్రు

క్రుంకు. దే. వి. రూ-క్రుంకుడు. అస్తమించుట: చూ, అస్తమనము; 2. మునక: చూ, స్నానము. 1; అ. క్రి. 3. చావు. ఉ, హరి.6, ఆ. 180: చూ, మరణించు; 4. అస్తమించు: చూ, నింగివడు; 5. స్నానముచేయు: చూ, నీళ్ళాడు. 2.

క్రుంకుకొండ. దే. వి. సూర్యుఁడు అస్తమించు కొండ: చూ, పర్వతము. (ఇట్లు క్రుంకుమల)

క్రుంకుడు. దే. వి: చూ, రూ- క్రుంకు.

క్రుంకుడుగట్టు. ద్వ. వి. చూ, క్రుంకుకొండ. య. 3, ఆ. 85.

క్రుంగఁబడు. ద్వ. అ. క్రి. (క్రుంగన్ + పడు) 1. రూ-క్రుంగిలు-క్రుంగు. రా. యు, కాం. 651 (స్వార్థమునపడు): చూ. మ్రుంగు; 2. దిగఁబడు: చూ, క్రుక్కు. 4.

క్రుంగిలు. దే. అ. క్రి. —పై—

క్రుంగు. దే. అ. క్రి: చూ, రూ- క్రుంగిలు.

క్రుంచ. సం. వి. ఆ. స్త్రీ. ఒకరకమువీణ: చూ, వీణ.

క్రుంచము. సం. వి. చ్. పుం. 1. = క్రౌంచ. రూ-క్రౌంచము: చూ, బకము; 2. = క్రౌంచ. క్రౌంచపర్వతము: చూ, పర్వతము.

క్రుక్క. దే. వి. 1. మోసము: చూ, వంచన; వా. 2. త్రాళ్లుతెగిన నులకమంచము, "ఈ క్రుక్కలో పరుండుట కష్టము." (రూ, కుక్క.)

క్రుక్కు. దే. స. క్రి. 1. పేలు లోనగువానిఁ జేతిబొటనవ్రేలి గోటితో చిదుపు: చూ, రూ-కుక్కు; 2. అడఁచు. స్వా. 3, ఆ. 97: చూ, పిసుకు. 3; 3. బలవంతమున లోపలవేసి క్రుక్కు. వి. పు. 7, ఆ. 284: చూ, కుఱుగు.

క్రుక్కుడు. దే. వి. క్రుక్కుట.

క్రుచ్చిక. వా. వి. గొప్పుత్రవ్వు పనిముట్లలో నిది యొకటి. క్రుచ్చికతో ముందునుండి వెనుకకు త్రవ్వుదురు. ఇందువలన త్రవ్వినభాగము మరల త్రొక్కివేయఁబడదు. దీనిని లోఁతుగ దింపి కల్పుమొక్కలను వేళ్ళతోనికి దీసి వేయవచ్చును. గాని పని మిగుల నాలస్యమగును. (గొప్పుత్రవ్వు పనిముట్లు—గుద్దలి, గార్ధాలికము, చిన్నగార్ధాలికము త్రొల్లిక, త్రిశూలము, దంతి పండ్లగుద్దలి లోనగునవి): చూ, ముద్గరము.

క్రుధ. సం. వి. ఆ. స్త్రీ. కోపము: చూ, రోషము. (ఇది ధకారాంతమునగు. ఇట్లు క్రుత్-క్రుద్ మొ.)

క్రుద్ధుఁడు. సం. విణ. కోపము నొందినవాఁడు: చూ, రోషణుఁడు.

క్రుమ్మరిలు. దే. అ. క్రి రూ - క్రుమ్మరిల్లు - క్రుమ్మరు, తిరుగు: చూ, సంచరించు.

క్రుమ్మరిల్లు. దే. అ. క్రి. —పై—

క్రిమ్మరు. దే. అ. క్రి: చూ, క్రిమ్మరిల్లు.

క్రిమ్ము. దే. వి. 1. (కొమ్ముల) పొడుపు: చూ, పోటు. 4; స. క్రి. 2. రూ-క్రుమ్ము-కుమ్ము. య. 2. ఆ. 17: చూ, పొడుచు.

క్రిమ్ముడు. దే. వి: చూ, క్రుమ్ము. 1.

క్రిమ్ముడువడు. ద్వ. అ. క్రి. (క్రిమ్ముడు + పడు): చూ, పోటుపడు.

క్రిమ్ములాడు. దే. అ. క్రి. (క్రొమ్ములు + ఆడు) క్రిమ్ముకొని పోట్లాడు. కాశీ. 2, ఆ. 104.

క్రియ్యఁబాఱు. ద్వ. అ. క్రి (క్రియ్యన్ + పాఱు) 1. క్రియ్యి, కృశించు. హరి పూ. 6, ఆ. 144: చూ, సొటసొటవోవు; 2. క్రియ్యి, వెనుకంజవేయు. హరి. పూ. 8, ఆ. 116: చూ, వెనుదీయు. 1.

క్రియ్యి. వై. అ. క్రి.=కృశి. —వై.—

క్రిష్టము. సం. వి. అ. న. 1.=గోడు. ఏడుపు: చూ, దుఃఖము; 2.=గోడు. సద్దు, అలికిడి: చూ, స్వరము. 2.

క్రిల్లగించు. దే. అ. క్రి. రూ- క్రిల్లు-కుల్లు. (మనసులో) దుఃఖించు: చూ, క్రుసుక్కు. 5.

క్రిల్లగింత. దే. వి (మనసులో) దుఃఖించుట: చూ, దుఃఖము.

క్రిల్లు. దే. అ. క్రి: చూ, రూ-కుల్లు. (మనసులో దుఃఖించు -భాగ. 6, స్కం. 509; అవిరయు- భో. 6, ఆ. 150.)

క్రిల్లుపోతు. దే. విశే. క్రుల్లగించు స్వభావము గలవాఁడు: చూ. రూ-కుల్లుపోతు.

## క్రూ.

క్రూరకంద. సం. వి. ఆ. స్త్రీ. కసరుగలకంద, దురదకంద *: చూ, సూరణము

క్రూరకర్మ. సం. వి. న. పుం. కటుతుంబి *: చూ, సొర.

క్రూరకర్ముఁడు. సం. వి. న. పుం. భయంకరమగు పనిచేయువాఁడు: చూ, ఇత్వరుఁడు. 3.

క్రూరత్వకము. సం. వి. అ. పుం. నెరవెంద *: చూ, రాజవృక్షము.

క్రూరగంధ. సం. వి. ఆ. స్త్రీ: చూ, కంథారి*,

క్రూరదృక్కు. సం. విశే. శ. 1. పిసునుఁడు: చూ, హీనుఁడు; పుం. 2. శని: చూ, రాహువు. 2.

క్రూరదృష్టి. సం. వి. ఇ. పుం. అంగారకుఁడు: చూ, రాహువు. 2.

క్రూరధూర్తము. సం. వి. అ. పుం. ఉమ్మెత్త *: చూ, హాలాపువ్వము.

క్రూరము. సం. వి. అ. పుం. 1. నెరవంజి *: చూ, సరవెంద; 2. భ్రాగము*: చూ, పోఁక; 3. గుగ్గిలము *: చూ, మహిసాక్షి; 4. ఎఱ్ఱగన్నేరు*: చూ. హయమారకము; 5. డేగ*: చూ, శ్యేనము; 6. రాఁబులుఁగు: చూ, రాబందు; న. 7. భయానకరసము. రసములు తొమ్మిదింటిలో నొకటి; చూ, రసములు; 8. అన్నము: చూ, సాదము (1); విశే. 9. వేఁడిగలది: చూ, వేఁడిమి; 10 నొప్పించునది; 11. భయంకరమైనది: చూ, రౌరవము. 2; 12. గట్టిది: చూ, బెడిదము.

క్రూరరావి. సం. వి. న. పుం. బొంతకాకి: చూ, వాయసము. 1.

క్రూరలోచనుఁడు. సం. వి. అ. పుం. శని: చూ, రాహువు. 2.

క్రూరాకృతి. సం. వి. ఇ. పుం. రావణుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

క్రూరు. దే. విశే. వాఁడి. భార. స్త్రీ. 2, ఆ. 20: చూ, వాలు. 6.

క్రూరుఁడు. సం. వి. అ. పుం. 1. దయలేనివాఁడు, పరపీడానిరతుఁడు (అని కొందఱు): చూ, నిర్దయుఁడు; 2. కఠినుఁడు: చూ,

వ్యాసుఁడు. 2; 3. ఘాతకుఁడు: చూ, హింసకుఁడు; 4 కినుకకాఁడు: చూ, రోషణుఁడు; 5. భయానకరసముగలవాఁడు.

క్రూసిఫరములు సా. ఆవకుటుంబములోనివి.- ఈ జాతిపుష్పములు నాలుగు ఆకర్షణపత్రములను, నాలుగు రక్షకపత్రములను గలిగి క్రాస్ వలె నుండును. (చూ, ఆవ; చూ, సర్షపము.) కాయలలో రెండఱలుండును. (ఇందు ఆవ, కాబేజీ, ముల్లంగిచేరును.)

## క్రె

క్రెడిటరు. ఆం. వి. ఋణప్రదాత.

## క్రే

క్రే. దే. విణ. వృత్తియందు క్రేవ శబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (ఉదా — క్రేఁగన్ను-క్రేఁగయి మొ.)

క్రేంకృతము. సం. వి. అ. న. 1. హంసధ్వని: చూ, స్వరము. 2; 2 కొంగధ్వని: చూ, స్వరము. 2.

క్రేఁటు. దే. అ. క్రి. 1. రూ-క్రేఁటుకొను-క్రేణించు గొంతడుపుతీయుటకు పకిలించునట్లు శబ్దించు: చూ, శబ్దించు; 2. తొట్రుపడు: చూ, సంభ్రమించు.

క్రేఁటుకొను. దే. అ. క్రి. -పై- (శబ్దించు.- స్వా. 8, ఆ. 92. స్వార్థమునకొను.)

క్రేఁగన్ను. దే. వి. (క్రేవ + కన్ను) కడకన్ను, కటాక్షము: చూ, నేత్రము. 1.

క్రేఁగయి. ద్వ. వి. (క్రేవ + కయి) 1. హస్తాగ్రము. అచ్చ. యు, కాం. 18: చూ, హస్తము; 2. వామహస్తము: చూ, పుఱ్ఱచెయి. (చూ, హస్తము.)

క్రేడి. దే. వి. సంబావుతోఁగలసిన కాయలోనగు ఎఱ్ఱవడ్లు: చూ, ధాన్యము.

క్రేడించు. దే. అ. క్రి. 1. తొలఁగు. భార. ద్రో. 1, ఆ. 374: చూ. విరియు. 5; స. క్రి. 2 అలక్ష్యముచేయు. భాగ. భీష్మ. 2, ఆ. 38: చూ, రూ-కేడించు. 2

క్రేడిసేయు. దే. స. క్రి. (క్రేడి + చేయు) రూ-క్రేణిసేయు. పరిహాసముచేయు. జై. 5, ఆ. 42: చూ, వెక్కిరించు.

క్రేణి. దే. వి 1. ఉన్నతపదము. కవిక. 2, ఆ. 19; 2. ఎగతాళి. వసు. 1 ఆ 68: చూ, పరిహాసము.

క్రేణించు. దే. స. క్రి. అలక్ష్యముచేయు. రామా.1, ఆ.188. (రూ-కేడించు-క్రేడించు.)

క్రేణిసేయు. దే. స. క్రి. (క్రేణి + చేయు); చూ, రూ-క్రేడిసేయు- క్రేడించు. భార. విరా. 1, ఆ. 234.

క్రేతొట్టు. దే. అ. క్రి: చూ. గట్టొరయు. “వ. క్రేతొట్టుకడల్లకైవడిఁ గలయబెరయు.” ఉ, హరి 2, ఆ. 64.

క్రేపు. దే వి. 1. (పర్వత) శిఖరము. “గిరిక్రేపులు మూఁపులు.” స్వా. 8, ఆ. 6: చూ, శిఖరము; 2. దూడ. “క. క్రేపులరూపముల నేఁజరించెదనను చుక్.” భాగ. 10, స్కం. పూ. 510: (చూ, వత్సము. 2.) చూ, ధేనువు.

క్రేయో. దే. వి. వెడలఁగొట్టుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

క్రేవ. దే. వి. వైపు: చూ, పార్శ్వము. 2. (వృత్తియందంత్యవర్ణలోపము. చూ, క్రే.)

క్రేవు. దే. వి. సింహనాదమునందగు ధ్వన్యనుకరణము. అని. 4, ఆ. 46: చూ, హూహూ.

క్రేళ్లు. దే. వి. బ. ఉన్నతి; రా. యు, కాం. 2280: చూ, పొడవు. 2.

క్రేళ్లుదాఁటు. దే. అ. క్రి. 1. రూ-క్రేళ్లుఱుకు-క్రేళ్లువాఱు. ఎగిరిపడు: చూ. లంఘించు; 2. గంతులిడు. స్వా 2, ఆ.7: చూ, లంఘించు.

క్రేళ్లుబ్బు. దే. అ. క్రి. (క్రేళ్లు + ఉబ్బు) అతిశయించు. కా.5, ఆ. 102: చూ, ముష్మరించు.

క్రేళ్లుఱుకు. దే అ. క్రి. (క్రేళ్లు + ఉఱుకు) 1. ఎగిరిపడు: చూ, లంఘించు; 2 గంతులిడు. కళా.7 ఆ. 72: చూ, లంఘించు; 3 దూఁకు; హరి. పూ. 7, ఆ. 105: చూ, లంఘించు.

క్రేళ్లువాఱు. దే. అ. క్రి. (క్రేళ్లు + పాఱు) గంతులిడు; భార. భీష్మ. 2, ఆ. 70: చూ, లంఘించు.

## క్రై

క్రైలు. దే. వి. రూ- క్రైలు. ధాన్యమునుతీచి కొలుచుట, ఒబ్బిడి: చూ, నూఱుపు.

క్రైలుదారి. దే.వి. క్రైలుచేయించెడి యధికారి.

క్రైసిస్. ఆం. వి. విషమపరిస్థితి.

క్రైస్తవత్రిపుటి. ఆం. (Christian Trinity) తండ్రి, కుమారుఁడు, పరిశుద్ధాత్మ. క్రైస్తవత్రిపుటియొక్క భావము వైదికమతము నుండియే గ్రహింపఁబడినది: చూ, త్రయము.

క్రైస్తవుఁడు. వా. వి. క్రిస్టియను; క్రైస్తవమతమును స్వీకరించినవాఁడు.

## క్రొ

క్రొ. దే. విశే. వ్యుత్పత్తియందుఁ గ్రొత్తశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (దీనికంటెఁ బరములైన పరుషసరళస్థిరవర్ణములకు ద్విత్వము కలుగును.—క్రొక్కన్ను, క్రొక్కారు, క్రొగ్గండి, క్రొచ్చెలిక. క్రొత్తరఁగ, క్రొత్తలిరు, క్రొత్తావి, క్రొన్ననక్రొన్నలువు. క్రొమ్మరువు. క్రొన్నెత్తురు, క్రొన్నెల. క్రొన్నేయి, క్రొమ్మించు. క్రొమ్మదుగు. క్రొమ్మావి. క్రొమ్మించు, క్రొమ్మిడుఁగుఱు, క్రొమ్ముడి, క్రొమ్మెదడు, క్రొమ్మెఱుఁగు క్రొమ్మొగడ. క్రొమ్మొన, క్రొవ్వలక, క్రొవ్వాఁడి, క్రొవ్విరి, క్రొవ్వెద. క్రొవ్వేఁడి మొ కొన్నిచోట్లఁ దత్సమపదము పరమగునపుడును ద్విత్వము కానఁబడుచున్నది. "సీ. పుష్కలావర్తంబులు లోనుగాఁగల క్రొమ్మేఘములువృష్టి కురియకుండ." భీ. 3, ఆ. 87; కొన్నియెడల పరుషములు పరములగునపుడు దీనికి నుమాగమము వచ్చును. క్రొంజాయ, క్రొంజెమట, క్రొందమ్మి, క్రొఁదలిరు, క్రొంబాట, క్రొంబదను, క్రొంబసిఁడి, క్రొంబసిమి. క్రొంబుట్టము, క్రొంబువ్వు. క్రొంబొగ, క్రొంబొగడ మొ) కొన్నిచోట్లఁ దత్సమపదములు పరమగునపుడును నుమాగమము కానంబడియెడి. ఉదా.- క్రొంబులకలు మొ.) (శ. ర.)

క్రొంకి. దే. వి: చూ, రూ-కొంకి.

క్రొంచె: వై. వి.=క్రౌంచః: చూ, రూ-కొంచె.

క్రొంజిగురుటలవిల్కాఁడు. ద్వ. వి. మరుఁడు. ఆం, భా. ప్రి. స్వ. 45: చూ, మన్మథుఁడు.

క్రొక్కారము. దే. వి: చూ. కోడికూఁత.

క్రొత్త దే. విశే. 1. నవీనము. కాశీ. 1, ఆ. 39: చూ, నూతనము; 2. అపూర్వము. కళా. 6. ఆ.9: అపురూపము,అబ్బురము. రూ-అబ్రము, అరుదు, (సం.ప):—అనిదంపూర్వము, అపూర్వము. (వ్యుత్పత్తియందు అంత్యవర్ణలోపము: చూ, క్రొ.)

క్రొత్తడము. దే. వి: చూ, రూ-కొత్తడము. య. 1, ఆ. 8.

క్రొత్తడి దే. వి. రూ-గొత్తడి-కొత్తడి. 1. మగనాలు. భార. ఉద్యో. 3, ఆ. 187: చూ, స్త్రీ; 2. పతివ్రత: చూ, స్త్రీ.

క్రొత్తముట్టు. దే.వి. 1.వడుకు నారంభించినప్పుడు ఏకునునుండి పురిలేక చేఁగఁదీసి కదురునకంటించెడు నూలు. భార. విరా. 1, ఆ. 95: చూ, నూలుపోఁగుతుకు; 2. ప్రథమార్తవము, సమరత: చూ, ముట్టు. 1.

క్రొత్తవాఁడు. దే. వి: చూ, నూతనుఁడు.

క్రొత్తళము. దే. వి: చూ, రూ-క్రొత్తడము.

క్రొన్ననవిలుకానితండ్రి. దే. వి. వెన్నుఁడు. అం, భా. ప్ర. స్వ. 38: చూ, విష్ణువు. 1.

క్రొన్నెలలు. దే. వి. బ. కపోలోరుకటోపరి ప్రదేశములయందలి నఖక్షతములు: చూ, నఖక్షతము.

క్రొమ్మి. వై. వి. = కురువక-కురవక. ఎఱ్ఱగోరంట*. అం, భా. ద్వి. వ. 53: చూ, మహాసహా.

క్రొమ్ముడి. దే. వి. కేశబంధవిశేషము: చూ, వేనలి.

క్రొవ్విదము. దే. వి. (క్రొవ్వు + ఇదము) 1. దుష్కార్యము: చూ, వ్యాపారము. 1; 2. పరుషము. లక్ష్మి. 3. ఆ. 75: చూ, పరుషము.

క్రొవ్వు. దే. వి. 1. గరువము: చూ, హంకారము; 2. కడుపులో బొడ్డుక్రిందనుండెడి యుల్లిపొరవంటి క్రొవ్వు: చూ, వప. 1; 3. మస్తిష్కము: చూ, మెదడు; 4. కావరము: చూ, మదము. 1; 5. బలము: చూ, శక్తి. 1; వా. 6. పొల: చూ, మాంసము; 7. కందరములలోని చేమురు: చూ, తైలము; అ. క్రి. 8. పొంగరించు: చూ, మదించు.

క్రొవ్వుగొను. దే. అ. క్రి. (క్రొవ్వు+కొను) పొంగరించు. హరి. పూ. 9, ఆ. 72: చూ, మదించు.

క్రొవ్వులు. పా. ఇవి కర్బనము, ఉదజని, అమ్లజని అను మూఁడింటి సంయోగముచేత నేర్పడు పదార్థములేగాని యింకు ఉదజని పరమాణువులు అమ్లజనిపరమాణువుల కంటె రెట్టింపున కెక్కువగానుండును. నేయి నూనె జంతుశరీరమునందలి క్రొవ్వులు. ఇవి క్రొవ్వు పదార్థముల కుదాహరణములు. (ఫేట్సు.)

క్రొవ్వెద. దే. వి. కొప్పు: చూ, వేనలి.

క్రొవ్వొత్తి. వా.వి.రూ-కొవ్వొత్తి. క్రొవ్వుతోఁ జేయఁబడిన కడ్డీవంటి దీపపువత్తి: చూ, వత్తి.

## క్రో

క్రోఁతి. దే. వి: చూ, రూ-కోఁతి. రా. యు, కాం. 376.

క్రోడకన్య. సం. వి. ఆ. స్త్రీ. వారాహీకంద*: చూ, నూరణము.

క్రోడచూడ. సం. వి. ఆ. స్త్రీ. మహాశ్రావణిక *: చూ, బోడతరము.

క్రోడపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. కంటకారిక *: చూ, వాఁకుడు.

క్రోడపాదము. సం. వి. అ. పుం. కమఠము: చూ, తాఁబేలు.

క్రోడము. సం. వి. అ. న, ఆ. స్త్రీ. 1. ఒడి, తొడపైభాగము: చూ, తొడ; 2. ఱొమ్ము, రెండుభుజముల నడిమిభాగము (అని కొందఱు): చూ, వక్షము; అ. పుం. 3. పంది: చూ, సూకరము; 4. ఏనుఁగు: చూ, హస్తి; 5. ఉదకము: చూ, సలిలము; 6. శని: చూ, రాహువు. 2.

క్రోడాంఘ్రి. సం. వి. ఇ. పుం: చూ, క్రోడపాదము.

క్రోడాడు. దే. అ. క్రి. దుమ్మెత్తిచల్లు. (రూ-కోరాడు-కోరు.)

క్రోడాయుధము. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

క్రోడి. సం. వి. ఈ. స్త్రీ: చూ, క్రోడకన్య *
క్రోడీకరణము. సం. వి. అ. న. 1. ఆలింగనము: చూ, సంశ్లేషము; 2. క్రోడీకరించుట.
క్రోడీకరించు. సం స. క్రి. ఒకటిగాచేర్చు.
క్రోడీకృతి. సం. వి. ఇ. స్త్రీ: చూ, క్రోడీకరణము.
క్రోడీముఖము. సం. వి. అ. పుం. పిల్లచేప: చూ, మత్స్యము. 1.
క్రోడుఁడు. సం. వి. అ. పుం. 1. శని: చూ, రాహువు. 2; 2. ముక్కంటి: చూ, శివుఁడు:
క్రోధము. సం. వి. అ. పుం. 1. త్రుంచఁబడినది. చూ, త్రుటితము; 2. నేత్రభేదము: చూ నేత్రము. 1.
క్రోధుఁడు. సం. వి. అ. పుం. మరుఁడు: చూ, మన్మథుఁడు.
క్రోధజము. సం. వి. అ. పుం. మోహము; చూ. వలపు. 2.
క్రోధజములు. అం. వాక్పారుష్యము, దండపరుషము. (2)
క్రోధన. సం. వి. అ. స్త్రీ. 1. ఎద్దునాలుక *: చూ, బెండ; 2. కొండబెండ *: చూ, వడ్రింధ; 3. కోపవతి: చూ. స్త్రీ; అం. 4. సంవత్సరములు అఱువదింటిలో నొకటి: చూ, సంవత్సరములు.
క్రోధనుఁడు. సం. విణ: చూ, రోషణుఁడు.
క్రోధము. సం. వి. అ. పుం. 1. రూ-క్రుత్తు-కృధము. కోపము: చూ, రోషము; 2. ఎనుపోతు: చూ, మహిషము; అం. 3. రసస్థాయీభావములు తొమ్మిదింటిలో నొకటి: చూ .రసస్థాయీభావములు. (రోషము); 4. శ్రుతులు ఇరువదింటిలో నొకటి: చూ, శ్రుతులు; (క్రోధ అని కొందఱు); 5. అరివర్గములు ఆఱింటిలో నొకటి: చూ, అరివర్గములు.
క్రోధమూర్ఛితము. సం. వి. అ. పుం. చోరమను గంధద్రవ్యము: చూ, రాజార్హము.
క్రోధమూర్ఛితుఁడు. సం. విణ. ఎక్కువకోపము గలవాఁడు: చూ, రోషణుఁడు.
క్రోధయుక్తుఁడు. సం. విణ. —వై.—
క్రోధి. సం. వి. న్. పుం. 1. సంవత్సరములు అఱువదింటిలో నొకటి: చూ,సంవత్సరములు; విణ. పుం. 2. కోపము గలవాఁడు: చూ, రోషణుఁడు.
క్రోధించు. సం. అ క్రి. కోపగిల్లు: చూ, రోషించు.
క్రోధుఁడు. సం. వి. అ. పుం. క్రోధుఁడను ఒక రాజు: చూ, రాజు. 1.
క్రోయు. దే. స. క్రి. విషము గాచోఁచు. "నాలుకలు క్రోయు మహోరగరాజముగ్గ ముం జేరి." భార. అర. 6. ఆ. 178.
క్రోరు. అం.వి.కోటి,నూఱులక్షలు.(1,00 00,000)
క్రోల. దే. వి: చూ, కోవి. 1.
క్రోలు. దే. వి. 1. క్రోల ఆము. 3, ఆ. 20: చూ, కోవి. 1; 2. తామరనాళము: చూ, బిసము. 1; స. క్రి. 3. తిను స్వా. 3, ఆ.51. చూ, సాపడు; 4. పానముచేయు. హరి. పూ. 5, ఆ. 196: చూ, త్రాగు; 5.గ్రహించు: భార. విరా. 2, ఆ. 35. (రూ-కొఱలు): చూ, పుచ్చుకొను; 6. అనుభవించు. హరి. ఉ. 7, ఆ. 204: చూ, భుజించు. 2.
క్రోలుకసవు. ద్వ. వి. నడము, కిక్కసకసవు*: చూ, తృణము.
క్రోలుగచ్చ. దే. వి: చూ, రూ-క్రొలుగచ్చ *.
క్రోలుచు. దే. అ. క్రి. రూ-క్రోల్చు. కూయు: చూ, శబ్దించు (పే. క్రోలఁజేయు.-లక్ష్మీ.1, ఆ. 17.)
క్రోలెముక. దే. వి: చూ, రూ-కోలెముక.
క్రోల్చు. దే. అ. క్రి: చూ, రూ-క్రోలుచు.
క్రోవ. దే. వి. 1. సరము. రామా. 7, ఆ. 140: చూ, భూషణము. 2; 2. దర్పామయము. అం, భా. ద్వి. 128.

క్రోవి. దే. వి. 1. తామరనాళము: చూ, బిసము. 1; 2. సస్యాదినాళము: చూ, నాళము. 5; వై. వి. 3. =కురవక. ఎఱ్ఱగోరంట* భార. ఆది. 4. ఆ. 20: చూ, మహాసహ; దే. వి. 4. ఊఁదు గోవి: చూ, గొట్టము; 5. ఆసుపోసెడిగొట్టము. హంస. 2, ఆ. 11; 6. తుపాకి, అగ్ని ప్రసరణాయుధము: చూ, బాణము. 1; 7. బుడ్డి. నీలా. 3, ఆ. 90: చూ, పాత్రము. 6; 8 భూమిలోపల నీళ్లువచ్చుట కేర్పఱచిన దారి, భార. అగ. 4. ఆ. 332; 9. మూష. కళా. 8, ఆ. 9: చూ, మూస.

క్రోశతాలము. సం. వి. అ. పుం. ఢక్క: చూ, వీణె.

క్రోశధ్వని. సం. వి. ఇ. పుం. —వై.—

క్రోశద్వయము. సం. వి. అ. న. రెండుకోసులు: చూ, పరువు. 2.

క్రోశము. సం. వి. అ. పుం = కోసు: చూ, కోసు.

క్రోశయుగము. సం. వి. అ. న: చూ, క్రోశద్వయము.

క్రోష్ట. సం. వి. ఋ. పుం. నక్క: చూ, సృగాలము.

క్రోష్టము. సం. వి. అ. పుం. న. గెనుసు *: చూ, గెనుసుసుంప.

క్రోష్టుకమేఖల. సం. వి అ. స్త్రీ. కోలపొన్న *: చూ, పృశ్నిపర్ణి.

క్రోష్టుపుచ్ఛి సం. వి. ఇ. స్త్రీ. -వై.-

క్రోష్టుపుచ్ఛిక. సం. వి. ఆ. స్త్రీ. 1. -వై.- 2. తుదగ్రుపవిశేషము: చూ, గోలామిక.

క్రోష్టుఫలము. సం. వి. అ. పుం. గార *: చూ, హింగుది.

క్రోష్టువిన్న. సం. వి. ఆ. స్త్రీ. నక్కతోఁక పొన్న *: చూ, సృగాలవిన్న.

క్రోష్టువు. సం. వి. ఉ. పుం. నక్క: చూ, సృగాలము.

క్రోష్టేక్షువు. సం. వి. ఉ. పుం. తెల్లచెఱకు *: చూ, రసాలము. 8.

క్రోష్ట్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడునక్క, రూ-క్రోష్ట్రీ: చూ, సృగాలము; 2. తెల్లనేలగుమ్ముడు *: చూ, భూమికర్కారువు; 3. లాంగలి *: (లాంగలిశబ్దమునకు తతిగొట్టము, నీరుపిప్పలియు నర్థములు): చూ, హాలిని.

క్రోష్ఠి. సం. వి ఈ. స్త్రీ. నల్లనేలగుమ్ముడు*: చూ, భూమికర్కారువు.

## క్రౌ

క్రౌంచదారణుఁడు. సం. వి. అ. పుం. గుహుఁడు, కుమారస్వామి: చూ, స్కందుఁడు.

క్రౌంచపదము. పా. ఒకానొక వృత్తము. ఇది యొక్కొక్క పాదమునందు భ, మ, స, భ, న, న, న, య గణములు గలిగి పదునొకటవయింటను యతిగల ఇరువదినాలుగవ ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా.- "హాంచితలీలన్యంకరనంది-ప్రకటితవిరతులు-భమసభనానన్యల్, క్రౌంచపదీవృత్తమ్మనఁ జెన్నారఁగఁ బలుకుదురిలఁ-గవివరులెల్లన్." : చూ, వృత్తము. 1.

క్రౌంచము. సం. వి. అ. పుం. = క్రౌంచే. 1. క్రౌంచమను కొండ. రూ-కౌంచము: చూ, పర్వతము. 1; 2. క్రౌంచమను ద్వీపము: చూ, లంక. 1; 3. క్రౌంచమనుపక్షి: చూ, బకము; అం. 4. ద్వీపములు ఏడింటిలో నొకటి: చూ, ద్వీపములు; 5. ఆసనములు ముప్పదింటిలో నొకటి: చూ, ఆసనములు; 6. ఒకానొక వ్యూహము.

క్రౌంచాదనము. సం. వి. అ. న. 1. మృణాలము: చూ, బిసము. 1; 2. చించోటకమను తృణము: చూ, తృణము. 1; 3. పిప్పలీమూలము*: చూ, పిప్పలి. 1.

క్రౌంచాదని. సం. వి. ఈ. స్త్రీ. పద్మబీజము: చూ, పద్మము. 1.

క్రౌంచానుజము. సం. వి. అ. పుం. మైనాక పర్వతము: చూ, పర్వతము.

క్రౌంచారాతి. సం. వి. ఇ. పుం: చూ, క్రౌంచదారణుఁడు.

క్రౌంచారి. సం.వి. ఇ. పుం. 1. -పై.- 2. కార్తవీర్యరిపువు: చూ, పరశురాముఁడు.

క్రౌంచాస్త్రము. అం. అస్త్రములు ఏఁబది మూఁడింటిలో నొకటి: చూ, అస్త్రములు.

క్రౌను. ఆం. వి. 1. కొలతలోభేదము. (ఇట్లు క్రౌను పై్రస్, క్రౌను పేపరు మొ.); వా. వి. 2. 2½ షిల్లింగులు (రు 2-0-0 విలువగల నాణెము.)

క్రౌర్యము. సం. వి. అ. న. క్రూరభావము.

## క్ల

క్లమథము. సం. వి. అ. పుం. (పుష్పాదులు) వాడుట: చూ, మ్లాని.

క్లమము. సం. వి. అ. పుం. 1.-పై.-; 2. బడలిక: చూ, శ్రమము. 1.

## క్లా

క్లాంతము. సం. విణ. బడలినది.

క్లాంతి. సం. వి. ఇ. స్త్రీ: చూ, క్లమథము,

## క్లి

క్లితకము. సం. వి. అ. న. రూ-క్లీతకము. అతిమధురము*: చూ. యష్టిమధుకము.

క్లితకిక. సం. వి. ఆ. స్త్రీ. రూ-క్లీతకిక. నీలి*: చూ, రంజని.

క్లిన్నము. సం. వి. 1. ఆర్ద్రిత: చూ, పదను. 2; విణ. 2. తడిసినది: చూ, నోదము.

క్లిశితము. సం. విణ. దారిద్ర్యాదులచేత క్లేశము నొందినది: చూ, దుఃఖితము.

క్లిష్టము. సం. వి. అ. న. 1. ఒకానొక శబ్దదోషము. పదదోషములు పదునేడింటిలో నొకటి: చూ, పదదోషములు. క్లిష్టము అనఁగా.— దూరమైన యర్థముకలది. ఉదా.— పవనాశనేంద్రధరమకుటాలంకారమణి జనకపుత్రీరమణ కుమారరూపదీపితుఁడు. (మన్మథుఁడని చెప్పుట కింతదూరము చెప్పుట దోషము) దీనినే క్లేష్టము అందురు: (చూ, ఉపన్యాస దర్పణము 228 పొరట); విణ: చూ, క్లిశితము; 3. పూర్వోత్తరవిరుద్ధమైనది. (వాక్య-): చూ, వ్యాఖ్యాతము. 2.

క్లిష్టుఁడు. సం. వి. ఇ. క్లేశితుఁడు: చూ, దుఃఖితుఁడు.

## క్లీ

క్లీ. సం. వి. న్. పుం. నపుంసకుఁడు: చూ, షండుఁడు.

క్లీతకము. సం. వి. అ న: చూ, రూ-క్లితకము.

క్లీతకిక. సం. వి. ఆ. స్త్రీ. చూ, రూ-క్లితకిక.

క్లీబని. సం. వి. ఈ. స్త్రీ. అంబుదఫలి*: చూ, మూలుగు. 2.

క్లీబము. సం. వి. అ. న. 1. నపుంసకము: చూ, షండము; విణ. 2. విక్రమములేనిది.

క్లీబుఁడు. సం. వి. అ. పుం. నపుంసకుఁడు: చూ, షండుఁడు.

క్లీవుఁడు. సం. వి. అ. పుం. 1.—పై.—; 2. పౌరుషహీనుఁడు.

## క్లే

క్లేదము. సం. వి. అ. న. తడి: చూ, పదను. 2.

క్లేదుఁడు. సం. వి. అ. పుం: చూ, హిమాంశువు.

క్లేదువు. సం. వి. ఉ. పుం. 1. —పై.—: 2. జన్ని: చూ, సన్నిపాతము. 1.

క్లేశము. సం. వి. అ. పుం. 1 వగ: చూ, దుఃఖము; 2. కోపము: చూ, రోషము; 3. కృషి: చూ, వ్యవసాయము.

క్లేశితము. సం. విణ: చూ, క్లిశితము.

## క్లై

క్లైమాక్సునాఁగలి. వా.వి. ఇదియొక రకము ఇనుప నాఁగలి. (ఇందలి భాగములు:— తల్లి కోలు, కఱ్ఱు, చెక్కకోలు, దూలము, మేళ్లు.పిడులు, చక్రము, చక్రిధ్వజము.అడ్డుకక్లైము, నిలువు కక్లైము): చూ, లాంగలము. 1. (దీని వెల రు 22-8-0 లు.)

## క్లో

క్లోమము. సం. వి. న్. న. 1. కడుపులో నొక ప్రక్కనుండెడి యెఱ్ఱని మాంసము: చూ, మాంసము; 2. ఉచ్చబుడ్డ: చూ, మూత్రకోశము.

## క్వ

క్వ. సం. అవ్య. ఎక్కడ: చూ, యత్ర. 1.

క్వంగువు. సం. వి. ఉ. పుం: చూ, రూ-కంగువు.

క్వణనము. సం. వి. అ. పుం. 1. వీణ లోనగు వాని మ్రోఁత: చూ, స్వరము. 2; 2. చిన్న కుండ: చూ, భాండము 3.

క్వణము. సం. వి. అ. పుం.—పై.— (నపుంసకమని కొందఱు) (రూ-క్వాణము.)

క్వథితము. సం. విణ. చక్కఁగా కాఁగినది: చూ, బృంగుడు. 1.

క్వయినా-క్వైనా. ఆం. వి. ఇది మలేరియా జ్వరములకు పరమౌషధము.

## క్వా

క్వాణము. సం. వి. అ.పుం. చూ, రూ-క్వణము.

క్వాథము. సం. వి అ. పుం. 1. బాధ: చూ, దుఃఖము; 2. వృత్తురసము.

క్వాథోద్భవము. సం. వి. అ. న. తుత్థాంజనము, మ్రానిపసుపునవండిన అంజనవిశేషము: చూ, రసాంజనము.

## క్వి

క్విటిరెంటు. వా. వి. ఈనాముల (మాన్యముల) మీఁద వేయఁబడిన పన్ను. (రూ-క్విట్రెంటు. (ఆంగ్లపదమువాడుకపదమయ్యె.)

క్విట్రెంటు. వా. వి.—పై.— "క్విట్రెంటు యీనాము."

## క్ష

క్ష. సం. వి. అ. పుం. 1. అడ్డగించుట: చూ, నిరోధము. 1; 2. పగ: చూ, విరోధము. 1; 3. క్షేమము: చూ, శుభము 1; 4. దుస్స్వప్నము: చూ, స్వప్నము: 2; 5. క్షత్రియుఁడు: చూ, రాజు. 1; 6. రక్కసుఁడు: చూ, రాక్షసుఁ

డు. 1; 7 నరసింహస్వామి. చూ, నరసింహుఁడు; 8. అరొమ్ము: చూ, వక్షము; 9. వ్యాకరణశాస్త్రము; చూ, వ్యాకరణము; 10. ఓరుపు. (స్త్రీలింగమనికొందఱు): చూ, శాంతము. 1; 11. పుడమి, పంటభూమి (అని కొందఱు): చూ, భూమి. 1; 12. కల్పము: చూ, సంవర్తము 1; 13. మెఱుపు: చూ, విద్యుత్తు. 1; 14. నాశము: చూ, రుత్తు; స్త్రీ. 15. నిద్ర: చూ, స్వప్నము. 2.

క్షమ్. సం. వి. అ. న. 1. క్షేత్రము: చూ, భూమి. 1; 2. చెట్టు: చూ, వృక్షము.

క్షంత. సం. విణ. (ఋ. ఈ. ఋ.) ఓర్పరి: చూ, సహనుఁడు.

క్షణంక్షణము. సం. వి. అ. పుం. వెంటవెంటనే, అప్పటికప్పుడు.

క్షణకము. సం. వి. అ. న. పిన్నముల్లంగి*: చూ, ముల్లంగి.

క్షణతువు. సం. వి. ఉ. పుం. గాయము: చూ, నఱుకు.

క్షణద. సం వి. ఆ. స్త్రీ. 1. రేయి: చూ, రాత్రి; 2. పసుపురంగు: చూ, వర్ణము. 6.

క్షణదము సం వి. అ. న. ఉదకము: చూ, సలిలము.

క్షణదుఁడు. సం. వి. అ. పుం, జోస్యుఁడు: చూ, సాంవత్సరుఁడు.

క్షణనము. సం. వి. అ. న. కోల: చూ, వధము.

క్షణనిశ్వాసము. సం. వి. అ. పుం. శిశుమారమను జలజంతువు: చూ. మత్స్యము. 1.

క్షణప్రభ. సం. వి. ఆ. స్త్రీ. రూ-క్షణిక, మెఱుపు: చూ, విద్యుత్తు. 1.

క్షణభంగురము. సం. వి. ఆ. స్త్రీ. క్షణమైన నుండనేరనిది. అచిరము, అనిత్యము, అనూర్జితము, అశాశ్వతము.

క్షణము. సం. వి. అ. పుం. 1. ఘటికయందాఱవపాలు (ఘటిక=24 నిమిషములు), నాలుగు నిమిషములు, ముప్పదికలలుగల కాలము: చూ, కాలపరిమాణము; 2 తిరునాళ్ల: చూ, పండుగ: 2; 3 వ్యాపారములేమి; 4. కాలము: చూ, సమయము. 1; 5. పరమాణువు: చూ. రేణువు. 1; 6. ఇల్లు: చూ, సదనము. 1; 7. సంరక్షణము; చూ, రక్షణము; 8. మృదుత్వము: చూ, సుకుమారము; 9 క్షణికము: చూ, వ్రేల్పుడి; అం. 10. కాలప్రమాణములు పంద్రెండింటిలో నొకటి: చూ, కాలపరిమాణము.

క్షణించు. సం. స. క్రి. భోజనార్థము వరించు: రూ-క్షణియించు.

క్షణిక. సం. వి. ఆ. స్త్రీ. మెఱుపు: చూ, విద్యుత్తు. 1.

క్షణికము. సం. విణ. 1. క్షణమాత్రస్థాయి: చూ, స్వరము. 2; వా. 2. కొప్పపాటు కాలము: చూ, వ్రేల్పుడి

క్షణిని. సం. వి. ఈ. స్త్రీ. రేయి: చూ, రాత్రి.

క్షణియించు సం. స. క్రి: చూ, రూ-క్షణించు.

క్షణుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకరికి లోఁబడినవాఁడు: చూ, పరాధీనుఁడు; 2. వ్యాపారములేనివాఁడు; 3. అంబేద: చూ, నిష్ప్రయోజకుఁడు.

క్షతఘ్నము. సం. వి. అ. పుం. 1 లాక్ష: చూ, లక్క; 2. లాక్షారసము: చూ, లక్క.

క్షతఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. లాక్ష, చూ లక్క.

క్షతజము. సం. వి. అ. న. 1. నెత్తురు: చూ, రక్తము. 1; 2. చీము: చూ, రక్తము. 1.

క్షతము. సం. వి. ణ. 1. గాయమునొందినది; 2. నాశమునొందినది; చూ, కుచి.

క్షమవిధ్వంసి. సం. వి. న్. పుం. బౌద్ధి*: చూ, వృద్ధదారకము.

క్షతహారము. సం. వి. అ. న. అగురు: చూ. రాజార్హము.

క్షతి. సం. వి. ఇ. స్త్రీ. 1. గాయము: చూ, నరుసు; 2. నాశము: చూ, రుత్త

క్షత్త. సం. వి. ఋ. పుం. 1. శూద్ర స్త్రీయందు క్షత్త్రియునికిఁ బుట్టినవాఁడు. క్షత్త్రియ స్త్రీయందు శూద్రునికిఁ బుట్టినవాఁడు (అని పాఠాంతరము): చూ, పుత్త్రుఁడు. 1; 2. దాసీపుత్త్రుఁడు: చూ, పుత్త్రుఁడు. 1; 2. ద్వారపాలకుఁడు: చూ, ప్రతిహారుఁడు; 4. నలువ: చూ, బ్రహ్మ. 1; 5. తేరుపూన్పరి: చూ, సారథి; 6. మఱఁదివలనఁబుట్టినసంతానోత్పత్తి; 7. చేఁప: చూ, మత్స్యము. 1.

క్షత్త్రదూతి. సం. వి. ఈ. స్త్రీ. తెల్లవాఁకుడు *: చూ, వాఁకుడు.

క్షత్త్రధనము. సం. వి. అ. పుం. పెద్దచేఁమఆనుగ *: చూ, సాఱ.

క్షత్త్రబంధువు. సం. వి. ఉ. పుం. స్వధర్మము లేక క్షత్త్రియునకు బంధుమాత్రుఁడైనవాఁడు (ఇది నిందయందు వచ్చును): చూ, రాజు. 1.

క్షత్త్రము. సం. వి. అ. న. మేను: చూ, శరీరము.

క్షత్త్రియ. సం. వి. ఆ. స్త్రీ. రాచేడి: చూ, స్త్రీ. (క్షత్త్రియజాతియందుఁ బుట్టి క్షత్త్రియునికి గాని మఱియొకనికి గాని పెండ్లామైనదాని పేరు.)

క్షత్త్రియబ్రాహ్మణులు. పా. ధనుర్వేదమునందతివిశేషప్రజ్ఞగలవారై రాజులను సేవించుచు అధ్యయన యాజనదానములగు త్రికర్మలయందతిఉత్సాహముగలవారే క్షత్త్రియబ్రాహ్మణులు: చూ, బ్రాహ్మణులు. (దశవిధబ్రాహ్మణులలోనివారు.)

క్షత్త్రియాణి. సం. వి. ఈ. స్త్రీ: చూ, క్షత్త్రియ.

క్షత్త్రియారి. సం. వి. ఇ. పుం. క్రౌంచారి: చూ, పరశురాముఁడు.

క్షత్త్రియి. సం వి. ఈ. స్త్రీ. రాచేవాని పెండ్లాము: చూ, భార్య.

క్షత్త్రియుఁడు. సం. వి. అ. పుం. రాచేవాఁడు: చూ, రాజు. 1.

క్షత్తృఁడు. సం. వి. అ. పుం. —పై.—

క్షద్మ. సం. వి. న్. న. అన్నము: చూ, సాదము. (1.)

క్షప. సం. వి. ఆ. స్త్రీ. 1. రేయి: చూ. రాత్రి; 2. పసుపు: చూ వర్ణము. 6.

క్షపణకుఁడు. సం. వి. అ. పుం. బౌద్ధమతస్థుఁడు: చూ, బుద్ధుఁడు. 1.

క్షపణము. సం. వి. అ. న 1. అశుచిభావము: చూ, కార్యభ్రష్టము; విణ. 2 సిగ్గులేనిది: చూ, నిర్లజ్జము.

క్షపణుఁడు సం. వి. అ. పుం: చూ, క్షపణకుఁడు.

క్షపణ్యువు. సం. వి. ఉ. పుం. తప్పు చూ, నేరము.

క్షపాకరుఁడు సం. వి. అ. పుం. చందురుఁడు: చూ, హిమాంశువు.

క్షపాచరుఁడు. సం వి. అ పుం. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

క్షపాటుఁడు. సం. వి. అ. పుం. 1. -పై.-; 2. యమదూత: చూ, యముఁడు.

క్షపాత్యయము. సం. వి. అ. పుం. రూ-క్షపావ్యయము. ప్రభాతము: చూ, వేగుజాము

క్షపాపతి. సం. వి. ఇ. పుం: చూ క్షపాకరుఁడు.

క్షపిత. సం. విణ. ఋ. ఓర్పరి: చూ, సహనుఁడు.

క్షపితము. సం. వి. అ. న: చూ, భాగహారము.

క్షమ. సం. వి. ఆ. స్త్రీ 1. రూ-క్షామ. ఓర్పు; (పుంలింగమని కొందఱు): చూ, శాంతము. 1; 2. నేల: చూ, భూమి. 1; 3. గౌరి: చూ, పార్వతి. 1; 4. రేయి: చూ, రాత్రి; పా. 5. (క్షప) ఒకానొక వృత్తము ఇందొక్కొక్క పాదమున న, న, త, త. గురువులు గలిగి యొనిమిదవయింట యతిగల త్రయోదశ ఛం

దన్నునందుఁ బుట్టిన వృత్తము. ఉదా.—
"క్రమమున నిధవిభ్రాంతిసాతాగయుం. క్షమగ
నుకవిపద్యంబు లూహించినక్, క్షమలనఁ
బరఁగుం- గంజపత్రేణా. సుమశరజనకా శూర
వంశోత్తమా.": చూ. వృత్తము. 1.

క్షమము. సం. విణ. 1. యుక్తము: చూ, సమీచీనము. 1; 2. చాలునది.

క్షమాదంశము. సం. వి. అ. పుం. మునగ*: చూ, శిగ్రువు. 1.

క్షమాపణ. పా. శరణుచొచ్చుట.

క్షమావంతుఁడు. సం. విణ. త్. ఓరుపరి: చూ. సహనుఁడు.

క్షమి. సం. విణ. (న్. ఈ. న్.) —వై.—

క్షమించు. సం. స. క్రి. ఓర్చు: చూ, సహించు.

క్షమిత. సం. విణ. (బు. ఈ. బు): చూ, క్షమి.

క్షమియించు. సం. స. క్రి: చూ, క్షమించు.

క్షముఁడు. సం. విణ. 1. శక్తుఁడు: చూ, లావరి; 2. నేర్పరి: చూ, సమర్థుఁడు; 3. హితవును చెప్పువాఁడు: చూ, హితవరి.

క్షయ. ఆం: చూ, క్షయము. 7

క్షయకరము. సం. వి. అ. పుం. జీడి*: చూ. భల్లాతకి.

క్షయతరువు. సం. వి. ఉ. పుం. పాదిరి*: చూ, స్థాలి. 2.

క్షయథువు. సం. వి ఉ. పుం. కాసరోగము: చూ, దగ్గు.

క్షయము. సం. వి. అ. పుం. 1. —వై.—; 2. అఱుఁదెవులు: చూ, రోగము. 1; 3. రూ-క్షయి. చెడుట, తగ్గుదల: చూ, వెలితి. 2; (క్షయము, స్థానము, వృద్ధి. ఇది యీ త్రివర్గములలో నొకటి: చూ, వర్గము): 4. ప్రళయము: చూ, సంవర్తము. 1; 5. ఇల్లు: చూ, సదనము. 1; 6. నాశనము: చూ, రుత్త; 7. క్షయనామ సంవత్సరము (రూ-క్షయ-అక్షయ): చూ, సంవత్సరము; 8. శత్రువున కంటెఁ దాను దగ్గియుండుట.

క్షయరోగజాతకుఁడు. పా. 1. షష్ఠమమున బుధకుజులుండి శుక్రచంద్రులచేఁ జూడఁబడి పాపగ్రహాంశలయందున్న పుడును, 2. బుధుఁడు కుజయుక్తుఁడై షష్ఠమమందుండి శుక్రచంద్రులచేఁ జూడఁబడుచు క్రూరాంశలయందున్న పుడును, 3. రాహువు షష్ఠమమందును లగ్నాధిపతి అష్టమమందునునుండి చంద్రుఁడు పాపయుక్తుఁడై యుండునపుడును, 4. శని కుజులమధ్యమందుఁజంద్రుఁడును, మకరమందు సూర్యుఁడు నుండునపుడును, 5 లగ్నమునకు అష్టమమందుఁ జంద్రుఁడుండి 6-8 స్థానములలో రాహువుండి, ఆరాహువునకు నెనిమిదింట శనియుండునపుడును, 6. కారకాంశ రాశికి నాల్గవస్థానమునగాని. ఐదవస్థానమున గాని కుజరాహువుల సంబంధముండి చంద్రదృష్టి యున్న పుడును క్షయరోగముండును.

క్షయరోగముచే చనిపోవుజాతకుఁడు. పా. జన్మలగ్న కారకలగ్నములకు తృతీయమునఁ జంద్రసంబంధమున్న క్షయవలన మరణముకలుగును.

క్షయించు. సం. అ. క్రి. క్షీణించు, తగ్గు: చూ, సుక్కు-. 4.

క్షయ్యము. సం. విణ. క్షయింపఁదగినది.

క్షరము. సం. వి. అ. న. 1. ఉదకము: చూ, సలిలము; పుం. 2 మబ్బు: చూ, మేఘము.1; 3. మహాపిండీతకము*: చూ, శ్వసనము; 4. కోకిలాక్షము*: చూ, వెంగలిర.

క్షవకము. సం. వి. అ. పుం. 1. జిల్లేడు*: చూ, జిల్లేడు; 2. ఉత్తరేణి*: చూ, శైఖరికము; 3. రాజిక*: చూ, సర్షపము; 4. అడవి తొలసి*: చూ, తులసి; 5. కొడిసె*: చూ, వత్సకము; 6. మోదెన*: చూ, శిరమల్లి; 7. కాసరోగము: చూ, దగ్గు.

క్షువక్రృత్తు. సం. వి. త్. స్త్రీ. చూ. పోఁక *.

క్షువధువు. సం. వి. ఉ. పుం. 1. క్షుతము; చూ, తుమ్ము; 2. కాళరోగము: చూ, దగ్గు; 3. ఎక్కిలి: చూ, ఎక్కిళ్ళ. 1.

క్షువపత్రి. సం. వి. అ. స్త్రీ. ఏనుఁగు తుమ్మి *: చూ, తుమికి.

క్షువము. సం. వి. అ. పుం. 1. క్షుతము: చూ, తుమ్ము; 2. నల్లనియావాలు: చూ, సర్షపము.

క్షువరము. సం. వి. అ. న. 1. మంగలిపని: చూ, ముండనము; వా. వి. 2 అపజయము. "నీ వ్యాజ్యము క్షువరమైనది." (గోదావరీమండల ప్రాంతమున వాడుక.) (క్షౌరము యొక్క రూపాంతరమని కొందఱు.) (వాడుక)

# క్షా

క్షా. సం. వి. ఆ. స్త్రీ. 1. నిద్ర: చూ, స్వప్నము. 2; 2. ఓరిమి: చూ, శాంతము 1

క్షాంతము. సం. విశే. ఓర్వఁబడిన తిట్టుకొట్టు మొదలైనది: చూ, సోఢము.

క్షాంతి. సం. వి. ఇ. స్త్రీ. ఓర్పు: చూ, శాంతము. 1.

క్షాత్రము. సం. వి. అ. న. క్షత్రధర్మము.

క్షామము. సం. వి. అ. పుం. 1. కఱవు: చూ, దుర్భిక్షము; విశే. 2. తక్కువైనది: చూ, హీనము. 1; అం. 3. జఠరక్రియలు మూఁడింటి లో నొకటి: చూ, జఠరక్రియలు.

క్షామవతి. సం. వి. ఈ. స్త్రీ. యాగవిశేషము: చూ, యజ్ఞము.

క్షామవతీష్టి. సం. వి. ఇ. స్త్రీ. —పై.—

క్షా[illegible]. సం. వి. అ. పుం. బలవంతుఁడగు [illegible]: చూ, లావరి.

క్షారకము. సం. వి. అ. పుం. 1. కసుగాయ: చూ, కేలాటువు. 2; 2. (పక్షులు మత్స్యములు లోనగువానిఁబట్టివేసెడు) బుట్ట: చూ, వల. 1; 3. పసరు మొగ్గ, మొగ్గలగుత్తి (అనికొందఱు): చూ, మొగ్గ. 1; 4. నెరవంజి*: చూ, సర్ప వెంద; న. 5. మూలకము, పెద్దముల్లంగి (అని కొందఱు): చూ, ముల్లంగి.

క్షారణము. సం. వి. అ. న. తిట్టుట: చూ, శాపము. 1.

క్షారతైలము. సం. వి. అ. న. పక్వమైనతైలము: చూ, తైలము.

క్షారత్రయము. సం. వి. అ. న. త్రివిధక్షారములు: చూ, లవణము. 1.

క్షారదళ. సం. వి. అ. స్త్రీ. చూ, లొద్దుగు*.

క్షారదశకము. సం. వి. అ.న. దశవిధక్షారములు: చూ, లవణము. 1.

క్షారద్రావణము. సం. వి. అ.న. మార్దము, చౌటి ఉప్పు: చూ, లవణము. 1.

క్షారద్రువు. సం. వి. ఉ. పుం. 1. కింశుకము*: చూ, మోదుగు; 2. ఘంటాపాటలి*: చూ, మొక్కము.

క్షారభూమి. సం. వి. ఇ. స్త్రీ. చౌటినేల: చూ, భూమి. 1.

క్షారమధ్యము. సం. వి. అ. పుం. ఉత్తరేణి*: చూ, శైఖరికము.

క్షారము. సం. వి. అ పుం. 1. ఉప్పు: చూ, లవణము. 1. 2.=కారము. ఒజ్జు: చూ, కారము. 1; 3. గాజు, గాజుమన్ను: చూ, భూమి. 1; 4. బూడిద: చూ, భస్మము; 5. యవక్షారము; యవలవలన గలిగిన ఉప్పు: చూ, లవణము. 1; 6. వెలిగారము, టంకణము: చూ, లవణము. 1; 7. సజ్జికాక్షారము: చూ, లవణము. 1.

క్షారములు. పా. ఖటికఉదజనితము, సోడియ ఉదజనితము, పొటాసియ ఉదజనితము, మ గ్నఉదజనితము. (అల్కలీస్) (ఉదజనితము గూడ క్షారమనఁ బడుచున్నది.)

క్షారమృత్తిక. సం. వి. అ. స్త్రీ. ఉప్పుమన్ను: చూ, భూమి. 1.

క్షారమేలకము. సం. వి. అ. పుం. సర్వక్షారము: చూ, లవణము. 1.

క్షారవృక్షము. సం. వి. అ. పుం. ముష్కకము*: చూ, మొక్కము.

క్షారశ్రేష్ఠము. సం. వి. అ. న. 1. వజ్రక్షారము: చూ, లవణము. 1; పుం. 2 పలాశము*: చూ, మోదుగు; 3. ముష్కకము*: చూ, మొక్కము.

క్షారషట్కము సం. వి. అ. న. షడ్విధక్షారములు: చూ, లవణము. 1.

క్షారసింధువు. సం. వి. ఉ. పుం. ఉప్పుసముద్రము: చూ, సముద్రము.

క్షారాచ్ఛము. సం. వి. అ. న. సముద్రపుఉప్పు, సైంధవలవణము (అని కొందఱు): చూ, లవణము. 1.

క్షారాబ్ధి. సం. వి. ఇ. పుం: చూ, క్షారసింధువు.

క్షారాయము. సం. వి. అ. పుం. కాలముష్కకము*: చూ, మొక్కము.

క్షారాష్టకము. సం. వి. అ. న. ఎనిమిదివిధముల క్షారములు: చూ, లవణము 1.

క్షారిక. సం. వి. ఆ. స్త్రీ. ఆఁకలి: చూ, బుభుక్ష.

క్షారితము. సం. విణ. కాఁచినది: చూ, స్రుతము.

క్షారితుఁడు. సం. విణ. పరస్త్రీగమనాదిదోషములచే దూఱఁబడినవాఁడు: చూ, వ్యాధుఁడు. 2.

క్షారోదము. సం. వి.అ. పుం: చూ, క్షారాబ్ధి.

క్షావకము. సం. వి. అ. పుం. సెరవంజి*: చూ, సరవొంద.

క్షాళనము. సం. వి. అ. న. కడుగుట: చూ, ప్రక్షాళనము.

క్షాళితము సం. విణ. కడుగఁబడినది: చూ, ప్రక్షాళితము.

## క్షి

క్షి. సం.విణ.ఇ 1. నివాసము: చూ, స్థానము 1; 2 గతి, నడవడి: చూ, వర్తనము. 1; 3. కల్పక్షయము: చూ, సంవర్తము. 1.

క్షితము. సం. విణ. క్షీణము: చూ, హీనము. 1.

క్షితి. సం.వి.ఇ. స్త్రీ 1. నేల: చూ, భూమి 1; 2 ఉనికి: చూ, స్థానము 1. 3. చిటికవేయునంతకాలము: చూ, వేగిర్పుడి; 4. నాశము: చూ, చత్తి; 5. ఇల్లు: చూ, సదనము. 1; 6. సంఖ్యావిశేషము, క్షితియనులెక్క: చూ, సంఖ్య. 1; 7. కాలభేదము: చూ, సమయము. 1; 8. రోచనమను గంధద్రవ్యము: చూ రాజార్హము; అం. 9. కృత్తులు ఇరువదిరెండింటిలో నొకటి: చూ, కృత్తులు.

క్షితికణము. సం. వి. అ. పుం. ధూళి: చూ, రేణువు. 1.

క్షితిక్షమము. సం. వి. అ. పుం. చెండ్ర*: చూ, వెలిచెండ్ర.

క్షితిజము. సం. వి అ. పుం. 1. వేస్తరము: చూ, వేపడము; 2. నేలవేము*: చూ, భూనింబము; 3. మంగళగ్రహము.

క్షితిధరము. సం. వి. అ. పుం. నేలతాలుపు, కొండ: చూ, పర్వతము.

క్షితిపతి. సం. వి. ఇ. పుం. భూమిభుఁడు: చూ, రాజు. 1. (ఇట్లు క్షితిపాలుఁడు, క్షితుభృఁడు మొ.)

క్షితిపుత్రుఁడు. సం. వి. అ. పుం. నరకరాజు: చూ, రాజు. 1.

క్షితిబదరి. సం. వి. ఈ. స్త్రీ. భూబదరిః: చూ, రేఁగు. 1.

క్షితిరుహము. సం. వి. అ. పుం. చెట్టు: చూ, వృక్షము.

క్షితివర్ధనము. సం. వి. అ. పుం. పీనుఁగు: చూ, శవము.

క్షితివ్యుదాసము. సం. వి. అ. పుం. గర్తము: చూ, రంధ్రము. 1.

క్షితిసంభూతము. సం. వి. అ. న. అట్టుప్పు: చూ, లవణము. 1.

క్షితీశ్వరాంకము. అం. షష్ట్యంకములలో నొకటి: చూ, షష్ట్యంకములు.

క్షిత్యాదితి. సం. వి. ఈ. స్త్రీ. విష్ణుమూర్తి తల్లి.

క్షిత్వా. సం. వి. న్. పుం. గాలి: చూ, వాయువు.

క్షిద్రము. సం. వి. అ. పుం. 1. తెగులు: చూ, రోగము. 1; 2. విషాణము, కొమ్ము: చూ, శృంగము. 1.

క్షిద్రుఁడు. సం. వి. అ. పుం. ఇనుఁడు: చూ, సూర్యుఁడు.

క్షిప. సం. వి. అ. స్త్రీ. 1. క్షేపణము: చూ, విమోచనము; 2 రేయి: చూ, రాత్రి.

క్షిపక. సం. వి. అ. స్త్రీ.—1. పై —

క్షిపకుఁడు. సం. వి. అ. పుం. యోద్ధ: చూ, భటుఁడు. 1.

క్షిపణి. సం. వి. ఇ. పుం. 1. అస్త్రము: చూ, బాణము. 1; ఇ. స్త్రీ. 2. నౌకాదండము: చూ, పీలి. 2; 3. జాలవిశేషము: చూ, వల. 1; 4. మంత్రము: చూ, మంత్రము. 1; 5 యజ్ఞమునందు యజుర్వేదతంత్రము నడపువాఁడు: చూ, అధ్వర్యుఁడు.

క్షిపణువు. సం. వి. ఉ. పుం. గాలి: చూ, వాయువు.

క్షిపణ్యువు. సం. వి. ఉ. పుం. 1. వసంతఋతువు: చూ, మాసద్వయము; 2. దేహము: చూ, శరీరము; విణ. 3. సురభి: చూ, రాజార్హము.

క్షిపము. సం. వి. అ. పుం. 1. ఎట్టియూతికోఁత: చూ, వాసరము; 2 క్షేపణము, ప్రేరేపించుట: చూ, విమోచనము.

క్షిప్త. సం. వి. ఆ. స్త్రీ. రాతిరి: చూ, రాత్రి.

క్షిప్తము. సం. విణ. 1. త్రోయఁబడినది: చూ, విద్ధము; 2. వైవఁబడినది, పాఱఁబడ్డది: చూ, స్థాపితము. 1; న. 3. రోగాజితము, లెక్కకలియఁగూడడము: చూ, సంకలనము; అం. 4. జంఘాక్రియలు అయిదింటిలో నొకటి: చూ, జంఘాక్రియలు.

క్షిప్నువు. సం. విణ. ఉ. తిరస్కరించువాఁడు: చూ, నిరాకరిష్ణువు.

క్షిప్రకము. సం. వి. అ. న. పాడిపిండి: చూ, సాదము. (1)

క్షిప్రము. సం. క్రి. విణ. అ. న. 1. శీఘ్రము: చూ, వేగము. 3; విణ. 2. వడిగలది: చూ, వేగము. 3. (క్షిప్రాదులు.—క్షేపిష్టము, క్షోదిష్ఠము, ప్రేష్ఠము, వరిష్ఠము, స్థవిష్ఠము, బంహిష్ఠము.); అం. 3. మల్లశాస్త్రములోని ప్రచారములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, ప్రచారములు.

క్షిప్రశ్యేనము. సం. వి. అ. పుం. ఏటిరింత: చూ, వ్యాఘ్రాటము.

క్షియ. సం. వి. ఆ. స్త్రీ. క్షయము, తగ్గుదల: చూ, వలిత. 2.

## క్షీ

క్షీణకోణము. ఖా. (Angle of Declination) ఈ కోణమునకు ప్రస్తుతమున లండను పట్టణమందు పడమట 16 అంశల 45 కళలున్న

న్యాయశాస్త్ర-పట్టణమందు పడమట 7 అంశలును పరిమాణము కలది: (చూ, కోణము.)

క్షీణము. సం.విణ. క్షయించినది: చూ. హీనము.1.

క్షీణించు సం.అ.క్రి. క్షీణమగు; చూ, స్రుక్కు.4.

క్షీబుఁడు. సం. విణ. తాగుఁబోతు, క్రొవ్వినవాఁడు (అని కొందఱు): చూ, మత్తుఁడు.

క్షీరకంఠుఁడు. సం. వి. అ పుం. బాలుఁడు: చూ, శిశువు. (రూ-క్షీరకంఠకుఁడు)

క్షీరకంద. సం. వి.అ.స్త్రీ. పాలనేలగుమ్ముడు*: చూ, భూమికర్కారువు. (ఇట్లు క్షీరకందము)

క్షీరకాండకము. సం. వి. అ. పుం.1. జెముడు*: చూ, స్నుహి; 2: చూ, జిల్లేడు*.

క్షీరకాకోలి. సం. వి.ఈ. స్త్రీ. పిన్నపాల*: చూ, మనుపాల (రూ-క్షీరకాకోలిక)

క్షీరకాష్ఠ. సం. వి. అ. స్త్రీ. నల్లమఱ్ఱి*: చూ, మఱ్ఱి.

క్షీరకీటము. సం. వి. అ. పుం. దుగ్ధజాతకీటము: చూ, పురుగు.

క్షీరక్షురము. సం. వి. అ.పుం. పాలఱాయి: చూ, ఱాయి.

క్షీరజము. సం.వి.అ.న. 1. దధి: చూ, పెరుఁగు.1; విణ. 2.క్షీరజాతద్రవ్యము: చూ, రాజార్హము.

క్షీరదళము. సం. వి. అ. పుం: చూ, జిల్లేడు*.

క్షీరద్రుమము. సం. వి. అ. పుం.1. అశ్వత్థము*: చూ, రావి; 2 వటము*: చూ, మఱ్ఱి.

క్షీరధేనువు. సం. వి. ఉ. స్త్రీ. దానార్థమై యేర్పఱచిన ఆవు: చూ, ధేనువు.

క్షీరనాళము. సం. వి. అ. పుం. పెద్దటేఁకు*: చూ, శాకోటము (రూ-క్షీరనాళకము)

క్షీరనీరము. సం. వి. అ. న. 1. ఆలింగనవిశేషము: చూ, సంశ్లేషము; 2. దుగ్ధజలము: చూ, సలిలము.

క్షీరపర్ణి. సం. వి. ఇ. పుం; చూ, జిల్లేడు*.

క్షీరపాకి. సం. వి. ఈ. స్త్రీ. అందుకము*: చూ, యవతిక్త.

క్షీరఫల. సం. వి. అ. స్త్రీ. కలివె*: చూ, సాప్లపుష్పఫల

క్షీరబల. సం. వి. అ. స్త్రీ —వై—

క్షీరము. సం. వి. అ. న. 1. దుగ్ధము: చూ, పాలు. 1; 2. నీళ్ళు (కునక క్షీరము కూనారము): చూ, సలిలము; పుం.3.వటము*: చూ, మఱ్ఱి; 4. చాపము: చూ, పాలపిట్ట; 5. క్షీరసముద్రము: చూ, సముద్రము; 6. తీఁపు: చూ, మాధుర్యము.

క్షీరమోరట. సం. వి. అ. స్త్రీ. చేకోణద. *: చూ, మోరట.

క్షీరవతి. సం వి. ఇ. స్త్రీ. పాలుగలది: చూ, అస్థిక్షీర.

క్షీరవల్లి. సం.వి. ఈ.స్త్రీ. పాలనేలగుమ్ముడు*: చూ, భూమికర్కారువు.

క్షీరవికృతి. సం. వి. ఇ. స్త్రీ. జున్ను: చూ, పాలు. 1. (చూ, కూర్చిక. 2)

క్షీరవిదారి. సం. వి. ఈ. స్త్రీ: చూ, క్షీరవల్లి. (రూ-క్షీరవిదారిక)

క్షీరవిషాణిక. సం. వి. అ. స్త్రీ. క్షీరకాకోలి*: చూ, మనుపాల.

క్షీరవృక్షము. సం. వి. అ. పుం. 1. ఉదుంబరము*: చూ, మేడి; 2. క్షీరిక*: చూ, పాల.

క్షీరశీర్షుఁడు. సం. వి. అ. పుం. శ్రీరాముఁడు: చూ, రాముఁడు.

క్షీరశుక్త. సం. వి. అ. స్త్రీ. 1. తెల్లనేలగుమ్ముడు*: చూ, భూమికర్కారువు; 2.పిన్నపాల: చూ, మనుపాల.

క్షీరశుక్ల. సం. వి. అ. స్త్రీ: చూ, క్షీరశుక్త.1.

క్షీరశుక్లము. సం. వి. అ. పుం. జలకంటకము: చూ, మత్స్యము. 1.

క్షీరసము. సం. వి. అ. పుం. పాలమీఁదిమీఁగడ: చూ, మీఁగడ.

క్షీరసాగరకన్యక. సం. వి. ఆ. స్త్రీ. లచ్చి: చూ, లక్ష్మి. 1 (ఇట్లు క్షీరసాగరసుత, క్షీరాబ్ధిజ, క్షీరాబ్ధితనయ మొ)

క్షీరసారము. సం. వి. అ. పుం: చూ, క్షీరసము.

క్షీరాకరము. సం. వి. అ. పుం. పాలసముద్రము: చూ, సముద్రము.

క్షీరాణి. సం. వి. ఈ. స్త్రీ. పిన్న పాల*: చూ, మనుపాల.

క్షీరాన్నము. సం. వి. అ. న. పరమాన్నము: చూ, పాదము (1)

క్షీరాబ్ధి. సం. వి. ఇ. పుం: చూ, క్షీరాకరము.

క్షీరాబ్ధిజము సం. వి. అ. న. 1. సముద్రపు ఉప్పు: చూ, లవణము.1; 2.మౌక్తికము: చూ, రత్నము. 1.

క్షీరాబ్ధిజుఁడు. సం వి. అ. పుం: చూ, చంద్రుఁడు. (ఇట్లు క్షీరాబ్ధితనయుఁడు.)

క్షీరావి. సం వి. ఈ. స్త్రీ. పిన్నపాల*: చూ, మనుపాల (రూ-క్షీరావిక)

క్షీరాశము. సం.వి.అ.పుం. అంచె; చూ, హంస.

క్షీరాహ్వము. సం. వి. అ. పుం. సరళి*: చూ, సర్వానుభూతి.

క్షీరి. సం. వి. న్. పుం. 1: చూ, జిల్లేడు; 2. చిఱుపాల*: చూ, మనుపాల; 3.వటము*: చూ, మఱ్ఱి; 4. పాదిరి*: చూ, స్థాలి, 2; 5 కొండగోనుఁగు*: చూ, మృదుద్రుమము. (ఈకారాంత స్త్రీలింగమని కొందఱు.)

క్షీరిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, పాల*.

క్షీరిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. చిఱుపాల *: చూ, మనుపాల; 2. కంటుష్టము*: చూ, స్వర్ణక్షీరిణి; 3: చూ, జిల్లేడు*.

క్షీరేక్షువు. సం. వి. ఉ. పుం: చూ, మృదుద్రుమము*.

క్షు

క్షుణము. సం. వి. అ. పుం. కుంకుడు*: చూ, ఫేనిలము, 2.

క్షుణ్ణము. సం. విశ. 1. పొడిచేయఁబడినది; వా. 2. పూర్తిగా చేయుఁబడినది; న. 2.గుణకారము: చూ, హెచ్చవేఁత.

క్షుణ్ణుఁడు. సం విశ. వ్యుత్పన్నుఁడు: చూ, సజ్జనుఁడు.

క్షుత. సం. వి ఆ. స్త్రీ. రూ-క్షుతము: చూ, తుమ్ము.

క్షుతము. సం. వి. త్. స్త్రీ. 1. —పై— (అకారాంత నపుంసక లింగమని కొందఱు); ధ్. 2. ఆఁకలి. (తకారాంతమని కొందఱు). చూ, బుభుక్ష; విశ. 3. వాఁడిగా చేయఁబడినది, నిశితము: చూ, శితము 1.

క్షుతాభిజననము. సం. వి. అ. పుం. బ. నల్లని ఆవాలు *: చూ, సర్షపము. (రూ. క్షుతాభిజనము-క్షుధాభిజననము.)

క్షుత్తు. సం. వి ధ్. స్త్రీ. 1. ఆఁకలి: చూ బుభుక్ష; అం. 2. షడూర్ములలో నొకటి: చూ, ఊర్ములు.

క్షుదము. సం. వి. అ. పుం. తండులాదిచూర్ణము: చూ, నురుము.

క్షుద్ర. సం. వి. ఆ. స్త్రీ. 1.ఈఁగ, అడవియీఁగ (అని కొందఱు): చూ, మక్షిక; 2 తేనెటీఁగ: చూ. మక్షిక; 3. బోగముది: చూ, వేశ్య; 4. అంగహీనయగు ఆఁడుది: చూ, స్త్రీ; 5. నాట్యమాడెడు ఆఁడుది: చూ, స్త్రీ; 6. హింసించెడు ఆఁడుది: చూ, స్త్రీ; 7.చేఁతలాసి*: చూ, చేఁతరాసి; 8. అస్పృశి*: చూ, వాఁకుడు; 9. దొమ్మరిది: చూ, వంశనర్తి; 10. రక్తమువిఱిగి గాయములోనగు స్థానియందుండి కాఱెడి నీరు: చూ, పులినీరు; 11. అ

డవిగోధుములు: చూ, ధాన్యము; 12 నల్ల ఉప్పి*: చూ, లవణి.

క్షుద్రకంటకి. సం వి. ఈ. స్త్రీ: చూ, వాఁకుడు*.

క్షుద్రకంబువు. సం. వి. ఉ. పుం. క్షుద్ర శంఖము: చూ, సంకు. 1.

క్షుద్రకము. సం. వి. అ. పుం: చూ, కుప్పికోల.

క్షుద్రకారలిక. సం వి.ఆ. స్త్రీ. అడవికాఁకర*: చూ, సువవి. 1. (ఇట్లు క్షుద్రకారవేల్లము- క్షుద్రకారవేల్లి.)

క్షుద్రకులికము. సం. వి. అ. పుం. వైక్రాంత మణి: చూ, రత్నము 1.

క్షుద్రఘుంట. ఆం. ఘనవాద్యములు ఆఱింటిలో నొకటి: చూ, ఘ-వాద్యములు.

క్షుద్రఘంటిక. సం. వి. ఆ. స్త్రీ. కింకిణి.(కాలిగజ్జెలు-పాంజేబులున్ను): చూ,భూషణము.2.

క్షుద్రఘోలి. సం. వి. ఈ. స్త్రీ. చివిల్లి కాక్షుపము*: చూ, రేఁగు 1.

క్షుద్రచందనము. సం. వి. అ. న. 1 రక్తచందనము: చూ, వాసన; 2. కుచందనము: చూ, పతాంగము

క్షుద్రచూడము సం. వి. అ. పుం. పక్షివిశేషము: చూ, పక్షి.

క్షుద్రజంతువు. సం. వి. ఉ. పుం. శతపది, కట్లజెఱ్ఱి; చూ, సర్పము.

క్షుద్రజాతిఫలము. సం వి.అ. న. ఉసిరిక*: చూ, శ్రీఫలి 1.

క్షుద్రజీర. సం వి. ఆ. స్త్రీ. తిప్పతీఁగ*: చూ, సోమవల్లి

క్షుద్రజీవము సం. వి. అ. పుం. సన్నజీలకఱ్ఱ*: చూ, సువవి. 2.

క్షుద్రతులసి. సం. వి. ఈ. స్త్రీ. తెల్లగగ్గెర* చూ, పర్ణాసము.

క్షుద్రదంశిక. సం. వి. ఆ. స్త్రీ. అడవియీఁగ: చూ, మక్షిక.

క్షుద్రదురాలభ. సం. వి. ఆ. స్త్రీ. చిన్నకేఁగడిదూల*: చూ, స్వల్పదురాలభ.

క్షుద్రదుస్పర్శ. సం వి. ఆ. స్త్రీ. —పై. —

క్షుద్రపత్ర. సం. వి ఆ. స్త్రీ. చాంగేరి*. చూ, పులిచింత.

క్షుద్రపత్రము. సం. వి. అ. పుం: చూ, క్షుద్రతులసి.

క్షుద్రపత్రి. సం. వి. ఈ. స్త్రీ. వచ* చూ,వస.

క్షుద్రపర్ణము. సం. వి అ. పుం. 1. తెల్లగగ్గెర*: చూ, పర్ణాసము; విణ. 2. సూక్ష్మపత్రము*: చూ, ప్రిబ్బలి.

క్షుద్రపాషాణభేద. సం. వి. ఆ. స్త్రీ. తుపము*: చూ, హ్రస్వశాఖాశిఫము.

క్షుద్రపిప్పలి. సం. వి. ఈ. స్త్రీ. అడవిపిప్పలి*: చూ, పిప్పలి 1.

క్షుద్రప్రబంధము. పా. (కలికోత్కలిక, జయపద, మాలిని, చక్రవాళ, మంజరి, ముక్తపదగ్రస్తాదులు గలది )

క్షుద్రఫల. సం.వి.ఆ. స్త్రీ.1. గోపాలకర్కటి*: చూ, బుడమ. 1; 2. కాకినేరేడు*: చూ, నేరేడు; 3. కంటకారి*: చూ, పెద్దసాఁపర; 4: చూ, వాఁకుడు.

క్షుద్రఫలము. సం. వి. అ. పుం. నేలపోఁక*: చూ, పోఁక.

క్షుద్రబల. సం. వి. ఆ. స్త్రీ. చిన్నముత్తవపులగము*: చూ, ముత్తవపులగము.

క్షుద్రము. సం. విణ. కొంచెము: చూ,స్వల్పము.

క్షుద్రమూలకము. సం.వి.అ. న. చిన్నముల్లంగి*: చూ, ముల్లంగి.

క్షుద్రమౌక్తికము. సం. వి. అ. న. ఉమ్మాయముత్తియము: చూ, రత్నము. 1. (చూ, ముత్తెము.)

క్షుద్రరస. సం. వి. ఆ. స్త్రీ. శానుగు*: చూ, కాదఘ్నము.

క్షుద్రవార్తాకి. సం. వి. ఈ. స్త్రీ. తెల్లవాఁకుడు *: చూ, వాఁకుడు.

క్షుద్రశంఖము. సం. వి. అ. పుం. శంటుకుఁడు: చూ, శత్రువు. 1.

క్షుద్రశమ. సం. వి. అ. స్త్రీ. నల్లగినియ *: చూ, శుకనాసము. 1.

క్షుద్రశీర్షము. సం. వి. అ. పుం. మయూరశిఖ *: చూ, పూతికరజము.

క్షుద్రశుక్తి. సం. వి. ఇ. స్త్రీ. జలశుక్తి: చూ, సంకు. 1.

క్షుద్రశ్యామ. సం. వి. అ. స్త్రీ. అగ్నిభాస *: చూ, మానేరు.

క్షుద్రశ్వేత. సం. వి. అ. స్త్రీ. గినియ *: చూ, శుకనాసము. 1.

క్షుద్రసహా. సం. వి. అ. స్త్రీ. 1 ముద్గపర్ణి కాఱుపెసర* (అని కొందఱు): చూ, పెసర; 2. ఇంద్రవారుణి *: చూ, పెద్దపాఁపర.

క్షుద్రహింగులిక. సం. వి. అ. స్త్రీ: చూ, వాఁకుడు *.

క్షుద్రాండమత్స్యసంఘాతము. సం. వి. అ. పుం. చిఱుమీనుల కదుపు, పోతాధానము: చూ, మత్స్యము. 1.

క్షుద్రాంబుపణస. సం. వి. అ. పుం: చూ, నిమ్మ *: (రూ-క్షుద్రామ్లపణస) (ఆకారాంత స్త్రీలింగమని కొందఱు.)

క్షుద్రాగ్నిమంథము. సం. వి. అ. పుం. పిన్ననెల్లి *: చూ, శ్రీపర్ణము. 1.

క్షుద్రాధాగని. సం. వి. ఈ. స్త్రీ: చూ, వాఁకుడు *.

క్షుద్రాపామార్గము. సం. వి. అ. పుం. ఎఱ్ఱఉత్తరేణి *: చూ, శైఖరికము (రూ-క్షుద్రాపామార్గకము.)

క్షుద్రాభయా. సం. ఒకానొక లేహ్యము: చూ, లేహ్యములు.

క్షుద్రామలకము. సం. వి. అ. న. ఆమలకము *: చూ, శ్రీఫలి. 1.

క్షుద్రామ్రకము. సం. వి. అ. పుం. కొండమామిడి. పోఁకమామిడి * (అని కొందఱు): చూ, మామిడి. (రూ- క్షుద్రామ్రము.)

క్షుద్రామ్ల. సం. వి. ఆ. స్త్రీ. 1. అమ్లలోణిక *: చూ, పులిచింత; 2. నక్కదోస *: చూ, దోస.

క్షుద్రామ్లపణస. సం. వి. అ. పుం: చూ, క్షుద్రాంబుపణస *.

క్షుద్రిక. సం. వి. ఆ. స్త్రీ. దంశము: చూ, మక్షిక.

క్షుద్రుఁడు. సం. విణ 1. అధముఁడు: చూ, హీనుఁడు; 2. పిసినిగొట్టు: చూ, లోభి; 3. హింసించువాఁడు: చూ, హింసకుఁడు; 4. పనికిరానివాఁడు: చూ, నిష్ప్రయోజకుఁడు.

క్షుద్రేంగుది. సం. వి. ఈ. స్త్రీ. తీఁటకసింద *: చూ. సముద్రాంత.

క్షుద్రోత్పలము. సం. వి. అ. న. కాకికలువ *: చూ, పద్మము. 1.

క్షుద్రోదుంబరిక. సం. వి. ఆ. స్త్రీ. కాకోదుంబరిక *: చూ, బొమ్మమేడి.

క్షుద్విబోధకము. సం. వి. అ. పుం. నెరవంజి *: చూ, సరవెండ.

క్షుధ. సం. వి. ఆ. స్త్రీ.=గొద. ఆఁకలి: చూ, బుభుక్ష.

క్షుదాభిజననము. సం. వి. అ. పుం. రాజిక *: చూ, సర్షపము.

క్షుధితము. సం. విణ. ఆఁకలిగొన్నది.

క్షుధితుఁడు. సం. విణ. ఆఁకలిగొన్నవాఁడు: చూ, బుభుక్షితుఁడు.

క్షుపము. సం. వి. అ. పుం. పొట్టికొమ్మలూడలు గల చెట్టు *: చూ, హ్రస్వశాఖాశిఫము.

క్షుపాలువు. సం. వి. ఉ. పుం. పానీయాలువు: చూ, సుషవి. 1.

క్షుబ్ధము. సం. విణ. 1. కలఁతపెట్టఁబడినది: చూ, సకలము; వి. అ. పుం. 2. చల్లకవ్వము: చూ, మంథానము.

క్షుభితము. సం. విణ: చూ, క్షుబ్ధము. 1.

క్షుమ. సం. వి. ఆ. స్త్రీ. 1. నీలి *: చూ, రంజని; 2 నూనెయగిసె *: చూ, శుకనాసము. 1.

క్షురకము. సం. వి. అ. పుం. 1. గొలిమిడి *: చూ, మొగబీర; 2: చూ, పల్లేరు *; 3. బొట్టుగు *: చూ, నువ్వులు.

క్షురకర్మ. సం. వి. న్. న మంగలిపని *: చూ, ముండనము.

క్షురపత్రము. సం. వి. అ. పుం. కుశతృణము *: చూ, తృణము. 1. (చూ, శరము.)

క్షురపుష్పకము. సం. వి అ. పుం మోదెన *: చూ, శివమల్లి.

క్షురప్రగము. సం. వి. అ. పుం: చూ, క్షురప్రము. (నపుంసకలింగమని కొందఱు.)

క్షురప్రము. సం.వి. అ. పుం.=కోలపము. 1.అర్ధచంద్రబాణము. "అర్ధచంద్రః క్షురప్రస్స్యాత్." హలాయుధనిఘంటువు: చూ రిష్టి. 2 (చూ, బాణము. 1); అం. 2.బాణాగ్రములు పదింటిలో నొకటి: చూ, బాణాగ్రములు.

క్షురమర్ది. సం. వి. న్. పుం: చూ, మంగలి.

క్షురము. సం. వి. అ. పుం. 1.=మారి- సురి- చురియ-చుఱుకత్తి: చూ, రిష్టి. 3; 2: చూ, మంగలికత్తి; 3. గొలిమిడి *: చూ, మొగబీర; 4: చూ, పల్లేరు*; 5. కుంచుజెల్లు *: చూ, శరము (చూ, తృణము. 1.)

క్షురాంగము. సం. వి. అ.పుం. ఏనుఁగుపల్లేరు*: చూ, పల్లేరు.

క్షురి. సం. వి. న్. పుం. క్షౌరకుఁడు: చూ, మంగలి.

క్షురిక. సం. వి. ఆ. స్త్రీ. 1. రూ-క్షూరిక. ఖరపత్రి*: బరిసెంక; 2. ఒకరకము మంటికుండ: చూ, భాండము. 3; 3 చూ, మంగలికత్తి.

క్షురికాబంధము. అం. శబ్దాలంకారములలో నొకటి: చూ, శబ్దాలంకారములు (చూ, అలంకారము. 3; చూ, హేతువు. 2.)

క్షుల్లకము. సం. వి. అ. పుం. 1 = గుల్ల, నత్తగుల్ల: చూ, సంకు. 1; విణ.2. అల్పము: చూ, స్వల్పము; 3. సన్నని నూలుపోఁగు: చూ, పోఁగు.1; 4. పేదతికము: చూ, బీదతనము.

క్షుల్లకుఁడు. సం. వి.అ.పుం. 1. రూ-ఖులకుఁడు, నీచుఁడు: చూ, హీనుఁడు; 2. దరిద్రుఁడు: చూ, బీదవాఁడు

క్షుల్లము. సం. వి అ. పుం. సన్నపునూలుపోఁగు: చూ, పోఁగు. 1.

క్షువు. సం. వి. ఉ. పుం: చూ, సింహము.

## క్షే.

క్ష్వేడము. సం. వి. అ. పుం. 1. కర్కోటకమను పాము: చూ, సర్పము; 2. సరళము: చూ, రాజార్హము.

క్షేత్రగణితము. పా. (స్పేస్‌వర్క్) ప్లాను డ్రాయింగు, సర్వేకొలతగలది. (చూ, కోణము, చూ, ఏంగిలు.)

క్షేత్రజ. సం.వి. ఆ. స్త్రీ. 1: చూ, వాఁకుడు*; 2. నక్క-దోస*: చూ, దోస; 3. శిల్పికాది తృణవిశేషము*. (గోమూత్రిక, శిల్పిక, చణిక.): చూ, తృణము. 1; 4 ఇతరునివలన తనభార్యయందుఁబుట్టిన కన్య: చూ, పుత్రిక.1.

**క్షేత్రజుఁడు.** సం. వి. అ. పుం. దేవరాది న్యాయము ననుసరించి భర్త మున్నగువారిచేత నియమింపఁబడిన భార్యయందు ఇతరునివలన పుట్టినకొడుకు: చూ, పుత్త్రుఁడు. 1.

**క్షేత్రజ్ఞుఁడు.** సం. వి. అ. పుం. 1. జీవుఁడు: చూ, హంసుఁడు. 2; విణ. 2. నేర్పరి: చూ, సమర్థుఁడు.

**క్షేత్రదూతి.** సం.వి.ఈ. స్త్రీ.:చూ, వాఁకుడు*.

**క్షేత్రపాలుఁడు.** సం. వి. అ. పుం: చూ, దేవతా విశేషము.

**క్షేత్రము.** సం. వి. అ. న. 1. వరిమడి: చూ, భూమి. 1; 2. గణితశాస్త్రవిశేషము: చూ, కరణము. 7 (చూ, క్షేత్రగణితము); 3. పెండ్లాము: చూ, భార్య; 4. ఒడలు: చూ, శరీరము; 5. సిద్ధస్థానము. (ఏనుఁగుయొక్క హస్త, వదన, దంత, శిరో, నయన, కర్ణ, గ్రీవా, గాత్ర, రశ, కాయ, మేఢ్ర, పదములు క్షేత్రములనఁబడును); 6. ఇల్లు: చూ, సదనము. 1; 7. ఆఁడుగుఱి: చూ, భగము. 12; 8. గోడ: చూ, మఱుఁగుగోడ; పా. 9 షోడశవర్గులో నొకటి. గ్రహ మే రాశియందుండునో ఆరాశికి క్షేత్రమని పేరు: చూ, షోడశవర్గు.

**క్షేత్రమునకు నవవర్గగణితము.** పా: చూ, ఏకాదశవర్గగణితము (నవవర్గ గణితక్రమమునకు కాలామృతము. 243 శ్లోకము చూడుము.)

**క్షేత్రరుహా.** సం.వి. ఆ. స్త్రీ. వాలుకీకర్కటి*: చూ, దోస.

**క్షేత్రాజీవుఁడు.** సం. విణ. దున్నుకొని బ్రదుకువాఁడు: చూ, వ్యవసాయి.

**క్షేత్రియము.** సం. విణ. మడియందుఁ బుట్టినది (తృణము)*: చూ, తృణము. 1.

**క్షేత్రియుఁడు.** సం. విణ. అ. పరదారరతుఁడు: చూ, వలపుకాఁడు.

**క్షేపణము.** సం. వి. అ. న. ప్రేరేపించుట: చూ, విమోచనము.

**క్షేపణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఓడనడపుగడ. రూ-క్షేపణీ: చూ, పీలి. 2; 2. ఒకానొకవల: చూ, వల. 1; 3: చూ, ఒడిసెల.

**క్షేపణ్యావు.** సం. వి. ఉ. పుం. 1. గాలి: చూ, వాయువు; 2. వసంతఋతువు (చైత్ర వైశాఖమాసములు): చూ, మాసద్వయము. (చూ, ఋతువులు.)

**క్షేపము.** సం. వి. అ. పుం. 1. చిమ్ముట: చూ, విక్షేపము; 2. త్రుళ్లు: చూ, హంకారము; 3. దూఱు: చూ, నింద. 1; 4. లేపనము: చూ, పూఁత. 3; 5. ప్రేరణము: చూ, విమోచనము; 6 తిరస్కారము: చూ, వహేలనము; 7. ఆలస్యము: చూ, విలంబము. 1; 8. త్రోయుట, నడపుట, గడపుటయున్ను: చూ, విమోచనము; 9. ఇచ్ఛలేనిబుద్ధి, వికల్పము: చూ, బుద్ధి; 10 గుత్తి: చూ, పూగుత్తి.

**క్షేపిష్ఠము.** సం. విణ. మిక్కిలి వేగముగలది (క్షిప్రము=శీఘ్రము): చూ, వేగము 3.

**క్షేపీయము.** సం. విణ. (న. ఈ. న) -పై.-

**క్షేపుఁడు.** సం. వి. అ. పుం. జాత్యాచారాదులచేత నిందితుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

**క్షేమ.** సం. వి. ఆ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2. లింగిదొండ *: చూ, దొండ.

**క్షేమంకరుఁడు.** సం. విణ: చూ, శుభంకరుఁడు. (ఇట్లు క్షేమకర్త-క్షేమకారుఁడు.)

**క్షేమకము.** సం. వి. అ. పుం. చోరమను గంధద్రవ్యము: చూ, రాజార్హము.

**క్షేమకృత్తు.** సం. వి. త్. పుం. గరుడుఁడు: చూ, హరివాహనుఁడు.

క్షేమతండులము. సం. వి. అ. పుం. ప్రయాణ కాలమందు పట్టిచేతఁబోక యింటనుండి కొంపోవలెను వెంట కొనిపోయెడు బియ్యము: చూ, బియ్యము.

క్షేమము. సం. వి. అ. పుం, న. 1=సేమము: చూ, శుభము. 1; 2. కలిగినది చెడకుండుట; పుం. 3. బృహచ్ఛదము*: చూ, బలురక్కసి; 4. చండయను గంధద్రవ్యము*: చూ, రాజార్హము; 5 గరుడుఁడు: చూ, హరివాహనుఁడు; 6. తుమ్మ*: చూ, విటఖదిరము.

క్షేమాఫల. సం. వి. ఆ. స్త్రీ. ఉదుంబరము*: చూ, మేడి (రూ-క్షేమఫల.)

క్షేమిని. సం. వి.ఈ. స్త్రీ: చూ, బలురక్కసి*.

## క్షై

క్షైత్రము. సం. వి. అ. న. 1. క్షేత్రముల సమూహము (క్షేత్రము = పరిమడి): చూ, భూమి. 1; 2. పట్టుఉప్పు: చూ, లవణము. 1.

క్షైరేయి. సం. వి. ఈ. స్త్రీ. రూ-క్షైరేయము, పరమాన్నము: చూ, సాదము (1).

## క్షో

క్షోడము. సం. వి. అ. పుం. కంబము: చూ, స్తంభము. 1.

క్షోణి. సం.వి. ఈ.స్త్రీ. 1. నేల: చూ, భూమి 1; 2. ముంజతృణముచే నల్లిన బ్రహ్మచారి మొలత్రాడు. రూ-క్షోణీ: చూ, మొలత్రాడు; 3. సంఖ్యావిశేషము: చూ, సంఖ్య. 1; 4. నల్లజీలకఱ్ఱ*: చూ, సువవి. 2.

క్షోణీరథుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

క్షోదము. సం. వి. అ. పుం. 1. నూఱుట: చూ, నురుము; 2. పొడి: చూ, నురుము.

క్షోదితము. సం వి. అ.న. పొడి: చూ, నురుము.

క్షోదిష్ఠము. సం. విశే. మిక్కిలి క్షుద్రమైనది. (క్షుద్రము=అల్పము); చూ, స్వల్పము.

క్షోదిష్ఠుఁడు. సం. విశే. మిక్కిలి క్షుద్రుఁడు: చూ, హీనుఁడు.

క్షోదీయము. సం. విశే: (స్. ఈ.స్.): చూ, క్షోదిష్ఠము.

క్షోభము. సం. వి అ. పుం. 1.=చోభు. కలఁత: చూ, సంతాపము; 2. దోఁపుడు: చూ, తలపాటు.2;3 క్షోభమనులెక్క: చూ, సంఖ్య1.

క్షోభించు. సం. అ. క్రి. కలఁతపడు: చూ, సంక్షోభించు.

క్షోభిణి. అం. శ్రుతులు ఇరువదిరెండింటిలో నొకటి: చూ, శ్రుతులు.

క్షోభితము. సం. విశే. కలఁతపెట్టఁబడినది; చూ, సకలము.

క్షోమము. సం. వి. అ. న. 1. రూ-క్షౌమము. తెలిపట్టుబట్ట. చూ, వస్త్రము. 2. అట్టడి: చూ, సదనము. 1; అం. 3. భావాధ్యాయ ప్రమేయములోని గండక్రియలు ఆఱింటిలో నొకటి: చూ, గండక్రియలు.

## క్షౌ

క్షౌణి. సం. వి. ఇ. స్త్రీ, ఈ. స్త్రీ. పుడమి, రూ-క్షౌణీ: చూ, భూమి. 1.

క్షౌణీప్రాచీరము. సం. వి. అ పుం. సంద్రము: చూ, సముద్రము.

క్షౌద్రపటలము. సం. వి. అ. న. తేనెపెర: చూ, మధుపటలము.

క్షౌద్రము. సం. వి. అ. న. 1. తేనె: చూ, మధువు. 5; 2. ఉదకము: చూ, సలిలము; పుం. 3.

లావుకపిట్ట: చూ, లావుక; 4: చూ, సం
పెంగ*.

క్షౌద్రమేహము. సం. వి. అ. పుం. ప్రమేహ రోగము: చూ, రోగము. 1.

క్షౌమకము. సం. వి. అ. పుం. చోరమను గంధ ద్రవ్యము*: చూ, రాజార్హము.

క్షౌమము. సం. వి. అ. న. నారచీర (చెట్టు నారతో నేసిన బట్ట): చూ, వస్త్రము; 2.నూనె యగిసె నారచీర: చూ, వస్త్రము; 3.కుందేటి తుప్పటి చీర: చూ, వస్త్రము; పుం, న. 4. తెల్లచీర: చూ, వస్త్రము; 5. తెల్లనిపట్టుబట్ట, తెల్లని పట్టుచీర (అని కొందఱు): చూ,వస్త్రము; 6. యట్టార్థము వాకిటిమండపముమీఁద గాని, కొత్తళముమీఁదగాని యేర్పఱచినగది, మేడలయొక్క వెనుకప్రక్కఁగట్టిన యింటి పేరు (అని కొందఱు): చూ, సదనము. 1.

క్షౌమి. సం. వి. ఈ. స్త్రీ. అతసి*: చూ, శుక నాసము. 1.

క్షౌరకాలము. పా. అశ్వి-మృ-పున- పుష్య- హ- చి-స్వా-వి-శ్రి-ధ-శత ఈ నక్షత్రములును, సో-బుధవారంబులును ప్రశస్తంబులు. జ్యే-రే. మధ్యమంబులు. ఆరోగ్యస్నాన మృతకర్మ యాగారంభ కాలములయందును, కాశ్యాదిపుణ్యక్షేత్ర కాలములయందును, వివాహదినంబునకు పూర్వదినంబునందును, కారాగృహ విముక్తి కాలంబునందును, క్షౌరనిషేధతిథ్యాదులును శుభకరంబులు. (క్షౌరనిషేధ తిథులు= నందరిక్తతిథులు, పంచపర్వంబులు, పితృతిథులు, ఉభయాష్టములు. మఱియు రాత్రి. వ్రత దినములు, భోజనానంతరము.)

క్షౌరము. సం. వి. అ. న: చూ, రూ- క్షురకము.

క్షౌరికుఁడు. సం. వి. అ. పుం. 1. నాపితుఁడు: చూ, మంగలి; అం. 2. పదునెనిమిది జాతులలోనొకఁడు: చూ, జాతులు.

# క్ష్ణు

క్ష్ణుతము. సం. విశ. వాఁడి చేయఁబడినది: చూ, శాతము. 1.

# క్ష్మా

క్ష్మా. సం. వి. ఆ. స్త్రీ. నేల: చూ, భూమి.1; 2. నిద్ర: చూ, స్వప్నము. 2.

క్ష్మాజము. సం. వి. అ.పుం. చెట్టు: చూ,వృక్షము.

క్ష్మాభృత్తు. సం. వి. త్. పుం. 1. కొండ: చూ, పర్వతము; 2. (క్షత్రియుఁడు కాకపోయినను) జనులను భూమిని రక్షించువాఁడు, ఱేఁడు: చూ, రాజు. 1.

క్ష్మాయము. సం. వి. అ. న. 1. ఉనికి: చూ, స్థానము. 1; 2.రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు.1.

క్ష్మాహారము. పా. ఇది యొకానొక వృత్తము. ఇది యొక్కొక్క పాదము మ, స, య, త, స, మ గణములతోఁ గూడి తొమ్మిదింట, పదమూఁడవయింట, యతిగల అష్టాదశ ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా— బాహాబాహినిదమలో-భ్రాతల్ దొడ్డ-పగలఁ బోరాడం, గాహంపిరుఁడగుబుధు - క్ష్మానూనున్ జ-గతిని గూలంగా, నాహాయేసిన నరపా. లారత్నేమ-యతులు పొందంగా, క్ష్మాహారంబు మనయత-న్మంబుల్ చెంది - మనుచునందంబై.": చూ, వృత్తము. 1.

# క్ష్వ్యం

క్ష్వ్యంక. సం. వి. ఆ. స్త్రీ.=చింకలిక్క. ఎఱ్ఱని మొంగముగల ఆఁడుకోఁతి: చూ,వానరము.

క్ష్వ్యంకము. సం. వి. అ. పుం. ఎఱ్ఱని మొంగముగల మొంగకోఁతి: చూ, వానరము.

## క్ష్వే

క్ష్వేడ. సం. వి. ఆ. స్త్రీ. 1. సింహనాదము: చూ, స్వరము. 2; 2. (వెదురు) సలాక: చూ, శలాక.

క్ష్వేడము. సం. వి. అ. న. 1. ఆవడపువ్వు * చూ, బీఱ 2; 2. ఎఱ్ఱబీర్లెడుకాయ: చూ, జిర్లెడు; పుం. 3. చెవుడు: చూ, బాధిర్యము; 4. మ్రోఁత: చూ, స్వరము. 2; 5. విషము: చూ, విసము. 1; విణ. 6. పొందరానిది; 7. వంకరైనది: చూ, వెల్లితము. 2.

క్ష్వేడితము. సం. వి. అ. న. సింహనాదము: చూ, స్వరము. 2.

క్ష్వేళ. సం. వి. ఆ. స్త్రీ. 1. —పై—; (రూ- క్ష్వేడ- క్ష్వేడితము- క్ష్వేళితము); 2. చేఁతిబీఱ *: చూ, బీఱ. 2.

క్ష్వేళము. సం. వి అ. పుం. విషము: చూ, విసము. 1.

క్ష్వేళితము. సం. వి. అ. న. సింహనాదము: చూ, స్వరము. 2. (రూ- క్ష్వేడితము)

## ఖ

ఖ. ఒకయక్షరము. సం. వి. అ. పుం. 1 గరుడుఁడు: చూ, హరివాహనుఁడు; 2. కత్తి: చూ, రిష్టి. 2; 3. వినుపోలు: చూ, స్వర్గము 4. బంగారు: చూ, లోహము. 1; 5 శాంతరసము: చూ, రసములు; 6 మణి: చూ, రత్నము. 1; 7. ఇంచుకంత: చూ, స్వల్పము; 8 దీనుఁడు: చూ, బీదవాఁడు; 9. సున్న: చూ, శూన్యము. 1; 10. దవాగ్ని: చూ, వహ్ని. 1; 11. నిశ్చయము: చూ, సత్యము. 1; 12. ఇనుఁడు: చూ, సూర్యుఁడు; పా. 13. కంఠ్యములలోనొకటి: చూ, కంఠ్యములు.

ఖమ్. సం. వి. అ. న. ఇంద్రియము (నేత్రాదీంద్రియములు): చూ, హృషీకము; 2. సుఖము: చూ, సంతోషము; 3. ఆకసము: చూ, విన్ను; 4. వినుపోలు: చూ, స్వర్గము; 5. దిక్కు: చూ, నక్షత్రము. 1; 6. పరిమడి: చూ భూమి. 1; 7. బిలము: చూ, రంధ్రము 1; 8. దంతధావనము: చూ, పలుదోముట; 9. పెట్టుకోలు: చూ, సంవేశము; 10. కరుణ: చూ, దయ; 11. ఫలకము: చూ, పలక; 12. అభావము: చూ, శూన్యము. 1; 13. అభ్రకము: చూ, బేగడ; 14. పోలు: చూ, దేశము; 15. సున్న (గుణింతములబిందువు): చూ, బిందువు. 2; 16. శంఖధ్వని: చూ, స్వరము. 2; 17 అలంబుష వృక్షఫలము.

ఖకరము. సం. వి. అ. పుం. చూర్ణకుంతలము: చూ, కెందుక. 1.

ఖంఖ. సం. వి. ఆ స్త్రీ. 1. అశ్వగమన విశేషము: చూ, హయము; 2. దూలగొండి *: చూ, శూకశింబి; 3. నాట్యము: చూ, నాటకము. 1.

ఖంఖటుఁడు. సం. వి. అ. పుం. కఠినుఁడు: చూ వ్యాధుఁడు. 2.

ఖంఖిరి. సం. వి. ఈ స్త్రీ. ఆఁడునక్క: చూ, సృగాలము. (రూ- ఖంఖేరి.)

ఖంగుఖంగు వా. వి. ఆయుధము లొకటితో నొకటి తాఁకునప్పుడు కలిగెడు ధ్వన్యనుకరణము: కళా. 8, ఆ. 108: చూ, హాహాహూ.

ఖంజ. సం. వి. ఆ స్త్రీ. 1. ఛందోవిశేషము: చూ, ఛందస్సు; 2. తృణవిశేషము *: చూ, తృణము. 1; 3. పసపు: చూ, వర్ణము. 6; 4. దూది: చూ, ప్రత్తి; విణ. 5. కుంటిది: చూ, కూరకూతుఁడు.

ఖంజకారి. సం. వి. ఈ. స్త్రీ. కుధాన్యము: చూ, ధాన్యము.

ఖంజకుఁడు. సం. విణ. కుంటికాలివాఁడు: చూ, కూరనూతుఁడు.

ఖంజఖేటము. సం. వి. అ. పుం. కాటుకపిట్ట చూ, పిచ్చుక.

ఖంజఖేలము. సం. వి. అ పుం. —పై.—

ఖంజనరతము. సం. వి. అ. న యతిమైథునము: చూ, సంయోగము.

ఖంజనము. సం. వి. అ. పుం. 1. మందపిచ్చుక కాటుకపిట్ట (అని కొందఱు) (భాద్రపద మాసము మొదలాఱునెలలు కనిపించేక తిరుగునది): చూ, పిచ్చుక; 2. భరద్వాజము: చూ, వ్యాఘ్రాటము.

ఖంజనిక. సం. వి అ. స్త్రీ. హాపుత్రిక యను పక్షి: చూ, హాపుత్రిక.

ఖంజపాదము. సం. వి. అ. పుం.=గంజీన. బాల క్రీడావిశేషము: చూ, బాలక్రీడ.

ఖంజము. సం. వి. అ. పుం. 1. కొల: చూ, వధము; న. 2. బల్లెము: చూ, బాణము. 1; అం. 3. అసంయుతహస్తములు నలువదిరెండింటిలో నొకటి: చూ, అసంయుత హస్తములు.

ఖంజరి. సం. వి. ఈ. స్త్రీ. 1. వాద్యవిశేషము: చూ, వీణె; అం. 2. మార్దవక్ర శికిజభావలు పదమూఁడింటిలో నొకటి: చూ, మార్దవక్ర శికిజభావలు (చూ, భావ. 1.)

ఖంజరిట్ట. సం. వి. అ. స్త్రీ: చూ, మించిలి *.

ఖంజరీటము. సం. వి. అ. పుం. మందపిచ్చుక, కాటుకపిట్ట (అని కొందఱు): చూ, పిచ్చుక

ఖంజరీటి. సం. వి. ఈ. స్త్రీ. అఁడుకాటుకపిట్ట: చూ, పిచ్చుక.

ఖంజలేఖము. సం. వి అ. పుం. భరద్వాజము: చూ, వ్యాఘ్రాటము.

ఖంజుఁడు. సం. విణ. ఖోడుఁడు, కుంటికాలి వాఁడు: చూ, కూరనూతుఁడు.

ఖండ. సం. వి. అ. స్త్రీ. గర్భాధానాదివిధి ప్రతిపాదక గ్రంథము; 2. గర్భాధానఖండ, వధూవరులాసీనులైయుండఁగా గర్భాధానాత్పూర్వము బ్రాహ్మణులచే చెప్పఁబడు మంత్ర విశేషము. (ఇక్కాలమున నిదియె ముహూర్త కాలమనివాడుక.)

ఖండకథ సం. వి.అ. స్త్రీ: చూ, పరికథ (చూ, ఆఖ్యాయిక.)

ఖండకము. సం. వి. అ. పుం, న. గోఁచి: చూ, బొట్టము.

ఖండఖండితము. సం. వి అ. పుం. పంచదార వేసిన గోదుమపూరి: చూ, భక్ష్యము.

ఖండగుత్త. మి. వి: చూ, గుండుగుత్త, గుత్త: చూ, స్వాధీనపుగుత్త.

ఖండచతురము. అం. (అర్ధచతురము)అసంయుత హస్తములు నలువదిరెండిఁటిలో నొకటి: చూ, అసంయుతహస్తములు.

ఖండజము. సం. వి అ. పుం. గుడము: చూ, బెల్లము. 1.

ఖండధార. సం. వి. అ. స్త్రీ. కత్తెర: చూ, బాణము. 1.

ఖండనము. సం. వి. అ. న. నఱుకుట: చూ, నఱుకుడు.

ఖండపత్రిక. సం. వి. అ స్త్రీ. ఉల్లాసు: చూ, పురోణి.

ఖండపరశువు. సం. వి. ఉ.పుం. 1. ముక్కంటి: చూ, శివుఁడు; 2: చూ, పరశురాముఁడు; 3. రాహువు అనుగ్రహము: చూ, రాహువు; 4 సున్నము పూయువాఁడు: చూ, తాపీవాఁడు; 5 ఖండామలకమనెడు మందు; 6. విరిగిన పల్లుగల యేనుఁగు: చూ, హస్తి; 7. వటుత్రివముస్తె *: చూ, తృణము. 1. (రూ-ఖండపర్శువు.)

ఖండపాలము. సం. వి. అ. పుం. భిల్లకుడుము: చూ, భక్ష్యము.

ఖండశృంఖలిక. సం. వి. అ. స్త్రీ: రూ- ఖండ శృంఖలి *: చూ, ములువెంపలి.

ఖండప్రస్తారము. అం. తాళాధ్యాయములోని ప్రస్తారప్రత్యయప్రాణములు పదొమ్మిదింటిలో నొకటి చూ, ప్రస్తారప్రత్యయప్రాణములు.

ఖండము. సం. వి. అ. పుం., న. 1.=కండ, తునక: చూ శకలము; పుం 2. పులకండము: చూ, బెల్లము. 1; 3. రత్నదోషము: చూ, రత్నము. 1; 4. తాళప్రాణజాతివిశేషము, సంగీతశాస్త్రమునందు లయవేయుటయందలి భేదము: చూ, తాళము. 2; 5. తొమ్మిది: చూ, ముమ్మూఁడు; విణ. 6.=కండిత. కొంత భాగము: చూ, సగము.

ఖండములు. అం.బ 1. భూఖండములు.-ఆసియా, యూరోపా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా (ఓషియానియా) (ఇవి పూర్వార్ధగోళములోనివి). అమెరికా (ఇది పశ్చిమార్ధగోళములోనిది) పరిపాలకులు పరిపాలనావిధానమునుబట్టి భూమిని పెక్కురీతుల విభజించియున్నారు.): చూ, దేశము; 2. అష్టాదశమహాపురాణములయొక్క నామములలో రెండవదగు పాద్మము=౫ ఖండములు ౫౦౦౦౦; పదమూఁడవదగు స్కాందము=౫౦ ఖండములు ౧౦౦౦౦౦అని చెప్పఁబడియున్నది: చూ, పురాణములు (చూ, ఉపపురాణములు); 3. తాళాధ్యాయములోని జాతిక్రియలు అయిదింటిలో నొకటి: చూ, జాతిక్రియలు (చూ, తాళము. 2.); అం. 4. భరతము, ఇంద్రము, చదువు, గభస్తి, నాగము, తామ్రము, తారుణి, సౌమ్యము, గంధర్వము. (9); వా. వి. బ. 5. తునియలు; 6. తుత్తునియలు.

ఖండలవణము. సం. వి. అ న. బిడలవణము: చూ, లవణము. 1.

ఖండశర్కర. సం. వి. అ. స్త్రీ.=కండచక్కెర. పులకండము: చూ, బెల్లము. 1.

ఖండా. వై.వి =కరండః. పెద్దకత్తి. కళా. 3, ఆ. 66: చూ, రిష్టి. 2.

ఖండానుస్వారము. పా. ఇది సిద్ధమని సాధ్యమని ద్వివిధము. కాఁక-వీఁక-ఈఁక-లోఁక ఇత్యాదులందలి.యరసున్న సిద్ధఖండానుస్వారము. వచ్చెన్ కమలాక్షుఁడు అనునది సంధియందు 'వచ్చెఁగమలాక్షుఁ' డని యగును. ఇందలిది సాధ్యఖండానుస్వారము. (చూ, సంధినూత్రము వ్యాకరణమున. 32.) అనుస్వారము-బిందువు:—(1) పూర్ణానుస్వారము (నిండుసున్న):-(1) సిద్ధపూర్ణము, (2) సాధ్యపూర్ణము; అనుస్వారము-బిందువు:-(2) ఖండానుస్వారము (అరసున్న):-(1) సిద్ధఖండము, (2) సాధ్యఖండము. (చూ, అనుస్వారము.) (చూ,ఉపన్యాసదర్పణము 68-99పారటలు.)

ఖండాభ్రకము. అం. దంతక్షతములు ఏడింటిలో నొకటి: చూ, దంతక్షతము.

ఖండాభ్రము. సం.వి అ. న. 1. మేఘశకలము: చూ, మేఘము 1; అం. 2. స్త్రీలదంతక్షత విశేషము: చూ, దంతక్షతము; (చూ, రతిబంధము.)

ఖండార్చిత. అం. లేహ్యములలో నొకటి: చూ, లేహ్యములు.

ఖండించు. సం స క్రి నఱుకు: చూ, నెలగు.

ఖండిక. వా. వి. చిన్న పల్లె: చూ, దేశము.

ఖండికము. సం. వి. అ. పుం. హారేణువు, ధాన్యవిశేషము, నూఁగుదోస (అని కొందఱు): చూ, ధాన్యము.

ఖండిత. సం. వి. అ స్త్రీ. 1. నాయకుఁడు రాత్రి మఱియొకదానియింటికిపోయి యాచిహ్నములతో రాఁగా చూచి కోపమునొందిన నాయిక (చూ, నాయిక): చూ, స్త్రీ; అం. 2·

అవస్థాభేదంబుచే శృంగారనాయిక లష్టవిధము లైరి. వారిలో నీమెయొక తె: చూ, నాయికలు.

ఖండితమగు. మి. అ. క్రి: చూ, తెగు.

ఖండితము. సం. విణ. 1. నఱకఁబడినది: చూ, విచ్ఛిన్నము. 3; వా. 2. స్పష్టపఱచునది.

ఖండిని. సం. వి. ఈ. స్త్రీ. పుడమి: చూ, భూమి. 1:

ఖండిరము. సం. వి. అ. పుం. రూ-ఖండీరము. పచ్చపెసర*: చూ, పెసర.

ఖండీ. హిం వి. పుట్టి.

ఖండీరము. సం. వి. అ. పుం: చూ, రూ-ఖండిరము*.

ఖండుకము. సం. వి.అ.పుం. గుజ్జునారికేడము*: చూ, నారికేళము.

ఖండువా. వా.వి. రూ-కండువా. పైబట్ట: చూ, వస్త్రము. (అంచులుగల బట్ట.)

ఖండేందుశుభిఖుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

ఖంబు. సం. వి. అ. న. 1. ఆకసము: చూ, విన్ను; 2. నాకము: చూ, స్వర్గము; 3 అభావము: చూ, శూన్యము. 1; 4. ఇంద్రియము: చూ, హృషీకము; 5. తెలివి: చూ, బుద్ధి; 6. పట్టణము: చూ, దేశము; 7. వరిమడి: చూ, భూమి. 1; 8. సుఖము: చూ, సంతోషము; 9. బిందువు: చూ, సున్న. 1.

ఖకుంతలుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

ఖగభాసము. సం. వి. అ. న. చెట్టుతొఱ్ఱ: చూ, రంధ్రము. 1.

ఖగపతి. సం. వి. ఇ. పుం. గరుడుఁడు: చూ, హరివాహనుఁడు.

ఖగము. సం. వి. అ. పుం. 1. పక్కి: చూ, పక్షి; 2. అమ్ము: చూ, బాణము. 1; 3. సూర్యాది: చూ, గ్రహములు; 4. దేహము: చూ, శరీరము; 5. గాలి: చూ, వాయువు.

ఖగవక్త్రము. సం. వి. అ. పుం. లకుచము*: చూ, రేఁగు.

ఖగవతి. సం. వి. ఈ. స్త్రీ. పుడమి: చూ, భూమి. 1.

ఖగవల్లి. సం. వి. ఈ. స్త్రీ. ఆకాశవల్లి*: చూ, పద్మము. 1.

ఖగశత్రువు సం. వి. ఉ. పుం. కోలపొన్న*: చూ, పృశ్నిపర్ణి.

ఖగాంతకుఁడు. సం. వి. అ పుం: చూ, ఖగపతి.

ఖగాసనము. సం. వి. అ.పుం. ఉదయపర్వతము: చూ, పర్వతము.

ఖగాసనుఁడు. సం. వి. అ.పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

ఖగుఁడు. సం. వి. అ. పుం. 1. వెలుఁగుఱేఁడు: చూ, సూర్యుఁడు; 2. చందురుఁడు: చూ, హిమాంశువు; 3. దేవుఁడు: చూ, వేలుపు.

ఖగేంద్రధ్వజుఁడు. సం. వి. అ. పుం: చూ, ఖగాసనుఁడు.

ఖగేంద్రుఁడు. సం. వి. అ. పుం. గరుడుఁడు: చూ, హరివాహనుఁడు.

ఖగేశ్వరుఁడు. సం వి. అ. పుం. —పై.—

ఖగోళము. సం. వి. అ.పుం. ఆకాశమండలము: చూ, విన్ను.

ఖగ్గడము. సం. వి. అ. పుం ఒకరకముగడ్డి*: చూ, తృణము. 1.

ఖచమసుఁడు. సం. వి. అ. పుం. చందురుఁడు: చూ, హిమాంశువు.

ఖచరప్లుతము. పా. ఒకానొకవృత్తము. ఇందొక్కొక్క పాదమునందు న-భ-భ-మ-స-స గణములుగలిగి పదునెండవయింట యతిగల వింశచ్ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా.— "యమునలోఁ జొరనోడిన నానా-ప్రాకృతజంతువులం బ్రిదిలా, దమునఁ

బోఁచుటకై కలఁచంగా-దర్పమునన్ జను
దెంచి ఘోరగముగఁ జుట్టిన కాళియు సంహా-
గంబొనరించిన కృష్ణుయ, ర్యమవిరామముతోడ
సభామృస్వల్ -రాజిలనాఖచరప్లుతన్." (ఇం
దు నాలవపాదమున ఏలనో గణము తప్పినది)
(అప్పకవీయము): చూ, వృత్తము. 1.

ఖచరము. సం. వి. అ. పుం. 1. పక్కి: చూ, పక్షి; 2. మబ్బు: చూ, మేఘము. 1; 3. గాలి: చూ, వాయువు.

ఖచరుఁడు. సం వి. అ. పుం. 1. దేవుఁడు: చూ, వేలుపు; 2. వెలుఁగుఱేఁడు: చూ, సూర్యుఁడు; 3. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

ఖచించు. సం. స.క్రి. రూ-ఖచియించు, చెక్కు: చూ, పొదుఁగు.

ఖచితకము. సం. వి. అ. న. సక్తవము, పొడిపిండి: చూ, సాదము. (1)

ఖచితము. సం. వి. అ. పుం. 1. బ్రహ్మయొక్క ఖడ్గము: చూ, రిష్టి. 2; విణ. 2.=కచ్చితము. కూర్పఁబడ్డది: చూ, సంయోజితము; 3. చెక్కఁబడినది: చూ, రుషితము.

ఖజ. సం. వి. అ. స్త్రీ. 1. కవ్వము: చూ, మంథానము; 2. చేప్పట, చపేటము, ప్రహస్తము: చూ, హస్తము, 3. గరిటె: చూ, దర్వి 1.

ఖజకము. సం. వి. అ. పుం. చేల్లకవ్వము: చూ, మంథానము.

ఖజపము. సం. వి. అ. న. 1. నెయ్యి: చూ, తైలము. 2; పుం. 2. కొయ్యతెడ్డు: చూ, పీలి. 2; 3. మిల్లి: చూ, దర్వి. 1.

ఖజలము సం. వి. అ. న. 1. మంచు: చూ, హిమము; 2. ఆకాశగంగ: చూ, నది.

ఖజాక. సం. వి. అ. స్త్రీ. గరిటె: చూ, దర్వి. 1.

ఖజాకము. సం. వి. అ. పుం. పక్కి: చూ, పక్షి.

ఖజానా. వా. వి. ధనాగారము : భాండాగారము.

ఖజిత్తు. సం. వి. త్. పుం. బుద్ధవిశేషము: చూ, బుద్ధుఁడు. 1.

ఖజూరియె బ్రాహ్మణులు. పా. పంచగౌడుల లోని సారస్వతులలో రెండవ తెగవారు: చూ ఆచార్య అను బ్రాహ్మణులు: చూ, బ్రాహ్మణులు.

ఖజ్జా. హిం. వి. కజ్జా

ఖజ్యోతి. సం. వి. స్. పుం: చూ, సూర్యుఁడు.

ఖటకుఁడు. సం. వి. అ. పుం. మనువు కుదుర్చువాఁడు: చూ, నాగవీటుఁడు.

ఖటము. సం వి. అ. పుం. 1. తెమడ: చూ, శ్లేష్మము; 2. పిడికిలి: చూ, ముష్టి. 2; 3. కంబము: చూ, స్తంభము. 1; 4. లోఁతుబావి: చూ, నుయ్యి; 5. తాళ్లుతోలిచెడియులి: చూ, వృక్షాదనము. 1.

ఖటి. సం. వి. ఈ. స్త్రీ. పలకపుల్ల: చూ, బలపము.

ఖటిక. సం. వి. అ. స్త్రీ. 1.=కడ్డీ. —పై.—; 2. : చూ, శ్వేతజ*.

ఖటికము. పా. (కాల్సియమ్)ఇది విడిగా దొరకక సంయోగస్థితిలో మాత్రము దొరకుచున్నది. ఇది ముఖ్యముగ కర్బనితరూపమునను, గంధకిత రూపమునను భూమియందు కనఁబడుచున్నది. నత్తగుల్లలు, సీమసున్నము, సున్నపురాలు మొదలగువానియందు ఖటికకర్బనిత రూపమునను, హారశోతము అనుదానియందు ఖటికగంధకితరూపమునను ఉన్నది. ఖటికము ప్లోరినముతో కలసి నాపరాయియగుచున్నది. మొ. (ఇందుకు సంబంధించిన శాస్త్రపరిభాషా పదములు:— ఖటికామ్లజనిదము, ఖటిక ఉదజనితము, ఖటికకర్బనితము, ఖటికగంధకితము, ఖటికనత్రితము. ఖటికాయితము, ఖటికశిల, ఖటికభూములు, ఖనిజములు మొ.)

ఖటిని. సం. వి. ఈ. స్త్రీ. చూ, ఖటి.

గచ్చులాఁడి. దే. వి. (గచ్చులు + ఆఁడి) బయటికి యోగ్యురాలివలె నటించునట్టి ఆఁడుది: చూ, స్త్రీ.

గచ్చువిచ్చగు. దే. అ. క్రి. (గచ్చువిచ్చు + అగు) (కార్య) వైకల్యమగు; (ఆంధ్ర నామశేషము.): చూ, వైకల్యమగు.

గచ్చువిచ్చు. దే. వి. 1. అఱుమూఁడు: చూ, వైకల్యము; 2. తాఱుమాఱు: చూ, వ్యత్యయము.

గజకంద. సం. వి. అ. పుం: చూ, ముల్లంగి*.

గజకణ. సం. వి. ఆ. స్త్రీ. గజపిప్పలి*: చూ, పిప్పలి. 1.

గజకర్ణ. అం. కళలు అఱువదినాలుగింటిలో నొకటి. చూ, కళలు.

గజకర్ణము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగు చెవివంటి యొకరకము విసనకఱ్ఱ: చూ, సురటి; 2: చూ, బలురక్కసి*; అం. 3. ఇంద్రజాలవిశేషము: చూ, ఐంద్రజాలికము, అవాంతరములు, ఉపవిద్యలు.

గజకూర్మాశి. సం. వి. న్. పుం. గరుడుఁడు: చూ, హరివాహనుఁడు.

గజక్రీడ. సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగు ఆట: చూ, హస్తి.

గజక్రీడితము. అం. కరణములు నూటయెనిమిదింటిలో నొకటి: చూ, కరణములు.

గజచిర్భిట. సం. వి. ఆ. స్త్రీ: చూ, శ్రీపర్ణి*.

గజచిర్భటా. సం. వి. ఆ. స్త్రీ: చూ, పెద్దపాఁపర*.

గజచిర్భిటా. సం. వి. ఆ. స్త్రీ—పై.—

గజచోదని. సం. వి. ఈ. స్త్రీ. చేఁతిబీఱ*: చూ, బీఱ. 2.

గజచ్చోటీయము. అం. తానములు మూఁడు. అందు సర్వతానములు ఇరువదియెనిమిది. అందు ౨౧ హీనతానములు ఏడు. వానిలో గజచ్చోటీయ మొకటి: చూ, ౨౧, హీనతానములు (చూ, సర్వతానములు): చూ, ఉపవిద్యలు.

గజచ్ఛాయ. సం. వి. ఆ. స్త్రీ. 1. కొండ: చూ, పర్వతము; 2. ఒకానొక పుణ్యకాలము.

గజచ్ఛాయము. సం. వి. అ. పుం. దున్నపోతు: చూ, మహిషము.

గజజాతులు. అం. భద్రము, మందము, మృగము, (3): చూ, హస్తి (చూ, గజము—గజశాస్త్రము).

గజఝంప. అం. జన్యతాళములలో నొకటి: చూ, జన్యతాళములు: (చూ, తాళము. 2)

గజఢక్క. సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగుపైనుండు నగారా, మదామాత్రము: చూ, భేరి.

గజత. సం. వి. ఆ. స్త్రీ ఏనుఁగుల గుంపు: చూ, హస్తి.

గజతుండము. అం. భావాధ్యాయపరిమేయము నందలి అసంయుతహస్తములు నలుబదిరెండింటిలో నొకటి: చూ, అసంయుతహస్తములు.

గజదండ అం. మల్లశాస్త్రమునందలి దండలు పంద్రెండింటిలో నొకటి: చూ, దండలు.

గజదంతఫలము: సం. వి. అ. పుం: చూ, దోస*.

గజదంతము. సం. వి. అ. పుం. 1. అభినయహస్తవిశేషము: చూ, వ్యంజకము.1; 2.ఏనుఁగుపల్లు: చూ, పల్లు. 1. (చూ, నాగదంతము); అం. 3. భావాధ్యాయ పరిమేయమునందలి సంయుతహస్తములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, సంయుతహస్తములు; 4. నృత్తహస్తములు ఇరువదితొమ్మిదింటిలో నొకటి: చూ, నృత్తహస్తములు.

గజదానము. సం. వి. అ. న. ఏనుఁగుమదము: చూ, మదము. 1.

గజనిమీలనము. సం. వి. అ. న. కపటము: చూ, వ్యాజము. 1.

గజనిమీలిక. సం. వి. అ. స్త్రీ. ముందు ఒప్పుకొని వెనుక లేదని వాదించుట. చూ, విసంవాదము.

గజపర్దనన్యాయము. పా. గజశర్దు (గజశ్రద్ధ అని వాడుక)

గజపాదపము. సం. వి. అ. పుం. పాదిరి*: చూ, స్థాలి.

గజపిప్పలి. సం. వి. ఈ. స్త్రీ. ఏనుఁగుపిప్పలి*: చూ, పిప్పలి. 1. (వాతమును శ్లేష్మమును అగ్నిమాంద్యమును పోఁగొట్టును.)

గజపిప్పళ్లు శుద్ధి. పా. గజపిప్పళ్లు కలిలోగాని మేఁక మూత్రములోగాని యొకజాము భావన చేసిన శుద్ధి.

గజపుటము. సం. వి. అ. పుం. ఔషధము వండుటకేర్పఱచిన గజములోఁతుగల గొయ్యి: చూ, రంధ్రము. 1.

గజప్రియము. సం. వి. అ. పుం. చామలు: చూ, ధాన్యము.

గజబంధని. సం. వి. ఈ. స్త్రీ. ఏనుఁగును కట్టెడి చోటు: చూ, స్థానము. 1.

గజభక్షకము. సం. వి. అ. పుం: చూ, రావి *.

గజభక్ష్య. సం. వి. అ. స్త్రీ. అందుగు*: చూ, సల్లకి (గజభక్ష అని కొందఱు)

గజమదములు. అం. దానము, సీధువు, సాగరము, శీకరము, శిక్యము, మదము, ఘర్మము, మేఘము. (8) (తదితరములకు: చూ, హస్తి)

గజమాచలము. సం. వి. అ. పుం, స్త్రీ: చూ, సింహము.

గజము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగు: చూ, హస్తి; (ఇందుల వివరము లన్నియు 'హస్తి' అను పదము కడఁ జూచుకొనవలెను.) 2. మూఁడడుగుల కొలఁది, 36 అంగుళములకొలఁది; 3. వాస్తుస్థానవిశేషము; 4. సేనాంగములు నాలుగింటిలో నొకటి (చతురంగబలము): చూ, సేనాంగములు. (చూ, అంగము. 9.); 5. దండలు పంద్రెండింటిలో నొకటి: చూ, దండలు; 6. గతులు పండ్రెండింటిలో నొకటి: చూ, గతులు; 7. (గోభూతిలాది) మహాదానములు పదునాఱింటిలో నొకటి: చూ, మహాదానములు. 1; 8. (తులాపురుషహిరణ్యగర్భాది) మహాదానములు పదునాఱింటిలో నొకటి: చూ, మహాదానములు. 2; 9. (గోవు, గజము మొదలగునవి) దానములు పదునాఱింటిలో నొకటి: చూ, దానములు.

గజమోటనము. సం. వి. అ. పుం, న: చూ, సింహము.

గజయాన. సం. వి. అ. స్త్రీ. 1. ఏనుఁగునడవంటి నడగల ఆఁడుది: చూ, స్త్రీ; 2. ఆఁడుది; చూ, స్త్రీ; (ఇట్లు ఇభయాన మొ).

గజరత్న. అం. తంత్రములు అఱువదినాలుగింటిలో నొకటి: చూ, తంత్రములు.

గజరిపువు. సం. వి. ఉ. పుం. ఏనుఁగుగొంగ: చూ, సింహము.

గజలక్షణము. అం. కళలు అఱువదినాలుగింటిలో నొకటి: చూ, కళలు.

గజలీలము. అం. జన్యతాళములలో నొకటి: చూ, జన్యతాళములు. (చూ, తాళము. 2.)

గజవదనుఁడు. సం. వి. అ. పుం: చూ, వినాయకుఁడు. 1.

గజవల్లభ. సం. వి. అ. స్త్రీ. 1. గిరికదలి*: చూ, రంభ. 2; 2. అందుగు*: చూ, సల్లకి.

గజవిద్విషము. సం. వి. అ. పుం: చూ, పాఁపర*.

గజవిలసితము. పా. ఒకానొకవృత్తము. ఇది యొక్కొక్క పాదమునందు భ, ర, న, న, న, గురువులుండి ఎనిమిదింట యతిగల షోడశ

ఛందస్సునందుఁ బుట్టినవృత్తము. ఉదా.–"బాల సరోజనాభ–వరదతను మిళితజం, బాల దిగంబ రాస–మసృణకబళ కరలం, బాలకమంగళావ–హాగజవిలసితమున, స్నాయిలు భరేఫనాస–గము లిభవిరమములై": చూ, వృత్తము. 1.

గజవైద్య. అం. కళలు అఱువదినాలుగింటిలో నొకటి: చూ, కళలు.

గజశిర్ధు. వా. వి. నిష్ప్రయోజకుఁడు. (గజశ్రద్ధ అనియుఁ వాడుక)

గజశాస్త్రము. పా. గజములనుగూర్చి మృగచర్మీయము, రాజపుత్రీయమను గ్రంథములయందు వివరింపఁబడియున్నది. అట్టిగ్రంథంబులిప్పుడరుదుగా నుండుటవలన విస్తరించుట దుర్లభము "శ్లో. త్వగ్భేదాచ్ఛోణిత స్రావాన్మాంసస్య చ్యవనాదపి । ఆత్మానం యోఽభిజానాతి తస్య గంభీరవేదితా॥ చిరకాలేన యో వేత్తి శిక్షాం పరిచితామపి । గభీరవేది విజ్ఞేయస్స గజో గజవేదిభిః॥" అని రాజపుత్రీయ, మృగచర్మీయములయందు. "సీ. పొగడపూవంటి కంపుల మదాంబువులును మధువర్ణ దంతశంబములు మెఱయ, భీకరస్వరచారు బృంహితంబులు ఘనాంగారకగ్రహకాంతి కన్నులమర, నిలఁజొట్టువడు తుండములమించు పూర్వాంగ మెత్తరంబై పిఱుందత్తమిల్లఁ, గటములుత్కటములై నిటలముల్ బటువులై సిబ్బెంపుమొగములనుబ్బుమీఱ, స్వర్ణకక్ష్యాంకుశ ప్రాసశరధి శార్ఙ్గ ఖేటసంఘఘంటి కావ్యలంకృతులు చెలువ, మెఱఁగుగంభీరవేది భద్రభళతము, నల్లునకునిచ్చె గంధర్వవల్లభుండు." స్వా. 5, ఆ. 98: చూ, గంభీరవేది. (చూ, హస్తి.)

గజసాహ్వయము. సం. వి.అ.న. హాస్తినాపురము: చూ, దేశము.

గజహంసగతి. సం. వి. ఇ. స్త్రీ. రాజపత్నీలక్షణము: చూ, లక్షణము. 1.

గజాఖ్యము. సం. వి. అ. పుం: చూ, జిల్లేడు*.

గజాగ్రణి. సం. వి. ఈ. స్త్రీ. ఐరావతమను యేనుఁగు: చూ, హస్తి.

గజాజీవుఁడు. సం. వి. అ. పుం: చూ, హస్త్యారోహుఁడు.

గజాదిమదము. సం. వి. అ. పుం. మత్తు: చూ, మదము. 1.

గజాననుఁడు. సం. వి. అ. పుం. ఏనుఁగు మోము సామి: చూ, వినాయకుఁడు. 1.

గజారి. సం. వి. ఇ. పుం. 1. ఏనుఁగుగొంగ: చూ, సింహము; 2: చూ, ఏనుఁగుల గొంగనూడు; 3. ఒకానొక చెట్టు: చూ, వృక్షము.

గజారోహణ. అం. కళలఱువదినాలుగింటిలో నొకటి: చూ, కళలు.

గజారోహణశరప్రయోగవిభాగము. అం. ధనుర్వేదమునందలి ప్రమేయములు నలుబదాఱింటిలో నొకటి: చూ, ప్రమేయములు.

గజాశన. సం. వి. ఆ. స్త్రీ. 1. అందుగు *: చూ, సల్లకి; 2. పద్మమూలము: చూ, పద్మము. 1.

గజాశనము. సం. వి. అ. పుం: చూ, రావి *.

గజాసురారి. సం. వి. ఇ. పుం: చూ, శివుఁడు.

గజాస్యుఁడు. సం.వి.అ.పుం: చూ, గజాననుఁడు.

గజాహ్వ. సం.వి. ఆ. స్త్రీ. 1. ఏనుఁగుపిప్పలి*: చూ, పిప్పలి. 1; 2. హస్తినాపురము: చూ, దేశము.

గజాహ్వము. సం. వి. అ. న. హస్తినాపురము: చూ, దేశము.

గజాహ్వయము. సం. వి. అ. న. —వై.—

గజిబిజి. దే. వి. 1. సందడి: చూ, స్వరము. 2; 2. కలఁత: చూ, సంతాపము; 3. నలఁగుడు: చూ, పీడనము; విణ. 4. కలఁగినది: చూ, సకలము; 5. నలఁగినది: చూ, పీడితము.

గజిబిజించు. దే. అ. క్రి. కలఁగు: చూ, సంక్షోభించు.

గజిముచ్చు. దే. వి. గరిడిముచ్చు: చూ, ట్రుముచ్చు. (గజదొంగ-గడిదొంగ అని వాడుక.)

గజ్జ. వై. వి.= కచ్ఛూః-ఖర్జూ. తీఁటకుఱుపు: చూ, విదర్చిక (చూ, వ్రణము.)

గజ్జియ. దే. వి. కింకిణి. రూ-గజ్జె: చూ, భూషణము. 2.

గజ్జె. దే. వి. —పై.—

గజ్జెగొలుసు. ద్వ. వి. పాఁజేబు: చూ. భూషణము. 2.

గజ్జెలపట్టెడ. దే. వి: చూ, దవురుగల్లి.

గజ్నియాలబ్రాహ్మణులు. పా. నేపాళదేశపు బ్రాహ్మణులు. వారి జాతులయొక్క నామములలో నొకతెగవారు: చూ, బ్రాహ్మణులు.

గజి. వై. విణ. పెద్ద. "గజినిమ్మ.": చూ, విపులము.

గజిగజి. దే. వి. వడఁకుటయందగు ధ్వన్యనుకరణము. హరిశ్చ. 3, ఆ. 106: చూ, హహాహహా.

గజినిమ్మ. ద్వ. వి. దబాలువు: చూ, లకుచము *.

గజీను. దే. వి. కపటము: చూ, వ్యాజము. 1.

గజీము. దే.వి. తుపాకికి మందుగట్టించెడి యినుపసలాక: చూ, శలాక.

గజోబు. వా. వి. కొద్దిగా వానకురియుట.

గజ్జె. దే. వి. తొడసందు: చూ, వంక్షణము.

గజ్జెలు. అం. కామశాస్త్రములోని నఖక్షత స్థానములలో నొకటి: చూ, నఖక్షతస్థానములు.

గజ్జా. వై. వి. మత్తు. పాండు. 4, ఆ. 37: చూ, మదము. 1.

గజ్జూరము. వై. వి.=ఖర్జూరము *: చూ, మధుఖర్జూరిక. (రూ-కజూరము- కజ్జూరము-కజ్జూరము.)

గటక. దే. వి. పిండితోఁజేసిన జావ: చూ, పాదము. (1)

గట్టం. వై. వి.=ఘట్టన. సిద్ధనోటికి వేసి గట్టించెడు బిరడ: చూ, బిరడ.

గట్టన. వై. వి.=ఘట్టన. గట్టించుట: చూ, దిమ్మిస.

గట్టి. దే. విణ. 1.=కఠినము: చూ, బెడిదము; 2. దృఢము: చూ, స్థైర్యము. 1; 3. ఉచ్చైర్నాదముకలది. "వాఁడుగట్టిమాటాడెఁడు."; 4. బీరము: చూ, శౌర్యము. 1.

గట్టించు. వై. స. క్రి. గట్టనచేయు.

గట్టినబోది. దే. వి: చూ, బాలక్రీడ.

గట్టిపడు. దే. అ. క్రి: చూ, గడితపడు.

గట్టివ. ద్వ. విణ. (గట్టి+వా) 1. ధూర్తుఁడు. పా. 1, ఆ. 127: చూ, వ్యాధుఁడు. 2; 2. గట్టిగమాటలాడువాఁడు: చూ, వక్త. 1; 3. రూ-గట్టివా. గట్టిగ మాటలాడునది: చూ, స్త్రీ; 4. ధూర్తురాలు. రూ-గట్టివా: చూ, స్త్రీ.

గట్టివయసుది. ద్వ. విణ. ప్రౌఢ: చూ, స్త్రీ.

గట్టివా. ద్వ. వి. రాలు: చూ, రూ-గట్టివ. 3-4.

గట్టివాఁడు. దే. విణ. నేర్పరి: చూ, సమర్థుఁడు. (మహాత్మ్య మహాదరకరూపము గట్టిది.

గట్టివాతనము. దే. విణ. స్త్రీధార్ష్ట్యము.

గట్టివాయి. ద్వ. విణ. ధూర్తురాలు: చూ, స్త్రీ.

గట్టివాల్బోటులు. ద్వ. వి. బ. పుష్పలావికలు: చూ, స్త్రీ.

గట్టివాలు. ద్వ. వి. రూ-గట్టువాలు. సైరంధ్రి (పర్వతమువలెఁ బ్రవర్తించునది అనఁగా పురుషసాంగత్యముఁగోరక ధైర్యముతో నుండునది యని వ్యుత్పత్త్యర్థము): చూ, స్త్రీ.

గట్టు. వై. వి.=ఘట్టు. 1. ఒడ్డు: చూ, తీరము; 2. కొండ: చూ, పర్వతము; 3. చెఱువుకట్టు: చూ, సేతువు. 1; 4. మళ్లకువేసినగట్టు: చూ, సేతువు. 1.

గట్టుఁదిరిమ్మరి. ద్వ. వి. (గట్టు + తిరిమ్మరి) అగచరము, కోఁతి. (ఇట్లు తిప్పతిరిమ్మరి. మలతిరిమ్మరి మొ.): చూ, వానరము.

గట్టుగ. దే. అవ్య: చూ, బిగ్గర.

గట్టుతాలుపు. ద్వ. వి: చూ, విష్ణువు. 1.

గట్టుదాయ. వై. వి: చూ, వేలుపుఱేఁడు.

గట్టుపట్టి. వై. వి. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2. మైనాకపర్వతము: చూ, పర్వతము.

గట్టురాచూలి. ద్వ. వి. —వై.—

గట్టులఱేఁడు. ద్వ. వి. హిమవంతుఁడు: చూ, పర్వతము.

గట్టువా. ద్వ. విశ: చూ, రూ-గట్టివా.

గట్టువాఱు. వై. వి. = కఠినవాక్. పరుషభాషణుఁడు.

గట్టువాలు. ద్వ. విశ. 1. సైరంధ్రి: చూ, రూ-గట్టివాలు; దే. వి. 2. విచ్చేలవిడియై యొకరియిండ్లనుండి శృంగారించుట లోనగు పనులు చేయునట్టి ఆఁడుది: చూ, స్త్రీ.

గట్టువిలుకాఁడు. ద్వ. వి. శైలధన్వుఁడు: చూ, శివుఁడు (ఇట్లు గట్టువిల్కాఁడు- గుబ్బలివిలుకాఁడు. మొ.)

గట్టువిలుతుఁడు. ద్వ. వి. —వై.— (ఇట్లు రూ-గట్టువిల్తుఁడు-మలవిలుతుఁడు మొ.)

గట్టువిల్దారి. ద్వ. వి. —వై.—(ఆంధ్ర. పదా. సుర. 10.)

గట్టొరయు. దే. అ. క్రి: చూ, క్రితొట్టు.

గట్రాచూలి. ద్వ.వి: చూ, రూ-గట్టురాచూలి. జై. 7, ఆ. 92.

గట్లయొకిమీఁడు. ద్వ. వి: చూ, రూ-గట్టులఱేఁడు.

గట్లయేలికమనుమఁడు. ద్వ. వి. కుమారస్వామి. సాంబ. ఔ. 7: చూ, స్కందుఁడు.

గడ. వై. వి. 1.=కాండ. నిడుపాటికోల. (ఏతపుగడ, చెఱకుగడ, వెదురుగడ మొ.): చూ, స్తంభము. 1; 2.=ఘటా. గుంపు: చూ, సమూహము; 3. ఓడకంబము: చూ, స్తంభము. 1; 4. కంబము: చూ, స్తంభము. 1. (ఇక్కడ గడయనఁగా అరఁటిచెట్టుయొక్క అడుగుభాగము.); 5. = కాండ. వెదురు: చూ, వేణువు; 6.=గణన. ఎన్నిక: చూ, సంకల్పము.

గడకము. సం. వి. అ. పుం. గండెచేప: చూ, మత్స్యము. 1. (జెల్లలని కొందఱు.)

గడగడ. దే. వి. వడఁకుట నీరుత్రాగుట లోనగువానియందగు ననుకరణము: చూ, హాహాహూ.

గడగడలాడు. దే.అ. క్రి. (గడగడలు + ఆడు) వడఁకు: చూ, వణఁకు. 2.

గడచీల. దే. వి. ఏతపుబానయం దమర్చియుండెడు దండెపుబీఁటలు తగుల్చుటకు గడతలనుండెడు చీల.

గడదేశజము. సం. వి. అ. న. సాంబరలవణము: చూ, లవణము. 1.

గడన. వై. వి. 1.=గణన. ఎన్నిక: చూ, సంకల్పము; 2.=గణన. పొగడిక: చూ, స్తోత్రము; 3. ఆర్జన: చూ, సంపాదనము; 4.=ఘటన. కూర్పు.

గడనకత్తె. వై. వి. భోగముది: చూ, వేశ్య.

గడనపడఁతి. ద్వ. వి. —వై.—

గడప. దే. వి. వాకిటిక్రిందిభాగము. రూ-కడప: చూ, దేహళి.

గడపడము. వా. వి. పంటకాఁపులు పాలేరువాండ్రకు యిచ్చు ధాన్యాదికము: గడపుఁదల-రూ-గడుపుఁదల.

గడపుఁదల. వా. వి —వై.—

గడబిడ. వా. వి. అల్లరి: రూ-గడబిడి.

గడబిడి. వా. వి.—వై.—

గడమంచె. వా. వి. రూ-గడవంచె: చూ, బడ్డీ.

గడము. సం. వి. అ. పుం. 1.=గండె: చూ, మత్స్యము. 1; 2. అడ్డము: చూ, నిరోధము.1; 3: చూ, విఘ్నము; 4: చూ, పరిఖ; 5. అడ్డపాటు: చూ, వ్యవధానము. 3; 6. గడమను దేశము: చూ, దేశము; దే. వి. (1) కుండలోనగువాని మూఁత. ఆం, భా. ప్రి. ది. 95 చూ, శరావము. (రూ-గడి.)

గడయంతము. సం. వి. అ. పుం. మబ్బు: చూ, మేఘము. 1.

గడరుఁగోయిల. ద్వ. వి: చూ, రూ- గండుఁగోయిల.

గడలవణము. సం. వి. అ. న. సంబరదేశమునఁ బుట్టిన ఉప్పు: చూ, లవణము. 1.

గడవంచె. వా. వి: చూ, రూ-గడమంచె.

గడసాదన. వై. వి. వ్యాయామము: చూ, సాము. 3.

గడసె. దే. వి. అటుక (అప్రి): చూ, మసెల.

గడి. సం వి. ఇ. పుం. 1. ఏఁడాది: చూ, సంవత్సరము; దే. వి. (1): చూ, శరావము; (2) ఎల్ల: చూ, సీమ. 1; (3) వాప్యాంకుర విశేషము; (4) బలము: చూ, శక్తి. 1; (5) మరియాద: చూ, సన్మానము; (6) కోట బురుజు: చూ, సదనము. 1; వా.వి. (7) (బట్ట మడత) హద్దు; (8) క్షేత్రగణితసంబంధమగు భాగము. (బ. గళ్లు) "స్పేసుకుక్క పొత్తము నిండుగ నెన్నిగారా గళ్లుగలవు."; (9)(తలుపు యొక్క) అడ్డు. "అడ్డుగడి వేయుము." (గడియ); (10) (చెవులు దిమ్మెక్కినపుడు కలుగు) అడ్డు "చెవులు గళ్లుపడ్డవి." మొ; (11) (చీదరంగపు) గడి: (12) (ఉప్పుబట్టి, చెడుగుడి లోనగు నాటలయందలి) గీత. "గడిదాఁటిరమ్ము." మొ.

గడించు. వై. స. క్రి.=ఘటు. రూ-గడియించు. 1. ఆర్జించు: చూ, సంపాదించు; 2.కల్పించు: చూ, సృజించు.

గడించుపడఁతి. ద్వ. వి: చూ, వేశ్య.

గడించువాఁడు. ద్వ. వి: చూ, సంపాదించువాఁడు.

గడికట్టు ద్వ. వి. చూ, ఆరితీఱు.

గడికొళ్లువేయు. దే. స. క్రి. (రెండురెండు పశువులను) ఒక్కొక్క కాలుచేర్చి లంకవేయు: చూ. లంకె వెట్టు. 3.

గడితపడు. వై. అ. క్రి. (గడితము + పడు): చూ, గట్టిపడు.

గడితము. వై. వి. 1. రూ-ముగ్గడితము. సాంద్ర వస్త్రము: చూ, వస్త్రము; 2.=ఘటిత. తఱచు: చూ, మొత్తము; 3. ముసుగు: చూ, లావు. 3: విశ. 4. తఱచైనది: చూ, మొల్లము; 5. ముదురైనది: చూ, స్థూలము.

గడితాడు. దే. వి. (రెండురెండు పశువులను) ఒక్కొక్క కాలుచేర్చి లంకవేసెడు- పలుపు: చూ, సూత్రము. 1.

గడితేఱు. దే. అ. క్రి. (గడి + తేఱు): చూ, సమర్థుఁడగు.

గడిదొంగ. దే. వి. ఒళ్లె వెతెఁగినదొంగ, గజదొంగ: చూ, ముచ్చు. 1.

గడిపోతు. దే.విశ. ఆఁబోతు: చూ, వృషభము.

గడిబిడి. వా. వి: చూ, రూ-గడబిడి.

గడిమెకము. దే. వి. వ్రేటునకుం జిక్కని మెకము: చూ, మెకము.

గడియ. వై. వి. 1.=ఘటిక. ఇరువదినాలుగు నిమిషముల కాలము: రూ-గడె; (సం. ప):— ఘటిక; తద్విశేషము.-అరగడియ:- (తె.ప):- అరగడియ; (సం. ప):-అర్థఘటిక, కథకము, 2.=ఘటిక. గడెమ్రాను, రూ-గడె. "తలుపు గడియ.": చూ, విష్కంభము. 2.

గడియమ్రాను. ద్వ. వి: రూ-గడెమ్రాను: చూ, విష్కంభము. 2.

గడియారము. వై. వి.=ఘంటికారము- ఘటీకారము కాలపరిమాణమును తెలుపునట్టి యొక యంత్రము. పా. 2, ఆ. 50: చూ, ఘటీకారము;(గడియారమునుబట్టి క్షేత్రగణితమునకు సంబంధించిన విశేషాంశములన్నియు తెలిసికొనవచ్చును: చూ, ఏంగిలు, కోణము.)

గడివడ. దే.వి. కఠినముగనుండెడి వడియము: చూ, వడియము.

గడివాఁడు. దే. వి. ఎల్లలవద్ద కాఁపున్నవాఁడు.

గడివోతు, దే. వి. ఒకానొక కుక్క: చూ, శునకము.

గడు. దే. వి. ఒకానొక దారువు. ఆం, భా. ద్వి. వ. 38: చూ, చెక్క.

గడుపుఁదల. వా. వి: చూ, గడపడము. (రూ-గడపుఁదల).

గడురుఁడు. సం. విణ. బొక్కబొమ్మవాఁడు: చూ, వామనుఁడు.

గడులుఁడు. సం. విణ.—పై.— (బొమ్మనఁగాని వీఁపునఁగాని కణితిగలవాఁడు)

గడువు. సం. వి. ఉ. పుం. 1.—పై.—; 2 గ్రంథి, మాంసగ్రంథి: చూ, బుడిపి; దే. వి. (1) మర్యాద: చూ, సన్మానము; (2) నిర్ణయకాలము: చూ, మితి.

గడుసరి. దే. విణ. (గడుసు + అరి) 1. అసాధ్యుఁడు; వై. విణ. 2. = కఠినుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 3.=కఠిన. శూరుఁడు. సాంబ. మానవ. 31: చూ, హంవీరుఁడు. 2; 4=కఠిన. ధైర్యముగలవాఁడు: చూ, దిట్టరి. (దేశ్యమని శ. ర.)

గడుసు. దే. వి. 1. కాఠిన్యము: చూ, బెడిదము; 2. ధైర్యము: చూ, స్థైర్యము; విణ. 3. కుజనుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 4. కుత్సిత స్త్రీ: చూ, స్త్రీ.; 5. అసాధ్యము: చూ, ముగ్గొయ్య; 6. కఠినము: చూ, బెడిదము.

గడుసుకుంక. వా. వి. గడుసరివాఁడు.

గడుసువడు. ద్వ.అ క్రి. (గడుసు + పడు) ధీరుఁడగు. పాండు. 3, ఆ. 14.

గడుసువాఁడు. వా. వి. నేర్పుగా తనపని నిర్వహించుకొను సమర్థుఁడు.

గడె. వై. వి.=ఘటిక: చూ, రూ-గడియ.

గడెంకొట్టుట. వా. వి. వ్యవసాయముచేయుట. (భద్రాచలప్రాంతమున వాడుక).

గడెత్తు. వా.వి. 1. దాఁటుకొనిపోవుటకు యెత్తు; 2. యుక్తిపైయుక్తి; 3. పెద్దఆలోచన: చూ, యోచన.

గడెత్తువాఁడు. వా వి. ఎత్తులమారి.

గడెమ్రాను. దే.వి.గడియ: చూ, విష్కంభము. 2.

గడేకారి. వా. వి. 1. అల్లరిచేయువాఁడు; 2. తాళ్లుచెక్కి మిద్దెకట్టువాఁడు (భద్రాచలప్రాంతమున గొండాలు అని వాడుక).

గడేకారీజట్టు. వా. వి. అల్లరిగుంపు.

గడేరము. సం. వి. అ. పుం. 1. మబ్బు: చూ, మేఘము. 1; వా. వై. వి. 2.=ఘటీకారము: చూ, రూ-గడియారము. (భద్రాచలప్రాంతమున వాడుక.)

గడోత్థము. సం. వి. అ. న. గడలవణము: చూ, లవణము. 1.

గడోలము. సం. వి. అ. పుం. 1. గుడము: చూ, బెల్లము. 1; 2. గ్రాసము: చూ, సాపాటు.

గడ్డ. వై. వి. 1.=గండః. కుఱుపు: చూ, వ్రణము; 2. = కందః, మూలము: చూ, వేరు. 1; 3. మంటిగడ్డ: చూ, భూమి. 1; 4. ద్వీపము: చూ, లంక. 1.

గడ్డకట్టు. దే. అ. క్రి: చూ, ముద్దకట్టు.

గడ్డపలుగు. ద్వ. వి: చూ, పలుగుగుంటక.

గడ్డపాఱ. ద్వ. వి. ఖనిత్రము: చూ, ముద్గరము.

గడ్డప్రొయ్యి. ద్వ. వి. గడ్డలప్రొయ్యి: చూ, ప్రొయ్యి.

గడ్డము. సై. వి. = గండ. 1. గద్దువ: చూ, శ్మశ్రువు; 2. గడ్డము మీసమును: చూ, శ్మశ్రువు.

గడ్డర. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుగొఱ్ఱె: చూ, మేషము. 1.

గడ్డవేళ్లు. పా. ఆకులలో తయారుకాఁబడు ఆహారము యెక్కువగా నున్నపుడీవేళ్లయందా యాహారమును భద్రము చేసికొనును. ముల్లంగి, చిలగడము పెండలము, పిల్లితేగలు మొ. (చెట్లుకు గడ్డవేళ్లుండును. వీనికి ప్లషీరూట్సు అనిపేరు.): చూ, ఆకు. 2.

గడ్డి. దే. వి. కసవు: చూ, తృణము. (పచ్చిగడ్డి, ఎండుగడ్డి అని ద్వివిధము. ఎండుగడ్డి = వట్టిగడ్డి అనివాడుక.)

గడ్డికట్టుట. దే. వి: చూ, ఆబంధము. 1.

గడ్డికటుంబము. పా.(గ్రామినె) వెదురు, చెఱకు, చోడి, జొన్న, వరి, మొక్కజొన్న. గటిక, సజ్జె, చామ. కొఱ్ఱ, గోధుమ మొ. (చూ, ఏకద్విబీజదళవృక్షములు-ఏకబీజదళము.)

గడ్డిగఱచుట. జా. 1. చిక్కులుఁబడుట; 2.లంచేములుఁబట్టుట.; వా. 3. గడ్డి నోటఁబెట్టుకొని తినుట.

గడ్డితినుట. —పై.—

గడ్డిపాము. దే. వి. ఒకానొక పాము: చూ, సర్పము.

గడ్డిపిట్ట. ద్వ. వి. ఒకరకము పిట్ట: చూ, పక్షి.

గడ్డిపెట్టు. వా. స. క్రి. 1. చీవాట్లుపెట్టు (గోదావరీమండలమున వాడుక); 2. గడ్డి తినిపించు.

గడ్డిబొద్దు. దే. వి. 1. చుట్టుకుమర. చంద్రరేఖా విలాపము. 1, ఆ. 69: చూ, పుట్టు. 3; వా. వి. 2. పొడవుగను గుండ్రముగను చుట్టి బండి మీఁదవేయు ఎండుగడ్డిచుట్ట: చూ, బొద్దు.2. (గోదావరీ ప్రాంతమున వాడుక.)

గడ్డిమేటి. వా. వి. కసవుఁగుప్ప: చూ, మేటి.

గడ్డివామి. వా. వి. —పై.—

గడ్డిమొలత్రాడు. దే. వి. ముంజదర్భల మొలత్రాడు, ముంజే: చూ, సూత్రము. 1.

గడ్డు. దే. విశ. 1. అసాధ్యము: చూ, ముగ్గొయ్య (రూ- గండు-గడుసు); 2. మిక్కిలి. "గడ్డపనులు-గడ్డుఱుకు" మొ: చూ, హెచ్చు1; 3. బలాత్కారము: చూ, బలవంతము.

గడ్డుకము. సం. వి. అ. పుం. రూ-గడ్డూకము. జలపాత్రము: చూ, పాత్రము. 6.

గడుకొను. దే. అ. క్రి: చూ, ముమ్మరించు.

గడ్డూకము. సం.వి.అ పుం: చూ,రూ-గడ్డుకము.

గడ్డెనబొద్దు. దే. వి: చూ, బాలక్రీడ.

గణకకర్మము. సం. వి.అ. న. లెక్కవ్రాయుట.

గణకరిక. సం.వి.ఆ. స్త్రీ: చూ, పెద్దపాఁపర*.

గణకి. సం. వి. ఈ. స్త్రీ. జ్యోతిషిక స్త్రీ: చూ, సాంవత్సరుఁడు. (చూ, స్త్రీ.)

గణకుఁడు. సం. వి. అ. పుం. జోస్యుఁడు: చూ, సాంవత్సరుఁడు; 2.=కరణము: చూ, పంజీకరుఁడు. (రూ-గణికుఁడు).

గణగణ. దే. వి. 1. ఘంటాధ్వనియందగుననుకరణము: చూ, హాహా; 2. చుఱుకుగా మాటలాడుటయందగుననుకరణము: చూ, హాహా.

గణచక్రకము. సం వి. అ. న. ధార్మికులుకలసి భోజనముచేయుట.

గణన. సం. వి. ఆ. స్త్రీ, అ. న. 1.=గడన. ఎన్నిక: చూ, సంకల్పము; 2. రూ-గణనము. లెక్కపెట్టుట: చూ, సంఖ్య. 1.

గణనము. సం. వి. అ. న. లెక్కపెట్టుట: చూ, రూ-గణన. 2.

గణనాయిక. సం. వి. ఆ. స్త్రీ. గౌరి: చూ, పార్వతి. 1.

గణనీయము. సం. విశే. లెక్కపెట్టఁదగినది (నక్షత్రాదులు): చూ, సంఖ్యేయము (రూ-గణేయము-గాణేయము).

గణపతి. సం. వి. ఇ. పుం: చూ, వినాయకుఁడు. 1.

గణపర్వతము. సం. వి. అ. పుం. కైలాసము: చూ, పర్వతము. (ఇట్లు గణాచలము)

గణము. సం. వి. అ. పుం 1. గుంపు: చూ. సమూహము; 2. ప్రమథుల సమూహము: చూ, సమూహము; 3. సేనావిశేషము. (ఇరువదియేడు రథములు అన్నియేనుఁగులు ఎనుబదియొక్క గుఱ్ఱము నూటముప్పదియైదురు కాల్వురునుగలది.): చూ, సేన. 1. (మూఁడుగుల్మములొకగణము); పా. 4. గురులఘువర్ణముల కూడిక కలది. సామాన్యముగా గురులఘువులు మూఁడుకూడినది గణము. కాని రెండు-మూఁడు-నాలుగు-ఐదువర్ణములుగల గణములుం గలవు: చూ, అష్టగణలక్షణము-ఉపగణములు. (సులభముగ గుర్తించు శ్లోకము.-"ఆదిమధ్యావసానేషు యరతాయాంతిలాఘవం. భజసా గౌరవంయాంతిమనౌతుగురులాఘవే." మతియు-న, హలు (2) సూర్యగణములు; భ, ర, త, నగ, నల, సలములు (6)ఇంద్రగణములు; తగ, తల, రగ, రల, భగ, భల, మల, సగల, నలగ, నగగ, నలల, సగల, సలగ, సలల లు (14) చంద్రగణములు, చంద్రగణము లక్కరాదు లందగు, తఱచుగ నింద్రసూర్యగణములె యుపయుక్తములు. పద్యములనుబట్టి యీయీగణములు నిన్నిగణములునని నియమముండును.)

గణరాత్రము. సం. వి. అ. న. పెక్కురాత్రుల సమూహము: చూ, రాత్రి.

గణరూపకము. సం. వి. అ. పుం. తెల్లజిల్లేడు, జిల్లేడు (అని కొందఱు)*: చూ, జిల్లేడు.

గణరూపము. సం. వి. అ. పుం. అర్కము*: చూ, జిల్లేడు.

గణరూపి. సం. వి. న్. పుం. తెల్లజిల్లేడు*: చూ, జిల్లేడు.

గణవతి. సం. వి. ఈ. స్త్రీ. ధన్వంతరితల్లి: చూ, పాలకాఖ్య.

గణవతీసుతుఁడు. సం. వి. అ. పుం. దివోదాసుఁడను రాజు: చూ, రాజు. 1.

గణహాసకము. సం. వి. అ. పుం. 1. నల్లకచోరము, చోరమను గంధద్రవ్యము (వాడుక)*: చూ, రాజార్హము; 2. చండయను గంధద్రవ్యము: చూ, రాజార్హము; 3: చూ, బలురక్కసి*.

గణహాసము. సం. వి. అ. పుం. చోరమనుగంధద్రవ్యము: చూ, రాజార్హము.

గణాగ్రణి. సం. వి. ఈ. పుం: చూ, వినాయకుఁడు. 1.

గణాధిపతి. సం. వి. ఇ. పుం. 1: చూ, శివుఁడు, 2: చూ, వినాయకుఁడు. 1. (ఇట్లు గణాధిపుఁడు)

గణి. సం. వి. ఇ. పుం. 1: చూ, గణనము; 2. సాంగముగా వేదాధ్యయనముచేసినవాఁడు. (అనఁగా ఋక్కు-యజుస్సు-సామము-అథర్వణవేదములను, శిక్ష-వ్యాకరణము-ఛందస్సు-నిరుక్తము-కల్పమను ఆఱువేదాంగములను జదివినవాఁడు.): (సం, ప.) అధ్యాపకుఁడు, ఉపాధ్యాయుఁడు, గురువు.

గణించు. సం. స. క్రి. 1. ఎంచు: చూ, లెక్కించు; 2: చూ, లక్ష్యపెట్టు.

గణిక. సం. వి. ఆ. స్త్రీ. 1. భోగముది: చూ, వేశ్య; 2. ఆఁడేనుఁగు: చూ, హస్తి: 8 అడవిమొల్ల*: చూ, యూథిక. 1; 4. శతపుష్పి*:

చూ, సదావ; 5. ఇల్లిందము*: చూ, మాతులుంగము; 6. వెల్లి, కూరవెల్లి (అని కొందఱు)*: చూ, శ్రీపర్ణము. 1.

గణికారిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, గణిక. 6*.

గణికుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ-గణకుఁడు. (అని కొందఱు)

గణితము. సం. వి. అ. న. 1. అంకవిద్య: చూ, సంఖ్య. 1. (చూ, గణితశాస్త్రము); విణ. 2. ఎంచఁబడినది. సంఖ్యాతము. చూ, సంఖ్య.1; అం. 3. అవధానములు ఎనిమిదింటిలో నొకటి: చూ, అవధానములు.

గణితములు. అం. అంకగణితము, క్షేత్రగణితము.

గణితవ్యము. సం. విణ. ఎంచఁదగినది: చూ, సంఖ్యేయము.

గణితశాస్త్రము. పా. గణితశాస్త్రమనఁగా.— క్షేత్రము, బీజము, అంకము, భిన్నము అని యనేక భేదములుగలవు. ఇందుకుఁ బ్రధాన గ్రంథములు లీలావతి, విమలవతి మొ: చూ, ఉపవిద్యలు. (ఇందుకు సంబంధించిన శాస్త్ర పరిభాషాపదములు.— గణితము:—శుద్ధగణితము, మిశ్రగణితము. శాతవ్యలిగణితము, చక్రభాస, ఆచ్ఛాదక, అపచక్రిలద, హారాత్మక, అతిపరవలయ, అతిచక్రిలద అతిత్రిచ్ఛేద. ఇలామూల. పరవలయ, కరణి మొ; మఱియు.— భిన్నము :— సంశ్లిష్టభిన్నము, సంయుక్తభిన్నము, అవిరామభిన్నము, దశాంశ భిన్నము, అపక్రమ భిన్నము, మిశ్రభిన్నము, క్రమభిన్నము, అంశబోధక భిన్నము, లుప్తభిన్నము, సాధారణభిన్నము. మొ.)

గణితి. వా. వి. ఎంచఁదగినలెక్క. "మనుష్యుల గణితి, పశువులగణితి." మొ.

గణిల్లు. దే. వి. ఎద్దు అంకవేయుట లోనగు వానియందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

గణుతి. వై. వి. 1.=గణన. ఎన్నిక: చూ, సంకల్పము; 2. పొగడ్త: చూ, స్తోత్రము; 3. గుఱి: చూ, లక్ష్యము. 1.

గణుతించు. వై. స. క్రి. 1. ఎంచు: చూ, లెక్కించు; 2. పొగడు: చూ, స్తుతించు; 3. లెక్కపెట్టు: చూ, లెక్కసేయు.

గణుతిచేయు. వై. స. క్రి. ఎంచు: చూ, లెక్కించు.

గణెము. దే. వి. వేషధారులు ధరించెడు లక్క సొమ్ము: చూ, భూషణము. 2.

గణేయము. సం. విణ: చూ, రూ-గణనీయము.

గణేరుక. సం. వి. ఆ. స్త్రీ. కుంటెనకత్తె: చూ. శంభళి.

గణేరువు. సం. వి. ఉ. స్త్రీ. 1. భోగముది. చూ, వేశ్య; 2. ఏనుఁగు: చూ, హస్తి: పుం. 3. కొండగోఁగు*: చూ, మృదుద్రుమము.

గణేశకుసుమము. సం. వి. అ. పుం. ఎఱ్ఱగన్నేరు*: చూ, హయమారకము.

గణేశభూషణము. సం. వి. అ. న. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము. 1.

గణేశుఁడు. సం. వి. అ. పుం: చూ, శివుఁడు.

గణోత్సాహము. సం. వి. అ. పుం. కుచ్చెలమీను: చూ, మత్స్యము. 1.

గణ్యుఁడు. సం. విణ. ఎంచఁదగినవాఁడు: చూ, సంఖ్యావంతుఁడు. 2.

గతజలసేతుబంధనన్యాయము. పా. నీరు పోయిన తరువాత గట్టువేసిన విధము.

గతజలసేతుబంధనము. జా. గతించినదానికి విచారించుట. నీరుపోయినతరువాత సేతువుగట్టుట. "చ. గతజలసేతుబంధనముగాదె యికం బరితాపమొందుటల్." (శంతనూపాఖ్యానము.)

గతపడు. మి. అ. క్రి. (గతము + పడు) 1. కడచు: చూ, సను. 3; 2. చెచ్చు: చూ, మరణించు.

గతము. సం. వి. అ. న. 1. పోక: చూ, ప్రయాణము; విణ. 2. పోయినది: చూ, హితము.3; 3. తెలియఁబడినది, పొందఁబడినది. (అని కొందఱు): చూ, వ్యక్తము. 2.

గతసన్నకము. సం. వి. అ. పుం. మదముడిగిన యేనుఁగు, నిర్మదము: చూ, హస్తి.

గతి. సం. వి. ఇ. స్త్రీ. 1. పోక .(గతులు మూఁడు.— దానము, భోగము నాశము): చూ, వర్తనము. 1; 2.=గండి. త్రోవ: చూ, మార్గము. 1; 3. నారిపుంటికంటిత్రోవ; 4. ఉపాయము: చూ, వెరవు; 5. తెలివి: చూ, బుద్ధి; 6. బాల్యము లోనగు దశ: చూ, వయస్సు. 1; 7. చందము. (ఈయర్థమునకు తెనుఁగున వాడుక): చూ, విధము. 1; 8. మూఁడునొకటి: చూ, నాలుగు; 9. సెల వేసినకులుపు: చూ, వ్రణము. 1; 10. పయనము: చూ, యాత్ర; 11. బ. అవస్థ, దశ: (చూ, అవస్థలు, ద్వాదశావస్థలు); అం. 12. సాముద్రికశాస్త్రమునందలి పురుషలక్షణాంగములు ఏఁబదియెనిమిదింటిలో నొకటి. (గతి.=నడక:— వృషభము, సింహము, శార్దూలము, గజము, హంసగతిగలిగినరాజగు; శుకగతిభోగియగు; శ్వాన, ఉష్ట్ర, మహిష, సూకరగతులైన భాగ్యహీనుఁడగు; నీటితరగల గతి దరిద్రవ్యక్తియగు; కాకగతి దుఃఖకరము; ఉలూకగతిరోగకరము): చూ, లక్షణాంగములు; 13. స్త్రీ లక్షణాంగములు ఏఁబదియెనిమిదింటిలో నొకటి: (గతి.=నడక:—హంస వలె నేనుఁగువలెనున్న రాజపత్ని యగు. భూమియదురునట్లు నడిచిన సర్వజనవిరోధురాలగు.): చూ, స్త్రీలక్షణాంగములు; 14. రస భావాదులందలి గుణములు ఇరువదినాలుగింటిలో నొకటి: చూ, గుణములు.

గతించు. షం. అ. క్రి: చూ, గతపడు.

గతితత్త్వరుపము. పా. అస్తమయము-పురస్కారము-తిరస్కారము- పశ్చాత్కారము- అలంకృతి ఇత్యాదులు గతితత్త్వరుపములు.

గతిబలము. పా. విసరుటవలన గలుగు బలము.

గతిభేదములు. అం. ఋషి, స్నాతకుఁడు, యతి, పాండిలుఁడు, ద్వయాతిగుఁడు, మాలికుఁడు, లోచకుఁడు, శౌర్యుఁడు, ఖపుటుఁడు. (9)

గతిల. సం.వి. అ. స్త్రీ. గతిలయను నది: చూ, నది.

గతివిశేషములు. అం. అశ్వశాస్త్రమునందలి (వీధిలో) గతివిశేషములు:—ఉరశ్చాలి, శిరశ్చాలి, పృథులము, బధ్యమానకము, ఆలీఢము, ప్రత్యాలీఢము, ఉపధ, పాదచారి, సర్వగము. (9).

గతుకు. దే. వి. 1. రూ-గదుకు. ఎంగిలితినుట: చూ, సాపాటు; స. క్రి. 2. రూ-గదుకు. ఎంగిలితిను: చూ, సాపడు. (కతుకు అనియు వాడుక.)

గతులు. అం. మల్లశాస్త్రములోనివి.—హరి, గజము, వ్యాఘ్రము, పక్షి, నరుఁడు, మహిషము, జంబుకము, మర్కటము (కుక్కుటమని కొందఱు), హరిణము, మార్జాలము, చటకము, తాండవము; (12). చూ, మల్లశాస్త్రము.

గత్త. దే. వి. రూ-గత్తము. ఎరువు: చూ, పేడక.

గత్తము. దే. వి.—పై.—

గత్తర. దే. వి. 1. ఉపద్రవము: చూ, విపత్తు; 2 దోషముయొక్క ప్రకటనము: చూ, రద్దు.2;విణ. 3.దోషమువలన ప్రకటితమైనది. చూ, రద్దు. 2.

గత్తు. దే. వి. మూత్రగంధము (గచ్చుకంపు-గత్తుకంపు అని వాడుక): చూ, వాసన.

గద. సం. వి. అ. స్త్రీ. 1.=గుదియ, నాలుగు మూరలు నిడివిగలదండము: చూ, బాణము.1; 2. పాదిరి*: చూ, స్థాలి. 2; అం. 3. విష్ణ్వాయుధములయిదింటిలో నొకటి: చూ, విష్ణ్వాయుధములు; 4. ముప్పదిరెండాయుధములలో

శాకటి: చూ, ముప్పదిరెండాయుధములు. (చూ, బాణము. 1.)

గదమాయించు. వా. క్రి: చూ, గద్దించు.

గదము. సం వి.అ. పుం. తెవులువిషము(అని కొందఱు): చూ, రోగము. 1.

గదయిత్నువు. సం. విణ. ఉ. 1. కాముకుఁడు: చూ,వలపుకాఁడు; 2. మిక్కిలి అసహ్యముగ మాటలాడువాఁడు, జల్పాకుఁడు (పుంలింగమని కొందఱు): చూ, వక్త. 1.

గదాంబరము. సం. వి. అ. పుం. మబ్బు: చూ, మేఘము. 1. (గదాంవరము అనియు)

గదాఖ్యము. సం. వి. అ. న. కుష్ఠము: చూ, మండలము. 8.

గదాగదులు. సం. వి. అ. పుం. స్వర్వైద్యులు

గదాగ్రజుఁడు. సం. వి. అ. పుం. గదునియన్న: చూ, విష్ణువు. 1.

గదాగ్రణి. సం. వి. ఈ. పుం. క్షయరోగము: చూ, దగ్గు, (ఇకారాంతమని కొందఱు).

గదాధరుఁడు. సం. వి. అ. పుం. చూ, గదాగ్రజుఁడు.

గదాభృత్తు. (గదాభృతుఁడు) సం. వి. త్. పుం. —పై.—

గదారాతి. సం. వి ఇ. పుం. ఔషధము: చూ, మందు. 1.

గదాహ్వము. సం. వి. అ. న: చూ, గదాఖ్యము.

గది. సం. వి. న్. పుం. 1. గదనుధరించినవాఁడు: చూ, విష్ణువు. 1; విణ. 2. తెవులుగలవాఁడు: చూ, వ్యాధితుఁడు; దే. వి. (1) ఇంటిలోపలి యఱ: చూ,సదనము. 1."పడకగది, వంటగది." మొ; (2) రెండుదూలముల మధ్యప్రదేశము, కాను (అని వాడుక), కాలిభాగము.

గదుఁడు. సం. వి. అ. పుం. కృష్ణుని తమ్ముఁడు, కృష్ణునియన్న (అని కొందఱు).

గదుకు. దే. స. క్రి: చూ, రూ-గతుకు.

గదుగుడు. దే. వి. గళనము. ఆం, పదా. సర. 109: చూ, జాఱుడు.

గదుము. దే స. క్రి రూ-గద్దించు: చూ, జెళిపించు.

గదుముకొను. దే. స. క్రి —పై.—(స్వార్థమున కొను).

గదురు. దే. వి. చెడుకంపు. పాండు. 2, ఆ. 56: చూ, వాసన.

గద్గదము. సం. విణ. = గద్గ. డగ్గుత్తికపడినది (మాట): చూ, శబ్దము. 2.

గద్గదస్వరము. సం. వి అ. పుం. 1. ఎనుపోతు: చూ, మహిషము; 2. మన్మనము, డగ్గుత్తికపడిన యెలుఁగు: చూ, స్వరము. 2.

గద్గదిక. సం. వి. ఆ. స్త్రీ.=గద్గ: చూ, గద్గదము.

గద్ద. వై. వి.=గృధ్రి. యా-గ్రద్ద: చూ, దాక్షాయ్యము.

గద్దకత్తె. వై. వి. అసాధ్యురాలు (రూ-గద్దతి-గడుసు-గరాసు): చూ, స్త్రీ.

గద్దగోరు. వై. వి. 1.=గృధ్రిఖుర. గరుడిగోరు, రూ-గ్రిద్దగోరు: చోరసాధనవిశేషము: చూ, ములుబంతి; వా. వి. 2. అందమునకై తాళపుచెవులగుత్తిలో తగిలించి మొలత్రాడున నుంచుకొనెడు వెండిలోనగువాని ఆభరణము: చూ, భూషణము. 2.

గద్దన. దే. వి. గద్దింపు.

గద్దముక్కుచేఁప. ద్వ. వి. కంకత్రోటమనుచేఁప: చూ, మత్స్యము. 1.

గద్దముక్కువాఁడు ద్వ. విణ. రూ-గ్రద్దముక్కువాఁడు: చూ, వాఁడిముక్కువాఁడు.

గద్దతి. దే. వి. దిట్టతనముకలది. "గద్దతిగద్ద.": చూ, స్త్రీ.

గద్దతికాఁడు. దే. విణ. దిట్టతనము కలవాఁడు.

అచ్చు. ము౦, కాం. 12: చూ, దిట్టఁడు. (స్వార్థమున కాఁడు).

గద్దించు. వై. అ. క్రి=గర్జించు. కోపమున అదలించు. రూ. గదుము-గదుముకొను: చూ, గదుము (దేశ్యమని శబ్దరత్నాకరము.)

గద్దియ. వై.వి. రూ-గద్దె. 1. చూ, సింహాసనము; 2.=ఖటికా. ఉన్నతపీఠము. పీఠము (అని కొందఱు.): చూ, పీఁట; 3.=గద్యా.ఎఱుక: చూ, సోదె; 4.=గద్యాణ.దీనారము, పైఁడినాణెము: చూ, లోహము. 1.

గద్దువ. వై. వి.=గండ. గడ్డము: చూ, శ్మశ్రువు. (దేశ్యమని శబ్దరత్నాకరము)

గద్దె. వై. వి.=చూ, రూ-గద్దియ.

గద్దెకాకులది. ద్వి. వి. ఒకరకము కోడి: చూ, పుంజు.

గద్దెపొంకము. ద్వి. వి. 1. పరువునకుఁ దగిన గౌరవంపు మాట: చూ, శబ్దము. 2; జా. 2. అధికారి పీఠముపైఁ గూర్చుండి చెప్పు మాటలు.

గద్య. అం. (గద్యము) అసంఖ్యాబద్ధములగు రగడ, గద్య, ద్విపద, దండకము. మంజర్యాదులలో నిదియొకటి. (చూ, గద్యము.)

గద్యకావ్యము. అం. కావ్యములు మూఁడింటిలో నొకటి: చూ, కావ్యము, (ఇది పద్యకావ్యము వలె ఛందోబద్ధము గాదుగాని తక్కిన సకల లక్షణములు కలిగియుండును. నీతిచంద్రిక మొ.)

గద్యము. సం. వి. అ. న. 1.=గద్దె. వచనము. (గద్యఅని వాడుక) (యగణతగణజగణాదులును, పాదములేని కవనము.) (సూ.-గద్యంబున నుచ్చారణ శ్రవణపారుష్యవిరహితంబుగ యథాయోగ్యత వక్తయిచ్ఛకొలఁది సంధి విడదీయనగు.); 2. చెప్పఁదగినది: చూ, వక్తవ్యము.

గద్యాణము. సం.వి.అ. పుం.=గద్దె 1. బంగారు వరహా రెండుధరణములయెత్తు వెండి (అని కొందఱు): చూ, లోహము. 1.

గనగన. దే. వి. 1. తపించుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ; 2. మండుటు, నిప్పులు ఎఱ్ఱగనగుటలోనగు వానియందలినను కరణము. (కర్మధారయసమాసమునందు దీనికి నిగాగమంబువచ్చును. "గనగనని నిప్పులు.": చూ, హూహూ.

గనపు. దే. విశ. పెద్ద: చూ, విపులము (రూ-గణువ-గజే-గంగ.)

గనపరాతులు. దే. వి. బ. గన్నెరాతులవంటి ముల్కులు.

గనము. వై. వి.=ఘన. అధికము: చూ, హెచ్చు.1.

గనయము. దే. వి. 1. నీవీబంధము: చూ, పోఁకముడి; 2. అటని. పా. 4, ఆ. 81: చూ, వింటికొప్పు.

గని. వై. వి. 1.=ఖని. బంగారులోనగునవి పుట్టుచోటు: చూ, భూమి. 1; 2 బిలము: చూ, రంధ్రము. 1.

గనిమ. దే. వి. మడికిఁ జోటు నేర్పఱచిన చిన్నకట్ట. రూ-గనిమె. చూ, సేతువు. 1.

గనిమె. దే. వి.—వై —

గనియ. వై.వి.=కణ. రూ-గనె. 1.ఖండము: చూ, శకలము. 4; 2. చెఱువు మొదలగువాని ఖండము: చూ, కండ్రి. 5.

గనీబు. దే. వి. ఒఱ: చూ, నిచోళము (తలగడయొఱ=గలీబు అని వాడుక).

గనుపు. దే. వి. 1. రూ-కనుపు. వెదురుచెఱకులోనగు వానియందెడ నెడనేర్పడి యుండుముడి, పర్వము: చూ, బుడిపి: వా. 2. దెబ్బవాపు: చూ, బొప్పి.

గనె. వై. వి.=చూ, రూ-గనియ.

గన్నేర. వై.వి.=కరవీరము.రూ-గన్నేరు-గన్నేరు (ఎఱ్ఱగన్నేరు, తెల్లగన్నేరు, పచ్చగన్నేరు అని త్రివిధము): చూ, హయమారకము (ఇది విష ముగాన లోపలకియ్యకూడదు. దీనివేరు గర్భ స్రావము కలిగించును) (శైత్యమని శబ్దరత్నా కరము.)

గన్నేరాకుముల్కి. ద్వ. వి. (గన్నేరు + ఆకు + ముల్కి) గన్నేరాకువంటి యలుఁగుగల బాణ ము: చూ, బాణము. 1.

గన్నేరు. వై. వి.=చూ, రూ-గన్నేర.

గన్నేరు. వై. వి.= —పై.—

గపటిక. సం. వి. అ. స్త్రీ. =గంటె. వరిగవైరు, పెద్దారుగవైరు: చూ, సస్యము. 1.

గప్పాలు. వా. వి. బ. గొప్పలు, టప్పాలు, డచ్చీ లు, డబుక్కులు, డాబులు, డాబుసరులు, బడా యిలు, వంకాయకోఁతలు, సొఱకాయకోఁత లు, (అతిశయపుమాటలు).

గబాలు. వా. వి. దాఁటుటయందగు ధ్వన్యను కరణము: చూ, హఠాహఠా.

గబీగుబీ. వా. వి. నేల అదరునట్లు వడిగా నడ చుట, గ్రుద్దుటలోనగు వానియందగు ధ్వన్యను కరణము: చూ, హఠాహఠా.

గబీలు. వా. వి. మండుట, కూలుట, గ్రుద్దుట లోనగు వానియందగు ధ్వన్యనుకరణము: చూ హఠాహఠా.

గబుకు. వా. వి. రూ-గబుక్కు, చేటుకు. "గబు కున గ్రుద్దినాఁడు." "గబుకు గబుకు ముద్దలు మ్రింగినాఁడు."

గబుక్కు. వా.వి.—పై.—(అవ్య.-గబుక్కున, చేటుక్కున మొ.) "గోడ గబుక్కున కూలి నది." (వాడుక.)

గబ్బ. వై.వి.=కపటము. కూబీ: చూ, వ్యాజము. 1.

గబ్బాటు. దే. వి. 1. కలఁత: చూ, సంతాపము: విణ. 2. వెలతక్కువైనది, అనర్ఘము.(పసుపు, కంద, చేమ, గెనుసు, పెండలము మొ.)

గబ్బి. వై. వి. 1. కపటము. ఆం, భా. ప్ర. 188: చూ, వ్యాజము. 1; 2.=గర్వ గాంభీర్యమును బట్టి తక్కికియ్యఁబడినపేరు. స్వా. 4, ఆ. 82: చూ, నివఁగి. 2; విణ. 3.=గర్వి. గర్వ ముగలవాఁడు: చూ, పొగరుఁబోతు.

గబ్బిడము. దే. వి. రూ-గబ్బిలము: చూ, తైల పాయిక. (రూ- గబ్బిడా- గబ్బిడాయి- గబ్బి లము-గబ్బిరాయి-గబ్బిలాయి.)

గబ్బిడా. దే. వి.—పై.—

గబ్బిడాయి. దే. వి.—పై.—

గబ్బిరాయి. దే. వి.—పై.—

గబ్బిలము. దే. వి.—పై.—

గబ్బిలాయి. దే వి.—పై.—

గబ్బిలి. దే. వి. పిడికిలి: చూ, ముష్టి. 2.

గబ్బిస. దే. వి. ఒకానొక మూలిక*: చూ, వృక్షము.

గబ్బు. దే. వి. 1. చెడుకంపు. కై. 3, ఆ. 74: చూ, వాసన; 2. గంధము. ఆం,భా.ప్ర. 106: చూ, వాసన; వై.వి. 3.=గర్వము.పాండు. 1, ఆ. 117: చూ, హంకారము; 4. మత్తు: చూ, మదము.1; 5. కక్కుభము: చూ, బెళగువ్వ.

గబ్బుచీఁకటి. దే. వి. గాఢాంధకారము: చూ, మేచకము. 1.

గబ్బుచెంకమెకము. ద్వ. వి. ఏనుఁగు: చూ, హస్తి.

గబ్బులుఁగు. దే. వి. ఒకరకముకకున పక్షి, భాసం తము: చూ, బెళగువ్వ.

గభస్తి. సం. వి. ఇ. పుం. 1. సూర్యకిరణము, సూర్యచంద్రాదుల రశ్మి (అని కొందఱు): చూ, హాయనము. 2; 2. ఇనుఁడు: చూ, సూర్యుఁడు; 3. ఆగ్నాయి, స్వాహా, అగ్ని పెండ్లాము: చూ, భార్య; అం. 4. ఖండములు తొమ్మిదిటిలో నొకటి: చూ, ఖండములు.

గభస్తిమంతుఁడు. సం. వి. త్. పుం. చూ, సూర్యుఁడు.

గభస్తిహస్తుఁడు సం. వి. అ. పుం. —పై.—

గభస్త్యస్త్రము. అం. ధనుర్వేదమునందలి అస్త్రములు ఏఁబదియూఁడింటిలో నొకటి: చూ. అస్త్రములు. (చూ, బాణము. 1 శస్త్రములు, ముప్పదిరెండాయుధములు.)

గభీరము. సం.వి అ న.=1: చూ, రూ-గంభీరము 6; వి. 2. నీచస్థానము: చూ, స్థానము. 1; విణ. 3: చూ, రూ-గంభీరము. 7.

గభీరిక. సం. వి. ఆ. స్త్రీ. బృహడ్ఢక్కా: చూ, వీణె.

గభీరిమ. సం. వి. న్. పుం: చూ, రూ-గంభీరిమ.

గభోలికము. సం. వి. అ. పుం. చిఱుసెనగలు: చూ, సెనగలు.

గభోళి. సం. వి. ఇ. స్త్రీ. ఒఱగుదిండు: చూ, లోడు.

గమకము. సం. వి. అ. పుం. 1. సంగీతశాస్త్రమునందలి స్వరవిన్యాసభేదము: చూ, స్వరము.2; 2. క్రిందిపెదవిక్రింది గుంట: చూ, పెదవి (చూ, రంధ్రము. 1); విణ. 3. తోఁపఁజేయునది: అం. 4. రాగాధ్యాయములోని అష్టాదశ పదార్థములలో నొకటి: చూ, అష్టాదశ పదార్థములు; దే. వి. (1) లావు: చూ, స్థూలము.2; (2) అధిక్యము: చూ, హెచ్చు.1; (3) ప్రయత్నము: చూ, యత్నము; విణ. (4) మనోజ్ఞము: చూ, హృద్యము.

గమకములు. అం. రిరిఫువు, స్ఫురితము, కంపితము, లీనము, ఆందోళితము, వళ్లి, త్రిభిన్నము, కురళము, ఆహతము, ఉల్లాసితము, ప్లావితము, గుంఫితము, ముద్రితము, నామితము, మిశ్రము. (15): చూ, ఉపవిద్యలు.

గమకారిత్వము. సం. వి. అ. న: చూ, రభసము.

గదకించు. దే. అ. క్రి: చూ, యత్నించు.

గమగమ. దే. వి. వాసనకొట్టుటయందగునను కరణము. స్వా. 2, ఆ.55: చూ, హాహాహా.

గమగమించు. దే. అ. క్రి. గమగమయని వాసనకొట్టు: (తె, ప) గమాయించు.

గమథుఁడు. సం. విణ. తెరువరి: చూ, పాంథుఁడు.

గమనము. సం. వి. అ. న. 1. రూ-గమము. పోఁక: చూ, వర్తనము. 1; 2: చూ, ప్రయాణము; 3. తలఁపు: చూ, స్మృతి. 1; 4. కోరిక: చూ, వాంఛ; అం. 5. తర్కశాస్త్రమునందలి పంచవిధకర్మములలో నొకటి: చూ, కర్మములు.

గమనించు. సం. అ. క్రి. 1. పోవు: చూ, వెళ్ళు. 3; 2. తలఁచు: చూ, యోచించు.

గమని. సం. వి. ఆ. స్త్రీ. 1. నడవడి: చూ, వర్తనము. 1; దే. వి. (1) చందము: చూ, విధము. 1.

గమము. సం. వి. అ. పుం. 1. నడవడి: చూ, వర్తనము. 1; 2. పయనము: చూ, ప్రయాణము; 3 త్రోవ: చూ, మార్గము. 1.

గమళ్లవాఁడు. దే. వి. క్షత్రియస్త్రీకి శూద్రునకుంబుట్టిన అయిదువిధముల సారాయి నమ్మువాఁడు: చూ, సురాజీవి.

గమాయించు. దే. అ. క్రి: చూ, గమగమించు.

గమి. సం. విణ. న్. 1. తెరువరి: చూ, పాంథుఁడు; దే. వి. (1) గుంపు, రూ-గుమి-గుమురు-గుబురు: చూ, సమూహము; విణ. 2. తఱచు: చూ, మొత్తము.

గమించు. సం. అ. క్రి. పోవు. రూ-గమియించు: చూ, వెళ్ళు. 3.

గమికత్తె. ద్వ. వి. అంతఃపురమునందు కావలియుండెడు ఆఁడుది. కళా. 4, ఆ. 164: చూ, స్త్రీ.

గమికాఁడు. దే. వి. 1. కాకి: చూ, వాయసము; 2. అధిపతి: చూ, ప్రభువు. 2; 3. దళపతి: చూ, సైనికుఁడు; 4. అల్పసైన్యాధిపతి: చూ, సైనికుఁడు (ఆం. భా. ద్వి. 184.); 5. ముఖ్యుఁడు: చూ, శ్రేష్ఠుఁడు.

గమికొను దే. అ. క్రి. అంటుకొట్టు: చూ, పోగుపడు.

గమియించు. సం. అ. క్రి: చూ, రూ-గమించు.

గమిష్ఠువు. సం. వి. ఉ. పుం. 1. కురుక్షేత్రము: చూ, దేశము; 2. గాలి: చూ, వాయువు.

గమ్మత్తు. వా. వి. 1. వేడుక; 2. తమాషా; 3. కనుకట్టు; 4. రహస్యము.

గమ్ము. దే. వి. 1. వాసనకొట్టుటయం దగునను కరణము. వసు. 5, ఆ. 106: చూ, హూహూ; వా. వి. 2. తుమ్మబంక: చూ, జిగురు.

గమ్మున. వా. అవ్య. త్వరితముగ "గమ్మున వెళ్లి రమ్ము."

గమ్యము. సం. విణ. పొందఁదగినది: చూ, ప్రాప్యము.

గయ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఫల్గునీ నదీతీరమున నుండు గయ యను పట్టణము: చూ, దేశము; 2. తీర్థవిశేషము: చూ, భూమి. 1; అం. 3. క్షేత్రములు ఇరువదినాలుగింటిలో నొకటి: చూ, క్షేత్రములు. (విశేషము.— శిరోగయ-గయ, నాభిగయ-భువనేశ్వరము, పాదగయ-పీఠికాపురము.)

గయము. సం. వి. అ. పుం. పశువు: చూ, మృగము. 1.

గయాపిండదానార్హులు. అం. పిండదానక్రమము— శ్లో॥ ఆదౌపితా, తథామాతా, । సాపత్నీ. జననీ, తథా । మాతామహస్సపత్నీకాః । ఆత్మపత్నీ, తథైవచ । సుత, భ్రాతృ। పితృవ్యాశ్చ । మాతులాశ్చసభార్యకాః, దుహితా, భగినీ, చైవ । దౌహిత్రో, భాగినేయకః, । పితృష్వసా, మాతృష్వసా,। జామాతా, భావుక, స్నుషా, । శ్వశుర, శ్యాలక, శ్చైవ । స్వామినో, గురురర్థినః తా —తండ్రి, తల్లి, సవతితల్లి, భార్యాయుక్తమాతామహులు, స్వభార్య, కొడుకు, అన్న, పిన్న పెదతండ్రులు, భార్యాయుక్తమైన మామలు, కూఁతురు, అప్ప, దౌహిత్రుఁడు, మేనల్లుఁడు, మేనత్త, పినతల్లి పెదతల్లులు, జామాత (అల్లుఁడు), అప్పచెల్లెండ్రభర్త, కోడలు, మామ, శ్యాలకుఁడు, రాజు, గురువు, దాసదాసీలు వీరు పిండోదకక్రమపద్ధతిలోనివారు; రెండవ విధము.— తండ్రి, తాత, ముత్తాత, వారి తల్లిదండ్రులు, తల్లి, అత్త, ఆమెయత్త, మారుతల్లి, ఆమె తల్లిదండ్రులు, వారి తల్లిదండ్రులు, తల్లితల్లి, ఆమెతల్లి, ఆమెతల్లికిఁదల్లి, వారిబిడ్డలు, తన భార్య, తనబిడ్డలు, తన యన్నదమ్ములు, తన పెదతండ్రి, పినతండ్రులు, మేనమామలు, వారిభార్యలు, వారిసంతతులు, తనతోఁబుట్టువులు, వారిబిడ్డలు, వారిభర్తలు, బిడ్డనిచ్చిన యత్తమామలు, వారిసంతతులు, తనకన్నమిడి కాపాడినవాఁడు, మంత్రోపదేశము చేసిన వాఁడు, చదువుచెప్పినవాఁడు, వడుగుచేయించినవాఁడు, పెండ్లిచేయించినవాఁడు, భయముడిపి యాదరించినవాఁడు, అప్పిచ్చినవాఁడు, వానిభార్యలు, కొడుకులు, కోమార్తెలు, తన దాయాదులు (88) (ఇందు రూఢములగు పదములు మాత్రము శిష్ఠకాపదములుగ గ్రహింపఁబడియె.) (సంజ్ఞావివరణదర్పణము.)

గయావళీబ్రాహ్మణులు. పా. 1. ఘూర్జరబ్రాహ్మణులలో నొకతెగవారు. వీరు యజుర్వేదులు. ఖేడాజిల్లాలో చేరిన అదాస నడ్యాద గ్రామములయందుఁ గానంబడియెదరు: చూ,

బ్రాహ్మణులు; 2. గయయందలి ఫల్గునీనది యందు పిండములను వేయించు క్షేత్రపురోహితులు. (హిం. గయావాలా.)

గయాళము. దే. వి. రూ-గయ్యాళము. ధిక్కారపుమాట: చూ, శబ్దము. 2.

గయాళి. దే. విణ. ధిక్కరించుచు మాటలాడునది. రూ-గయ్యాళి: చూ, స్త్రీ.

గయాళించు. దే. అ. క్రి. ధిక్కరించి మాటలాడు: చూ, రూ-గయ్యాళించు.

గయాళు. దే.వి. రూ-గయ్యాళు. సేద్యముచేయుటకుఁ దగని పొలము: చూ, భూమి. 1.

గయిరమ్మ. వై. వి.=గౌరి: చూ, రూ-గవరమ్మ. (వాడుక). "గయిరమ్మ పండుగ": చూ, పార్వతి. 1

గయుఁడు. సం. వి. అ పుం. 1. ముక్కంటి: చూ, శివుఁడు; 2. గయుఁడను కోఁతి: చూ, వానరము; 3. గయుఁడను రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; అం. 4. మహారాజులు పదునాఱుగురిలో నొకఁడు: చూ, మహారాజులు-రాజు. 1.

గయ్యాళము. దే వి: చూ, రూ-గయాళము.

గయ్యాళి. దే. విణ: చూ, రూ-గయాళి "నీవెంత గయ్యాళిగంపవే."

గయ్యాళించు. దే. అ. క్రి: చూ, రూ-గయాళించు. కళా. 3, ఆ. 222.

గయ్యాళు. దే. వి: చూ, రూ-గయాళు.

గర. సం. వి. ఆ. స్త్రీ. 1. భోజనము: చూ, సాపాటు; దే. వి. (1) మంటిగడ్డ, మంటిముద్ద: చూ, భూమి. 1.

గరకట్టు. దే. అ. క్రి. గడ్డకట్టు. శై. 6, ఆ. 196: చూ, ముద్దకట్టు (రూ-గరమును-గరవడు)

గరకొను. దే. అ. క్రి.—వై.—

గరగ. వై. వి. =కరకా. రూ-గరిగ. 1. చిన్నకుండ, పెండ్లిలో వసంతముంచెడు గరగముంత (అనికొందఱు): చూ, భాండము. 8; 2. నీళ్లు త్రాగుటలోనగువాని కుపయోగించెడు చిన్న పాత్రము: చూ, పాత్రము. 6; 3. గ్రామదేవత (అమ్మవారు) ఘటము. "నూకాలమ్మ గరగ.": చూ, పాత్రము. 6.

గరగడ. దే వి. (గరగ + గడ) నూనె మొదలగునవి చిన్ననోరుగల పాత్రములలోఁ బోయుటకు అడుగున ఆఁదోఁకవలె క్రోవియమర్చి చేసిన విశాలమగు ముఖపాత్రవిశేషము, గళ్లా: చూ, పాత్రము. 6.

గరగముంత. వా. వి: చూ, గరగ. 1. 2.

గరగర. దే.విణ. నైర్మల్యము: చూ, సాచ్ఛ్యము. 2.

గరగరనివాఁడు. దే. వి. మెదురుఁడు: చూ, మిసమిసనివాఁడు.

గరగరిక. దే. వి. 1. నైర్మల్యము: చూ, గరగర; 2. అందము: చూ, సౌందర్యము; 3. తెలివి: చూ, బుద్ధి.

గరఘ్నము. సం. వి. అ. పుం. 1. నల్లగొగ్గెర *: చూ, పర్ణాసము; 2. బర్బరము *: చూ, బారంగి.

గరఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. గరఘ్ని యనుచేఁప: చూ, మత్స్యము. 1.

గరటి. సం. వి. ఇ. పుం. కరణములు పదునొకటింటిలో నొకటి: చూ, కరణము. 14 (చూ, కరణములు. 2.)

గరడి. వై. వి.=: చూ, రూ-గరిడి. 2.

గరణము. సం. వి. అ. న. భోజనము: చూ, సాపాటు. (తెనుఁగు అని కొందఱు)

గరదము. సం.వి.అ. న. విషము: చూ, విషము. 1.

గరదుఁడు. సం. విణ. విషముపెట్టువాఁడు.

గరపనేల. ద్వి. వి. మెరకనేల (గులకరాలచే గట్టియైనది): చూ, భూమి. 1.

గరభము. సం. వి. అ. పుం. చూ, రూ-గర్భము.

గరమూపంచకము. అం. కేలపండు, తుంగము తైలం, కరక్కాయ, కటుకరోహిణి, పిప్పలీ మూలము. (వై) .

గరము. సం. వి. అ. పుం. 1. (గరము=గరజి): చూ, గరజి; 2. రూ-గరళము. కృత్రిమ విషము "గరస్తుకృతకమ్ విషమ్" అ. పా. ప్రి. ఖో: చూ, విసము. 1; 3. వత్సనాభి*: చూ, విష. 1; 4. ఒకానొక రోగము: చూ, రోగము. 1.

గరలారి. సం. వి. ఇ. పుం. మరకతమణి: చూ, రత్నము. 1.

గరవడు. దే. అ. క్రి. (గర + పడు): చూ, గడ్డకట్టు.

గరళము. సం. వి. అ. న. 1. విషము: చూ, విసము. 1; 2. సర్పవిషము: చూ, విసము. 1; (కడుపులోగాని పేగులలోగాని పుండుగల రోగులకు గరళముతోఁ గూడిన మందులు వాడకూడదు); 3. వత్సనాభి *: చూ,విష.1; 4. గార *: చూ, హింగుది; 5. కసవుప్రోగు: చూ, కెంటి; 6. కొలఁది: చూ, పరిమాణము.

గరళముఖము. సం. వి. అ. పుం. పాము: చూ, సర్పము.

గరళాంశము. అం. వత్స్యాంశములలో నొకటి; చూ, వత్స్యాంశములు.

గరవ్రతము. సం. వి. అ. పుం. నెమిలి: చూ, మయూరము.

గరాగరి. సం. వి.ఈ. స్త్రీ. 1. రూ-ఖరాగరి*: చూ, దేవతాళము; వా. విణ. (1) ఉన్న దున్నటుల, సత్యమైనది. (తెలంగున గోదావరిమండల ప్రాంతమున వాడుక.)

గరాత్మకము. సం. వి.అ. న. శోభాంజనబీజము*: చూ, శిగ్రువు. 1.

గరాధిక. సం. వి. అ. స్త్రీ: చూ, లక్క.

గరాసు. వై. విణ. 1. దుష్టుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 2. పతివ్రత స్త్రీ: చూ, స్త్రీ; 3.=కర్కవ్యాసి. రక్కసి: చూ, రాక్షసి. 1.

గరి. సం. వి. ఈ. స్త్రీ: చూ, దేవతాళము *; వా. వి. (1) వాఁడి: చూ, వాలు. 6; (2) నాలుగు అణాలు: చూ, కోమటివాని లెక్క.

గరిండము. సం. వి. అ. న: చూ, పడక.

గరిఁటె. దే. వి: చూ, రూ-గంటె. 1. (రూ-గతిఁటె.)

గరికపూజలమెచ్చుగబ్బివేల్పు. మి. ద్వ. వి: చూ, వినాయకుఁడు. 1.

గరిగ. వై. వి. = కరకా: చూ, రూ-గరగ.

గరిడి. వై. వి. 1. చోటు: చూ, స్థానము. 1; 2.=ఖురళి. సాముకూటము. రూ-గరిడీ-గరడి: చూ, సదనము. 1; 3. గడసాదన.రూ-గరిడీ. కళా.7, అ.34: చూ, సాము.8; 4. దగ్గఱ. రాఘ. 2, అ. 18: చూ, సమీపము. 1.

గరిడిముచ్చు. ద్వ. వి. గడిముచ్చు. మంచివాని వలె దగ్గఱఁజేరియుండి సమయముచూచి దొంగిలించెడుదొంగ. కళా. 2, అ.45: చూ, ముచ్చు. 1.

గరిడియ. వై. వి.=కరండికా. పూలబుట్ట: చూ, సజ్జె.

గరిడీ. వై. వి. (రూ-గరడి-గరిడి) 1. = ఖురళి. సాముకూటము. వసు 4, అ. 73: చూ, సదనము. 1; 2. గడసాదన: చూ, సాము. 8.

గరిత. వై. వి. = గృహస్థా. 1. ఇల్లాలు: చూ, భార్య; 2. పతివ్రత. అచ్చ. యు, కాం.856: చూ, స్త్రీ.

గరిమ. సం. వి. న్. పుం. 1. రూ-గరిమము. గొప్పతనము: చూ, యోగ్యత; అం. 2. అణిమాద్యష్టసిద్ధులలో నొకటి: చూ, సిద్ధులు

(విభూతులు); పా. 8. (బరువు) ఒకవస్తువును భూమి యెంతశక్తితో నాకర్షించునో ఆశక్తి పరిమాణమే ఆవస్తువుయొక్క గరిమ (దీనివలన బరువునకును, ద్రవ్యరాశికిని గల భేదము తేట పడుచున్నది.): గరిమము.

గరిమనాభి. పా. పదార్థముయొక్క మధ్యతూకము (సెంటరాఫ్ గ్రావిటీ.)

గరిమము: చూ, గరిమ; అం. 4. తర్కశాస్త్రము నందలి పంచవిధకర్మములలో నొకటి: చూ, కర్మములు. 2.

గరిమిడి. దే. వి 1. రూ-గఱిక. దూర్వ*: చూ, తృణము 1; 2. ఎల్లెలుక: చూ, మూషికము.

గరిమిడికొక్కు. దే. వి. —2. పై.— స్వా.4, అ. 25.

గరియ. దే. వి. రూ-గరుగు*: చూ, ములగ.

గరివడి. వై. వి.=ఖాదిరవటకము: చూ, ఠంగదము.

గరివడియము. వై. వి. =—పై.—

గరివి. వై. వి.=గర్వి. గర్వముగలవాఁడు: చూ, పొగరుఁబోతు.

గరివించు. వై. వి.=గర్వించు: చూ, హంకరించు.

గరిష్ఠము. సం. విణ. 1. మిక్కిలిగురువు,మిక్కిలి బరువైనది: చూ, స్థవిష్ఠము.

గరిష్ఠసామాన్యప్రమాణము. పా. (గ్రేటెస్టు కామన్ మల్టిప్లికేషన్.)

గరిసె. వై. వి.=కర్ష. 1. రూ-గఱిసె. గంజ. ధాన్యముంచెడుకొట్టు: చూ, పంటసాల; 2. రూ-గఱిసె మానవిశేషము (గరిసె = 8 మలకపుట్లు, 7½ పల్లెపుట్లు, 15 పందుములు, 30 ఏదుములు, 150 తూములు, 600 కుంచెములు.) (గోదావరిజిల్లాలో వాడుక.)

గరిసెబావి. వై. వి. మెట్టలతో గరిసెవలెనల్లి భూమిలోపలికి కుంచియొత్తెడునూయి: చూ, నుయ్యి.

గరు. తె. వి: చూ, రూ-గగురు.

గరుగు. తె. వి: చూ, గరియ.

గరుజీ. వా. వి. అక్కఱ, అగత్యము, అవసరము. "నాకేమి? గరుజీ అనుకొన్నావా?" (గోదావరిమండలప్రాంతమున వాడుక.)

గరుటామంతుఁడు. వై. వి. = గరుత్మంతుఁడు (రూ- గరుటాలమంతుఁడు- గరుడాలమంతుఁడు-గరుటి- గరుడి): చూ, హరివాహనుఁడు.

గరుటాలమంతుఁడు. వై. వి.= —పై.—

గరుటి. వై. వి.= —పై.—

గరుడండు. తె.వి. ఒకానొక కోడి:చూ, కుంజీ.

గరుడకంబము. వై. వి.=(విష్ణువు గుడియందలి) గరుడస్తంభము: చూ, స్తంభము. 1; (నిస్సారపుసంభాషణమందు గాడిదెగుడ్డు గరుడకంబము అని గోదావరిమండలమున వాడెదరు.)

గరుడతాళము. సం. వి. అ. పుం. తాళప్రాణకళావిశేషము: చూ, తాళము. 2.

గరుడధ్వజుఁడు. సం. వి. అ. పుం: వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

గరుడపక్షము. అం. భావాధ్యాయప్రమేయము నందలి నృత్తహస్తములు ఇరువదితొమ్మిదింటిలో నొకటి: చూ, నృత్తహస్తములు.

గరుడపచ్చ. వై.వి. మరకతము:చూ,రత్నము.1.

గరుడప్లుతము. అం. కరణములు నూటయెనిమిదింటిలో నొకటి: చూ, కరణములు.

గరుడము. అం. 1. సంయుతహస్తములు ఇరువదినాలుగింటిలో నొకటి: చూ, సంయుతహస్తములు; 2. జన్యతాళములలో నొకటి: చూ, జన్యతాళములు.

గరుడసరులు. వై. వి. బ. మేలైన శాలిధాన్యము: చూ, ధాన్యము.

గరుడస్తంభము సం. వి. అ. పుం.=చూ, గరుడకంబము,

గరుడాంకితము. సం. వి. అ. న. మరకతమణి: చూ, రత్నము. 1.

గరుడాంజనము. అం. అంజనములలో నొకటి: చూ, అంజనములు.

గరుడాగ్రజుఁడు. సం. వి. అ. పుం. గరుత్మంతుని యన్న: చూ, సూరసూతుఁడు.

గరుడారతి. ద్వ. వి. ఆరాత్రికావిశేషము: చూ, అళఘూరతి.

గరుడాశ్మము. సం. వి. న. పుం: చూ, గరుడాంకితము.

గరుడి. వై.వి.=గరుడః: చూ, గరుత్మంతుఁడు.

గరుడిరవుతు. వై. వి.= గరుడరావుత్త: చూ, విష్ణువు. 1 (రూ-గరుడికాతు.)

గరుడుఁడు. సం. వి. అ. పుం.=గరుడి: చూ, హరివాహనుఁడు.

గరుడోత్తరము. సం. వి. అ. న: చూ, గరుడాంకితము.

గరుత్తు. సం. వి. త్. పుం. 1.=గతి. పత్రము: చూ, ఱెక్క. 1; 2. ఇనుఁడు: చూ, సూర్యుఁడు; 3. ధ్వని: చూ, స్వరము. 2.

గరుత్మంతము. సం. వి. త్. పుం. పక్కి: చూ, పక్షి.

గరుత్మంతుఁడు. సం. వి. త్. పుం. 1.=గరుటామంతుఁడు: చూ, హరివాహనుఁడు.

గరుదాల్పు. ద్వ. వి: చూ, గగురు.

గరుద్యోధి. సం. వి. న్. పుం. భారతీపక్షి: చూ, వ్యోమనావిక.

గరుపసేల. ద్వ. వి: చూ, రూ-గరపసేల.

గరుపాటు. ద్వ.వి: చూ,రూ-గగురు (శకాం. 3, ఆ. 64.)

గరుపాటువెంట. ద్వ. వి. పందిమూఁతి ముట్టె. (శబ్దరత్నాకరము.)

గరుపాఱు. దే. అ. క్రి: చూ, గగురుపొడుచు.

గరుము. వై. విణ. 1.=ఖరభూ. (గులకరాలచే గట్టిరాయినది) నేల: చూ, గరపనేల; 2. విరివి: చూ, విస్తారము. 1.

గరువతనము. దే. వి. 1: చూ, నియమము; 2. (శృంగార) గర్వము: చూ, హంకారము.

గరువపడు. వై. అ. క్రి.=గర్వపడు: చూ, హంకరించు.

గరువము. వై. వి. 1.=గర్వము. రూ-గరువతనము. అచ్చ.యు, కాం. 116: చూ, హంకారము: 2.=గౌరవము: చూ, సన్మానము.

గరువు. దే.వి. 1.=గర్వము: చూ,హంకారము. 2. చెక్కిలి. స్వా. 5. ఆ.58: చూ, లెంప.2; వై.విణ. 3=ఖరభూ. రూ-గరుము. స్వా. 4. ఆ. 60: చూ, గరపసేల.

గరుసు. దే. వి. 1. మేర: చూ, మర్యాద; 2. చర్మము: చూ, బెరడు; 3. ముఖభీతి: చూ, మోమోటమి; వై. విణ. 4.=ఖరభూ. అం. భా. ద్వి. భూ. 4: చూ, గరపనేల.

గర్గము. సం. వి. అ. పుం. 1. దేవనోని సర్ప విశేషము: చూ, సర్పము; 2. గర్గముని: చూ, ముని. 1.

గర్గరము. సం. వి. అ. పుం. గర్గరమనుచేఁప: చూ, మత్స్యము. 1.

గర్గరి. సం. వి. ఈ. స్త్రీ. పెరుఁగుచిలికెడు కుండ, తరిగడవ: చూ, మంథని.

గర్గాటము. సం. వి. అ. పుం. యోగనాలిక యను చేఁప: చూ, మత్స్యము. 1.

గర్జ. సం. వి.ఆ. స్త్రీ. 1. గర్జనము. (మేఘము లోనగువాని) ధ్వని: చూ, స్వరము. 2; 2. ఏనుఁగుధ్వని: చూ. స్వరము. 2; 3. సింహధ్వని: చూ. స్వరము. 2; 4. వ్యాఘ్రుధ్వని: చూ, స్వరము. 2.

గర్జకము. సం. వి. అ. పుం. గర్జకమను చేఁప: చూ, మత్స్యము. 1.

గర్జనము. సం. వి. అ. న. 1: చూ, గర్జ. 1; 2: చూ, రోషము.

గర్జము. సం. వి. అ. న. 1. ఏనుఁగుధ్వని: చూ, స్వరము. 2; 2. (మేఘములోనగువాని) ధ్వని: చూ, గర్జ. 1.

గర్జాఫలము. సం. వి. అ. పుం. 1: చూ, సముదాక్రాంత *; 2. పోరు: చూ, యుద్ధము; 3: చూ, బెదరింపు; 4: చూ, పేరేచుట.

గర్జి. సం. వి. ఇ. పుం. మేఘధ్వని: చూ, స్వరము. 2.

గర్జించు. సం. అ. క్రి. 1. (మేఘము లోనగునవి) ధ్వనించు: చూ, శబ్దించు; 2. కోపించు: చూ, రోషించు; 3. = గద్దించు: చూ, గదుము.

గర్జితము. సం. వి. అ. న: చూ, గర్జము.1-2; పుం. 3. మదపుటేనుఁగు: చూ, హస్తి.

గర్తజంబుకన్యాయము. పా. గుంటనక్కచేష్టల రీతి.

గర్తము. సం. వి. అ. పుం. 1. = గుంట. క్రంత. గోయి-గర్త. పల్లము. (గొయ్యి, బొక్క నున్ను): చూ, రంధ్రము. 1; 2. పిఱుఁదుల మీఁదిగుంతలు: చూ, రంధ్రము. 1; 3 త్రిగర్త దేశవిశేషము: చూ, దేశము.

గర్తాటము. సం. వి. అ. పుం. 1. ఎలుక: చూ, మూషికము; 2. పందికొక్కు: చూ, మూషికము.

గర్తిక. సం. వి. ఆ స్త్రీ. పట్టుసాలెవాని యిల్లు: చూ, సదనము. 1.

గర్దభకము. సం. వి. అ. పుం. తెల్లఁగలువ *: చూ, పద్మము. 1.

గర్దభగదము. సం. వి. అ. పుం. ఒకానొకరోగము: చూ, రోగము. 1.

గర్దభచందనన్యాయము. పా. గాడిద మీఁద నెంత గంధపుచెక్క వేసినను దాని వాసన తెలిసికొనలేనిరీతి.

గర్దభము. సం. వి. అ. న. 1: చూ, గర్దభకము*; 2: చూ, వాయువిళంగము *; 3. డావరడంగి *: చూ, దేవతాళము; పుం. 4. గాడిద: చూ, రాసభము; 5. క్షుద్రరోగము(స్త్రీలింగమని కొందఱు): చూ, రోగము. 1.

గర్దభశాఖ. సం. వి. ఆ. స్త్రీ. చిఱుతేఁకు *: చూ, శారంగి.

గర్దభశాఖము. సం. వి. అ. పుం. —పై.—

గర్దభశాఖి. సం. వి. ఈ. స్త్రీ. —పై.—

గర్దభాంజనక. సం. వి. అ. స్త్రీ: చూ, దేవతాళము *.

గర్దభాండము. సం. వి. అ. పుం. కలజువ్వి, జువ్వి (అనికొందఱు) *: చూ, ప్లక్షము.

గర్దభాహ్వయము. సం. వి. అ. పుం. కుముదము*: చూ, పద్మము. 1.

గర్దభి. సం. వి. ఈ. స్త్రీ. తెల్ల వాఁకుడు *: చూ, వాఁకుడు.

గర్దభిక. సం. వి. అ. స్త్రీ. క్షుద్రరోగవిశేషము: చూ, రోగము. 1.

గర్ధనము. సం విశే. 1. రూ-గృధ్నువు. ఇచ్ఛగలవాఁడు ఇచ్ఛగలది (అనియు): చూ, వలపుకాఁడు; 2. పరద్రవ్యాసక్తుఁడు: చూ, లుబ్ధుఁడు. (గర్ధనము అని శ.ర.) గర్ధనుఁడు అనికొందఱు)

గర్ధము. సం. వి. అ. పుం: చూ, గర్దభాండము*.

గర్పాడు. దే. అ. క్రి. తిండితిను. అం, భా. క్రి. 97: చూ, మేపుమేయు.

గర్భండము. సం. వి. అ. పుం. కాయబొడ్డు: చూ, నాభిగుడకము.

గర్భకము. సం. వి. అ. న. వెండ్రుకల లోపల ముడుచుకొన్న పూదండ: చూ, భూషణము 2.

గర్భకరము. సం. వి. అ. పుం: చూ, పుత్రజీవి*.

గర్భకవిత్వము. పా. ఒక పద్యములో నొకటి రెండు మూఁడు పద్యముల గణాది నియమ సమన్వితముగ నిముడ్చుటు. (కవిరచనమే కవి

త్వము, ఇది నాలుగు విధములు. —ఆశుకవి త్వము, బంధకవిత్వము, గర్భకవిత్వము, చిత్ర కవిత్వము అని) ఈనాలుగువిధములలో గర్భ కవిత్వమొకటి: చూ, మాటలల్లుట.

గర్భఘాతిని. సం. వి. ఈ. స్త్రీ: చూ, కూశ కింబి *.

గర్భదము. సం. వి. అ. పుం: చూ, గర్భకము *.

గర్భనుత్తు. సం. వి. త్. పుం. ఒకరకము అతి వస *: చూ, విస.

గర్భపాతకము. సం. వి. అ. పుం. ఎఱ్ఱముసగ *: చూ, శిగ్రువు. 1.

గర్భపాతన. సం. వి. ఆ. స్త్రీ. గుమ్మడి *: చూ, మహాఫలము.

గర్భపాతనము. సం. వి. అ. పుం. రీడాకరం జము *: చూ, పూతికరజము.

గర్భపాతము. సం. వి. అ. పుం. కుంకుడు*: చూ, ఫేనిలము.

గర్భపాతని. సం. వి. ఈ. స్త్రీ: చూ, హాలిని *.

గర్భపాతిని. సం. వి. ఈ. స్త్రీ. —పై.—

గర్భము. సం. వి. అ. పుం. 1.=కడుపు: చూ, భ్రూణము. 1. (చూ, కడుపు. కుక్షి); 2.=కడుపు కడుపులోని పిండము. (గర్భసం స్కారములు మూఁడు. —అధానికము, పుం సవనము, సీమంతోన్నయనము) కడుపులోని పిల్ల: చూ, భ్రూణము. 1; 3. స్త్రీగర్భము: చూ, భ్రూణము. 1; 4. బిడ్డ. (నపుంసకమని కొందఱు): చూ, శిశువు; 5. పనసపండు తొక్క; 6. అన్నము: చూ, సాదము. (1); 7. అగ్ని: చూ, నిప్పు; అం. 8. నాటకసంధు లయిదింటిలో నొకటి: చూ, నాటకసంధులు (చూ, సంధి 3.); విణ. 9. కొలిమితిత్తి, పవన సంకటము: చూ, భస్త్ర; 10. ఇంటిలోపలి యిల్లు, అపవరకము: చూ, సదనము. 1.

గర్భవతి. సం. వి. ఈ. స్త్రీ: చూ, చూలాలు.

గర్భశయ్య. సం. వి. ఆ. స్త్రీ. గర్భోత్పత్తిస్థా నము: చూ, మావి. 2.

గర్భాగారము. సం. వి. అ. న. శయనగృహము లోనిల్లు (అని కొందఱు): చూ, సదనము. 1.

గర్భదము. అం. తానములు మూఁడు. అందుసర్వ తానములు ఇరువదెనిమిది. అందు ని-గ-హీన తానములు ఏడు. అందు గర్భదమొకటి: చూ, ని-గ-హీనతానములు. (చూ, సర్వతానములు)

గర్భాధానపుఖండ. పా: చూ, ఖండ.

గర్భాధానము. సం. వి. అ. న. 1. యుక్తవయ స్సువచ్చిన పిల్లను భర్తతో ప్రప్రథమమునఁ గలుపుట: చూ, శోభనము; 2. గర్భమును ధరించుట; అం. 3. కర్మములు పదునారింటి లో మొదటిది: చూ, కర్మములు; పా. 4. గర్భాధానమునకు ముహూర్తకాలము:— తిథులు.—2-3-5-7-10; వారములు.—బు, గు, శు, సో; నక్షత్రములు. —రో-ఉఫ-హ- స్వా-అనూ-ఉషా- శ్ర-శ- ఉభా- పూభా; లగ్నములు.—వృ-మి-సిం-కన్య- వృశ్చి- తు- ధ-కుం-మీ; త్యాజ్యములు.— పంచపర్వవ్ర తదినములు.

గర్భాశయము. సం. వి. అ. పుం. గర్భ మును పోట్టుకొనియుండెడి సంచి: చూ, మావి. 2.

గర్భాష్టముఁడు. సం. వి. అ. పుం. ఎనిమిదవ నెల లోఁ బుట్టిన బాలుఁడు, దేవమానుఁడు: చూ, శిశువు.

గర్భిణి. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, గర్భవతి; 2: చూ, మనుపాల *.

గర్భిణ్యావేక్షణము. సం. వి. అ. న. గర్భిణీ స్త్రీ చర్య: చూ, బాలతంత్రము.

గర్భోణి. సం. వి. ఈ. స్త్రీ. రూ-గర్భోని. అర్ధ చంద్రాకారపు తలగడ: చూ, లోడు.

గర్భోని. సం. వి. ఈ. స్త్రీ. —పై.—

గర్భోపఘాతిని. సం. వి. ఈ. స్త్రీ. కట్టిసతర్వాత నాఁబోతుపాలిఁగా నీచుకొన్నయావు: చూ, ధేనువు.

గర్ముత్తు. సం. వి. త్. న. 1. గంటెలు, చామలు' సజ్జలు మొ. *: చూ, సస్యము. (తృణధాన్యవిశేషమును, తృణమును అనఁబడును.); పుం. 2. ఇనుఁడు: చూ, సూర్యుఁడు; 3. కిరణము: చూ. హాయనము. 2; స్త్రీ. 4. ఎండించిన వరుగు. చూ, వరుగు 1; 5. బంగారు: చూ, లోహము. 1; 6. తీఁగె *: చూ, లత. 1. (రూ-గర్ముతీ)

గర్ముటిక. సం. వి. ఆ. స్త్రీ. వ్రీహిభేదము: చూ, ధాన్యము.

గర్మోటిక. సం. వి. ఆ. స్త్రీ. జరడీతృణము *: చూ, తృణము. 1.

గర్వటి. సం. వి. ఈ. స్త్రీ: చూ, గర్ముత్తు. 4.

గర్వము. సం. వి. అ. పుం. 1.=గరువము: చూ, హంకారము (ఐశ్వర్యము- రూపము-తారుణ్యము-కులము-విద్య-బలము-ఇష్టవస్తు లాభాదులచే నితరులను ఎఱుఁగక యుండుటది. గర్వమను శృంగార రసైక దేశ వ్యభిచారీభావము); 2. కొవరము: చూ, మదము. 1; అం. 3. సంచారీ భావములు ముప్పదిమూఁడింటిలో నొకటి: చూ, సంచారీభావములు (ఓగోరి కొండలం జెండునటులఁ జెండి తెచ్చినమాకు నీవొకడవనురే.)

గర్వాటుఁడు. సం. వి. అ. పుం. ద్వారపాలకుఁడు: చూ, వేత్రధారుఁడు.

గర్వి. సం. విణ. (న్. ఈ. న్) = గరివి. గర్వముగలవాఁడు: చూ, పొగరుఁబోతు.

గర్వించు. సం. అ. క్రి. = గరివించు: చూ, హంకరించు.

గర్వితుఁడు. సం. విణ: చూ, గర్వి.

గర్హ. సం. వి. ఆ. స్త్రీ. దూఱు: చూ, నింద. 1.

గర్హణము. సం. వి. అ. న. చూ, గర్హ.

గర్హించు. సం. స. క్రి. దూఱు: చూ, నిందించు.

గర్హితము. సం. విణ. నిందింపఁబడినది: చూ, హీనము. 2.

గర్హ్యము. సం. విణ. నికృష్టము: చూ, హీనము. 1.

గర్హ్యవాది. సం. విణ. (న్. ఈ. న్.) నిందింపఁదగు మాటలాడువాఁడు, కద్వదుఁడు: చూ, వ్యాధుఁడు. 2. (గర్హ్యవాదికంటె కద్వదుఁడు నిందింపఁదగు మాటలు కొంచెముగ ఆడును. ఇదియె వారిద్దఱికిఁగల భేదము.)

గర్హ్యుఁడు. సం. విణ. 1. అధముఁడు: చూ, హీనుఁడు; 2. జాత్యాచారాదులచే నిందితుఁడు: చూ, వ్యాధుఁడు 2.

గఱగఱ. దే. వి. 1. భక్ష్యములు నమలుటయందగుధ్వన్యనుకరణము. రూ-కఱకఱ: చూ, హుహూహూ; 2. కాఠిన్యము: చూ, బెడిదము.

గఱగఱలాడు. దే. అ. క్రి. (గఱగఱలు + ఆడు) గఱగఱయని మ్రోఁగు: చూ, శబ్దించు.

గఱగొఱ. దే. వి. తక్కువ: చూ, వెలితి. 2

గఱి. వై. వి. 1. = గరుత్. ఱెక్క: చూ, ఱెక్క. 1; 2. = గరుత్. బాణము ఱెక్క: చూ, ఱెక్క. 1; వా. వి. 3. (అడుతాయి, పెద్దపులి నాలుక నోటిపూఁతగలవాని నాలుక లోనగువానియందలి) గఱుకు: చూ, గఱుకు.2; 4. తాటికమ్మ (తాడిమె) కు ఇటునటుగల గఱుకు. "గఱికమ్మ-గఱిగమ్మ."

గఱిఁటె. దే. వి: చూ, రూ-గరిఁటె.

గఱిక. దే. వి. 1. దూర్వ *: చూ, తృణము. 1. (దీనిరసము మూత్రమును జారీచేయును. మూత్రమువెంటపడు రక్తము తగ్గించును. పీనస, గ్రహణి, అతిసారముకట్టును. దీనివేరు చితుకకొట్టి పెరుఁగుతోనిచ్చిన సెగరోగము

పోవును.); అం. 2. అర్ఘ్యములెనిమిదింటిలో నొకటి: చూ, అర్ఘ్యము.

గఱికచెక్క. ద్వ. వి. పచ్చికతోడి మట్టిపెల్ల, పచ్చికపెల్ల (గఱికమోడిచెక్క అనియు): చూ, భూమి. 1.

గఱికమ్మ. వా. వి. గఱుసుగల తాటికమ్మ (లొడిమె): రూ-గఱిగమ్మ: చూ, మదురుకమ్మ.

గఱికమ్మి. ద్వ. వి. గఱిబద్ద (సంధిని వర్ణలోప వర్ణ వికారములు.)

గఱికనూదులు. ద్వ. వి. బ. శాలిధాన్యము: చూ, ధాన్యము.

గఱిగమ్మ. వా. వి. (గఱుసు + కమ్మ): చూ, రూ-గఱిగమ్మ. "గరివిమాట గఱిగమ్మసదును." "మదురుపోయుటకు గఱిగమ్మలు తీసికొని రమ్ము."

గఱిచిప్ప. ద్వ. వి. ముత్తెపుఁజిప్ప: చూ, సీపి.

గఱిబద్ద. ద్వ. వి. (గఱుసు + బద్ద) గఱుసుతోడి తాటాకుబద్ద: చూ, గఱికమ్మి.

గఱిసె. వై. వి=: చూ, రూ-గరిసె

గఱుకు. దే. వి. 1. కొడవలి లోనగువానికక్కు: రూ-కక్కు-కఱసు-కఱుకు; వా.వి. 2: చూ, గఱి. 3.

గఱుగు. దే. వి: చూ, గరియ *.

గఱువ. వై. విణ. 1.=గురు, పెద్ద: చూ, విపులము; 2.=గురు. గుర్వీ. గొప్పవాఁడు. ప్రభా. 3, ఆ. 5: చూ, హేమాహేములు.

గఱువు. వై. వి. = : చూ, రూ-గరువు. 3.

గఱ్ఱు. దే. వి. తెగ్రఁచుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హలాహలా.

గఱ్ఱె. దే. వి. చేపలఁబట్టెడు సాధనము (దీని ఆకారము తిత్తివంటిదిగాని యిది మిక్కిలి పెద్దది.): చూ, వల. 1.

గలంతిక. సం వి. ఆ. స్త్రీ. గరిగెపిడత: చూ, పాత్రము. 6.

గలఁతియ. వై. వి. = గలంతికా.గిండిచెంబు: చూ, పాత్రము. 6. (రూ-గలఁతి-గలంతి-గలంతియ-గళంతి-గళంతియ.)

గలకంబలము. సం. వి. అ. పుం. ఆఁబోతు గంగడోలు, ఆవులకు మెడక్రింద వ్రేలాడునది: చూ, సాస్న (రూ-గళకంబళము.)

గలగండము. సం. వి. అ. పుం. గలగండమాల: చూ, వ్రణము. (రూ-గళగండము.)

గలగల. దే.వి.1. కదలుట, చెట్లఆకులు రాలుట, ఫలాదులురాలుట యందగుధ్వన్యనుకరణము: చూ, హలాహలా; 2. భూషణములు మ్రోయుటయందగు ధ్వన్యనుకరణము. కళా. 6, ఆ. 197: చూ, హలాహలా.

గలజేర. దే. వి. రూ-గలిజేరు *: చూ, వర్షకేతువు. (రూ-గలజేరు-గలిజెర-గలిజెరు-గలిజేరు) (ఇది మూత్రము జారీచేయును.)

గలజేరు. దే. వి. —వై.—

గలతరించు. దే. అ. క్రి. (మేను) జల్లుమను.

గలపడించు. దే. వి: చూ, నిష్ప్రయోజకుఁడు.

గలబ. దే. వి. కలఁత: చూ, సంతాపము.

గలబరించు. దే. అ క్రి. కలఁగు: చూ, సంక్షోభించు.

గలబా-గల్బా. వా. వి. కలఁత: చూ, సంతాపము.

గలమేఖల. సం. వి. ఆ. స్త్రీ. నూతాళి, గళనూత్రము: చూ, భూషణము. 2. (రూ-గళమేఖల.)

గలవ్రతము. సం. వి. అ. పుం. నెమిలి: చూ, మయూరము (రూ-గళవ్రతము)

గలశుండి. సం. వి. ఈ. స్త్రీ: చూ, గొంతుముడి: (రూ-గళశుండి)

గలశుండిక. సం వి. ఆ. స్త్రీ. కొండనాలుక. చూ, రసన (రూ-గళశుండిక.)

గలస్తని. సం. వి. ఈ. స్త్రీ. మేఁక: చూ, మేషము. 1. (రూ-గళస్తని)

గలానిలము. సం. వి. అ. పుం. ఒకరకముచేఁప: చూ, మత్స్యము. 1. (రూ-గళానిలము)

గలామ. పై. వి. = ఖల్ల. కళ్లెము: చూ, ఖలము. 4.

గలిజేర. దే. వి: చూ, రూ-గలజేర *.

గలిజెరు. దే. వి. —పై.—

గలిజేరు. దే. వి. —పై.—

గలిబిలి. దే. వి. 1. సందడి: చూ, స్వరము. 2; 2. అలికిడి: చూ, స్వరము. 2.

గలీబు. వా. వి: చూ, రూ- గనీబు.

గలేగండము. సం. వి. అ. పుం. ఒకరకము పక్షి: చూ, పక్షి. (రూ-గళేగండము.)

గలేస్తని. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-గలస్తని. (రూ- గళేస్తని)

గల్యా. సం. వి. ఆ. స్త్రీ. 1. = రూ-గళ్యా. కుతికలగుంపు: చూ, మెడ; 2. పాటగళముల సమూహము.

గల్యము. సం. వి. అ. న. ఉమ్మి: చూ, రసనామలము.

గల్ల. దే. వి. 1. బొత్తిగా గింజేపట్టని ధాన్యము, పొల్ల, పొల్లు: చూ, ధాన్యము; 2. మాదిగవాఁడు తోలునానవేసెడి చేట్టి: చూ, భాండము. 8.

గల్లచాతురి. సం. వి. ఈ. స్త్రీ. ఒకరకము తలగడ: చూ, లోడు.

గల్లము. సం. వి. అ. పుం. చెక్కిలి: చూ, తెంప. 2.

గల్లు. దే. వి. భూషణములు మ్రోయుటయందగు ధ్వన్యనుకరణము. కళా. 8, ఆ. 25 (ఆమ్రేడితమునందు గల్లుగల్లు- గలుగల్లు.): చూ, హాహాహూ.

గల్వర్కము. సం. వి. అ. పుం. 1. చమకము: చూ, పాత్రము. 6; 2. మద్యపానపాత్రము: చూ, పాత్రము. 6; 3. ఇంద్రనీలమణి: చూ, రత్నము. 1.

గవఁశ. దే. వి. దుర్గమ పురద్వారము: చూ, పెద్ద వాకిలి (రూ- గవను- గవని- గవిని- గవఁకు- గవుకు.

గవఁకు. దే. వి. —పై.—

గవడగొయ్యి. వా. వి. 1. చిక్కులోఁబడిన వ్యవహారము; 2. బయటికి రావీలులేని గొయ్యి.

గవతము. దే. వి. రూ-గవదము. కసవు: చూ, తృణము. 1.

గవద. వా. వి. రూ-గవుద. చెక్కిలి "గవద బిళ్లలు.": చూ, తెంప. 2.

గవదము. దే. వి: చూ, రూ-గవతము.

గవని. దే. వి. —పై.—

గవను. దే. వి. —పై.—

గవయము. సం. వి. అ. పుం. 1. అడవి ఆవు: చూ, ధేనువు; 2.=గోవ. గురుపోతు, మృగవిశేషము: చూ, శరభము. 1.

గవరన. పై. వి.=గౌర. ఎఱుపు: చూ, వర్ణము. 6.

గవరనమెంటు. వా. విశే. ప్రభుత్వసంబంధమగు, గవర్నమెంటు.

గవరనరు. వా. వి. రాష్ట్రపాలకుఁడు, గవర్నరు.

గవరమ్మ. పై. వి.= గౌరి. (రూ-గయిరమ్మ- గైరమ్మ): "గవరమ్మ సంబరము": చూ, పార్వతి. 1. (వాడుక.)

గవరాజము. సం. వి. అ. పుం. ఎద్దు: చూ, వృషభము.

గవలము. సం. వి. అ. న. 1. ఎనుపకొమ్ము: చూ, శృంగము. 1; పుం. 2. నల్ల ఎనుఁబోతు: చూ, మహిషము.

గవాక్షము. సం. వి. అ. పుం, న. కిటికి: చూ, వాతాయనము.

గవాక్షి. సం. వి. ఈ. స్త్రీ. 1. చిన్నపాఁపర* (ఎద్దుకండ్లవంటి పువ్వులు గలది): చూ,

పొఁపర; 2. గోపాలకర్కటి: చూ, బుడమ*; 3. మల్లికాలత *: చూ, మొల్ల; 4. దింటెన*: చూ, విష్ణుక్రాంత; న. పుం. 5. పెద్దపేఁకు*: చూ, కాకోటము.

గవాక్షుఁడు. సం. వి. అ. పుం. గవాక్షుఁడను కోఁతి: చూ, వానరము.

గవాచి. సం. వి. ఈ. స్త్రీ. గవాచియను చేఁప: చూ, మత్స్యము. 1

గవాదనము. సం. వి. అ. న. ఘాసము *: చూ, తృణము. 1.

గవాదని. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, పెద్ద పొఁపర *; 2. పసులుమేయుకంచె, కొఱను: చూ, భూమి. 1; 3. దింటెన *: చూ, విష్ణుక్రాంత.

గవాదిని. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-గవాదని. 3.

గవామయము. అం. తానములు 3. అందు కూటతానములు 23. అందు రహీనతానములు 7, రిహీనతానములు 7, గహీనతానములు 7, మహీనతానములు 7. వీనిలోని రహీనతానములం ఏడింటిలో గవామయ మొకటి: చూ, రహీనతానములు. (ఈవివరణము కూటతానములను పదముకడఁజేర్చి చదువుకొనవలెను): (చూ, ఉపవిద్యలు.) చూ, కూటతానములు: చూ, తానములు.

గవాలూకము. సం. వి. అ. పుం: చూ, గవయము.

గవాశిక. సం. వి. అ. స్త్రీ: చూ, లక్క.

గవి. సం. వి. అ. స్త్రీ. 1. ఆవు: చూ, ధేనువు; 2. పాలుపితుకు చెంబు: చూ, పాత్రము. 6; వై. వి. (1)=గవ్వార. సుహా. స్వా. 4, ఆ. 46: చూ, పణఁకు; (2) పల్లము: చూ, రంధ్రము. 1.

గవిని. దే. వి: చూ, గవక.

గవిలెము. దే. వి. గంధములోరాచి కలిపెడు విత్తు.

గవిసె. వై. వి.=కోశ. గాడా: చూ, ఘంటసాల (దేశ్యమని శబ్దరత్నాకరము.)

గవిసెన. వై. వి.=కోశ. రూ-గవుసెన-గౌసెన: చూ, నిచోళము (దేశ్యమని శబ్దరత్నాకరము.)

గవీనము. సం. విశ. ఆశితము, అంతకుముందే అవులు మేసినది (పొలము), మునుపు ఆవులుండినది (పొలము) (అని కొందఱు): చూ, భూమి. 1.

గవుండ్లవాఁడు. వై. వి.=గోండ. రూ-గౌండ్లవాఁడు. సారాయినమ్మువాఁడు, కల్లుగీయువాఁడు (అనికొందఱు): చూ, సురాజీవి.

గవుఁడు. వై. వి. 1.=గోండ: —వై.— (రూ-గౌఁడు); 2. కాఁపువారిపట్టపు పేరు: రూ-గౌఁడు.

గవుకు. దే. వి: చూ, గవక.

గవుడసరము. దే. వి. ఆఁడువారి నగ: చూ, భూషణము. 2.

గవుద. వై. వి. = గండ. రూ-గౌద. చెక్కిలి: చూ, లెంప.2 (దేశ్యమని శబ్దరత్నాకరము.)

గవుర దే. వి. రూ-గౌర. బెహారి: చూ, వర్తకుఁడు.

గవురమ్మ. వై. వి=: చూ, గవరమ్మ.

గవురు. దే. వి. రూ-గౌరు. 1. కపటము. అం. పదా. చర, 10: చూ, వ్యాజము. 1; 2. ఏనుఁగు: చూ, హస్తి; 3. కావాలిక: చూ, వీణె; 4. గవులి: చూ, బల్లి; వై. వి. 5.=గౌరి: చూ, పార్వతి. 1. (రూ-గౌరు)

గవులు. దే. వి. రూ-గౌలు. 1. దుర్గంధము: చూ, వాసన; 2. గంధము: చూ, వాసన.

గవులి. దే. వి. రూ-గౌలి-గౌరు. శకునములు చెప్పెడు బల్లి: చూ, బల్లి.

గవుసెన. వై. వి. = కోశ. రూ-గౌసెన-గవిసెన. వీణె మొదలగువాని యొఱ: చూ, నిచోళము.

గవేడువు. సం. వి. ఉ. స్త్రీ. అడవిగోధుమలు. పట్టివడ్లు. రూ-గవేధువు: చూ, ధాన్యము.

గవేధుక. సం. వి. ఆ. స్త్రీ. —పై.— "గవేధుర్నా గవేధుకః." రత్నకోశము.

గవేధువు. సం. వి. ఉ. పుం, స్త్రీ. —పై.—

గవేరుకము. సం. వి. అ. న. —పై.—

గవేళక. సం. వి. ఆ. స్త్రీ. ఒకరకముచెట్టు: చూ, వృక్షము.

గవేషణ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆమంత్రణార్థము వెదకుట (శ్రాద్ధబ్రాహ్మణులను వెదకుట): చూ, పర్యేషణ; 2. వెదకుట: చూ, వెదకుడు.

గవేషించు. సం. స. క్రి. అరయు: చూ, వెదకు.

గవేషితము. సం. విశే. వెదకఁబడినది: చూ, మృగితము.

గవ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆవులమంద: చూ, ధేనువు; 2. వింటినారి: చూ, మౌర్వి. 1; 3. రెండుకోసులు: చూ, పరువు. 2.

గవ్యము. సం. వి. అ. న. 1. వింటినారి: చూ, మౌర్వి. 1; 2: చూ, రాగద్రవ్యము; విశే. 3. ఆవుపాలు లోనగునవి; 4. ఆవునకు హితమైనది. (చూ, గవ్యములు.)

గవ్యములు. అం.—పంచగవ్యములు:- గోమూత్రము, గోమయము, గోఘృతము, గోదధి, గోక్షీరము, (5) (ఇవి పవిత్రమైనవి. పాపములను పోఁగొట్టునవి.)

గవ్యాదని. సం. వి. ఈ. స్త్రీ: చూ, పెద్ద పాఁపర *.

గవ్యూతము. సం. వి. అ. న. రెండుకోసుల దూరము: చూ, పరువు. 2.

గవ్యూతి. సం. వి. ఇ. స్త్రీ. 1. —పై.— (ఈకారాంతమనియు, పుం-స్త్రీ. లింగమనియు కొందఱు.)

గవ్వ. దే. వి. ఒకరకము శంఖము: (చూ, వరాటము): చూ, సంకు. 1.

గవ్వచాళము. ద్వ. వి: చూ, వెలిగారము.

గవ్వము దే. వి. క్షుద్ర జలచరము: చూ, మత్స్యము. 1.

గవ్వసరులు. దే. వి. ఒకరకము వడ్లు: చూ, ధాన్యము.

గవ్వసాంబ్రాణి. వా.వి. గవ్వపలుకుసాంబ్రాణి, ఒకరకము అంగడివస్తువు: చూ, సాంబ్రాణి. 1.

గశికము. సం. వి. అ. పుం. 1. నూనెమడ్డి, తైలశేషము: చూ, మడ్డి. 2; 2. మేకు: చూ, గసి. 2.

గస. దే. వి. కాసము: చూ, దగ్గు.

గసకము. సం. వి. అ. పుం.=గసగస. నల్లమందువిత్తు: చూ, సూక్ష్మతండులము.

గసగస. వై. వి.=ఖసఖసము. గసకము -పై.-

గసగసాలు. వై. వి. బ.=—పై.— (గ్రహణి కట్టును, వీర్యపుష్టి చేయును.)

గసి. వై. వి. 1: చూ, గశికము. 1; 2. మేకు. హారిక్స్. 2, అ. 6: చూ, శూలము.

గసిక. దే. వి. 1. అమ్ము: చూ, బాణము. 1; 2. మేకు: చూ, శూలము; 3. సలాక: చూ, శలాక; 4. త్రవ్వుట కనువుగా కొనచెక్కిన కొయ్య: చూ, కత్తవ. 2.

గసిబిసి. దే. విశే: చూ, రూ-గజిబిజి.

గసిరా. దే. వి. ప్రవాళము. అం. పదా-4-5: చూ, రత్నము. 1.

గస్తాలు. దే. వి. బ. మల్లబంధ విశేషము: చూ, మల్లశాస్త్రము.

గస్తి. వా. వి: చూ, గస్తు.

గస్తీలు. దే. వి. బ. (గస్తు+యీలు) కావలివారు. "గస్తీలరిజస్టరు.": చూ, రక్షకుఁడు.

గస్తు. దే. వి. (రాత్రులందు ఊరుతిరిగి కాచు) కావలి: చూ, రక్షణము.

గాంధర్వము. సం. వి. అ. న. 1. రూ-గంధర్వము. పాట: చూ, స్వరము. 2; 2. గంధర్వగానము: చూ, స్వరము. 2. (చూ, ఉపవిద్యలు ); 3. గుఱ్ఱము: చూ, హయము; 4. కన్యావరులు పరస్పరేచ్ఛచేతఁ జేసికొను వివాహము. వివాహములు ఎనిమిదింటిలో నొకటి: చూ, వివాహము; 5. దినముయొక్క ఏడవభాగము: చూ, దినభాగములు.

గాంధర్వవేదము. అం. రూ- గంధర్వవేదము. విద్యలు పదునెనిమిదింటిలో నొకటి: చూ, విద్యలు: (చూ, ఉపవిద్యలు.) (ఇందుకు సంబంధించినవి.—నృత్తగీతవాద్యము, అవాంతరములు, భావాధ్యాయము, రాగాధ్యాయము, తాళాధ్యాయము, నాటకపరీక్ష మొ.)

గాంధర్వాస్త్రము. అం. అస్త్రములు ఏఁబది మూఁడింటిలో నొకటి: చూ, అస్త్రములు.

గాంధర్వి. సం. వి. ఈ. స్త్రీ. సామవేదము: చూ, వేదము.

గాంధర్వులు. అం: చూ, రూ-గంధర్వులు.

గాంధారగతిని. అం. భాషాంగములు పదునొకటింటిలో నొకటి: చూ, భాషాంగములు. (చూ, భాష. 1.)

గాంధారగ్రామ గతమూర్ఛనలు. అం. నంద, విశాల, సుముఖి, చిత్రి, చిత్రవతి, సుఖ, ఆలాప (7). (తానముల వివరమునందు షడ్జమధ్యమగ్రామములలోఁ జెప్పఁబడిన మూర్ఛనాసప్తకద్వయములో ప్రత్యేక మవాంతరభేదములు నాలుగు కలవు. వాటిచేత నొక్కొక్క సప్తక మిరువదెనిమిది భేదములుగానైనది. (చూ, అవాంతరభేదములు, అచ్చులఅనుబంధములో) చూ, తానములు.

గాంధారగ్రామము. అం. గ్రామములు మూఁడింటిలో నొకటి: చూ, గ్రామములు.

గాంధారదేశస్త్రీ. అం. దేశస్త్రీలలో నొకతె: చూ, స్త్రీ (చూ, దేశస్త్రీలు.)

గాంధారపంచమి. అం. 1. గాంధర్వవేదము నందలి రాగాధ్యాయములోని అంశములు68, అందుగలజాతులు11లోనిదియొకటి: చూ, అంశములు; 2. టక్కజభాషలు ఇరువదియొకటింటిలో నొకటి: చూ, టక్కజభాషలు (చూ, భాష. 1.)

గాంధారపంచమిజభాష. అం. గాంధారియను భాష: చూ, గాంధారి. 5.

గాంధారము. సం. వి. అ. పుం. 1. గాంధారమనుస్వరము, రణధ్వని (అని కొందఱు): చూ, స్వరము. 2; 2. సిందూరము: చూ, వహ్నిశిఖము. 1; 3. బాలెంతబోలు: చూ, బోళము; అం. 4 దేశములు ఏఁబది యాఱింటిలో నొకటి: చూ, దేశము; 5. సంగీతస్వరములు ఏడింటిలో నొకటి.(గాంధారము-గ): చూ, స్వరము. 2; చూ, సంగీతస్వరములు (చూ, సప్తస్వరములు. చూ, ఉపవిద్యలు.)

గాంధారరాజము. సం. వి. అ. పుం. నల్లపిచ్చుక: చూ, పిచ్చుక.

గాంధారవీధిక. అం. భిన్నషడ్జకజభాషలు 17 లో నొకటి: చూ, భిన్నషడ్జకజభాషలు. (చూ, భాష. 1.)

గాంధారి. సం. వి. ఈ. స్త్రీ. 1.=గంజాయి*: చూ, జెడగంజె (గాంధారిదుంప); 2. ధృతరాష్ట్రునిభార్య: చూ, భార్య. (దుర్యోధనాదుల తల్లి); అం.3. సౌవీరజభాషలు నాలుగింటిలో నొకటి: చూ, సౌవీరజభాషలు (చూ, భాష. 1.); 4. గాంధర్వవేదములోని రాగాధ్యాయము నందలి అంశములు68. అందుగల శుద్ధజాతులు7 లో నిదియొకటి: చూ, అంశములు; 5: చూ, గాంధారపంచమిజభాష; 6. భిన్నషడ్జకజ భాషలు 17 లో నొకటి: చూ, భిన్నషడ్జకజ భాషలు. (చూ, భాష. 1.)

గాంధారేయుఁడు. సం. వి. అ. పుం. దుర్యోధనుఁడు: చూ, సుయోధనుఁడు.

గాంధారోదీచ్యవ. అం. గాంధర్వవేదమునందలి రాగాధ్యాయములోని అంశములు 63, అందు గలజాతులు 11 లో నిదియొకటి: చూ, అంశములు.

గాంధికుఁడు. సం. వి. అ. పుం. 1. లేఖకుఁడు: చూ, పంజికరుఁడు; 2. సుగంధవస్తువులను విక్రయించువాఁడు: చూ, విక్రయికుఁడు.

గాంభీరి. అం. భాషాంగములు పదునొకటింటిలో నొకటి: చూ, భాషాంగములు. (చూ, భాష. 1.)

గాంభీర్యము. సం. వి. అ. న. 1. గంభీరభావము; 2. భ్రూనేత్రాది వికారములచేత కొంచెము తెలియఁదగిన మనోవికారవిశేషము: చూ, హావము; అం. 3. గుణములు ఇరువదిమూఁడింటిలో నొకటి: చూ, గుణములు.

గాఁజేర. దే. వి.=గాంధారి *: చూ, జెడగాఁజే.

గాఁడి. వై. వి. 1. తొలిచికాని, త్రవ్వికాని నిడుపుగా నేర్పఱచిన పల్లము. "గాఁడిపలక" ము: చూ, రంధ్రము. 1; 2. పసులు నీరు త్రాగుటకు గాఁడియేర్పడ ఱాతితోఁ గట్టిన తొట్టి: చూ, నిపానము; 3. పసులఁగట్టుచోటఁ గసవువేయుటకుఁ బలకలు లోనగువానితో గాఁడిగా నేర్పఱచిన స్థానము: చూ, తొట్టి. 3; వా. 4. పగులు, బీటిక: చూ, స్ఫోటము; 5. (గుండిగలతో వండుట కనువుగా త్రవ్విన) నిడుపాటి పొయ్యి: చూ, పొయ్యి.

గాఁడిగడుగు. దే. స క్రి. (గాఁడి + కడుగు) సంచయనముచేయు.

గాఁడిపొయ్యి. దే. వి: చూ, గాఁడి. 5.

గాఁడు. దే.వి. 1. కామమదము: చూ, మదము. 1; 2. గుదము: చూ, ముడ్డి; పా. 3. వ్యాకరణంబున.—సూ. 16. నీచత్వంబునఁ బుంలింగంబున, నేకవచనంబునఁ గొన్ని సంజ్ఞావాచకంబులకు 'గాఁడు' చేరుచోఁ బ్రాతిపదిక మికారాంతమగు. ఉదా.—రామ. నీచార్థంబునఁ బుంలింగంబున నేకవచనంబున రామిగాఁడు'. ఇట్లు సుబ్బిగాఁడు-పాపిగాఁడు మొ. కాఁడు అనునది యిట్లయ్యెననియెఱుంగునది; దే.స.క్రి. 4. నాటులోనగువాని గ్రుచ్చు: చూ, నాటు.

గాగర. దే.వి. రూ-గాగరా.(స్త్రీలుకట్టుకొను) పావడ: చూ, వస్త్రము.

గాగరా. దే. వి.—వై.—

గాజె. వై. వి.=గంజ. రూ-గాదె: చూ, పంటసాల.

గాజెంగి. వా. వి: చూ, గులాబి*.

గాజోపరుఁజో. ద్వ. వి. ఖడ్గముష్టిసంగ్రాహ్యతలము, అం, భా, ద్వి. కు. 215: చూ, రూ-పరుజో.

గాజు. వై. వి.=కాచ. 1. ఒకరకము మన్ను: చూ, భూమి 1; 2. గాజుప్పు: చూ, లవణము. 1; బ. 3. గాజుమట్టితోఁ జేసిన వలయము, హస్తభూషా విశేషము: చూ, భూషణము. 2.

గాజుకప్పెరలు. దే. వి. బ. ఒకరకము వడ్లు: చూ, ధాన్యము.

గాజుకాయ. వా. వి. గాజుబుడ్డి: చూ, సీసా.

గాజుగిన్నె. వా. వి. కాచపాత్రము: చూ, పాత్రము. 6.

గాజుపూస. దే. వి.=కాచము: చూ, పూస.

గాజుప్పు. ద్వ. వి. (గాజు + ఉప్పు) కాచలవణము: చూ, లవణము. 1.

గాజుమన్ను. ద్వ. వి. కాచమృత్తిక: చూ, భూమి. 1.

గాజులగాఁడు. దే. వి. ఒకరకము కోఁడి: చూ, పుంజు.

గాజులవాండ్రు. ద్వ. వి. బ. గాజులమ్మెడు బలిజెలు: చూ, బలిజె.

గాజువాఱు. ద్వ. అ. క్రి. (గాజు + పాఱు) కాంతిహీనమగు, హరిశ్చ. 5, ఆ. 89: చూ, వెల్వెలఁ బాఱు.

గాటము. వై. విణ. అధికము. కళా. 1, ఆ. 124: చూ, హెచ్చు. 1; 2. అతిశయము. అం. భా. ప్ర. 66: చూ, హెచ్చు. 2; 3.=గాఢ. కాఠిన్యము: చూ, బెడిదము; 4=. గాఢ. దట్టము: చూ, సాంద్రము. 2.

గాటు. వై. వి.=కటు. కారము. "పొగాకు గాటుగా నున్నది": చూ, కారము (1).

గాడబము. సం. వి. అ. పుం. మబ్బు: చూ, మేఘము. 1.

గాడి. దే. వి. రూ–గాడీ. కొలారుబండి: చూ, శకటము. 1.

గాడిద. వై. వి. 1.=గర్దభ. రూ–గాడిదె–గాడ్ద: చూ, రాసభము; వా. వి. 2. తప్పు చేసిన వానిని తిట్టెడి తిట్టు: రూ–గాడిదె.

గాడిదకాళ్లవాఁడు. ద్వ. వి. ముట్టుమోఁకాళ్ల వాఁడు: చూ, సంజ్ఞువు.

గాడిదగడపర. ద్వ. వి. వృషగంధిక*: చూ, శ్వసనము. 2. (గర్భస్రావము కలిగించును).

గాడిదగత్తము. వా. వి. గాడిదలద్ది: చూ, గుఱ్ఱపు యొరువు.

గాడిదగుడ్డు. వా. వి. 1. నిస్సారమును సూచించు మాటయందును, తిరస్కారమునందును, అతిశయోక్తియందును, అహంభావమునందును, వక్రగతినిఁ బోవువారియెడలను మొదలగు వాని యందుపయోగింపఁబడు ఊఁతపదము; 2. గాడిద కనుగుడ్డు.

గాడిదపులి. ద్వ. వి. కొరగానిగండు: చూ, దుమ్ములగొండి.

గాడిదె.=: చూ, రూ–గాడిద.

గాడీ. దే. వి: చూ, రూ–గాడి.

గాడుపు. దే. వి. రూ–గాడ్పు: చూ, వాయువు.

గాడుపుకొడుకు. దే. వి. 1. హనుమంతుఁడు: చూ, వానరము; 2. గాలిచూలి: చూ, భీముఁడు.

గాడుపుమేపరి. దే. వి. పవనాశనము: చూ, సర్పము.

గాడుపుసంగడీఁడు. దే. వి. వాయుసఖుఁడు: చూ, నిప్పు.

గాడ్పు. దే. వి: చూ, రూ–గాడుపు.

గాడ్పుటరదపుదొర. దే. వి: చూ, మన్మథుఁడు. సాంబ. దేవ. 8.

గాఢము. సం. క్రి. విణ. అ. న.=గాటము. 1. అతిశయము: చూ, హెచ్చు. 2; విణ. 2. అధికము: చూ, హెచ్చు 1.

గాఢముష్టి. సం. వి. ఇ. పుం. 1. ఖడ్గము: చూ, రిష్టి. 2; 2. గండ్రగొడ్డలి: చూ, ముద్గరము; 3. పిసినిగొట్టు: చూ, లోభి.

గాథావటి. సం. వి. ఈ స్త్రీ. (స్త్రీపురుషులు వినోదమునిమిత్తమై యాడెడు చతురంగము మొదలగునవి) ఆట: చూ, విలాసము. 1.

గాణ. వై. వి. 1.=గాయనః. రూ–గాణుఁడు. పాటకాఁడు. కళా. 2, ఆ. 79: చూ, సీకారి; 2.=గాయనీ. రూ–గాణి– గాణీ. స్వా. 5, ఆ. 71: చూ, పాటకత్తె: చూ, స్త్రీ.

గాణాపత్యము. అం. (గాణపతము.) మతములు ఆఱింటిలో నొకటి: చూ, మతములు.

గాణి. వై. వి.=గాయని: చూ, గాణ. 2.

గాణిక్యము. సం. వి. అ. న. బోగముచానల గుంపు: చూ, వేశ్య.

గాణీ. వై. వి.=: చూ, రూ–గాణి. 2 వసు. 2, ఆ. 11.

గాణుఁడు. వై. వి. = గాయనః చూ, సీకారి.

గాణేయము. సం. విణ. గణనీయము.

గాత. సం. వి. ఋ. పుం. 1. పాటపాడు వాఁడు: చూ, సీకారి; వై. వి. (1)=ఘాతము. దెబ్బ: చూ, మొత్తు. 1.

గాతము. వై. వి.=ఖాత. పల్లము; గుహ (అని కొందఱు): చూ, రంధ్రము. 1.

గాతవము. సం. వి. అ. న. గంధర్వగానము: చూ, స్వరము. 2.

గాతి. వై. వి. తిండి: చూ, సాపాటు. (వా)

గాతికలఁగు. దే. అ. క్రి: చూ, వేఱుపడు.

గాతువు. సం. వి. ఉ. పుం. 1. మగకోయిల: చూ, పికము; 2. తుమ్మెద: చూ, భ్రమరము; 3. దిట్టమైనపాటకాఁడు. (విణ. పాటకాఁడు): చూ, సీకారి; 4. చయనముచేసినవాఁడు: అగ్నిచిత్తు (ఇదివిచార్యము), అహితాగ్ని; 5. సొద: చూ, శ్మశానము. (అగ్నిచిత్తు అను పదమునకీయర్థము కలదని కొందఱు.); ఉ. స్త్రీ. 6. భూమిలో ఉఱుముట: చూ, స్తనితము; విణ. 7. కోపి: చూ, రోషణుఁడు.

గాత్రభంగ. సం. వి. ఆ. స్త్రీ. దూలగొండి*: చూ, శూకశింబి.

గాత్రమార్జని. సం. వి. ఈ. స్త్రీ. దేహము తుడుచుకొను బట్ట: చూ, వస్త్రము.

గాత్రము సం. వి. అ. న. 1. దేహము: చూ, శరీరము; 2. అవయవము: చూ, విశేషము. 3; 3. ఏనుఁగుయొక్క ముందటిపిక్క లోనగు చోటు (ఈ యర్థము నందిది ఆకారాంత స్త్రీలింగము): చూ, హస్తి. (వెనుకటికాళ్లు మొదలుగాఁగల భాగము అవరము); 4. కంఠము: చూ, మెడ; దే. విణ. (1) లావు: చూ, స్థూలము.

గాత్రవృక్షము. సం. వి. అ. పుం. తడ *: చూ, మహాబల.

గాత్రసంకోచి. సం. వి. న్. పుం. 1. పిల్లి: చూ, మార్జాలము; 2. తొండ: చూ, సరటము.

గాత్రసంప్లవము. సం. వి. అ. పుం. ప్లవపక్షి: చూ, మహాపక్షము.

గాత్రానులేపని. సం. వి. ఈ. స్త్రీ. సుగంధద్రవ్యములు కూర్చి చేసిన గంధపుబిళ్ల: చూ, వర్తి. 8.

గాథ సం. వి. ఆ. స్త్రీ. 1. చరిత్రము: చూ, సమాచారము. 2; 2. పద్యము, శ్లోకము: చూ, వృత్తము. 1; 3. పాట: చూ, స్వరము. 2; 4. చక్కఁబఱుపఁబడని భాష, ప్రాకృతభాష (అని కొందఱు): చూ, భాష. 1; 5. ముందుగాఁజెప్పెడి వాగ్విశేషము: చూ, సమాచారము. 2; 6. పూర్వీకుల చరిత్రము: చూ, సమాచారము. 2; 7. ఊహ: చూ, యోచన; 8. వాయులక్ష్మి: చూ, వాయువు.

గాథకుఁడు. సం. వి. అ. పుం, విణ. (అని కొందఱు). పాటకాఁడు: చూ, సీకారి.

గాధము. సం. వి. అ. పుం. 1. చోటు: చూ, స్థానము. 1; 2. ఇచ్ఛ: చూ, వాంఛ.

గాద. దే. వి. చెమటకాయలతఱుచు.

గాదము. దే. వి. 1. వైరులోనికసవు: చూ, తృణము. 1; 2 ఆకు: చూ, పర్ణము. 1; 3.కదుము. ఆం, భా. ద్వి. 130: చూ, బొప్పి.

గాదిలి. దే. వి. 1. ప్రేమము: చూ, స్నేహము. 1; 2. చుట్టము: చూ, బంధువు.

గాదె. వై. వి.=గంజ: చూ, గాజె.

గాధము. సం. వి. అ. పుం. 1. మిట్ట: చూ, భూమి. 1; 2 కోరిక: చూ, వాంఛ; విణ. 3. కొట్టఁదగినది: చూ, ప్రహతము. 1.

గాధిజుఁడు. సం. వి. అ. పుం. విశ్వామిత్రఋషి: చూ, ముని. 1.

గాధిని. సం. వి. ఈ. స్త్రీ. గంగానది: చూ, నది.

గాధిపురము. సం. వి. అ. న. కన్యాకుబ్జదేశము: చూ, దేశము.

గాధిభువు. సం. వి. ఊ. పుం: చూ, గాధిజుఁడు.

గాధేయుఁడు. సం. వి. అ. పుం. —పై.—

గాధేరము. సం. వి. అ. పుం: చూ, గాధేరము.

గానము. సం. వి. అ. న. పాట. (పాడఁబడునది): చూ, స్వరము. 2; అం. 2. భోగములు ఎనిమిదింటిలో నొకటి: చూ, భోగములు.

గానశాస్త్రపండితుఁడు. పా. గాయక దోషములు లేక ఆఱుమార్గములను (ఘనము-రాగాలాపము-మధ్యమకాలము-పంద్రాయెత్తు-పల్లవి-పదకీర్తన, వర్ణములు, స్వరజతులు. రాగమాలికలు) వినికిఁజేయఁదగినవాఁడు: చూ, సీకారి.

గానిఁగ. దే. వి. రూ- గానుఁగ- గానుఁగు- గాన్గు): చూ, పరంజము. 1.

గానిని. సం. వి. ఈ. స్త్రీ. వచ*: చూ, విమ.

గానుఁగ. దే. వి: చూ, రూ-గానిఁగ.

గానుఁగపిండి. ద్వ. వి: చూ, తెలికపిండి. (ఎరువులకిది ప్రశస్తము) రూ- గానుఁగుపిండి- గాన్గుపిండి.

గానుఁగాటు. ద్వ. వి: చూ, అటు. 5.

గానుఁగు. దే. వి: చూ, రూ-గానిఁగ.

గానుఁగుపిండి. ద్వ. వి: చూ, రూ-గానుఁగపిండి.

గాన్గుపిండి. ద్వ. వి. —పై.—

గాబ. దే. వి. రూ-గాబము. ఒకరకము గడ్డి. "ఇక్కడ గాబ నిండ పెరిగియున్నది.": చూ, తృణము. 1.

గాబము. దే. వి. —పై.—

గాబరా. వా. వి. కలవరము. "పెద్దపులిని మాడఁగానే గాబరా చెందితివి."

గాబు. దే.వి. కొప్పెర. అం, భా. ద్వి. పై 245: చూ, పాత్రము. 6.

గామ. దే. వి. ఒకరకము చీమ: చూ, పిపీలిక.

గామము. వై. వి. = గ్రామము. చూ, దేశము.

గామిడి. వై. విశ. = గ్రామణి. మేలుబంతి: చూ, శ్రేష్ఠుఁడు.

గాము. వై. వి. = గ్రహము 1. (సూర్యాది) గ్రహము (చూ, గ్రహము): చూ, రాహువు. 2; 2. పిశాచము: చూ, భూతము.

గాముల తేఁడు. ద్వ. వి. చూ, సూర్యుఁడు.

గాయకము. దే. వి. 1. అనరు. సా. 2, ఆ. 66: చూ, మర్మము. 1; విశ. 2. గూఢము. సా. 3, ఆ. 204: చూ, రహస్యము. 1; వా. 3. హెచ్చువెల గలది: చూ, ప్రియము. 4.

గాయకుఁడు. సం. వి. అ. పుం, విశ. (అని కొందఱు) 1. పాటపాడువాఁడు: చూ, సీకారి; వై. విశ. (1)=గ్రాహకః. గ్రహణశక్తిగలవాఁడు: చూ, గ్రహీత.

గాయకులు. అం. సభాంగము లేడుగురిలో నొకరు. (చూ, సభాంగములు, సభాసప్తాంగములు.): చూ, అంగము. 9.

గాయత్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. షడక్షరీ మంత్రము. ("గాయంతం త్రాయతేయస్మాద్గాయత్రీ తేనకథ్యతే." గానముచేయువానిని అనఁగా మననముచేయువానిని రక్షించునది గావున గాయత్రియనఁబడును.) ఈమంత్రము ద్విజులకుపనయన కాలమందు గురువులచే నుపదేశింపఁబడుటచే దీనికి గురుమంత్రమనియు, బ్రహ్మోపదేశమనియుఁ బేర్లుగలవు. గాయత్రి మంత్రము వేదత్రయమందును గలదు. (ఓమ్ భూర్భువః స్వః । తత్స † వితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి । ధియోయోనః ప్రచోద

యాత్॥ శుక్లయజుర్వేదః అ 40. మం 35; అ 3. మం 35; అ 22. మం 9; అ 30. మం 2; కృష్ణయజుర్వేదః. కాండ 1. ప్రశ్న 5. అనువాకం 6. పదము 4. పనస 24; కాం 4. ప్ర 1. అ 11. ప 1. ప 43; ఋగ్వేదః. మం 3. అను 5. సూ 62. మం 11; సామవేదః. ఉ. ప్ర 6. అ 3. మం. 10).

♦దక్షిణదేశమందు 'సువః' అని వ్యవహరింతురు.

† "తథ్స...." అని కొన్ని మైసూరు వేదప్రతులయందు గలదు. "ప్రథమోష్మపరేద్వితీయః" పాణిని, ప్రథమకు ('త' కు) ఊష్మము (స) పరమైనపుడు ద్వితీయము ("థ") అగునని కొందఱి మతము.

§ దక్షిణదేశపు సాంప్రదాయానుసారముగ "రే", "యా" లపై దీర్ఘస్వరితమున్నది.

1 2 3 1గ 1ర 3
ఓ 3 మ్ త త్స వి తు ర్వ రే ణ్యం
1 2 3 1 2
భ ర్గో దే వ స్య ధీ మ హి ।
2 3 1 2 3 1 2
ధి యో యో నః ప్ర చో ద యా త్॥
సామవేదః.

ఇందు ఓ 3 మ్ అనునది ప్రణవము. ప్రతి వేదమంత్రమునకును ముందును చివరను దీని నుచ్చరింపవలెనని ఋషులమతము. "భూర్భువస్వః" (భూః- భువః- స్వః) అను నీమూఁడును మహావ్యాహృతులు. చతుర్వింశత్యక్షరాత్మకంబగు "తత్సవితుర్వరేణ్యం, భర్గో దేవస్యధీమహి, ధియోయోనః ప్రచోదయాత్." అనునది ముఖ్యమైన గాయత్రీమంత్రము. గాయత్రీమంత్రము ఎనిమిదేసి అక్షరములతోఁ గూడుకొనిన మూఁడుపాదములుకలది. ఇందు మొదటిపాదమునం దేడక్షరములు మాత్రమే యున్నవి. అందులకుగాను "వరేణ్యం" అను పదమును సామవేదమునందువలె "వరేణియం" అని విడదీసిగాని "ఓం"కారమును కలిపిగాని యెనిమిది అక్షరములుగ లెక్కించుచున్నారు. ("ఇయాదిపూరణః" అని పింగళఛందమునం దున్నది) "నగాయత్ర్యాః పరంమంత్రమ్" మ్మని పెద్దలు నుడివినట్లు సర్వమంత్రములయందును గాయత్రీమంత్రమగ్రస్థానమలంకరించియున్నది. గాయత్రీమంత్రమునకు ఋషి విశ్వామిత్రుఁడు అనఁగా మంత్రద్రష్ట. ఈమంత్రమును మంత్రార్థమును దెలిసికొని విస్తరించి ప్రచారము చేసినవాఁడు "సవితా" దేవత అనఁగా ప్రతిపాద్యవిషయము సృష్టికర్తయగు పరమేశ్వరుఁడు. "(నిచృద్) గాయత్రి" ఛందస్సు. స్వరము. "షడ్జమము." గాయత్రీమంత్రము శుక్లయజుర్వేదమున నాలుగుసార్లును, కృష్ణయజుర్వేదమున రెండుసార్లును, ఋగ్వేదమున నొకసారియు, సామవేదమున నొకసారియు వచ్చినది. కాని శుక్లయజుర్వేదమున 36, 3 లో వ్యాహృతియుతముగ నున్నది. అక్కడ మాత్రము స్వరము "మధ్యమము." తక్కిన చోట్ల స్వరము. "షడ్జమము": చూ, మంత్రము. 1. (చూ, గాయత్రీమంత్రార్థవివరణము గ్రంథము.); 2. రూ-గాయత్రము. గాయత్రీఛందము. ఛందస్సులు ఇరువదియాఱింటిలో నొకటి: చూ, ఛందస్సులు. (ఇది ఆఱక్షరముల పాదముగలది. కడమఛందస్సులు ఆమీఁద నొక్కొక్కయక్షరము అధికముగాఁగల పాదములుగలవి. ఇది తనను జెంపినవానిని రక్షించునది. గాయంతులనఁగా వైద్యులు. వారిని రక్షించునది); ఈ. త్రీ. న్. పుం. 3. చంద్రుఁడు: చూ, వెలిచేండ్రి. (చూ, విట్ఠదిరము.)

గాయత్రీబ్రహ్మచారి. సం. వి. న్. పుం. బ్రహ్మచారి విశేషము; చూ, వటువు.

గాయని. సం. వి. ఈ. స్త్రీ.=గాణి. (పాట పాడునది): చూ, పాటకత్తె: (చూ, స్త్రీ.)

గాయనుఁడు. సం. వి. అ. పుం, విణ (అని కొందఱు) 1.=గాణ: చూ, సీకారి: 2. జల్పాకుఁడు: చూ, వక్త. 1.

గాయమానములు. అం. బ: చూ, రూ-కాయమానములు. ఆం. భా. ద్వి. స్క. 205.

గాయము. దే. వి. క్షతి: చూ, నఖంకు.

గార. దే. వి. 1. ఇసుకఁజేర్చి దంచినసున్నము: చూ, లేపనము; 2. మణిదోషవిశేషము: చూ, రత్నము. 1; 3. ఇంగుదిః: చూ, హింగుది.

గారకాఁడు. దే. వి. సున్నమునుపూయువాఁడు: చూ, తాపీవాఁడు.

గారడము. వై. వి. 1=గారుడః. విషమంత్రము: చూ, మంత్రము. 1; 2. మాయ. అచ్చ. యు, కాం, 827: చూ, మాయము. 1; 3. మోసము: చూ, వంచన.

గారడి. వై. వి. (గారడము + ఇ) 1. = గారుడః. రూ-గారడీఁడు- గారడివాఁడు. పాములవాఁడు. ఆం. భా. ప్ర. వా. 148: చూ, వ్యాళగ్రాహి; 2.=గారుడః. మాయ: చూ, మాయము. 1. (రూ-గారడీ)

గారడివాఁడు. ద్వ.వి. 1. పాములవాఁడు: చూ, వ్యాళగ్రాహి; 2. ఐంద్రజాలికుఁడు. ఆం, భా. ద్వి 287: చూ, ప్రాతిహారకుఁడు.

గారడీ. వై. వి. =: చూ, రూ-గారడి.

గారడీఁడు. వై. వి. (గారడము + ఈఁడు) —వై.—

గారపండు. దే. వి: చూ, ఇంగుదము.

గారపూఁత. దే. వి: చూ, ఓరు.

గారబము. వై. వి.=గౌరవము: చూ, స్నేహము. 1. (మరియాద అని కొందఱు.)

గారము. వై. వి. = గౌరవము. —వై—; 2.=గౌరవము. అచ్చ. బాల, కాం. 178: చూ, మర్యాద; వా. వి. 3. అజ్ఞనతిశ్రిమిం చునట్లలవాటుపడుట. "మాపిల్లలు గారము చేత బడికిపెళ్లరు." (రూ- గారాబము-గారాబు-గారాము.-గారవము.)

గారవము. —వై—

గారవించు. వై. స. క్రి. 1. గౌరవపఱచు: చూ, సన్మానించు; 2. ఆదరించు: చూ, సంభాళించు.

గారవింపు. చూ, గారము.

గారవిలు వై. అ. క్రి. గౌరవపడు: చూ, రూ-గారవిల్లు.

గారవిల్లు. వై. అ. క్రి. రూ—వై.— (విజ.2, అ. 39.)

గారాబము. చూ, రూ-గారము

గారాబు. —వై.—

గారాము. —వై.—

గారిత్రము. సం. వి. అ. న. ఓదనము: చూ, సాదము. (1)

గారిెలు. వై. వి. = ఘారిక. రూ- గారె, వడ: చూ, భక్ష్యము.

గారు. దే. అప. పూజ్యత్వమును దెలుపునది. "అయ్యగారు-అమ్మగారు." మొ.

గారుడచిత్తు. సం. వి. త్. పుం. గారుడచయనమను యజ్ఞమునుచేయువాఁడు.

గారుడము. సం. వి. అ. పుం. 1.=కిరీటి. గరుడపచ్చ: చూ, రత్నము. 1; 2.=గారడము. విషమంత్రము, (విషమునుబోఁగొట్టు మంత్రశాస్త్రము): చూ, మంత్రము. 1; 3. సూర్యనిగమనము; 4. బంగారు: చూ, లోహము. 1; విణ. 5. గరుఁడునిది; అం. 6. గరుడపురాణము. పురాణములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, పురాణములు (ఇది 12000శ్లో.గలది); 7. వ్యాకరణ బంధములు ఇరువదొకటి. అందు గీతములు పది. భావ

దూషితములు పదునొకండు. గారుడము భావదూషితములలో నొకటి (చూ, వ్యాకరణబంధములు) చూ, భావదూషితములు; 3. ఏకవింశతిస్థానకములలో నొకటి: చూ, ఏకవింశతిస్థానకములు.

గారుడి. సం. వి. ఈ. స్త్రీ: చూ, వత్సాదనీ*.

గారుడికుఁడు. సం. వి. అ. పుం. 1. పాముల వాఁడు: చూ, వ్యాళగ్రాహి; 2. విష వైద్యుఁడు: చూ, వైద్యుఁడు.

గారుత్మతపత్రిక. సం. వి అ. స్త్రీ. పచ్చాకు*: చూ, హరితపత్రిక.

గారుత్మతము. సం. వి. అ.న. పచ్చ, మరకతము: చూ, రత్నము. 1.

గారువు. అం. దూతీచతుష్టయములోని మొదటి దానియందలి ఆఱింటిలో నొకటి: చూ, దూతీచతుష్టయము.

గారె. వై. వి.=ఘారి: చూ, రూ-గారియ.

గార్గి. సం. వి. ఈ. స్త్రీ. రూ-గార్గ్యము. గర్గ గోత్రమందుఁబుట్టిన యాఁడుది: చూ, స్త్రీ.

గార్గేయసగోత్రము. పా. గోత్రములలో నొకటి: చూ, గోత్రములు. (చూ, ప్రవర.)

గార్గేష్ట. సం. వి. ఆ. స్త్రీ. బండిగురివెంద *: చూ, శ్వేతపాకి.

గార్గ్యుఁడు. సం. వి. అ. పుం. 1. గర్గగోత్ర మందుఁ బుట్టినవాఁడు; 2. గార్గేయమహర్షి: చూ, ముని. 1.

గార్దభము. సం. వి. అ. పుం. 1.=గాడిద: చూ, రాసభము; అం. 2. వ్యాకరణబంధములు ఇరువదొకటి అందు అదూషితములు పది భావదూషితములు పదునొకండు. గార్దభము భావదూషితములలో నొకటి: (చూ, వ్యాకరణబంధములు.): చూ. భావదూషితములు.

గార్దభసత్వ. అం. ద్వాదశసత్వలలో నొకటి: చూ, ద్వాదశసత్వలు.

గార్ధ్యము. సం. వి. అ. న. ఇచ్ఛ: చూ. వాంఛ.

గార్భిణము. సం. వి. అ. న. చూలాండ్రయొక్క గుంపు, గార్భిణ్యము: చూ, ధ్రూణ.

గార్భిణ్యము. సం. వి. అ. న. —పై.—

గార్హపత్యము. సం. వి. అ. పుం. 1. ఒక త్రేతాగ్ని, యజ్ఞమునందు వేదికకుఁ బడమట గుండ్రని గుండమునందుండు అగ్ని: చూ, వహ్ని. 1; అం. 2. అగ్నులు అయిదింటిలో నొకటి: చూ, అగ్నులు; 3. అగ్నులు మూఁడింటిలో నొకటి: చూ, అగ్నులు.

గార్హస్థ్యము. సం. వి. అ. న. 1. గృహస్థధర్మము, ఆశ్రమములు నాలుగింటిలో నొకటి. చూ, ఆశ్రమము. 2; 2. తాంబూలము: చూ, వీడియము.

గాలకాఁడు. దే.వి. (గాలము + కాఁడు) చేపలను పట్టువాఁడు: చూ, వలతేఁడు.

గాలకురాలు. దే. వి. ప్రౌఢ: చూ, స్త్రీ.

గాలనము. సం.వి.అ.న. తిట్టు: చూ, శాపము. 1.

గాలము. దే. వి. రూ-గాలాము: చూ, మత్స్యబంధనము (దీని భేదములు,-ఊంటగాలము-గోరుగాలము అని. ఇదియే గోరుగాలము): చూ, వల. 1.

గాలవము. సం. వి. అ. పుం. 1. తెల్లలొద్దుగు*: చూ, లొద్దుగు; 2. మంగ*: చూ. శ్వసనము.2.

గాలవుఁడు. సం. వి. అ. పుం. 1. గాలవముని: చూ, ముని. 1; 2. మహాతలమను క్రింది యాఱవలోకమునందుండు ఋషి: చూ, ముని. 1.

గాలాము. దే వి: చూ, రూ-గాలము. పాండు. 2, ఆ. 187.

గాలి. సం. వి. ఇ. పుం. 1. తిట్టు: చూ, శాపము. 1; దే. వి. (1) గాలి: చూ, వాయువు (రూ - గాడుపు - గాడ్పు); (2) దయ్యము: చూ, భూతము "దీనికి గాలి సోఁకినది"; (3) మృగముల దేహవాసన. స్వా. 4, ఆ. 42;

చూ, వాసన; పా. (4) ఒక భాగము అమ్లజని యు, నాలుగు భాగములు నత్రజనియు శుద్ధ మిశ్రమును బొందుటచే నేర్పడినది మనవా తావరణము.

గాలించు. దే. స. క్రి 1. బియ్యములోని నగు వానిని నీళ్లలోఁపోసి రాళ్లులేక శోధించు: చూ, శోధించు. 1; 2. బియ్యములోనగు వానిని చేటలోఁబోసి ప్రక్కవాటుగా నిటునటు త్రిప్పు: చూ, కోడు; 3. అన్వేషించు: చూ, వెదకు.

గాలింపు దే. వి: చూ, శోధనము.

గాలికుంటు. దే. వి. పశువులకు గొరిజెలయందు పుండుపడెడు రోగము: చూ, పశురోగము.

గాలిఁగడు. దే. వి. గాడిద: చూ, రాసభము.

గాలిగుడి. ద్వ. వి. పరివేషము: చూ, వలిదగుడి.

గాలిగొను. దే. అ. క్రి: (గాలి + కొను): చూ, గాలిపోవు.

గాలిగుడ్డు. దే. విణ. పేద (అప్రి): చూ, బీద వాఁడు.

గాలిచూలి. దే. వి. 1. అగ్ని: చూ, వహ్ని. 1: 2: చూ భీముఁడు; 3. హనుమంతుఁడు: చూ, వానరము.

గాలితంత్రి. దే. వి. ఆకాశము: చూ, విన్ను.

గాలితేరెక్కుమన్నీఁడు. దే. వి: చూ, మన్మథుఁడు. ఆం, భా. ప్ర. 45

గాలిదిండి. దే. వి. (గాలి + తిండి) పన్నాశనము. అచ్చ. యు, కాం. 3: చూ, సర్పము.

గాలినెచ్చెలి. దే. వి.అగ్ని. వాయుసఖుఁడు: చూ, వహ్ని. 1.

గాలిపంట దే. వి. నిర్దయములేని పంట: చూ, సస్యము

గాలిపటము. ద్వ. వి: చూ, బాలక్రీడ

గాలిపడగ. ద్వ. వి. —పై.—

గాలిపోవు. దే. అ. క్రి: చూ, గాలిగొను.

గాలిమాట. దే. వి. జనశ్రుతి: చూ, శబ్దము.

గాలిమేఁతరి. దే. వి: చూ, గాలిదిండి.

గాలిమేపరి. దే. వి. —పై.—

గాలియిల్లు. దే. వి. గాలికియొగిరిపోవునట్లు కట్టిన యిల్లు: చూ, సదనము. 1.

గాలిలేని దీపకలికచందము. లో. గాలిలేమిచే నిటునటు కదలని దివ్వె రీతి. "ఆ. గాలి లేని దీపకలికచందంబున...నిశ్చలాత్మ యెన్న నిర్వికారంబున, నుండె నేని." వేమన. 1274.

గాలివాన. దే. వి. 1. ఝంఝు, గాలితోడి వాన: చూ, వాన. 1; 2. ఝంఝు, వానగాలి: చూ, వాయువు.

గాలివేఁత. దే. వి. 1. గాలి కొట్టుట; 2. ఒక రకము జ్వరము: చూ, రోగము. 1.

గాలిసూడు. దే. వి. మబ్బు. ఆం, పదా. సుర. 143: చూ, మేఘము. 1.

గాలోడ్యము. సం. వి. అ. న. పద్మబీజము: చూ, పద్మము. 1.

గావ. దే. వి. ఒకానొకపక్షి: చూ, పక్షి.

గావంచే. వా. వి. కొల్లాయగుడ్డ: చూ, వస్త్రము.

గావు. దే. వి పొలి: చూ, బలి.

గావుకోడి. ద్వ. వి. ఒకానొక మూలిక*: చూ, వృక్షము.

గావుపట్టు. దే.వి. 1. గట్టిపట్టు; స.క్రి. 2. చంపు. సా. 1, అ. 92: చూ, సంహరించు; 3. నాశముచేయు: చూ, సరిపెట్టు.

గాసటబీసట. దే. వి. సలక్షణముగా చేదువు. లక్ష్మీ. 1, అ. 9: చూ, విద్య.

గాసము. వై. వి.=గ్రాసము: చూ, సాపాటు.

గాసి. దే. వి. 1. అలసట: చూ, శ్రమము. 1; విణ. 2. గాసినొందినది: చూ, అంజిలి గుంజిలి. 1.

గాసిఁబడు. ద్వ. అ. క్రి. (గాసిఁగా + పడు): చూ, బాధపడు,

గాసిఁబెట్టు. దే. స. క్రి. (గాసిఁ + పెట్టు): చూ, బాధించు.

గాసిచేయు. ద్వ. స. క్రి: చూ, సరిపెట్టు.

గాసియగు. దే. అ. క్రి. (గాసి + అగు) నాశమగు: చూ, పోకారు.

గాసిలు. దే. అ. క్రి. రూ-గాసిల్లు. 1: చూ, బాధపడు; 2. శ్రమపడు: చూ, వేసరు. 2; 3: చూ, రోషించు. (ప్రేరణమందు రూపము గాసించు.)

గాసిల్లు. దే. అ. క్రి. —పై.—

గాహనము. సం. వి. అ. న: చూ, స్నానము.

గాహము. సం. వి. అ. పుం. 1. —పై.—; 2. ప్రాకృతశ్లోకము.

గాహితము సం. విణ. మునిఁగినది: చూ, విగాహితము.

గాళుఁడు. దే. విణ. 1. ధీరుఁడు. విజ. 1, అ. 76: చూ, దిట్టఁడు; 2: చూ, ప్రౌఢుఁడు.

గాళ్లవాఁడు. దే.విణ: చూ, రూ-గాండ్లవాఁడు.

## గి

గి. దే. అవ. నిందయందు ప్రాసాద్యాదియైన ఆమ్రేడిత శబ్దముయొక్క యాద్యక్షరమునకు వచ్చెడి యాదేశము. (చంద్రుఁడు గింద్రుఁడు, చిలుక గిలుక, వరములు గిరములు మొ)

గింగురు. దే. వి. వింటినారినుండి బాణము వెడలుటయందును, చెవులు గుళ్లుపడుటయందును నగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

గింజి. దే. వి. రూ-గిజేరు-గిజారు- గురుజా- బ. గుఱుములు: చూ, విత్తనము.

గింజుకొను. దే. అ. క్రి. బిడ్డలు వెలికిలఁబండుకొని యేడ్చునప్పుడు కాళ్లు విదలించు: చూ, విదిలించు.

గింటన. దే. వి. రూ-గింటెన-బింటెన. గిరిపక్షి*: చూ, విష్ణుక్రాంత.

గింటెన. దే వి. —పై.—

గింటెము. దే. వి. జంటనేతబట్ట. కళా. 7, ఆ. 181: చూ, వస్త్రము. (రూ-గెంటెము-ఠెంటెము-రేఁటెము.)

గిండి. దే. వి. సన్నని మెడగల చెంబు: చూ, పాత్రము. 6. (బ. గిండులు-గిండ్లు.)

గిండిచెంబు. దే. వి. —పై.—

గిచ్చు. దే. స. క్రి. రూ-గీచు. గీటుగీచు: చూ, వ్రాయు.

గిజిగాఁడు. దే. వి. రూ-గిజ్జిగాఁడు. పచ్చపిట్ట: చూ, హారితము. 3.

గిజ్జిగాఁడు. దే. వి. —పై.—

గిజెగిజె. దే. వి. తన్నుకొనుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

గిజెగిజెగొను. దే. అ. క్రి. (గిజెగిజె + కొను) తత్తఱపడు. అచ్చ, యు, కాం. 217: చూ, సంభ్రమించు.

గిజెగిజెలాడు దే. అ. క్రి. (గిజెగిజెలు + ఆడు) —పై.—

గిజారు. దే. వి. 1. మామిడిపండు లోనగువాని యందుండు పీసము: చూ, పీసెము; వా. వి. 2. ముసురు. "గిజారువంకాయ: చూ, వృద్ధము.

గిటక. దే. విణ. రూ-గిట్ట-గిడ్డ-గిఱుక. పొట్టి: చూ, వామనుఁడు.

గిటగిట. దే. వి. పండ్లుకొఱుకుటయందగు ధ్వన్యనుకరణము; స్వా. 5, ఆ. 19: చూ, హూహూ.

గిటగిటన. దే. విణ. 1. అల్పము: చూ, స్వల్పము; 2. కృశము: చూ, బక్క; 3. అలకన: చూ, సూక్ష్మము. 4; వి. 4. అలకన: చూ, సూక్ష్మము. 4.

గిటగిటమను. దే. అ. క్రి. (గిటగిట + అను) వడఁకు. ప్రభా.2, ఆ. 88: చూ, వణఁకు.2.

గిట్ట. దే. వి. 1. పశులకాలిగోరు: చూ, వింఖము; 2. అమ్మకి. అచ్చ. యు, కాం. 191: చూ, బాణము. 1.

గిట్టమి. దే. వి. పగ: చూ, విరోధము.

గిట్టించు. దే. అ. క్రి. గిట్టుబడియగు. (ప్రే. చావఁజేయు.)

గిట్టింపు. దే. వి. 1. (అమ్మకమునందలి)లాభము. రూ-కిట్టుబడి-గిట్టుబడి: చూ, లాభము. 1; 2. చావు: చూ, మరణము.

గిట్టు. దే. అ. క్రి. 1. అనుకూలించు: చూ, పొందుపడు; 2. చచ్చు: చూ, మరణించు; 3. చెడు: చూ. నశించు.

గిట్టుబడి. దే. వి. (అమ్మకమందలి) లాభము. రూ-కిట్టుబడి-గిట్టింపు: చూ, లాభము. 1.

గిడస. దే. విణ. పొట్టి. "గిడసవంకాయ.": చూ, హ్రస్వము.

గిడిగి. దే. వి. మద్దువు: చూ, వీణె.

గిడిగిల్లు. దే. వి. బ. 1. నతి: చూ, నమస్కారము; 2. నతివిశేషము: చూ, నమస్కారము.

గిడిబిడి. దే. వి: చూ, గడిగి.

గిడియ. దే. వి. పటహవిశేషము. ఆం, భా. ప్ర. నా. 127: చూ. వీణె.

గిడుగు. దే. వి. (రూ- గొడుగు- గొడువు.) కామలేనిగొడుగు: చూ, వారిత్రి.

గిడ్డ దే. విణ. పొట్టి: చూ, వామనుఁడు.

గిడ్డంగి. దే. వి. 1. సరుకులుంచి అమ్మెడియిల్లు (చూ, పంటసాల.): చూ, సదనము. 1; 2. చెఱసాల: చూ, బంధనాలయము.

గిడ్డి. వై.వి. 1. ఆవు, పొట్టిఆవు (అని కొందఱు): చూ, ధేనువు; 2. పొట్టి: చూ, వామనుఁడు.

గిడ్డు. దే. వి. ఒకరకముడేగ: చూ, శ్యేనము.

గిత్త. దే. వి. రూ-గిబ్బ. 1. ఎద్దుపట్టనికోడె: చూ, వృషభము. 1; 2. ఎద్దు: చూ, వృషభము.1.

గిత్తతత్తడి రేఁడు. దే.వి. నందివాహనుఁడు: చూ, శివుఁడు (ఆం. పదా. కు. 10.)

గిత్త్వము. సం. వి. అ. పుం. ప్రాణవాయువు. చూ, వాయువు.

గిద్ద. దే. వి. 1. పావుసోల. రూ-గిద్దె: చూ, ప్రస్థము. 2; వా. వి 2 చిన్నకొడవలి: చూ, లవిత్రము.

గిద్దు. దే. వి: చూ, రూ-గిడ్డు.

గిద్దె. వా. వి: చూ, రూ-గిద్ద. 1.

గినియ. వై. వి.=కిణిపా-కిణిహి. నల్లగిసె *: చూ, శుకనాసము. 1.(గినియనే నల్లగినియ అందురు.)

గినిమాను. దే. స. క్రి. (గిన్నము + అగు): చూ, వంచించు.

గినుము. దే. వి: చూ, వంచన.

గిన్నియ. దే. వి. రూ-గిన్నె: చూ, పాత్రము. 6.

గిన్నె. దే. వి.—ప్ర.—

గిబ్బ. దే. వి. 1. అచ్చుటెద్దు: చూ, వృషభము. 1; 2. ఎద్దు: చూ, వృషభము. 1.

గిబ్బరౌతు. ద్వ. వి: చూ, గిత్తతత్తడిరేఁడు.

గిబ్బరౌతు సకుఁడు. ద్వ.వి. కుబేరుఁడు. ఆం, భా. ప్ర. 51: చూ, శ్రీగుఁడు.

గిర. సం. వి. ఆ. స్త్రీ. 1. వాక్కు: చూ, శబ్దము; 2: చూ, సరస్వతి.

గిరక. దే. వి. రూ-గిఱక. నూతిరాట్నము: చూ, రాట్నము.

గిరకతాడి. దే. వి. ఈఁదాడి*: చూ, హింతాళము.

గిరకతాడు. దే. వి.—రూ. వై.—

గిరగిర. దే. వి. తిరుగుటయందగు ధ్వన్యనుకరణము. శశా. 6, ఆ. 14: చూ, హాహా.

గిరజా. వా. వి. రూ-గిరదా-గిఱజా, గీర: చూ, సిగ. 4. (చూ, వెండ్రుక. 1.)

గిరణము. సం. వి. అ. న: చూ, మ్రింగుడు.

గిరదా. వా. వి: చూ, రూ-గిరజా.

గిరవు. దే. వి: చూ, తాకట్టు.

గిరస. దే. విశే. పిటికి: చూ. వెలపరి.

గిరాకి. వా. విశే: చూ, గాయకము.

గిరాటువేయు. దే. స. క్రి. (త్రాయి) ఉవ్వు: చూ, వైచు.

గిరి. సం. వి. ఇ. స్త్రీ. 1: చూ, సాపాటు; పుం. 2. కొండ: చూ, పర్వతము; 3. ఏనుఁగు: చూ, హస్తి; 4. గుండుఱాయి, కొండనుండి పడినఱాయి (అని కొందఱు): చూ, రాయి; 5. గళము: చూ, మెడ; 6. కందుకము: చూ, బంతి 3; 7. యతిసంప్రదాయ జ్ఞానార్థమైన గుఱుతు: చూ, లక్షణము. 1; 8 అచ్చనగాయలు: చూ, బాలికాక్రీడ; 9. నేత్రరోగము: చూ, బిడాలము. 2; విశే. 10. పూజ్యము, పూజింపఁదగినవాఁడు (అని కొందఱు): చూ. పూజ్యము.

గిరిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చిట్టెలుక: చూ, మూషికము; 2. జెలగ: చూ, బుడ్డపిసుఁదు; 3. వసురాజుభార్య, కోలాహలపర్వతమునకును శుక్తిమతినదికిని బుట్టిన స్త్రీ: చూ, స్త్రీ; 4. గౌరి: చూ, పార్వతి 1; 5. అనాథ: చూ, విధవ; 6. అడవిమల్లె*: చూ, మల్లె.

గిరికంట(ఠ)కము. సం. వి. అ. పుం. వజ్రము: చూ, రత్నము. 1.

గిరికంఠము. సం. వి. అ. పుం. వజ్రాయుధము, నూఱంచులవాలు: చూ, బాణము. 1.

గిరికదంబము. సం. వి. అ. పుం: చూ, నీపము*.

గిరికదళి. సం. వి. ఈ. స్త్రీ. కొండఅరఁటి*: చూ, రంభ. 2.

గిరికము. సం. వి. అ. పుం: చూ, బొంగరము.

గిరికర్ణి. సం. వి. ఈ. స్త్రీ. దింటెన*: చూ, విష్ణుక్రాంత.

గిరికర్ణిక. సం. వి. ఆ. స్త్రీ. 1.—పై.— (నల్ల దింటెన అని కొందఱు); 2. తెల్లగిరియ*: చూ, శుకనాసము. 1; 3. నేల: చూ, భూమి. 1.

గిరికాఖ్యము. సం. వి. అ. పుం. నీరిప్ప*: చూ, మధూకము.

గిరికోల. సం. వి. ఆ. స్త్రీ. ఉసుగు*: చూ, మహాయమళపత్రిక.

గిరిగిటలు. దే. వి. బ. ఆడునప్పుడు వాయించెడు కంచుతాళము, రూ-గిర్దిటలు: చూ, వీణె.

గిరిగుడము. సం. వి. అ. పుం. కందుకము: చూ, బంతి. 3.

గిరిజ. సం వి.ఆ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి.1; 2: చూ, మాతులుంగము*.

గిరిజంబీరము. సం. వి. అ. పుం. కొండనిమ్మ*: చూ, నిమ్మ.

గిరిజము. సం. వి. అ. న. 1. అభ్రకము: చూ, బేగడ; 2. బంగారు లోనగునది. చిట్టెము (అనియు) ఇనుము (అనియు కొందఱు): చూ, లోహము. 1; 3: చూ, శిలాజిత్తు; 4: చూ, మధూకము*; 5. కొడిసె*: చూ, వత్సకము; విశే. 6. కొండయందుఁబుట్టినది.

గిరిజానుజ. సం. వి. ఆ. స్త్రీ, కలుఁగానుగు*: చూ, వార్షికము. 1.

గిరిజామలము. సం. వి. అ. న: చూ, గిరిజము. 1.

గిరిజ్వరము. సం. వి. అ. పుం. వజ్రము: చూ, రత్నము, 1.

గిరిధన్వుఁడు. సం. వి. న్. పుం: చూ, శివుఁడు.

గిరిధరుఁడు. సం. వి. అ. పుం. గట్టుతాలుపు (కూర్మమై మందరగిరిని ధరించెననుట (లేక) కృష్ణుఁడై గోవర్ధనగిరిని ధరించెననుట): చూ, విష్ణువు. 1.

గిరిపక్షభిత్తు. సం. వి.ద్. పుం: చూ. గిరికంఠము.

గిరిపీలువు. సం. వి. ఉ. పుం, న. చిట్టీఁత*: చూ, మధుఖర్జూరిక.

గిరిభవము. సం. వి. అ. పుం. జువ్వి *: చూ, ప్లక్షము.

గిరిమల్లిక. సం. వి. ఆ. స్త్రీ. కొడిసె *: చూ, వత్సకము.

గిరిమానము. సం. వి. అ. పుం. ఏనుఁగు: చూ, హస్తి.

గిరిమృత్తు. సం. వి. ద్. స్త్రీ. జేగుఱుఱాయి: చూ, ఱాయి.

గిరిమేదము. సం. వి. అ. పుం. వెలితుమ్మ *: చూ, విట్ఖదిరము.

గిరియకము. సం. వి. అ. పుం. అచ్చనగాయలు: చూ, బాలక్రీడ.

గిరియాకము. సం. వి. అ. పుం. చర్మవస్త్రాది కృతమైనబంతి: చూ, బంతి. 3.

గిరివర్తికము. సం. వి. అ. పుం. ఒకానొకపక్షి: చూ, పక్షి.

గిరివాటకము సం వి. అ. పుం. నూఁగుదోస, శైలేయము *: చూ, దోస.

గిరివాసి. సం. వి. న్. పుం: చూ, ముల్లంగి *.

గిరిశాలిని. సం. వి. ఈ. స్త్రీ. అపరాజిత *: చూ, విష్ణుక్రాంత.

గిరిశుఁడు. సం. వి. అ. పుం. రూ-గిరీశుఁడు. 1. కొండయల్లుఁడు: చూ, శివుఁడు; 2. ఈశానుఁడు: చూ, గిరీశుఁడు. 3.

గిరిసారము. సం. వి. అ. పుం. 1: చూ. గిరిజము.2; 2. మలయాపర్వతము, శివలింగము (అని కొందఱు): చూ, పర్వతము; 3. మగగుఱి: చూ, శిశ్నము.

గిరిసింగప్పవృత్తి. మి. వి: చూ, బాలక్రీడ.

గిరిసుత. సం. వి. ఆ. స్త్రీ. గౌరి: చూ, పార్వతి. 1.

గిరిసెము. వై. వి.=శిరీషము *: చూ, శిరీషము.

గిరిస్తని. సం. వి. ఈ. స్త్రీ. పుడమి: చూ, భూమి. 1.

గిర్గిటలు. దే. వి. బ: చూ, రూ-గిరిగిటలు.

గిరీశుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, శివుఁడు; 2. హిమవంతుఁడు: చూ, పర్వతము; 3. ఈశానుఁడను నష్టదిగధిపతులలో నొకఁడు: చూ, దిగధిపతులు; 4 పదునొకండురుద్రులలో నొకఁడు: చూ, రుద్రులు; 5. బృహస్పతి: చూ, వేలుపుటొజ్జ: 6. నలువ: చూ, బ్రహ్మ.1.

గిర్వాణుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ-గీర్వాణుఁడు.

గిఱక. దే. విణ. 1. పొట్టివాఁడు: చూ, వామనుఁడు; 2: చూ, రూ-గిరక.

గిఱకతాడు. ద్వ. వి: చూ, రూ-గిరకతాడు.*

గిఱజా. వా. వి: చూ, రూ-గిరజా.

గిఱి. దే. వి. వలయాకారపురేఖ, బరి: చూ, రేఖ. 3.

గిఱికొను. దే. స. క్రి: చూ, వేష్టించు.

గిఱిపిల్లఁడి. దే. వి. స్త్రీలు కాలఁధరించెడి మూఁడవవ్రేలిపిల్లఁడి: చూ, భూషణము.2.

గిఱుకు. దే. వి. 1. తప్పువ్రాలను గిఱికినగిఱుకు: చూ, తుడుపు; స. క్రి. 2. అక్షరములు బటువుగానేర్పడ వ్రాయక వంకరకొంకరగాఁగీచు; 3 తప్పువ్రాఁతను తుడుచు.

గిఱుక్కు. దే.వి. మసలుటయందగునుకరణము: చూ, హూహూ.

గిఱుపు. దే. స. క్రి. 1. (కన్ను)త్రిప్పు అచ్చ. యు, కాం. 125: చూ, గీఁటు. 2; 2.కదలునటులఁజేయు, కదలించు.

గిఱ్ఱు. దే. వి. తిరుగుటయందగునుకరణము: చూ, హూహూ. (ఆమ్రేడితమందు గిఱ్ఱు గిఱ్ఱు)

గిఱ్ఱుపురుగు. ద్వ. వి. చెట్లయందుండి ఎల్లప్పుడు గిఱ్ఱుమని కూయునట్టి యొక పురుగు: చూ, పురుగు.

గిలక. దే. వి. 1. గిలగిలమ్రోఁగు బాలక్రీడా సాధనము: చూ, బాలక్రీడ; 2. గిలగిలమని మ్రోఁగెడి యనుపతగటిబిళ్ల; 3 గిలగిచ్చ*: చూ, కణపుష్పిక. (రూ-గిలగిచ్చ-గిలగింత-గిలగిల-గిలిగిచ్చ-గిలిగిట్ట-గిలిగిచ్చ); వా. వి. 4. నీరుతోడు సాధనములలో నొకటి: చూ, గాట్నము; 5. నరముజారెడిఅండవ్యాధి. (వా.)

గిలకబండి. దే. వి. చిన్నచక్రములబండి: చూ, శకటము. 1.

గిలకరించు. దే. స. క్రి. 1. వ్రేళ్లతోఁ కలఁచు: చూ, గిలకొట్టు; 2. (కవ్వముతో) చిలుకు: చూ, మథించు.

గిలకొట్టు. దే. స. క్రి. 1: చూ, గిలకరించు. 1. పాండు. 1, ఆ. 117; 2. కుదిలించు. సా. 1, ఆ. 44; 3. (వ్రేళ్లతో) పుణుకు: చూ, పుడుకు. 5.

గిలగింత. దే. వి. రూ-గిలిగింత*: చూ, కణపుష్పిక:

గిలగిచ్చ. దే. వి. —పై.—

గిలగిల. దే. వి. 1. —పై.—; వా. వి. 2. తిండిలేక మలమలమాడుటయందగు ననుకరణము: చూ, హాహా.

గిలగ్రాహము. సం. వి. అ. పుం. నక్రము: చూ, మత్స్యము. 1.

గిలనము. సం. వి. అ. న. తిండి: చూ, సాపాటు.

గిలము. సం. వి. అ. పుం: చూ, నిమ్మ*.

గిలాబ. వా. వి. గచ్చుచేయుట: రూ-గిలాబా.

గిలాబా. వా. వి. —పై.—

గిలి. సం. వి. ఇ. స్త్రీ. ౧: చూ, సాపాటు; దే. వి. (1): చూ, వెఱపు.

గిలిగించు. దే. స. క్రి. గిలిగింతపెట్టు.

గిలిగింత. దే. వి. 1. (రూ-గిలిగిలింత-చెక్కిలిగింత-చెక్కిలిగిలి) అన్యకరస్పర్శముచేఁ గలిగెడు చంక మొదలైన యంగముల సంకోచము: చూ, చెక్కిలిగింత; 2: చూ, రూ-గిలగింత*.

గిలిగిచ్చ. దే. వి: చూ, రూ-గిలగిచ్చ*.

గిలిగిట్ట. దే. వి. —పై.—

గిలిగిలింత. దే. వి. —పై.—

గిలితము. సం. విశే. మ్రింగఁబడినది. రూ-గళితము-గిళితము: చూ, భుక్తము. 2.

గిలుక. దే. వి: చూ, క్రార.

గిలుకు. దే. వి. మెట్టెలులోనగువానియందగు ధ్వన్యనుకరణము. పారిజా. 2, ఆ. 98: చూ, హాహా.

గిలుకుపలుకు. దే. వి. చూ, కూకిపలుకు.

గిలుగాడు. దే. స. క్రి: చూ, రూ-గిలుబాడు.

గిలుగాడుట. దే. వి. రూ-గిలుబాడుట: చూ, ముచ్చిలి.

గిలుగిచ్చ. దే. వి: చూ, రూ-గిలిగిచ్చ*.

గిలుపు. దే. స. క్రి. (కన్ను) గిఱుపు: చూ, రూ-గిఱుపు. 1.

గిలుబాడు. దే స. క్రి. (గిలుబు + ఆడు) రూ-గిలుగాడు. పాండు. 3, ఆ. 16: చూ, మ్రుచ్చిలించు.

గిలుబాడుట. దే. వి: చూ, రూ-గిలుగాడుట.

గిలుబు. దే. వి. రూ-గిలువు-గిలుబుకోలు. అపహరణము: చూ, మ్రుచ్చిలి.

గిలుబుకొను దే. స క్రి: చూ, గిలుబాడు.

గిలుబుకోలు. దే. వి: చూ, రూ-గిలుబు. స్వా. 3, ఆ. 34.

గిలుబుచేయు. ద్వ. స క్రి. (గిలుబు + చేయు): చూ, గిలుబాడు.

గిలువు. దే. వి: చూ, రూ-గిలుబు.

గిల్లకన్ను. దే వి. మెల్లకన్ను: చూ, నేత్రము 1.

గిల్లచూపు. దే. వి. చూ, మెల్లచూపు.

గిల్లు. దే. వి. రూ-గిల్లుడు. 1: చూ, నఖక్షతము;

స. క్రి. 2. నఖక్షతముచేయు: చూ, చిదుము; 3. అరుగులలోనగువానిఁగోయు: చూ, చిదుము.

గిల్లుడు. దే. వి. రూ-గిల్లు: చూ, నఖక్షతము.

గివుటు. దే. స. క్రి. 1. గోఁకు. రూ-గీటు: చూ, అక్కు; 2. భేదించు: చూ, భేదిల్లు. 1.

గిష్ణుఁడు. సం.వి.అ.పుం. 1. సామవేదవేత్త: చూ, వేదాంతి. 1; 2. గాయకుఁడు: చూ, సీకారి.

గిసరి. దే. వి.=: చూ, కేసరి. 1.

గిళనము. సం. వి. అ. న. తినుట: చూ, సాపాటు.

గిళితము. సం. విణ: చూ, రూ-గిలితము.

## గీ

గీ. సం. వి. ర్. స్త్రీ. 1: చూ, సరస్వతి; 2: చూ, వాక్కు; దే. అవ. (1) నిందయందు దీర్ఘాదియైన ఆమ్రేడితశబ్దముయొక్క ఆద్యక్షరమునకు వచ్చెడి ఆదేశము. (దేవుఁడు గివుఁడు, వాలి గీలి. సాత్యకి గీత్యకి మొ)

గీఁక. వై. వి.=ఘీఙ్కారః: చూ, రూ-కీఁక.

గీఁకు. దే. స. క్రి: చూ, అక్కు.

గీఁటు. దే.స. క్రి. 1. (పండ్లు)కొఱుకు; 2.(కన్ను) గీటుపు. జై. 8, ఆ. 65: చూ, గీటుపు. 1; 3. చిమ్ము: చూ, విసరు. 3.

గీఁత. దే. వి. 1. గీటు: చూ, రేఖ. 3; వా. వి. 2.బ్రహ్మవ్రాసిన నుదుటిగీటు: చూ, రేఖ.3; 3. అనాదరము: చూ, వహేలనము.

గీఁతకట్టెము. ద్వ. వి. వడ్లవాఁడు గీఁతలుగీయుట కుపయోగించెడు పలక. (రూ-గీఁతకట్టె.)

గీచు. దే. స. క్రి. రూ-గీయు. గోటనొక్కి వ్రాయు, గీటుగీచు: చూ, రూ-గిచ్చు.

గీటడంగుట. దే. వి. చచ్చుట: చూ, మరణము.

గీటడఁగు. దే. అ. క్రి. చచ్చు: చూ, మరణించు (ప్రే. గీటడఁచు)

గీటు. దే. వి: చూ, గీఁత 1. 2. (రూ-గీఁత-గీఱ-గాఱ-గోటు).

గీటునఁబుచ్చు. దే. స. క్రి. అనాదరించు. జై. 8, ఆ. 39: చూ, తిరస్కరించు.

గీట్లబద్ద. ద్వ. వి. కాగితములలోనగు వానియందు గీట్లుచేయుట కుపయోగించెడు కోల.

గీత. సం. వి. ఆ. స్త్రీ. గ్రంథవిశేషము.

గీతగోవిందము. పా. ఈగ్రంథమునకు కర్త జయదేవుఁడు: చూ, కావ్యనాటకములు.

గీతము. సం.వి.అ.న. 1. పాట. ధ్రువాదులతోఁ జేర్చినపాట: చూ, స్వరము. 2; 2. గానశాస్త్రము; 3. ఒకానొక పద్యము. దీనికిఁ బ్రతి పాదమునకు నైదేసి గణములు. నాలవగణాదియందే విశ్రమము: చూ, వృత్తము. 1; విణ. 4. పలుకఁబడినది, చెప్పఁబడుచేయఁబడినది (అని కొందఱు): చూ, శబ్దము. 2.

గీతి. సం. వి. ఇ. స్త్రీ 1. పాట: చూ, స్వరము.2; 2. గోపకులగీతము: చూ, స్వరము. 2; 3. చేండ్రి*: చూ, వలిచేంద్ర; 4. గీతము: చూ, తేఁటగీతి.

గీపెట్టు. ద్వ.అ.క్రి. (గీఁక + పెట్టు) 1. ఏనుఁగు కూయు. అచ్చ. యు, కాం. 322: చూ, శబ్దించు; 2. మొఱపెట్టు: చూ, రోదించు; 3. మ్రోయు. పాండు. 3, ఆ. 182: చూ, శబ్దించు.

గీము. వై. వి.=గృహమ్. ఇల్లు: చూ, సదనము.1.

గీయు. దే. స. క్రి. గీఁతగీయు: చూ, వ్రాయు.

గీరణగింజలు. దే. వి. బ. (రూ-గీరసంగింజలు-గీరసగింజలు) రేఖికాబీజకేళి: చూ, బాలక్రీడ.

గీరథుఁడు. సం. వి. అ. పుం: చూ, వేలుపుటొజ్జ.

గీరసంగింజలు. దే.వి.బ: చూ, రూ-గీరణగింజలు. కళా. 6, ఆ. 200.

గీరసగింజలు. దే. వి. బ. —వై.— శశాం. 2, ఆ. 19.

గీరా. వా. వి: చూ, రూ-గిరజా.

గీర్ణి. సం. వి. ఇ. స్త్రీ. మ్రింగుట: చూ, సాపాటు.

గీర్దేవి. సం. వి. ఈ. స్త్రీ: చూ, సరస్వతి.

గీర్పతి. సం. వి. ఇ. పుం. రూ-గీష్పతి: చూ, గీరథుఁడు.

గీర్లత. సం. వి. ఆ. స్త్రీ: చూ, మహాజ్యోతిష్మతి*.

గీర్వాణకుసుమము. సం. వి. అ. న: చూ, లవంగము*.

గీర్వాణము. సం. వి. అ. పుం. దేవభాష: చూ, భాష. 1.

గీర్వాణుఁడు. సం. వి. అ. పుం. దేవుఁడు: చూ, వేలుపు.

గీఱ. దే. వి. గీఁత: చూ, రేఖ. 3.

గీఱు. దే. స. క్రి. రూ-గివుఱు. 1. గీఁకు: చూ, ఆక్కు-; 2. ఛేదించు. లక్ష్మి. 1, ఆ. 95: చూ, ఛేదిల్లు. 1.

గీఱుగాజులు. ద్వ. వి. బ. ఒకరకము గాజులు: చూ, భూషణము. 2.

గీఱుడు. దే. వి. 1. గోఁకుడు; 2. ఛేదనము: చూ, స్ఫోటము.

గీఱునామము. దే. వి. గీఱగలిగిన నామము: చూ, పంగనామము.

గీలు. దే. అ. క్రి. కాఱు: చూ, స్రవించు.

గీలుకొనుట. దే. వి. అభిముఖమగుట: చూ, రూ-గీల్కొనుట.

గీలుకొలుపుట. దే. వి. పుష్పాదులు ధరించుట: చూ, రూ-గీల్కొలుపుట.

గీల్కొనుట. దే. వి: చూ, రూ-గీలుకొనుట.

గీల్కొలుపుట. దే.వి: చూ, రూ-గీలుకొలుపుట.

గీవు. దే. వి: చూ, రూ-గిరవు (అప్ర.)

గీష్ణువు. సం. వి. ఉ. పుం. 1. నటుఁడు: చూ, నర్తకుఁడు; 2. గాయకుఁడు: చూ, సీకారి.

గీష్పతి. సం. వి. ఇ. పుం. 1. (రూ-గీఃపతి-గీర్పతి): చూ, వేలుపుటొజ్జ; 2. పండితుఁడు: చూ, సమర్థుఁడు.

# గు

గుంభము. సం. వి. అ. పుం.=గుత్తి-గొత్తు. (వికసించిన) పువ్వులగుత్తి: చూ, పూగుత్తి.

గుంజ. సం. వి. ఆ. స్త్రీ. 1.=గురిజే. పూసగురివెంద*: చూ, శ్వేతపాకి; 2. రూ-గృంజన*: చూ, ముల్లంగి; 3. అవ్యక్తమధురధ్వని: చూ, స్వరము. 2; 4. ఉప్పరిగము: చూ, భూమి. 1; 5. తప్పెట: చూ, వీణె; 6. సితారు అనువాద్యము: చూ, వీణె; 7. ప్రమాణములచేత విషయమును పరిశీలించుట: చూ, విచారణ; 8: చూ, మాతులుంగము*.

గుంజకము. సం. వి. అ. పుం: చూ, వృద్ధదారకము*.

గుంజకృత్తు. సం. వి. త్. పుం. తుమ్మెద: చూ, భ్రమరము. 1.

గుంజనము. సం. వి. అ. న. 1. గునగునమను చప్పుడు: చూ, స్వరము. 2; 2. తుమ్మెదల రొద: చూ, స్వరము. 2.

గుంజము. సం. వి. అ. పుం. 1: చూ, పూగుత్తి.

గుంజర. సం. వి. ఆ. స్త్రీ: చూ, సుభిక్ష*.

గుంజాగ్నిన్యాయము. పా. గురివెందగింజలను నిప్పనుకొనుట.

గుంజితము. సం. వి. అ. న: చూ, గుంజనము.

గుంజిలిపెట్టు. దే. స. క్రి. గోపనముచేయు.

గుంజిళ్లు. దే. వి. బ. చేతులుకట్టుకొని రెండు కాళ్లు చేర్చిపెట్టి కూర్చుండిలేచుట. (రూ-గుంజీలు.)

గుంజిళ్లుపెట్టించుకొనువేల్పు. ద్వ. వి: చూ, వినాయకుఁడు. 1.

గుంజీలు. వా. వి. బ: చూ, రూ-గుంజిళ్లు.

గుంజి. వై. వి.=కుంభ. 1. కంబము: చూ, స్తంభము. 1; 2. కట్టుగొట్టు: చూ, స్తంభము. 1.

గుంజీనుసుగు. దే. వి. 1. ఎలుఁగుగొడ్డాటు; స. క్రి. 2. పరిహాసముచేయు: చూ, వెక్కిరించు. 3.

గుంజోటన. వా. వి. వ్యసనము.

గుంజు. దే. వి. 1. తాడు ఈఁదు లోనగువాని మోవుమొదలు; 2. తాటితేఁగ మొనయందు బుఱ్ఱలోనుండెడు గిజురు. కొబ్బరి (అని కొందఱు). (కొన్నిచోట్ల పుఱ్ఱెలోని మెదటికిని అర్థముగలదు): చూ, పేసెము; స. క్రి. 3. ఈడ్చు. హరిశ్చ. 4, ఆ. 162; హరిశ్చ. 5, ఆ. 17; 4. ఉతుకు: చూ, పులుము. 4.

గుంజీకాయలు. పా. (కాయలు (లేక) ఫలములు.)




(చూ, ఏక, ద్విబీజదళవృక్షములు-ఏకబీజదళము)-

1. సామాన్య ఫలములు (అండాశయ మొక్కటే):—చిక్కుడు, పెసర మొ.
2. సోదరఫలములు (పెక్కు అండాశయములు గలది):—సంపఁగి.
3. మిశ్రిమ ఫలములు (—వై.—):—నారింజ.
4. పుష్పసమూహపరిణామఫలము (పూవులే విత్తనములుగలది):—అనాస.
5. వృంతపరిణామఫలము (దొంగపండు):—జీడిమామిడి.
6. సవృంతపుష్పసమూహపరిణామఫలము: —మత్తి.
7. శరీరాదులనంటుజాతి:-అంట్రింతలు. మొ.

గుంజుకొను. దే. వి. వెనుకకును ముందునకును తన్నులాడుకొను.

గుంజులాడు. దే. స. క్రి. (గుంజులు + ఆడు): చూ, కొంటిగొను.

గుంట. వై. వి. 1.=కుండమ్- గర్తమ్. రూ-కుంట. కొలను: చూ, సరస్సు. 1; 2.=కుండమ్. రూ-కుంట చెఱువు: చూ, సరస్సు. 1; 3.=కుండమ్. రూ- కుంట. పల్లము: చూ, రంధ్రము. 1; 4. భూపరిమాణవిశేషము:

చూ, రూ-గుంట. 4; 5. పల్లించినకొండ్రి. ఆం. భా. ద్వి. 233: చూ, గొంటి; 6. పిఱిఁదిమీఁదిగుంత: చూ, పిఱ్ఱ; వా. వి. 7. (విశాఖపట్టణప్రాంతమున) బాలిక: "మా గుంటకు పెండ్లి అయినది.": చూ, స్త్రీ; 8. ఆఁడుగుఱి: చూ, భగము. 12.

గుంటఁడు. వా. వి. (విశాఖపట్టణప్రాంతమున) బాలుఁడు: చూ, శిశువు.

గుంటక. దే. వి. గుంటుగు. దున్ని విత్తులు చల్లిన వెనుక నేల సవరచేయు సాధనము: చూ, పాపటము (ఇది దక్కను జిల్లాలలోను గుంటూరు కృష్ణా జిల్లాలలోను వాడెదరు).

గుంటకలకర. ద్వ. వి: చూ, రూ-గుంటగలగర* (రూ-గుంటగలిజేరు-కలగర) (వాడుక).

గుంటకోరివ. ద్వ. వి. అగ్నిప్రసరణాయుధమను పిరంగి: చూ, బాణము. 1.

గుంటగలగర. ద్వ. వి: చూ, భృంగరాజము* (దీనిపసరు తేలువిషము, జ్వరము, పచ్చకామెరలు హరించును.)

గుంటగలిజేరు. ద్వ. వి. —పై.—

గుంటచాల్లు. ద్వ. వి. బ: చూ, బాలక్రీడ.

గుంటదూలము. వై. వి: చూ, రూ-గుంటదూలము.

గుంటనక్క. వై. వి. కిఖి: చూ, సృగాలము.

గుంటప్రియ్య. ద్వ. వి. గుంటత్రవ్వి యేర్పఱచిన ప్రియ్య: చూ, ప్రియ్య.

గుంటి. దే. వి. 1. చెవిభాగము: రూ-గుంటు; 2. దున్నుట మొదలగువాని కేర్పఱచుకొన్న భాగము: రూ-గుంటు.

గుంటు. వా. వి. —పై.—

గుంటుగు. దే. వి: చూ, గుంటక.

గుంఠితము. సం. విణ. (ధూళి మొదలగువానిచే) కప్పఁబడినది: చూ, రూషితము.

గుండ. దే. వి. 1: చూ, రూ-గుడ్డ 1-2; వై. వి. 2. పొడి: చూ, సురుము.

గుండఁగి. దే. వి. నీరుకోఁడి: చూ, పుంజో.

గుండఁడు. దే. వి. దాసుఁడు: చూ, సేవకుఁడు.

గుండకము. సం. వి. అ. పుం. 1. దుమ్ము: చూ, రేణువు 1; 2.=గుడక. ఉగ్గుచిప్ప: చూ, పాత్రము. 6; 3. అవ్యక్తమధురధ్వని, మధురభాషణము (అని కొందఱు): చూ, స్వరము. 2; విణ. 4. మలినము: చూ, మైల 6.

గుండక్రియ. అం. స్త్రీరాగములు ఇరువదినాలుగింటిలో నొకటి: చూ, స్త్రీరాగము: (చూ, స్వరము. 2.)

గుండగొయ్య. ద్వ. విణ. (గుండ + గొయ్య) దుష్టుఁడు: చూ, వ్యాధుఁడు.2 (గుండఁగొయ్య అని కొందఱు.)

గుండతుంగ. ద్వ. వి. రూ-గుంద్రతుంగ. తుంగగతికగడ్డి (అని కొందఱు)*: చూ, తృణము. 1.

గుండము. సం. వి. అ. పుం. 1. —పై.—; వై. వి. (1)=కుండమ్. నిప్పులగుంట: చూ, వహ్ని. 1. (హోమగుండముఅని వాడుక); (2)=కుండమ్. గొయ్యి, పల్లము: చూ, రంధ్రము. 1.

గుండా. దే. విణ: చూ, దిట్టఁడు.

గుండారము. వై. వి.=గుణాలయ. దేరా: చూ, సదనము. 1.

గుండాల. సం. వి. ఆ. స్త్రీ: చూ, గుండతుంగ*.

గుండాలువు. సం. వి. ఉ. పుం. నీళ్లమీఁదబలిసి పాకే కూర*: చూ, పాఁకుడు.

గుండాసిని. సం. వి. ఈ. స్త్రీ: చూ, గుండతుంగ*.

గుండిక. సం. వి. ఆ. స్త్రీ. గుండికమనునది: చూ, నది.

గుండికము. సం. వి. అ. పుం. బియ్యములోనగువాని పిండి: చూ, సురుము.

గుండిగ. వై. వి. = కుండికా: చూ, పాత్రము. 6.

గుండియ. దే. వి: చూ, రూ-గుండె.

గుండియరాయివడి. జా. ఒడలెఱుంగక. "మూర్ఛ

లంభాయెఱుకుందూరమునుండి కొంచి గుండియరాయివడి యంగమాకంపింప నెలుకకిట్లనియె." (నీతిచంద్రిక-విగ్రహము.)

గుండిలము. సం. వి. అ. పు. మద్దెలమ్రోఁత: చూ, స్వరము. 2.

గుండీ. వై. వి. 1.=కరండము. బరణి: చూ, పాత్రము. 6; వా. వి. 2: చూ, బొత్తాము.

గుండు. వై. వి.=కుండమ్. 1. కొండ. అచ్చ. కుం, కాం. 57: చూ, పర్వతము; 2. గుండ్రపు తాయి: చూ, రాయి; 3. తూనికగుండు: చూ, పడికట్టు; 4. ఓటుగుండు: చూ, పిరంగిగుండు; 5. కపిలెగుండు: చూ, రాయి; 6. పెద్దతాయి: చూ, రాయి; 7. గోళకము: ఆం, భా. ద్వి. 275: చూ, పూస; దే. వి. 8. గుల్మము: చూ, పాద. 2; 9. గుజ్జము: చూ, హాయము; వా. వి. 10. (వెండ్రుకలు గొఱుగఁబడిన) తల. "బోడిగుండు.": చూ, శిరము. 1; 11. (తప్పినలెక్కపై నుంచఁబడిన) సున్న. "గుండుసున్న.": చూ, సున్న 1. మొ.

గుండుకొను. ద్వ. స. క్రి: చూ, చేష్టించు. (అ. క్రి. గుండుగిలు).

గుండుగుత్త. వై. వి: చూ, ఖండగుత్త.

గుండుజిల్ల ద్వ. వి. పెద్దగంప: చూ, సజ్జ. 1.

గుండుపులుఁగు. ద్వ. వి. చూ, బటువుగువ్వ.

గుండుబెండు. వా. వి. ఇలాగము ఇటునటు వెసఁగకుండుటకై చుట్టునుకట్టిన కట్టు.

గుండుమల్లె. ద్వ. వి: చూ, వృత్తమల్లిక*.

గుండుములుపుగాఁడు. దే. వి. ఒకానొకపిట్ట: చూ, పక్షి.

గుండుసూది. వా. వై. వి. తలగల సూది: చూ, సూది.

గుండె. దే. వి. రూ-గుండియ. 1: చూ, హృదయము. (కుడికర్ణిక-కుడిజఠరిక, ఎడమకర్ణిక-ఎడమజఠరిక అను నాలుగుగదులుఁగలిగి రక్తముతో నిండినదై గుప్పెడు పరిమాణముగల (ప్రాణాధారపు భాగము); 2: చూ, మనస్సు.

గుండెకాయ. దే. వి: చూ, హృదయము.

గుండెగాలి. దే. వి. ప్రాణవాయువు: చూ, వాయువు.

గుండెచెఱువగుట. జా. భయకంపితములు పుట్టుట. "ఆ హాళాహాళింగాంచి వారిగుండె చెఱువైపోయెను." (ధర్మజరాజసూయము.)

గుండెలులేనిబంటు. జా. దయాదాక్షిణ్యాదులు లేని బంటువంటి హృదయముగలవాఁడు.

గుండ్ర. వై. విశ. = కుండల. వృత్తియందు గుండ్రమునకు మీఁది వర్ణము లోపించఁగా మిగిలిన రూపము. (ఉదా.- గుండ్రకంబము- గుండ్రకడుపు. మొ )

గుండ్రతుంగ. ద్వ. వి: చూ, రూ-గుండతుంగ*.

గుండ్రదనము. దే. వి: చూ, వర్తులము.

గుండ్రన వై. వి.=కుండల. —వై.—

గుండ్రము. వై. విశ.= కుండల: —వై.— (కొన్నియెడల వృత్తియందు అంత్యవర్ణలోపము. చూ, గుండ్ర.)

గుండ్రులు. దే. వి. బ. 1. పిండికొట్టి చెరుగఁగా వెనుకనిలిచిన ఉండలు: చూ, మొఱుములు; 2. చెఱకురాట్నపు కంబములు: చూ, స్తంభము. 1.

గుండ్రులుకొలుపు. దే. అ. క్రి. గుడ్లగూబ కూయు. భాగ. 1, స్కం. 342: చూ, శబ్దించు.

గుండ్రా. వై. వి.= గుండ్రా: చూ, గుండతుంగ *. (దేశ్యమని శబ్దరత్నాకరము) (రూ-గుండతుంగ-గుండ్రతుంగ.)

గుండ్రాయి. ద్వ. వి. (గుండు + తాయి) పొత్రము, కల్వపుగుండు (అని కొందఱు): చూ. రాయి.

గుండ్రించు. దే. అ. క్రి. కడుపులోతిప్పు: చూ, తిప్పు.

గుండిగ్రింపు. దే. వి. 1. కడుపులో వికారము: చూ, వికారము. 1; 2. గుండిగ్రించుట.

గుంత. వై. వి. 1.=కుండమ్-గర్త. పల్లము: చూ, రంధ్రము. 1; 2.=గర్త. రూ-గుంట. పిల్లిగిమ్మిడిగుంట: చూ, పిల్లి.

గుందలము. సం. వి. అ. పుం. మర్దళశబ్దము: చూ, స్వరము. 2.

గుంద్ర. సం. వి. ఆ. స్త్రీ. 1.=గుంద్రా. నాగ ముస్తె*: చూ, తృణము. 1; 2. మోరటి*: చూ, ప్రేంకణము; 3. తెల్లు*: చూ, తృణము. 1.

గుంద్రము. సం. వి. అ. పుం. 1. కొకిచెఱకు*: చూ, తృణము. 1; 2. ఒకానొకపక్షి: చూ, పక్షి.

గుంద్రమూల. సం. వి. ఆ. స్త్రీ. ఏరకాతృణము*: చూ, తృణము. 1.

గుందాలము. సం. వి. అ. పుం: చూ, వెన్నెల పులుగు.

గుంధము. సం. వి. అ. పుం.=గుంజి: చూ, స్తంభము. 1.

గుంపించు. దే. స. క్రి. 1 కుప్పవేయు: చూ, రాసిపడు; 2. అతిక్రమించు. భాగ. 7. స్కం, 270: చూ, దాటు. 6.

గుంపు. దే. వి. ప్రాణిసమూహము: చూ, సమూహము.

గుంపుగూడు. దే. వి: చూ, పోగుపడు.

గుంపెన. దే. వి. 1. ఒకానొక చెట్టు: చూ, వృక్షము; 2. ఎసకము: చూ, విజృంభణము.

గుంఫనము. సం. వి. అ. న. రూ-గుంభనము: చూ, మాటలల్లుట.

గుంఫము. సం. వి. అ. పుం. 1. —పై—; 2. బాహుభూషణము: చూ, భూషణము. 2; 3. ఒకానొక అలంకారము: చూ, హేతువు. 2.

గుంఫించు. సం. అ. క్రి. గుంఫితమగు.

గుంఫితము. సం. విశే. 1. కూర్పఁబడినది: చూ, సంయోజితము; అం. 2. గమకములు పదునైదింటిలో నొకటి: చూ, గమకములు.

గుంబము. దే. వి: చూ, రూ-గుమ్మము.

గుంభితము. సం. విశే: చూ, రూ-గుంఫితము.

గుంభనము. సం. వి. అ. న: చూ, రూ-గుంఫనము.

గుంభము. సం. వి. అ. పుం. —పై—

గుక్క. వా. వి: చూ, రూ-గుక్క.

గుక్కఁడు. వా. వి: చూ, రూ-గుక్కఁడు.

గుజరాతీబ్రాహ్మణులు. పా. వీరు యజుర్వేదులు వల్లభమత సంప్రదాయ ప్రవర్తకులు. వీరు కృష్ణవిగ్రహముల నర్చించుచు జీవించువారు వీరితెగ బొంబాయి యందధికముగ గలదు: చూ, బ్రాహ్మణులు.

గుగ్గిలపుఁజెట్టు. ద్వ. వి: చూ, మహిసాక్షి *.

గుగ్గిలము. వై. వి. 1.=గుగ్గులువు. -పై-; 2.=గుగ్గులు. గుగ్గులువృక్షముయొక్క బంక.

గుగ్గిలముశుద్ధి. పా. త్రిఫలకషాయముతో డోలాయంత్రమున రెండుజాములు వండిన శుద్ధి.

గుగ్గిళ్లు దే. వి. బ: చూ, పాలి.

గుగ్గులువు. సం. వి. ఉ. పుం. 1.=గుగ్గిలము*: చూ, మహిసాక్షి; 2. ఎఱ్ఱముసగ *: చూ, శిగురు. 1.

గుచ్ఛకంటకము. సం. వి. అ. పుం: చూ, బ్రహ్మదండి *.

గుచ్ఛకణిశము. సం. వి. అ. పుం. బ. చోళ్లు: చూ, ధాన్యము.

గుచ్ఛకము. సం. వి. అ. పుం. 1.=కుచ్చు-గుత్తి-గొత్తు: చూ, భూగుత్తి; 2. నెమలిపురి: చూ, పింఛము. 1; 3. గుల్మము: చూ, పొద. 2; 4. ముప్పదిరెండుమణులు గ్రుచ్చిన హారము: చూ, భూషణము. 2; న. రే. గ్రంథి

పర్ణము *: చూ, రాజార్హ్వము (పుం. అని కొందఱు.)

గుచ్ఛకరంజము. సం. వి. అ. పుం. కరంజ విశేషము *: చూ, శాదఘ్నము.

గుచ్ఛకుసుమము. సం. వి. అ. పుం. ఏడాకుల అరఁటి *: చూ, రంభ. 2.

గుచ్ఛదంతిక. సం. వి. ఆ. స్త్రీ. అరఁటి *: చూ, రంభ. 2.

గుచ్ఛపత్రము. సం. వి. అ. పుం. 1. ఏడాకుల పొన్న *: చూ, పొన్న; 2. కోరింద *: చూ, మురుక్కరి.

గుచ్ఛపుత్రి. సం. వి. ఈ. స్త్రీ: చూ, బంతి. 4.

గుచ్ఛపుష్ప. సం. వి. ఆ. స్త్రీ: —పై.—

గుచ్ఛపుష్పము. సం. వి. అ. పుం. 1: చూ, గుచ్ఛపత్రము1.*; 2: చూ, పూతికరజము*.

గుచ్ఛపుష్పి. సం. వి. ఈ. స్త్రీ: చూ, సుభిక్ష*.

గుచ్ఛపుష్పిక. సం. వి. ఆ. స్త్రీ. ఱెల్లు*: చూ, తృణము. 1.

గుచ్ఛఫల. సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, వాయసి*; 2: చూ, స్వాదుఫల*; 3. కదళి*: చూ. రంభ. 2.

గుచ్ఛఫలము. సం. వి. అ. పుం: చూ, సల్లకి*.

గుచ్ఛఫలికము. సం. వి. అ. పుం: చూ, స్వాదుఫల*.

గుచ్ఛబంధ. సం. వి. ఆ. స్త్రీ: చూ, గూండాల*.

గుచ్ఛబంధము. పా. శబ్దాలంకారములలోనొకటి. చూ, శబ్దాలంకారములు. (చూ, అలంకారము. 3.)

గుచ్ఛభద్ర. సం. వి. ఆ. స్త్రీ: చూ, గుచ్ఛబంధ*.

గుచ్ఛము. సం. వి. అ. పుం.=కుచ్చు-గుత్తి-గొత్తు. (రూ-గుత్సము-గుత్సకము-గుంఛము - గుళుచ్ఛము-గుళుత్సము- గులుత్సకము.): చూ, గుచ్ఛకము 1-2-3-4-5; పుం, 6. ఱెల్లుపు కొమ్ములవంటి వేళ్లగడ్డి, నడ్డివేళ్లగడ్డి, వృత్తతృణము: చూ, తృణము. 1; 7. దుబ్బు, కసవు కాడ: చూ ,పొట్టుకట్ట (చూ, తృణము.1.); 8. గుంపు: చూ, సమూహము.

గుచ్ఛమూలిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, గుండాసిని*.

గుచ్ఛార్ధము. సం. వి. అ. పుం. పదియాఱుపేటల ముత్యాలహారము: చూ, భూషణము. 2.

గుచ్ఛి. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, గుచ్ఛకరంజము*; బ. 2.=కుచ్చెళ్లు: చూ,పింజె.4.

గుచ్ఛేలి. దే. వి. ఘోలి.*: చూ, శకుల.

గుజము. సం.వి.అ.పుం: చూ, మాతులుంగకం*

గుజిరీ. వా. వి: చూ, రూ-గుజేరీ. 4.

గుజ్జరి. సం. వి. ఈ. స్త్రీ. రూ-గుర్జరి. ఎఱ్ఱాకుల తోఁటకూర*: చూ, మారిషము.

గుజ్జెనగూళ్లు. దే. వి. బ. (గుజ్జు + ఎన + కూళ్లు) 1. చూ, బాలక్రీడ; 2. బాలికలాడుకొనునపుడు గురుగులతో వండిన వంటకము: చూ, సాదము (1). (రూ-గుజ్జెనగూళ్లు.)

గుజేగుజే. దే. విశ. అనుమడు. భాగ. 6, స్కం. 409: చూ, పీడితము.

గుజేగుజేఱేకులు. దే. వి. బ: చూ, బాలికాక్రీడ, హంస. 5, ఆ. 155.

గుజేగుజేలాడు. దే. అ. క్రి. (గుజేగుజేలు + ఆడు) (రూ-గుజేగుజేవోవు-గుజేగుజేలుపోవు) తొందరపడు: చూ, సంతాపించు.

గుజేగుజేవోవు. దే. అ. క్రి. —పై.—

గుజేగుజేలువోవు. దే. అ. క్రి. —పై.—

గుజేగుజేలువోవుట. జా. రహస్యమాడుకొనుట. "కొంతవడి పొట్టుపొరలై గుజేగుజేలువోయి డాయఁజూచిన. (నీతిచంద్రిక-విగ్రహము.)

గుజేరాతి. దై.వి.=ఘూర్జర. రూ-గజేరీ-గుజేరు-గుజ్జెరాతి-గుజ్జెరి. 1. నాట్యభేదము. అం,

భా. ప్ర. నా. 180: చూ, వ్యంజకము; 2. ఘూర్జరభావ: చూ, భావ. 1; 3. ఘూర్జరదేశము: చూ, దేశము.

గుజేరీ. 1. వై. వి.= —వై.—; వా. వి. 4. రూ-గుజిరీ. సంతచోటు: చూ, సదనము.1.

గుజేస్తా. వా. వి. గడచిపోయినది. "సాలు గుజేస్తారెతు."

గుజోరతు. వా. వి. వశము.

గుజాంతి. దే. వి. ధనికుఁడు: చూ, విడిముడి గలవాఁడు.

గుజారు. దే. వి: చూ, రూ-గిజారు.

గుజ్జెనగూళ్లు. దే. వి. బ: చూ, రూ-గుజ్జెనగూళ్లు.

గుజ్జెరాతి. వై. వి: చూ, రూ-గుజేరాతి. 2-3.

గుజ్జెరి. వై. వి. —వై.— (రూ-గుజేరీ-గుజ్జెరీ.)

గుజ్జెరిమముకు. అం. మల్లశాస్త్రమునందలి నఖుకులు మూఁడింటిలో నొకటి: చూ, నఖుకులు.

గుజ్జెరివాఁడు. ద్వ. వి. ఘూర్జరుఁడు.

గుజ్జు. దే. వి. 1. అనుకగు రసద్రవ్యము; వై. వి. 2.=కుబ్జ. కుబ్జత్వము: చూ, పొట్టితనము; 3. పొట్టియెద్దు: చూ, వృషభము. 1; 4. గుంటకగుజ్జు: 5. దూలపుగుజ్జు: కురుజు-కొమరు; 6. బండిపఱపుగుజ్జు; 7. కుబ్జదారువు; విణ. 8. పాపటపుగుజ్జు; 9. పొట్టివాఁడు: చూ, వామనుఁడు.

గుజ్జుకొమరులకుఁదండ్రి. ద్వ.వి: చూ, శివుఁడు. (ఆం. పదా. సుర. 10.)

గుజ్జుతనము. వై. వి =కుబ్జత: చూ, గుజ్జు. 2.

గుజ్జునారికేడము. వై. వి: చూ, అఖుండుకము.

గుజ్జుపొట్ల. వై. వి పొట్టిపొట్ల *: చూ, పొట్ల.

గుజ్జుమామిడి. దే. వి. పొట్టిమామిడి *: చూ, మామిడి.

గుజ్జువేలుపు. ద్వ. వి: చూ, వినాయకుఁడు. 1.

గుజ్జువేల్పుతండ్రి. ద్వ. వి: చూ, శివుఁడు.

గుజ్జుసైదోడు. ద్వ. వి: చూ, స్కందుఁడు. (ఆం. పదా. సుర. 19.)

గుట. సం. వి. ఆ. స్త్రీ. రేఁగుపండు: చూ, రేఁగు. 1.

గుటక. వా. వి. గుక్కెడునీటికొలత: చూ, నోరెండు.

గుటకలుమ్రింగు. వా.వి: చూ, రూ-గ్రుక్కలు మ్రింగు.

గుటగుట దే. వి. 1. అన్నముడుకుట-నీళ్లు త్రాగుట-ప్రాణములు వదలుట-కడుపులో త్రిప్పుట-పులికూయుట లోనగువానియందగు ధ్వన్యనుకరణము: చూ, హుహూహూ; 2. పంది కూఁత: చూ, స్వరము. 2; 3. బ. పెద్దరికపు మాటలు. స్వా. 5, ఆ. 19: చూ, శబ్దము. 2.

గుటిక. సం. వి. ఆ. స్త్రీ. నల్లమట్టి*: చూ, మట్టి.

గుటుకు. దే. వి: చూ, రూ-గుటుక్కు-గుడుక్కు (ఆమ్రేడితమందు గుటుగుటుకు.) చూ, హుహూహూ.

గుటుక్కను. దే. అ. క్రి. (గుటుక్కు + అను) 1: చూ, మరణించు; వా. 2. లటుక్కన మ్రింగు, నమలకుండగమ్రింగు, త్వరితముగ మ్రింగు, మాయచేసిమ్రింగు మొ.

గుటుక్కు. దే. వి. లటుక్కు. మ్రింగుటయందగు ధ్వన్యనుకరణము: చూ, రూ-గుటుకు:

గుటుగుటుకు. వా. వి. (గుటుకు + గుటుకు). రూ-గుటుకు: చూ, హుహూహూ.

గుట్ట. వై. వి.=ఘుట్ట. కుండ. 1. కొండ: చూ, పర్వతము; 2. చిన్నకొండ: చూ, పర్వతము; 3. పోగు: చూ, రాశి. 2.

గుట్టు. వై వి =గూఢ. 1. కీలు: చూ, మర్మము.1; 2. గాంభీర్యము: చూ, పేరిమి.

గుట్టుచేడు. ద్వ. వి. (గుట్టు + పేడు) రాజమంత్రము బయలుపడుట.

గుట్టుసాక్షి. వై. విణ. = గూఢసాక్షి: చూ, సాక్షి.

గుడ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉంట: చూ, గోళము. 2; 2. జెముడు *: చూ, స్నుహి; 3. ద్రాక్ష *: చూ, స్వాదుఫల; 4. నిద్ర: చూ, స్వప్నము. 2; 5. దూడతోఁగూడిన యావు: చూ, ధేనువు; 6. జ్ఞానముద్ర.

గుడంబము. అం. మల్లశాస్త్రమునందలి ప్రచారములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, ప్రచారములు.

గుడక. వై. వి.=గుండక. 1. టెంకాయబుఱ్ఱలోనగునది; 2: చూ, పాలడ.

గుడకము. సం. వి. అ. పుం. బెల్లముతో వండిన మందు: చూ, మందు. 1.

గుడకరి. సం. వి. ఈ. స్త్రీ. ఎఱ్ఱాకుల తోఁట కూర *: చూ, మారిషము. 1.

గుడగుడ. వా. వి: చూ, గుటగుట. 1.

గుడచి. సం. వి. ఈ. స్త్రీ: చూ, సోమవల్లి *.

గుడజిహ్వికాన్యాయము. పా. బెల్లము నాలుక మీఁద నున్నంతసేపే రుచి యనురీతి.

గుడతృణము. సం. వి. అ. పుం. చెఱకు*: చూ, రసాలము. 3.

గుడత్రిణము. సం. వి. అ. న. -వై.-(చెఱకుగడ అని కొందఱు.)

గుడత్వక్కు. సం. వి. చ్. న: చూ, వరాంగకము*. (దుడత్వచము అనియు.)

గుడదానము. అం. దశదానములలో నొకటి: చూ, దానములు.

గుడదారువు. సం. వి. ఉ. న: చూ, గుడత్రిణము *.

గుడద్రవము. సం. వి. అ. పుం: చూ, లక్క.

గుడధేనువు. సం. వి. ఉ. స్త్రీ. బెల్లముతోఁ జేసిన ఆవు: చూ, ధేనువు.

గుడనాగాది. అం. రసాయనములలో నొకటి: చూ, రసాయనములు.

గుడపము. సం. వి. అ. పుం: చూ, కృష్ణలము.

గుడపాకి. సం. వి. ఈ. స్త్రీ: చూ, శ్రీతాళము *.

గుడపిండము. సం. వి. అ. పుం. బెల్లముతోఁ జేసిన పిండిపోఁకలు: చూ, భక్ష్యము.

గుడపుష్పము. సం. వి. అ. పుం: చూ, మధూకము *.

గుడఫల. సం. వి. ఆ. స్త్రీ. 1. కామంచి *: చూ, తృణము. 1; 2. కాకమాచి *: చూ, వాయసి.

గుడఫలము. సం. వి. అ. పుం. గోఁగు *: చూ, పీలువు.

గుడబల. సం వి. ఆ. స్త్రీ: చూ, పూతిక *.

గుడబీజకము. సం. వి. అ. న. అంబాళము *: చూ, మామిడి.

గుడమంజరి. సం. వి. ఈ. స్త్రీ: చూ, శణపుష్పిక *.

గుడము. సం. వి. అ. పుం, నపుంసకము (అని కొందఱు) 1. రూ-గూడము: చూ, బెల్లము. 1; 2. గోలి (పుం, స్త్రీలింగమని కొందఱు) ఉంట: చూ, పూస; 3. ఏనుఁగుకవచము: చూ, బొందడము; 4. చేయి: చూ, హస్తము; 5. (యుద్ధమునకు) సన్నాహము: చూ, యత్నము; 6. గిడమనుచేఁప: చూ, మత్స్యము. 1; 7. తెవులు: చూ, రోగము. 1; న. 8. కుంకుమము: చూ, వహ్నిశిఖము. 1.

గుడమూలము. సం. వి. అ. పుం. చెఱకు *: చూ, రసాలము. 3.

గుడశర్కర. సం. వి. ఆ. స్త్రీ. బెల్లపుచక్కెర: చూ, బెల్లము.

గుడశిగ్రువు. సం. వి. ఉ. పుం. ఎఱ్ఱమునగ *: చూ, శిగ్రువు. 1.

గుడాక. సం. వి. ఆ. స్త్రీ.=గుఱుకు, నిద్ర: చూ, స్వప్నము. 2.

గుడాకు. మి. వి. గ్రా. ( గుడము + ఆకు ) బెల్లముతోఁజేర్చి మర్దించిన పొగాకు: చూ, పొగాకు.

గుడాకేశము. సం. వి. అ. పుం. తెల్లపువ్వుల నీరుల్లి *: చూ, పలాండువు:

గుడాకేశుఁడు. సం.వి. అ. పుం. 1. అర్జునుఁడు: చూ, విజయుఁడు. 1; 2: చూ, శివుఁడు (గుహాకేశుఁడని కొందఱు.)

గుడారము. వై.వి.=గుణాలయః. రూ-గుడారు-గూడారము-గూడారు-గుండారము): చూ, సదనము. 1.

గుడారు. వై. వి. = —వై.—

గుడాశ్రయము. సం. వి. అ. పుం: చూ, మృదు ద్రుమము.

గుడాసార. సం. వి. ఆ. స్త్రీ: చూ, స్వాదు ఫల *.

గుడి. దే. వి. 1. ఇకార రూపాంతరనామము; 2. రూ-గుడుసు. ఆం. భా. ప్ర. ది. 30: చూ, పరివేషము; 3. వలయాకారపు రేఖ: చూ, రేఖ. 3: వై. వి. 4 = కుటి. దేవాలయము: చూ, వేలుపుటెంకి (చూ, సదనము. 1.); 5. = కుడిశ. ఒకచేఁప: చూ, మత్స్యము. 1.

గుడికట్టు. దే. వి. గ్రామము నాలుగుదిక్కుల యెల్లల యేర్పాటు, గ్రామకంఠము- అయకట్టు (అని కొందఱు.)

గుడికొను. దే. అ. క్రి. క్రమ్ము. సా. 3, ఆ. 164: చూ, వ్యాపించు.

గుడిగి. దే. వి. చెడ్డి: చూ, వస్త్రము

గుడిగుడి. దే.విశ. 1. అల్పము: చూ, స్వల్పము; వా. వి. 2. గంజాయిత్రాగుట లోనగువానియందగు ధ్వన్యనుకరణము: చూ, హుక్కా.

గుడిగుడిగుంచేములు. వా. వి. బ: చూ, రూ-గుడుగుడు గుంచేములు.

గుడిచుట్టు. దే. వి: చూ, పరివేషము.

గుడిసెల్ల. ద్వ. వి. ఒకానొక చేఁప: చూ, మత్స్యము. 1.

గుడిదిరుగు. దే. అ. క్రి. (గుడి + తిరుగు) గుండ్రముగాతిరుగు. ఖై. 5, ఆ. 35.

గుడినుండి గుడితాళ్లు తెగఁగోయుట. లో. ఉదా. "క. కుడిచినయింటికి రెండె, ప్పుడు దలఁతురసంగవలదు భూతల మెఱుఁగున్, గుడినుండియె గుడితాళ్లే, క్కుడుగాఁ గోయుట సగోత్ర గుణములు సుమ్మీ."

గుడిమ్రింగినవానికిఁ దల్పులప్పడములు. లో. ఉదా. "అలమి గుడిమ్రింగువానికిఁ దలుపులప్పడములు గాకుండునే." పాండురంగమాహాత్మ్యము.

గుడిసి. వై.వి.=కుటి. ఆకుటి: చూ, సదనము.1. (రూ-గుడిసె గుడుసు.)

గుడిసె. వై. వి. 1. = —పై.—; దే. వి. 2. ఒకవిత్తుగల చింతపండు: చూ, చింతపండు.

గుడిసెవాటు. ద్వ. వి: చూ, ఱంకులాఁడి.

గుడు. వా. క్రి. చెప్పరించు.

గుడుక్కు. దే. వి: చూ, రూ-గుటుకు.

గుడుగుడు. వా. వి. 1. చిన్నహుక్కా; దే.వి. 2. పరుగెత్తుట. చిగుడాట, గంజాయి త్రాగుట, అన్నముడుకుట లోనగువానియందగు ధ్వన్యనుకరణము: చూ, హుక్కా.

గుడుగుడుగుంచేములు దే. వి. బ: చూ, బాలక్రీడ. కాశ. 3, ఆ. 33.

గుడుగురావిలము. దే. వి. ఒకరకముపిట్ట: చూ, పక్షి.

గుడిచి. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-గుడూచి *.

గుడుప. దే. వి. ఇనుపదుడ్డు: చూ, ముద్గరము.

గుడుసరి. దే. విశే. (గుడుసు + అరి): చూ, కపటి.

గుడుసు. దే. వి. 1. గుడి. ఆం,భా. ప్ర. ది 80: చూ, పరివేషము; వై. వి. 2. =కుటీర. రూ-గుడిసి: చూ, సదనము. 1; విశే. 3. గుండ్రము: చూ, వర్తులము.

గుడుసుకయిదువు. దే. వి. విష్ణుచక్రము: చూ, బాణము. 1.

గుడుసువడు. ద్వ. అ. క్రి. (గుడుసు + పడు) గుండ్రమగు.

గుడుసువాలు. దే. వి: చూ, గుడుసుకయిదువు.

గుడూచి. సం.వి.ఈ. స్త్రీ. రూ- గుళూచి తిప్పతీఁగె*: చూ, సోమవల్లి

గుడెము. దే. వి. చిన్నపల్లె. (రూ-గూడెము-గోడము-గోడెము): చూ, దేశము.

గుడేరకము. సం. వి. అ పుం. తిండి: చూ, సాపాటు.

గుడేరము. సం. వి. అ. పుం. 1 —పై.—; 2: చూ, గుడకము.

గుడోద్భవ. సం. వి. ఆ. స్త్రీ. శర్కర: చూ, బెల్లము. 1.

గుడోపలన్యాయము. పా. బెల్లముఁగొట్టినట్టాయి వలె ననురీతి

గుడ్డ. దే. వి. రూ-గుండ 1. బట్ట: చూ, వస్త్రము; 2. వ[స్త్ర]ఖండము: చూ,వస్త్రము.

గుడ్డగొడుగు. వా. వి: చూ, వారిత్ర.

గుడ్డము. దే. వి. రూ- గుడ్డాము. 1. చేను. పాండు. 3, ఆ. 75: చూ, భూమి. 1; 2. చేనుతునుక: చూ, భూమి 1.

గుడ్డి. వా. విశే. రూ-గ్రుడ్డి. 1. అంధుఁడు: చూ, రూ-గ్రుడ్డి; వి. 2. అంధభావము. (విశే. అని కొందఱు) చూ, చీఁకు. 3 ఆట చెమ్మ ఆటలో వెలికిలఁబడ్డ ఒంటికాయ.

గుడ్డికణ్ పాముసా. ద్వ. వి: చూ, శ్రీమఁడు.

గుడ్డికొక్కెర. ద్వ. వి. చీఁకుఁగొక్కెర: చూ, బకము.

గుడ్డికొక్కెరాయి. ద్వ. వి. —పై.—

గుడ్డితనము. దే. వి. రూ-గ్రుడ్డితనము: చూ, చీఁకు.

గుడ్డు. వా. వి. 1. అండము. రూ-గ్రుడ్డు: చూ, పేశీకోశము; 2. సున్న. "నీలెక్క గుడ్డు."

గుడ్వలము. సం. వి. అ. పుం: చూ, సీలమండ.

గుడ్ఫము. సం. వి. అ. పుం. —పై.—

గుడ్లగుబ్బలి. దే. వి: చూ, సకినంపుఁబులుఁగు.

గుడ్లగూబ. దే.వి —పై.— (రూ-గుబ-గూబ-గ్రుడ్లగూబ-గ్రుడ్లగుబ్బలి.)

గుణ. సం వి.ఆ. స్త్రీ. దూర్వ*: చూ, తృణము.1.

గుణకబిందువు. అం. రదక్షతములు పదింటిలో నొకటి: చూ, రదక్షతములు.

గుణకము. సం. వి. అ. పుం. పెంపుడులెక్క, పూరకాంకము.

గుణకహారపథకము. పా. ఎక్కములు.

గుణకారము. పా: చూ, హెచ్చవేత.

గుణకారుఁడు. సం. వి. అ. పుం: చూ, వృకోదరుఁడు.

గుణకీర్తనము. అం. సామపంచకములో నొకటి: చూ. సామపంచకము.

గుణజ్ఞుఁడు. సం. విశే: చూ, సమర్థుఁడు.

గుణత్రయపురి. అం. పురులెనిమిదింటిలో నొకటి: చూ, పురులు.

గుణధర్మములు అం. ధర్మము లయిదింటిలో నొకటి: చూ, ధర్మములు.

గుణధ్వని. సం. వి. ఇ. పుం. ధనుష్టంకారము: చూ, స్వనము. 2.

గుణని. సం. వి. ఈ. స్త్రీ: చూ, శీలనము.

గుణనిక. సం. వి. ఆ. స్త్రీ. 1. నాట్యమునందుఁ బ్రయోగింపఁదగిన యర్థము; 2. విలువిద్య నెందులగువాని నేర్చుకొనుట; 3. లోళ్లభా

వ్యము; 4. రెట్టించిన వడ్డి; 5. మరలమరల యను నర్థము.

గుణనీయము. సం. వి. అ. న: చూ, స్వభావము.

గుణపడు. మి.అ.క్రి. (గుణము + పడు) చేకూఁ బడు: చూ. సరిపడు. 2.

గుణప్రియ. సం.వి.ఆ.స్త్రీ. అతివస*: చూ, విమ.

గుణభ్రంశము. సం. విణ. గుణనాశనము: చూ, పర్యంతిక.

గుణము. సం. వి. అ. పుం. 1. రూ-గూణము = గొనయము. అల్లెత్రాడు: చూ, మౌర్వి. 1; 2. త్రాడు, దారము (అని కొందఱు): చూ, సూత్రము. 1; 3.=గొనము. మడుఁగు. "ఇను మడుఁగు-మున్మడుఁగు" మొ: చూ, రెట్టి. 2; 4. ఇంద్రియము: చూ, హృషీకము; 5. అప్రధానకార్యము: చూ, అప్రధానము; 6.=గొనుబు. అలవాటు: చూ, స్వభావము; 7. గుణకారము: చూ, హెచ్చవేఁత; 8. మూఁడనుసంజ్ఞ (తిగ): చూ, మూఁడు; 9. శుల్కము: చూ, సుంకము. 1.

గుణములను గొనియాడుట. అం. సామము లయిదింటిలో నొకటి: చూ, సామములు.

గుణములు. అం. 1. కావ్యగుణములు.—మాధుర్యము, ఓజస్సు, ప్రసాదము, శ్లేష, సౌకుమార్యము, అర్థవ్యక్తి, సమత, ఔదార్యము, కాంతి, సమాధి, సంశబ్దత, ప్రేయస్సు, ఔర్జిత్యము, విస్తరము, సౌక్ష్మ్యము, గాంభీర్యము, సంక్షేపము, భావితము, సమ్మితత్వము, ప్రౌఢి, రీతి, ఉక్తి, గతి (23) (చూ, ఉపవిద్యలు); మది యని శబ్దరత్నాకరము.-శ్లేషము, ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యము, సమత, అర్థదీపనము, ఔదార్యము, కాంతి, ఓజస్సు, సమాధి. (చూ, కమ్మన. 2. మాధుర్యము= కమ్మన.) (వీనిలో వచ్చు పద్యకవిత్వముల లక్షణములు వృత్తరత్నాకరాదిఛందో గ్రంథములయందు వివరింపఁబడియున్నవి. రీతులు, వృత్తులు, గుణములు, పాకములు, శయ్య, అలంకారములు, రసములు, ధ్వనులు మొదలగునవి వామనసూత్రము, వాత్స్యాయన సూత్రము, కావ్యాదర్శము, కావ్యప్రకాశము, సాహిత్యకౌముది, సాహిత్యచంద్రోదయము, సాహిత్యరత్నాకరము, సాహిత్యమీమాంస, ప్రతాపరుద్రీయము, కువలయానందము మొదలగు గ్రంథములందు లక్ష్యలక్షణములతోఁ గూడ వివరింపఁబడియున్నవి: చూ, ఉపవిద్యలు, చూ, కావ్యస్వరూపము; 2. సత్త్వాది.- సత్త్వము, రజము, తమము (వీనికి శక్తులని యు నామాంతరముగలదు. ఈమూఁడుగుణములు సాధ్వసస్ఫురితము, సతతోద్ధితమను భేదముల నాలువిధములగును): చూ, త్రయము; 3. సంధ్యాది.—ఇవియాఱు.—సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధము (భేదము), ఆశ్రయము; 4. శక్త్యాది.—ఇవి యాఱు.—శక్తి, జ్ఞానము, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు.- మఱియొక విధము.- ఐశ్వర్యము, వీర్యము, యశము, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము; 5. శబ్దాది.—ఇవియైదు.—శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము (ఇవి యైదును భూతగణములు); 6. త్యాగశౌర్యాది; 7. ఐశ్వర్యాది; 8. శుక్లాది; పా. 9.ఏ, ఓ, అర్, అవ్; 10. పరీక్ష యందుత్తీర్ణుఁడైన వాని ఫలితము (మార్కులు.)

గుణరహితము. అం. ఆకాశము లయిదింటిలో నొకటి: చూ, ఆకాశములు.

గుణలయని. సం. వి. ఈ. స్త్రీ. —వై.—

గుణలయనిక. సం. వి. ఆ, స్త్రీ. గుడారము; చూ, సదనము. 1.

గుణలయిని. సం. వి. ఈ. స్త్రీ. —వై.—

గుణవంతుఁడు. సం.విణ. త్: చూ, సమర్థుఁడు.

గుణవతి. సం. వి. ఈ. స్త్రీ: చూ, గుణలయనిక.

గుణవర్ణనము. సం. వి. అ. న: చూ, స్తోత్రము.

గుణవినుతి. అం. దశావస్థలలో నొకటి: చూ, దశావస్థలు.

గుణవృక్షకము. సం. వి. అ. పుం. ఓడకంబము: చూ, స్తంభము. 1.

గుణసంధి. పా. అవర్ణమునకు ఇక్కులు పరమైన పుడు గుణంబగు: చూ, అపవాదము. 9.

గుణసాగరుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, బ్రహ్మ. 1; 2. బుద్ధవిశేషము: చూ, బుద్ధుఁడు. 1; విణ. 3. సకలగుణాధారుఁడు.

గుణాకరుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, బుద్ధుఁడు. 1; విణ. 2: చూ, సమర్థుఁడు.

గుణాన్వితము. పా: చూ, కావ్యస్వరూపము. (చూ, గుణములు.)

గుణాలయము. సం. వి. అ. పుం.=గుడారము: చూ, సదనము. 1.

గుణి. సం. వి. న్. పుం. 1. విల్లు: చూ, బాణము. 1; విణ. 2. గుణముగలవాఁడు: చూ, సమర్థుఁడు.

గుణించు. సం. స. క్రి. గుణకముచేయు.

గుణితము. సం. వి. అ. న. 1. హల్లులలో అచ్చులను జేర్చిచెప్పుట (గుణింతమని వాడుక); విణ. 2. గుణింపఁబడినది: చూ, హెచ్చవేఁత; 3. రెట్టింపుగాఁ జేయఁబడినది: చూ, హితము.

గుణుఁడు. సం. వి. అ. పుం. 1.=గూణుఁడు: చూ, వృకోదరుఁడు; విణ. 2: చూ, సూపకారుఁడు.

గుణేశ్వరము. సం. వి. అ. పుం. చిత్రకూటము: చూ, పర్వతము

గుణోజ్వల. సం. వి. ఆ. స్త్రీ. అడవిమొల్ల *: చూ, యూథిక. 1.

గుణ్యము. సం. విణ. గుణింపఁదగినది.

గుత్త. వై. వి.=గుప్తి. 1. ఫలప్రదమైన యొక సొత్తును ఆసొత్తుగలవానికి తత్ఫలార్థము తగిన ధనమిచ్చి తను యనుభవమున నుంచుకొనుట: చూ, స్వాధీనపుగుత్త; వా. వి. 2. బట్ట: చూ, వస్త్రము: 3. గుత్తిగ: చూ, ఇజారా; 4. సమస్తమును ఒకేసారి వెలకుకొనుట: జట్టి - రూ- జట్టీ.

గుత్తకాఁడు. ద్వ. విణ: చూ, పాలెగాఁడు.

గుత్తిగ. వై. వి.=గుప్తి. రూ-గుత్తవ: చూ, గుత్త. 3.

గుత్తగొను. ద్వ. స. క్రి. (గుత్త + కొను) గుత్తయెత్తు. కళా. 3, ఆ. 73.

గుత్తము. వై. వి. = గుప్త. 1. కచ్చితము: చూ, సున్నితము; 2 బిగువు: చూ, లవణి.

గుత్తవ. వై. వి.=గుప్తి; చూ, రూ-గుత్తగ.

గుత్తి. వై. వి. 1. = గుచ్ఛః. రూ-గుది-గొత్తు: చూ, పూగుత్తి. 2: చూ, సీలమండ.

గుత్తికగువ్వ. ద్వ. వి. రూ - గువ్వగుత్తిక- గువ్వగుత్తుక*: చూ, రాజార్హము.

గుత్తికవ్వము. ద్వ.వి. కటరి: చూ, మంథానము.

గుత్తినెమిలడుగుమాని. ద్వ. వి: చూ, పూతికరజము*.

గుత్తిపండ్లు. ద్వ. వి. బ. గుత్తులుగుత్తులుగా పండెడు పండ్లు.

గుత్తిమల్లెలు. వై. వి. బ. ఒకరకమువడ్లు: చూ, ధాన్యము.

గుత్తిలుగుత్తులు. వై. వి. బ. —వై.—

గుత్తిపడు. వై.అ.క్రి. (గుత్తి + పడు)ముడుఁగు: చూ, సుక్కు. 3.

గుత్తులు. వై. వి. బ: చూ, గుత్తిమల్లెలు.

గుత్థకము. సం. వి. అ. న. గండివనము *: చూ, రాజార్హము.

గుత్సకపుష్పము. సం. వి. అ. పుం, న: చూ, గుచ్ఛపత్రము *.

గుత్సకము. సం. వి. అ. పుం. 1. = గుత్తి: చూ, పూగుత్తి; 2. గ్రంథపరిచ్ఛేదము: చూ, పుస్తకము.

గుత్సము. సం. వి. అ. పుం. 1. వరి లోనగు వాని గంటు: చూ, పొట్టకట్టు (చూ, తృణము. 1.); 2. = గుత్తి: చూ, పూగుత్తి; 3. ముప్పదిరెండుమణులు గుచ్చిన హారము: చూ, భూషణము. 2; 4. గండివనము *: చూ, రాజార్హము; 5 కంబము: చూ, స్తంభము. 1.

గుత్సార్ధము. సం వి. అ. పుం: చూ, గుచ్ఛార్ధము.

గుత్సికము. సం. వి. అ. న: చూ, సురటి.

గుదకీలకము. సం. వి. అ పుం: చూ, మూలశంక.

గుదకీలము. సం. వి. అ. పుం. —పై.—

గుదగుదలాడు. దే. అ. క్రి. (గుదగుదలు + ఆడు) దగ్గుత్తికతో నేడ్చు. చూ, రోదించు.

గుదనాడి. అం. నాడులు పదింటిలో నొకటి: చూ, నాడులు.

గుదము. సం. వి. అ. న=గుద్ద: చూ, ముడ్డి.

గుదస్థానము. అం. రంధ్రములు తొమ్మిదింటిలో నొకటి: చూ, రంధ్రములు.

గుదాంకురము. సం. వి. అ. పుం: చూ, గుదకీలకము.

గుదావర్తి. అం. అశ్వశాస్త్రమునందలి అశుభావర్తములలో నొకటి: చూ, అశుభావర్తములు.

గుది. వై. వి = గుచ్ఛ. రూ-గుత్తి: చూ, పూగుత్తి (దేశ్యమని శబ్దరత్నాకరము); దే. వి. 2: చూ, సీలమండ. అం, భా. ద్వి. 185; 3. ఆకులులోనగువాని గ్రుచ్చిన సరము; వా. వి. 4. పశుబంధరజ్జువు; 5. పదములకూర్పు, గుదికూర్పు: చూ, మాటలల్లుట.

గుదికాలు. దే. వి: చూ, పార్ష్ణి.

గుదికూర్పు. దే. వి: చూ, మాటలల్లుట.

గుదికట్టు. దే. వి. (గుది + కట్టు) దుష్టమగుగోవు మొదలుగాగలవానికి మెడనుగట్టెడుకొయ్య: చూ, బండ. 3.

గుదిగుంజెలు. ద్వ. వి. బ. (పసులదొడ్డిలోనగు వానిద్వారమందు) నిలువుగాఁ బాఁతిన కంబములు: చూ, స్తంభము. 1.

గుదిగుంపులుచేయుట. జా. అవిచ్ఛిన్నము చేయుట. "అదిగనుక దివిజవేశ్యల సదనంబున నున్నమానిసంతతితలఁపుల్ గుదిగుంపులుఁజేసి మథింపదె." నిరంకుశోపాఖ్యానము.

గుదిగొను. దే. అ. క్రి. (గుది + కొను) అతిశయించు: చూ, ముమ్మరించు; 2. దట్టమగు: చూ, వ్యాపించు; 3. మూటకట్టుగాఁ గూలఁబడు. హరిశ్చ. 4, ఆ. 214: చూ, చాఁపచుట్టువడు.

గుదితాడు. దే. వి. 1. దూడకాలికిఁ గట్టుతాడు: చూ, సూత్రము. 1; వా. వి. 2. పాలుపిదుకునపుడు ఆవు వెనుకటికాళ్లకు గట్టు తాడు: చూ, బంధము. 3. (చూ, సూత్రము. 1.)

గుదిత్రోయు. దే. స. క్రి. కాళ్లుకట్టి త్రోయు. హరిశ్చ 4, ఆ. 34: చూ, తన్ను. 2.

గుదిబండ. దే. వి: చూ, గుదిగట్టు.

గుదియ. వై. వి.=గదా. (రూ-గుదె-గుదికట్టు-గుదిగట్టు.) 1: చూ, గుదిగట్టు; 2. ఇనుపదుడ్డు. అం, భా. ద్వి. 216: చూ, ముద్గరము; 3. నాలుగుమూరలు నిడివిగల దండము: చూ, బాణము. 1.

గుదియకట్టులు. ద్వ.వి.బ. గుదిగుంజెలకడ్డముగాఁ జొప్పించెడు కట్టులు: చూ, స్తంభము. 1.

గుదియతాలుపు. ద్వ.వి: చూ, యముఁడు. అచ్ఛ. సుం, కాం. 23.

గుదివడు. ద్వ. అ. క్రి. (గుది + పడు): చూ, బద్ధమగు.

గుదె. వై. వి.=గదా: చూ, రూ-గుదియ.

గుద్ద. వై. వి =గుద: చూ, ముడ్డి.

గుద్దలి. వై. వి=కుద్దాలః: చూ, ముద్గరము.

గుద్దలించు. వై. స. క్రి. 1. గుద్దలితోఁ బెల్లగించు: చూ, భేదిల్లు. 1; 2. అన్వేషించు: చూ, వెదకు.

గుద్దు. వా. వి. 1. (రూ-గుద్దు-గుమ్ము) పిడికిటిపోటు: చూ, యుద్ధము; స. క్రి. 2. పిడికిటితోఁపొడుచు: చూ, చేదము.

గుద్దులాట. వా. వి. రూ. గుద్దులాట. ముష్టాముష్టి: చూ, యుద్ధము.

గుద్దులాడు. వా. అ. క్రి: చూ, రూ-గుద్దులాడు.

గునక. దే. వి: చూ, రూ-గునుక.

గునకలు. దే. వి. బ. తృణధాన్యము: చూ, ధాన్యము.

గునగున. దే. వి. వేగముగ నడచుటయందగు ననుకరణము: చూ, హూహూ.

గునపనకోడి. ద్వ. వి: చూ, పుంజు.

గునపము. వై. వి.=ఖనిత్ర: చూ, రూ-గునుపము. కళా. 6, ఆ.8.(దేశ్యమని శబ్దరత్నాకరము.)

గునామొలనూలు. దే. వి. బిడ్డలుకట్టుకొనెడు కటిసూత్రవిశేషము (భానుపుద్విజీయము): చూ, భూషణము. 2.

గునియు. దే. అ. క్రి. 1. నర్తించు: చూ, మలపుగొను: 2. కులుకు: చూ, పూయు.

గునిసాడు. దే. అ. క్రి.—పై— (మొదటి రూపము గునిసియాడు.)

గునిసె. వా. వి. పొట్టి. (రూ-గొనిసె-గొనబ-గొనప-గొనను-గున్న-గుజ్జు): చూ, వామనుఁడు.

గునుక. దే. వి. అల్పధావనము: చూ, పరుగు.2. (రూ- గునుకు- గునుకుడు- గునుగుడు- గునుగుపరుగు.)

గునుకు. దే. వి. 1.—పై.—ఆం. భా. ద్వి.224; 2. తృణవిశేషము*: చూ, తృణము. 1; బ. 3. తృణధాన్యము: చూ, ధాన్యము; అ. క్రి. 4. కొద్దిపరువుగా పరుగెత్తు: చూ, పరుగెత్తు.

గునుకుడు. దే.వి: చూ, గునుక. ఆం, భా. ద్వి. 224.

గునుకులు. దే. వి. బ. తృణధాన్యము: చూ, ధాన్యము.

గునుగుడు. దే. వి: చూ, రూ—గునుకుడు.

గునుగుపరుగు. దే. వి.—పై.—

గునుపము. వై. వి.=ఖనిత్ర: చూ, రూ-గునపము.

గునుపు. దే వి. రూ—గొనపు. విలాసవిశేషము: చూ, విలాసము.

గున్న. వై. వి. 1. పిల్ల (ఏనుఁగు గున్న-పందిగున్న-మామిడిగున్న మొ.): చూ, శిశువు; 2: చూ, వామనుఁడు; 3. ఏనుఁగుగున్న: చూ, హస్తి; 4. క్షుపము: చూ, హ్రస్వశాఖాశిఫము; 5. కురువమనుచెట్టు*: చూ, వృక్షము.

గున్నంగి దే. వి. ఒకానొక పక్షి: చూ, పక్షి.

గుపారము. అం. రూ-గుబారము. మల్లబంధవిశేషము: చూ, మల్లశాస్త్రము.

గుపారు. దే. వి. ఆఘోషణము. ఆం, భా. ప్రి. 115: చూ, స్వరము. 2.

గుప్త. సం. వి. ఆ. స్త్రీ. 1. రాణివాసపు స్త్రీ: చూ, శుద్ధాంతము. (చూ, స్త్రీ); 2. దూలగొండి*: చూ, కూకశింబి.

గుప్తకేళి. సం. వి. ఈ. స్త్రీ. దాఁగిలిమూఁతలు: చూ, బాలక్రీడ.

గుప్తచరుఁడు. సం. వి. అ. పుం: చూ, బలరాముఁడు.

గుప్తము సం. విణ. 1. కావఁబడినది: చూ, రక్షితము; 2. దాఁచఁబడినది: చూ, రహస్యము.3.

గుప్తరాగము. సం. వి. అ. పుం: చూ, వెంగలి*.

గుప్తస్నేహము. సం. వి. అ. పుం: చూ, మహాయమళపత్రిక*.

గుప్తాసనము. సం. వి. అ. న: చూ, ఆసనములు.

గుప్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. కాపాడుట: చూ, రక్షణము; 2: చూ, దాఁచుట; 3: చూ, బంధనాలయము; 4. పాఁతఱ: చూ, లిబ్బి. 2; 5. వడ్ల పాఁతఱ: చూ, పంటసాల; 6. బొక్క: చూ, గంధ్రము. 1; 7. లోఁతైన గొయ్యి: చూ, రంధ్రము. 1; పుం. 8. దాసుఁడు: చూ, సేవకుఁడు; 9: చూ, యముఁడు.

గుప్పసగూర. దే. వి. చిందఱవందఱ: చూ, సంతాపము.

గుప్పళించు. దే. స. క్రి. 1. వస్త్రము మొదలగువాని ఉసుము (ఉప్పళించు అనియు వాడుక); 2: చూ, పుకిలించు; 3. ఉంచు: చూ, పెట్టు. 5.

గుప్పించు. దే.స.క్రి. 1. (బాణాదులను) ప్రయోగించు, గుప్పు: చూ, ప్రయోగించు. 2; 2: చూ, వర్షించు.

గుప్పిలి. దే. వి: చూ, పిడికిలి (రూ-గబ్బిలి.)

గుప్పు. దే. వి. 1. ఎగయుటయందును, మ్రోయుటయందును, వాసనకొట్టుటయందును, వైచుటయందును నగు ననుకరణము. శశాం. 1, ఆ. 106; స్వా. 4. ఆ. 108: చూ, హూహూ; స. క్రి. 2 ఉంచు: చూ, పెట్టు. 5; 3. చల్లు: చూ, ప్రోక్షించు; 4. (దూడ పాలుత్రాగునపుడు తలతో) పొదుగును పొడుచు; 5. (బాణాదులను) ప్రయోగించు: చూ, ప్రయోగించు. 2; 6. విసరివైచు.

గుప్పున. దే. క్రి. విశే. శీఘ్రముగా: చూ, వేగము. 3.

గుప్పుమను. వా. అ. క్రి. ఒక్కమాఱుగా వెల్లడియగు.

గుబ. వై. వి.=ఘూకము. రూ-గూబ: చూ, సకినంపుఁబులుఁగు.

గుబక. వై. వి. తలుపుగండెపట్టెమీఁది గుబ్బ.

గుబగుబ. దే. వి. కోకిలధ్వని యందగు ననుకరణము: చూ, హూహూ.

గుబాగము. అం: చూ, రూ-గుపారము.

గుబాలు. దే. వి. రూ-గుబేలు-గుబీలు. పడుట యందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

గుబాళించు. దే. అ. క్రి. వాసనకొట్టు: చూ, వలచు. 1.

గుబిలి. దే. వి. 1. (రూ-గుమిలి-గుబ్బలికాఁడు-గుబ్బిలికాఁడు- గులిబి-.గులిమి- గుల్మి) కనకాక్షి. ఆం, భా. ద్వి. సిం. 91: చూ, సకినపుఁబులుఁగు; 2. గులిమి: చూ, పింజూషము.

గుబీలు. వా. వి: చూ, రూ-గుబాలు. "గుండె గుబీలుమనుచున్నది."

గుబుకు. దే. స. క్రి. రూ-గుముకు. పిడికిటితో పొడుచు: చూ, పోట్లాడు.

గుబురు. దే. వి. (రూ- గుమురు- గుమి- గమి- గుంపు) 1. దట్టము: చూ, సాంద్రము; 2. గుంపు: చూ, సమూహము; 3. వృక్షవిటపము.

గుబులు. దే వి. 1: చూ, బుగులు; 2: చూ, వెఱపు.

గుబులుకొను. దే. అ. క్రి: చూ, గుబాళించు. శశాం. 3, ఆ. 53.

గుబుసు. దే. వి. కపటము: చూ, వ్యాజము. 1.

గుబేలు. వా. వి: చూ, రూ-గుబాలు.

గుబ్బ. వై. వి. = కుంభ. 1. కుచము: చూ, స్తనము (బ. గుబ్బలు); 2. కంతి, ఆం, భా. ద్వి. 74: చూ, బుడిపి; 3. గొడుగుమీఁది గుబ్బ: కుప్పియ-కుప్పె; 4. తలుపుగండెపట్టెమీఁదిగుబ్బ: చూ, బొగడ; 5. బాణము

నలుగుకింగిరిగుబ్బ. స్వా. 4, ఆ. 115; విశ. 6. గుండ్రమైనది: చూ, బొండు. 2

గుబ్బకాయ. దే. వి. వీణాగ్రశలాటువు: చూ, వీణె.

గుబ్బటిలు. వై. అ. క్రి. రూ-గుబ్బటిల్లు: చూ, పరిభ్రమించు.

గుబ్బటిల్లు. వై. అ. క్రి. —వై—.

గుబ్బతిలు. వై. అ. క్రి. రూ- గుబ్బతిల్లు. 1. ఉప్పొంగు. శై. 8, ఆ. 92: చూ, విజృంభించు; 2. అతిశయించు. వసు. 1, ఆ. 185: చూ, ముమ్మరించు.

గుబ్బతిల్లు. వై. అ. క్రి. —వై—

గుబ్బన. దే. ద్రి. క్రి. విశ. శీఘ్రముగా: చూ, వేగము. 8.

గుబ్బపేట. దే. వి. 1. కొండకొన, ఆం, భా. ద్వి. 80: చూ, శిఖరము; 2. కొండచేటియ: చూ, చేటియ.

గుబ్బమాను. దే. వి. కుండలుచేయు సాధనము.

గుబ్బలాడి. ద్వ.వి. (గుబ్బలు + ఆడి)యువతి: చూ, స్త్రీ.

గుబ్బలి. దే. వి. కొండ: చూ, పర్వతము.

గుబ్బలికాడు. దే. వి: చూ, గుబ.

గుబ్బలిదొర. దే వి. హిమాద్రి: చూ, పర్వతము.

గుబ్బలిపట్టిగుజ్జము. దే. వి: చూ, సింహము.

గుబ్బలివిలుకాడు. దే. వి: చూ, శివుడు.

గుబ్బసరము. వై. వి.=గుంభసరః. పలురకముల మణులు గ్రుచ్చినసరము. కళా. 3, ఆ.204: చూ, భూషణము. 2.

గుబ్బిక. దే. వి: చూ, వాగుర.

గుబ్బిరి. దే. వి. ఒకానొక చెట్టు:చూ, వృక్షము.

గుబ్బిలికాడు. దే. వి. గూబ: చూ, సకినంపుఁ బులుఁగు.

గుబ్బు. దే. వి. గుండె అదరుట యందగునను కరణము. కళా.4, ఆ. 20: చూ, ఫూహూ.

గుబ్బుమను. దే. అ. క్రి. (గుబ్బు + అను) గుండె గుబ్బుమనియదరు. కళా. 4, ఆ. 20: చూ, భయపడు.

గుబ్బురను. దే. అ. క్రి. (గుబ్బు + అను) -వై.- రా. వి. 2, ఆ. 68 (ఆమ్రేడితమందు గుబ్బు గుబ్బురను.)

గుబ్బెత. వై. వి. (గుబ్బ + ఎత): చూ, గుబ్బలాడి.

గుమగుమ దే. వి. 1. గుమగుమయను వాసన: చూ, వాసన. 1; 2. వాసనకొట్టుటయందగు ననుకరణము: చూ, హూహూ.

గుమాను. వా. వి. 1. లోకమున పుట్టినవార్త; చూ, సమాచారము. 2; 2. అనుమానము:చూ, సందేహము.

గుమాయింపు. వా. వి. ఎండవేడిమిచే చెమట పోసి తపించుట.

గుమాస్తా. వా. వి. క్రిందియుద్యోగి. (క్లర్కు)

గుమి. దే. వి. 1. గుంపు: చూ, సమూహము; 2. రూ-కుమి: చూ, పంటసాల.

గుమికాడు. దే. వి. కాకి: చూ, వాయసము.

గుమితి. దే. వి. రూ-గుమ్మితి కళాం.2, ఆ.17: చూ, బాణము. 1.

గుమిలి. దే. వి: చూ, రూ-గుబిలి.

గుముకు. దే. స. క్రి: చూ, రూ-గుబుకు.

గుముడు. వై. వి.=కుముదా. రూ-గుమ్ముడు* (తేఁతఆకులకషాయము సెగలలోపనిచేయును): చూ, మహాఫలము.

గుమురు. దే. వి: చూ, రూ-గుబురు.

గుమ్మ. దే. వి. 1. పాలుపిండునప్పుడు వచ్చెడు ధార: చూ, పీరు; 2. ఆఁడుది: చూ, స్త్రీ; 8. గాజువంటి బొట్టు.

గుమ్మఁడు. దే. విశ. అలంకరించుకొనువాఁడు: చూ, సౌందర్యవంతుఁడు.

గుమ్మటము. దే. వి. 1. దీపముంచెడు కాగితపు

గూఁడు: వా. వి. 2. ఉత్సవాదులయందు విగ్రహములనుంచి ఊరేగించు విమానాదికము.

గుమ్మడి. వై. వి.=కూశ్మాండము *: చూ, మహాఫలము.

గుమ్మతీలు. దే. వి. బ. చెవితమ్మెలనుంచుకొను నగ: చూ, భూషణము. 2.

గుమ్మపాలు. వా. వి. పొదుఁగుదగ్గఱి పాలు, అప్పుడెపిదికినపాలు. (రంగా. 1, ఆ. 52.): చూ, పాలు. 1.

గుమ్మము. దే. వి. రూ-గుంబము: చూ, వాకిలి.

గుమ్మాళి. దే. వి: చూ, పాదుక.

గుమ్మి. దే. వి. గాదె: చూ, పంటసాల.

గుమ్మితి. దే. వి: చూ, రూ-గుమితి. శశాం. 2 ఆ. 70.

గుమ్ము. దే. వి. 1. పిడికిడిపోటు: చూ, యుద్ధము; 2. వాసనకొట్టుటయందగు ధ్వన్యనుకరణము (అభిమన్యుద్విపద): చూ, హూహూ; స. క్రి. 3. పిడికిటితోపొడుచు: చూ, పోట్లాడు.

గుమ్ముడు. వై. వి.=సముద్రా: చూ, రూ-గుముడు (ఇది ద్వివిధము - పెదగుమ్ముడు, చినగుమ్ముడు అని. ఇదే పెదగుమ్ముడు.)

గుమ్మెట. వై. వి.=గుంభిత. రూ-గుమ్మెత. 1. తుడుము: చూ, వీణె (దేశ్యమని శబ్దరత్నాకరము); అం. 2. వాద్యము లాటింటిలో నొకటి: చూ, వాద్యములు. (రూ-గుమ్మెడ అని కొందఱు.)

గుమ్మెత. వై. వి. 1-2= —పై.— (దేశ్యమని శబ్దరత్నాకరము); 3. అల్పపటుగృహము: చూ, సదనము. 1.

గుమ్మెతకాఁడు. దే. వి. గుమ్మెతవాయించువాఁడు.

గురగాయిబ్రాహ్మణులు. పా. వేపాళశెళపు బ్రాహ్మణులలో నొకతెగవారు: చూ, బ్రాహ్మణులు.

గురగుర. వై. వి. 1=ఘుర్ఘుర. పందికూఁత: చూ, స్వరము. 2; 2. రూ-గుఱగుఱ. దురద: చూ, విదర్చిక.

గురణము. సం.వి.అ.న. రూ-గూరణము. ఉద్యోగము: చూ, యత్నము.

గురపిడి. దే. వి. అడవియావు: చూ, ధేనువు.

గురపోతు. దే. వి. రూ గురుపోతు: చూ, శరభము. 1.

గురికొచ్చె. దే. వి: చూ, బుద్ధి.

గురిగ. దే. వి. రూ-గురిగ-గురియ. అఁడుపడుచులు ఆడుకొను చిన్నపిడత: చూ, భాండము. 3.

గురిగి. దే. వి. —పై.—

గురిగింజె. వై. వి. = గుంజా. రూ-గురుగింజె. (గురిజె + గింజె) 1. గుంజాలత*: చూ, శ్వేతపాకి (దేశ్యమని శబ్దరత్నాకరము): 2. గురిజెపూస: చూ, శిలాపాకి; 3 ఒకానొక బాలక్రీడ: చూ, బాలక్రీడ.

గురిజె. వై. వి=గృంజన. గుంజ (రూ-గుంజె-గురిగింజె-గురివెంద-గురువెంద*. (ఇది త్రివిధము.- ఎఱ్ఱగురిజె, తెల్లగురిజె, నల్లగురిజెఅని. ఇదే ఎఱ్ఱగురిజె): చూ, శ్వేతపాకి.

గురిమానిసి. ద్వ. వి: చూ, కైజీతకాఁడు.

గురియ. దే. వి: చూ, గురిగి.

గురివెంద ద్వ. వి. (గురిజె + వెంద): చూ, గురిజె*.

గురు. దే. వి. రూ-గురుపోతు-గుఱుపోతు-గోర: చూ, శరభము. 1.

గురుంటకము. సం. వి. అ. న. తిలమయూరము: చూ, మయూరము.

గురుఁడు. సం. వి. ఉ. పుం: చూ, గురువు. 2. (చూ, గ్రహములు.)

**గురుక.** దే. వి. నిద్దుర. ఆం, భా. ప్ర. 141: చూ, స్వప్నము.

**గురుసు.** దే. వి. 1: చూ, పశురోగము; వా. వి. 2. ఊపిరిపట్టు: చూ, యశాకము.

**గురుగింజ.** ద్వ. వి: చూ, రూ-గురిగింజ. 1-2.

**గురుగు.** వై. వి.=కుక్కట. భూరుండి*: చూ, హస్తిని. (దేశ్యమని శబ్దరత్నాకరము)

**గురుగుండితము.** సం. విణ. చెక్కఁబడినది: చూ, సంయోజితము.

**గురుగుపల్లిక.** ద్వ. వి: చూ, గురుగు.*

**గురుఘ్నము.** సం. వి. అ. పుం. తెల్లావాలు*: చూ, సర్షపము.

**గురుజ.** దే. వి. ఉత్తుండి*: చూ, సప్తల.

**గురుజా.** దే. వి. వజ్రము. ఆం, భా. ద్వి. 278: చూ, రత్నము. 1.

**గురుజు.** వా. వి. చూ, రూ-గురుసు. 5.

**గురుతు.** దే. వి: చూ, రూ-గుఱుతు.

**గురుత్వాకర్షణము.** పా. లాగిపట్టెడి ఆకర్షణశక్తి.

**గురుదైవతము.** సం. వి. అ. పుం. పుష్యమి: చూ, నక్షత్రము. 1.

**గురుపంచమూలము.** అం. ఇవి అయిదు.-మారేడు వేరు, దుండిలపువేరు, గుమ్మడువేరు, కలిగొట్టు వేరు, కూరనెల్లివేరు.

**గురుపత్నీగమనము.** అం. మహాపాతకములయిదింటిలో నొకటి: చూ, మహాపాతకములు.

**గురుపత్ర.** సం. వి. ఆ. స్త్రీ. చింత*: చూ, తింత్రిణి.

**గురుపత్రము.** సం. వి. అ. న. వంగము: చూ, లోహము. 1.

**గురుపోతు.** దే. వి: చూ, రూ-గురపోతు. ఆం, పదా. 5-20.

**గురుప్రణామప్రమేయము.** అం. ధనుర్వేదమునందలి ప్రమేయములు నలుబదాఱింటిలో నొకటి: చూ, ప్రమేయములు.

**గురుప్రియము.** సం వి. అ. పుం. పుష్యరాగము: చూ, రత్నము. 1.

**గురుభార్య.** అం. మాతలైదుగురిలో నొకతె: చూ, మాతలు.

**గురుమర్దలము.** సం. వి. అ. పుం. డిండిమ వాద్యము: చూ, స్వరము. 2.

**గురుమేరునష్టము.** అం. ప్రస్తారప్రత్యయప్రాణములు పందొమ్మిదింటిలో నొకటి: చూ, ప్రస్తారప్రత్యయప్రాణములు.

**గురుమేరూద్దిష్టము.** అం. —పై—

**గురుమేరువు.** అం. 1. ప్రస్తారములు పదింటిలో నొకటి: చూ, ప్రస్తారములు; 2. ప్రస్తారప్రత్యయప్రాణములు పందొమ్మిదింటిలో నొకటి: చూ, ప్రస్తారప్రత్యయప్రాణములు.

**గురురత్నము.** సం. వి. అ. న: చూ, గురుప్రియము.

**గురులఘుక్రియ.** పా. ఇదే మేరుచక్రము

**గురువందనము.** అం. సుజ్ఞానదాయకములు పదింటిలో నొకటి: చూ, సుజ్ఞానదాయకములు.

**గురువారము.** సం. వి. అ. పుం. బృహస్పతి వారము: చూ, వారము.

**గురువు.** సం. వి. ఉ. పుం. 1. ఉపాధ్యాయుఁడు: చూ, పంతులు. 1; 2. బృహస్పతి యను గ్రహము: చూ, రాహువు. 2; 3. కులముపెద్ద; 4. తండ్రి: చూ, పితరుఁడు. 1; 5. తండ్రితోడఁబుట్టినవాఁడు: చూ, పితరుఁడు. 1; 6. తాత, తండ్రితండ్రి: చూ, పితామహుఁడు. 1; 7. అన్న: చూ, సహోదరుఁడు. (చూ, జ్యేష్ఠుఁడు. 1); 8. ఆలుమగల తండ్రి, మామ: చూ, శ్వశురుఁడు; 9. మేనమామ: చూ, మాతులుఁడు; 10. పురోహితుఁడు: చూ, యాజ్ఞికుఁడు; 11. ఏలిక: చూ, రాజు. 1; 12. కాపాడువాఁడు: చూ, రక్షకుఁడు; 13. నిషేక వివా

పోదులు చేయించు ఉపాధ్యాయుఁడు (లేక) తండ్రి, యథాశాస్త్రముగ పంచదశకర్మములు చేసినవాఁడు (అని కొందఱు): చూ, పితరుఁడు. 1; 14 = గుర్వ్వ-గుఱువ. ప్రసిద్ధిఁ జెందిన వాఁడు: చూ, యశస్వి; 15. బరువు: చూ, భారము. 1; 16. వేదముచదివించు వాఁడు: చూ, గణి 2; 17 కీర్తిభాజుఁడు: చూ, దోర్గుణుఁడు; విశే. 18. గొప్పది: చూ, విపులము; 19. భరింపఁగూడనిది; 20. ఉత్తమమైనది; 21. అలఘువు; 22. ముసలితనము లేనిది (నశింపనిది); అం. 23. తాళాంగము లేడింటిలో నొకటి: (చూ, అంగము. 9) చూ, తాళాంగములు; 24. గాంధర్వవేదము నందలి తాళాధ్యాయములోని కాలప్రాణములు పండ్రెండింటిలో నొకటి: చూ, కాలప్రాణము; దే. వి. (1) వేగపుపురుగు: చూ, పురుగు.

**గురువునకు పుచ్చేపాదు.** జా. గురువునకు అపకారము.

**గురువుదేలు.** దే. అ. క్రి. (గురువు + తేలు) జిల్లునచిప్పిలు.

**గురువునకు పంగనామము.** జా. గురుతిరస్కారము.

**గురువులువాఱు.** దే. అ. క్రి. 1. అతిశయించు: చూ, ముమ్మరించు; 2. వేగపుపురువుగాపాఱు.

**గురుసంకీర్తనము.** అం. ధనుర్విద్యావిలాసమందలి ప్రమేయములు నలుబదాఱింటిలో నొకటి: చూ, ప్రమేయములు.

**గురుసు.** దే. వి 1. జీవస్థానము: చూ, మర్మము. 1: 2. మేర: చూ, సీమ. 1; 3. బీరము: చూ, శౌర్యము; 4. పశువులతోఁక చివర వెండ్రుకలు మొల్చుటకాధారముగా నుండు తావు; వా.వి. 5. తిరుగలిపై గుంటకొయ్య: చూ, గురుజు.

**గుగుసులు.** దే. వి. బ. కేశమూలములు.

**గురుసేవ.** అం. శకునరహితములు పదింటిలో నొకటి: చూ, శకునరహితములు.

**గుర్గురించుమెకము.** ద్వ. వి. పంది వేం. ఆం.93; చూ. సూకరము.

**గుర్గురింత.** దే. వి. —వై.— సాంబ. తిక్క. 5.

**గుర్జరి.** సం. వి. ఈ. స్త్రీ. ఎఱ్ఱానుల తోఁటకూరః: చూ, మారిషము.

**గుర్తించు.** దే.స.క్రి. గుఱుతుపట్టు: చూ, లెక్కసేయు.

**గుర్తు.** దే. వి: చూ, రూ-గుఱుతు.

**గుర్వి.** సం. వి. ఈ. స్త్రీ. 1. గర్భిణి: చూ, భ్రూణ; 2. గురుపత్ని: చూ, భార్య.

**గుర్విణి.** సం.వి.ఈ. స్త్రీ: గర్భిణి: చూ, భ్రూణి.

**గుర్వ్వ** వై.విశే=గురుః. అధికము: చూ, హెచ్చు.1.

**గుర్వెట్టు.** దే. అ. క్రి: చూ, రూ-గుఱువెట్టు.

**గుఱక.** వై. వి=గుడాక. 1. నిద్రయందలి ధ్వని. రూ. గుఱ్ఱు: చూ, స్వాగము. 2. (దేశ్యమని శబ్దరత్నాకరము); 2 నిద్దుర: చూ, స్వప్నము.2.

**గుఱుగుఱ.** దే. వి. 1: చూ, రూ-గురగుర. 2: 2. దురదయందగు ననుకరణము: చూ, హూహూ

**గుఱము.** వై. వి=కుదర. రూ-గుఱ్ఱము: చూ, హయము.

**గుఱాలగోచే.** దే. వి: చూ, సాహిణి.

**గుఱి.** దే. వి. 1. గుఱుతు: చూ, లక్షణము. 1; 2. లెప్పము: చూ, లక్ష్యము. 1; 3. దృష్టాంతము: చూ, నిదర్శనము. 1; 4. నిర్ణయము: చూ, నిజేము. 2; 5. గడువు. పాండు. 5. ఆ. 51: చూ, మితి; 6. అభిప్రాయము: చూ, స్మృతి. 1; వా.అప. 7. స్త్రీపురుషులగుఱుతు లనుసూచించుగుఱుతు (అఁడుగుఱి-మగగుఱి)

**గుఱించు.** దే. స. క్రి. 1: చూ, గుర్తించు; 2: చూ, స్పృజించు; 3: చూ, విషయీకరించు.

గుతికట్టు. దే. వి. 1. అంచు: చూ, మైజాఱు; 2. గడువు: చూ, మితి.

గుతికాఁడు. దే. విశే. లక్ష్యము తప్పక యేయు వాఁడు: చూ, సూటికాఁడు. 2.

గుతికొంప. దే. వి. 1. జీవస్థానము: చూ, మర్మము. 1; 2. స్థానము: చూ, వెలితి. 2.

గుతికొను. దే. స. క్రి: చూ, లెక్కసేయు.

గుతిచి. దే. అప. (రూ-కూరిచి - కూర్చి - గుతించి): చూ, రూ-కూరిచి.

గుఱక. వై. వి.=గుడాక: చూ, రూ-గుఱ్ఱు. 2-3-4-5.

గుఱుక. వై. వి.= —వై.—

గుఱుకొను. ద్వ. అ క్రి: చూ, యత్నించు.

గుఱుగుఱు. దే. వి. ఒఱులుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హుూహుూ.

గుఱుతు. దే. వి. 1. రూ-గురుతు- గుర్తు- గుతి- గుఱ్తు: చూ, లక్షణము. 1; 2. మేర. లక్ష్మ. 1. అ. 142: చూ, సీమ. 1.

గుఱుతుపట్టు. దే. స. క్రి: చూ, లెక్కసేయు.

గుఱుతుపాడుచు. దే. అ. క్రి: చూ, గుఱువెట్టు.

గుఱుతులు. పా. (చేదువుటకు గుఱుతులు) సులభముగ నన్వయించుకొనుకొఱకు గ్రంథమును వాక్యములుఁగాను, వాక్యాంశములుఁగాను విభజించుటకయి వివిధవిరతులను దెలుపుసంజ్ఞలు.

, వాక్యాంశ బిందువు. (కామ) అన్వయమునందు సమీపసంబంధమును గలిగియుఁ నించుక విరతి నపేక్షించు వాక్యాంశముల తుద, నీగుఱుతు వాడఁబడును.— "సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, ఆకాశము నలంకరించెను. ఇదియేకమాత్రకాలపువిరతినిదెలుపును.

; అర్ధబిందువు. (సెమికోలన్) మహావాక్యములోని ముఖ్యవాక్యములయంతమందీ గుఱుతువచ్చును.— నీటియందు బెండ్లు తేలును; గానిగుండ్లు తేలవు ఇది ద్విమాత్రకాలపువిరతిని దెలుపును.

: న్యూనబిందువు. (కోలన్) దూరసంబంధముగల రెండు ప్రత్యేకవాక్యములనడుమ నీ గుఱుతు వచ్చును.— లోకములో నాకంటెఁ బ్రాజ్ఞుఁడు లేఁడనుకొనకు: ఒకరినిమించిన వారొకరుండనేయుందురు. ఇది మూఁడుమాత్రల కాలపు విరతిని దెలుపును.

. బిందువు. (ఫుల్ స్టాప్) భిన్నవాక్యముల యంతమందీ గుఱుతువచ్చును —పాపమునకు భయపడుము. మనుష్యుల కోపమునకు భయపడకుము. ఇది నాలుగుమాత్రలకాలపు విరతిని దెలుపును.

ఈవిరతులను తెలుపు గుఱుతులుగాక అర్థానురాగములైన ధ్వన్యాదులను సూచించు గుఱుతులును, మఱికొన్ని పెఱగుఱుతులును గలవు.

? ప్రశ్నార్థకచిహ్నము. ప్రశ్నార్థకవాక్యముల తుద నీగుఱుతువచ్చును— ఎవరక్కడ? నీవు సంస్కృతముం జదివితివా?

! రాగచిహ్నము. ఆశ్చర్యము, సంతాపము మొదలగువానినిఁ దెలుపు పదములయు, వాక్యములయు తుద నీ గుఱుతువచ్చును — ఆ! ఇవి యేటిమాటలు! అయ్యో! ఎంత మంచివాఁడుపోయెను!

" " అనువాద చిహ్నము. (కొటేషన్) గ్రంథాంతరమునుండి గ్రహింపఁబడిన వాక్యాదులకిరుప్రక్కల నీగుఱుతులుండును. "దుర్బలస్య బలంరాజా" అనవినమే.

( ) వృత్తాకారము. [ ] వలయితము. అముఖ్యములగునట్టి కాని, పర్యాయములగునట్టి కాని పదములయొక్కయు, వాక్యములయొక్కయు రెండుప్రక్కల నీగుఱుతులు వేయఁబడును.— దాశరథికి (రామునకు) నమస్కారము. నిష్కారణముగ నీఁచుడు [పాపమునకు వెఱవఁడు కాఁబట్టి] సత్పురుషుల కిగ్గు చేయును.

ఎ. హంసపాదము. ఈగుఱుతు లుప్తవర్ణాదులఁమీఁద వ్రాయఁబడియున్నవని తెలుపును.

* తారకము } ఈ గుఱుతులు రెండును
† శూలము } గ్రంథమునందలి విషయములను గూర్చి యడుగున వ్రాయఁబడిన కారికలు మొదలగువానిని జూచుమని చదువు వానికిం దెలుపుట కుపయోగింపఁబడును.

గుఱుములు. దే. వి. బ. గిఁజెలు: చూ, విత్తనము.

గుఱ్ఱావెట్టు. దే. అ. క్రి. (గుఱ్ఱు + పెట్టు) గుఱకయిడు. అచ్చ. యు, కాం. 225: రూ-గుర్వెట్టు-గుఱుతుపొడుచు.

గుఱ్ఱపుఁజుక్క. వై. వి. (గుఱ్ఱము + చుక్క) అశ్విని: చూ, నక్షత్రము. 1.

గుఱ్ఱపుఁజొంగ. ద్వ. వి. విషభేదము: చూ. హాలాహలము. 3.

గుఱ్ఱపుఁదొవవు. ద్వ. వి. అశ్వాభరణము: చూ, భూషణము. 2. (చూ, భాండము 2, చూ. హయము.)

గుఱ్ఱపుఁబీఁట. వై. వి. (గుఱ్ఱము + పీఁట) ద్వారబంధముమీఁదనుంచెడు గుఱ్ఱపుమూతికొయ్య.

గుఱ్ఱపుతోఁక. ద్వ. వి. అశ్వవాలము: చూ, హయము.

గుఱ్ఱపుపిల్ల. వై.వి. అంబరీషము: చూ,హయము.

గుఱ్ఱపుమూఁక. ద్వ వి. గుఱ్ఱములగుంపు: చూ, హయము.

గుఱ్ఱపుమోమువేల్పు. ద్వ. వి. కింపురుషుఁడు: చూ, దేవతాభేదము.

గుఱ్ఱపురౌతు. ద్వ. వి. అశ్వారోహకుఁడు. చూ, హయము.

గుఱ్ఱపుసుడి. ద్వ. వి. ఆవర్తి. (ఆవర్తము): చూ, హయము.

గుఱ్ఱపుసారము. వై. వి. ధైవతము, సప్తస్వరములలో నొకటి: చూ, స్వరము. 2.

గుఱ్ఱపెక్కుడు. వా. వి: చూ, బాలక్రీడ.

గుఱ్ఱము. వై. వి =ఖురు. 1. రూ-గుఱము. (దీనికి బహువచనమున గుఱ్ఱాలనియు రూపముగలదు. పాండు. 2, ఆ. 38): చూ, హయము; అం. 2. దిక్పాలవాహనములలో నొకటి: చూ, దిక్పాలవాహనములు. (కుబేరుని వాహనము.)

గుఱ్ఱములు. అం. బ. చతురంగబలములోని జంతువులు: చూ, చతురంగములు, చదరంగము.

గుఱ్ఱు. దే వి. 1. కోపమునందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ; వై.వి. 2.=గురక. నిద్రయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ. (దేశ్యమని శబ్దరత్నాకరము.); 3. నిద్రయందగు ధ్వని: చూ, స్వరము. 2 (దేశ్యమని శబ్దరత్నాకరము.); 4. కడుపులోని కపటము: చూ, వ్యాజము. 1; 5. కోపము: చూ, రోషము.

గుల. సం. వి. ఆ. స్త్రీ. 1. జెముడు *: చూ, స్నుహి; వా. వి. (1) దురద: చూ, విదర్చిక.

గులక. వై. వి. 1. ఒకానొక రాయి: చూ, రాయి; వా. వి 2. కొబ్బరి, తాడి లోనగు వాని పూలనంటియుండు భాగాములు: గుల్ల-డొలక-డొల్ల: చూ, బోలు.

గులకరించు. దే. అ. క్రి: చూ, రవళించు.

గులగుల. దే. వి. 1. పుట్టలను కోరాడుటయందగుననుకరణము: చూ, హూహూ; 2. బ. చూర్ణము: చూ, సురుము: 3. నలఁగుడు. పాండు. 4, ఆ. 296: చూ, పీడనము; 4 రూ-గుఱగుఱ. దురద: చూ, విదర్చిక.

గులప. దే. వి: చూ, సాహిణి.

గులము. సం. వి. అ. పుం. గుడము: చూ, బెల్లము. 1.

గులాబి. వా.వి: చూ, గాజెంగి * (చూ,గులాబీ కుటుంబము.)

**గులాబీకుటుంబము.** పా. ఈకుటుంబలక్షణములు.– ఆకులు.–జంటలుగా కణుపుల కిఱువైపులను బుట్టుచుండును. అవి పుట్టినచోట గణుపు పుచ్ఛములుండును. ఆకులఅంచులు రంపపు పండ్లవలె నుండును. ఆకులు మిశ్రమపత్రములై జంటలుజంటలుగా 5 మొదలు 7 వఱకు లఘుపత్రములను గలిగి యుండును. మిశ్రమపత్రాగ్రమందొక లఘుపత్రము మిగిలియుండును. దీనినే "ఇంపారిపిన్నేట్" అందురు. కణుపుపుచ్ఛములఁ బుట్టుచున్న లేఁతయాకులను గాపాడుచుండును.

పువ్వు.— పుష్పములు క్రమపుష్పదళవంతములై (రిగ్యులర్) పుష్పములక్రిందుగా తొడిమ యుబ్బియుండును. రక్షక పత్రములు 5, పుష్పదళములు సాధారణముగా 5 గాని, 5 నకు మించిగాని యుండి కేసరములనేకములుగా రక్షకపత్రముల పట్టుభాగమునఁ బుట్టును. గులాబిపుష్పము పూలరాణి యను బిరుదముగలది.

కొమ్మ — కొమ్మలకు ముండ్లుండును ఈముండ్లు చెట్లను శత్రువులనుండి కాపాడును. ఇవి పట్టుమీఁద పెరుగును గాన యుపశాఖలు కానేరవు. మారేడు, నిమ్మ మొదలగు ముండ్లు మాత్రమునుండిపుట్టి పట్టును గలిగి యుండును గాన నవి యుపశాఖలనఁబడును.

అంటు.—శాఖలను అంట్లుకట్టవచ్చును.

విత్తనము.—వృంతాగ్రమందుబ్బిన భాగములో బీజమేర్పడును. పండు ఎఱ్ఱగా నుండును. పక్షులాపండ్లు తినును గాని అందుగల గింజలు మఱియొకచోట విడుచును. అందుచే గులాబీకుటుంబము వృద్ధియగును (రోజా కుటుంబమనియు వాడుక.)

**గులాము.** హై. వి. రూ–గుల్లాము. 1. దాసుఁడు: చూ, సేవకుఁడు.(గులాపువాఁడు–గులాపాఁడు అనియు వాడుక); 2. దాసురాలు: చూ, బానిసె; 3. అశ్వపాలకుఁడు: చూ, సాహిణి.

**గులి.** సం. వి. ఈ. స్త్రీ. 1.=గోలీ. బాలురాడుకొను చిన్నజాతిగుండు: చూ, గోలీ; 2. =గల్ల. తీఁటగుల్ల: చూ, వ్రణము.

**గులిక.** సం. వి. ఆ. స్త్రీ. రూ–గుళిక.

**గులిబి.** దే. వి: చూ, రూ గులిమి. (ఇట్లు బకారోపధముగా కొందఱు.)

**గులిమి.** దే. వి రూ–గుల్మి: చూ, పింజూషము.

**గులిమికడుపు.** దే. వి: చూ, గులిమితెడ్డు.

**గులిమితెడ్డు.** దే వి. —పై.—

**గులివి.** వా. వి: చూ. రూ. గులిమి.

**గులుచ్ఛము.** సం. వి. అ. పుం. వికసించిన పువ్వులగుత్తి, (ఇట్లు– గులుచ్ఛకము– గులుఞ్ఛము– గులుఞ్ఛకము– గుఛుచ్ఛకము–గుళుచ్ఛము–గుళుఞ్ఛకము–గుళుఞ్ఛము.)

**గులూచి.** సం. వి. ఈ. స్త్రీ. రూ–గళూచి 1. తిప్పతీఁగె *: చూ, సోమవల్లి. 2. గుగ్గులువు *: చూ, మహిషాక్షి; 3: చూ, స్వర్గము; 4. జలబిందువు: చూ, బొట్టు: 5. పర్వతప్రాంతము: చూ, పర్వతము.

**గుల్ఫము.** సం. వి. అ. పుం. 1. (రూ–గుల్భము–గుడ్ఫము–గుడ్భము): చూ, సీలమఁడ; 2 స్త్రీ కళాస్థానవిశేషము (అని కొందఱు): చూ, కళాస్థానములు.

**గుల్భము.** సం. వి. అ. పుం. —పై.—

**గుల్భములు.** అం. 1. పురుషలక్షణాంగములు ఏఁబదియెనిమిదింటిలో నొకటి. (గుల్భములు= చీలమఁడలు. సమములైనఁ బ్రశస్తములు): చూ. లక్షణాంగములు; 2. స్త్రీలక్షణాంగములు ఏఁబదిరెండింటిలో నొకటి. (సమములైన భాగ్యవతియగు): చూ, స్త్రీలక్షణాంగములు.

గుల్మ. సం. వి. ఆ. స్త్రీ. ఉసిరిక *: చూ, శ్రీఫలి. 1.

గుల్మకేతువు. సం. వి. ఉ. పుం. ఫుల్లపఱ్ఱబ్బ*. చూ, పఱ్ఱబ్బలి.

గుల్మము. సం. వి. అ. పుం. 1. బోదెలేనిచెట్టు: చూ, పాద. 2 (చూ. వృక్షము); 2. గుల్మరోగము, (కడుపులో వైశ్యముచేతఁ బుట్టిన మాంసగ్రంథి): చూ, రోగము. 1; 3 సేనా విశేషము. (9 రథములు, అన్నియేనుఁగులు ఇరువదేడుగుఱ్ఱములు నలువదేవురుకాల్బంటులును గలదినగరసైన్యవిశేషము(అనికొందఱు) చూ, సేన. 1; 4. సైన్యరక్షణము: చూ, రక్షణము; 5 పురాభిముఖమైన రాజమార్గము: చూ, మార్గము. 1: 6. గుల్మమను చేప: చూ మత్స్యము. 1; 7: చూ. ప్లీహము; 8. స్కంధ: చూ ఖండము. 3; 9 కోట మొదలగునది: చూ, సదనము. 1. 10. గుంపు; చూ, సమూహము; 11. నాభి: చూ, బొడ్డు. (పుం. అని కొందఱు).

గుల్మమూలము. సం. వి. అ. న. అల్లము *:చూ, శృంగబేరము.

గుల్మరోగజాతకుఁడు. పా. వ్యయాధిపతి షష్టమమునుండి పాపులచేఁ జూడఁబడునప్పుడును, వ్యయాధిపతి షష్టమమందును షష్టమాధిపతి వ్యయమునందుండి లగ్నాధిపతి బలహీనుఁడైనప్పుడును, షష్టమమందు రవియుండి షష్టాధిపతి పాపులతోఁగలసి రవి పాపులచేఁజూడఁబడునప్పుడును,శనికుజులమధ్యమందుఁ జంద్రుఁడును మకరమునందు సూర్యుఁడును నుండునప్పుడును, షష్టమమందు శనియుండి పాపగ్రహదృష్టుఁడై పాపగ్రహానవాంశయుక్తుఁడైనను గుల్మరోగముండును.

గులువలి. సం .వి. ఈ. స్త్రీ: చూ, సోమలత*:

గుల్మవినాశము. సం. వి. అ. పుం. వరగోఁగు*: చూ. పీలువు.

గుల్మి. సం. వి. ఈ. స్త్రీ. 1 ఉసిరిక*: చూ, శ్రీఫలి 1; 2. ఏలా*: చూ,పత్రల; 3 నిప్పు: చూ, వహ్ని. 1; 4. నల్లఉప్పి*: చూ,లవణి; 5. డేరా: చూ, సదనము. 1: విశ. న్. 6. గుల్మరోగయుక్తుఁడు; దే. వి. (1): చూ, రూ–గులిమి.

గుల్మిని. సం. వి ఈ. స్త్రీ. ఉలపము,దట్టముగా అల్లుకొనెడి తీఁగె (అని కొందఱు)*. చూ, పాద. 2 (చూ, వృక్షము).

గుల్మిఁడు. సం. వి. అ. పుం. 1. దండుకాపాడువాఁడు: చూ,సైనికుఁడు; 2. చూ, వైద్యుఁడు.

గుల్ల. వై. వి. 1.=త్రుల్లక. గులి, నత్తగుల్ల,కప్పచిప్ప: చూ, సంకు. 1; 2. బొబ్బ, గులి, తెల్లనివర్ణము (అని కొందఱు): చూ, వర్ణము; విశ. 3. అల్పము: చూ, స్వల్పము; 4. లోపల యేమియులేనిది: చూ, బోలు.

గుల్లకడియము. వా. వి. వరిపప్పు మట్టుచుట్టును నూర్చునపుడు వేయు వరి.

గుల్లకాఁడు. ద్వ. విశ. ఏమియు లేనివాఁడు. "గుల్లకాఁడై మనయింటి గుఱుతు లడుగ వచ్చిన." క్షేత్రయ: చూ, బీదవాఁడు.

గుల్లపడు వై. అ. క్రి: చూ, భంగపడు.

గుల్లపుటిక. దే. వి. చిన్నబుట్ట: చూ, సజ్జ. 1.

గుల్లాము. వై. వి. చూ, రూ–గులాము.

గుల్యము. సం. వి. అ. పుం. కమ్మన: చూ,మాధుర్యము.

గువాకము. సం. వి. అ. పుం. రూ-గూవాకము 1; చూ, పోఁక*; 2. కఁదుకము: చూ, బంతి. 3; బ. 3: చూ, మల్లెమొగ్గలు. 2; 4. చేట: చూ, శూర్పము; 5. చేండ్రి*: చూ, వెలిచేండ్రి; 6. గేదెయీనిక: చూ, ప్రసవము 6.

గువాకువు. సం. వి.ఉ. పుం: చూ, గువాకము. 1-8-4-6.

గువ్వ. దే.వి. 1.అడవిపావురము. పావురము(అని కొందఱు)"గువ్వ గూఁడెక్కెను రాజు మేడ యెక్కెను.": చూ, పావురము; 2. పక్కి: చూ, పక్షి.

గువ్వకరి. దే. వి. గువ్వలగుంపు: చూ, పక్షి.

గువ్వకరిగొను. దే. స. క్రి: చూ, వేష్టించు. శై. 4, ఆ. 72.

గువ్వకుత్తుక. దే. వి. (అఁకటిచేతఁ గలుగు) హీన స్వరము. పాండు 8, ఆ. 20: చూ. స్వరము.2.

గువ్వకుత్తికపడు ద్వ. అ క్రి. (అఁకటిచేత) హీన స్వరమగు.

గువ్వకోలుగొను. దే. స. క్రి రూ-గువ్వకోల్గొను: చూ, వేష్టించు.

గువ్వగుత్తి. ద్వ. వి. రూ - గువ్వగుత్తిక - గువ్వ గుత్తుక-గుత్తికగువ్వ. కపోతాంఘ్రి*: చూ, రాజార్హము.

గువ్వగుత్తుక. దే. వి. —పై.—

గుసగుస. దే. వి. రహస్యపుమాటల చెప్పుడు: చూ, సల్లాపము: చూ, స్వరము. 2.

గుసగుసలువోవు. దే. అ. క్రి. గుసగుసయని మాటలాడు. విజ. 8. ఆ. 107.

గుహ. సం. వి. ఆ. స్త్రీ.1.=గొబ. కొండయందు తొలువఁబడిన బిలము: చూ, రంధ్రము. 1; 2. పల్లము: చూ, రంధ్రము. 1; 3 చూ సృగాలవిన్న*; 4: చూ, సాలపరి*; 5: చూ, పృశ్నిపర్ణి; 6: చూ, హృదయము; 7: చూ, సౌందర్యము.

గుహాప్రియువు. సం. వి. ఊ. స్త్రీ. పార్వతీదేవి: చూ, పార్వతి 1.

గుహాశేకుఁడు. సం. వి. అ. పుం: చూ, శివుఁడు.

గుహాశయము. సం. వి. అ. పుం. 1: చూ, మృదుద్రిమము*; 2: చూ, శార్దూలము; 3: చూ, భల్లూకము; 4: చూ, సింహము.

గుహీనము. సం. వి. అ న. వసనము: చూ, వస్త్రము.

గుహిలము. సం. వి. అ. న: చూ, విత్తము.

గుహీనము. సం. వి. అ.న. వనము: చూ, విపినము.

గుహుఁడు. సం. వి. అ. పుం. 1. కందుఁడు: చూ, స్కందుఁడు; 2. ఎఱుకలవాఁడు: చూ, వ్యాధుఁడు. 1.

గుహ్య. సం. వి. ఆ. స్త్రీ. రూ-గృహ్య. పేఁట, శాఖానగరము: చూ, దేశము.

గుహ్యకుఁడు. సం వి.అ. పుం. 1. మాణిభద్రుఁడు మొదలగు గుహ్యకజాతి అనఁగా యక్షులను దేవతావిశేషము: చూ, దేవతాభేదము; 2. గుహ్యకుఁడను పేరిఁటివాఁడు.

గుహ్యకేశ్వరుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు: చూ, శ్రీగుఁడు.

గుహ్యగురువు. సం. వి. ఉ. పుం: చూ, శివుఁడు.

గుహ్యతంత్రము. అం. శివప్రోక్తములగు చతుష్షష్టి తంత్రములు అఱువదినాలగిఁటిలో నొకటి: చూ, తంత్రములు.

గుహ్యనిష్యందము. సం. వి. అ. పుం. ఉచ్చ: చూ, మూత్రము.

గుహ్యపుష్పము. సం. వి. అ. పుం: చూ, రావి*.

గుహ్యబీజము సం. వి. అ. పుం. చిప్పగడ్డి*: చూ, తృణము 1.

గుహ్యభాషితము. సం. వి. అ. న. 1. మంతరము: చూ, మంత్రము. 1; 2. గుప్తమైనది. (మాట): చూ, శబ్దము. 2.

గుహ్యము. సం వి. అ. న. 1. ఏకాంతము: చూ, రహస్యము. 1; 2 పురీషమార్గము: చూ, ముడ్డి; 3. ఆఁడుగుఱి చూ, భగము. 12: 4. స్త్రీ పురుషులగుఱి: చూ, భగము. 12: పుం, న; (అనికొందఱు) 5. కమఠము: చూ, తాఁబేలు.

పుం. 6: చూ, హుంకారము; 7. నెపము: చూ, వ్యాజము. 1; విణ. 8. దాఁచఁదగినది: చూ, రహస్యము. 3.

గుళిక. సం. వి. ఆ. స్త్రీ = గుళిక. పాదరసపు టుండ: చూ, పూస.

గుళిగ. వై. వి.=గుళిక. —వై.—

గుళుచ్ఛము. సం. వి. అ. పుం.=గుత్తి: చూ, పూగుత్తి.

గుళుత్సకము. సం. వి. అ. పుం.= —వై —

గుళుత్సము. సం. వి. అ. పుం = —వై.—

గుళూచి. సం.వి.ఈ.స్త్రీ: చూ, రూ-గులూచి.

గుళ్లు. దే. వి. బ. సందెనగుడియను బాలక్రీడ, చూ. బాలక్రీడ: వా. 2. దేవాలయములు. "గుళ్లు గోపురములు."

## గూ

గూండ్రు. దే. వి. గుడ్లగూబ కూఁత: చూ, స్వరము. 2.

గూండ్రించు. దే. అ. క్రి. 1. (గుడ్లగూబ) కూయు: చూ. శబ్దించు; 2. (కడుపు) త్రిప్పు రూ-గుండ్రించు: చూ, త్రిప్పు.

గూఁటి. వై. వి.=ఘోటీ ఘృష్టి: చూ, సూకరము.

గూఁటిగువ్వ. దే వి. (గూఁడు + గువ్వ) ఈఁకలు రాల్చిన పక్షి: చూ, పక్షి.

గూఁడు. వై. వి.=కులాయ. 1. నీడము: చూ, సదనము. 1; 2. గోడయందు దీపముంచుట కేర్పఱచినచోటు: చూ, అరగూఁడు; 3.(పెంపుడు చిలుకలు లోనగునవియుండు) పంజరము: చూ, పంజరము; 4. ఆకుగుడిసె: చూ, సదనము. 1. (ఈనాలుగర్థములును దేశ్యముల నిశబ్దగత్వాకరము);నా.వి. 5 (బండి)గూఁడు.

గూఁడుకానుపు. దే. వి. నీడోద్భవము. అచ్చ, సుం. కాం. 57: చూ. పక్షి.

గూఁడుబండి. దే. వి. తోఁప కట్టినబండి: చూ, శకటము. 1.

గూటము. వై. వి. రూ- గూటాము = కూట. 1. గుంజె: చూ, స్తంభము. 1; 2. మేకు: చూ, శూలము; 3. వడ్లవాని యొకానొక కొఱముట్టు: రూ-గూటాము; 4. కుబుసము: చూ, సీదరము. 3.

గూటాము. వై వి. = —వై.—

గూడ. దే వి. 1. జెమ్మగూడ: చూ, వారిత్ర; 2. వైష్ణవుల తిరుమణికాటాకుల బుట్ట: చూ, తిరుపగూడ: 3 నీళ్లుచల్లెడు వెదురుబుట్ట చూ, సజ్జ.1; 4.పూవులులోనగునవియుంచెడు బుట్ట: చూ,సజ్జ 1; 5. మత్స్యములనుబట్టెడి యొకానొక సాధనము: చూ, వల. 1; 6. త్రాగుట కుపయోగమైన దొప్ప: చూ, పాత్రము. 6; 7. వెదురుపేళ్లతోఁ జేయఁబడు కోణాకృతి గల బుట్ట (నీరుతోడు సాధనము.) చూ.సజ్జ.1.

గూడకట్టు. దే.వి. కచ్ఛములేకకట్టిన దోవతియుడ్డ కట్టు.

గూడచాఁప. వా. వి. గూడ: చూ, వారిత్ర.

గూడపాల. దే. వి: చూ, శారిబ* (దూడపాల అని కొందఱు.)

గూడబాతు. దే. వి. 1. ఒకరకము కొంగ: చూ, బకము: 2. ఒకరకము బాతు: చూ, శరారి.

గూడము. సం.వి.అ పుం. చూ. రూ-గుడము.1.

గూడారము వై. వి.=గుడాలయ: చూ, రూ-గుడారము.

గూడాయ. వై వి. = —వై.—

గూడెము. దే. వి. (రూ- గోడము - గోడెము - గుడెము) కొండవాన నాశ్రయించి యుండెడి బోయపల్లె. అచ్చ. బాల, కాం. 18. పీఠిక: చూ, రూ-గుడెము.

గూఢజుఁడు. సం. వి. అ. పుం. భార్యయందు తనకుఁ దెలియకుండ - అంకుమగనికిఁ బుట్టిన

కొడుకు: చూ, పుత్త్రుఁడు. 1. (చూ, గూఢోత్పన్నుఁడు).

గూఢనీడము. సం. వి. అ. పుం. కొటుకపిట్ట: చూ, పిచ్చుక.

గూఢపత్త్రి. సం. వి. ఆ. స్త్రీ: చూ, భూమ్యాలకి*.

గూఢపత్త్రము. సం. వి. అ. పుం: చూ, వెణుతురు*.

గూఢపథము. సం. వి. అ. పుం. అంతఃకరణము: చూ, హృదయము. 2.

గూఢపాకి. సం. వి. ఈ. స్త్రీ: చూ, క్షీతాళము*

గూఢపాత్తు. సం. వి. త్. పుం. కానరాని కాళ్లది, పాము: చూ, సర్పము.

గూఢపురుషుఁడు. సం. వి. అ. పుం: చూ, వేగువాఁడు.

గూఢపుష్పకము. సం. వి. అ. పుం. బ: చూ, సెనగలు.

గూఢపుష్పము. సం. వి. అ. పుం: చూ, వకుళము.

గూఢఫలము. సం. వి. అ. పుం. బదరి*: చూ, రేఁగు. 1

గూఢమణి. సం. వి. ఇ. స్త్రీ: చూ, బాలిక్రీడ.

గూఢమార్గము. సం వి. అ. పుం. భువోంతరమార్గము: చూ, మార్గము. 1.

గూఢము. సం. వి. అ. న. =గుట్టు. 1. ఏకాంతము: చూ, రహస్యము: 2. స్త్రీపురుషుల గుఱి: చూ, భగము. 12; 3. అమేధ్యము: చూ, గూథము. 1; విణ. 4. దాఁచఁబడినది: చూ, రహస్యము 3. (దాఁగియున్నది అని కొందఱు.)

గూఢముష్కము. సం. వి. అ. పుం. ఏనుఁగు: చూ, హస్తి.

గూఢమైథునము. సం. వి. అ. పుం. కాకి: చూ,

గూఢవర్చస్కము. సం. వి. అ. న. పురీషము: చూ, మలము. 1.

గూఢవర్చస్సు. సం. వి. స్. పుం. కప్ప: చూ, మండూకము.

గూఢవల్లిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, మహాయమళపత్త్రిక.

గూఢసాక్షి. సం. విణ. (న్. ఇ న్.) = గుట్టుసాకిరి. (కృతసాక్షులేవురిలో నొకఁడు): చూ, కృతసాక్షులు (చూ, గూఢుఁడు).

గూఢాంగము. సం. వి. అ. పుం: చూ, తాఁబేలు.

గూఢాంఘ్రి. సం. వి. ఇ. పుం. పాము: చూ, సర్పము.

గూఢార్థకము. అం. పదదోషములు పదునేడింటిలో నొకటి: చూ, పదదోషములు.

గూఢార్థము. అం. కావ్యదోషములలో నొకటి. (అర్థము వెల్లడి కానిది): చూ, కావ్యదోషములు.

గూఢుఁడు. అం. 1. కృతసాక్షులేవురిలో నొకఁడు: చూ, కృతసాక్షులు: 2. సాక్షులు పదునొకండుగురిలో నొకఁడు: చూ, సాక్షులు.

గూఢోక్తి. అం. గూఢోక్త్యలంకారము. అర్థాలంకారములు నూటిరెంటిలో నొకటి. ఒకరిని గూర్చినది వేఱొకనిని సంగతిగా సూచించు నట్లు వచించుట. ఉదా-"ఒరునిచేను నీవు మేయఁదగునె. అదె క్షేత్రస్వామి వచ్చుచున్నాఁడు. వృషభమవ్వలఁ బొమ్ము.": చూ, అలంకారము. 8.

గూఢోత్తరము. అం. —పై—

గూఢోత్పన్నుఁడు. సం. వి. అ. పుం: చూ, గూఢజుఁడు.

గూద. వా. వి. 1: చూ, రూ-గుద్ద; 2. పాతిన పేగు. "గూదదిగినది."

గూథము. సం వి. అ. న. (పుం, న. అని కొందఱు)

గూథలక్తము. సం. వి. అ. పుం. ఒకానొక పక్కి: చూ, పక్షి.

గూన. దే. వి. పెద్దకుండ: చూ, భాండము. 3

గూనము. సం. విణ. విడువఁబడిన మలాదులు. (చూ, గూథము.)

గూనివాఁడు. దే. విణ. (గూను + వాఁడు): కుబ్జుఁడు: చూ, వామనుఁడు.

గూను. దే.వి. 1.వసుముమీఁదివంపు; 2. కుబుచేఁదనము: చూ. పొఱడు.

గూనుఁడు. సం.విణ: చూ, విసర్గుఁడు (వాడుక).

గూనుగిల్లు. దే. అ. క్రి: చూ, పొఱకువోవు.

గూబ. వై. వి. 1.=ఘూకః. రూ-గుబ: చూ, పకినంపుఁ బులుఁగు; దే. వి. 2: చూ, చెవి గూబ. 1.

గూబతెడ. దే. వి: చూ, మహాబల*.

గూబరి. దే. వి: చూ, మాదిగ. ఆం, భా. ద్వి తూ 289.

గూరణము. సం. వి. అ. న: చూ, రూ-గురణము.

గూవనాలు. దే. వి. బ: బాలక్రీడ. వి, పు 7 ఆ 202.

గూవాకము. సం. వి. అ. పుం: చూ. రూ-గువాకము.

గూహనము. సం. వి. అ. న: చూ, దాఁపుట

గూహావాలింగనము. ఆం ఆలింగనములు పదునాలుగింటిలో నొకటి: చూ, ఆలింగనములు.

## గృ

గృంజనము. సం. వి. అ. న. 1. విషము తిన్న పశువుయొక్క మాంసము, పొదిగినమాంసము (లేక) విషముపూసిన ఆయుధముచేఁ జంపఁబడిన పశుమాంసము (అని కొందఱు): చూ, మాంసము; పుం. 2. తెల్లఉల్లి *: చూ, వెల్లుల్లి; 3. కారుమునగ *: చూ, శిగ్రువు.1; 4.=గుఱిజె గురిగింజ *: చూ. ముల్లంగి.

గృండీవము సం. వి. అ. పుం పెద్దనక్క: చూ, సృగాలము.

గృత్సుఁడు. సం. వి.అ. పుం: చూ,మన్మథుఁడు.

గృత్స్నుఁడు సం. వి. అ. పుం. వేదాంగము లాఱింటితోఁగూడ వేదముఁజదివినవాఁడు: చూ, బ్రాహ్మణుఁడు.

గృధువు. సం. వి. ఉ. పుం. 1: చూ, మన్మథుఁడు; 2. ఆపగలాఁడు: చూ, లుబ్ధుఁడు.2; ఊ. పుం. 3: చూ, బుది.

గృధ్నుత. సం. వి. ఆ. స్త్రీ. అనురాగము: చూ, స్నేహము. 1.

గృధ్నువు. సం. విణ. ఉ: చూ, గర్ధనుఁడు 1-2.

గృధ్రనఖ. సం. వి. ఆ. స్త్రీ. ఉప్పి *: చూ, లవణి.

గృధ్రనఖి. సం. వి. ఈ. స్త్రీ: కలము, కోలి*.

గృధ్రపత్రి. సం. వి. ఆ. స్త్రీ. చూ, పొగాకు.

గృధ్రఫల. సం. వి. ఆ. స్త్రీ: చూ, గృధ్రనఖ*.

గృధ్రము. సం. వి. అ. పుం. 1 =గర్ధ: చూ, దాక్షాయ్యము; విణ. 2: చూ, లోభి.

గృధ్రరాజము. సం. వి. అ. పుం: చూ, హరివాహనుఁడు.

గృధ్రవక్త్ర. సం. వి. ఆ. స్త్రీ: చూ, గృధ్రనఖ *.

గృధ్రశిక్ష. సం. వి. ఈ. స్త్రీ. 1 వృషాగ్రము: చూ, సుద. 3; 2. పద్మకేసరము: చూ, పద్మము. 4.

గృధ్రసఖి. సం. వి. ఈ. స్త్రీ: చూ, గృధ్రనఖ *.

గృధ్రసి. సం. వి. ఈ. స్త్రీ =కిరుదెస. దొండిలోని వాతము: చూ, రోగము. 1.

గృధ్రిహాల. సం. వి. ఆ. స్త్రీ: చూ, గృధ్రినఖ*.

గృధ్రాశీ. సం. వి. ఈ. స్త్రీ: చూ, గృధ్రిపతి *.

గృధ్రాని. సం. వి. ఈ. స్త్రీ —పై.—

గృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఒకతూరి యీనిన యావు: చూ, ధేనువు; 2 పాంచితీఁగె *: చూ, శైవలము; పుం. 3. పంది: చూ, సూకరము; విణ. 4: చూ, అవష్టబ్ధము.

గృష్ణి. సం. వి. ఇ. పుం. 1: చూ, పాషండుఁడు: 2. షండుఁడు: చూ, పౌవిదల్లుఁడు.

గృహ. అం. చేతనరత్నములు తొమ్మిదింటిలో నొకటి: చూ, చేతనరత్నములు.

గృహకచ్ఛపము. సం. వి. అ. న. (నూఱెడు) సన్నికల్లు. తిరుగలి (అని కొందఱు): చూ, రాయి.

గృహకన్య. సం.వి. ఆ. స్త్రీ: చూ, కలబంద*.

గృహకపోతము. సం. వి. అ. పుం: చూ, పావురము.

గృహకాండము. సం. వి. అ. పుం. గజపిప్పలి *: చూ, పిప్పలి. 1.

గృహకారి. సం. వి. న్. పుం. ఒకానొక పురుగు: చూ, పురుగు.

గృహగోధ. సం. వి. ఆ. స్త్రీ: చూ, బల్లి.

గృహగోధిక. సం. వి. ఆ. స్త్రీ. —పై.—

గృహగోలిక. సం. వి. ఆ. స్త్రీ. —పై.—

గృహణి. సం. వి. ఈ. స్త్రీ: చూ, శుక్తము. 1.

గృహతటి. సం. వి. ఈ. స్త్రీ, వీధి బజాఱు (అని కొందఱు): చూ, మార్గము. 1.

గృహదాహకుఁడు. అం. ఇంట నిప్పిడువాఁడు. ఆతతాయిలు ఆఱుగురిలో నొకఁడు: చూ, ఆతతాయి. 2.

గృహదీపికాన్యాయము. పా. ఇంట దీపమున్న యెడల నిల్లంతయుఁ బ్రకాశింపఁజేయురీతి.

గృహదుశ్చరితము. అం. ప్రకాశింపఁజేయఁ గూడని పదికర్మములలో నొకటి: చూ, ప్రకాశింపఁజేయఁగూడనివి.

గృహదేవత. సం. వి ఆ. స్త్రీ: గృహదైవము, ఇష్టదేవత, కులదేవత; (తె. ప):-ఇలువేలుపు.

గృహదైవము. సం. వి. అ. పుం —పై.—

గృహద్రుమము. సం. వి. అ. పుం. 1: చూ, పాలతేఁకు*; 2. పినగుమ్మడు, తేఁకు *: చూ, మహాఫలము; 3. పెద్దతేఁకు *: చూ, శాకోటము.

గృహధూమము. సం. వి. అ. పుం: చూ, పొగ.

గృహనాశనము. సం. వి. అ. పుం: చూ, పావురము.

గృహనీడము. సం. వి. అ. పుం: చూ, పిచ్చుక.

గృహపతి. సం. వి. ఇ. పుం. 1. గృహస్థుఁడు, గృహవిత్తుఁడు, నిత్యాగ్నిహోత్రి (అని కొందఱు): చూ, యజమానుఁడు; 2. ప్రెగ్గడ: చూ, మంత్రి. 1; 3. సదాదాత: చూ, సత్రి; 4. తపాలో కాగితము తెచ్చెడువాఁడు (పోస్టుమేన్): చూ, వేగువాఁడు.

గృహపోతకము. సం. వి. అ. పుం. ఇల్లు, వాస్తువు: చూ, సదనము. 1.

గృహబద్ధమారీన్యాయము. పా. కలబంద యింట్లో గట్టిన పెరుఁగను పెరుఁగదు చావను చావదు అను విధము. (పెరుఁగునని కొందఱు.)

గృహబలిప్రియము. సం వి. అ. పుం. కొంగ: చూ, బకము.

గృహబలిభుక్కు. సం. వి. జ్. పుం. 1: చూ, పిచ్చుక; 2. కొంగ: చూ, బకము; 3. కాకి: చూ, వాయసము.

గృహభూదారము. సం. వి. అ. పుం. పందికొక్కు: చూ, మూషికము.

గృహమణి. సం. వి. ఇ. స్త్రీ. దివ్వె: చూ, స్నేహాశము.

గృహామాచిక. సం. వి. అ. స్త్రీ: చూ, సకినంపుం బులుంగు.

గృహామార్జాలన్యాయము. పా. బయటనున్నను నేనుంగునకుఁగల గౌరవము ఇంటనున్నను పిల్లికి లేదనువిధము.

గృహము. సం. వి. అ. న. 1 =గీము. ఇల్లు: చూ, సదనము. 1; 2. పెండ్లాము. "జాయాతు గృహిణీగృహమ్." అని హలాయుధ ఘంటువు (ఇది యీరెండర్థములయందును పుంలింగమునగును. అప్పుడు బహువచనాంతము): చూ, భార్య; అం. 3. దానములు పదునారింటిలోనొకటి: చూ, దానములు; 2 మహాదానములు పదునారింటిలో నొకటి. చూ, మహాదానములు.

గృహమృగము. సం. వి. అ. పుం. కుక్క: చూ, శునకము.

గృహమేధి. సం.వి.న్.పుం: చూ, రూ-గృహస్థు.

గృహయాళ్వుఁడు. సం. వి. అ. పుం.—పై.—

గృహయాలువు. సం. విశ. ఉ. గృహీత: చూ, గ్రాహకుఁడు (గ్రహయాలువుఅని కొందఱు)

గృహస్థు. సం. వి. అ. పుం. = గేస్తు గ్రిస్తు. రూ గృహస్థుఁడు. భార్యను పరిగ్రహించి ధర్మార్థకామములను నడపుచు వేదపాఠము వైశ్వదేవాగ్నిహోమము అతిథిపూజ పితృతర్పణము భూతబలియు ననెడు పంచయజ్ఞములనుజేయుచు ప్రవర్తించువాఁడు. ఇలువేలుపు: చూ, యజమానుఁడు.

గృహస్థుఁడు. సం. వి. అ. పుం. —పై.—

గృహస్థుధర్మము. సం. వి. అ. పుం: చూ, ఇంటిపట్టు.

గృహస్థూణము. సం. వి. అ. న. నిటారిడు: చూ, స్తంభము. 1.

గృహాంతరము. సం. వి. అ. న. మూఁడులోవలు కలిసిన త్రోవ: చూ, మార్గము. 1.

గృహాక్షము. సం. వి. అ. న. కిటికి: చూ, వాతాయనము.

గృహాగతుఁడు. సం. వి. అ. పుం. అతిథి: చూ, విందు. 4.

గృహాధిపుఁడు సం. వి. అ. పుం: చూ, గృహస్థు.

గృహామ్లము. సం. వి. అ. న. పులిగడుగు: చూ, శుక్తము. 1.

గృహాయనికుఁడు. సం.వి.అ.పుం: చూ, గృహస్థు.

గృహారామము. సం. వి. అ. పుం. ఇంటితోఁట: చూ, వనము. 2.

గృహాలిక. సం. వి. అ. స్త్రీ: చూ, బల్లి.

గృహావగ్రహణి. సం. వి. ఈ. స్త్రీ. గడప: చూ, దేహళి.

గృహాశయ. సం. వి. అ. స్త్రీ: చూ, తాంబూలి*.

గృహాశ్మ. సం. వి. న్. పుం. (నూరెడు) సన్నికల్లు. తిరుగలి (అని కొందఱు): చూ, రాయి.

గృహి. సం. వి. న్. పుం: చూ, గృహస్థు.

గృహిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. పెండ్లాము: చూ, భార్య; 2. ఎఱ్ఱతుమ్మెద: చూ, భ్రమరము; 3. కణుఁదురీఁగ: చూ, మక్షిక; 4: చూ, గృహామ్లము.

గృహీత. సం. విశ. ఋ: చూ, గృహయాలువు.

గృహీతము. సం. విశ. 1. గ్రహింపఁబడినది: చూ, స్వీకృతము; 2. అందుబడి: చూ. ప్రాప్తము.1; 3. తెలియఁబడినది; చూ. వ్యక్తము; 4. ధరింపఁబడినది: చూ, హితము. 2.

గృహీతి. సం. వి. ఇ. స్త్రీ. (గ్రహింపఁజాలిన) బుద్ధి: చూ. బుద్ధి.

గృహైకదేశము. సం. వి. అ. పుం. ఇంటిచోపా: చూ, సదనము. 1.

గృహోరకము. సం. వి. అ. న: చూ, గృహామ్లము.

గృహోలిక. సం. వి. అ. స్త్రీ: చూ, బల్లి.

గృహ్య. సం. వి. అ. స్త్రీ: చూ, రూ-గుహ్యా.

గృహ్యాకము. సం. వి. అ. పుం. 1. పెంపుడు

మృగము లోనగునది: చూ, దీమము; విణ. 2. ఒకరివశమునయున్నది: చూ, పరాధీనము.

గృహ్యము. సం.వి. అ. న. 1. కర్మబోధక గ్రంథము: చూ, పుస్తకము: పుం. 2. పెంపుడు మృగము లోనగునది: చూ, దీమము 3. గొడుగు గడ్డి*: చూ, తృణము. 1; 4. పేట: చూ. గుహ్య: విణ. 5. లోబడునది: చూ, వశము; 6. ఒకరి వశమునయున్నది: చూ, పరాధీనము.

# గె

గెంగెటు. దే. వి: చూ, రూ-కెంగటు.

గెంజి. వా. వి: చూ, రూ-గంజి "కాసంత గెంజి తాగితిని" (హీనజాతుల వాడుక.)

గెంజాయి. వై. వి.=కలంజ*: చూ, గంజా. 1.

గెంటుసము. దే. వి. కట్టెవిరుపుమాట. వసు. 4. ఆ. 44: చూ, శబ్దము. 2.

గెంటించు. దే. అ. క్రి. 1. చలించు: చూ. సలించు; వా. 2. (మెడపట్టి) త్రోయించు.

గెంటు. దే. వి. 1. చలనము. కళా. 8, ఆ. 45. చూ, లోలము; అ. క్రి. 2. చలించు. పారిజా. 3, ఆ. 12: చూ, సలించు; 3. తొలగు: చూ, విరియు. 5; స. క్రి. 4. త్రోయు: చూ, నిషేధించు; 5. పచేరించు. రై. 5. ఆ. 11: చూ, ప్రయోగించు. 2.

గెంటుట. వా. వి. త్రోపుడు: చూ. నిషేధము.

గెంటువడు. ద్వ. అ. క్రి. (గెంటు + పడు) తక్కు. శై. 3, ఆ. 105: చూ, మిడివోవు.

గెంటెము. దే. వి: 1 జేంట నేతబట్ట. రూ-గెంటెము, స్కా. 5, ఆ. 14: చూ, వస్త్రము; 2. దట్టము: చూ, సాంద్రము.

గెండ. వై. వి 1.=గండక-గడః. చేపపిల్ల: చూ, మత్స్యము. 1: 2. పౌరుషము: చూ, శక్తి. 1.

గెండకము. వై. వి. = —వై.—

గెండె వై. వి=: చూ, రూ-గెండ 1.

గెగ్గలు. దే. వి. గేలి చూ, పరిహాసము (అప).

గెచ్చే. వా. వి: చూ, రూ-గచ్చే. అం. భా. ద్వి. 49.

గెజ్జె. దే వి. ఒకరకముచేప: చూ, మత్స్యము 1.

గెట్టె. దే. వి. గుజ్జుపుడెక్క: చూ, వింఖము.

గెడ. దే. వి. 1. దగ్గఱ. స్కా. 5. ఆ. 14: చూ, సమీపము; 2. జేత: చూ, సంగడి. 5; 3. వేటకుఁదగిన యొకానొక సాధనము: చూ, బాణము. 1; వై. వి. = కాండ. రూ-గడ. 4. నిడుపాటికోల: చూ, స్తంభము. 1; 5. కంబము: చూ, స్తంభము. 1; 6 వెదురు: చూ, వేణువు; 7. ఓడకంబము: (పడవలోప్రుడు) గడ (అని కొందఱు): చూ, స్తంభము. 1. (వాడుక.)

గెడ్డ. వై. వి.=: చూ, రూ-గడ్డ (వాడుక.)

గెడ్డము. వై.వి =: చూ, రూ-గడ్డము. (వాడుక.)

గెనయు. దే అ. క్రి. పుష్టియగు: చూ, పోషించు.

గెనసు. దే. వి: చూ, రూ-గునుసు *.

గెనుసు. వా. వి. —వై.—

గెనుసుదుంప. వా. వి. —వై.—*: ఉరలగడ్డ, గెనసు-రూ-గెనుసు-గెనుసుదుంప; (వా.ప).- ఆలుకము, అలువు-రూ-ఆలూవు, ప్రోష్టము.

గెబ్బు. వై. వి. 1.=గర్వము: చూ, హుంకారము: స. క్రి. 2. అపహరించు. విజ. 1, ఆ. 150: చూ, ముచ్చిలించు: 3. గ్రహించు: చూ, ప్రాపించు.

గెఱ. దే. వి. గీత. భాగ. 1, స్కం. 515: చూ, రేఖ. 3.

గెల. వై. వి.= గుళుచ్ఛః. రూ-గొల (పూల యొక్కయు, కాయలయొక్కయు, పండ్ల యొక్కయు) గొల: చూ, పూగుత్తి (దేశ్యమని శబ్దరత్నాకరము.)

గెలివి. దే. వి. 1. రూ-గెలివిడి: చూ, సంతోషము, 2: చూ, వికాసము.

గెలివికాఁడు. దే. వి. 1: చూ, సౌందర్యవంతుఁడు; 2: చూ, హృష్టుఁడు.

గెలివిడి. దే. వి. 1: చూ, రూ- గెలివి. 1; 2. రూ-గెల్విడి. గెలుపు: చూ విజయము.1.

గెలుచు. దే. అ. క్రి. 1. పోవు: చూ, వెళ్లు. 8; అం. పే9. 2. పుష్పు: చూ, పుష్పించు; స. క్రి. 3. జయించు: చూ,విజయమునొందు.

గెలుపము. దే. వి: చూ, విజయము, 1.

గెలుపు. దే. వి. (రూ-గెల్పు- గెలివిడి-గెల్విడి-గెలుపము) —పై.—

గెలుపుకాఁడు. దే.విణ. మేలుచేయి: చూ,విజయి.

గెలుపుకొను. దే. స. క్రి: చూ, గెలుచు. 3.

గెలుపుపేరుగలాఁడు. దే. వి. పార్థుఁడు. సాం. దే. 16: చూ, విజయుఁడు. 1.

గెలుపుబాసయొడయఁడు. ద్వ. వి. —పై.— వేం. ఆం. 19.

గెలువము. దే. వి. 1: చూ, రూ-గెలుపు; వా. వి. 2. (వ్యతిరేకమందు) జయము పొందనేరము. "పందెము గెలువము."

గెల్పు. దే. వి: చూ, రూ-గెలుపు.

గెల్పుకొను. దే. స. క్రి: చూ,రూ-గెలుపుకొను. అచ్చ. సుం. కాం. 160.

గెల్లి దే. వి. ఉప్పుపప్పు: చూ, లవణము. 1.

గెల్లు. వై. వి. కలకలము: చూ, స్వరము. 2.

గెల్విడి. దే. వి: చూ, రూ-గెలివిడి.

## గే

గేండుకము. సం. వి. అ. పుం. చెండు: చూ బంతి. 3.

గేంతువు. సం వి. ఉ. పుం. —పై.—

గేండూకము. సం. వి. అ. పుం. —పై.—

గేందుకము. సం. వి. అ. పుం: చూ, రూ-గేండుకము.

గేడెకాళ్లవాఁడు. దే విణ: చూ, కొంగకాళ్లవాఁడు.

గేదంగి. వై. వి. = కేతకి. రూ-గేదఁగి; పచ్చపూ మొగలి* (ఇది శివపూజకనర్హము): చూ, మొగలి.

గేదఁగి. వై. వి.= —పై.—

గేదె. దే. వి. 1. పొట్టిబఱ్ఱె: చూ, మహిషి; 2. బఱ్ఱె: చూ, మహిషి.

గేదెచెలప. దే. వి. మూఁడేండ్ల ఎనుపదూడ: చూ, మహిషి.

గేయము. సం. వి. అ. న. పాట; చూ,స్వరము.2; విణ. 2. పాడఁదగినది: చూ, సంగీతము; 3. పాడునది: చూ, సంగీతము.

గేయుఁడు. సం. విణ. గానముచేయువాఁడు: చూ, సీకారి.

గేరంజనము. సం. వి. అ. పుం. =: చూ, కేరజము.

గేలి. వై. వి.=కేళి: చూ, పరిహాసము.

గేలికొట్టు. ద్వ. స. క్రి. రూ-గేలికొను. పరిహసించు: చూ, వెక్కిరించు. 3.

గేలికొను. ద్వ. స. క్రి. —పై.—

గేష్ణువు. సం. వి.ఉ. పుం. 1: చూ, గేయుఁడు: 2. నటుఁడు: చూ, శైలూషుఁడు.

గేస్తు. వై. వి =గృహస్థః రూ-గేస్తుఁడు: చూ, గృహస్థు.

గేస్తుఁడు. వై. వి. = —పై.—

గేస్తురాలు. ద్వ. వి. (గేస్తు+అలు) ఇల్లాలు: చూ భార్య.

గేహము. సం. వి. అ. పుం, న. 1.=గీము. ఇల్లు: చూ, సదనము. 1; న. 2. పెండ్లాము: చూ, భార్య.

గేహావర్ణము. సం. వి. అ. పుం. ఎఱ్ఱనిగుఱ్ఱము: చూ, హయము.

గేహళి. సం. వి. ఈ. స్త్రీ. గడప: చూ, దేహళి

గేహి. సం. వి. న్. పుం: చూ, గృహస్థు.

గేహేనర్ది. సం. విణ. న్. ఇంటిలోనుండి ప్రగల్భోక్తులు పలుకువాఁడు: చూ, వక్త. 1.

గేహేశూరన్యాయము. పా. ఇంట్లో డంబములు కొట్టువాఁడే పనికిఁ బనికిరాఁడను విధము.

గేహేశూరుఁడు. సం. వి. అ. పుం: చూ, గేహేనర్ది.

## గై

గైంధార బ్రాహ్మణులు. పా: చూ, కపూరిగౌ బ్రాహ్మణులు. (చూ, బ్రాహ్మణులు.)

గైతి. సం. వి. ఈ. స్త్రీ. 1. సామవేదము: చూ, వేదము (చూ, ఉపవిద్యలు); 2: చూ, స్వర్గము.

గైతాల. పా. నేపాళదేశపు బ్రాహ్మణులలో నొక తెగవారు: చూ, బ్రాహ్మణులు.

గైరమ్మ. వా. వై. వి = గౌరి. రూ-గవరమ్మ "గైరమ్మసంబరము": చూ, పార్వతి. 1.

గైరి. సం. వి. ఈ. స్త్రీ. నీటిపిప్పలి*: చూ, శకులాదని. 2.

గైరికము. సం. వి. అ. న. జేగుఱురాయి: చూ, రాయి: 2. కాకిబంగారము: చూ, బేఁడ; 3. బంగారు: చూ, లోహము. 1.

గైరికాక్షము. సం. వి. అ. పుం. జలమధూకము* చూ, మధూకము.

గైరికుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, కిరాతుఁడు: 2. గానవిద్యావిశారదుఁడు: చూ, సీకారి.

గైరేయకము. సం. వి. అ. పుం: చూ, కారుపోఁక*.

గైరేయము. సం. వి. అ. న: చూ, సిలాజిత్తు.

## గో

గో. దే. అవ్య. చూపుటయందువచ్చును. "అదిగో, ఇదిగో." మొ.

గోంగ. దే. వి: చూ, శత్రువు.

గోంగడి. వై. వి.=కంబళి: చూ, రూ-గోంగళి (దేశ్యమని శబ్దరత్నాకరము)

గోంగడికాఁడు. దే. వి. ఒకానొకపక్షి: చూ, పక్షి.

గోంగడిపుఱుఁగు. వై. వి: చూ, కంబళిపురుగు.

గోంగళి. వై. వి=: చూ, రూ-గోంగడి (దే. అని శ. ర.)

గోంగళ్లునేయువాఁడు. ద్వ. వి: చూ, అజాజీవుఁడు. 2.

గోంజి. దే. వి. రూ-గొడ్డు-గొడ్డురాలు-గొడ్రాలు. ఆం, భా. ద్వి. వై. 263: చూ, వంధ్య. (చూ, స్త్రీ.)

గోంటరి. దే. విణ. (గోటు + అరి) కుత్సితుఁడు, కఠినుఁడు (అనికొందఱు) శశాం. 2, ఆ.116: చూ, వ్యాధుఁడు. 2 (స్వార్థమున అరి)

గోంటి. దే. విణ. దుష్టురాలు: చూ, వెంబర (చూ, స్త్రీ.)

గోంటు. దే. విణ. 1. దుష్టుఁడు స్వా. 4, ఆ. 14: చూ, వ్యాధుఁడు. 2; వై. వి; 2 =కుంఠః. కుత్సితుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 3 =కుంఠః. కుత్సితము: చూ, హీనము 1; 4. బఁదలేనివక్క: చూ, పోఁక.

గోంటుకాఁడు. ద్వ. విణ. కఠినుఁడు. "గోంటుకాఁడు మువ్వగోపాలరాయఁడు." క్షేత్రయ. (స్వార్థమున కాఁడు): చూ, వ్యాధుఁడు. 2.

గోంటుపోఁక. వై. వి: చూ, గోంటు. 4.

గోంట్రి. దే. వి. సీతానివృత్తి: చూ లాంగలము. 1.

గోండాట. వా. వి. (ఊపిరితిప్పుకొనుటకైనను తీఱికలేనంత) పని: చూ, గోఁజాటు.

గొండిలి. వై. వి. = క్రీడ. రూ-గొండి-గొండ్లి. 1. కుండలాకార నృత్యము: చూ, వ్యంజకము. 1; 2. ఆట,నృత్యము: చూ, వ్యంజకము. 1; 3. క్రీడ: చూ, విలాసము. 1; 4. నర్తకి: చూ, శైలూషి.

గొండీలు. వై. వి. బ. ఒకానొక నతి: చూ, నమస్కారము.

గొండెము. దే. వి. తలుపుచిలుకు. రూ-గొండ్లెము- గొల్లెము- గొళ్లెము. అచ్చ. బాల, కాం. 21: చూ. విష్కంభము 2.

గొండ్లి. వై. వి.=: చూ, రూ-గొండిలి (నృత్యము.-వసు. 1, ఆ. 104.)

గొండ్లెము. దే. వి: చూ, రూ-గొండెము.

గొంతి వై. వి.=కుంతి రూ-గోతి. 1. పాండురాజుభార్య: చూ, కుంతి. 1; 2. ఆఁడుది: చూ, స్త్రీ.

గొంతు. వై. వి. 1.=కంఠము. రూ-గొంతుక: చూ, మెడ (దేశ్యమని శబ్దరత్నాకరము): 2. కంఠధ్వని. "నీగొంతువిని వచ్చితిని": చూ, స్వరము. 2; 3 కుక్కుటాసనము. "గొంతు కూర్చున్నాఁడు." (మా. కుక్కుటము. 9): చూ, ఆసనములు.

గొంతుక. వై. వి.=కంఠము. —వై.— (దేశ్యమని శబ్దరత్నాకరము.) (కంఠధ్వని.—"నీకు అంతగొంతుక యెందుకు")

గొంతుకపోఁక. ద్వ.వి.గొంతుముడి: చూ, ముడి 5.

గొంతుమాలు. దే. వి. మల్లశాస్త్రము నందలి విన్నాణములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, విన్నాణములు.

గొంతుముడి. దే. వి కంఠమణి: చూ, ముడి 5.

గొంతెమకోర్కెలు. జా. అలభ్యమైన కోర్కెలు. "కొసరి గొంతెమ కోరికల్ గోరనేని." పాండు. 4, ఆ. 165.

గొంతెమగోరు. దే. వి. (గొంతెమ + కోరు): చూ,లంజెసవరము*. (లంజెసవరము - సవరపు తీఁగెసమూలము.చిలుకఁగొట్టిన 'కార్బన్ డైసల్ఫైడ్', వాసనవేయును. దీనితో పరిశారణీతైలము చేయుదురు.)

గొంతెమ్మ. జా. వి. (పంచమజాతివారుపూజించు) ఒకానొక గ్రామదేవత: చూ, మహాలక్ష్మి. 3. (గొంతేసమ్మ - గొంతేలమ్మ అనియు నందురు.)

గొందు. దే వి. 1. మూల: చూ,విదిక్కు; 2.పర్వతముయొక్క అత్యల్పకోణము: చూ విదిక్కు.

గొంల్లి. వై. వి=రూ-గొండ్లి: చూ, రూ-గొండిలి. (శు. పా.)

గొగ్గి. దే వి. 1. కిరీటము. ఆం, భా. ద్వి. 204: చూ, శీసకము. 1; 2. అరమ్యమాణిక్యము: చూ, రత్నము. 1; విణ. 3. ఎచ్చుతక్కువైనది. "గొగ్గిపండ్లు." ము: చూ, కొక్కి.

గొగ్గిటు. దే. వి. బర్బరత్వము.

గొగ్గిపండ్లవాఁడు. దే.వి: చూ, మిడిపండ్లవాఁడు. ఆం, భా. ద్వి. 121.

గొజ్జంగ. వై.వి =కుబ్జిక. పన్నీరుపూలచెట్టు (అని వావిళ్ల)*. కళా. 3, ఆ. 249: రూ-గొజ్జెఁగి- గొజ్జెగి- గొజ్జెఁగ- గొజ్జఁగ-గోజంగి- గోజఁగి; (సం. ప.):—కంటకాఢ్యము. కుబ్జిక.

గొజ్జఁగ. వై. వి.=—వై.—

గొజంగి. వై. వి.=—వై.—.

గొజు. దే. వి. ఇగిరిన పులుసుకూరగ లోనగునది (ఆం. పద. పా.)

గొజ్జంగి. వై వి=: చూ, రూ-గొజ్జంగ. ఆం భా. ద్వి. 52.

గొజ్జెగినీరు. వై. వి. పన్నీరు: చూ, సలిలము.

గొజ్జెగిపువ్వు. వై. వి: చూ, పన్నీరుపువ్వు.

గొజ్జెగ. వై. వి =: చూ, గొజ్జంగ. స్వా. 3, ఆ. 84.

గొజ్జఁగిఁ(బ్రా)లు. ద్వ. వి. ఒకరకము వడ్లు: చూ, ధాన్యము.

గొటగొట. దే. వి. గోండ్రించుట లోనగువాని యందగు ధ్వన్యనుకరణము. సా. 1, ఆ. 68: చూ, హలాహలా.

గొట్టము. దే. వి: చూ, ఊఁదుఁగో్రవి.

గొట్టాలమ్మ. వా. వి. కలరాదేవత: చూ, మహాలక్ష్మి. 3.

గొట్టి. దే. వి: చూ, నమ్మకుంప*.

గొట్టికాండ్రు. దే. వి. బ: చూ, వేగువాఁడు.

గొట్టు. దే. వి. 1: చూ, శత్రువు. రా, వి 8, ఆ.8; 2: చూ, వ్యళీకము. 2; విశ. 3. కఠినము: చూ, బెడిదము: 4. దుర్లభము: చూ, వెక్కసము. 3; 5. చెడ్డది: చూ, దుష్టము.

గొట్టె. వై వి.=ఘోంటజటి*: చూ, రేఁగు.

గొట్లియ. వై. వి.=ఘోంటా. రూ - గొల్లె బదరి*: చూ, రేఁగు.

గొల్లె. వై. వి.=—పై.—

గొణఁగు. దే. స. క్రి. మాట వెడలనీక నోటనె గొణగొణయను: చూ, రూ—గొణఁగు.

గొడగ. వై.వి =కూటకమ్. ఏఁడికోలలేనివాఁగలి, గొణగ, దుంప: చూ, లాంగలము. 1.

గొడగర. దే. వి. రూ—గొడగరి. చెప్పులుకుట్టి జీవించెడు జాతి: చూ, మాదిగ.

గొడగరవాఁడు. దే. వి. రూ—గొడగర-గొడగరి-గొడారి గొడారివాఁడు-గోదలి: చూ, మాదిగ.

గొడఁరి. దే. వి (గొడగర + ఇ)—పై.—

గొడవ. దే. వి. 1. ఆపద. స్వా. 4, ఆ. 68: చూ, విపత్తు; 2. వగ స్వా. 5, ఆ. 13: చూ శోకము; 3. కలఁత: చూ, సంతాపము; 4. అడ్డు: చూ, నిరోధము. 1; 5. తప్పు: చూ, నేరము; వా. వి. 6. కలహము: "వారి యింటిలోని గొడవ వినలేము": చూ, యుద్ధము.

గొడసాల. దే. వి: చూ, దేవగంధ* (గోడపాల అని కొందఱు)

గొడారి. దే. వి: చూ, రూ—గొడగరి.

గొడారివాఁడు. దే. వి. —పై.—

గొడిగ. వై. వి.=గుడికా. గులకఱాయి: చూ, రాయి.

గొడిగట్టు వా. వి. 1. నిట్రాడు; 2. పనికిమాలినవాఁడు.

గొడియ. దే. వి. అందలముయొక్క ఒకానొక అవయవము: చూ, రూ—గొడె.

గొడివె. దే. వి. 1. కష్టము: చూ, శోకము; 2. ఆపద, ఉపద్రవము (అనికొందఱు): చూ, విపత్తు.

గొడుగు. దే. వి. రూ—గొడువు: చూ, వారిత్ర*

గొడుగుగడ్డి. దే. వి. గుర్రిడ్డికామంచి*: చూ, తృణము. 1.

గొడుగుపావలు. ద్వ. వి. బ. గొడుగువలెనుండు పాదరక్షలు: చూ, పాదుక.

గొడుగుబల్ల. దే. వి. 1. తలుపుమీఁది కుబుసము ఆఠిగెడు పట్టె; 2. ద్వారముమీఁదిచెక్క.

గొడుగుమెట్లు. దే.వి. బ. వాటము పెట్టి ఓరలు సన్నగాఁ దీర్చిన వెడలుపుమెట్లు.

గొడువు. దే. వి: చూ, రూ—గొడుగు.

గొడె. దే. వి: చూ, రూ—గొడియ. రా. వి. 2, ఆ. 48.

గొడ్డ. దే. వి 1. బిఱుసు: చూ, బెడిదము: వా. వి. 2. కోపము 'నామీఁద నీకింతగొడ్డ యేల?': చూ, రోషము; దే. వి. బ. 3 బిరుసుమాట. రా. వి. 1, ఆ. 54: చూ, శబ్దము. 2; విశ. 4 బిఱుసైనవాఁడు: చూ, వ్యాధుఁడు. 2.

గొడ్డగము. వై. విశ.=కుట్టక. బాధకము: చూ, హింసితము.

గొడ్డతనము వై. విశ. మూఢత్వము.

గొడ్డలి. వై. వి.=కుఠార: చూ, ముద్గరము.

గొడ్డు. దే. వి. 1. గొడ్రాలితనము; 2. (ఈనిన పశువు) ఆవు (లేక) గేదె: చూ, వంధ్య.3*

(చూ, ధేనువు); 3. గొడ్రాలు: చూ, వంధ్య: (చూ, స్త్రీ); 4. పశువు. శై. 6, ఆ. 265: చూ, మృగము. 1; విశ. 5. ఉరిక్త: చూ, శూన్యము. 1; (గొడ్డంబలి = నూకలు లేని యంబలి; ఇట్లు గొడ్డుబావ గొడ్డుసంకటి: గొడ్డేఱు.=నీళ్లు లేని యేఱు; గొడ్డుచెట్టు = ఫలములేని చెట్టు ఇత్యాదులు.)

గొడ్డుఁగాఁకర. ద్వ. వి. (గొడ్డు + కాఁకర) కర్కోటకి *: చూ, సుషవి. 1.

గొడ్డుఁబోఁతు. దే. విశ. (గొడ్డు + పోతు): చూ, నిష్ప్రయోజనుఁడు.

గొడ్డుమాఱు. ద్వ. విశ. అవకేశి: చూ, వృక్షము.

గొడ్డురాలు. దే. వి. (గొడ్డు + ఆలు) రూ-గొండ్రాలు, వంధ్య: చూ, స్త్రీ.

గొడ్డువోవు. దే. అ. క్రి. (గొడ్డు + పోవు) పొల్లవోవు. లక్ష్మీ. 4, ఆ. 135: చూ, వ్యర్థమగు; 2. పాయసహీనమగు: 3. గొడ్రాలగు. శై. 6, ఆ. 115.

గొడ్డేఱు. దే. వి. (గొడ్డు + ఏఱు). 1. నీళ్లులేని యేఱు: చూ, నది; స. క్రి. 2. గుత్తయెత్తు.

గొడ్రాలు. దే. వి: చూ, రూ- గొడ్డురాలు. పాంచు. 3, ఆ. 223.

గొడ్రాలు బిడ్డ కుట్టే మెఱుఁగును. లో. ఉదా.- "క. లోలతవిటుఁడయినం దా, నేలాతల్లుల సృజించు నిటువేశ్యలనుం, గీలెఱుఁగక చెఱిచెను విధి, కూళయి గొడ్రాలుబిడ్డ కుట్టే మెఱుఁగున్." వైజ. 3, ఆ. 126.

గొణఁగు. దే. అ. క్రి: చూ, రూ-గొడఁగు.

గొణగ. వై. వి. = కూటకమ్: చూ, రూ- గొడగ.

గొణగొణ. దే. వి. గొణఁగుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

గొణగొణలాడు. దే. అ. క్రి. గొణగొణయను.

గొణిగలు. దే. వి. ఒకానొకనతి: చూ, నమస్కారము.

గొణిజె. దే. వి. తలుపుగ్రంథి తగిలించెడి యినుపచీల: చూ, రూ-గొణిద.

గొణిస. దే. వి. —వై.—

గొణెము వా. వి: చూ, రూ-గొండెము.

గొశుప్ర. దే. వి నీలమణి విశేషము. అం, భా. ద్వి. వై. 278: చూ, రత్నము. 1.

గొత్రడి. దే. వి: చూ, రూ కొత్రడి (అం. పద పా.)

గొత్తు. దే. వి. 1. వెన్న మొదలగునవి పాసిపోయినకంపు: చూ, వాసన; వై. వి. 2. = గుచ్ఛము: చూ, పూగుత్తి.

గొద. వై. వి. 1. = క్షుధ. ఆఁకలి: చూ, బుభుక్ష; 2. కోపము: చూ, రోషము. (దేశ్యమని శబ్దరత్నాకరము.)

గొదకొను దే. అ. క్రి. అతిశయించు. కళా. 7, ఆ. 117: చూ, ముమ్మరించు: 2. త్వరపడు: చూ, సంభ్రమించు; 3: చూ, విజృంభించు.

గొదగొద. దే. వి పగ: చూ, విరోధము. 1.

గొదాము. దే. వి. ధాన్యాదుల నిలవఁజేయు పెద్దయిల్లు (అం గొడౌన్.): చూ, పంటసాల (చూ, సదనము. 1.)

గొనకొను. దే. అ. క్రి: చూ, యత్నించు. భార. శాం. 3, ఆ. 211-212. (ప్రే. గొనకొలుపు.)

గొనను. దే. వి: చూ, వామనుఁడు

గొనప. దే. వి. 1. రూ-గొనమ. అఱిగిననాఁగలి: చూ, లాంగలము. 1; విశ. 2. పొట్టి: చూ, హ్రస్వము; 3: చూ, వామనుఁడు.

గొనపు. దే. వి: చూ, రూ-గునుపు.

గొనబ. దే. వి: చూ, వామనుఁడు.

గొనబు. దే. వి. రూ-గొనము-గోవ, 1. మనోజ్ఞత: చూ, హృద్యము; విశ. 2. మనోజ్ఞము: చూ, హృద్యము; వై. వి. 3 =గుణ. రూ-గొనము: చూ, స్వభావము.

గొనబుకాఁడు. దే.విణ: చూ, సౌందర్యవంతుఁడు.

గొనబుపాట. దే. వి. సంచుపాట: చూ. స్వరము. 2

గొనపు. దే. వి: చూ రూ-గొనప. (ఇట్లు మకారోపధముగాఁ గొందఱు).

గొనము. వై. వి.=గుణః. 1. మడుఁగు: చూ రెట్టి: 2. రూ-గొనయము: చూ. మౌర్వి. 1; 3. శౌర్యాదిగుణము: చూ. గుణము. 12.

గొనయము. వై. వి. 1.=గుణః. వింటినారి: చూ. మౌర్వి. 1; 2 అటని: చూ, వింటినారి (రూ-గనయము.)

గొనిసె. దే వి: చూ, వామనుఁడు.

గొనుగు. దే. వి. రూ-గొలుగు*: చూ, పీలువు.

గొప్ప. దే. వి. 1. అధికము: చూ, హెచ్చు. 1; 2. పెద్ద: చూ, విపులము; వా. 3. గౌరవము: చూ, సన్మానము; 4. స్థితికిమించిన వేషము: చూ. డంబము. 2

గొప్పగోడులు. జా. గొప్పతనమును కొద్దితనమును. (కొద్దితనము=ఏకువు అని కొందఱు.)

గొప్పతనము. దే. వి: చూ, యోగ్యత.

గొప్పగుడారము. ద్వ. వి. మహాపటగృహము. ఆం. భా. ద్వి. 159: చూ, సదనము 1.

గొప్పచేయు. దే. స. క్రి: చూ, సన్మానించు.

గొప్పదెబ్బ వా. వి. పెద్దదెబ్బ; పెద్దఆపత్తు: చూ, విపత్తు.

గొప్పబొజ్జలాఁడు. ద్వ. వి: చూ, వినాయకుఁడు.1.

గొప్పబొజ్జమెకము. ద్వ. వి. ఏనుఁగు: చూ, హస్తి.

గొప్పమెయిపోఁడ. ద్వ. వి: చూ, వినాయకుఁడు. 1. (వేం. ఆం. 61.)

గొప్పగజ్జమెకము ద్వ. వి: చూ, గొప్పబొజ్జమెకము. సాం. లక్ష్య 2.

గొప్పలు. వా. వి. బ. డంబములు: చూ, బడాయి. 4.

గొప్పవాఁడు దే. విణ అధికుఁడు: చూ, హేమాహేములు.

గొప్పుత్రిప్పు పనిముట్లు. పా. తొల్లిక, కుచ్చిక, త్రిశూలము, చిన్నగార్ధాళికము, గుద్దలి, గార్ధాళికము, పండ్లగుద్దలి, దంతి మొదలగునవి.

గొప్పులు. దే. వి. బ. 1. పగిసుడిలోని కొద్దికొద్ది మెరక భాగములు; వై. వి.బ. 2 =గోపానసీ. పెండెలుజాతిరాక ముంజూరుసంజ్ఞత్తుగా నమర్చినపట్టె.

గొబ. వై. వి. 1.=కోణ. గొంది, మూల: చూ, విదిక్కు; 2.=గుహా: చూ, పణఁకు.

గొబడి. దే. వి ఒకానొక పక్కి: చూ, పక్షి.

గొబ్బండు. దే. వి. (గొబ్బ + పండు) పెద్దపండు. పాండు. 1, ఆ. 118: చూ. ఫలము. 1.

గొబ్బరము. దే. వి. ఎరువు: చూ, పిడక.

గొబ్బి. దే. వి. 1. రూ-గొలిమిడి-గొల్మిడి-నీరుగొబ్బి-ముల్లుగొలిమిడి) ఇక్షుగంధము*: చూ, ముగిబీర.(వీర్యవృద్ధికి మంచిది): 2.ధనుర్మాసపు దినములలో సాయంకాలముల ముందు గడపలకు ముందు బాలికలుపాటలుపాడి చేతులుతట్టుచుఁ జుట్టివచ్చి జేరపించెడు నొకానొక వేడుక: చూ, వేడుక. 5; 3. సమర్తాడినపుడు బాలికలు పాటలుపాడి చేతులుతట్టుచుఁ జుట్టివచ్చి జేరపించెడు నొకానొక వేడుక: చూ, వేడుక. 5.

గొబ్బికొయ్యలు. దే.వి. ఒకరకమువడ్లు. హంస.5, ఆ. 128: చూ, ధాన్యము.

గొబ్బిళ్లు. దే. వి. బ. 1: చూ, బాలక్రీడ. భో 7, ఆ. 39; 2: చూ, బాలికాక్రీడ. 3. నతి: చూ, నమస్కారము; 4. నతి విశేషము: చూ. నమస్కారము. 5 గొబ్బిళ్లపాట: చూ, స్వరము 2.

గొబ్బున. దే దృ. క్రి. విణ. 1. శీఘ్రముగా: చూ, వేగము. 3; 2. సహసార్థకము.

గొయ్యి. దే. వి. రూ-గోయి. పల్లము: చూ, రంధ్రము. 1.

గొరంకి. వై. వి =గోరంకు.(రూ-గొరక-గొరవంక-గొరవక-గొరువంక-గోరువంక-గోర్వంక-గోరింక-గోరక-గోరిక-గోర-గొరంక-గొరఁకి-గోరంకి-గోరింక): చూ, శారిక.

గొరక. వై. వి. 1. = ఖురాలక. నారసము. స్వా 4, ఆ. 45: చూ, బాణము. 1; 2. =ఖురాలక. అల్పాగ్రంతము. ఆం, భా. ద్వి. 217: చూ, బాణము. 1; 3 =ఖురాకము. ఒకానొకమృగము: చూ, మృగము.1; 4.=గోరంకు: చూ, రూ-గొరంకి.

గొరకకట్టె. వై. వి.=ఖురాలకః. 1. నారసము: చూ, బాణము. 1; 2. అల్పకుంతము: చూ, బాణము. 1; 3. అలుఁగువేసిన చేతికఱ్ఱ: చూ, బాణము. 1.

గొరగ. దే. వి. మైలారును గొలిచెడి యొకానొక మతస్థుఁడు.

గొరగొర. దే. వి. శీఘ్రము: చూ, వేగము. 3.

గొరవంక. దే. వి. రూ-గొరంకి: చూ, శారిక.

గొరవంకతెగడణి. ద్వ. వి: చూ, మన్మథుఁడు.

గొరవక. దే. వి: చూ, గొరవంక.

గొరిజె. వై. వి. 1.=ఖుర (రూ-గొరిసె-గొరిజె-గొరిజియ) పశువుకాలిగిట్ట: చూ, వింఖము; 2. రూ-గొటిజె. డేరా: చూ, సదనము. 1.

గొరిజియ. వై. వి.=ఖుర: చూ, రూ-గొరిజె. 1

గొరిజె. వై. వి.= —వై.—

గొరిసె. వై. వి. = —వై. —

గొరిసెగాలి. ద్వ. వి. పశువుల గొరిసెలనడుమ పుండై పురుగుపడెడి వ్యాధి: చూ, పశురోగము.

గొరుగు. దే. వి: చూ, రూ-గొలుగు *.

గొరువంక. దే. వి: చూ, రూ-గొరంకి.

గొఱకు. వై. విశే.=ఖుల్లకః. నీచుఁడు. లక్ష్మీ 4, ఆ. 86: చూ, హీనుఁడు.

గొఱగొఱ. దే. వి. ఒకానొక ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

గొఱపము. వై. వి. = కురప. 1. గుఱ్ఱమును దోమెడు సాధనము: రూ-కొఱపము-కొడపము-గోఱపము (సం. ప)—కరఫలము, కేశకారము; 2. అర్ధచంద్ర బాణము. రూ-కొఱపము: చూ, బాణము. 1. (ఇట్లు సరళాదిగాఁ గొందఱు.)

గొఱపోతు. దే. వి: చూ, రూ-గురపోతు.

గొఱిజె. వై వి: చూ, రూ-గొరిజె. 2.

గొఱియ. వై. వి.=ఖురీ. రూ-గొఱె-గొఱ్ఱియ-గొఱ్ఱె. సాంబ. తి. 6: చూ, మేషము. 1.

గొఱియలనూఁడు. ద్వ. వి: చూ, వృకము.

గొఱుగు. దే. స. క్రి: చూ, కోఁగు. 2.

గొఱుగుట. దే. వి: చూ, కోఁగుట.

గొఱె. వై. వి. = :చూ, రూ-గొఱియ.

గొఱ్ఱియ. వై. వి. = —వై.—

గొఱ్ఱు. దే. వి. 1: చూ, గుంటక; 2. ముప్పది రెండుకుంటల కొలఁది: గొఱ్ఱిసేల.

గొఱ్ఱె. వై. వి.=: చూ, రూ-గొఱియ.

గొఱ్ఱెనుచ్చు. ద్వ. వి. గొఱ్ఱెపెంటిక: చూ, మలము. 1.

గొఱ్ఱెపాలు. ద్వ. వి. అవిక్షీరము: చూ, పాలు. 1.

గొఱ్ఱెలమంద. ద్వ. వి. గొఱ్ఱెలగుంపు: చూ, మేషము. 1.

గొఱ్ఱిసేల. దే. వి: చూ, గొఱ్ఱు. 2.

గొల. వై. వి. = : చూ, గెల. పా. 2, ఆ. 69.

గొలక. వై. వి. 1. = కలకలము. రూ-గొల్ల-గోల: చూ, స్వరము. 2; దే. వి. బ. 2. తాటిచేన్నులు. (గులకలనియు.)

గొలకు. వై. వి. = కలకలము. సేనాదుల కలకలము. ఆం, భా. ప్ర. 121: చూ, స్వరము. 2.

గొలగొల. వై. వి.=కలకల. 1. కలకలము: చూ, స్వరము. 2; 2. ధ్వన్యనుకరణము. స్వా. 5, ఆ. 75: చూ, హూహూ; 3. ధ్వని: చూ, స్వరము. 2.

గొలిమిడి. దే. వి. రూ- గొల్మిడి *: చూ, గొబ్బి 1.

గొలివె. దే. వి. 1. గొలివెగడ్డి *: చూ, తృణము. 1; బ. 2. తృణధాన్యము: చూ, ధాన్యము.

గొలుగు. దే. వి: చూ, రూ-గొనుగు *.

గొలుసు. దే. వి. 1. మెడను వ్రేలాడు హారము లోనగునది. (నగ), లలంతికావిశేషము: చూ, భూషణము. 2; 2. చేతినగ: చూ, భూషణము. 2; 3. కాలినగ. చూ, భూషణము. 2; 4. కొప్పునగ: చూ, భూషణము. 2; 5. (ఏనుఁగు లోనగువాని కాలికిగట్టెడు) నిగళము: చూ, శృంఖలము. 2; 6. సంకెల: చూ, శృంఖలము. 3; పా. 7. (భూమిని కొలుచు) గొలుసు: చూ, కొలత; 8. ఖైదువాని చేతులసంకెల; 9. ఖైదువానికాలిసంకెల, బొండ (అనికొందఱు); 10. రెండు ధూమశకటములను సంధానముచేయు సంకెల; 11. గడియారపు గొలుసు; ఇత్యాదులు.

గొలుసుపట్టె. పా. ఏఁడికోలుబదులు త్రాళ్లతో గాని గొలుసుతో గాని లాగించు నొక పనిముట్టు: చేదుసుపట్టె.

గొలుసుమోడి. దే. వి. 1. కలిపివ్రాఁత; 2. కలిపి వ్రాసిన సంతకము: చూ, సంతకము. (గొలుసుకట్టువ్రాఁత అనియు.)

గొల్మిడి. దే. వి: చూ, రూ-గొలిమిడి *.

గొల్ల. వై. వి. 1.=గోపాలః: చూ, మహాశూద్రుఁడు; 2. =గోపాలః గొల్లజాతి. (గొల్లవాఁడు-గొల్లది); దే. వి. 3. ద్వారపాలకుఁడు: చూ, ప్రతిహారుఁడు; 4. ధనపాలుఁడు: చూ. శ్రీదుఁడు.

గొల్లఁడు. వై. వి. =: చూ, రూ-గొల్ల. 1.

గొల్లకావిడిచుక్కలు. వా. వి. బ: చూ, పాలకావిడి చుక్కలు.

గొల్లకిలారి. ద్వ వి: చూ, గొల్ల. 1.

గొల్లకీలారి. ద్వ. వి. —వై.—

గొల్లజిడ్డు ద్వ. వి: చూ, శూలిని *.

గొల్లత. వై. వి.=గోపాల. వ్రేఁత: చూ, మహాశూద్రి.

గొల్లది. వై. వి. = —వై.— (రూ. గొల్లత-గొల్లెత.)

గొల్లదొందు దే. వి గొల్లదొందను చేఁప: చూ, మత్స్యము 1.

గొల్లపల్లె ద్వ. వి. రూ-పల్లియ-పల్లె-పాలెము. వ్రేపల్లె: చూ, దేశము.

గొల్లము. వై. వి.=ఖలః. 1. లోఁతుగల పల్లము. ఉ, హరి. 5, ఆ. 306: చూ, రంధ్రము. 1; 2. మిక్కిలి పల్లపుప్రదేశము, బాడువ: చూ, భూమి 1.

గొల్లవాఁడు. ద్వ. వి: చూ, గొల్ల. 1.

గొల్లియన. దే. వి. రూ-గొల్లెన. గుడారము. అల్పపటగృహము (అని కొందఱు): చూ, సదనము. 1.

గొల్లు. వై. వి.=కలకలము. గుంపునఁ బుట్టిన పెద్దమ్రోఁత: చూ, స్వరము. 2.

గొల్లెత. వై వి.=: చూ, రూ-గొల్లత.

గొల్లెన. దే. వి: చూ, రూ-గొల్లియన.

గొల్లెనబండి. దే. వి. గాడీ. కై. 2, ఆ. 113: చూ, శకటము. 1.

గొవరు. దే. వి: చూ, సంతాపము.

గొవగువోవు. దే. అ. క్రి: చూ, సంతాపించు.

గొవారు. దే వి. ఉపద్రవము. సా. 2, ఆ. 180: చూ, శోకము.

గొల్లి. వై. వి. రూ-గొంల్లి: చూ, రూ-గొండిలి.
గొల్లెము. వా. వి: చూ, రూ-గొండెము.

## గో

గో. ... అవ్య: చూ, రూ-గో.

గోండము. సం. వి. అ. పుం. గోండదేశము: చూ, దేశము.

గోండుఁడు. సం. వి. అ. పుం. 1. పామరజాతి వాఁడు. విణ. (అని కొండ లు): చూ, హీనుఁడు. 3; విణ. 2: చూ, తుందిలుఁడు. 2.

గోండ్రించు. దే. అ. క్రి. 1. (పులి) కూయు: చూ, శబ్దించు; 2. (ఎలుఁగు) కూయు: చూ, శబ్దించు.

గోండ్రిలు. దే. అ. క్రి. -పై.- (రూ-గోండ్రిల్లు.)

గోండ్రిల్లు. దే. అ. క్రి. —పై.—

గోండ్రు. దే. వి. అంగలార్పుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హాహాహా.

గోండ్రుకప్ప. దే. వి: చూ, గోఁదురు.

గోంబు. సం. వి. ఉ. న: చూ, గోమూత్రము.

గోఁకు. దే. స. క్రి. 1. రూ-గీఁకు: చూ, అక్కు; 2. గీఱు: చూ, ఛేదిల్లు. 1.

గోఁకుడు. దే. వి. పాలుకాఁచినపుడడుగున నంటుకొనిన దానిసత్వము: చూ, మడ్డి. 2.

గోఁకుడుపాఱ. దే. వి: చూ, దోఁకుడుపాఱ

గోఁగు. దే. వి. రూ-గోఁగు*: చూ, మ్రాకు ద్రుమము. ఇది ద్వివిధము.— ఊరగోఁగు, కొండగోఁగు అని. ఇదియె ఊరగోఁగు. (మఱియు.—గుట్టగోఁగు, ఎఱ్ఱగోఁగు. గాడగోఁగు, దనాసరగోఁగు. పుల్లగోఁగు, మెట్టగోఁగు మొ.)

గోఁగుట. దే. వి: చూ. రూ-కోఁగట.

గోఁచి. వై. వి. = కచ్ఛ-కచ్ఛేదము: చూ, బొట్టము. (దేశ్యమని శబ్దరత్నాకరము.)

గోఁచికట్టు. దే. వి. బ్రహ్మచారి. పాండు. 5, ఆ. 285: చూ, వటువు.

గోఁచికాఁడు. దే వి. 1. —పై.—; విణ. 2: చూ, నిర్ధనుఁడు.

గోఁచిపాఁతరాయఁడు దొంగలమిండఁడు. లో. ఉదా.—"ఆ. పేర్మినదరుగుండెపిక్క చెదురులేక, నుండవచ్చుఁ బేదయాలుకుఁదక్క, రమణ గోఁచిపాఁతరాయఁడు దొంగల, మిండఁడనెడు మాటమేలు దెలిసి." కుచేలోపాఖ్యానము.

గోఁచిబాఁపడు. ద్వ. వి: చూ, వటువు.

గోఁజాటు. దే. వి. గోఁజాడుట: గొండాటు, గోఁజు.

గోఁజాడు. దే. స. క్రి. (గోఁజు + ఆడు) పీడించియడుగు: గోఁజు.

గోఁజు. దే. వి. 1: చూ, బందన; 2: చూ, గోఁజాటు; స. క్రి. 3: చూ, గోఁజాడు.

గోఁటు. దే. వి. 1. కోకయంచున చేర్చి కుట్టెడు సన్ననిసరిగపట్టె: చూ, పట్టె. 7; 2. ఒయ్యారము: చూ, విలాసము; 3. గీటు: చూ, రేఖ. 3; బ. 4. చేతినగ: చూ, భూషణము. 2.:

గోఁటుకత్తె. ద్వ. విణ. ఒయ్యారము గలది: చూ, స్త్రీ.

గోఁటుకాఁడు. ద్వ. విణ: చూ, సౌందర్యవంతుఁడు.

గోఁదు దే. వి. రూ-గోఁజు: చూ, బందన.

గోఁదురు. దే. వి. పెద్దకప్ప రూ-గోఁదురుకప్ప-గోండ్రుకప్ప: చూ. మండూకము. 1.

గోఁదురుకప్ప. దే వి. —పై.—

గోకంటకము. సం. వి అ. పుం. 1. ఏనుఁగుపల్లేరు *: చూ, పల్లేరు; 2. కాజి *: చూ, స్ఫుటు; 3. గోవులగొరిసె: చూ, విఁఖము.

గోకర్ణము. సం. వి. అ. పుం. 1. పాము: చూ, సర్పము; 2. కడఁతిమృగము: చూ, హరి

ణము. 1; 3. అడవియేనుఁగు: చూ, హస్తి; 4. మృగశీర్షము: చూ, నక్షత్రము. 1; 5: చూ. పదకుడు; 6. మృగయు: చూ, వేఁట. 3; 7: చూ. స్తోత్రము; 8. జేనెఁడు కొలఁతకు కొంచెము తక్కువ, జేత్త. ఎక్కువ (అనిత్రి కాండశేషము): చూ, లొడితిలి: 9. కంచరగాడిద: చూ, రాసభము; 10. ప్రమథగణవిశేషము: చూ, సమూహము; అం. 11. అథర్వణవేదమునందలి అవాంతరములలో నొకటి: చూ, అవాంతరములు (చూ, ఉపవిద్యలు): 12. కళలయిరువదినాలుగింటిలో నొకటి: చూ, కళలు.

గోకర్ణి. సం. వి. ఈ. స్త్రీ. చోఁగ*: చూ, స్రవ.

గోకర్ణిక. అం. ముఖరజ్జువు (వాగె) లు పదునాలుగింటిలో నొకటి: చూ, ముఖరజ్జువులు.

గోకిరటి. సం. వి. ఈ. స్త్రీ: చూ, గోరంకి.

గోకిరాటి. సం. వి. ఈ. స్త్రీ. —పై.—

గోకిరాటిక. సం. వి. ఆ. స్త్రీ. —పై.—

గోకిలము. సం. వి. అ. పుం. 1.=గోఁకలి: చూ, గోఁకలి; 2. నాఁగలి: చూ, లాంగలము. 1.

గోకీలము. సం. వి. అ. పుం. —పై.—

గోకుణికుఁడు. సం. విణ బుగద యొందున్న గోవును దీయ నుపేక్షించినవాఁడు, మెల్లకంటివాఁడు (అని కొందఱు): గోకులికుఁడు.

గోకులము. సం. వి. అ. న. ఆవులమంద: చూ, ధేనువు.

గోకులికము. సం. వి. అ. పుం. అడుసునఁబడిన యెద్దు. (గోగుణికము అనికొందఱు.): చూ, వృషభము. 1.

గోకులికుఁడు. సం. విణ. 1. కేకరుఁడు: చూ, మెల్లకంటివాఁడు; 2: చూ, గోకుణికుఁడు.

గోకృతము. సం. విణ. పేడ: చూ, పిడక.

గోక్షీరన్యాయము. పా. గేదెపాలైనను ఆవుపాలు కొంచెము కలిసినయెడల పవిత్రమగు నను విధము.

గోక్షీరము. అం. పంచగవ్యములలో నొకటి: చూ, గవ్యములు.

గోక్షురకము. సం. వి. అ. పుం. ఏనుఁగుపల్లేరు*: చూ, పల్లేరు.

గోఖురము. సం. వి. అ. పుం. —పై.—

గోఖురి. సం వి. ఇ. పుం. —పై.—

గోగండ. సం. వి. ఆ. స్త్రీ. కొండనాలుక*: చూ, రసన.

గోగంధనము. సం. వి. అ. పుం. 1. ఎదురుగాలి: చూ, వాయువు; అం. 2. వాయువులెనిమిదింటిలో నొకటి: చూ, వాయువులు.

గోగణము. సం. వి. అ. న. గరిండము: చూ, పిడక.

గోగుణికము. సం. వి. అ. పుం: చూ, రూ-గోకులికము.

గోగృష్టి సం. వి. ఇ. స్త్రీ అప్పుడే యీనుచున్న ఆవు: చూ, ధేనువు.

గోగోయుగ్మము. సం వి. అ. న. ఆవులజంట: చూ, ధేనువు.

గోగోష్ఠము. సం వి. అ. న. ఆవులదొడ్డి చూ, సదనము. 1.

గోగ్రంథి. సం.వి. ఇ. పుం. 1. పసులకొట్టము: చూ, సదనము. 1; 2. ఏఱుపిడక. (ఎనువు-ఎండిన ఆవుపేఁడ ఇంగుఁజేరును): చూ, పిడక; 3. ఎద్దునాలుక, బెండ*: చూ, వార్మిక. (ఒకానొక జంతువిశేషమని కొందఱు.)

గోఘృతము. సం. వి. అ. న. 1. ఆవునెయ్యి చూ, తైలము. 2; 2. ఇరాచరము: చూ, వడగల్లు; అం. 3. పంచగవ్యములలో నొకటి చూ. గవ్యములు.

గోఘ్నుఁడు. సం. వి. అ. పుం. అతిథి: చూ, విందు. 4.

గోచరము. సం. వి. అ. పుం. 1. ఇంద్రియార్థము: చూ, విషయము. 3. (గోవులు = ఇంద్రియములు. అవి వీనియందు సంచరించును); 2. విషయము. పంచభూతములు.—రూప, రస, గంధ, స్పర్శ, శబ్దములు: చూ, వ్యాపీకము; న. 3. పసులదొడ్డి: చూ, సదనము.1; విశే. 4. కనఁబడినది: చూ, దృష్టము. 2.

గోచరించు. సం. అ. క్రి: చూ, ప్రత్యక్షమగు.

గోచారము. సం. వి. అ. పుం. సూర్యాది గ్రహములయొక్క మేషాదిరాసుల సంచారము.

గోచారఫలము. పా. "శ్లో. జన్మే రసాయదశి సువర్ణమూర్తి । ర్ద్విపంచనందా రజితాఖ్యమూర్తిః । త్రిసప్తదిక్ష్వేవహి తామ్రమూర్తి । ర్గజార్క వేదేషుచ లోహమూర్తిః॥ తా.—జన్మరాశి మొదలు గ్రహప్రవేశరాశి 1-6-11 యయిన సువర్ణమూర్తి బహులాభముచేయును. 2-5-9 లు రజితమూర్తి శుభము నిచ్చును 3-7-10 లు తామ్రమూర్తి కొంచెము కష్టముఁజేయును. 8-12-4 లు లోహమూర్తి బహుకష్టములు గలిగించును.

గోజ. సం. వి. ఆ. స్త్రీ: చూ, గోలోమిక *.

గోజలము. సం. వి. అ. న: చూ, గోమూత్రము.

గోజాకరికము. సం. వి. అ. న, 1. మంగళము: చూ, శుభము. 1; 2 చూ, వాఁకుడు (రూ-గోజాగరికము.) *.

గోజాగరికము సం. వి. అ. న. —పై.—

గోజిహ్వా. సం. వి. ఆ. స్త్రీ. 1. ఎద్దునాలుక బెండ *. చూ, దార్వీక; 2. అధోపుష్పి*: చూ, బరివెంక.

గోజిహ్వక. సం.వి ఆ. స్త్రీ: చూ, గోజిహ్వా. 1.

గోజెంగి. వై. వి. = కష్టిక *: చూ, రూ-గోజెఁగి.

గోజెఁగి. వై. వి.=: చూ, గోజంగి.

గోటదొర్లుడుకాయ. దే. వి. బ: చూ, బాలక్రీడ.

గోటమీటుట. వా. నిర్లక్ష్యముగాఁజేయుట.

గోటాపన. వై. వి. 1.=గరుత్పర్ణ. పక్షియాఁక: చూ, ఱెక్క. 1; 2. ఎసకము: చూ, విజృంభణము.

గోటికాయ. వా. వై. వి.=గులి: చూ, బాలక్రీడ. (గోటిక్కాయ అనియు.)

గోటినాటులు. ద్వ. వి. బ: చూ, నఖక్షతము.

గోటినెలవంకలు. ద్వ. వి. బ: —పై.—

గోటినొక్కులు. ద్వ. వి. బ: —పై.—

గోడ. వై. వి. = కుడ్యము. (ఇటుకగోడ-మట్టిగోడ): చూ, మఱుఁగుగోడ.

గోడకాలు. ద్వ. వి. కోరడి: చూ, కరగోడ.

గోడగించు. దే. అ. క్రి. 1. మాటాడు. పా. 1, ఆ. 47: చూ, వచించు; 2. మొఱయు: చూ, శబ్దించు; స. క్రి. 3: చూ, తిరస్కరించు.

గోడచేర్పు. ద్వ. విశే: చూ, మూర్ఖుఁడు.

గోడదొలుక్కలపోడ. ద్వ. వి. ఎలుక: చూ, మూషికము.

గోడపురుగు ద్వ.వి. 1.నల్లి: చూ, మత్కుణము; వా.వి. 2. తేలు: చూ, వృశ్చికము; 3: చూ, బల్లి.

గోడము. దే. వి: చూ, రూ-గుడెము.

గోడలయందు చిత్రముల వ్రాయించుట. అం. శోభనములెనిమిదింటిలో నొకటి: చూ, శోభనములు.

గోడవాడము. దే. వి. జగడము. అం పదా. సర. 113: చూ, యుద్ధము.

గోడా. వై. వి. = ఘోటః. మగగుఱ్ఱము: చూ, హయము.

గోడాడు. దే. అ. క్రి. (గోడు + ఆడు) దుఃఖించు: చూ, స్రుక్కు. 5.

గోడి. దే. విశే. 1. అణఁగుడు; 2: చూ, వంకర.

గోడిగ. వై. వి. = ఘోటికా. ఆఁడుగుఱ్ఱము: చూ, హయము.

గోడిపట్టెలు. దే వి. బ: చూ, బాలక్రీడ.

గోడిపడు. ద్వ. అ. క్రి. (గోడి + పడు) 1. అణఁగు: చూ, క్రుక్కు. 4; 2. వంపగు: చూ, వంకరపోవు.

గోడిపెట్టు. దే. స. క్రి. (గోడి + పెట్టు) వంగించు: చూ, వంచు

గోడు. వై. వి.=క్రుష్ట! వగ, ఏడుపు (అని కొందఱు) ఆం, భా. ప్రి. 141: చూ, శోకము.

గోడుంబ. సం. వి. ఆ. స్త్రీ. గవాదని*: చూ, పెద్దపాఁపర.

గోడుంబిక. సం. వి. ఆ. స్త్రీ. —వై.—

గోడుపట్టె. దే. వి. గొలుసుపట్టెవంటి పట్టె.

గోడెము. దే. వి: చూ, రూ–గుడెము.

గోణము. వై. వి.=కౌపీనము. రూ–గోవణము–గోణాము: చూ, జొట్టము.

గోణముదారి. ద్వ. వి. సన్యాసి: చూ ముని. 1.

గోణాము. వై. వి.=కౌపీనము: చూ, రూ–గోణము.

గోణి. సం. వి ఈ. స్త్రీ. 1.=గోనె. రెండు చేటుల పరిమాణపు గోనెసంచి: చూ, సంచి; దే. వి. (1) ఎద్దు: చూ, వృషభము. 1.

గోతమాన్వయుఁడు. సం. వి. అ. పుం. శాక్యముని: చూ. బుద్ధుఁడు 1.

గోతము. దే. వి రూ–గోతాము. 1. జనపనార సంచి: చూ, సంచి; 2. మల్లులు సాదన కొఱకు ఱాళ్లునించియుంచుకొనెడు గోనె. స్వా. 4, ఆ. 3: చూ, సంచి; 3. ధనముంచు గోనె: చూ, సంచి.

గోతముఁడు. సం. వి. అ. పుం. గౌతమముని: చూ, ముని. 1.

గోతాము. దే. వి: చూ, రూ–గోతము.

గోతి వై. వి. = కాంత. ఆఁడుది: చూ, స్త్రీ. (శేక్యమని శబ్దరత్నాకరము. గోఁతి అని కొందఱు.)

గోతుంబ. సం. వి. ఆ. స్త్రీ. 1. పిన్నపాఁపర*: చూ, పాఁపర; 2: చూ, పుచ్చ*; 3: చూ, బుడమ*.

గోతుంబము. సం. వి. అ. పుం. గవాదనీఫలము.

గోత్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. నేల: చూ, భూమి. 1; 2. గోవులగుంపు: చూ, ధేనువు.

గోత్రజుఁడు. సం. విణ. గోత్రమునఁ బుట్టినవాఁడు.

గోత్రభిదుఁడు. సం. వి. ద్. పుం. ఇంద్రుఁడు; చూ, వేలుపుఱేఁడు.

గోత్రము. సం వి. అ. పుం. 1. కొండ: చూ, పర్వతము; 2. చక్రము: చూ, బండికల్లు; 3. పుడమి: చూ, భూమి. 1; 4. వేశ్యాగృహము: చూ, సదనము. 1; 5. ధనము: చూ, విత్తము. 1; 6. దారి: చూ, మార్గము. 1; న. 7. నామము: చూ, పేరు. 1; 8. గొడుగు: చూ, వారిత్ర; 9. అడవి: చూ, విపినము; 10. బలిమి: చూ, శక్తి. 1; 11. వరిమడి: చూ, భూమి. 1; 12. కులము: చూ, వంగడము; 13. వంశము, ఋషిసంతతి; చూ, ఋషిశ్రేష్ఠులు. (చూ, ప్రవరము. 1) విప్రులకు.—వంశములు 7. (ఇవి త్రివిధములుగ నున్నవి)

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|---|
| A. | కశ్యప | అత్రి | భరద్వాజ | విశ్వామిత్ర | గౌతమ | జమదగ్ని | వశిష్ఠ |
| B. | మరీచి | అత్రి | అంగిర | పులస్త్య | పులహు | క్రతువు | వశిష్ఠ |
| C. | కశ్యప | అత్రి | ఆంగీరస | కౌశిక | వశిష్ఠ | భృగు | అగస్త్య |

☞ C. క్రమము ననుసరింతము.—

1. కశ్యప = 1. కశ్యప (కాశ్యప). —ప్రవర.- (ఎ) కాశ్యప, అవత్సార, నైధ్రువ; (బి) కాశ్యప, అసిత, దైవల (దేవల); (సి) కాశ్యప, అవత్సార, అసిత;

2. శాండిల్య. (శండిల). -ప్ర.- (ఎ) దేవల (దైవల), అసిత; (బి) కాశ్యప, దేవల (దైవల), అసిత; (సి) కాశ్యప, అసిత, దేవల (దైవల); (డి) కాశ్యప, అవత్సార, నైధ్రువ, రే (ఫ) భ, రై (ఫ) భ, శండిల, శాండిల్య; (ఇ) శాండిల, అసిత, దైవల (దేవల); [నైధ్రువ;

3. నిధ్రువ. -ప్ర.- కాశ్యప, అవత్సార,

4. రేభ. -ప్ర.- కాశ్యప, అవత్సార, రైభ్య (రే (ఫ) భ, రై (ఫ) భ);

2. అత్రి = 1. ఆత్రేయ. -ప్ర - (ఎ) ఆత్రేయ, ఆర్చనాన, శ్యావాస్య; (బి) ఆత్రేయ, ఆర్చనాన, శ్యావాస్య, ధనంజయ, కానేన, వసుజాతసుమంగల, వామనకులజ, ఏకాదశార్షేయమున్నూ కలదు;

2. గవిష్ఠిర. -ప్ర.- ఆత్రేయ, గావిష్ఠిర, పౌర్వాతిథ;

3. అంగిరస = (ఇది ఆంగీరస(అ. గౌతమ)గణము, ఆంగీరస (అ. భారద్వాజ) గణము అని ద్వివిధము)ఆంగీరస(అ. గౌతమ) గణము.-

1. గౌతమ. -ప్ర.- ఆంగీరస, ఆయాస్య, గౌతమ;

2 ఉతచథ్య. -ప్ర.- ఆంగీరస, ఔతచాథ్య, గౌతమ; [గణ్య, గౌతమ;

3. రహూగణ. -ప్ర.- ఆంగీరస, రాహూ

4. సోమరాజక. -ప్ర.- ఆంగీరస, సౌమ్య రాజ, గౌతమ; [గౌతమ;

5. వామదేవ. -ప్ర.- ఆంగీరస, వామదేవ్య,

6. బృహదుక్థ. -ప్ర - ఆంగీరస, బార్హదుక్థ, గౌతమ;

7. ఋక్ష. -ప్ర.- ఆంగీరస, బార్హస్పత్య, భారద్వాజ, వాందన, మాతవచస;

8. కక్షీవత్తు. -ప్ర.- ఆంగీరస, ఔచథ్య, గౌతమ, ఔశిజ, కాక్షీవత్తు;

9. దీర్ఘతమ. -ప్ర.- ఆంగీరస, ఔచథ్య, దైర్ఘతమ;

10. పృషదశ్వ. -ప్ర.- ఆంగీరస, పార్ష (దశ్వ) తస్య, వైరూప (లేక) అ (ఆ) ష్టాదంష్ట్ర, పార్ష (దశ్వ) తస్య, వైరూ (ప) ప్య;

11. రథీతర. -ప్ర.-(ఎ) ఆంగీరస, వైరూప్య, పార్ష (దశ్వ) తస్య; (బి) అ (ఆ) ష్టాదంష్ట్ర, వైరూప్య (ప), పార్ష (దశ్వ) తస్య;

ఆంగీరస (అ. భారద్వాజ) గణము.—

12 భరద్వాజ (భారద్వాజ). -ప్ర.- ఆంగీరస, బార్హస్పత్య, భారద్వాజ;

13 అగ్నివేశ్య. —పై.— [మౌద్గల;

14. మౌద్గల్య. -ప్ర.- ఆంగీరస, భార్మ్యశ్వ,

15. శ (మ) రమర్షణ. -ప్ర.- (ఎ) ఆంగీరస, పౌరుకుత్స్య, త్ర (త్రా) సదస్య; (బి) ఆంగీరస, విష్ణువర్ధ, పౌరుకుత్స్య;

16. నితుందిల. -ప్ర.- ఆంగీరస, పౌరుకుత్స్య, త్ర (త్రా) సదస్య;

17. విష్ణువృద్ధ. —పై.—

18. పౌరుకుత్స. —పై.—

19. గార్గేయ (గర్గ) -ప్ర - (ఎ) ఆంగీరస, గార్గ్య, శై (న్య) న్య; (బి) ఆంగీరస, బార్హస్పత్య, గార్గ్య; (సి) భారద్వాజ, గార్గ్య, చ్యవన; (డి) ఆంగీరస, బార్హస్పత్య, భారద్వాజ, గార్గ్య, శై (న్య) న్య (లేక) ఆంగీరస, శై (న్య) న్య, గార్గ్య;

20. హారిత. -ప్ర - హారిత, అంబరీష, యౌవనాస్య (లేక) మాంధాతృ, అంబరీష, యౌవనాస్య;

21. పింగ. —పై.—

22. శంఖ. —పై.—

23. దర్భ. —పై.—

24. భైమగవ. —పై.—

25 కుత్స. —పై.—; ఆంగీరస, మాంధాత, కుత్స (అనియు వాడుక)

26. హారిత. -ప్ర.- ఆంగీరస, అంబరీష, యౌవనాస్య;

27. కణ్వ -ప్ర.- ఆంగీరస, అజామీహ్య, కాణ్వ (లేక) ఆంగీరస, ఘోర, కాణ్వ;
28. కపి -ప్ర - (ఎ) ఆంగీరస, ఉరుక్షయ (ఆగ్రయ, ఔరుక్షయ), ఆమహైవ (ఆమహీయవ); (బి) ఆంగీరస,ఆమహైవ (ఆమహీయవ), ఉరుక్షయ (ఆగ్రయ, ఔరుక్షయ);
29. స్వతంత్రకపి -ప్ర.- (ఎ) ఆంగీరస, స్వతంత్రకపి, ఆమహైయ (ఆమహీయవ); (బి)ఆంగీరస, ఆమహైవ (ఆమహీయవ), ఉరుక్షయ (ఆగ్రయ, ఔరుక్షయ);
30. శౌంగశైశిర. -ప్ర.- ఆంగీరస, బార్హస్పత్య, భారద్వాజ, కాత్య, ఆత్కీల (లేక) భారద్వాజ, కాత్య, ఆత్కీల.
31. సంకృతి. -ప్ర.- ఆంగీరస, గౌరివీత, సాంకృత్య (లేక) శాక్త్య, గౌరివీత, సాంకృత్య.
32 పూతిమాష. —పై.—
33. తండి —పై.—
34. శంబు —పై —
35. శైవగవ. —పై.—

4. కౌశిక. (విశ్వామిత్ర) = 1. కౌశిక. -ప్ర.- వైశ్వామిత్ర, అఘమర్షణ, కౌశిక;
2. అఘమర్షణ —పై —
3. శ్రౌమత. -ప్ర.- వైశ్వామిత్ర, దైవశ్రవ, దైవతర;
4. కామకాయన. —పై.—
5. లోహిత. -ప్ర- వైశ్వామిత్ర, అష్టక;
6. అష్టక. -ప్ర - వైశ్వామిత్ర, మాధుచ్ఛంద, అష్టక;
7. దేవరాజ. -ప్ర.- వైశ్వామిత్ర, దేవరాజ (దేవరాత-దైవరాత), ఔద (న) (ర) ల;
8. చికిత. -ప్ర.- (ఎ) —పై.—; (బి) దేవరాజ. ఔదర, వైశ్వామిత్ర.
9 గాలవ -ప్ర.- వైశ్వామిత్ర, దేవరాజ, ఔద (న) (ర) ల;
10. కాల. —పై.—
11. బభ్ర. —పై.—
12. మనుతంతు. —పై.—
13. కుశిక. —పై.—
14. కిత. —పై.—
15. ధనంజయ —పై.— [ఆజ్య;
16. అజ. -ప్ర- వైశ్వామిత్ర, మాధుచ్ఛంద,
17. రోహిణ. -ప్ర.- వైశ్వామిత్ర, మాధుచ్ఛంద, రౌహిణ; [పౌరణ;
18. పూరణ. -ప్ర.- వైశ్వామిత్ర, దైవరాత,
19 వారిధాపయంత. —పై.—
20. కత. -ప్ర.- వైశ్వామిత్ర, కాత్య, ఆత్కీల;
21. వేణు. -ప్ర.- వైశ్వామిత్ర, గాధిన,రైణ;
22. వేణు. -ప్ర.- వైశ్వామిత్ర, గాధిన, రైణ. (వేను); [కాయన, కౌశిక;
23. శాలంకాయన. -ప్ర.- వైశ్వామిత్ర, శాలం
24. శాలాక్ష. —పై.—
25 లోహితాక్ష. —పై.—
26 లోహితజహ్ను. —పై.—

5 వశిష్ఠ = 1. కౌండిన్య (కుండిన).-ప్ర.- వాశిష్ఠ, మైత్రావరుణ, కౌండిన్య; 2 పరాశర, -ప్ర.- వాశిష్ఠ, శాక్త్య, పారాశర్య;
3 వశిష్ఠ.-ప్ర.- (ఎ) వాశిష్ఠ; (బి) వశిష్ఠ, ఇంద్రప్రమద, (ఇంద్రప్రమద)ఆభరద్వసు;
4. ఉపమన్యు.-ప్ర.- వాశిష్ఠ, ఆభరద్వసు, ఇంద్రప్రమద (ఐంద్రప్రమద);

6. భృగు. = 1. జామదగ్నివత్స. -ప్ర.- భార్గవ, చ్యావన, ఆప్నవాన, ఔర్వ, జామద (గ్ని) గ్న;
2. శ్రీవత్స. —పై.—
3 జామదగ్ని. -ప్ర.-భార్గవ, చ్యావన, ఆప్నవాన, ఆర్ష్టిషేణ, అనూపేత;
4. బిద. -ప్ర.- భార్గవ, చ్యావన, ఆప్నవాన, ఔర్వ, బైద; [సావేత;
5. యాస్క. -ప్ర.- భార్గవ, వైతహవ్య,
6. వాధూల (వాధౌల). —పై.—
7. మౌన. —పై.—
8. మౌక. —పై.—
9. శార్కరాక్షి. —పై —

10. సార్ష్టి. —పై.—
11. సావర్ణి శాలంకాయన. —పై.—
12 జైమిని —పై.—
13. దేవంత్యాయన. —పై.—
14. శైత్య. -ప్ర.-భార్గవ, వైన, పార్థ;
15. మిత్రియువ. -ప్ర - వాధ్ర్యశ్వ;
16. శునక.-ప్ర.- గార్త్సమద (గృత్సమద) (లేక) భార్గవ, శౌనహోత్ర, గార్త్సమద, (గృత్సమద);
7. అగస్తి=అగస్త్య -ప్ర.- అగస్త్య, దార్ఢ్య చ్యుత, ఇధ్మవాహ (లేక) అగస్త్య, దార్ఢ్య చ్యుత, సోమవాహ. (ఇత్యాది)

☞(సగోత్రకన్యల వివాహమాడరాదను సంశయమీ ప్రవరలవలనం దెలియఁగలదు. ఇందలి ప్రతిగోత్రనామముతుదను స కారము చేర్చి యుచ్చరింపవలెను): చూ, ప్రవరను

గోత్రములు. పా. బ. చూ, గోత్రము. 13.

గోత్రుఁడు. సం. వి. అ. పుం. 1. గోవులఁ గాచువాఁడు: చూ, మహాశూద్రుఁడు; 2. ఎఱుఁగఁదగిన దొంగ: చూ, ముచ్చు. 1; 3. నృపుఁడు: చూ, రాజు. 1.

గోద. సం. వి. ఆ స్త్రీ. 1. రూ-గోదావరి: చూ, నది: 2. విష్ణుచిత్తుని కూఁతురు. గోదాదేవి : చూ, పుత్రిక. 1; 3: చూ, మెదడు; దే. వి. (1) ఎద్దు: చూ, వృషభము. 1.

గోదంతము. సం వి. అ. న: చూ, హరిదళము.

గోదధి. అం. పంచగవ్యములలో నొకటి: చూ. గవ్యములు.

గోదము. వై. వి. = గోర్ధ. గోద: చూ, మెదడు.

గోదానము. అం. 1 షోడశకర్మములలో నొకటి: చూ, కర్మములు; 2. దశదానములలో నొకటి: చూ, దానములు; 3. మహాదానములు పదునాఱింటిలో నొకటి: చూ, మహాదానములు. [లాంగలము, 1.

గోదారణము. సం. వి. అ. న. నాఁగలి: చూ,

గోదారి. దే. వి. వెన్న కాఁచిన మడ్డి: చూ, తైలము. (వైకృత మని కొందఱు.)

గోదావరి. సం. వి. ఈ. స్త్రీ. 1. గోల, గోదావరీనది: చూ, నది. (కృష్ణవేణి-గోదావరి-సరయువు మొదలగునవి సరిత్తులనంబడును.) వా. వి. 2=: చూ, గోదారి.

గోదావల్లి. సం. వి. ఈ. స్త్రీ: చూ, పుల్లబచ్చలి*.

గోదుగ్ధ. సం. వి. ఆ. స్త్రీ. చణికమను గడ్డి*: చూ, తృణము. 1.

గోదు. వా. ?: చూ, తుమ్మజిగురు.

గోదుమ. వై. వి = గోధుమః. 1. గోధుమసస్యము: చూ, సస్యము. 1; విణ. బ. 2. గోధుమలను ధాన్యము: చూ, ధాన్యము. (మధుమూత్ర వ్యాధికి గోదుమఅన్నము మంచిది. ఇది మూత్రమందలి చక్కెరను తగ్గించును.)

గోదుమపూసలు. ద్వ. వి. బ. స్త్రీ మెడనగ: చూ, భూషణము. 2.

గోదుమలు. అం. నవధాన్యములలో నొకటి: చూ, ధాన్యములు. (చూ, గోదుమ.)

గోదుహము. సం. వి. అ. న. గోపాలుర క్రీడ: చూ, విలాసము. 1.

గోదోహము. అం. గహీనతానములు ఏడింటిలో నొకటి: చూ, గహీనతానములు (చూ, కూటతానములు.)

గోద్దాలము. సం. వి. అ. పుం. 1. మాఘమాసము: చూ, మాసము. 1; 2. బాల్యము: చూ, శైశవము. 2.

గోద్రవము. సం. వి. అ. పుం: చూ, గోమూత్రము.

గోధ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉడుము: చూ, తేలుమేపరి; ఆ స్త్రీ, అ. న. 2. వింటినారి దెబ్బతగులకుండఁ జేతినిగట్టిన ఉడుముతోలు (ముంజేతిని జుట్టుకొని యుండునది): చూ, బొరదు.

గోధనము. సం. వి. అ. న. 1. గోకులము: చూ, ధేనువు; 2. ఆవులకొట్టారము: చూ, సదనము. 1; పుం. 3. స్థూలాగ్రబాణము: చూ, బాణము. 1.

గోధావది. సం. వి. ఈ. స్త్రీ: చూ, హంసపాది *.

గోధావని. సం. వి. ఈ. స్త్రీ: చూ, సోమలత*.

గోధాస్కంధము. సం. వి. అ. పుం. చంద్ర*: చూ, వెలిచండ్రి.

గోధి. సం. వి. ఇ. పుం. 1. నొసలు: చూ, లలాటము; 2. ఉడుము: చూ, తేలుమేపరి.

గోధిక. సం. వి. అ. స్త్రీ. రూ- గుధిక. 1. ఉడుము: చూ, తేలుమేపరి; 2. నీరుడుము: చూ, తేలుమేపరి.

గోధుహుఁడు. సం. వి. హ్. పుం. గొల్ల: చూ, మహాశూద్రుఁడు.

గోధూమము. సం. వి. అ. పుం. 1.=గోదుమ. గోదుమలను యవలు: చూ, ధాన్యము; 2. నారింజ *: చూ, శర్కరాంకము; అం. 3. దర్భలు పదింటిలో నొకటి: చూ, దర్భలు.

గోధూమి. సం. వి. ఈ. స్త్రీ: చూ, గోలోమిక*.

గోనంది. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుబెగ్గురు: చూ, సారసము.

గోనర్దము. సం. వి. అ. న. 1. కయివడిముస్తె*: చూ, ముస్తకము; 2. ముక్కువైపు కంటిమూల: చూ, నేత్రము. 1; పుం. 3. బెగ్గురు: చూ, సారసము; 4. చేఁప: చూ, మత్స్యము. 1; 5. పాము: చూ, సర్పము.

గోనర్దీయము. అం: చూ, కామము. 3.

గోనర్దీయుఁడు. సం. వి. అ. పుం. పతంజలి: చూ, ముని. 1.

గోనర్దుఁడు. సం. వి. అ. పుం. గురుద్రోహము చేయువాఁడు.

గోనసము. సం. వి. అ. పుం. 1. రూ-గోనాసము. కొండచిలువ: చూ, సర్పము; 2. రూ-గోనాసము. వైక్రాంతమణి: చూ, రత్నము. 1; 3. పాలను: చూ, మాంసము; 4. పంటకుము: చూ, వహ్నిశిఖము. 1.

గోనసుఁడు. సం. వి. అ. పుం: చూ, హీనుఁడు.

గోనాథుఁడు. సం. వి. అ. పుం. ఎద్దు: చూ, వృషభము. 1.

గోనాసము: చూ, రూ-గోనసము. 1-2

గోనిష్యందము. సం. వి. అ. పుం: చూ, గోమూత్రము.

గోనియ. వై. వి.=గోణికా. రూ-గోనె. అడ్డముగా నడుమఁ గుట్టుపోసి ధాన్యమునించి యెద్దుమీఁద వేసెడు జనుపనార పట్టలసంచి: చూ, సంచి.

గోను. దే. వి: చూ, రూ-గోఁగు *.

గోనె. వై. వి.=గోణి: చూ, రూ-గోనియ.

గోనెయెద్దు. ద్వ. వి. ధాన్యాదులుగల గోనెలు మోయుయెద్దు: చూ, వృషభము. 1.

గోనెపణము. ద్వ వి. (పురితో నేసి పట్టాలు కుట్టి పణముకొనునది) పటకాలుగలగుడ్డ: చూ, వస్త్రము.

గోనెసంచి. ద్వ. వి: చూ, గోనియ. (వాడుక)

గోపకంటకము. సం. వి. అ. పుం. కొనరేఁగు*: చూ, రేఁగు. 1.

గోపఘోంట. సం. వి. అ. స్త్రీ: చూ, శమి*.

గోపతి. సం. వి. ఇ. పుం. 1. ఆఁబోతు: చూ, వృషభము. 1; 2: చూ, వేలుపుఱేఁడు; 3. ఱేఁడు: చూ, రాజు. 1; 4: చూ, శివుఁడు; 5: చూ, సూర్యుఁడు; 6: చూ, మండుఁడు; 7. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 8. చేందమామ: చూ, హిమాంశువు; 9. నలువ: చూ, బ్రహ్మ. 1; 10. నిప్పు: చూ, వహ్ని. 1.

గోపనము. సం. వి. అ. న. 1: చూ, దాఁచుట; 2. కాపాడుట: చూ, రక్షణము.

గోపభద్రి. సం. వి. అ. స్త్రీ. కాశ్మరి*: చూ, మహాఫలము.

గోపభద్రిక. సం. వి. అ. స్త్రీ. —పై.—

గోపము. సం. వి. అ. పుం. రూ-గోపము: చూ, బోళము.

గోపవధువు. సం. వి. ఊ. స్త్రీ: చూ, శారిబ*.

గోపవల్లి. సం. వి. ఈ. స్త్రీ. 1 —పై.—; 2: చూ, సరివ*.

గోపాణి. సం. వి. ఇ. పుం: చూ, వేలుపుతేఁడు.

గోపానసి. సం. వి. ఈ. స్త్రీ. =గొప్ప (ఇంటి కప్పుపైన వాసికవలెనుండునది): చూ, వెలిసె.

గోపాయితము. సం. విణ: చూ, రక్షితము.

గోపాలకర్కటి. సం వి. ఈ. స్త్రీ: చూ, బుడమ*.

గోపాలకుఁడు. సం. వి. అ. పుం. 1: చూ. శివుఁడు; 2. శ్రీకృష్ణుఁడు: చూ, విష్ణువు. 1.

గోపాలి. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, బుడమ*; 2 గొల్లది: చూ, మహాశూద్రి.

గోపాలిక. సం వి.ఆ. స్త్రీ. 1 గోపాలునిభార్య: చూ, భార్య; 2 ఒకానొకపురుగు: చూ. పురుగు.

గోపాలుఁడు. సం. వి. అ. పుం. 1 = గొల్ల: చూ, మహాశూద్రుఁడు; 2. భూపతి: చూ, రాజు.1; 3. శ్రీకృష్ణుఁడు: చూ, విష్ణువు. 1; 4: చూ, వేలుపుతేఁడు.

గోపి. సం. వి. ఈ. స్త్రీ. 1=గొల్లది: చూ, మహాశూద్రి; 2. మామెన*: చూ, శారిబ; 3. నల్ల సుగంధిపాల*: చూ, శారిబ; 4. బదరి*: చూ, రేఁగు.

గోపిక. సం. వి. ఆ. స్త్రీ. = గొల్లది: చూ, మహాశూద్రి.

గోపిచందనము. సం. వి. అ. న. ఒకరకము సుద్ద మన్ను: చూ, రూ-గోపీచందనము.

గోపిత. సం. వి. ఆ. స్త్రీ: చూ, అనాస*.

గోపీచందనము. సం. వి. అ. న. రూ-గోపిచందనము: చూ, భూమి 1.

గోపీతము. సం. వి. అ. పుం: చూ, వేగుజాము.

గోపీథము. సం. వి. అ. పుం. 1. నీటిదొన: చూ, నిపానము; 2. కావలి: చూ, రక్షణము.

గోపీద్ధము. సం. వి. అ. పుం. 1. —పై.—; 2.నూతిదగ్గఱనుండునీళ్లగాఁడి: చూ, నిపానము.

గోపు. దే. వి. ఆకతాయి: చూ, వ్యాధుఁడు. 2.

గోపుఁడు. సం. వి. అ. పుం. 1. రూ-గోపాలకుఁడు: చూ, మహాశూద్రుఁడు; 2. నృపుఁడు: చూ, రాజు. 1; 3. పెక్కుగ్రామముల కధికారుఁడు: చూ, రక్షకుఁడు. 4. గోవుల కధిపతి: గోమంతుఁడు, గోమి, గోమానుఁడు, గోస్వామి; 5. మగఁడు: చూ, భర్త. 1; 6. మేలుచేయువాఁడు: చూ, శుభంకరుఁడు.

గోపుచ్ఛన్యాయము. పా. మొదటలావుగానుండి క్రమముగా సన్నముగానుండురీతి.

గోపుచ్ఛము. సం. వి. అ. పుం. 1. కోఁతి: చూ, వానరము: పుం, న. 2. నలుబదిపేటలుగల హారము: చూ, భూషణము. 2; అం. 3. బాణాగ్రములు పదింటిలో నొకటి: చూ, బాణాగ్రములు; 4. తాళాధ్యాయప్రకరణమునందలియతిప్రాణములు ఆఱింటిలోనొకటి: చూ, యతిప్రాణములు, (చూ, తాళము 2); యతులుమూఁడింటిలోనొకటి: చూ, యతులు; వా. 6. ఆవుతోఁక.

గోపుటము. సం. వి. అ. న. శివునియొక్కయు వృషభముయొక్కయు మంటపము: చూ, సదనము. 1.

గోపురబంధము. అం.శబ్దాలంకారములలోనొకటి: చూ,శబ్దాలంకారములు.(చూ,అలంకారము. 3.)

గోపురము. సం. వి. అ. న. 1. గవను, పురద్వారము, పెద్దవాకిలి: చూ, సదనము. 1; 2. గృహద్వారము, వాకిలి: చూ, సదనము. 1; 3. తుంగముస్తె*: చూ, ముస్తకము; 4. విష్ణువు మేడ: చూ, సదనము. 1. "గాలిగోపురము"

గోపురాంశ. పా. ఏగ్రహంబునకైనను షోడశవర్గుచేయఁగా నాలుగువర్గంబులు స్వవర్గంబులు వచ్చెనేని గోపురాంశయగును.

గోపురీషము. సం. వి. అ. న. ఆవుపేఁడ: చూ, పిడక.

గోపేంద్రుఁడు. సం. వి. అ. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

గోపేశుఁడు. సం. వి. అ. పుం. శాక్యముని: చూ, బుద్ధుఁడు. 1.

గోప్త. సం విశే. ఋ: చూ, రక్షకుఁడు.

గోప్యకుఁడు. సం. వి. అ. పుం. బంటు: చూ, సేవకుఁడు.

గోప్యము. సం. విశే. రక్షింపఁదగినది: చూ, రక్షితవ్యము.

గోప్యార్థగోపనము అం: చూ, ఇతివృత్తవిస్తరము.

గోప్యుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, గోప్యకుఁడు; విశే. 2. కావఁదగినవాఁడు.

గోబలీవర్దన్యాయము. పా. గోశబ్దమునకు ఆవులు ఎద్దులుకూడ నర్థము. బలీవర్దశబ్దమున కెద్దులర్థము. గోబలీవర్దములనఁపుడు బలీవర్దశబ్దమున్నందువలన గోశబ్దమున కావులే యర్థము చెప్పవలయునను విధము.

గోభండీరము. సం. వి. అ. పుం: చూ, బెళ్ళుగువ్వ. (గుడ్డికొంగ అని వాడుక.)

గోమంతము. సం. వి. త్. పుం. అకారాంతము (అని కొందఱు). గోమంతపర్వతము; చూ, పర్వతము.

గోమంతుఁడు. సం. వి. త్. పుం. అకారాంతము (అనికొందఱు): చూ, గోపుఁడు.4.

గోమక్షిక. సం. వి. ఆ. స్త్రీ. అడవియీఁగ: చూ, మక్షిక.

గోమతి. సం.వి.ఈ. స్త్రీ. 1. వాసి(శి)ష్ఠి. గోమతి యనునది: చూ, నది; 2: చూ, గోరోచన.

గోమతివాలుఁడను బ్రాహ్మణులు. పా. గౌతముఁడను ఋషినిఁబట్టి వీరికీపేరు గలిగినది. వీరు యజుర్వేదులు: చూ, బ్రాహ్మణులు.

గోమఠము. సం. వి. అ. న. మండపము: చూ, సదనము. 1.

గోమయచ్ఛత్రము. సం. వి. అ. న: చూ, పుట్టగొడుగు*.

గోమయచ్ఛత్రిక. సం. వి. ఆ. స్త్రీ.—పై.—

గోమయపాయసీయన్యాయము. పా. పేఁడపరమాన్నమగునా యనురీతి. (పేఁడపాలు రెండును గోవుదేహమునుండి వచ్చుటచే సమానము అని చేయుదుర్వాదము.)

గోమయప్రియము. సం. వి. అ. న. భూతృణము*: చూ, తృణము. 1.

గోమయము. సం. వి. అ. పుం, న. 1. ఆవుపేఁడ: చూ, పిడక; 2. పేఁడ: చూ, పిడక; అం.3. పంచగవ్యములలో నొకటి: చూ, గవ్యములు.

గోమయోద్భవము. సం. వి. అ. పుం: చూ, తేల*.

గోమాయువు. సం. వి. ఉ. పుం. నక్క (గోవులను బోఁదోలునది): చూ, సృగాలము.

గోమారి. మి.వి. (గోవు + మారి): చూ, పిణుఁజో.

గోమి. సం. వి. న్. పుం. 1: చూ. గోపుఁడు.4; 2: చూ, వానరము; 3: చూ, సృగాలము; 4. కప్ప: చూ, మండూకము. 1; విశే. 5. బుద్ధభిక్షుక శిష్యుఁడు: చూ, బుద్ధుఁడు. 1; 6: చూ, గోపుఁడు. 4.

గోమించు. దే. స. క్రి. గోముచేయు.

గోమితము. సం వి. అ న. కోసు: చూ, పరువు 2.

గోమిని. సం.వి.ఈ. స్త్రీ. దుర్గ: చూ, పార్వతి. 1.

గోమీనము. సం. వి. అ. పుం. గోమీనమను చేఁప: చూ, మత్స్యము, 1.

గోమీమఁడు. సం.వి.అ.పుం: చూ, గోమంతుఁడు.

గోము. దే. వి. 1. శ్రిసుమెలుఁగనితనము: చూ, సుకుమారము; 2. తేఁత: చూ, సౌకుమార్యము.1.

గోముఖబ్రాహ్మణులు. పా. వీరిని గోళకబ్రాహ్మణులనిసైత మందురు. తల్లిమాత్రము వితంతువు: చూ, బ్రాహ్మణులు.

గోముఖము. సం. వి. అ. న. 1. ఇల్లుఅలుకుట: చూ, మెత్తు 1; 2. కొంకరవంకరగా కట్టిన యిల్లు: చూ, సదనము. 1; 3 పూరకమను వాద్యము, వాయించుకుండ (అనికొందఱు): చూ, వీణె; పుం 4. మొసలి, కాలుమొసలి (అనికొందఱు): చూ,మత్స్యము. 1; వా. 5. ఆవుమొగము.

గోముఖవ్యాఘ్రిన్యాయము. సా. ఆవుమొగము గల పులినిఁ జూచి, ఆనను నూహతో నితర జంతువులుదగ్గఱకురాఁగా వానిని మ్రింగి వేయు ననురీతి.

గోముఖాసనము. అం. ఆసనములుముప్పదింటిలో నొకటి: చూ, ఆసనములు.

గోముఖుఁడు. సం. వి. అ. పుం. నలువ: చూ, బ్రహ్మ. 1.

గోమూత్రము. సం. వి. అ. న. 1. ఆవుఉచ్చ: చూ. మూత్రము; అం. 2. పంచగవ్యములలో నొకటి: చూ, గవ్యములు.

గోమూత్రశిలాజిత్తు. సం. వి. ఉ. న. (పచ్చగా నుండు) గోమూత్రశిలాజిత్తు: చూ, సిలాజిత్తు.

గోమూత్రి. సం. వి. న్. పుం. ఎఱ్ఱవేఁగిస*: చూ, సర్జకము. 2.

గోమూత్రిక. సం.వి.అ. స్త్రీ. ఒకరకము గడ్డి* : చూ, తృణము. 1.

గోమూత్రికము. అం. వ్యూహశాస్త్రములోని భోగవ్యూహములు అయిదింటిలో నొకటి: చూ, భోగవ్యూహములు.

గోమూత్రికాబంధము. అం. శబ్దాలంకారము లలో నొకటి: చూ, శబ్దాలంకారములు. (చూ, హేతువు. 2; అలంకారము 3.)

గోమేదకము. సం. వి. అ. పుం. గోమేదకమణి: చూ, రత్నము. 1.

గోమేదము. సం. వి. అ. న.—పై.—

గోమేదికము. వై. వి=గోమేధికము.—పై—.

గోమేధము. సం. వి. అ. పుం. 1: చూ, రూ గోమేదము; 2. కొండ: చూ, పర్వతము; 3. జన్నము: చూ, యజ్ఞము.

గోమేధసన్నిభము సం. వి. అ. పుం. పాల తాయి: చూ, గాయి.

గోమేధికము. సం. వి. అ. న. 1.=గోమేదికము. పసుపువన్నెగల రత్నము. నవరత్నములలో నొకటి: చూ, రత్నములు; చూ, రత్నము.1; 2. అరుపత్రికము *: చూ, గోమశము; 3. విషభేదము: చూ, విసము. 1.

గోయి. వై. వి.=గర్తమ్. రూ-గొయ్యి: చూ, రంధ్రము. 1.

గోయుజ. సం. వి. అ. స్త్రీ. రెండుకోసులు: చూ, పరువు. 2.

గోర. వై. వి. 1 = గోరంకువు: చూ, రూ-గొరంక; 2. అరఁటిపువ్వు లోపలనుండెడి యొకానొక వస్తువు: చూ, గోరు.

గోరంక. వై. వి =: చూ, రూ-గొరంకి.

గోరంకి. వై. వి.= —పై.—

గోరంకువు. సం. వి. ఉ. పుం 1. = గొరంకి- గోరంక-గోర: చూ, శారిక. 1; 2. బట్టఁ గట్టనివాఁడు: చూ, దిగంబరుఁడు; 3: చూ, బట్టువాఁడు: 4. జామీనుదారు: చూ, లగ్న కుఁడు.

గోరంత. వా.వి. మిక్కిలికొంచెము. "గోరంతలు కొండంతలుగాఁ జేసెను.": చూ, స్వల్పము. (చూ, కాంత. (1).)

గోరఁక. వై. వి.=గోరంకు: చూ, రూ-గొరంకి.

గోరఁకి. వై. వి. = —పై.—

గోరఁట. వై. వి: చూ, మహాసహ * (దీని ఆకు నిమ్మపండ్ల రసముతో నూఁతి అరికాళ్లకు కట్టిన మంటలుతగ్గును. దీనికషాయము పుండ్లు మాన్పును.)

గోరంబాపునదిగొడ్డంటనఱకుట. లో. ఈదా- "మనకప్పుడు గోరంబోవుపని గొడ్డంటందిర్వ వలసివచ్చును." (నీతిచంద్రిక-మిత్రభేదము)
గోరకలి. వా. వి. గొప్పచిక్కు,అతిదారుణము.
గోరక్ష. సం. వి. అ. స్త్రీ. 1. నారింజ *: చూ, శర్కరాంకము; 2. పసులఁగాచుట; 3. కుంఠానుఁగు *: చూ, నాదాలాబువు.
గోరక్షకము. అం. జాతులు పదునెనిమిదింటిలో నొకటి: చూ, జాతులు.
గోరక్షకుఁడు. సం. వి. అ. పుం. 1 వైశ్యస్త్రీకిని క్షత్రియునికినిఁ బుట్టిన గొల్లవాఁడు: చూ, మాహిష్యుఁడు; వా. 2 పసులకాపరి.
గోరక్షతుంబి. సం. వి. ఈ. స్త్రీ: చూ, గోరక్ష. 3.
గోరక్షి. సం. వి. ఈ. స్త్రీ 1. —పై.— 2: చూ, సర్పదండి *. [కుఁడు.]
గోరక్షుఁడు. సం. వి. అ. పుం: చూ, గోరక్ష
గోరగింత. వై. వి.=ఘోరత్వ. భయంకరత్వము: చూ, రౌరవము. 2.
గోరచేనము. వై వి. = గోరోచన ఆవుకడుపు నుండి యొత్తెడి యొకవస్తువు: చూ, రోచన.
గోరజము. వై. వి = —పై.—
గోరడము. దే. వి. ఎగతాళి: చూ, పరిహాసము.
గోరతనము. దే.వి. దౌష్ట్యము: చూ,వ్యళీకము. 2.
గోరత్నము. అం. చేతనరత్నములు తొమ్మిదింటిలో నొకటి: చూ, చేతనరత్నములు.
గోరథుఁడు. సం. వి. అ. పుం. బృహస్పతి గ్రహము: చూ, రాహువు. 2.
గోరప. దే. వి. గట్టిమ్రోఁత: చూ, స్వరము. 2.
గోరపడు. ద్వ. అ. క్రి. (గోరము + పడు): చూ, రోఁతపడు.
గోరపన. దే. వి. రూ-గోరము-గోను: చూ, నింద. 1.
గోరపము. వై. వి.=కురప: చూ, రూ-గొఱపము.
గోరము. వై. వి =ఘోర. 1. భయము, భయంకరము (అని కొందఱు): చూ, వెఱపు; దే. వి. 2. ఆపద. అచ్చ. యు. కాం. 142: చూ, విపత్తు; 3. దేహముయొక్క అస్వాస్థ్యము; 4. రోఁత: చూ, నింద. 1; విణ. 5. రోఁత కలది. కళా.7, అ. 86: చూ, వికృతము.8.
గోరవంక. వై. వి.=: చూ, రూ-గొరంకి.
గోరసజము. సం. వి. అ. న. చేల్ల: చూ, మజ్జిగ.
గోరసము. సం. వి. అ. పుం. 1. —పై.—; 2. క్షీరము: చూ, పాలు. 1; 3. దేవదారు బంకతోఁ జేసిన ధూపద్రవ్యము: చూ, రాజార్హము.
గోరాండికి. సం. వి. అ. స్త్రీ.=గోరంక: చూ, శారిక. 1.
గోరాటక. సం. వి. అ. స్త్రీ. = —పై.—
గోరాటి. సం. వి ఈ. స్త్రీ = —పై.—
గోరి. దే. వి. కట్టినసమాధి: చూ. సమాధి. 1.
గోరింక. వై. వి.=: చూ, రూ-గొరంకి.
గోరించు. దే. అ. క్రి. 1. ఎగయు. శకాం. 3, అ. 111: చూ, లంఘించు; 2. పైకిలేచు: చూ, రేఁగు.
గోరింపు. దే. వి. 1. ఎగపు: చూ, నెగపు; 2 గర్వము: చూ, హంకారము.
గోరక. వై. వి.=: చూ, రూ-గొరంకి.
గోరు. వై. వి. 1. = ఖుర: చూ, నఖము; 2.=ఖుర. తంతిమీటు ప్రతినఖము. స్వా. 5, అ. 64: చూ, నఖము; 3: చూ, గోర; విణ. 4. అల్పము. "గోరువెచ్చని నీరు." చూ, స్వల్పము; అం. 5. రంధ్రములు తొమ్మిదింటిలో నొకటి: చూ, రంధ్రములు.
గోరుగల్లు. ద్వ. వి. (మంగలి గోళ్లుతీసెడి) ఇనుపసలాక. కళా. 8, అ. 109: చూ, నఖోత్పాటని (రూ-గోరుగొండి-గోర్గొండి.)

గోరుగాలము. ద్వ. వి. చేపలను బట్టుటకు ఉక్కు-కమ్మితో వంకరగాఁజేసిన గాలము: చూ, వల. 1.

గోరుగొండి. ద్వ. వి. రూ- గోర్గొండి: చూ, గోరుగల్లు.

గోరుచిక్కుడు. ద్వ. వి: చూ, మట్టికి *.

గోరుచీరణము. ద్వ. వి గోటివలె కొనయందు వంపుగల యులి: చూ, వృక్షౌదనము. 1.

గోరుచుట్టు. ద్వ. వి. 1. గోరుచుట్టు లేచెడు పుండు: చూ, వ్రణము; 2. ఒకానొక గడ్డ.

గోరుచుట్టుపై రోఁకలిపోటు. జా. ఆపదపైన మఱియొక ఆపద.

గోరుతము. సం విణ. కోసు: చూ, పరువు. 2.

గోరుపడము. వై. వి.=ఘోరపట: చూ, రూ- గోర్పడము.

గోరుపిల్లాడు. దే. స క్రి. 1. పుట్టచెండ్లాడు: రూ- గోరుపులాడు-గోర్పిలులాడు-గోర్పిల్లాడు; 2. ఎగురవేయు: రూ- గోరుపులాడు-గోర్పిలులాడు-గోర్పిల్లాడు

గోరుపులాడు దే. స. క్రి. —వై.—

గోరుమీటులు. దే. వి. బ: చూ, భత్యము.

గోరురాజనాలు దే. వి. బ. ఒకరకము వడ్లు: చూ, ధాన్యము.

గోరువంక. వై. వి.=: చూ, గొరంకి.

గోరువంకలు. వై. వి. బ. = ఖురవక్రి. రూ- గోర్వంకలు: చూ, నఖక్షతము. ఆం, భా. ద్వి. 180.

గోరువెచ్చ. ద్వ. వి. రూ- గోర్వెచ్చ: చూ, మందోష్ణము (చూ, వేఁడిమి.)

గోరేఖకము. సం. వి. అ. పుం. తంగేడు *: చూ, హేమపుష్పకము.

గోరొత్తు. ద్వ. వి. (గోరు + ఒత్తు). కళా. 7, ఆ. 161: చూ, నఖక్షతము.

గోర్గొండి. ద్వ. వి: చూ, రూ-గోరుగొండి.



గోరోచన. సం. వి. అ. స్త్రీ.=గోరోజనము: చూ, రోచన.

గోరోచము. సం. వి. అ. న: చూ, హారిదళము.

గోరోజనము. వై. వి.=గోరోచన. రూ-గోరజము-గోఅజము: చూ, రోచన.

గోర్దము. సం. వి. అ. న: చూ, మెదడు.

గోర్ధము. సం. వి. అ. న. —వై.—

గోర్పడము. వై. వి.= ఘోరపట. రూ- గోరుపడము. 1. కంబళి: చూ, రల్లకము; 2. ఏనుఁగు మీఁదఁ బఱచెడి యెఱ్ఱని కంబళి: చూ, రల్లకము

గోర్పిలులాడు. దే. స. క్రి: చూ, రూ-గోరుపిల్లాడు.

గోర్పిల్లాడు. దే. స. క్రి. —వై.—

గోర్వంక. వై. వి. 1.=: చూ, గొరంకి; ఆం. 2. కామశాస్త్రమునందలి దూతీచతుష్టయము లోని మతాంతరములందలి మూఁడవదానిలోని పదునాటింటిలో నొకటి: చూ, దూతీచతుష్టయము.

గోర్వంకలు. వై. వి. =: చూ, రూ- గోరువంకలు.

గోర్వెచ్చ. ద్వ. వి: చూ, రూ-గోరువెచ్చ.

గోఅజము. వై. వి. = గోరోచన. స్వా. 4. ఆ. 14: చూ, రోచన.

గోల. సం. వి. అ. స్త్రీ. 1. = గోలి. కాఁగు: చూ, పాత్రము.6; 2. దుర్గ: చూ, పార్వతి.1; 3. గోదావరీనది: చూ, నది; 4. మణిసిల: చూ, రాయి; దే. వి. (1) అతి దారుణధ్వని: చూ, స్వరము. 2; (2) రెమ్మ: రెమ్మ: చూ, శాఖ. 1; (3) ఆఁడుది. ఆం, భా. ద్వి. 104. చూ, స్త్రీ; విణ. (4) ముగ్ధ. పండ్రెండేండ్ల పర్యంతమైన వయసుగలది (ఆఁడుది): చూ, స్త్రీ; (5): చూ, ముగ్ధుఁడు.

గోలకము. సం. వి. అ. పుం. 1. = గోళము. రూ-గోళకము. కాఁగు: చూ, 6 పాత్రిము

2. గులి: చూ, గోలీ; 3. పోయునకుండ: చూ, భాండము. 3; 4. బొమిడికము: చూ, సీసకము. 1; 5. కంబళి: చూ, రల్లకము; 6. ఇంద్రియములుండు తావు; 7. పోఁకగెల: చూ, పోఁక.

గోలకుఁడు. సం. వి. అ. పుం. విధవకు అంయ మగనియందుఁ బుట్టిన కొడుకు, రూ- గోళకుఁడు: చూ, పుత్రుఁడు.

గోలక్షణము. అం. కళలఱువదినాలుగింటిలో నొకటి: చూ. కళలు.

గోలత్తిక. సం. వి. ఆ. స్త్రీ. అఁడుఉవ్వపిట్ట: చూ, పిచ్చుక.

గోలము. సం. వి. అ. పుం. రూ- గోళము. 1. బాలెంతబోలు: చూ, బోళము; 2. మంటి ఉంట: చూ, పూస; 3. కంటిగుడ్డు: చూ, నేత్రము. 1; స. 4. (సూర్యచంద్రాదుల) బింబము: చూ, మండలము. 9.

గోలాంగూలము. సం. వి. అ, పుం. 1. కొండముచ్చు: చూ, వానరము; 2. కోఁతి: చూ, వానరము.

గోలాసము. సం.వి.అ స: చూ, పుట్టగొడుగు*.

గోలి. సం. వి. ఈ. స్త్రీ. ఉసుము: చూ, తేలుమేపరి.

గోలించు. దే. స. క్రి. చేమురుపోసి వేఁచు: చూ, వేఁచు.

గోలియము. వై. వి. = గోలకః. రూ-గోలెము. కాఁగు: చూ, పాత్రము. 6.

గోలిహము. సం.వి. హ. పుం: చూ, మొక్కము*.

గోలీ. వై. వి. = గోలకః. గోలీకాయ: చూ, బాలక్రీడ.

గోలీకాయ. ద్వ. వి. —పై.—

గోలీఢము. సం.వి. అ పుం: చూ, గోలిహము*. (ఆవులచేత ఆస్వాదింపఁబడునది.)

గోలు. దే. వి: చూ, పేముబొద్దు.

గోలుఁడు సం. వి. అ. పుం: చూ, గోలకుఁడు

గోలుగోలు. దే వి. రూ గోల్గోలు. ఏడ్పుటందగు ధ్వన్యనుకరణము: చూ, హాహాహా.

గోలురించు. దే. అ. క్రి. (పులి) కూయు: మశబ్దించు.

గోలె. దే అవ్య. ఆరంభకాలనిశ్చయార్థమున వచ్చు నిపాత. "నాటఁగోలె." మొ.

గోలెము. వై. వి=గోలకః: చూ. రూ-గోలియము

గోలోకము. సం. వి. అ. స. శ్రీకృష్ణునియొక స్థానము.

గోలోమి. సం. వి. ఈ. స్త్రీ. తెల్లగఱిక*: చూ తృణము. 1; 2: చూ. మర్గమాతంగి*; 3. వసల్లవస (అనికొందఱు)*: చూ, విష; 4: చూ నేలగొలిమిడి*; 5. భూతకేశము*: చూ, జటామాంసి; 6. శమీధాన్యము: చూ, ధాన్య

గోల్గోలు. దే. వి: చూ, రూ-గోలుగోలు.

గోవ. దే. వి. 1. యౌవనము. స్వా. 4, ఆ. చూ, వయస్సు. 1; వై. వి. 2=గవయః: చూ శరభము 1; దే. విశ. 3. మనోజ్ఞము. "గ పని.": చూ, హృద్యము; వా. 4 పాడవు.

గోవందని. సం వి. ఈ. స్త్రీ: చూ, ప్రేంకణము

గోవందిని. సం. వి. ఈ. స్త్రీ.—పై.—

గోవణము. వై. వి=కౌపీనము: చూ, బొట్టము

గోవత్సన్యాయము. పా. ఆవునమ్మినపుడు దూడ వేరేఖరీదు లేదనురీతి.

గోవమొలత్రాడు. దే. వి. మగవాని మొలనూ చూ, శృంఖలము.

గోవర్ధనధరుఁడు. సం. వి. అ. పుం. శ్రీకృష్ణుఁ చూ, విష్ణువు. 1.

గోవర్ధనము. సం.వి.అ.పుం. 1: చూ, సింహ 2: చూ, మాతులుంగము*; 3. సారము దూది మొదలగు వస్తువు; 4. గోవర్ధన తము: చూ, పర్వతము.

గోవశ. సం.వి.ఆ. స్త్రీ. గొడ్డావు: చూ, ధేను

వాలము. సం. వి. అ. పుం. ఆవుయొక్క తోఁక: అఁదోఁక. రూ. ఆవుతోఁక.

వావు. దే. వి. (గోవ + ఆవు) సాధువుకాని యావు, కరటు: చూ, ధేనువు.

వాల్డు. దే. వి. బ: చూ, యాదవుఁడు. స్వా. 4, ఆ 83; 2. ముండలమారి. ఆం, భా. ద్వి 116: చూ, విటుఁడు.

విందము. సం వి. అ. పుం. కొండ: చూ, పర్వతము.

విందములు. దే. వి బ. నతివిశేషము: చూ, నమస్కారము.

విందములుకొట్టుచు. క్రి. ఉత్సాహముతో గోవిందస్మరణ చేయుచు. "చతుర్విధాహార పరిధానాభీష్ట మృష్టాన్నంబుల విందుపెట్టు లనుకొంచు గోవిందములు కొట్టుకొంచు జిహ్వాలు చివురించునట్లు భుజించుచు." (ధర్మజ రాజసూయము.)

విందుఁడు. సం. వి. అ. పుం. 1. శ్రీకృష్ణుఁడు: చూ, విష్ణువు. 1; 2. అలకాపురి: చూ, మహేంద్రుఁడు; 3. బృహస్పతిగ్రహము: చూ, రాహువు. 2; 4. నలువ: చూ, బ్రహ్మ. 1; 5. ఇంద్రుఁడు: చూ, వేలుపుఱేఁడు; 6. భూపతి: చూ, రాజు. 1; 7. పరమాత్మ: చూ, హంసుఁడు; 8. మనస్సు మొదలగు నింద్రియముల నడపు అంతర్యామి (గోవిందాయనమః): చూ, ఓమ్.

విట్టు. సం. వి. ష్. (శ్). పుం, స్త్రీ: చూ, గోమయము.

విరేచనము. సం. వి. అ. న 1: చూ, గోమూత్రము; వా. 2. ఆవుపేడ.

విష్ఠ. సం. వి. ఆ. స్త్రీ: చూ, గోమయము.

వు. సం. వి. ఓ. స్త్రీ. 1. ఆవు. (దీని ధ్వని హంభ. శిరోదేశము సైచికము): చూ, ధేనువు; 2. కన్ను (పుం, స్త్రీ అని కొందఱు): చూ, నేత్రము. 1; 3. దిక్కు: చూ, హరిత్తు; 4. తూపు (పుం, స్త్రీ అని కొందఱు): చూ, బాణము. 1; 5. పుడమి: చూ, భూమి. 1; 6. వాక్కు: చూ, శబ్దము. 2; 7. బంజలము (పుం, స్త్రీ అని కొందఱు): చూ, సలిలము; 8. నలువరాణి: చూ, సరస్వతి; 9. కోసుదూరము: చూ, పరువు. 2; 10. గుఱి: చూ, లక్ష్యము. 1; 11. చూపు: చూ, లక్షణము. 3; పుం. 12. (బండిలాగు) ఎద్దు: చూ, వృషభము. 1; 13. కిరణము (పుం, స్త్రీ అని కొందఱు): చూ, హాయనము. 2; 14. నాకము (పుం, స్త్రీ అని కొందఱు): చూ, స్వర్గము; 15. చందమామ: చూ, హిమాంశువు; 16. వజ్రాయుధము (పుం, స్త్రీ అని, కొందఱు): చూ, బాణము. 1; 17: చూ, సూర్యుఁడు; 18. వెండ్రుక (పుం, స్త్రీ అని కొందఱు): చూ, వెండ్రుక. 1; 19. జన్నము: చూ, యజ్ఞము; 20. ఒక ముని: చూ, ముని. 1; 21. అర్జునుఁడు: చూ, విజయుఁడు. 1; స్త్రీ, న. 22. తేజస్సు: చూ, వెలుతురు. 1; అం. 23. దానములు పదునాఱింటిలో నొకటి: చూ, దానములు.

గోవృందము. సం. వి. అ. న. ఆవులమంద: చూ, ధేనువు.

గోవృకము. సం. వి. అ. పుం. 1. కోడి: చూ, పుంజు; 2, చిక్కవపిట్ట: చూ, బటువుగువ్వ.

గోవృషము. సం. వి. అ. పుం. ఆఁబోతు: చూ, వృషభము. 1.

గోశకృత్తు. సం. వి. త్. న: చూ, గోమయము.

గోశాల. సం. వి. ఆ. స్త్రీ. ఆవులసాల. రూ. గోశాలము: చూ, సదనము. 1.

గోశాలము. సం. వి. అ. న. —పై.—

గోశాస్త్రము. పా. అథర్వవేదములోనిది. ఇది సహదేవ కల్పితగ్రంథము. ఇది గోవులవర్ణముల

మల్లు, శుభలక్షణములు, వాని ఫలితాదులు, పశువ్యాధులు, తదుపశమనౌషధాదు లెఱిం గించును: చూ, ఉపవిద్యలు.

గోశీర్షము. సం. వి. అ. న. హరిచందనము: చూ, వాసన.

గోశృంగము. సం. వి. అ. పుం. తుమ్మ*: చూ, విట్ఖదిరము.

గోశృంగోదకన్యాయము. పా. గోశృంగము నందు నీటినిపోసి గాయత్రిచేత మూఁడు పర్యాయము లభిమంత్రించి ఆయుదకము చేత స్నానమొనర్చుట అను విధము.

గోశ్రేణి. సం. వి. ఈ. స్త్రీ. తంగేడు*: చూ, హేమపుష్పకము.

గోషా. పా. వి. రాణివాసము (గోషాఅనియు.)

గోష్ఠము. సం. వి. అ. న.=కొట్టము. రూ-గాష్ఠము. గోవులమందయుండు చోటు: చూ, సదనము. 1.

గోష్ఠశ్వుఁడు. సం. విణ. తానుండెడు చోట నుండుకొని పరులను ద్వేషించువాఁడు.

గోష్ఠి. సం. వి. ఈ. స్త్రీ. 1. సభ: చూ, సభ. 2; 2. రాజసభ: చూ, సభ. 2; 3. మహారాజసభ: చూ, సభ. 2; 4. పరిషత్సభ: చూ, సభ. 2; 5. ఇష్టగోష్ఠి: చూ, సల్లాపము; అం. 6. నాటికలు పదునెనిమిదింటిలో నొకటి. (1 అంకము. కథప్రణయము. పురుషపాత్ర 9 లేక 10. స్త్రీలు 5 లేక 6): చూ, నాటికలు.

గోష్ఠీనము. సం. వి. పుం. న. రూ-గాష్ఠీనము మునుపావులున్న సాల: చూ, సదనము. 1.

గోష్పదము. సం. వి. అ. న. 1. ఆవుడెక్క, (ఆవుయొక్క అడుగుకొలఁది): చూ, వింఖము; 2. గోవుగొరిసె యిడినగుంట: చూ, రంధ్రము. 1; 3. గోవులుతిరిగెడిచోటు: చూ, స్థానము. 1.

గోస. వా. వి. తిట్టు, ఘోష.

గోసంఖ్యుఁడు. సం. వి. అ. పుం. గొల్ల: చూ, మహాశూద్రుఁడు.

గోసంగము. సం. వి. అ. పుం: చూ, వేగుజాము.

గోసంగి. వై. వి. 1=గోహింసకః. రూ-గోసఁగి. అం, భా. ద్వి. 289: చూ, మాదిగ; 2 కడజాతివాఁడు: చూ, మాల (1).

గోసఁగి. వై. వి.=—పై —

గోసడుచు. దే. స. క్రి. (గోసు + అడుచు): చూ, నిందించు.

గోసన. వై. వి=ఘోషణ. రూ-గోసు-గోసున. చాటించుట: చూ, ఘోషణ.

గోసము. వై. వి. 1: చూ, బోళము; 2: చూ, వేగుజాము. [చూ, యజ్ఞము]

గోసరము. సం. వి. అ. పుం. గోమేధయజ్ఞము:

గోసర్గము. సం. వి. అ. పుం: చూ, వేగుజాము

గోసవము. అం. రిహీనతానములేడింటిలో నొకటి: చూ, రిహీనతానములు. (చూ, శుద్ధతానములు.)

గోసు. వై. వి. 1 =ఘోషణ: చూ, రూ-గోసన; 2. అపదూఱు: చూ, నింద. 1; 3. దోషము: చూ, పాపము. 1.

గోసున. వై. వి.=ఘోషణ. అం. భా. ప్ర.114: చూ, రూ-గోసన.

గోస్తన. సం. వి. ఆ. స్త్రీ: చూ, గోస్తని*.

గోస్తనము. సం. వి. అ. పుం. నలువదిపూసల సరము. (పుం, న. అని కొందఱు.) చూ, భూషణము. 2.

గోస్తని. సం. వి. ఈ. స్త్రీ. 1. ద్రాక్ష*: చూ, స్వాదుఫల; వా. 2. ఒకానొకనది.

గోస్థానకము. సం. వి. అ. న: చూ, గోష్ఠము.

గోస్వామి. సం. వి. న్. పుం. 1: చూ, గోప్తుఁడు. 4; 2. (నాట్యపరిభాషయందు) ఇతరరాజులయొక్క కొడుకు: చూ, పుత్త్రుఁడు.

గోహన్నము. సం.వి. అ. న: చూ, గోమయము.

గోహరి. దే. వి. పరాక్రమము. జై. 6, ఆ. 154: చూ, శౌర్యము. 1.

గోహరితకి. సం. వి. ఈ. స్త్రీ: చూ, మారేడు*.

గోహాలకుఁడు. సం. వి. అ. పుం: చూ, శివుఁడు.

గోహాలము. సం. వి. అ. పుం. ఏఱుపిడక. రూ-గోహాళము: చూ, పిడక.

గోహాళము. సం. వి. అ. పుం. —పై.—

గోహింసకుఁడు. సం. వి. అ. పుం. =గోసంగి: చూ, మాదిగ.

గోహితము. సం. వి. అ. పుం: చూ, మారేడు*.

గోళకుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ-గోలకుఁడు.

గోళము: చూ, రూ-గోలము.

గోళి. వై. వి.=ఘూళీ. కుచ్చెలి *: చూ, విచిల్లిక. (నోటినుండి నెత్తురు కాఱుట, పైత్య జ్వరము, దగ్గు తగ్గును.)

గోళ్లకుతికంటు. ద్వి. వి. స్త్రీ. కంఠభూష: చూ, భూషణము. 2.

గోళ్లగొండి. ద్వి. వి. 1. ఒకరకము గడ్డి *: చూ, తృణము.1; 2 తృణధాన్యము: చూ, ధాన్యము.

## గౌ

గౌంజికుఁడు. సం. వి. అ. పుం. బంగారు పనివాఁడు: చూ, స్వర్ణకారుఁడు.

గౌండవాఁడు. వై. వి. = గోండ. రూ-గవుండ్లవాఁడు: చూ, సురాజీవి.

గౌండ్లవాఁడు. వై. వి. = —పై.—

గౌఁడు. వై. వి.= —పై.—

గౌడకృతి. అం. క్రియాంగములకు సంబంధించిన సామకృతి, గౌడకృతి, దేవకృతి యను మూఁడింటిలో నిదియొకటి.

గౌడదేశిక. సం. వి. అ. స్త్రీ: చూ, వాయసోలి *.

గౌడము. సం. వి. అ. పుం. రూ-గౌళము. 1. ఏఁబదియాఱు దేశములలో నొకటి: చూ, దేశము; అం. 2. రాగాంగములు పదుమూఁడింటిలో నొకటి: చూ, రాగాంగములు.

గౌడలి. వై. వి. ముసలిది (ఆఁడుది) చూ, స్త్రీ.

గౌడసరము. ద్వి. వి: చూ, రూ-గవుడసరము. కళా. 7, ఆ. 66.

గౌడి. సం. వి. అ. పుం. 1. వాల్కలి, ఆరపూవుసారాయి, బెల్లముతోఁజేసిన సారాయి (అని కొందఱు): చూ, సుర. 2; అం. 2. కావ్యరీతులు మూఁడింటిలో నొకటి (కఠినపదములు, దీర్ఘసమాసములుగలది): చూ, కావ్యరీతులు; 3. రీతులు నాలుగింటిలో నొకటి: చూ, రీతులు; 4. మాళవకైశికిజ భాషలు పదుమూఁడింటిలో నొకటి: (చూ, భాష. 1): చూ, మాళవకైశికిజభాషలు; 5. హిందోళజభాషలు తొమ్మిదింటిలో నొకటి: (చూ, భాష. 1): చూ, హిందోళజ భాషలు; వా. 6. పొట్టి.

గౌడిగెదె. దే. వి. పొట్టికొమ్ముల బఱ్ఱె: చూ, మహిషి.

గౌడిబ్రాహ్మణులు. పా. బేహారునకు వంగదేశమునకు బంగాళమునకు ముఖ్యపట్టణముగా నుండిన గౌడి యను పట్టణమును బట్టి యా ప్రదేశ బ్రాహ్మణులకు గౌడిబ్రాహ్మణులను పేరు కలిగినది. వీరు మత్స్యములను మాంసమును మధువును గూడ భక్షింతురు. వీరిలో (చూ) అగ్రదానీ బ్రాహ్మణులు, ఆచార్యబ్రాహ్మణులు, ఆదిగౌడ బ్రాహ్మణులు, కీర్తన్యగౌడబ్రాహ్మణులు, శ్రీగౌడ బ్రాహ్మణులు, శుక్లవాలగౌడ బ్రాహ్మణులు అనువారు కలరు: చూ, బ్రాహ్మణులు. (వాడుక గౌడబ్రాహ్మణులు)

గౌణము. సం. విణ. ముఖ్యముకానిది.

**గౌణవిధి.** సం. వి. ఇ. పుం: చూ, అనుకల్పము.

**గౌతమ.** అం. మూలస్మృతులు పదునెనిమిదింటిలో నొకటి: చూ, స్మృతులు.

**గౌతమము.** సం. వి. అ. పుం. ఏనుఁగుతుమ్మి*: చూ, తుమికి.

**గౌతమసగోత్రము.** పా: చూ, గోత్రము. 13.

**గౌతమస్మృతి.** అం. మూలస్మృతులుపదునెనిమిదింటిలో నొకటి: చూ, స్మృతులు. (త్రేతాయుగంబున గౌతమస్మృతి ప్రతిపాదిత ధర్మంబులను ప్రచురించినది.)

**గౌతమి.** సం. వి. ఈ. స్త్రీ 1. గౌతమి యను నది: చూ, నది; 2. గౌరి: చూ, పార్వతి. 1; అం. 3. పంచగంగలలో నొకటి: చూ, గంగలు.

**గౌతమీద్వారము.** సం. వి. అ. న. కైలాసగిరి: చూ, పర్వతము.

**గౌతముఁడు.** సం. వి అ. పుం. గౌతమఋషి: చూ, ముని. 1; 2. జినుఁడు: చూ ,బుద్ధుఁడు.1; 3. సప్తఋషులలో నొకఁడు: చూ, ఋషిశ్రేష్ఠులు: చూ, మహర్షులు; 4. శాస్త్రప్రవర్తకులలో నొకఁడు: చూ, శాస్త్రప్రవర్తకులు.

**గౌద.** వై. వి.=గండ: చూ, రూ-గవుద (దేశ్యమని శబ్దరత్నాకరము.)

**గౌడకట్టు.** దే. వి. చెంపలను మూసికట్టుట. అం, భా. తృ. 37.

**గౌధారము.** సం. వి. అ. పుం. ఉడుముయొక్క పిల్ల: చూ, తేలుమేపరి. (గోధ యనఁగా ఉడుము; దానిపిల్ల గనుక గౌధేరము-గౌధారము-గౌధేయము అనంబరఁగు.)

**గౌధేయము.** సం. వి. అ. పుం. —వై.—

**గౌధేరము.** సం వి. అ. పుం. —వై.—

**గౌపుచ్ఛికము.** సం. వి. అ. పుం. రెండు త్రాటిమ్రాఁకులనుచేర్చి కట్టి నీరుదాఁటెడు సాధనము, సంగడి: చూ, పుత్తడము.

**గౌర.** దే. వి: చూ, రూ-గవుర.

**గౌరజీరకము.** సం. వి. అ. పుం. తెల్లజీలకఱ్ఱ*: చూ, సుమవి. 2.

**గౌరము.** సం. వి.అ. న. 1. బ.అకరువు,కింజల్కములు: చూ, పత్మ్మము. 4; పుం. 2. బ. తెల్లావలు (న. అని కొందఱు): చూ, సర్షపము; 3. తెలుపు: చూ, వర్ణము. 6; 4.పసుపుపచ్చ: చూ, వర్ణము. 6; 5. పసుపుపచ్చరంగు అధికముగాఁ గలిగిన యెఱుపు: చూ, వర్ణము. 6; 6. నారింజ*: చూ, శర్కరాంకము; 7. నెమిలడుగుమ్రాను*: చూ, పూతికరజము; 8. ఒకరకమువడ్లు: చూ, ధాన్యము; 9=గవరన. ఎఱుపు: చూ, వర్ణము. 6; 10 జింక: చూ, హరిణము; విణ. 11. ఎఱ్ఱనిది: చూ, వర్ణము. 6; 12. తెల్లనిది: చూ, వర్ణము 6; 13. పసుపుపచ్చనిది చూ, వర్ణము. 6; 14. స్వచ్ఛమైనది: చూ, శుద్ధము. 3.

**గౌరవము.** సం. వి. అ. న. =గరువము-గారాము, మరియాద: చూ, సన్మానము.

**గౌరవించు.** సం. స. క్రి: చూ, సన్మానించు.

**గౌరవితుఁడు.** సం. వి. అ. పుం. ఆర్యమిశ్రుఁడు: చూ, మర్యాదకుఁడు.

**గౌరశాకము.** సం. వి. అ. పుం. 1. నీరుఇప్ప*: చూ, మధూకము; 2. చౌగ*: చూ, ప్రివ.

**గౌరసర్షపము.** సం. వి. అ. పుం. తెల్లావాలు: చూ, సర్షపము.

**గౌరసువర్ణము.** సం. వి. అ. పుం: చూ, నెల్లి*

**గౌరసావర్ణము.** సం. వి. అ. పుం. —వై.—

**గౌరాత్మిక.** సం. వి. అ. స్త్రీ తదియతిథి: చూ, తిథి. 1.

**గౌరి.** సం. వి. ఈ. స్త్రీ. 1.=గౌరు దుర్గ: చూ, పార్వతి. 1; 2. పమర్తాదని కన్యక, పెండ్లిగాని పదేండ్లపడుచు,చీరకట్టనికన్నియ: చూ, స్త్రీ; 3.పసుపు: చూ, వర్ణము.6; 4.చేఁత

రాసి*: చూ, శకుల; 5. గోరోచనము: చూ, గోచన; 6. ఇంగువ: చూ, హింగువు. 2; 7. బ కొఱ్ఱలు: చూ, ధాన్యము; 8. వరుణునియిల్లాలు: చూ, భార్య. 1; 9: చూ, రాత్రి; 10. నేల: చూ, భూమి. 1; 11. ఏఱు: చూ, నది; 12 నలువ రాణి: చూ, సరస్వతి. 1; అం. 13. యౌవన భేదములుగల స్త్రీలలో తొమ్మిదివత్సరముల లేఁతజవ్వనముగల కన్యక: చూ, యౌవనభేద ములు; 14 భాషాంగములుపదునొకటింటిలో నొకటి: చూ, భాషాంగములు (చూ, భాష 1.)

**గౌరిక.** సం. వి. ఆ. స్త్రీ.=గోరువంక: చూ, శారిక. 1.

**గౌరికము.** సం. వి. అ. పుం. తెల్లలావుకపిట్ట: చూ, లావుక.

**గౌరికుంకుమలు.** దే. వి. బ. ఒకరకమువడ్లు: చూ, ధాన్యము.

**గౌరిపిండ.** సం. వి. ఆ. స్త్రీ: చూ, గోరోచన.

**గౌరేక.** సం. వి. ఆ. స్త్రీ.=: చూ, రూ-గౌరిక.

**గౌరీపుత్రి.** సం. వి. ఈ. స్త్రీ. బుద్ధునితల్లి: చూ, బుద్ధుఁడు. 1.

**గౌరీవాసము.** సం. వి. అ. పుం: చూ, మధూకము*.

**గౌరు.** దే. వి: చూ, రూ-గవురు. 1-2-3-4; వై. వి. 5=గౌరి. చూ, రూ-గవురు. 5.

**గౌరుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు: చూ, హిమాంశువు.

**గౌర్ధాలికము.** సం. వి. అ. న. గుద్దలికంటె సఖువుగనుండు పనిముట్టు: చూ, గుద్దలి.

**గౌలు.** దే. వి: చూ, రూ-గవులు.

**గౌలేయకము.** సం. వి. అ. పుం. కొండపోఁక*: చూ, పోఁక.

**గౌష్ఠీనము.** సం. వి. అ. న. మునుపావులున్న సాల: చూ, సదనము. 1.

**గౌసెన.** వై. వి.-కో. శ. స్వా. 4, అ. 88: చూ, రూ-గవుసెన.

**గౌళ.** అం. 1. పురుషరాగము లెనిమిదింటిలో నొకటి: చూ, పురుషరాగములు; 2. స్త్రీ రాగము లిరువదినాలుగింటిలో నొకటి: చూ, స్త్రీరాగములు.

**గౌళదేశస్త్రీ.** అం దేశస్త్రీలు ఇరువదినలుగు రిలో నొకతె: చూ. స్త్రీ. (చూ, దేశ స్త్రీలు.)

**గౌళము.** సం. వి. అ. పుం: చూ. రూ-గౌడము.

**గౌళి.** దే. వి: చూ, రూ-గవుళి.

## గ్ర

**గ్రంత.** వై. వి.=కందరము: చూ, రూ-క్రంత. 2.

**గ్రంథకర్త.** సం. విశ. ఋ. గ్రంథకారుఁడు: చూ, కృతికర్త.

**గ్రంథకుటి.** సం. వి. ఈ. స్త్రీ. వ్రాసెడి గది, కరణము లెక్కలు వ్రాసెడిచావడి (అని కొందఱు), గ్రంథములుగల గది, పుస్తకభాండాగారము (అని కొందఱు): చూ, సదనము. 1.

**గ్రంథనము.** సం. వి. అ. న. 1. కూర్పు, చంపూ ప్రబంధరచన (అనియు): చూ, మాటలల్లుట; 2. పూలుమొదలగునవి గ్రుచ్చుట: రూ-గ్రథనము. (గ్రంథన అనియు)

**గ్రంథము.** సం. వి. అ. పుం. 1. కావ్యము. (కవికల్పితమైనది): చూ, పుస్తకము; 2. మాటలపొందిక; 3. ముప్పదిరెండక్షరముల శ్లోకము, అనుష్టుప్పు: చూ, ఛందస్సులు; 4. నియమగ్రంథము: చూ, శాస్త్రము. 1. (చూ, కావ్యము); 5. ధనము: చూ, విత్తము. 1.

**గ్రంథసంధి.** సం. వి. ఇ. పుం. ప్రకరణము: చూ, సర్గము. 1.

**గ్రంథి.** సం. వి. ఇ. పుం=కంతి: 1. వెదురులో నగువాని బుడిపి: చూ, బుడిపి; 2. గడ్డవలెఁ

బుట్టెడురోగము: చూ, దద్రువు; 3. పుంగుడు: చూ, బొప్పి; 4. దద్దు: చూ, దద్రువు; 5. చెట్టులోనగువానిముడి: చూ, ముడి. 1; 6. దారములోనగువాని ముడి: చూ, ముడి. 2; 7. వెండ్రుకలముడి: చూ, ముడి. 3; 8. రూకలముడి: చూ, ముడి. 4; 9. కీల్లముడి; 10. గండివనము *: చూ, రాజార్హము; 11. రథాభరణము: చూ, భూషణము. 2; 12. వంకర: చూ, వేల్లితము. 2; వా. వి 13. తలుపు అడ్డుగడియ.

గ్రంథిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కట్లతీఁగె *: చూ, పర్యంకపాలిక; 2. పచ్చేవస *: చూ, విష.

గ్రంథికము. సం. వి. అ. న. పిప్పలివేరు: చూ, పిప్పలి. 1; 2. గండివనము*: చూ, రాజార్హము; పుం. 3. గుగ్గిలము *: చూ, మహిసాక్షి; 4. కరీరము *: చూ, వెణుతురు; 5. అగరుమ్రాను *: చూ, చందనము; 6: చూ, సగురువము *; 7: చూ, గ్రంథిక. 2.

గ్రంథికుఁడు. సం. వి. అ. పుం. 1. జోస్యుఁడు: చూ, సాంవత్సరుఁడు; 2 యుధిష్ఠిరునికడ గోట్టుతమ్ముఁడు.

గ్రంథితము. సం. విణ. 1. రూ-గ్రథితము, దృబ్ధము, (కూర్పఁబడిన పుష్పమాలికాదులని అమరము) కూర్పఁబడినది: చూ, సంయోజితము; 2. హింసింపఁబడినది: చూ, హింసితము.

గ్రంథిపర్ణకము. సం. వి. అ. న. 1: చూ, మాచిపత్రి *; 2. స్థౌణేయమను గంధద్రవ్యము: చూ, రాజార్హము.

గ్రంథిపర్ణము. సం. వి. అ. న. 1.=గండివనము. గ్రంథిపర్ణకము *: చూ, రాజార్హము. 2. పచ్చాకు *: చూ, హరితపత్రిక.

గ్రంథిపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. గండదూర్వ *: చూ, తృణము. 1.

గ్రంథిపాత్తు. సం. వి. ద్. పుం. ఒంటె: చూ లొట్టిపిట్ట.

గ్రంథిఫలము. సం. వి. అ. పుం: చూ, వెలఁగ*

గ్రంథిలము. సం. వి. అ. పుం. 1. పుల్లవెలఁగ: చూ, ములువెలఁగ; 2: చూ, వెణుఁతురు* విణ 3. గనుపులుగలది.

గ్రంథిహరుఁడు. సం. వి. అ. పుం: చూ, మంత్రి

గ్రంథె. వై. వి.=గ్రంథి. దారబంధములోనగువాని నిలువులయందు బిగఁగొట్టిన చీలలకు తగిలించెడు తలుపులయందలి యినుపపట్టె; తలుపు అడ్డుగడియ. (అనియు).

గ్రక్కతిల్లు. దే. అ. క్రి: చూ, భయపడు.

గ్రక్కదలు. దే. అ. క్రి. (కదలు + కదలు మిక్కిలి కదలు.

గ్రక్కన. దే. దృ. క్రి. విణ. శీఘ్రముగ. పా. 1 ఆ. 23: చూ, వేగము. 3.

గ్రక్కున. దే. దృ. క్రి. విణ. —వై.—

గ్రగ్గులుకాఁడు. దే. వి. 1. పాఱిపోయినవాఁడు చూ, పలాయితుఁడు; 2. భయముతోఁ గూడినవాఁడు: చూ, భయశీలుఁడు.

గ్రచ్చ. దే. వి: చూ, రూ-గచ్చ *.

గ్రచ్చకాయలు. దే. వి. బ 1: చూ, బాలక్రీడ. 2. గచ్చచెట్టుకాయలు.

గ్రచ్చు. వై. విణ.=గ్రస్త. గ్రస్తోక్తి: చూ, శబ్దము. 2. [నము.]

గ్రథనము. సం. వి అ. న: చూ, రూ-గ్రంథ

గ్రథితము. సం. విణ. 1: చూ, గ్రంథితము. 1 2. గ్రువ్వఁబడినది.

గ్రద్ధ. వై. వి. = గృధ్రము: చూ, రూ-గద్ద

గ్రద్దగోరు. వై. వి. = గృధ్రనఖ. చోరసాధన విశేషము: చూ, రూ-గద్దగోరు.

గ్రద్దన. దే. దృ. క్రి. విణ: చూ, గ్రక్కన.

గ్రమ్మన. దే. దృ. క్రి. విణ. —వై.— జై. 3, ఆ. 5.

గ్రమ్మున. దే. దృ. క్రి. విణ. —వై.—

**గ్రసించు.** సం. స. క్రి. 1. కప్పు: చూ, మ్రింగు; 2. తిను: చూ, సాపడు; 3. గుటక వేయు: చూ, మ్రింగు.

**గ్రసిష్ణువు.** సం. విణ. ఉ. 1 నమలితినువాఁడు: చూ, మ్రింగువాఁడు; 2. నమలక నే గుటక వేయువాఁడు: చూ, మ్రింగువాఁడు.

**గ్రస్తము.** సం. విణ. 1. రూ-గ్లస్తము. తినఁబడినది: చూ, భుక్తము. 2; 2. మ్రింగఁబడినది: చూ, భుక్తము. 2; 3: చూ, కచ్చు; 4. లోపించిన వర్ణములు పదములుగల వాక్యము. (వి. అని కొందఱు.)

**గ్రస్తు.** వై. వి.=గృహస్థః: చూ, ఇంటికాఁపు (రూ-గేస్తు-గేస్తుఁడు.)

**గ్రహకల్లోలము** సం. వి. అ. పుం. రాహుగ్రహము: చూ, రాహువు. 2.

**గ్రహగతులు.** పా. వక్రము, అతిచారము, స్తంభన, అస్తంగతత్వము, సమాగమము, యుద్ధమునందోడిపోవుట, జయించుట, రాశ్యంతగ్రహము.

**గ్రహణము.** సం. వి. అ. న. 1. రాహువు సూర్యచంద్రులను బట్టుట (ఇది ద్వివిధము.—చంద్రగ్రహణము, సూర్యగ్రహణము ) గ్రహణమనఁగా—చంద్రుఁడు గ్రహపాత స్థానములయందున్నప్పుడే సూర్యుఁడును, భూమియు, చంద్రుఁడును ఏకసమరేఖలో నుండుట తటస్థించును. మఱియు చంద్రుఁడు గ్రహపాతస్థానములయందు పూర్ణిమ, అమావాస్యలయందే యుండును. భూమివలన నేర్పడిన ఛాయయందు చంద్రుఁడు ప్రవేశించినప్పుడు చంద్రగ్రహణమును, చంద్రుని వలన నేర్పడిన ఛాయయందు భూమి ప్రవేశించినప్పుడు సూర్యగ్రహణమును గలుగుచున్నవి: ఉపగ్రహము, ఉపరాగము, కందశము, గ్రహము; 2. గ్రహించుట: చూ, ప్రతిగ్రహము. 1; 3 ఆదరణము, ప్రేమము: చూ, స్నేహము. 1; 4. చెలినిడిన పాణి; 5. చేయి: చూ, హస్తము; 6. తెలివి: చూ, బుద్ధి.

**గ్రహణి.** సం. వి. ఈ. స్త్రీ. ప్రవాహిక: చూ, రోగము. 1.

**గ్రహదుర్బలములు.** పా. నీచ, శత్రుగ్రహముల సంబంధముగలవారును, నీచాంశ, శత్రు అంశలను బొందినవారును, నీచనుబొందినవారును, అస్తంగతులైనవారును, శత్రుక్షేత్రమందున్నవారును, అవరోహణ గ్రహములును, యుద్ధమందోడిన గ్రహములును దుర్బలులు.

**గ్రహనాశనము.** సం. వి. అ. పుం. ఏడాకులరఁటి *: చూ, రంభ. 2.

**గ్రహనిఘంటువు.** పా: చూ, రాహువు. 2.

**గ్రహపతి.** సం. వి. ఇ. పుం: చూ, సూర్యుఁడు.

**గ్రహపాతములు.** పా. చంద్రమార్గమును, భూమార్గమును ఏకసమప్రదేశమందులేవు. చంద్రునికక్ష్య భూకక్ష్యకు సుమారు 5 అంశలు వంగియున్నది. చంద్రకక్ష్యయు, భూకక్ష్యయు రెండుస్థానములయందుమాత్రము కలిసికొని యున్నవి. ఈ రెండుస్థానములకును గ్రహపాతములని పేరు.

**గ్రహప్రాణములు.** పా. అతీతము, అనాగతము, సమము, విషమము (4): (చూ, తాళప్రాణములు.)

**గ్రహబలములు.** పా. స్వోచ్చ, మూలత్రికోణ, స్వక్షేత్ర, మిత్రక్షేత్ర, మిత్రద్రేక్కాణముల యందుండువారలును, ఆరోహణగ్రహములును, యుద్ధమందు జయించినవారును బలాధికులు.

**గ్రహము.** సం వి. అ. పుం. 1: చూ, గ్రహణము. 1; 2. రాహుగ్రహము, తలగాము: చూ, రాహువు. 2; 3. సూర్యాది: చూ, గ్రహములు; 4. రూ-గ్రాహము. గ్రహించుట: చూ, ప్రతిగ్రహము. 1; 5. అనుగ్రహము: చూ, సాకతము. 2; 6. (భూతకి మొదలగు పిశాచము: చూ, భూతము; 7. (ఊర్ధ్వాకారమైన) యజ్ఞపాత్రవిశేషము: చూ, పాత్రము 6; 8. (యుద్ధ) ప్రయత్నము: చూ, యత్నము; 9. తొందరపాటు: చూ, సంభ్రమము. 1; 10. తొమ్మిది: చూ, మూమ్మఁడు; 11=గాము: చూ, రాహువు. 2; 12. తాళప్రాణములు పదింటిలో నొకటి: చూ, తాళప్రాణములు.

**గ్రహములకాచ్ఛాదన.** పా. పూర్ణచంద్రుఁడు, శని, కేతువు వీరు తామున్న రాశికి ద్వితీయమును, ద్వాదశమును నాచ్ఛాదింతురు. గురుఁడు

తానున్న రాశికి తృతీయైకాదశముల నాచ్ఛా దించును.

గ్రహములదిగ్బలము. పా. లగ్నమందు బుధ గురులున్నప్రుడు తూర్పుదిక్కునపూర్ణ బలులు, చతుర్థమందు శుక్రచంద్రు లున్నపుడు ఉత్తరదిక్కున పూర్ణబలులు, సప్తమమందు శని యున్నపుడు పశ్చిమమున పూర్ణబలుఁడు, దశమమందు రవ్యంగారకు లున్నచో దక్షిణ దిశయందు పూర్ణబలులు.

గ్రహములు. అం. సూర్యుఁడు, చంద్రుఁడు, అంగారకుఁడు, బుధుఁడు, బృహస్పతి, శుక్రుఁడు, శని, రాహువు, కేతువు. (9); వరుణగ్రహము (యూరేనస్), ఇంద్రగ్రహము (నెప్ట్యూన్), ప్లూటోగ్రహము (ప్లూటో). మొ: చూ, రాహువు. 2.

గ్రహముల దశాపరిమాణాదులు. పా.

| గ్రహములు. | | ర | చం | అం | బు | బృ | శు | శ | రా | కే |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| దశాపరిమాణములు. | | 6 | 10 | 7 | 17 | 16 | 20 | 19 | 18 | 7 |
| తానున్న రాశికి వీక్షణములు. | | 7 | 7 | 4-7-8 | 7 | 5-7-9 | 7 | 3-7-10 | ... | ... |
| తానున్న రాశికి బలిష్ఠతలు. | | 7 | 7 | 4-8 | 7 | 5-9 | 7 | 3-10 | ... | ... |
| ఒకరాశియందు చారములు. | | 30 | $2\frac{1}{4}$ | 45 | 30 | 12 | 30 | 30 | 18 | 18 |
| వర్గము.- | స్వ | ... | ... | 3 | ... | 3 | ... | 4 | 2 | ... |
| | శుభ | 11 | 10 | 11 | 4 | 11 | 3 | 12 | 12 | 13 |
| | పాప | 5 | 6 | 5 | 12 | 5 | 13 | 4 | 4 | 3 |
| కాలబలములు. | | పగలు | రాత్రి | రా | సదా | ప | ప | రా | ... | ... |
| సౌమ్యక్రూరత్వములు. | | క్రూర | పూర్ణ చం.సౌ. క్షీణ చం.క్రూ | క్రూ | సౌ | సౌ | సౌ | క్రూ | క్రూ | క్రూ |
| ధాతువులు. | | ఎముక | నెత్తురు | ఎముకలలోని ధాతువు | చర్మము | మెదడు | రేతస్సు | నరములు | ... | ... |
| రుచులు. | | కార | ఉప్పు | చేదు | అన్ని | తీపి | పులు | వగరు | ... | ... |
| స్వరూపములు. | | పరితాపశాలి | కృశాంగుఁడు | నిత్యయౌవనశరీరి | గద్గదభాషి | స్థూలసుందరశరీరి | సుందరాంగుఁడు | క్రూర | ... | ... |
| కీడులు. (రోగములు) | | అగ్నిరోగ | పాండువు | బృహద్బీజ | గుహ్యరోగ | గుల్మరోగ | మేహరోగ | సంధి | అపస్మార | దురద |
| కారకత్వములు. | | ఆత్మ | బుద్ధి | భూమి | జ్ఞాన | ధన | దాస్య | శ్వేతచ్ఛత్రి | ఆరామ | మోక్ష |
| నైసర్గిక. | మిత్రత్వ | చ,కు,గు | ర,బు | గు,చ,ర | శు,ర | ర.కు.చ | శ,బు | శు,బు | ... | ... |
| | శతృత్వ | శ,శు | ... | బు | చ | బు, శు | ర, చ | ర,చ,కు | ... | ... |
| | సమత్వ | బు | కు, గు, శు, శ | శు, శ | కు,గు,శ | శ | కు, గు | గు | ... | ... |
| పంచభూతాద్యధికారములు. | | అగ్ని | జల | అగ్ని | భూమి | ఆకాశ | జల | వాయు | ... | ... |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఉచ్చ. | మే | వృష | మ | కన్య | కర్క | మీ | తు | మి | ధ |
| పరమోచ్చ. | $\frac{1}{10}$ | $\frac{1}{3}$ | $\frac{1}{28}$ | $\frac{1}{15}$ | $\frac{1}{5}$ | $\frac{1}{27}$ | $\frac{1}{20}$ | ... | ... |
| నీచ. | తు | వృశ్చి | కర్క | మీ | మ | కన్య | మే | ధ | మి |
| పరమనీచ. | $\frac{1}{10}$ | $\frac{1}{3}$ | $\frac{1}{28}$ | $\frac{1}{15}$ | $\frac{1}{5}$ | $\frac{1}{27}$ | $\frac{1}{20}$ | ... | ... |
| మూలత్రికోణము. | సిం | వృష | మే | కన్య | ధ | తు | కుం | సిం | కుం |
| స్వక్షేత్రము. | సిం | కర్క | మే, వృశ్చి | కన్య, మి | ధ, మీ | వృష, తు | మ, కుం | కన్య | మీన |

| గ్రహములు. | ర | చం | అం | బు | బృ | శు | శ | రా | కే |
|---|---|---|---|---|---|---|---|---|---|
| స్వభావము. | $\frac{1}{2}$ పా | * | $\frac{3}{4}$ పా | $\frac{1}{2}$ శు | శు | $\frac{3}{4}$ శు | శు | ... | పాపి |
| జాతులు. | క్షత్రి | వైశ్య | క్ష | వై | బ్రా | బ్రా | శూ | ... | ... |
| లింగములు. | పు | స్త్రీ | పు | న | పు | స్త్రీ | న | స్త్రీ | న |
| వర్ణములు. | ఎ | తె | ఎ | ఆ, ప | ప | తె | నీల | ధూ | ధూ |
| దిక్కులు. | తూ | వా | ద | ఉ | ఈ | ఆగ్నే | ప | నై | ... |
| వయస్సు. | 50 | ... | బాల్య | కౌమార | 30 | 16 | 100 | 100 | 100 |
| గుణములు. | సత్త్వ | స | త | ర | స | ర | త | త | త |
| రత్నములు. | మాణి | ముత్య | పగ | మర | పుష్య | వజ్ర | నీల | గో | వై |
| ధాన్యములు. | గో | వ్రీ | కం | పె | సెన | బొ | ను | మి | ఉ |
| చరస్థిరములు. | స్థిర | చర | చర | ఉభ | ఉభ | స్థిర | ఉభ | చ | చ |

* పూర్ణచంద్రుఁడు = గురుసముఁడు, త్రిపాదచంద్రుఁడు = శుక్రతుల్యుఁడు, అర్ధచంద్రుఁడు=బుధసముఁడు, క్షీణచంద్రుఁడు = పాదశుభుఁడు.

గ్రహసమయములు. పా. సూత్రము.-1. మేషాది జన్మలగ్నమువఱకు లెక్కించి యాసంఖ్యనొకచోట నుంచుకొనుము, 2. ఏగ్రహమునకు ఏసమయము కనుఁగొనవలెనో యాగ్రహము మేషాదియెన్నవరాశియందుండునో నాసంఖ్యను దెలిసికొనుము, 3. పైరెండుసంఖ్యలనుగుణించి యా గుణించిన మొత్తము నొకచోట నుంచుకొనుము, 4. పైగుణించినమొత్తమును నక్షత్ర సంఖ్య యనఁగా 27 చేతను భాగించుము. ఒకప్పుడు 27 చే భాగించుటకు 27 కన్న తక్కువమొత్తమున్నయెడల ఆ తక్కువ మొత్తమునే మహాదశాసంవత్సర సంఖ్యచే గుణింపవలెను, 5. భాగించగా వచ్చినశేషమును ఏగ్రహమునకు సమయము కావలెనో ఆ గ్రహదశాసంవత్సర సంఖ్యచేతను గుణించుము, 6. అట్లు గుణించగావచ్చిన మొత్తమును తిరిగి 27 చేతను భాగించుము. భాగించగావచ్చిన శేషము సమయమనఁబడును. ఒకప్పుడు శేషము రానియెడల 27నే శేషముగా నెంచుకొనవలయును.

సమయములు. ఫలములు.

1 స్నాన = ధైర్యము.
2 వస్త్ర = ప్రభుత్వము.
3 తిలకధారణ = క్షేమము.
4 జప = శత్రుజయము.
5 శివపూజ = —వై.—
6 ఉపాసన = దుఃఖము.
7 విష్ణుపూజ = జయము.
8 బ్రాహ్మణపూజ = రాజ్యము.
9 నమస్కార = మంగళము.
10 అద్రిప్రదక్షిణ = దారిద్ర్యము.
11 వైశ్వదేవ = అశుభము.

12. అతిథిపూజ=భోగము.
13. భోజన= —పై—.
14. విద్యాప్రసంగ=పండితుఁడు.
15. ఆక్రోశ=వ్యసనము.
16. తాంబూల=స్త్రీసౌఖ్యము.
17. రాజవిలాసస్థిత=జయము.
18. కిరీటధారణ=సుఖము, గజారోహణము.
19. జలపాన=సుఖము.
20. ఆలస్య=మిక్కిలిభయము.
21. శయన=సౌభాగ్యము.
22. అమృతాశన=తృప్తి.
23. గంధపుష్పాద్యాభరణ=రాజ్యము.
24. స్త్రీసల్లాప=భోగము.
25. భోగ=భార్యాపుత్రులు.
26. నిద్రా=భోగవిహీనము.
27. రత్నపరీక్షా=ధనప్రాప్తి.

గ్రహములకు అవస్థలు. పా: చూ, అవస్థలు. 5.

గ్రహయాళువు. సం. విణ. ఉ: చూ, గ్రహీత.

గ్రహరాజు. సం. వి. అ. పుం. 1: చూ, సూర్యుఁడు; 2: చూ, హిమాంశువు.

గ్రహాధారుఁడు. సం. వి. అ. పుం. జ్యోతీరథుఁడు: చూ, ధ్రువుఁడు.

గ్రహించు. సం. స. క్రి. 1. కైకొను: చూ, పుచ్చుకొను; 2: చూ, తీసికొను; 3. తెలిసికొను: చూ, విదితమగు; 4. పొందు: చూ, ప్రాపించు. (గ్రహియించు అనియు.)

గ్రహిలుఁడు. సం. విణ. గ్రహించువాఁడు: చూ, గ్రహీత.

గ్రహీత. సం. విణ. (ఋ. ఈ. ఋ) -పై.-: గాయకుఁడు, గ్రహయాళువు, గ్రహిలుఁడు, గ్రాహకుఁడు, గృహయాలువు- యా.-గృహయాళువు, గృహీత, గ్రహీత.

గ్రహీతుఁడు. సం. విణ. గాలిసోఁకినవాఁడు.

# గ్రా

గ్రాంథికము. సం. విణ. గ్రంథమునది.

గ్రాఁజి. దే. వి. ఒకరకము చెట్టు. పాండు. 4, ఆ. 21: చూ, వృక్షము.

గ్రాద. దే. వి. కదుము: చూ, బొప్పి.

గ్రామకూటుఁడు. సం. వి. అ. పుం. పెద్దకాఁపు: చూ, మహత్తరుఁడు. [ఖేటము.

గ్రామటిక. సం. వి. ఆ. స్త్రీ. పల్లె: చూ,

గ్రామణి. సం. వి. ఈ పుం. 1: చూ, మంగలి; విణ. 2. = గామిడి. గ్రామాధిపతి: చూ, మునసబు; 3.=గామిడి: చూ, శ్రేష్ఠుఁడు.

గ్రామత. సం. వి. ఆ. స్త్రీ. గ్రామముల సమూహము; చూ, ఖేటము.

గ్రామతక్షుఁడు. సం. వి. అ. పుం. గ్రామమున కధీనుఁడైన కాణాచి, వడ్లంగి: చూ, స్వర్ణకారుఁడు.

గ్రామదూరన్యాయము. పా. ఈ యూరికా యూరెంతదూరమో ఆయూరికీయూరంతే దూరమను విధము. [ఖేటము.

గ్రామధానము. సం. వి. అ. న. పల్లె: చూ,

గ్రామపాలన. అం. తంత్రములు అఱువదినాలుగింటిలో నొకటి: చూ, తంత్రములు.

గ్రామమద్గురిక. సం. వి. ఆ. స్త్రీ. 1. బొమ్మిడాయి అను చేఁప: చూ, మత్స్యము. 1; 2. గ్రామయుద్ధము: చూ, యుద్ధము.

గ్రామముఖము. సం. వి. అ. న. అంగళ్లబజారు (తెలు) అంగళ్లవీధి: చూ, మార్గము. 1.

గ్రామము. సం. వి. అ. పుం. 1. ఊరు: చూ, ఖేటము; 2. షడ్జాదిస్వరము: చూ, స్వరము. 2; 3. (శబ్దాదిపూర్వక మైనపుడు) గుంపు. (ఉదా.—శబ్దగ్రామము, గుణగ్రామము): చూ, సమూహము.

గ్రామములు. అం. షడ్జగ్రామము, మధ్యమ గ్రామము, గాంధారగ్రామము.

గ్రామమృగము. సం. వి. అ. పుం. కుక్క: చూ, శునకము.

గ్రామసింహము. సం. వి. అ. పుం. —పై.—

గ్రామసూకరము. సం.వి. అ. పుం. ఊరఁబంది: చూ, సూకరము.

గ్రామస్థులు. అం. అకృతసాక్షులు ఆఱుగురిలో నొకరు: చూ, అకృతసాక్షులు; 2. సాక్షులు పదునొకండుగురిలో నొకరు: చూ, సాక్షులు; 3. గ్రామమున కాఁపురమున్న వారు.

గ్రామాంతము. సం. వి. అ. న. మాలపల్లె: చూ, దేశము.

గ్రామిణి. సం. వి. ఇ. స్త్రీ. 1. నీలి *: చూ, రంజని; 2. బోగముది: చూ, వేశ్య; విశే. 3. ఊరిది.

గ్రాము. వా. వి. ఒక ఘనశతాంశమీటరు పరిమాణముగల నీటితూకము. [వాఁడు.

గ్రామేయుఁడు. సం. విశే: చూ, పల్లెటూరి

గ్రామ్యకుంకుమము. సం. వి. అ. న. కుసుంభా పూవురంగు: చూ, వర్ణము. 6.

గ్రామ్యకోశాతకి. సం. వి. ఈ. స్త్రీ. ఏనుఁగు బీఱ *: చూ, బీఱ. 2.

గ్రామ్యధర్మము. సం. వి. అ. పుం. స్త్రీసంగమము: చూ, సంయోగము.

గ్రామ్యము. సం. వి. అ. న. 1. అశ్లీలము, మూర్ఖునిమాట: చూ, శబ్దము. 2; 2. శబ్దదోష విశేషము: చూ, అశ్లీలము. 2; 3. అశ్లీలము, అసభ్యపుమాట: చూ, శబ్దము. 2; 4. పామర జనవాక్యము, అశ్లీలము: చూ, శబ్దము. 2; అం. 5. అశ్లీలము, అర్థదోషములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, అర్థదోషములు; 6. అశ్లీలము. (సిగ్గుగలిగించునది) పదదోషములలో నొకటి: చూ, పదదోషములు (చూ, కావ్యదోషములు.) (వ్యాకరణ నిషిద్ధమైన పామరభాష అనఁగా సిగ్గు, ఏవగము, అమంగళము కలిగించు పదములు. ఉదా.— "ఎఱు దేవయోనిగోప్తీ । విసరమహాపీన కుచ నవీనాశ్లేషా । ల్లసితుండవఁగాలిందీ । రసవిహారణకరణనిత్యరసికుండనఁగ ।" ఇచట యోని యనునది సిగ్గును గలుగఁజేయునది. పీ అనునది యేవగము. కాలిందీర=పూర్తిగాఁ గాలి పోయెనను నర్థము స్ఫురించుచున్నది. గావున నమంగళము; కావున శాస్త్రనిషిద్ధము గ్రామ్యము. లోకములోని జనులు మాటలాడు శబ్దములలో వ్యాకరణశాస్త్ర విరుద్ధమైనది గ్రామ్యము. ఈగ్రామ్యము చ్యుతసంస్కారమనియు నర్థగ్రామ్యమనియు రెండు విధములు. వ్యాకరణ దుష్టమైన పదములు వస్తాఁడు, తెస్తాఁడు, చేసుట, తీసుట యీ మొదలైనవి శాస్త్రవిరుద్ధ పదంబులు చ్యుతసంస్కారమున కుదాహరణంబులు. వీనిఁ బ్రయోగింపరాదు. (చూ, అర్థగ్రామ్యము). ఇత్యాది; న. 7 ఒకానొక రతిబంధము: చూ, రతిబంధము; 8 ఉమ్మెత్త *: చూ, హాలాపుష్పము; 9 కోళ్ళు మొదలగువాని జాతి; 10. ఆంధ్రభాష= తత్సమము, తద్భవము, దేశ్యము, గ్రామ్యము అని చతుర్విధము. ఈ నాలుగురీతులలో గ్రామ్య మొకటి; విశే. 11. గ్రామమునఁ బుట్టినది; అం. 12. ఉత్తానకరణబంధములు నలువదియొకటింటిలో నొకటి: చూ, ఉత్తానకరణబంధములు; 13. అష్టాదశ పదార్థములలో నొకటి: చూ, అష్టాదశ పదార్థములు.

గ్రామాశ్వము. సం. వి. అ. పుం. గాడిద: చూ, రాసభము.

గ్రామ్యుఁడు. సం.విశే: చూ, గ్రామేయుఁడు

గ్రావము సం. వి. న్. పుం. 1.= కరువ. కొండ: చూ, పర్వతము; 2. ఱాయి: చూ, రాయి.

గ్రావస్తుఁడు. అం: చూ, ఋత్విజుఁడు.

గ్రాసము. సం. వి. అ. పుం.=గాసము. కబళము: చూ, సాపాటు.

గ్రాహకము. సం. వి అ. పుం. 1. డేగ: చూ, శ్యేనము; విణ. 2. గ్రహించునది; పా. వి. 3. తీఁగెటుపాను గ్రహించు యంత్రము.

గ్రాహకుఁడు. సం. విణ.=గాయకుఁడు: చూ, గ్రహీత. [చూ, సముద్రాంత.

గ్రాహణి. సం. వి. ఆ. స్త్రీ. తీఁటకసింద *:

గ్రాహము. సం. వి. అ. పుం. 1: చూ, ప్రతిగ్రాహము. 1; 2. పంది: చూ, సూకరము; 3. చెఱ: చూ, బంధనాలయము; 4. ఒకానొక నీరుపాము, మొసలి (అని కొందఱు): చూ, మత్స్యము. 1.

గ్రాహి. సం. వి. న్. పుం. 1: చూ, వెలఁగ*; 2. ఉమ్మెత్త *: చూ, హాలాపువ్వము.

గ్రాహ్యము. సం. విణ. 1. గ్రహింపఁదగినది; 2. సంభోగబంధభేదము: చూ, రతిబంధము.

## గ్ర

గ్రక్కుర. దే. వి. డోఁకు: చూ, వాంతి.

## గ్రీ

గ్రీటు. దే. వి: చూ, బలవంతము.

గ్రీవ. సం. వి. ఆ. స్త్రీ 1. కంఠము: చూ, మెడ; 2. మెడనరము: చూ, మెడ.

గ్రీవము. సం. వి. అ. పుం. కిరణము: చూ, హాయనము.

గ్రీవాఘంట. సం. వి. ఆ. స్త్రీ. ఘర్ఘర, గుఱ్ఱపు మెడగంట: చూ, వీణ.

గ్రీవాభేదము. అం. నృత్యములు నాలుగింటిలో నొకటి: చూ, నృత్యములు.

గ్రీవాభేదములు. అం. సుందరి, తిరశ్చీనము, పరివర్తితము, ప్రకంపితము. (4).

గ్రీవావర్తి. అం. అనుభావర్తములలో నొకటి: చూ, అనుభావర్తములు.

గ్రీష్మభవ. సం. వి. ఆ. స్త్రీ: చూ, గ్రీష్మి *.

గ్రీష్మము. సం. వి. అ. పుం. 1. వేఁడి: చూ, వేఁడిమి; 2. వేసంగి, వెట్టకారు, గ్రీష్మఋతువు (జ్యేష్ఠము, ఆషాఢము): చూ, మాసద్వయము; అం. 3. కాలములు మూఁడింటిలో నొకటి: చూ, త్రయము. (చూ, కాలములు. 2.); 4. ఋతువులాఱింటిలో నొకటి: చూ, ఋతువులు. [పాది *.

గ్రీష్మసుందరి. సం. వి. ఈ. స్త్రీ: చూ, హంస

గ్రీష్మహాసము. సం. వి. అ న: చూ, దూది పోగు. [లొద్దుగు *.

గ్రీష్మాతిరీటము. సం. వి. అ. పుం: చూ,

గ్రీష్మి. సం. వి. ఈ. స్త్రీ: చూ, విరజాజి *.

గ్రీష్మోద్భవ. సం. వి. ఆ. స్త్రీ. —పై.—

## గ్రు

గ్రుక్క. దే. వి. 1. గ్రసనము. రూ-గుక్క. మ్రింగుట: చూ, మ్రింగుడు; 2. ఊపిరి, రూ-గుక్క: చూ, శ్వాసము.

గ్రుక్కకొను. ద్వ. అ. క్రి. చూ, మ్రింగు.

గ్రుక్కలుమ్రింగు. దే. అ. క్రి. 1. అపేక్షపడు: చూ, వాంఛించు; 2: చూ, రూ-గుటకలు మ్రింగు; 3: చూ, సంకోచించు.

గ్రుక్కిలి. దే. వి: చూ, గ్రుక్క.

గ్రుక్కిళ్లుమ్రింగు. దే. అ. క్రి. 1. అపేక్షపడు. కళా. 5, అ. 187: చూ, వాంఛించు; 2: చూ, సంకోచించు.

గ్రుక్కిళ్లుమ్రింగుట. వా. ఆశపడియుండుట. "నేనిప్పుడు నీపాంమునకే గ్రుక్కిళ్లు మ్రింగుచుందును" (నీతిచంద్రిక. విగ్రహము)

గ్రుక్కుమిక్కను. దే. అ. క్రి; చూ, గ్రుక్కిళ్లుమ్రింగు.

గ్రుక్కుమిక్కుమను. దే. అ. క్రి.—పై— (సంకోచించు.—ప్రభా. 1, ఆ. 28)

గ్రుక్కెఁడు. వా. వి: చూ, నోరెఁడు.

గ్రుచ్చు. దే. స. క్రి. 1. నాటు. ఆం, భా. తృ. 122; భాగ. 4, స్కం. 326: చూ, మొలవేయు (అ. క్రి. అని. శ. ర); అం. ప్రే. 2. నాటించు: చూ, నాటు; 3. తూఁటుఁజేయు. తూఱ్పు "సూదినిదారముగ్రుచ్చు": చూ, తూఱుచు.

గ్రుడ్డి. దే. వి. 1. అంధకుఁడు: చూ, రేచీఁకు; 2. అంధభావము. ఆం, భా. ద్వి. 124: చూ, చీఁకు.

గ్రుడ్డింగిలాయి. దే. వి. (గ్రుడ్డి + ఇంగిలాయి) ఒకరకము ఇంగిలాయి: చూ, మత్స్యము. 1.

గ్రుడ్డికామంచి. దే. వి. గోడుగుగడ్డిః: చూ, తృణము. 1.

గ్రుడ్డికొక్కెరాయి. ద్వ. వి కోయష్టికము: చూ, బకము.

గ్రుడ్డితనము. దే. వి: చూ, చీఁకు.

గ్రుడ్డిపాటు. దే. విశే. (గ్రుడ్డి + పాటు) దైవమువలనఁ గలిగినది. "వాని కీపని గ్రుడ్డిపాటుగా కలిగినది.": చూ, దైవికము.

గ్రుడ్డు. దే. వి. 1. గ్రుడ్డితనము: చూ, చీఁకు; 2. రూ-గుడ్డు. కనుగ్రుడ్డు: చూ, నేత్రము. 1; 3. రూ-గుడ్డు. పక్షిలోనగువాని అండము. అచ్చ. యు, కాం. 302: చూ, పేశీకోశము.

గ్రుడ్డుకానుపు. దే. వి. 1. పాము. అచ్చ. బాల, కాం. 8: చూ, సర్పము; 2. పిట్ట: చూ, పక్షి (దీనికి సరియైన సంస్కృతశబ్దము అండజము.)

గ్రుడ్లగూబ. ద్వ. వి. ఘూకము: చూ, పకినంపుఁ బులుఁగు.

గ్రుద్దు. దే. వి. 1. పిడికిటి పోటు: చూ, యుద్ధము; స. క్రి. 2. పిడికిటితో పొడుచు: చూ, చేసుము.

గ్రుద్దులాట. దే. వి. ముష్టియుద్ధము. ఆం, భా. ద్వి. 222: చూ, యుద్ధము.

గ్రుద్దులాడు. దే. అ. క్రి, స. క్రి. (అని కొందఱు) (గ్రుద్దులు + ఆడు). రూ-గుద్దులాడు: చూ, పోట్లాడు.

## గ్రె

గ్రెటు. దే. వి. గద్గదకంఠసాధుధ్వని: చూ, స్వరము. 2.

గ్రెణి. దే. వి. పరిహాసము: చూ, విలాసము. 1.

## గ్రై

గ్రైవము. సం. వి. అ. న. మెడతాడు: చూ, భూషణము. 2 (మెడను బెట్టెడు సొమ్ము అనియు) (చూ, సూత్రము. 1.)

గ్రైవేయకము. సం. వి. అ. న. —పై—

గ్రైవేయము. సం. వి. అ. న. —పై—

గ్రైష్మి. సం వి. ఈ. స్త్రీ: చూ, గ్రీష్మి*.

## గ్రొ

గ్రొచ్చు. దే. ప్రే. గుద్దలిలోనగువానితో పల్లముచేయు.

గ్రొయ్యు. దే. అ. క్రి. పల్లముపడు.

## గ్రో

గ్రోవులు. దే. వి. బ. భూషణవిశేషము: చూ, భూషణము. 2.

# గ్ల

గ్లస్తము. సం. విణ. తినఁబడినది: చూ, భక్షితము.
గ్లహము. సం. వి. అ. పుం. జూదమునందలి పందెము: చూ, వ్యవహారము. 4.

# గ్లా

గ్లాన. అం. సంచారీభావమునఁ బుట్టిన దృష్టులు ఇరువదింటిలో నొకటి: చూ, సంచారీభావమునఁ బుట్టిన దృష్టులు.
గ్లాని. సం. వి. ఇ. స్త్రీ. 1. శ్రమము చేతఁ గలిగిన దౌర్బల్యము: చూ, నిస్సత్త్వ; అం. 2. సంచారీభావములు ముప్పదిమూఁడింటిలో నొకటి: చూ, సంచారీభావములు. (ఉదా.— తొల్లి పూలబంతులం జేఁబూనుటకైన నలపొందునయ్యిందు వదనకొండకంటెను బరువగు నవ్వలపు నెట్లు సైరించు మందునోగదా.)
గ్లానుఁడు. సం. విణ: చూ, వ్యాధితుఁడు. 2.
గ్లాసు. వా. వి. అద్దపుపాత్ర: చూ, ముకురము.
గ్లాస్నుఁడు. సం. విణ. ఉ. చూ, రూ—గ్లానుఁడు.
గ్లాస్ను వు. సం. విణ. ఉ. —పై.—

# గ్లౌ

గ్లౌ. సం. వి. ఔ. పుం. 1. కర్పూరము: చూ, సిరము; 2. చంద్రుఁడు: చూ, హిమాంశువు.

# ఘ

ఘ. ఒకయక్షరము. సం. వి. అ. పుం. 1. మబ్బు: చూ, మేఘము. 1; 2. వేఁడి: చూ, వేఁడిమి; 3. బ. చిఱుఁగజ్జెలు: చూ, భూషణము. 2; 4. చిఱుఁగంట: చూ, భూషణము. 2; 5. గట్టించుట: చూ, దట్టింపు; 6. ముక్కంటి: చూ, శివుఁడు; 7. గుడ్లగూబ: చూ, సకినంభ్రుఁబులుఁగు; న. 8. వాద్యము (వీణ లోనగునది): చూ. వీణె; 9. అమృతము: చూ, సుధ. 1; ఆ. స్త్రీ. 10. నేల: చూ, భూమి. 1; 11. కబురు: చూ, సమాచారము. 2; 12. గొల్లపల్లె: చూ. దేశము; 13. అమ్ము. (పుం. అని కొందఱు): చూ, బాణము. 1; అం. 14. కంఠ్యములలో నొకటి: చూ, కంఠ్యములు.
ఘంట. సం. వి. ఆ. స్త్రీ. 1=గంట: చూ, గంట. 1 (చూ, కాలపరిమాణము); 2. ఒకానొక రాగము: చూ, స్వరము. 2; 3.=గంట. పిడిగంట యను వాద్యము: చూ, వీణె; 4: చూ, మొక్కము *; 5. బదరి *: చూ, రేఁగు; 6. పున్నాగము *: చూ, పొన్న; అం. 7. ప్రణవనాదములు పదింటిలో నొకటి: చూ, ప్రణవనాదములు.
ఘంటాపథము. సం. వి. అ. పుం. 1 సంసరణము, ఘంటలతోఁగూడిన యేనుఁగుల దారి: చూ, మార్గము. 1; న. 2. ముక్కువైపు కొలికి: చూ. ముక్కుకొలికి. [మొక్కము*.
ఘంటాపాటలము. సం. వి అ. పుం: చూ, ఘంటాపాటలి. సం. వి. ఇ. పుం. రూ— —పై.— [బువు *.
ఘంటాభిద. సం. వి. ఆ. స్త్రీ: చూ, నాదాలా
ఘంటారవ. సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, గిలగింత *; 2. బ. చిఱుఁగజ్జెలు: చూ, భూషణము. 2.
ఘంటారవము. సం. వి. అ. పుం: చూ, రాబందు.
ఘంటావధానము. అం. కళలఱువదినాలుగింటిలో నొకటి: చూ, కళలు.
ఘంటాశబ్దుఁడు. సం. వి. అ. పుం: చూ, వైతాళికుఁడు.

ఘంటిక. సం. వి. ఆ. స్త్రీ. 1. గొంతుముడి: చూ, ముడి. 5; అం. 2. చక్రములు తొమ్మిదింటిలో నొకటి: చూ, చక్రములు; 3. ఘనవాద్యము లాతింటిలో నొకటి: చూ, ఘనవాద్యములు.

ఘండము. సం. వి. అ. పుం: చూ, భ్రమరము.

ఘట. సం. వి. ఆ. స్త్రీ. 1. గుంపు: చూ, సమూహము; 2. ఏనుఁగుల గుంపు: చూ, హస్తి; 3. ఘటనము, రెండుమూఁడు మాఱులు ఏనుఁగును దట్టుట (అని కొందఱు): చూ, సంధానము. 1; 4 గోష్ఠి: చూ, సభ. 2.

ఘటకుఁడు. సం. విణ. ఘటిల్లఁజేయువాఁడు.

ఘటచక్రము. సం. వి. అ. న. రతిబంధవిశేషము: చూ. రతిబంధము.

ఘటచ్ఛదము. సం. వి. అ. పుం. మునగ *: [చూ. శిగ్రువు. 1.

ఘటదాసి. సం. వి. ఈ. స్త్రీ. విటీవిటులను తార్చెడియాఁతి: చూ, శంభళి.

ఘటన. సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, ఘట. 3; 2. కూర్పు: చూ, సంధానము. 1.

ఘటము. సం. వి. అ. న. 1. ఎళనీరుకాయ, వారికడేపుమొవ్వు (అని కొందఱు): చూ, ముక్కంటిపండు; పుం. 2.=కడవ. రూ- ఘటి: చూ, భాండము. 3; 3. ఏనుఁగు కుంభస్థలము: చూ, హస్తి; 4. శిఖరము: చూ, సుద. 3; 5. పాడునుయ్యి: చూ, నుయ్యి: 6. ఊపిరి లోనికిఁదీసి నిలుపుట: చూ, శ్వాసము; 7. నీలాటిరేవు: చూ, రేవు; 8. ఎగుమతీదిగుమతుల చోటు: చూ, రేవు; 9. గరగ. "నూకాలమ్మ ఘటము": చూ, పాత్రము. 6.

ఘటయంత్రము. సం. వి. అ. న. 1. నూతిగిలక: చూ, రాట్నము; 2: చూ, ఏతము. (1)

ఘటయోని. సం. వి. ఇ. పుం. అగస్త్యముని: చూ, ముని. 1.

ఘటశాసి. సం. వి. న్. పుం: చూ, తార్కికుఁడు.

ఘటి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఉల్లిపాషాణము: చూ, సౌవీరము. 2; 2. కుండ: చూ, భాండము. 3; 3. పిడత: చూ, భాండము. 3; 4. సీలమండ బుడిపి: చూ, సీలమండ; 5 = గడియ. రూ - ఘటి: చూ, గడియ. 1; 6. ఘటకార్యయను వాద్యము: చూ, వీణ.

ఘటిక. సం వి. ఆ. స్త్రీ. 1 = గడియ. రూ- ఘటి. ఇరువదినాలుగు నిమిషములకాలము: చూ, గడియ. 1; 2.=గడియ. గడెమాన్రు: చూ, విష్కంభము. 2; 3: చూ, బలపము; 4. కువాళి: చూ, పోఁకపొత్తి; 5. పాలఱాయి. చూ, రాయి; 6. చీలమండ బుడిపి: చూ, సీలమండ; 7. తెప్ప: చూ, ప్లోడము.

ఘటికాలగ్నము. పా. సూర్యోదయము మొదలు జననకాలమువఱకునైన గడియల సంఖ్యను 12 చే భాగించవలెను. భాగించగా వచ్చిన శేషసంఖ్యను జన్మలగ్నము మొదలు లెక్కపెట్టినయెడల నెన్నవలగ్నమగునో యది ఘటికాలగ్నమగును. ఒకప్పుడు 12 కన్న తక్కువ వచ్చినయెడల నాతక్కువసంఖ్యనే జన్మలగ్నము మొదలు లెక్కింప నేరాశియగునో యదియ ఘటికాలగ్నమగును.

ఘటితము. సం. వి. అ న. 1. ఏనుఁగులగుంపు: చూ, హస్తి; విణ. 2. బ్రద్దలుచేయఁబడినది: చూ, పాటితము; 3. గ్రువ్వఁబడినది: చూ, న్యూతము; అం. 4. చుంబనములు పదునైదింటిలో నొకటి: చూ, చుంబనములు.

ఘటికారము. సం. వి. అ. పుం =: చూ, రూ- ఘటీకారము.

ఘటికాసిద్ధి. అం. కళలఱువదినాలుగింటిలో నొకటి: చూ, కళలు.

ఘటిని. సం. వి. ఈ. స్త్రీ. ఉల్లిపాషాణము; [చూ, సౌవీరము. 2.

ఘుటిల్లు. సం. అ. క్రి. కలుగు. చూ, పుట్టు. 2.

ఘటీకారము. సం. వి. అ. పుం=గడియారము. కాలసూచకయంత్రము: చూ, గడియారము.

ఘటీకారుఁడు. సం. వి. అ. పుం: చూ, మృత్కా-రుఁడు.

ఘటీయంత్రన్యాయము. పా. ఏతమువలె కార్య మగునంతవఱకు వంగియుండి కార్యము కాఁగానే మీఁదికి నిక్కురీతి.

ఘటీయంత్రము. సం. వి. అ. న: చూ, రూ-ఘటు యంత్రము.

ఘటోత్కచాంతకుఁడు. సం. వి. అ. పుం. కర్ణుఁడు: చూ, రాధేయుఁడు.

ఘటోద్ధిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, ఘటదాసి.

ఘటోదకము. సం. వి. అ. పుం. కొబ్బరి*: చూ, నారికేళము.

ఘటోదరము. సం. వి. అ. న. దౌర్భాగ్యలక్షణము: చూ, లక్షణము. 1.

ఘటోద్భవుఁడు. సం. వి. అ. పుం. అగస్త్యముని: చూ, ముని. 1.

ఘట్టకుట్టీప్రభాతన్యాయము. ఒక వ్యవహారస్థుఁడొక పట్టణముచేరి తన వ్యవహారము చేసికొని పోవునప్పుడా పట్టణములోని ఘాటీపాక దగ్గఱనుండి వెళ్లినచో సుంకమీయవలసివచ్చునని యర్ధరాత్రివేళ మాఱుత్రోవను బోవలయునను తలంపుతోఁ బయలుదేరి యా పట్టణము సందులుగొందులు తిరిగి త్రోవ తెలియక తుదకు ఘాటీపాకదగ్గఱకుఁ జేరునప్పటికిఁ దెల్లవాఱినది. కనుక ఆయాసపడుటయు, సుంకమీయక తప్పక వచ్చెననుటయు నను విధము. (తప్పించుకొన నుద్దేశించిన కార్యముచేయవలసి వచ్చినయెడల నిది చెప్పఁబడును.)

ఘట్టగ. సం. వి. ఆ. స్త్రీ. 1. మాషపర్ణి *: చూ, మినుము; 2: చూ, రుద్రజడ*.

ఘట్టన. సం. వి. ఆ. స్త్రీ =గట్టన: చూ, దిమ్మిస.

ఘట్టము. సం. వి. అ. పుం. 1.=గట్టు. తీరము: చూ, రోధస్సు: 2. సుంకము పెుదలైనవి తీయుచోటు: చూ, సదనము. 1; 3. వనగిరి ప్రాయదేశము; 4. రామాయణాదులలోని శ్రేష్ఠమగు కథాభాగము: చూ, పట్టు. 14.

ఘట్టితము. సం. విణ. 1. గట్టింపఁబడినది; అం. 2. స్థితకరణబంధము లెనిమిదింటిలో నొకటి: చూ, స్థితకరణబంధములు( చూ, బంధములు.)

ఘతనుఁడు. సం. విణ: చూ, భక్షకుఁడు.

ఘన. సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, మినుము *; 2: చూ, రుద్రజడ *; వా. 3. పనసయొక్క ఆవృత్తి: చూ, మరలుఁబాటు.

ఘనకాలము. సం. వి. అ. పుం. వర్షర్తువు (శ్రావణ భాద్రపదమాసములు): చూ, మాస ద్వయము (చూ, ఋతువులు.)

ఘనకఫము. సం. వి. అ. పుం: చూ, వడగల్లు

ఘనచ్ఛాయ. సం. వి. ఆ. స్త్రీ. చింత *: చూ, తింత్రిణి. [చూ, బురద.

ఘనజంబాలము సం. వి. అ. న. గొప్పబురద:

ఘనడిండిమము. సం. వి.అ పుం. కొండదొండ*: చూ, దొండ. [కోయిల.

ఘనతాలము. సం. వి. అ. పుం: చూ, వాన

ఘనత్వక్కు. సం.వి. చ్. పుం: చూ, లొద్దుగు*.

ఘననామకము. సం. వి. అ. పుం. చిత్తి *: చూ, భండీరము. 2.

ఘనపల్లవము. సం. వి. అ. పుం: చూ, శిగ్రువు.1.

ఘనపుష్పము. సం. వి. అ. పుం. —పై.—

ఘనమగు. మి. అ. క్రి. దట్టమగు: చూ, వ్యాపించు.

ఘనమానము. పా. 1728 ఘనఅంగుళములు=1 ఘనఅడుగు, 27 ఘనఅడుగులు=1 ఘన గజము, 42 ఘనఅడుగులు (కలప)=1 (ఓడ బరువు) టన్ను: చూ, ఘనము. 11.

**ఘనము.** సం. వి. అ. న. 1. నృత్యాది మధ్యమానము (విలంబిత-ద్రుత-మధ్యంబులనెడి లయ విశేషములు వరుసగా తత్వ, ఓఘ, ఘనము లనంబడును): చూ, స్వరము. 2 (చూ, తాళము 2); 2. కంచుతాళము లోనగు వాద్యము: చూ, వీణె; 3. నడిమిపెరుఁగు: చూ, పెరుఁగు. 1; పుం. 4. తుంగముస్తె*: చూ, ముస్తకము; 5: చూ, లొద్దుగు*; 6. దిటవు: చూ, శక్తి. 1; 7. రూ. ఘనాఘనము. మబ్బు; చూ, మేఘము. 1. (అగ్నివలనఁ బుట్టిన భయంకరమగు మేఘము); 8.=గనము. విరివి: చూ, విస్తారము. 1; 9: చూ, సమ్మెట; 10. కుఱుచయినుపదుడ్డు: చూ, ముద్గరము; 11. వర్గ తిరిగి గుణించుట (ఘనపరిమాణము.= పొడవు × వెడల్పు × ఎత్తు): చూ, హెచ్చవేఁత; విణ. 12. దట్టమైనది: చూ, సాంద్రము. 2; 13. దిటవుగలది: చూ, వ్యాయతము. 1; అం. 14. గాయకదోషము లేక పాడెడి పాటయందలి ఆఱువిధములలో ముందుగ పాడఁబడునది (చూ, గానశాస్త్ర పండితుఁడు.) [రసాలము. 3.

**ఘనమూలము.** సం. వి. అ. పుం. చెఱకు*: చూ,

**ఘనరవము.** సం. వి. అ. పుం: చూ, రాబందు.

**ఘనరసము.** సం. వి. అ. పుం. 1. నీరు: చూ, సలిలము; 2 కర్పూరము: చూ, సిరము; 3. గుళిక: చూ, పూస; 4 చెట్టుబంక: చూ, బందన; 5. చల్ల: చూ, మజ్జిగ; 6. జొంగ*: చూ, సిరి; విణ. 7. దట్టమైనది: చూ, సాంద్రము. 2.

**ఘనవల్లిక.** సం. వి. ఆ. స్త్రీ. మెఱపు: చూ, విద్యుత్తు. 1. [చూ, నరకములు.

**ఘనవాతము.** సం. వి. అ. పుం. నరకభేదము:

**ఘనవాద్యములు.** అం. కాంస్యతాళము, తాళిక, ఘంటిక, జయఘంట, క్షుద్రఘంట, కర్త(6.)

**ఘనవాసము.** సం. వి. అ. పుం. గుమ్మడి*: చూ, మహాఫలము.

**ఘనవాహనుఁడు.** సం. వి. అ. పుం. 1: చూ, శివుఁడు; 2: చూ, వేలుపుఱేఁడు.

**ఘనశ్రేణి.** సం. వి. ఈ. స్త్రీ. నేల: చూ, భూమి. 1.

**ఘనసారతరువు.** సం. వి. ఉ. పుం. కర్పూరపు అరఁటి*: చూ, రంభ. 1.

**ఘనసారము.** సం. వి. అ. పుం. 1. కర్పూరము: చూ, సిరము; 2. గాడిద: చూ, రాసభము; 3. నీరు: చూ, సలిలము.

**ఘనస్వరము.** సం. వి. అ. పుం. 1. చిత్రికూర*: చూ, భండీరము; 2. ఉఱుము: చూ, స్తనితము. [కాలము.

**ఘనాకరము.** సం. వి. అ. పుం: చూ, ఘన

**ఘనాఘనము** సం. వి. అ. పుం. 1. కురియునట్టి మేఘము, తొలుమొగులు: చూ, మేఘము. 1; 2. హింసించునట్టి మదపుటేనుఁగు: చూ, హస్తి; 3. కొండ: చూ, పర్వతము; 4. ఐశ్వర్యము: చూ, సంపత్తి; 5. కవాటము: చూ, తలుపు; విణ. 6. దట్టము: చూ, సాంద్రము. 2.

**ఘనాఘనుఁడు.** సం. వి. అ. పుం. 1. ఇంద్రుఁడు: చూ, వేలుపుఱేఁడు; 2. దానశీలుఁడు: చూ, వదాన్యుఁడు; 3. దుర్మార్గుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

**ఘనాత్యయము.** సం. వి. అ. పుం. శరత్కాలము (ఆశ్వయుజము-కార్తీకము): చూ, మాసద్వయము (చూ, ఋతువులు.)

**ఘనాపాఠి.** వా. వి. వేదాధ్యయనసంపన్నుఁడు.

**ఘనాశ్రయము.** సం. వి. అ. పుం: చూ, విన్ను.

**ఘనీభవించు.** సం. అ. క్రి: చూ, ముద్దకట్టు.

**ఘనుఁడు.** సం. విణ. గొప్పవాఁడు: చూ, హేమాహేములు.

ఘనోదధి. సం. వి. ఇ. పుం. నరకభేదము: చూ, నరకములు.

ఘనోపలము. సం. వి. అ. పుం. చూ, వడగల్లు.

ఘరట్టన్యాయము. పా. తిరుగలిదిమ్మలు తిరుగు నదియు తిరుగనిదియు రెండు నుండినఁగాని ఒక్కటితిరిగెదానితో నేపనినెఱవేఱదనురీతి.

ఘరట్టము. సం. వి. అ. పుం. చూ, తిరుగలి.

ఘర్ఘటము. సం. వి. అ. పుం. ఘర్ఘటమనుచేఁప: చూ, మత్స్యము. 1.

ఘర్ఘర. సం. వి. ఆ. స్త్రీ. గుఱ్ఱపుమెడగంట: చూ, హయము.

ఘర్ఘరకము. సం. వి. అ. పుం. గుడ్లగూబ: చూ, సకినంపుఁబులుఁగు.

ఘర్ఘరము. సం. వి. అ. పుం. 1. రూ- -పై-; 2. కొండదారి: చూ, మార్గము. 1; 3. గర్భముమ్రోఁత: చూ, స్వరము. 2; 4. వాకిలి, ద్వితీతలకవాటము (అని కొందఱు): చూ, సదనము. 1; 5. అమృతరసమువలనఁ బుట్టిన నవ్వు: చూ, హాస్యము. 1; 6. వానకురియు చప్పుడు: చూ, స్వరము. 2; 7. ఉఱుము: చూ, స్తనితము; 8. వాద్యభేదము: చూ, వీణె.

ఘర్ఘరి. సం. వి. ఈ. స్త్రీ. 1. చిఱుగంట: చూ, భూషణము. 2; 2. ఒకరకము వీణె: చూ, చూ, వీణె; 3. ఒకానొక స్వరము: చూ, స్వరము. 2. [నది.

ఘర్ఘరిక. సం. వి. ఆ. స్త్రీ. ఘర్ఘరికానది: చూ,

ఘర్ఘుర. సం. వి.ఆ. స్త్రీ: చూ, యమకీటకము.

ఘర్వరకము. సం. వి. అ. పుం: చూ, ఘర్ఘరకము.

ఘర్వరిక. సం. వి. ఆ. స్త్రీ. 1. వయించెడి కట్టె: చూ, కొడుపు. 1; 2. భేరీవాద్యము: చూ, వీణె; 3: చూ, ఘర్ఘరిక.

ఘర్మము. సం. వి. అ. పుం. 1. ఎండ: చూ, వెలుఁగు. 3; 2. చెమట: చూ, స్వేదము. 1; 3. ఏనుఁగు హృదయమునందలి మదము: చూ, మదము. 1; 4: చూ, వేఁడిమి; 5. వేసంగి, గ్రీష్మర్తువు (జ్యేష్ఠము, ఆషాఢము): చూ, మాసద్వయము (చూ, ఋతువులు); అం. 6. గజమదము లెనిమిదింటిలో నొకటి: చూ, గజమదములు.

ఘర్షణము. సం. వి. అ. న: చూ, పీడనము.

ఘర్షణాలము. సం. వి. అ. పుం. నూరెడు గుండు: చూ, రాయి.

ఘర్షణి. సం. వి. ఈ. స్త్రీ. పసుపు: చూ, వర్ణము. 6.

ఘర్షించు. సం. స. క్రి: చూ, రాయిడిచేయు.

ఘుల్లరీముఖము. సం.వి. అ. న. రతిబంధవిశేషము: చూ, రతిబంధము. [సాపాటు.

ఘసి. సం. వి. ఇ. పుం. ఆహారము: చూ,

ఘస్మరుఁడు సం. విశే: చూ, భక్షకుఁడు.

ఘస్రము. సం. వి. అ. పుం. 1. దినము: చూ, రోజు; న. 2. అహము: చూ, పగలు; 3 కుంకుమము: చూ, వహ్నిశిఖము. 1; విశే. 4. కర్కశము, చంపునది: చూ, హింస్ర.

ఘస్రుఁడు. సం. విశే. హింసించువాఁడు.

# ఘా

ఘాంటికము. సం. వి. అ. పుం ఉమ్మెత్త: చూ, హాలాపుష్పము.

ఘాంటికుఁడు. సం. వి. అ. పుం వేకువను రాజు లనిద్రమేల్కొలిపెడువాఁడు: చూ, వైతాళికుఁడు. (రూ-ఘాటికుఁడు)

ఘాట. సం వి. ఆ. స్త్రీ: అవటువు: చూ, పెడతల.

ఘాటము. సం. వి. అ. పుం. —పై—

ఘాటి. సం. వి. ఈ. స్త్రీ: చూ, ఘాటు.
ఘాటిక. సం. వి. అ. స్త్రీ. —పై—
ఘాటికుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ- ఘాంటికుఁడు.
ఘాటియాబ్రాహ్మణులు. పా. వీరు కృష్ణశుక్ల యజుర్వేదులుగ నున్నారు. గంగావైతరణీ మొదలగు పుణ్యనదీ స్నానములకు వచ్చెడి వారలకు వైదికకర్మములను చేయించి జీవనము చేయుదురు: చూ, బ్రాహ్మణులు.
ఘాటీపాక. వా. మి. వి. సుంకము వసూలుచేయు యిల్లు (ఘాటీ అనియు): చూ, సదనము. 1.
ఘాతకుఁడు. సం. విణ: చూ, హింసకుఁడు.
ఘాతము. సం. వి. అ. పుం. 1. దెబ్బ: చూ, మొత్తు 1; 2. అమ్ము: చూ, బాణము. 1; 3. చంపుట: చూ, వధము; 4. కోనేరు: చూ, సరస్సు. 1; పా. 5. శక్తి (పవర్), ఘాతము (ఇందుకుసంబంధించిన శాస్త్రపరిభాషాపదములు—ద్వితీయఘాతము, త్రిఘాతము, చతుర్ఘాతము.)
ఘాతి. సం. వి. న్. పుం. డేగ: చూ, శ్యేనము.
ఘాతించు. సం. స. క్రి. చంపు: చూ, సంహరించు.
ఘాతిక. సం. వి. అ. స్త్రీ: చూ, పరిఖ.
ఘాతిని. సం. విణ. (ఈ). చంపునట్టిది: చూ, హింస్రి.
ఘాతుకుఁడు. సం. విణ. 1: చూ, రూ-ఘాతకుఁడు; 2: చూ, పాపుఁడు. [విన్న.
ఘామము. సం. వి. అ. పుం. ఆకసము: చూ,
ఘాముఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు: చూ, హిమాంశువు.
ఘారిక. సం. వి. అ. స్త్రీ. = గారె. అప్పాలు (అనికొందఱు) (ఘారి అనియు): చూ, భక్ష్యము.
ఘాసము. సం.వి.అ.పుం=కసవు: చూ, తృణము.1.
ఘాసి. సం. వి. ఇ. పుం. అగ్ని: చూ, వహ్ని.1.

## ఘి

ఘిమిరియాబ్రాహ్మణులు. పా. నేపాళదేశపు బ్రాహ్మణులలో నొక తెగవారు: చూ, బ్రాహ్మణులు.

## ఘీ

ఘీంకారము. సం. వి. అ. పుం=గీఁక. ఏనుఁగు గీఁక: చూ, స్వరము. 2.
ఘీంకృతము. సం. వి. అ. న. —పై—
ఘీంకృతి. సం. వి. ఇ. స్త్రీ. —పై—

## ఘు

ఘు. సం.వి.ఉ.పుం. చెప్పుడు: చూ, స్వరము.2.
ఘుంటకము. సం. వి. అ. పుం: చూ, సీలమండ.
ఘుంటము. సం. వి. అ. పుం. —రూ-పై—
ఘుండము. సం.వి.అ.పుం: చూ, భ్రమరము. 1.
ఘుటము. సం. వి. అ. పుం. రూ-ఘుటిక: చూ, సీలమండ.
ఘుటి. సం. వి. ఇ. స్త్రీ. 1. గుదికాలు: చూ, మడమ; 2: చూ, సీలమండ.
ఘుటిక. సం.వి.అ.స్త్రీ. 1: చూ, రూ-ఘుటము; 2=గుళిక: చూ, పూస; 3. చిన్నమందుండ: చూ, మాత్ర (1). (విన్న.
ఘుణప్రియ. సం. వి. అ. స్త్రీ. అతివస: చూ,
ఘుణము. సం. వి. అ. పుం. మ్రానితొలుచు పురుగు: చూ, పురుగు.
ఘుణవల్లభ. సం.వి.అ. స్త్రీ: చూ, ఘుణప్రియ.
ఘుణాక్షరన్యాయము. పా. మ్రానియందు నుసి పురుగులు తొలువఁగా నేర్పడిన యక్షరము యొక్క న్యాయము. (ఇది యాప్రయత్నముగా నేర్పడినదిగాని పురుగుయొక్క ప్రయత్నముచేతఁగాను. ఉద్దేశము లేక జరిగినదాని యందిది చెప్పఁబడును.)

ఘుర్ఘురము. సం. వి. అ. పుం. 1=గురగుర. పందికూఁత: చూ, స్వరము. 2; 2. ఘుర్ఘుర మను పురుగు: చూ, యమకీటకము.

ఘుర్ఘురి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొక జల జంతువు: చూ, మృత్కుర; 2. మండలియను వాద్యము: చూ, వీణె.

ఘుర్ఘురించు. సం. అ. క్రి. (పంది) కూయు: చూ, శబ్దించు.

ఘుర్మ్మరము. సం. వి. అ. పుం. కుమ్మరపురుగు: చూ, యమకీటకము.

ఘులఘులారవము. సం. వి. అ. పుం. పారావత భేదము: చూ, పావురము. [వ్యాప్తము.

ఘుష్టము. సం. విణ. చాటింపఁబడినది: చూ,

ఘుసృణము. సం. వి. అ. పుం. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము.

## ఘూ

ఘూకమార్గాలలోచనము. పా. ఎనమండ్ర మగం డ్రను జంపెడు స్త్రీగుణము. అనఁగా ఎని మిది మనువులు పోవు మగువ, భర్తృహంత్రి లక్షణము: చూ, లక్షణము. 1.

ఘూకము. సం. వి అ. పుం = గూబ: చూ, పక్షి సంపుఁ బులుఁగు. (సము. 1.

ఘూకారి. సం. వి. ఇ. పుం. కాకి: చూ, వాయ

ఘూకావాసము. సం. వి. అ. పుం. పెద్దటేఁకు*: చూ, శాకోటము.

ఘూర్జరము. సం. వి. అ. పుం=గుజరి-గుజరాతి. దేశము శేఁబదియాఱింటిలో నొకటి: చూ, దేశము.

ఘూర్జర స్త్రీ. అం. దేశస్త్రీలలో నొకతె: చూ, దేశస్త్రీలు (చూ, స్త్రీ.)

[ఘూ]ర్జరి. అం. 1. శ్రీరాగము లిరువదినాలుగిం [ట]నొకటి: చూ, శ్రీరాగములు; 2. పంచ మిజభావలు పదింటిలోనొకటి: చూ, పంచ మిజభావలు. (చూ, భావ. 1.)

ఘూర్జగ్యపాంగములు. అం. (చూ, అంగము.9) మహారాష్ట్రి ఘూర్జరి, సౌరాష్ట్రి, దక్షిణ, ద్రావిడ (4).

ఘూర్ణనము. సం. వి. అ. న. తిరుగుడు: చూ, మర. [చూ, విహారము. 1.

ఘూర్ణి. సం. వి. ఇ. స్త్రీ. గిరగిరతిరుగడము:

ఘూర్ణితము. సం. విణ. 1. తిరుగుడుపడినది: ఆఘూర్ణితము, ఆవృత్తము, ఉద్భ్రాంతము; 2. కూరుకుపాటుపడినది: చూ, స్వప్నము.2.

ఘూర్ణితుఁడు. సం.విణ: చూ, ప్రచలాయితుఁడు.

ఘూర్ణిల్లు. సం. అ. క్రి. తిరుగుడుపడు: చూ, పరిభ్రమించు.

## ఘృ

ఘృణ. సం. వి. అ. స్త్రీ. 1. కనికరము: చూ, దయ; 2. అసహ్యత: చూ, రోఁత. 2.

ఘృణావాసము. సం. వి. అ. పుం. గుమ్మడి*: చూ, మహాఫలము. [నము. 2.

ఘృణి. సం. వి. ఇ. పుం. కిరణము: చూ, హాయ

ఘృతకోశాతకి. సం. వి. ఈ. స్త్రీ. నేతిబీఱ*: చూ, బీఱ. 2.

ఘృతకోశాతకీన్యాయము. పా. నేతిబీఱకాయ యని పేరేగాని అందులో నేయిలేదు సరే గదా చెప్పగా నుండుననురీతి.

ఘృతదిధీచి. సం.వి.ఇ.పుం. అగ్ని: చూ. వహ్ని.1.

ఘృతదీధితి. సం. వి. ఇ. పుం. —పై—

ఘృతధూపకము. సం. వి. అ. పుం: చూ, వృక ధూమకము. * [కరజము*.

ఘృతపత్రికము. సం. వి. అ. పుం: చూ, పూతి

ఘృతపూర్ణకము. సం.వి.అ.పుం: చూ, వ్యాఘ్ర నఖము* [సాలి*.

ఘృతమండ. సం. వి. అ. స్త్రీ: చూ, వాయ

ఘృతమండలిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, హంస పాది*.

ఘృతమంథ. సం. వి. అ. స్త్రీ. —పై—

ఘృతము. సం. వి. అ. న. 1. నెయ్యి: చూ, తైలము; 2. నీరు: చూ, సలిలము; 3. క్షీరము: చూ, పాలు. 1; విణ. 4. వెలిఁగినది: చూ, దీప్తము. 1; అం. 5. దానములు పదింటిలో నొకటి: చూ, దానములు.

ఘృతములు. అం. అశ్వగంధాది, ఐలేయక,షట్ఫల, దూర్వాది, పంచగవ్య, ఆర్ద్రిక, కదళీకంద, కల్యాణ, తండులీయక, కూశ్మాండ ఘృతములు మొదలగునవి.

ఘృతాంకము. సం. వి. అ. న. పాలమడ్డి: చూ, సరలద్రవము. [పిపీలిక.

ఘృతేలిక. సం. వి. ఆ. స్త్రీ. ఎఱ్ఱచీమ: చూ,

ఘృతోదము. సం. వి. అ. పుం. నేతిసముద్రము: చూ, సముద్రము.

ఘృష్టకము. సం. వి. అ. న. 1. కౌఁగిలింత: చూ, సంశ్లేషము; అం. 2. అజాతస్మరాలింగనములు నాలుగింటిలో నొకటి: చూ, అజాతస్మరాలింగనములు (చూ, ఆలింగనములు.)

ఘృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. పాఁచితీఁగె*: చూ, విష్వక్సేనప్రియ; 2. పోటి: చూ, స్పర్థ; 3. రాయిడి: చూ, పీడనము; 4. తొలిచూలిఁతయావు, రూ-సృష్టి: చూ, ధేనువు; పుం. 5. కిరణము: చూ, హాయనము. 2; 6. =గూటి. పంది: చూ, సూకరము.

## ఘో

ఘోంట. సం. వి. ఆ. స్త్రీ. 1=గోంటు*: చూ, పోఁక; 2=గొట్టె. రూ-ఘోటు*: చూ, రేఁగు; 3. రేఁగుపండు: చూ, రేఁగు*.

ఘోంటా ఘుటి సం.వి. ఈ. స్త్రీ: చూ, రేఁగు*.

ఘోంటాఫలము. సం. వి. అ.న: చూ, పోక*.

ఘోటకబ్రహ్మచర్యము. జా. గుఱ్ఱము బ్రహ్మచర్యము చేయుట, అనఁగాఁ జేయదనుట. (ఘోటకబ్రహ్మచర్యము-అజగరోపవాసము-పింగళాజపము - పిల్లిశీలము - బకధ్యానము-నక్కవినయము. ఇవియన్నియు నసత్యములనుట. "ఆ కదనిమాడ ఘోటకబ్రహ్మచర్యంబు, పింగళాజపంబు పిల్లిశీల, మజగరోపవాసములబకధ్యానంబు, నక్కవినయ మిట్టి నయములెల్ల." వైజ. 2, ఆ. 19).

ఘోటకము. సం వి. అ. పుం=గోడా: చూ, హాయము.

ఘోటకముఖము. అం. సప్తాధికరణములలో నొకటి: చూ, సప్తాధికరణములు (చూ, ఔపనిషదికము-కామశాస్త్రము) [రేఁగు.

ఘోటజటి. సం. వి. న్. పుం = గొట్టె*: చూ,

ఘోటావర్తి. అం. అశ్వశాస్త్రమునందలి అశుభావర్తములలో నొకటి: చూ, అశుభావర్తములు.

ఘోటి. సం. వి. ఈ. స్త్రీ=గోడిగ: చూ, హయము.

ఘోటిక. సం. వి. ఆ. స్త్రీ.= —పై —

ఘోట్టాణము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము: చూ, హయము; 2. ఘోట్టాణమను దేశము: చూ, దేశము.

ఘోడావుకుఁడు. సం. వి. అ. పుం. (రూ-ఘోడావుక్కుఁడు) అశ్వవిక్రయికుఁడు: చూ, హేలావుకుఁడు.

ఘోరణ. సం. వి. ఆ. స్త్రీ. 1. నాసిక: చూ, ముక్కు; 2. గుఱ్ఱపుముక్కు, పోత్రిథము: చూ, ముక్కు. [వృషభము. 1.

ఘోణము. సం. వి. అ. పుం. గోపతి: చూ,

ఘోణావర్తి. అం: చూ, ఘోటావర్తి.

ఘోణి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఏనికదోమ: చూ, మశకము. 1; 2. నీరుపట్టుయీఁగ: చూ, మక్షిక; న. పుం. 3.=గూటి. పంది: చూ, సూకరము.

ఘోణికాపుత్రము. అం: చూ, ఘోటకముఖము.

ఘోణికాపుత్రుఁడు. సం. వి. అ. పుం. కళాశాస్త్రము చేసినవాఁడు.

ఘోర. సం. వి. అ. స్త్రీ: చూ, రాత్రి.

ఘోరకుఁడు. సం. వి. అ. పుం: చూ, వ్రేఁతకాఁడు.

ఘోరదర్శనము. సం. వి. అ. పుం. 1. పులి: చూ, శార్దూలము; పుం, న. 2. గూబ: చూ, పకినంపుఁబులుఁగు [వహ్ని. 1.

ఘోరధ్వని. సం. వి. ఇ. పుం. బడబాగ్ని: చూ,

ఘోరపటము. సం. వి. అ. న=గోరుపడము. కంబడి: చూ, రల్లకము.

ఘోరపుష్పము. సం. వి. అ. న. కంచు: చూ, లోహము. 1.

ఘోరము. సం. వి. అ. పుం. 1. నక్క: చూ, సృగాలము; 2. జింక: చూ, హరిణము. 1; విణ. 3=గోరము. భయంకరము: చూ, రౌరవము 2. (భయానకరసము)

ఘోరరాసనము. సం. వి. అ. పుం. నక్క: చూ, సృగాలము.

ఘోరరాశి. సం. వి. శ్. పుం —పై.—

ఘోరరూపిణి. సం. వి. ఈ. స్త్రీ బొమ్మదేవుని విల్లు: చూ, బాణము. 1.

ఘోరాంశము. అం. షష్ట్యంశములలో మొదటిదియును, ముప్పదినాలుగవదియున్ను: చూ, షష్ట్యంశములు.

ఘోరుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, శివుఁడు; విణ. 2: చూ, భయంకరుఁడు.

ఘోలము. సం. వి. అ. న. రూ-ఘోళము: చూ, మజ్జిగ.

ఘోలి. సం. వి. ఈ. స్త్రీ. 1. రూ-ఘోళి. =గోళి*. చేఁతరాసి చూ, శకుల; 2 రూ-ఘోళి.=గోళి. పావలి*: చూ, విచిల్లిక.

ఘోష. సం. వి. అ. స్త్రీ. 1: చూ, సదాప*; 2. నల్లజీలకఱ్ఱ*: చూ, సుషవి. 2; 3. చిట్టికూర*: చూ, భండీరము; 4. చప్పుడు: చూ, స్వరము. 2

ఘోషకము. సం. వి. అ. పుం. చేఁదుబీఱ*: చూ, బీఱ. 2.

ఘోషకాకృతి. సం. వి. అ. పుం —పై.—

ఘోషణ. సం. వి. అ. స్త్రీ. 1. ఉచ్చైర్ఘుష్టము: చూ, బెట్టుసరి; 2=గోను: చూ, సాటింపు.

ఘోషము. సం. వి. అ. పుం. 1. గొల్లపల్లె: చూ, దేశము; 2. ఆవులమంద: చూ, ధేనువు; 3. ఉఱుము: చూ, స్తనితము; 4 కంచు: చూ, లోహము. 1; 5: చూ, ఘోషకము*; 6. దోమ: చూ, మశకము. 1.

ఘోషయిత్నువు. సం. వి. ఉ. పుం. 1. బాఁపఁడు: చూ, బ్రాహ్మణుఁడు; 2. కోయిల: చూ, పికము.

ఘోషవతి. సం. వి ఈ. స్త్రీ వల్లకి: చూ, వీణె. (వీణెమీఁద పాడుట అని కొందఱు.).

ఘోషాపత్రికాళము. సం. వి అ. న. కంచు: చూ, లోహము. 1.

ఘోషించు. సం. అ. క్రి. మ్రోయు: చూ, శబ్దించు.

ఘోషికము. సం. వి. అ. పుం. నీరుపంది: చూ, సూకరము.

ఘోషుఁడు. సం. వి. అ. పుం. గొల్లవాఁడు: మహాశూద్రుఁడు.

ఘోళము. సం. వి.అ. న: చూ, రూ-ఘోలము.

ఘోళి. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-ఘోలి.

## ఘ్రా

ఘ్రాణతర్పణము. సం. విణ. ఇష్టగంధము. మంచివాసనగలది: చూ, వాసన.

ఘ్రాణము. సం. వి. అ. న. (పుం. అనికొందఱు) 1. నాసిక: చూ, ముక్కు; విణ 2. రూ-ఘ్రాతము. మూర్కొనఁబడినది: చూ, వాసన; 3. నేత్రాది దశేంద్రియములలో నైదవ యింద్రియము: చూ, హృషీకము: (చూ, ఇంద్రియములు.)

ఘ్రాణరంధ్రములు. అం. బ రంధ్రములు తొమ్మిదింటిలోని యొక తెగలో నొకజేత: చూ, రంధ్రములు.

ఘ్రాణించు. సం. స క్రి: చూ, మూర్కొను.

ఘ్రాతము. సం. విణ: చూ, ఘ్రాణము. 2.

ఘ్రాతి. సం. వి. ఇ. స్త్రీ. నాసిక: చూ, ముక్కు.

## ఙ

ఙ. ఒకయక్షరము. సం. వి. అ. పుం. 1. భైరవుఁడు: చూ, శివుఁడు; 2. భయము: చూ, వెఱపు; 3: చూ, దేశము; 4 మాట: చూ, శబ్దము. 2; 5. జనము: చూ, ప్రజ. 2; 6. విషయవాంఛ: చూ, వాంఛ; అం. 7. కంఠ్యములలో నొకటి: చూ, కంఠ్యములు; 8. అనునాసికములలో నొకటి: చూ, అనునాసికములు; 9. కవర్గములోనిది: చూ, కవర్గము.

ఙమ్. సం. వి. అ. న. 1. కాటుక: చూ, చోదు; 2. పిల్లనగ్రోవిశబ్దము: చూ, స్వరము. 2; 3. అరము: చూ, స్థిరము.

## చ

చ. ఒకయక్షరము. సం. అవ్య. 1. పాదపూరణమందు వచ్చెడి అవ్యయము. ('సచప్రాచ రాజానమ్') (కు-హి-చ-స్మ-హ-వై ఈ ఆఱును పాదపూరణమందు వర్తించును); 2. అయ్యో పే; 3. అదియుండగా యిదిన్ని; 4. అవయవములకు ప్రాధాన్యము లేక సమాహారప్రాధాన్యము; 5. అన్నిటికిన్ని పరస్పరప్రాధాన్యము; 6. అదిన్ని యిదిన్ని; 7. చేదరకము, అట్లాయెనా; 8. అవధారణార్థకము: చూ, సత్యము. 1; 9. అతిశయము: చూ, హెచ్చు. 2; 10. కారణము: చూ, హేతువు; 11. తుల్యయోగము; 12. ఆజ్ఞ: చూ, సెలవు; 13. పౌనరుక్త్యార్థకము; 14. దీప్తి: చూ, వెలుతురు. 1; సం. వి. అ. పుం. 15: చూ, శివుఁడు; 16: చూ, వెన్నలపులుఁగు; 17: చూ, మ్లేచ్ఛుఁడు; 18: చూ, హిమాంశువు; 19: చూ, సూర్యుఁడు: 20: చూ, ముచ్చు. 1; అం. 21. తాలవ్యములలో నొకటి: చూ, తాలవ్యములు; 22. చవర్గములో నొకయక్షరము: చూ, కవర్గము.

చమ్. సం. వి. అ. న. నెత్తురు: చూ, రక్తము. 1

చంకరము. సం. వి. అ. పుం. 1.=కంచేరము. తేరు: చూ, శకటము. 1; 2. చెట్టు: చూ. వృక్షము. రూ-చంకురము.

చంకురము. సం. వి. అ. పుం. 1.=: చూ, రూ-చంకరము; 2. చూ, రూ-చంకరము; 3. ధోరణము: చూ, హాయము.

చంక్రమణము. సం. వి. అ. న: చూ, లంఘు.

చంగము. సం. విణ. = చేక్కన. చేక్కనిది: చూ, హృద్యము.

చంగలము. సం. వి. అ. పుం. పన్నులేని అంగడివీధి: చూ, మార్గము. 1.

చంగుఁడు. సం. విణ: చూ, సమర్థుఁడు.

చంచ. సం. వి. అ. స్త్రీ. 1: చూ, చాఁప; 2. కసవుతోఁజేసిన బొమ్మ: చూ, బింబము. 3.

చంచత్పుటము. అం. తాళప్రాణభూతమై సద్యోజాతమువలనఁ బుట్టిన కళలయిదింటిలో నొకటి: చూ, తాళకళలు. (చూ, తాళము. 2.) (ముఖ్యకళాప్రాణము.)

చంచభృత్తు. సం. వి. ద్ పుం, స్త్రీ: చూ, పక్షి. (చంచుభృత్తు అనియు.)

చంచరీకము. సం. వి. అ. పుం. తుమ్మెద: చూ, భ్రమరము.

చంచరీకావళి. పా. ఒకానొక వృత్తము. ఇది ఒక్కొక్కపాదమునందు మ, మ, ర, ర, గురువులు గలిగి ఏడవయింట యతిగల త్రయోదశచ్ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా.—"కంబుగ్రీవాసత్యా-కామినీప్రాణనాథా": చూ, వృత్తము. 1.

చంచల. సం. వి. ఆ. స్త్రీ. 1. మెఱుపు: చూ, విద్యుత్తు. 1; 2: చూ, లక్ష్మి; 3: చూ, పిప్పలి. 1. *; 4. ములువెంపలి *: చూ, వెంపలి.

చంచలము. సం. వి. అ. పుం. 1. గాలి: చూ, వాయువు; 2. మందపిచ్చుక: చూ, పిచ్చుక; విణ. 3. చలించునది: చూ, చలితము 3; అం. 4. విద్యుత్తులేడింటిలో నొకటి: చూ, విద్యుత్తులు (విద్యుత్తు. 1.)

చంచలించు. సం. అ. క్రి: చూ, చలించు.

చంచలుఁడు. సం. విణ. 1: చూ, చలపుకాఁడు; 2: చూ, విటుఁడు; 3. గాలి: చూ, వాయువు.

చంచిసూచి. సం. వి. ఈ. స్త్రీ: చూ, మహాపక్షము.

చంచుఁడు. సం. వి. అ. పుం. = చెంచు: చూ, వ్యాధుఁడు. 2.

చంచువు. సం. వి. ఉ. స్త్రీ. 1. పక్షిముక్కు: చూ, ముక్కు; పుం. 2. ఆముదము *: చూ, వ్యడంబకము; 3. పాలముబచ్చలి *: చూ, బచ్చలి; 4.=చెంచు: చూ, వ్యాధుఁడు. 2.

చండ. సం. వి. ఆ. స్త్రీ. 1. నల్లకచోరము *: చూ, రాజార్హము; 2: చూ, బలురక్కసి *; 3. లింగిదొండ *: చూ, దొండ; 4. కొండ బెండ *: చూ, పద్మగ్రంథి.

చండకము. సం. వి. అ. పుం. 1. పులి: చూ, శార్దూలము; 2. సన్నపాకుల ఎఱ్ఱగన్నేరు *: చూ, హయమారకము.

చండకౌశికనాటకము. పా. కావ్యనాటకములలో నొకటి: చూ, కావ్యనాటకములు.

చండము. సం. వి. అ. పుం. చింత *: చూ, తింత్రిణి.

చండముండ. సం. వి. ఆ. స్త్రీ. యా-చండముండి. మర్గ. చూ, పార్వతి. 1.

చండముండి. సం. వి. ఈ. స్త్రీ. —పై.—

చండవాయువు. సం. వి. ఉ. పుం. పెడిగాలి చూ, వాయువు.

చండశాకము. సం. వి. అ. పుం. 1. సాలము* చూ, మద్ది; 2: చూ, నీరుచిట్టి *.

చండసూచికము. అం. ఏకవింశతిస్థానకములలో నొకటి. చూ, ఏకవింశతిస్థానకములు.

చండాంశువు. సం. వి. ఉ. పుం: చూ, సూర్యుఁడు.

చండాకి. సం. వి. ఈ. స్త్రీ: చూ, మంజిటి*

చండాతకము. సం. వి. అ. పుం, న.=చెర్మ భోగముచానలు సగము తొడవఱకుఁ దాడి కొనెడు గుడిగి: చూ, వస్త్రము.

చండాతము. సం. వి. అ. పుం. గన్నేరు. వా గన్నేరు (అని కొందఱు) *: చూ, హయమారకము.

చండాల బ్రాహ్మణులు. పా. శస్త్రధరులై ధనాపహారులగు విప్రులును, పరుల హింసింపుచు క్రూరత్వముఁ గలిగి పరదారగమన పరాయణులై పరద్రవ్యాపహారణాలాపులగువారును చండాలబ్రాహ్మణులు: చూ

బ్రాహ్మణులు. (వీరు దశవిధ బ్రాహ్మణుల లోనివారు.) [వీణె: చూ, వీణె.

చండాల వల్లకి. సం. వి. ఈ. స్త్రీ. చండాల

చండాలి. సం. వి. ఈ. స్త్రీ. 1. మాలది: చూ, మాల. (1); 2 నీలి*: చూ, రంజని.

చండాలిక. సం. వి. అ. స్త్రీ. 1. వీణ: చూ, వీణె; 2. దుర్గ: చూ, పార్వతి. 1; 3. పిన్న నీలి*: చూ, రంజని.

చండాలుఁడు. సం. వి. అ. పుం. రూ- చాండాలుఁడు. 1. మాలవాఁడు: చూ, మాల. 1; 2: చూ, మంగలి; అం. 3. జాతులు పదునెనిమిదింటిలో నొకటి: చూ, జాతులు.

చండి. సం. వి. ఈ. స్త్రీ. 1=చెండి: చూ, పార్వతి 1; 2. కోపముగల ఆఁడుది: చూ, స్త్రీ; 3. మిక్కిలి ప్రేమగల ఆఁడుది: చూ, స్త్రీ; 4. చేంపునట్టి ఆఁడుది: చూ, స్త్రీ.

చండించు. సం అ. క్రి: చూ, రోషించు.

చండిక. సం. వి. ఆ. స్త్రీ. =: చూ, చండి.

చండిమ. సం. వి. న్. పుం వాఁడిమి: చూ, శౌర్యము. 1.

చండిల. సం. వి. ఆ. స్త్రీ. చండిలమను నది: చూ, నది. [కూరాకు.

చండిలము. సం. వి. అ. పుం. చక్రవర్తమను

చండిలుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, శివుఁడు; 2. చంద్రుఁడు: చూ, హిమాంశువు: 3: చూ, మంగలి.

చండుఁడు. సం. వి. అ. పుం: 1. చండుఁడను రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; 2. యమకింకరుఁడు: చూ, యముఁడు; విణ. 3. మిక్కిలి కోపము గలవాఁడు: చూ, రోషణుఁడు; 4. వాఁడిమిగలవాఁడు: చూ, వాంభీరుఁడు. 2.

చండువు. సం. వి. ఉ. పుం. ఎలుక: చూ, మూషికము.

చండ్స. సం. వి. ఆ. స్త్రీ: చూ, శారిబ*.

చందనద్రుమము. సం. వి. అ. పుం. చూ, గంధపు మ్రాను*. [లవంగపుష్పము*.

చందన పుష్పకము. సం. వి. అ. పుం: చూ,

చందనము. సం. వి. అ. న. 1. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము. 1; పుం, న. 2. మంచి గంధము: చూ, వాసన; పుం. 3: చూ, సుగంధము*. (చందనాసవము చేయుదురు.)

చందనాచలము. సం. వి. అ. పుం. మలయపర్వతము: చూ, పర్వతము (ఇట్లు చందనాద్రి-చందనాలయము.) [చూ, నది.

చందని. సం. వి. ఈ. స్త్రీ. చందనియను నది:

చందనుఁడు. సం. వి. అ. పుం. చందనుఁడను కోఁతి: చూ, వానరము.

చందినీ అత్తరు. మి. వి. చందన తైలము, మంచి గంధపు నూనె. (సెగ, తెల్ల కుసుమ మాన్పును): చూ, ప్రబోధము.

చందిరుఁడు. సం. వి. అ. పుం. 1.=చేందమామ. రూ-చంద్రుఁడు - చంద్రముఁడు: చూ, హిమాంశువు; 2. ఏనుఁగు: చూ, హస్తి.

చంద్రకము. సం. వి. అ. పుం. 1. నెమలిపురి కన్ను: చూ, పింఛము; 2: చూ, వితానము.

చంద్రకళ. పా. 1. ఒకానొక వృత్తము. ఇది ఒక్కొక్క పాదమున ర, స, స, త, జ, జ, గురువులుండి పదునొకండవయింట యతిగల ఏకోనవింశచ్ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము: చూ, వృత్తము 1; 2. చేంద్రునికళ: చూ, శశికళ.

చంద్రకళలు. పా. చంద్రునికళలు:— చంద్రుఁడు సూర్యునికిని భూమికిని మధ్యనుండుటచే వెలుతురుగల చంద్రార్ధభాగము మనకు మఱుఁగై చీఁకటిగల యర్ధభాగమే మన వైపు తిరిగియుండుటచే చంద్రుఁడు అమావాస్యనాఁడు కనఁబడఁడు; శుద్ధసాడ్యమి మొదలు పూర్ణిమవఱకు క్రమక్రమము గా వెలుతురుగల చంద్రార్ధభాగమంతయు

మనకు కనఁబడుటచే పూర్ణ బింబాకారము పొందును. ఇదియే పూరిమ. బహుళ పాడ్యమి మొదలు అమావాస్య వఱకు మనకు కనఁబడు వెలుతురుభాగము క్రమక్రమముగా క్షీణించి మొదటిస్థానమునకు చేరునప్పటికి పూర్ణముగా నదృశ్యమగును. ఇదియే అమవస. ప్రతిమాసమునను కళలిట్లు మార్పు నొందుచుండును: చూ, శశికళ.

చంద్రకాంతము. సం. వి. అ. న. 1. కపటము: చూ, వ్యాజము. 1; పుం, న. 2. తెల్ల కలువ*: చూ, పద్మము. 1; పుం. 3. చలువఱాయి: చూ, రాయి; 4. ఒక రకము పిండివంట: చూ, భక్ష్యము; 5. దుంపజాతిచెట్టు (దీని ఆకులు ఆముదమున వెచ్చచేసి నెత్తురు గడ్డలపైన వేయుదురు. దుంప సెగ రోగములలో వాడెదరు.)

చంద్రకి. సం. వి. న్. పుం. 1. నెమిలి: చూ, మయూరము; 2. కవుఁజు: చూ, కాఁజు; 3. కోడి: చూ, పుంజు.

చంద్రగణములు. పా. బ: చూ, గణము. 4.

చంద్రగోళ్ఠులు. సం. వి. అ. పుం. (ప్ర-బ). పితృదేవతలు: చూ, యముఁడు.

చంద్రగ్రహణము. పా: చూ, గ్రహణము. 1.

చంద్రచంచల. సం. వి. ఆ. స్త్రీ. చంద్రకమను చేప: చూ, మత్స్యము. 1.

చంద్రచంద్రికాన్యాయము. పా. చంద్రుని వదలి వెన్నెల యుండదను రీతి.

చంద్రచ్ఛందము. సం. వి. అ. పుం. వేయిపేటలు గల హారము: చూ, భూషణము. 2.

చంద్రజ్ఞానతంత్రము. అం. శివప్రోక్తములగు చతుష్షష్టి తంత్రములలోనొకటి: చూ, తంత్రములు.

చంద్రజ్ఞానము. అం. ఆగమములు ఇరువదెనిమిదింటిలో నొకటి: చూ, ఆగమములు (చూ, ఉపవిద్యలు.)

చంద్రజ్యోతి. సం. వి. స్. న.= చేందురజోతి: చూ, బాణసంచు (ఇట్లు చంద్రద్యోతి-చంద్రద్యుతి.)

చంద్రబాల. సం. వి. ఆ. స్త్రీ. పెద్ద యేలకి*: చూ, పత్రిల. [లోహము. 1.

చంద్రబీజము. సం. వి అ. న. వెండి: చూ,

చంద్రభస్మము. సం. వి. న్. న. కర్పూరము: చూ, సిరము.

చంద్రభాగ. సం. వి. ఆ. స్త్రీ. చంద్రభాగ అను నది: చూ, నది. (రూ-చంద్రభాగి-చాంద్రభాగ-చాంద్రభాగి.)

చంద్రభాగి. సం. వి. ఈ. స్త్రీ.—పై.—

చంద్రమసుఁడు. సం. వి. స్. పుం: చూ, చేందురుఁడు. 1.

చంద్రము. సం. వి. అ. పుం. 1.=సిరము: చూ, చంద్రభస్మము; 2. నీరు: చూ, సలిలము; 3. బంగారు: చూ, లోహము. 1; 4. కంపిల్లము*: చూ, రోచన.

చంద్రమౌళి. సం. వి. ఇ. పుం: చూ, శివుఁడు.

చంద్రరేఖ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఇందురేఖ: చూ, శశికళ; 2: చూ, సోమరాజి*; పా. 3. ఒకానొక వృత్తము. ఇది యొక్కొక్క పాదమునందు మ, ర, మ, య, యగణములు గలిగి యెనిమిదింట యతిగల పంచదశచ్ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా:— మత్తేభక్రాంతిచేర-మ్యంబా మహిం జంద్రరేఖా, వృత్తిం.గ: చూ, వృత్తము. 1.

చంద్రరేణువు. సం. విశే. కావ్యచోరుఁడు: చూ, ముచ్చు. 1.

చంద్రలగ్నము. పా. జన్మకాలమునకుఁ జంద్రుఁడే రాశియందుండెనో యదియు చంద్రలగ్నమనఁబడును.

చంద్రవదన. పా. ఒకానొక వృత్తము. ఇది యొక్కొక్క పాదమునకు ఒక భగణము,

ఒక యగణము గలదై యాఱవచ్ఛందస్సునందు బుట్టినవృత్తము. ఉదా:—"చంద్రవదనన్ జే పేంద్రవినుతా ని, స్తంద్రిత భయంబుల్, సాంద్రముగఁ జెప్పన్.": చూ, వృత్తము.1.

చంద్రవర్త్మ. పా. ఒకానొకవృత్తము. ఇది యొక్కొక్క పాదమునందు ర, న, భ, సగణములు గలిగి ఏడింటియతిగల ద్వాదశచ్ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా:—"ఇంద్ర వంద్య జగ-దీశ ఘనయశ, స్సాంద్ర కామ ఫలి-సద్మయనువరా.": చూ, వృత్తము. 1.

చంద్రవల్లి. సం. వి. ఈ. స్త్రీ: చూ, మాతులుంగము *.

చంద్రవాంగమము సం. వి. అ. పుం. వాలుకొంగ: చూ, బకము. [యాణవ్రతము.

చంద్రవ్రతము. సం. వి. అ. న: చూ, చాంద్రా

చంద్రవ్యాకరణము. అం. తొమ్మిది వ్యాకరణములలో నొకటి: చూ, వ్యాకరణములు.

చంద్రశాల. సం. వి ఆ. స్త్రీ. 1. పైమేడ: చూ, సదనము. 1; 2: చూ, వెన్నెల.

చంద్రశాలి. సం. వి. ఆ. స్త్రీ. పైమేడ: చూ, సదనము. 1.

చంద్రశేఖరచంపు. పా. కావ్యనాటకములలో నొకటి: చూ, కావ్యనాటకములు.

చంద్రశేఖరుఁడు. సం. వి. అ. పుం: చూ, శివుఁడు.

చంద్రశ్రీ. పా. ఒకానొక వృత్తము. ఇది ఒక్కొక్క పాదమునందు య, మ, న, స, ర, గురువులు గలిగి పండ్రెండవయింట యతి గలిగి పదునాఱవ ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా:—"క్షమం జంద్రశ్రీతో యమనసర-గల్భానువిశ్రా, మముల్ సంబంధించున్నరహరి ర-మాచిత్తచోరా.": చూ, వృత్తము. 1.

చంద్రసంజ్ఞము. సం వి. అ. పుం: చూ, సిరము.

చంద్రసూర్యాగ్నిలోచనుఁడు. సం. వి. అ. పుం: చూ, శివుఁడు. [చూ, లోహము. 1.

చంద్రహాసకము. సం. వి. అ. పుం. వెండి:

చంద్రహాసము. సం. వి అ. పుం. 1. కత్తి: చూ, రిష్టి. 2; 2. రావణుని కత్తి: చూ, రిష్టి. 2; 3. కుబేరునికత్తి: చూ, రిష్టి. 2.

చంద్రాంశము. అం. వష్ట్యంశములలో నొకటి: చూ, వష్ట్యంశములు

చంద్రాతపము. సం. వి. అ. పుం. 1: చూ, వెన్నెల; న. 2 మేలుకట్టు: చూ, వితానము.

చంద్రాపీడుఁడు. సం. వి. అ. పుం: చూ, శివుఁడు. [రూ-చాంద్రాయణము.

చంద్రాయణము. పా. ఇందువ్రతము: చూ,

చంద్రాలోకము. పా. ఈ గ్రంథము జయదేవుఁడు రచించెను: చూ, కావ్యనాటకములు.

చంద్రాహ్వము. సం. వి. అ. పుం: చూ, సిరము.

చంద్రిక. సం. వి ఆ. స్త్రీ. 1.=చెందిరిక. రూ- చాంద్రిక- చాంద్రిమ- చాంద్రిమి- చాంద్రి-చాంద్రీ- చాంద- చాంది-చాందిర- చాందిరి: చూ, వెన్నెల; 2. కుసుమపువ్వు: చూ, వహ్నిశిఖము. 2; 3: చూ, సోమవల్లి*; 4: చూ, బొల్లిబూసర *; 5: చూ, మెంతి*; 6. జ్యోతిర్ఘుంటు; 7. వేఁపుడుపిండి: చూ, సాదము (1); 8. ఒకానొకవృత్తము. ఇది ఒక్కొక్క పాదమునందు న, న, ర, వగణములు గలిగి తొమ్మిదింటయతిగల పదునొకండవ ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా:—"అగవరధరనార-వాన్వితం": చూ, వృత్తము. 1.

చంద్రిలుఁడు. సం. వి. అ. పుం: చూ, మంగలి.

చంద్రుఁడు. సం. వి. అ. పుం. 1.=చందమామ: చూ, హిమాంశువు; అం. 2. మూర్తులెనిమిదింటిలో నొకఁడు: చూ, మూర్తులు; 3.

నక్షత్రములలో నొకఁడు: చూ, గ్రహములు; (చూ, రాహువు. 2.)

చంద్రునకు నూలుపోఁగు. లో. ఉదా.—"చంద్రునకు నూలుపోఁగనునట్లు సర్వలోకాధీశుండగు శ్రీకృష్ణునకుఁ గుచేలుం డటుకుల నొసంగె." (కుచేలోపాఖ్యానము)

చంద్రోదయము. సం.వి. అ. పుం. 1=చందువ: చూ, వితానము; 2. చంద్రోదయమను ఔషధరాజము; 3. చంద్రుఁడు పుట్టుట.

చంప. సం. వి. అ. స్త్రీ. కర్ణుని పట్టణము· చూ, దేశము.

చంపకకేసరి. పా. ఒకానొక వృత్తము. ఇది ఒక్కొక్కపాదమునందు స, జ, స, స, స, వగణములు గలిగి తొమ్మిదింట యతిగల సప్తదశచ్ఛందస్సునందుఁ బుట్టినవృత్తము. ఉదా:- "సనకాదియోగినుతు-జాంబవతీప్రియునిర్వికల్పునమేయు నక్షరువి-భున్యమళార్జున భంజనున్.": చూ, వృత్తము. 1. [చూ,సంపెఁగ.

చంపకలిక. సం. వి అ. స్త్రీ. సంపెంగమొగ్గ:

చంపకమాల. పా. ఒకానొక పద్యము. ఇది యొక్కొక్కపాదమునందు న, జ, భ, జ, జ, జ. గణములు గలిగి పదునొకండవయింట యతిగలిగి ఇరువదియొకటవ ఛందస్సునందుఁ బుట్టిన పద్యము. ఉదా:—"పరమదయాళుమూర్తివని-భావములోపల సేవసేసెదన్.": చూ, వృత్తము. 1.

చంపకమాలి. పా. ఒకానొక వృత్తము. ఇది యొక్కొక్కపాదమున భ మ స గురువులు గలిగి యేడవయింట యతిగల పదవ ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా:— "భూమిధరకాంతు-ల్పొలుపారన్, ప్రేమభమంబుల్లో - రిసగంబుల్, దామనుతించుస్నం-దమునుత్వా, మామకరాంతుం జం-పకమాలిన్.": చూ, వృత్తము. 1.

చంపకము. సం. వి అ. పుం. 1.=సంపకము: చూ, సంపెఁగ. (దీనికి దోహదక్రియ ముఖరాగము. కర్ణికారమునకు సల్లాపమును, కురవకమునకు ఆలింగనమును దోహదక్రియలని యెఱుంగునది); న. 2. ఒకరకము అరటిపండు: చూ, రంభ. 2; 3. సంపెంగపువ్వు: చూ, సంపెఁగ.

చంపకరంభ. సం. వి. అ. స్త్రీ. సువర్ణకదళి *: చూ, రంభ. 2.

చంపకోల్వము. సం. వి. అ. పుం: చూ, పనస. 2 *. [చూ, దేశము.

చంపాపురి సం. వి. ఈ. స్త్రీ. చంపానగరము:

చంపాగాయి బ్రాహ్మణులు. పా. నేపాళదేశపు బ్రాహ్మణులలో నొక తెగవారు: చూ, బ్రాహ్మణులు.

చంపువు. సం. వి. ఉ. స్త్రీ. కావ్యభేదములలో నొకటి, వాఙ్మయభేదము (అని కొందఱు): చూ, పరికథ (చూ, ఖండకథ, కథ, ఆఖ్యాయిక, పరికథ.)

చంపేశుఁడు. సం. వి. అ. పుం. కర్ణుఁడు, సూతపుత్రుఁడు: చూ, రాధేయుఁడు.

చంబుకము. సం. వి. అ. న. రూ-చబుకము-చబూకము- చాబుకము-చాబూకము- చిబుకము- చిబూకము-చీబుకము- చీబూకము- చుబుకము, గడ్డము: చూ, శ్మశ్రువు.

చకితము. సం. వి. అ. న. 1. భయము: చూ, వెఱపు; 2. నాయికకు దేనిచేతనైనను ప్రియునియెదుట కలిగెడు భయసంభ్రమము: చూ, వెఱపు; అం. 3. శృంగారచేష్టలు పదునెనిమిదింటిలో నొకటి: చూ,శృంగారచేష్టలు.

చకితుఁడు. సం. విణ. భయపడినవాఁడు: చూ, శంకితుఁడు.

చకురము. సం.వి. అ. పుం: చూ, రూ-చికురము·

చకోరకము. సం. వి. అ. పుం: చూ, వెన్నెల పులుఁగు.
చకోరము. సం. వి. అ. పుం. —పై.—
చక్రంద. సం. వి. ఆ. స్త్రీ: చూ, వాయింటః.
చక్రకారకము. సం. వి. అ. పుం వ్యాఘ్రనఖ మను గంధద్రవ్యము: చూ, రాజార్హము.
చక్రగుచ్ఛము. సం. వి. అ. పుం. అశోకః: చూ, శకులాదని. 1. [రాట్నము.
చక్రడోల. సం. వి. ఆ. స్త్రీ: చూ, అంకుల
చక్రధరము. సం. వి. అ. పుం: చూ, సర్పము.
చక్రధరుఁడు. సం. వి. అ. పుం 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; విశ. 2. గ్రామములేలు వాఁడు; చూ, రాజు. 1.
చక్రపక్షము. సం. వి. అ. పుం. అంచే: చూ. హంస. 1. [శేలః
చక్రపరివ్యాధము. సం. వి అ. పుం: చూ,
చక్రపర్ణి. సం. వి. ఈ. స్త్రీ: చూ. తులసిః.
చక్రపాణి. సం. వి. ఇ. పుం. చుట్టు కైదువు తాల్పు, నారాయణుఁడు: చూ, విష్ణువు. 1.
చక్రపాదము. సం. వి. అ. పుం. 1. తేరు: చూ, శకటము. 1; 2. ఏనుఁగు: చూ, హస్తి.
చక్రపుంఖము. సం. వి. అ. పుం. అమ్ము: చూ, బాణము. 1.
చక్రఫలము. సం. వి. అ. పుం. అట్టనమను బాణము: చూ, బాణము. 1.
చక్రబంధము. పా. శబ్దాలంకారములలో నొకటి: చూ, శబ్దాలంకారములు. (చూ, హేతువు.2.)
చక్రబంధువు. సం.వి.ఉ. పుం: చూ, సూర్యుఁడు.
చక్రబాంధవుఁడు. సం. వి. అ. పుం: చూ, సూర్యుఁడు. [చూ, విష్ణువు. 1.
చక్రభృత్తు. సం. వి. త్. పుం. వెన్నుఁడు:
చక్రభేదిని. సం. వి. ఈ. స్త్రీ: చూ, రాత్రి.
చక్రభ్రమిన్యాయము. పా. చక్రపు అంచు మీఁదిది క్రిందికి, క్రిందిది మీఁదికి వచ్చు చుండునను రీతి.
చక్రమండలము. అం. కరణములు నూటయేని, మిదింటిలో నొకటి: చూ, కరణములు.
చక్రమండలి. సం. వి. న్. పుం. కొండచిలువ: చూ, సర్పము. [స్నానటముః.
చక్రమర్దకము.. సం. వి అ. పుం: చూ, ప్రిత్త
చక్రమర్దనము. సం. వి. అ. పుం. —పై.—
చక్రమర్దము. సం.వి. అ. పుం: చూ, జిల్లేడుః
చక్రము సం. వి. అ. న. 1. సుదర్శనమను బాణము: చూ, బాణము. 1; 2. గాలిగుడి: చూ, వలిదగుడి; 3. గుంపు: చూ, సమూహము; 4 దండు. చతురంగపుసేన (అనికొం దఱు): చూ, సేన; 5. రాష్ట్రము: చూ, దేశము; 6. గ్రామసమూహము; 7: చూ, కుమ్మర సారె; 8. నీటిసుడి: చూ, సుడి. 1; 9. చిన్నగానము: చూ, లోహము. 1; 10. బండిని లాగు గుండ్రని చట్రము. అరి, ఓః: చూ, శకటము. 1; పుం. 11= జక్క్రవ. రూ- చక్రవాకము: చూ, బటువు గువ్వ; అం. 12 విష్వాయుధము లైదింటిలో నొకటి: చూ, విష్వాయుధములు; 13. సంయుత హస్తముల లోనొకటి: చూ, సంయుత హస్తములు; 14.ఆయుధములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, బాణము. 1; అం. 15. పాదరేఖలలో నొకటి: చూ, స్త్రీలక్షణాంగములు.
చక్రముఖము. సం. వి. అ. పుం. పంది: చూ, సూకరము.
చక్రములు. అం. 1. మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము. అనాహతము, విశుద్ధము, ఆజ్ఞము. (6) (అనియు) మూలాధారము, స్వాధిష్ఠానము. నాభి, హృదయము, కంఠము, ఘంటిక, భ్రూవు, బ్రహ్మరంధ్రము, గగనము (9) (అనియు) రెండు విధములు;

2. రాశిచక్రము, అంశచక్రము, ఆరూఢచక్రము మొ. (చక్రములోని రాసులు.- మేషము, వృషభము, మిథునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము.)

చక్రరదము. సం. వి. అ. పుం: చూ, చక్రముఖము. [చూ, లక్షణము. 1.

చక్రరేఖ. సం వి.ఆ. స్త్రీ. రాజపత్నీలక్షణము:

చక్రల. సం. వి. ఆ. స్త్రీ. వట్రువమున్తైక*: చూ, తృణము. 1. [చూ, సోమవల్లి.

చక్రలక్షణ. సం. వి ఆ. స్త్రీ. తిప్పతీఁగె*:

చక్రవక్త్రము. సం. వి. అ. న. దరిద్రవతీలక్షణము: చూ, లక్షణము. 1.

చక్రవర్త. సం. వి. ఆ. స్త్రీ. రూ-చక్రవర్తము- చక్రవర్తిని. ఒకరకము కూరాకు*: చూ, వాస్తూకము-వాస్తుకము. (ఇది తెల్లరకము, ఎఱ్ఱరకము అని రెండువిధములు. దీనితైలము కొంకిపురుగువ్యాధిలో పనిచేయును. ఈకూర మలమును భేదించును.)

చక్రవర్తము. సం. వి. అ. పుం.—పై.—

చక్రవర్తి. సం. వి. న్. పుం.=చక్కురవతి: చూ, రాజు. 1. (ఇ. పుం. అని కొందఱు.)

చక్రవర్తిని. సం. వి. ఈ. స్త్రీ. 1. సార్వభౌమురాలు, రాణి: చూ, రాజు. 1; 2. కోరింద*: చూ, మదపత్రి; 3: చూ, చక్రవర్త.

చక్రవర్తులు. అం. హరిశ్చంద్రుఁడు, నలుఁడు, పురుకుత్సుఁడు, పురూరవుఁడు, సగరుఁడు, కార్తవీర్యార్జునుఁడు. (6): చూ, మహారాజులు.

చక్రవాకము. సం. వి. అ. పుం.=జక్కవ: చూ, బటువుగువ్వ.

చక్రవాకముఖప్రియము. సం. వి. అ. పుం. కంచెయాడ*: చూ, కర్కాటకము.

చక్రవాటము. సం. వి. అ. పుం. 1. దగ్గఱ: చూ, సమీపము. 1; 2. దీపపుకుంది: చూ, ప్రమిద (చూ, పాత్రము. 6)

చక్రవాటుఁడు. సం. వి. అ. పుం. పనిఁబూనినవాఁడు.

చక్రవాస్తుకము. సం. వి. అ. పుం. చక్రవర్తికూర*: చూ, వాస్తుకము.

చక్రవాళ. అం. క్షుద్రప్రబంధము. [హేమ.

చక్రవాళకము సం. వి. అ. న: చూ, సమూ:

చక్రవాళము. సం. వి. అ. న. 1. —పై.—; 2. గాలిగుడి: చూ, వఱదగుడి; పుం. 3. చుట్టుఁగొండ (రూ- చక్రవాడము): చూ, పర్వతము; పా. 4. ఒకానొకవృత్తము చూ, వృత్తము. 1.

చక్రవృద్ధి. సం. వి. ఇ. స్త్రీ. 1. వడ్డీకివడ్డీ: చూ, వడ్డీ: అం. 2. ధనవృద్ధులు నాలుగింటిలో నొకటి: చూ, ధనవృద్ధులు.

చక్రశిరష్కము. సం. వి. అ. పుం. తగిరిస*: చూ, ప్రపున్నాటము.

చక్రసంజ్ఞము. సం. వి. అ. న. వంగము, తగరము: చూ, లోహము. 1.

చక్రసంవరుఁడు. సం.వి. అ. పుం. బుద్ధభేదము: చూ, బుద్ధుఁడు. 1.

చక్రాంకితము. సం. విశే. గుండ్రని గుఱుతిడఁబడినది (చూ, అంకితము.)

చక్రాంగము. సం. వి. అ. పుం. 1.=జక్కవ: చూ. బటువుగువ్వ; 2. అంచ: చూ, హంస; 3. గొడుగు: చూ, వారిత్ర.

చక్రాంగి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుఅంచ: చూ, హంస; 2. రూ-శక్రాంగి. కటుకరోహిణి*: చూ. కటులాదని. 1; 3. దూసరి*: చూ, వత్సాదని.

చక్రాంతము. అం. కరణములు నూటయెనిమిదింటిలో నొకటి: చూ, కరణములు.

చక్రాటము. సం. వి. అ. పుం. ముప్పదిరెండు గురిగింజల యెత్తు బంగారునాణెము: చూ, లోహము. 1.

చక్రాటుఁడు. సం. వి. అ. పుం. 1. పాముల వాఁడు: చూ, వ్యాళగ్రాహి; 2: చూ, వంచకుఁడు. 1.

చక్రాణి. సం. వి. అ. న. బ. ఏటివంపు, భూమి నిరాకరించి నీళ్ళూరివచ్చెడు బుగ్గ (అనికొందఱు): చూ, పుటభేదము. (ఏ. చక్రము.) (అమ-వారివర్గము.)

చక్రాధివాసి. సం. వి. న్. పుం: చూ, నారింజ*.

చక్రాయుధప్రయోగము. అం. తంత్రము లఱువదినాలుగింటిలో నొకటి: చూ, తంత్రములు

చక్రాయుధము. సం. వి. ధ్. స్త్రీ, అ. న. ఆయుధము: చూ, బాణము. 1.

చక్రాలత్రిప్పుడు. అం: చూ, బాలక్రీడ.

చక్రి. సం. వి. న్. పుం. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు 1; 2.=జక్కవ: చూ, బటువుగువ్వ; 3: చూ, సర్పము; 4. రారాజు: చూ, రాజు. 1; 5. కుమ్మరి: చూ, మృత్కారుఁడు; 6. తేరు: చూ, శకటము. 1; 7. కప్ప: చూ, మండూకము. 1; 8: చూ, తెలుకులవాఁడు; 9. పురోహితుఁడు: చూ, యాజకుఁడు; 10. గ్రామముల కధికారి: చూ, రాజు. 1.

చక్రికాయంత్రము. సం. వి. అ. న: చూ, తిరుగలి. [రాసభము.

చక్రీవంతము. సం. వి. త్. పుం. గాడిద: చూ,

చక్రోధుఁడు. సం.వి.అ. పుం. జక్కులఱేఁడు, కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు.

చక్షుఃప్రీతి. అం. ద్వాదశావస్థలలో నొకటి: చూ, ద్వాదశావస్థలు.

చక్షువు. సం. వి. స్. న. 1. కన్ను: చూ, నేత్రము. 1; అం. 2. ఇంద్రియము లయిదింటిలో నొకటి: చూ, ఇంద్రియములు; (చూ, హృషీకము).

చక్షుశ్శ్రవణన్యాయము. పా. పామునకు వినికి యున్నప్పుడు చూపును, చూపున్నప్పుడు వినికియు నుండదనురీతి.



చక్షుశ్శ్రవము. సం. వి. స్. పుం. చూ, సర్పము.

చక్షుష్య. సం. వి. అ. స్త్రీ. 1. అందకత్తె: చూ, స్త్రీ; 2. పాలకూర *: చూ, మనుపాల; 3: చూ, వద్ది *; 4. పొడిపిండి: చూ, సాదము (1); 5. రూ-చక్షుష్యము. అడవియులవలు: చూ, సరటి.

చక్షుష్యము. సం. వి. అ. పుం, న. 1: చూ, మొగలి *; 2: చూ, శ్రీపువ్వము *; పుం. 3. చిల్ల *: చూ, సల్లకి; 4. మునుగ *: చూ, శిగ్రువు. 1; 5: చూ, రసాంజనము; 6: చూ, రూ-చక్షుష్య. 5; విణ. 7. హితవైనది: చూ, హితవు.

చటక. సం. వి. అ. స్త్రీ. 1. ఆఁడుపిచ్చుక (చటకక అనియు): చూ, పిచ్చుక; 2. ఆఁడుపిచ్చుక పిల్ల: చూ, పిచ్చుక; 3. పిప్పలివేరు: చూ, పిప్పలి. 1; అం. 4. గతులు పండ్రెండింటిలో నొకటి (చటకగతి): చూ, గతులు.

చటకగతి. అం: చూ, చటక. 4.

చటకము. సం.వి. అ. పుం. 1: చూ, పిచ్చుక; 2. కోడి: చూ, కుంజా.

చటకవిలసితము. అం. వ్యాకరణబంధము లిరువది యొకటింటిలో నొకటి: (చూ. అదూషితము) చూ, వ్యాకరణబంధములు.

చటకారి. వా. వి. 1. హిందూదేశమునఁబుట్టిన ఆంగ్లేయసంతతివాఁడు; 2: చూ, నిష్ప్రయోజకుఁడు.

చటకాశిరము. సం. వి. స్. న: పిచ్చుకతలవలెనుండునది. (చటకా-శిరః అనిరెండుపేళ్లుగాఁగొందఱు. అప్పుడు శిరశ్శబ్దము అ. పుం.)

చటకోత్తమ. సం. వి. అ. స్త్రీ. ఆఁడు ఊరఁబిచ్చుక: చూ, పిచ్చుక. [కము. 1.

చటాకము. సం. వి. అ. పుం: చూ, రూ-చట.

చటాకు. వా. వి. $\frac{1}{16}$ సేరు, 5 తులములు, ఒకగిద్ద (తెనుఁగున వాడుక.)

చటుచాటుని. సం. వి. ఇ. పుం. ప్రియవాక్యము: చూ, శబ్దము. 2. [త్రము. 3.

చటులము. సం. విణ. చలించునది: చూ, వలి

చటుల్లోలుఁడు. సం. విణ. ప్రియోక్తులం బాస క్తి గలవాఁడు: చూ, చాటులోలుఁడు.

చటువు. సం. వి. ఉ. పుం. 1: చూ, కడుపు; 2. రూ-చాటువు: చూ, చటుచాటుని; 3. యోగుల ఆసనవిశేషము: (చూ, ఆసనములు.) చూ, స్వస్తికాసనము.

చణకపుష్పి. సం. వి. ఈ. స్త్రీ: చూ, కలభకరికఁ *.

చణకము. సం. వి. అ. పుం. 1.=సెనగ*: చూ, సెనగలు. (త్రి అని శ. ర.); 2. గాలి: చూ వాయువు. [యనముని: చూ, ముని. 1.

చణకాత్మజుఁడు. సం. వి. అ. పుం. వాత్స్య

చణపుష్పి. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-చణకపుష్పి *. [తృణము. 1.

చణిక. సం. వి. ఆ. స్త్రీ. అంటిస *: చూ

చతుఃప్రాసము. పా. నాలుగక్షరములువచ్చునది.

చతురంగము. సం. వి. అ. న 1.=చేదరంగము. ఒకయాట. (ఇందు రాజు 1, మంత్రి 1, ఏనుఁగులు 2, గుఱ్ఱములు 2, శకటములు 2. బంట్లు 8. ఒకవైపునను, ఇవ్విధంబునఁ రెండవవైపునను ఉండి రెండుబలములును నడకలారంభించును.); అం. 2 అవధానము లెని మిదింటిలో నొకటి: చూ, అవధానములు.

చతురంగములు. అం. ఏనుఁగులు, గుఱ్ఱములు, రథములు, కాల్బంట్లు (4.)

చతురంగులము. సం. వి. అ. పుం. 1: చూ, ఱేల *; 2. అపరకర్మమందలి పిండివంట. చూ, మల్లకము. [భూమి. 1.

చతురంత. సం. వి. ఆ. స్త్రీ. నేల: చూ,

చతురంతయానము. సం. వి. అ. న: చూ, పాలకి.

చతురబ్ద సం. వి. ఆ. స్త్రీ. నాలుగేండ్ల (ఆవు) పెయ్య: చూ, ధేనువు. (చతుర్హాయని.)

చతురము. సం. వి. అ. న. 1. గజశాల: చూ, సదనము.1; పుం. 2. అభినయహస్తవిశేషము: చూ, వ్యంజకము;1; 3.=చేదరము. పొడవు × వెడల్పు = చతురము: చూ, వైశాల్యము; 4.=చేదరము. సమమైన నాలుగు మూలలు కలది, చౌకము: చూ, వైశాల్యము. అం. 5. సంయుతహస్తములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, సంయుతహస్తములు; 6. అసంయుతహస్తములు నలుబదైదింటిలో నొకటి: చూ, అసంయుతహస్తములు; 7. భూమిక్రియలేడింటిలో నొకటి: చూ, భూక్రియలు; 8. కరణములు నూటయెనిమిదింటిలో నొకటి. చూ, కరణములు.

చతురశ్రి. సం. వి. ఆ. స్త్రీ. తుమ్మ *: చూ, విట్ఖదిరము.

చతురశ్రము. అం. తాళజాతులు(జాతిక్రియలు) అయిదింటిలో నొకటి: చూ, తాళజాతులు: (చూ, జాతిక్రియలు: చూ, తాళము. 2.)

చతురశ్రికము. సం. వి. అ. పుం: 1: చూ, ములువెలఁగ *; 2. చూ, డాఁగలి.

చతురస్రము. సం. విణ.=చేదరము: చూ, చతురము. 3-4.

చతురాననుఁడు. సం. వి. అ. పుం. నలువ: చూ, బ్రహ్మ. 1.

చతురిక. అం. దూతీచతుష్టయములో రెండవది. (ఇందు ప్రహిత, ఉద్వహిత, పత్రహారి, భావన, పత్రిక, మూక, స్వయం, భావదూతిక గలవు): చూ, దూతీచతుష్టయము.

చతురిమ. సం. వి. న్. పుం. నేరుపు: చూ, సామర్థ్యము. 1.

చతురుఁడు. సం. విణ.=చేదుర. రూ-చాతురుఁడు: చూ, సమర్థుఁడు. 1.

చతురు మెన. అం. మల్లశాస్త్రమునందలి మెనలు పండ్రెండింటిలో నొకటి: చూ, మెనలు.

చతుర్గతి. సం. వి. ఇ. పుం. 1: చూ, తాఁబేలు; పా. 2. సింహము శార్దూలము గజము వృషభములవలె నడచుట.

చతుర్జాతము. సం. వి. అ. న. ఏలకులు లవంగాలు ఆకుపత్రికము నాగకేసరములున్ను.

చతుర్థము. పా. 1. లగ్నకారకత్వములు పద్రెండింటిలో నొకటి: చూ, లగ్నకారకత్వములు. (వాహనము, వంశము, మాత, సింహాసనము, గృహము, భూమి, సుఖము, మిత్రులు, బాహువులు, విశ్వాసము, కృషి, గుఱ్ఱములు, ఏనుఁగులు, విద్య, ప్రయాణము, రాజ్యము, స్థానభ్రంశము, సౌధము, చెఱువులు, నూతులు; తోఁటలు.) 2. చతుష్కము, చతుష్టయము: చూ, నాలుగు.

చతుర్థాంశ. అం. షోడశవర్గలో నొకటి: చూ, షోడశవర్గ. (లగ్నమును నాలుగు సమభాగములుచేసిన యెడల చతుర్థాంశ యగును. అట్లుచేయఁగా మొదటిభాగమునకు లగ్నాధిపతియును, ద్వితీయభాగమునకుఁ జతుర్థాధిపతియును, తృతీయభాగమునకు సప్తమాధిపతియును, చతుర్థభాగమునకు రాజ్యాధిపతియును, చతుర్థాంశాధిపతులగుదురు.)

చతుర్థి. సం. వి. ఈ. స్త్రీ. 1.=చేవులి: చూ, తిథి. 1; విణ. 2. నాలుగవది; అం. 3. విభక్తు లేడింటిలో నొకటి: చూ, విభక్తులు; 4. తిథులు పదునేనింటిలో నొకటి: చూ, తిథులు.

చతుర్దంతము. సం. వి. అ. పుం.=చేవుదంతి. ఇంద్రునియేనుఁగు: చూ, హస్తి.

చతుర్దశకము. సం.వి.అ. న: చూ, పదునాలుగు.

చతుర్దశి. సం. వి. ఈ. స్త్రీ. 1 కలిదైవత్య. చూ, తిథి. 1; 2. పదునాలుగు తంతులుగల పరివాదిని యను వీణె: చూ, వీణె; విణ. 3. పదునాలుగవది; అం. 4. తిథులుపదునేనింటిలో నొకటి: చూ, తిథులు; 5. నిహీనతానములేడింటిలో నొకటి: చూ, నిహీనతానములు (చూ, శుద్ధతానములు); 6. తతవాద్యములిరువదింటిలో నొకటి: చూ, తతవాద్యములు. [చూ, స్వస్తికము.

చతుర్దశ. సం. వి. అ. స్త్రీ. నీరుచెంచేలి*:

చతుర్భద్రము. సం. వి. అ. న. 1. బలయుక్తములైన ధర్మార్థకామమోక్షములు: చూ, చతుర్వర్గము; అం. 2. అశ్వముయొక్క చిత్రవర్ణములు ముప్పదింటిలో నొకటి: చూ, చిత్రవర్ణములు.

చతుర్భాగము. అం. కాలపాణములు పండ్రెండింటిలో నొకటి: చూ, కాలపాణములు.

చతుర్భుజుఁడు. సం. వి. అ. పుం. 1. నలువ. చూ, బ్రహ్మ. 1; 2. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

చతుర్ముఖము. అం. జన్యతాళములు తొంబదియొకటింటిలో నొకటి: చూ, జన్యతాళములు.

చతుర్మోన. అం. మల్లశాస్త్రమునందలి మెనలు పండ్రెండింటిలో నొకటి : చూ, మెనలు.

చతుర్లవణములు. అం. సైంధవ, సౌవర్చ, బిడా, సముద్ర లవణములు.

చతుర్లేఖ. పా. లలాటమున 4 రేఖలున్న 200 ఏండ్లు, 3 రేఖలున్న 100 ఏండ్లు, 2 రేఖలున్న 60 ఏండ్లు, 1 రేఖయున్న 20 ఏండ్లు ఆయుర్దాయము తెలియఁజేయును.

చతుర్వర్గము. సం. వి. అ. పుం. ధర్మార్థకామమోక్షములు: చూ, చతుర్భద్రము. 1.

చతుర్విధకందము. పా. చిత్రికవిత్వములలోనొకటి. అప్ప. 4, ఆ. 412-418: చూ, వృత్తము. 1.

చతుర్విధ ప్రీతులు. అం. అభిమానప్రీతి, విభవ ప్రీతి, సదృశప్రీతి, విషయప్రీతి (4).

చతుర్హాయని. సం. వి. ఈ. స్త్రీ: చూ, చతురబ్ద.

చతుశ్శాలము. సం.వి.అ.న.=చేవుసాల. నాలుగిండ్లకూటమి, నాలుగిండ్లబవంతి: చూ, సదనము. 1. (చతుశ్శాల అనియు.) [వహ్ని. 1

చతుశ్శృంగము. సం. వి. అ. పుం. అగ్ని: చూ,

చతుష్కంటకిని. సం. వి. ఈ. స్త్రీ. ఉప్పి*: చూ, లవణి.

చతుష్కము. సం. వి. అ. న. 1.=చేదుకము, నాలుగుదారులకూడలి: చూ, మార్గము. 1; 2. చేవిక, మంటపము: (చూ. మెల్లా), చూ, సదనము. 1; 3. = చేవు: చూ, నాలుగు.

చతుష్కి. సం. వి. ఈ. స్త్రీ. 1. పెద్దకోనేలు చూ, సరస్సు. 1; 2. దోమతెర. కప్పుకొను బట్ట (అని కొందఱు): చూ, వస్త్రము; 3. నాలుగుపేటలు గల ముత్యాలహారము: చూ, భూషణము. 2.

చతుష్టయము. పా: చూ, చతుర్థము. 2.

చతుష్పథము. సం. వి. అ. న. 1.=చేవుపదము: చూ, మార్గము. 1; పుం. 2. ఒకరకము మంచేము: చూ, మంచేము.

చతుష్పథుఁడు. సం. వి. అ. పుం బాపఁడు: చూ, బ్రాహ్మణుఁడు.

చతుష్పద. పా. ఒకానొకవృత్తము. ఇందు పాదమునకు పదునాఱులఘువులుండవలయు ను. ఒకప్పుడు రెండులఘువుల కొక గురువును ఉండవచ్చును. యతి తొమ్మిదవ అక్షరమునందుండును: చూ, వృత్తము. 1.

చతుష్పదము. సం. వి. అ. పుం. 1: చూ, చతుష్పాత్తు; 2. నాలుగుకాళ్లజంతువు. (ఇట్లు చతుష్పాదము).

చతుష్పాటి. సం. వి. ఈ. స్త్రీ. చతుష్పాటి యనునది: చూ, నది. [చూ, విష్ణువు. 1.

చతుష్పాణి. సం. వి. ఈ. స్త్రీ. వెన్నుఁడు:

చతుష్పాత్తు. అం. బవాదికరణములు పదునొక టింటిలో నొకటి: చూ, కరణము. 14. (చూ, కరణములు)

చతుష్షష్టి. సం. స. ఇ. స్త్రీ. రూ-చతుష్షష్టి 1.=చేవుసట్టి (వా). చేవుషట్టి (పురు-కవీయము), అఱువది నాలుగు; 2. ఋగ్వేదము: (చూ, ఉపవిద్యలు) చూ, వేదము; అం. 3. (64): చూ, కళలు (కళలు=విద్యలు); చూ, కల.

చతుష్షష్టి.—వై.—

చతుష్షష్టిమరీచ్యాదిలేహ్యము. అం. లేహ్యముల లో నొకటి: చూ, లేహ్యములు.

చతుస్తాళి. పా. జన్యతాళములు తొంబదియొక టింటిలో నొకటి: చూ, జన్యతాళములు.

చతుస్స్వరయుక్తరాగములు. అం. (స్వరాంతములు): చూ, రాగములు.

చత్వరము. సం వి. అ. న. 1: చూ, ముంగిలి; 2. వ్రతము పూనినవానికి పండుకొనుటకు చెక్కఁబఱచిన భూమి, అగ్నిహోత్రమునుంచుటకై సంస్కరించిన స్థానము (అని అమరము): చూ, స్థండిలము; చూ, భూమి. 1; 3: చూ, చతుష్పథము. 1; 4. పాదరిల్లు: చూ, సదనము. 1; 5. నారచీర: చూ, వస్త్రము. [బుద్ధి: చూ, బుద్ధి.

చత్వారి. సం. వి. ఈ. స్త్రీ. శ్రవణతుమమైన

చత్వారిక. సం. వి. అ. స్త్రీ. బాలవిధవ: చూ, విధవ.

చన. సం. అవ్య: చూ, చిత్. 1.

**చపటము.** సం. వి. అ. పుం: చూ, రూ-చపేటము.

**చపల.** సం.వి.ఆ.స్త్రీ. 1. మెఱుపు. చూ, విద్యుత్తు. 1; 2. లచ్చి: చూ, లక్ష్మి; 3: చూ, ఱంకులాఁడి; 4: చూ, పిప్పలి. 1*; పా. 5. కంద పద్యభేదములాఱింటిలో నొకటి. ఉదా.— "సమపదముల మొదలంజగణములొగ దయిడుగునను ద్విగణలఘువుపై. సమకొనువిరతి యుం బదియేన్. లములే మునుపంద చపలను సమరున్": (చూ, కందము. 3); చూ, వృత్తము. 1.

**చపలత.** సం. వి. అ. స్త్రీ. రాగద్వేషాదులచే పనులయందుఁ గలుగు తబ్బిబ్బు: చూ, వ్యత్యయము.

**చపము.** సం వి. అ. పుం. 1. మగగుఱి: చూ, శిశ్నము; 2. వెదురు: చూ, వేణువు.

**చపలతాళయము.** సం. వి. అ. పుం అజీర్ణరోగము: చూ, రోగము. 1.

**చపలము** సం. వి. అ. పుం. 1. కోఁతి: చూ, వానరము; 2. చేఁప: చూ, మత్స్యము. 1; 3. చేలుపటాయి: చూ, రాయి; 4: చూ, పాదరసము; 5. చోరకమను గంధద్రవ్యము, చండ (అని కొందఱు): చూ, రాజార్హము; 6. కామంచిగడ్డి*: చూ, తృణము. 1; క్రి. విశే. అ. న. 7. రూ-చాపలము. శీఘ్రము: చూ, వేగము. 3; విశే. 8. కదలునది: చూ, చలితము. 3; 8. నిలుకడలేనిది; 9. వడిగలది: చూ, వేగము. 3; అం. 10. విద్యుత్తులేడింటిలో నొకటి: చూ, విద్యుత్తులు (చూ, విద్యుత్తు. 1.)

**చపలాంగము.** సం. వి. అ. పుం. జలజంతువిశేషము: చూ, మత్స్యము 1.

**చపలాతిశయోక్తి.** అం. అలంకార విశేషము: చూ, హేతువు. 2.

**చపలుఁడు.** సం. విశే. 1. వేగముగలవాఁడు: చూ, వేగిరకాఁడు; 2. చంచలస్వభావముగలవాఁడు: చూ, వలపుకాఁడు; 3. దురాచారుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 4 అల్పుఁడు: చూ, హీనుఁడు; 5. దోషము విచారింపక వధబంధనాదులఁ జేయువాఁడు: చూ, చిఱుఁదు.

**చపిటము.** సం. వి. అ. పుం: చూ, రూ-చిపిటకము.

**చపుటము.** సం. వి. అ. పుం. —పై.—

**చపేటము.** సం. వి. అ. పుం. చాఁచినవ్రేళ్లుగల అఱచేయి. రూ-చపటము: చూ, హస్తము.

**చపేటార్ఘ్యము.** సం. వి అ. పుం. కాకిదొండ*: చూ, దొండ.

**చబుకము.** సం. వి. అ. న. గడ్డము: చూ, రూ-చంబుకము.

**చబూకము.** సం. వి. అ. న. —పై.—

**చమత్కారము.** సం. వి. అ. పుం. నేర్పు: చూ, సామర్థ్యము. 1.

**చమత్కారిత్వము.** పా. నేర్పుతో నుపన్యసించుట: చూ, ఇతివృత్తవిస్తరము.

**చమత్కృతి.** సం. వి. ఇ. స్త్రీ: చూ, చమత్కారము.

**చమసము.** సం. వి. అ. న. పిష్టవర్తి. సోమపానము తాగుపాత్రము: చూ, పాత్రము. 6.

**చమరము.** సం. వి. అ. న. 1. వింజామరము: చూ, సురఁటి; పుం. 2.=సవరపుమెకము: చూ, సవరపుమెకము; 3.=సవరము. చమరమృగముతోఁక: చూ, సవరము; 4: చూ, రూ-చమరి. 3.

**చమరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుసవరపుమెకము: చూ, సవరపుమెకము; 2. చిగురుకొమ్మ: చూ, శాఖ. 1; ఇ. స్త్రీ. 3: చూ, పూగుత్తి.

**చమరిక.** సం. వి. ఆ. స్త్రీ. రూ-చమ్మరికము. ఎఱ్ఱకాంచనము*: చూ, యుగపత్రికము.

చమరికము. సం. వి. అ. పుం. —పై.—

చమలుఁడు. సం. విణ: చూ, భక్షకుఁడు.

చమసము. సం. వి. అ. పుం, న. 1. రూ-చమసి. చతురస్రమైన యజ్ఞపాత్రము: చూ, పాత్రము. 6; పుం. 2. పక్షిపిల్ల: చూ, పక్షి.

చమసి. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, రూ-చమసము. 1; 2. సోఁపుపిండి: చూ, సాదము (1).

చమువు. సం. వి. ఊ. స్త్రీ. 1. రూ-చమూవు. ఏన్నూటయిరువదితొమ్మిది రథములు. అన్ని యేనుఁగులు, రెండువేల నూటయేనుబదియేడు గుఱ్ఱములు, మూఁడువేల నార్నూటనలువది యేవురు కాల్వురుగలసేన: చూ, సేన. 1; 2. దండు: చూ, సేన. 1.

చమూముఖము. సం. వి. అ. న. 1: చూ, సేనాముఖము; అం. 2. దండవ్యూహములు పదునేడింటిలో నొకటి: చూ, దండవ్యూహములు

చమూరువు. సం. వి. ఉ. పుం. కలదులేదను నోఁకకలిగి తెల్లగానైనను, నల్లగానైనను, నానావర్ణములు కలదిగానైనను నుండెడి యిఱ్ఱి జాతివిశేషము (దీనితోలు జనులుపయోగించుకొందురు): చూ, రామము.

చమూవు. సం.వి. ఊ. స్త్రీ: చూ, రూ-చమువు.

చయనము సం. వి. అ. న. అగ్నిని స్థాపించుటకై ఇటుకరాళ్ళు మొ. వానిచేఁ జేయఁబడిన జంతువుయొక్క యాకారము గల తిన్నె- ఆతిన్నెయందుండు అగ్ని (ఒకానొక యాగము): చూ, వహ్ని. 1.

చయము. సం. వి. అ. పుం. 1: చూ, సమూహము; 2. కోటకొఱడు: చూ, వప్రము. 2; 3: చూ, సంగ్రహము. 2.

చరకము. సం. వి. అ. పుం, న. 1. వైద్యశాస్త్రము: చూ, శాస్త్రము. 1. (చూ, శాస్త్రములు); 2. దుప్పటి: చూ, వస్త్రము.

చరచ్ఛద. సం. వి. ఆ. స్త్రీ: చూ, బరివెంక *.

చరటము. సం. వి. అ. పుం. కాటుకపిట్ట: చూ, పిచ్చుక.

చరణక్రియలు. అం. అంచితము, కుంచితము, సూచి, అగ్రతలసంచరము, ఉద్ఘట్టితము, సమము (6).

చరణగ్రంథి. సం.వి. ఇ. పుం: చూ, సీలమండ.

చరణపర్వము. సం. వి. న్. న. ఏనుఁగుకాలికణుపు. ప్రాహము: చూ, హస్తి.

చరణము. సం. వి. అ. న. 1. తిండితినుట: చూ, భక్షణము; 2. తిరుగుట: చూ, విహారము. 1; 3. మంచినడత: చూ, వర్తనము. 1; న. 4. విష్ణుచక్రము: చూ, బాణము. 1; 5. సంస్కారముచేసిన నేల: చూ, భూమి. 1; 6. ప్రాంగణము: చూ, ముంగిలి; పుం, న. 7. అంఘ్రి: చూ, పాదము. 1; 8. మూలము: చూ, వేరు 1; 9. ఋగ్యజుశ్శాఖాదులు (వేదభాగము): చూ, వేదము; 10. కులము: చూ, వంగడము; అం. 11. శరీరాంగము లెనిమిదింటిలో నొకటి: చూ, శరీరాంగములు (చూ, అంగము 9.)

చరణములు. అం. నాట్యోపయోగాంగములు పందొమ్మిదింటిలో నొకటి: చూ, అంగము 9: (చూ, ఉపవిద్యలు.)

చరణామల. సం. వి. ఆ. స్త్రీ. పిన్నముల్లంగి*: చూ, ముల్లంగి.

చరణాయుధము. సం. వి. అ. పుం. అజ్జేవాలు: చూ, పుంజు.

చరణుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, సూర్యుఁడు; 2. వేదశాఖాధ్యయనము చేసినవాఁడు; బహ్వృక్శాఖాధ్యేత (అనియు); 3. నాట్యపరిభాషలయందుఁ గడపటచేర్చునపుడు పూజ్యుఁడు.

చరణ్యువు. సం వి. ఉ. పుం. గాలి: చూ, వాయువు.

చరమక్రియ. సం. వి. ఆ. స్త్రీ. అంత్యకర్మము, అపరక్రియ, అహర్దానము, ఉత్తరక్రియ, ఔర్ధ్వదైహికము, శ్రాద్ధము: చూ, కర్మములు. (చూ, శ్రాద్ధము. 1.)

చరమక్ష్మాభృత్తు. సం. వి. త్. పుం. పడమటికొండ: చూ, పర్వతము. (ఇట్లు చరమాచలము, చరమాద్రి.)

చరమము. సం. విశే. 1. కడపటిది: చూ, వెరసి. 2; 2. పడమటిది: చూ, పశ్చిమము. 1.

చరము. సం. వి. అ. పుం. 1. ఒకానొక జూదము: చూ, వ్యవహారము. 4; 2. జంతువర్గము: చూ, రూ-చరాచరము; విశే. 3. కదలునది: చూ, చలితము. 3; 4. తిరుగునది: చూ, త్రసము.

చరయువు. సం. వి. ఉ. పుం. 1. మబ్బు: చూ, మేఘము. 1; 2. గాలి: చూ, వాయువు.

చరవాయువు. సం. వి. ఉ. పుం. వేసఁగిగాలి: చూ, వాయువు.

చరాచరము. సం. వి. అ. న. 1. జగము: చూ, లోకము; 2: చూ, రూ-చరము. 1; విశే. 3. తిరుగునది: చూ, త్రసము; 4. తిరుగునదియుఁ దిరుగనిదియునైనది.

చరి. సం. వి. ఇ. పుం. గాడిద: చూ, రాసభము.

చరించు. సం. అ. క్రి. 1. తిరుగు: చూ, సంచరించు; స. క్రి. 2. చేయు: చూ, సలుపు.

చరిత. సం. వి. ఆ. స్త్రీ. నడవడి, మంచినడవడి (అని కొందఱు); చూ, వర్తనము. 1; 2. వృత్తాంతము: చూ, సమాచారము. 2. (రూ-చరితము-చరిత్ర-చరిత్రము-చారిత్రము.)

చరితము. సం. వి. అ. న. —పై.—

చరిత్ర. సం. వి. ఆ. స్త్రీ. —పై.—

చరిత్రము. సం. వి. అ. న. —పై.—

చరిష్ణువు. సం. విశే. ఉ. తిరుగునది: చూ, చలమానము. 1.

చరుఁడు. సం. వి. అ. పుం. 1. రూ-చారుఁడు: చూ, వేగువాఁడు; 2. అంగారకుఁడు: చూ, రాహువు. 2.

చరువు. సం. వి. ఉ. పుం. 1 =చేరవ. పాత్రము, అగ్నిలో వేల్వఁదగిన పక్వాన్నము: చూ, సాదము. (1); 2. హవ్యముఁ వండెడు కుండ: చూ, భాండము. 3; అం. 3. ఖండములు తొమ్మిదింటిలో నొకటి: చూ, ఖండములు.

చరువ్రణము. సం. వి. అ. పుం. చిత్రాపూపమను పిండివంట: చూ, భక్ష్యము.

చర్చ. సం. వి. ఆ. స్త్రీ. 1. విచారణము: చూ, వెదకుడు; 2. చింత: చూ, పశ్చాత్తాపము; 3. చేతనిడిన కుంకుమము లోనగునది, చర్చిక, కుంకుమము లోనగువానిపూఁత (అని కొందఱు): చూ, బచ్చెన; 4. దుర్గ: చూ, పార్వతి. 1; 5. చర్చయనునది: చూ, నది; 6. నవనిధులలో నొకటి: చూ, నిధులు. (చూ, లిబ్బి. 1.)

చర్చరి. సం. వి. ఈ. స్త్రీ. 1. చేప్పట, చోఁచిన వ్రేళ్లుగల అఱచేయి: చూ, హస్తము; అం. 2: చూ, ఉద్ధతము. 2; 3. జన్యతాళములు తొంబదియాఱింటిలో నొకటి: చూ, జన్యతాళములు.

చర్చించు. సం. స. క్రి. 1. అరయు: చూ, విచారించు. 1; 2. అన్వేషించు: చూ, వెదకు.

చర్చిక. సం. వి. ఆ. స్త్రీ. 1. దుర్గ: చూ, పార్వతి. 1; 2: చూ, చర్చ. 3; 3. శివపరిచారికలలో నొకతె: చూ, పరిచారిక.

చర్చిక్యము. సం. వి. అ. న. రూ-చార్చిక్యము. గందము మొదలగువానిపూఁతద: చూ, చర్చ. 3.

చర్చితము. అం. రదక్షతములు పదింటిలో నొకటి: చూ, రదక్షతములు.

చర్పటము. సం. వి. అ. పుం. 1: చూ, చర్చరి. 1; 2. ఒకానొకమందు చెట్టు: చూ, వృక్షము; 3. అప్పడము: చూ, భక్ష్యము.

చర్పటి. సం. వి. ఈ. స్త్రీ. ఒబ్బట్టు, పోలీ: చూ, భక్ష్యము.

చర్మకషా. సం.వి.ఆ. స్త్రీ. = చూ, సంబరేను*.

చర్మకారకు. సం.వి.అ పుం. చూ, చర్మకషా.

చర్మకారుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, మాదిగ; అం. 2.జాతులుపదునెనిమిది. వారిలో నొకఁడు: చూ, జాతులు. [వాయు.

చర్మచటక. సం. వి. ఆ. స్త్రీ. చూ, చీకురు

చర్మచటి. సం. వి. ఈ. స్త్రీ. —పై.—

చర్మచోర. సం. వి. ఆ. స్త్రీ. కొండబెండ*: చూ, పద్గ్రంధ.

చర్మణ్వతి. సం. వి. ఈ. స్త్రీ. 1. చర్మణ్వతీ నది: చూ, నది. 2. అరఁటి*: చూ, కంభ.2.

చర్మప్రసేవిక. సం. వి. ఆ. స్త్రీ. కొలిమితిత్తి: భస్త్రి.

చర్మఫలకము. సం. వి. అ న: చూ, అరిగ.1.

చర్మభేదిక. సం. వి. ఆ. స్త్రీ. ఆరె: చూ, సూది.

చర్మము. సం. వి. న్. పుం. 1: చూ, తోలు. 1; 2. కేడెము: చూ, ఫారిగ; అం. 3. ధాతువు లేడింటిలో నొకటి: చూ, ధాతువులు.

చర్మముండ. సం. వి. ఆ. స్త్రీ. 1. దుర్గ: చూ, పార్వతి. 1; 2. శివపరిచారికలలో నొకతె: చూ, పరిచారిక.

చర్మయష్టి. సం. వి. ఈ. స్త్రీ. చూ, సమ్మెట.

చర్మరంగ. సం వి ఆ. స్త్రీ. నులితడ*: చూ, మహాబల.

చర్మరువు. సం.వి.ఉ.పుం: చూ, చర్మకారుఁడు.

చర్మశము. సం. వి. అ. పుం. చేదర: చూ, చాప.

చర్మారము. సం.వి. అ. పుం: చూ, చెప్పుతట్టు*

చర్మి. సం. వి. న్. పుం. 1. కేడెము ధరించినవాఁడు: చూ, డాలుకాఁడు; 2. బుజపత్తిరి*: చూ, భూర్జము; 3. మూఁడు కాళ్లుగల భృంగియను శివభక్తుఁడు; 4. అలంబుషుఁడను రక్కసుఁడు:చూ,రాక్షసుఁడు1.

చర్యా. సం. వి. ఆ. స్త్రీ: చూ, ఈర్య. 1-2-3; 4. నడత: చూ, వర్తనము. 1.

చర్వా. సం. వి. ఆ. స్త్రీ. చెంపదెబ్బ: చూ, లెంపకాయ.

చర్వణ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఈఁగ, నల్లయీఁగ (అనికొందఱు): చూ, మక్షిక; 2. దిగుచుఁ బాతిన చంద్రికళ. (చర్విత అనియును).

చర్వణము. సం. వి. అ. న: చూ, నమలుట; 2. నోరు: చూ, వదనము. 1; 3. స్త్రీహంసుని యిల్లు: చూ, సదనము. 1.

చర్వితచర్వణన్యాయము. పా. నమలినదే మరల నమలిన రీతి.

చర్వితచర్వణము. సం.వి.అ. న. నెమరువేయుట: చూ, రోమంథము; జా.2. చేసినదియే మరలఁ జేయుట. (పిష్టపేషణము) "పోయినదాని మరలఁ ద్రవ్వుట చర్వితచర్వణము." (నీతిచంద్రిక-విగ్రహము)

చర్వితపాత్రము. సం. వి. అ. న. తమ్మతసుకు: చూ, పీఁకెదాను (చూ, పాత్రము. 6)

చర్వితము సం. వి. అ న. 1. ముక్కువైపు కొలికి. చూ, ముక్కుకొలికి. విణ. 2. నమలఁబడినది, తినఁబడినది (అనికొందఱు): చూ,, భుక్తము. 1.

చర్షణి. సం. వి. ఈ. స్త్రీ: చూ, బంధులాఁడి.

చల. సం. వి. ఆ. స్త్రీ: చూ, లక్ష్మి.

చలత్తైలాఖ్యము. సం. వి. అ. పుం. సిల్లమను ధూపద్రవ్యము*: చూ, సల్లకి.

చలదళము. సం. వి. అ. పుం. 1: చూ, రావి*, 2. గుండ్రతుంగ*: చూ, తృణము. 1.

చలద్రుమము. సం. వి. అ. పుం: చూ, జయద్రుము*.

చలనాడులు. పా. చలించునాడులు: చూ, నాడులు.

చలనము. సం. వి. అ. న. 1. కదలుట: చూ, లోలము; 2. తిరుగుట: చూ, విహారము. 1; 3. = చేల్లడము. లాగు: చూ, వస్త్రము; 4. భయము: చూ, వెఱపు; విణ. 5. కదలునది: చూ, చలితము. 3; అం. 6. తారాక్రియలు తొమ్మిదింటిలో నొకటి: చూ, తారాక్రియలు.

చలపత్రికము. సం. వి. అ. పుం. ఉమ్మెత్త* చూ, మాలాపుష్పము.

చలపత్రము. సం. వి. అ. పుం: చూ, రావి*.

చలము. సం. వి. అ. పుం. 1. రూ-చంచలము. వణఁకు: చూ, లోలము; 2. వణఁకుగలది: చూ, లోల. (చలితము. 3)

చలరాశి. పా. అస్థిరరాశి.-ఇందుకు సంబంధించి నక్షత్రపరిభాషాపదములు. — పరాధీనచలరాశి, స్వతంత్రచలరాశి (అవ్యక్తరాశి.)

చలసంహతము. అం. చిబుకక్రియలు యెనిమిదింటిలో నొకటి: చూ, చిబుకక్రియలు.

చలపర్శ్వశిరము. అం. అసంయుతహస్తములు నలుబదిరెండింటిలో నొకటి: చూ, అసంయుతహస్తములు [తము. 3.

చలాచలము. సం. విణ. కదలునది: చూ, చలి

చలి సం. వి. ఇ. స్త్రీ. రూ-చాల-చాలి. పదునాలుగంగములు గల నర్తనవిశేషము: చూ, నాటకము. 1. [చలించు.

చలించు. సం. అ. క్రి.= చలించు: చూ,

చలితము. సం. విణ. కదలింపఁబడినది: చూ, వేల్లితము. 1. [వ్యాధుఁడు. 2.

చలుఁడు. సం. వి. అ. పుం. దుష్టుఁడు: చూ,

చవర్గము. అం. చ ఛ జ ఝ ఞ: చూ, కవర్గము.

చవలాగాయి బ్రాహ్మణులు. పా. నేపాళదేశపు బ్రాహ్మణులలో నొక తెగవారు: చూ, బ్రాహ్మణులు. [చూ, రాజార్హము.

చవి. సం. వి. ఇ. స్త్రీ. = సేవ్యము. చవ్యము*:

చవిక. సం. వి. అ. స్త్రీ, అ. న.=: చూ, చవి.

చవికము. సం. వి. అ. న. = —పై.—

చవికాఫల. సం. వి. అ. స్త్రీ. గజపిప్పలి*: చూ. పిప్పలి. 1.

చవితి. అం. 1. తిథులలో నాలవది: చూ, తిథులు; 2. శుక్లపక్షతిథులు పదునేనింటిలో నొకటి: చూ, తిథులు; 3. కృష్ణపక్షతిథులుప దునేనింటిలో నొకటి: చూ, తిథులు. (చూ, పక్షము.) [సరకు. 1.

చవీనాహి. సం. వి. ఈ. స్త్రీ. బావి: చూ,

చవ్య. సం. వి. అ. స్త్రీ. రూ-చవికము-చవిక.= సేవ్యము*: చూ, రాజార్హము.

చవ్యకము. సం. వి. అ. న.=—పై.—

చవ్యము. సం. వి. అ. న.= —పై.—

చషకము. సం. వి. అ. పుం, న. 1. కల్లుత్రాగు గిన్నె: చూ, పాత్రము. 6; 2. కల్లు: చూ, సుర. 1; 3. గిన్నె: చూ, పాత్రము. 6; 4. గిండి: చూ, పాత్రము. 6; 5. ఒక దినుసుకల్లు: చూ, సుర. 1; న. 6. మబ్బు: చూ, మేఘము. 1.

చషాలము. సం. వి. అ. పుం. యూపస్తంభ శిరోభాగమునందలి దారుమయమైన కడియము, రాజసూయమునందు యూపస్తంభమున కడుగునఁ దగిల్చెడి యినుపకడియము (అని కొందఱు)

## చా

చాంగము. సం. వి. అ. పుం: చూ, పులిచింత*.

చాంగేరి. సం.వి.ఈ. స్త్రీ. 1: చూ, పులిచింత*; 2. ముస్తె*: చూ, ముస్తకము.

చాంచల్యము. సం.వి.అ.న. చపలత్వము: చాపలము, చాపల్యము; [వీణ.

చాండాలిక. సం. వి. అ. స్త్రీ. మాలవీణ: చూ,

చాండాలుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ-చండాలుఁడు.

చాండిక. సం.వి.అ.స్త్రీ: చూ, రూ-చండిక.1.

చాంద్రభాగ. సం. వి. అ. స్త్రీ: చూ, రూ-చంద్రభాగ.

చాంద్రభాగి. సం. వి. ఈ. స్త్రీ. —పై.—

చాంద్రమసము. సం. వి. అ. న. మృగశిరః చూ, నక్షత్రము. 1.

చాంద్రమసాయనము. సం. వి. అ. పుం. బుధగ్రహము: చూ, రౌహిణువు. 2.

చాంద్రమానాబ్దము. పా. పండ్రెండు చాంద్రమాసములు గలది. చంద్రుని సంచారము వలన దీనికీ పేరు గలిగెను. (ఈమానము త్రిలింగదేశమందు వ్యవహరింపఁబడును.)

చాంద్రమాసము. పా. చంద్రునిగతినిఁబట్టి యేర్పఱచెడు కాలపరిమాణము. మనము కొన్ని రాత్రులు చంద్రుని స్థానమును పరిశీలించిన మొదల పడమటనుండితూర్పునకు నక్షత్రముల మధ్య సంచారముచేసి 27దినముల, 7 గంటల, 48 నిమిషములకు తానువిడిచిన నక్షత్రము నందు మరలప్రవేశించుట గోచరమగును. సూర్యుఁడుఁగూడ పడమటనుండి తూర్పునకు సంచరించుచుండుటవలన చంద్రుఁడు సూర్యునివద్దనుండి దూరమై తిరిగి సూర్యునివద్దకుఁ జేరుటకు 29½ దినములు పట్టుచున్నది. దీనికే చాంద్రమాసము (Lunar Month) అని పేరు.

చాంద్రాయణము. పా. చాంద్రాయణవ్రతము. భుజింపఁదగిన ముప్పదిరెండు కబళములలో చంద్రునియొక్క క్షయవృద్ధుల ననుసరించి క్రమమున కృష్ణపక్షమందు ఒక్కొక్కటిగా తగ్గించుచు శుక్లపక్షమందు ఒక్కొక్కటిగా హెచ్చించుచు భుజించి యాచరించెడి యొకానొక వ్రతము. రూ-చంద్రాయణము: చూ, కృచ్ఛ్రము. 3: తద్విశేషము.— ఋషిచాంద్రాయణము; మనువచనము.—శ్లో. "ఏతమేవవిధింకృత్స్నమాచరేద్యవ మధ్యమే।శుక్లపక్షాదినియతశ్చరంచాంద్రాయణం వ్రతమ్."

చాంద్రి. సం. వి.ఈ. స్త్రీ. 1: చూ, వెన్నెల; 2: చూ, చాంద్రమసాయనము. [నది.

చాంపిల. సం. వి. అ. స్త్రీ. చాంపిలానది: చూ,

చాంపేయము. సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1; పుం. 2. అకరువు: చూ, పద్మము. 4; 3: చూ, నాగకేసరము*: 4: చూ, సంపెఁగ*; 5. సురపొన్న*: చూ, పొన్న. [చూ, వెన్నెలపులుఁగు.

చాకోరము. సం.వి. అ. న. చకోరపక్షులగుంపు:

చాక్రికుఁడు. సం. వి. అ. పుం. 1. వేకువను రాజుల నిద్రమేల్కొలుపువాఁడు: చూ, ఘంటికుఁడు; 2: చూ, తెలుకులవాఁడు.

చాక్షుషుఁడు. అం. రూ-చాక్షుషుఁడు. వైవస్వతాది పదు నలుగురు మనువులలో నొకఁడు: చూ, మనువులు.

చాచపుటము. అం. (చాచపుటము) తాళకళలైదింటిలో నొకటి: చూ, తాళకళలు.

చాటకైరము. సం. వి. అ. పుం. 1. ఏట్రింత: చూ, వ్యాఘ్రాటము; 2. పిచ్చుక మగపిల్ల: చూ, పిచ్చుక.

చాటుకారము. సం. వి. అ. పుం. బంగారు పూసలు గ్రుచ్చిన యొంటిపేట హారము: చూ, భూషణము. 2. [లోలుఁడు.

చాటులోలుఁడు. సం. విణ: చూ, రూ-చటు

చాటువు. సం. వి. ఉ. పుం, న. = చాటు. 1. ప్రియమైనమాట, ఉదాహరణము (అని కొందఱు): చూ, శబ్దము. 2; 2. బ. అప్పుడప్పుడు కవి ఆశువుగ చెప్పిన పద్యములు. (గ్రంథస్థముకానివి).

చాటూక్తి. సం.వి.ఇ. స్త్రీ. సేవ: చూ, శుశ్రూష.2.

**చాణకీనము.** సం. విణ. సెనగలుపండు మంచి నేల: చూ, భూమి. 1.

**చాణము.** సం. వి. అ. న: చూ, పిడక.

**చాణక్యుఁడు.** సం. వి. అ. పుం: చూ, వాత్స్యాయనుఁడు.

**చాణూరసూదనుఁడు.** సం. వి. అ. పుం. విష్ణుఁడు: చూ, విష్ణువు. 1.

**చాతకము.** సం. వి. అ. పుం: చూ, వానకోయిల.

**చాతురంతికములు.** అం. శుభావర్తములలో నొకటి: చూ, శుభావర్తములు.

**చాతురి.** సం. వి. ఈ. స్త్రీ. రూ-చాతుర్యము. నేర్పు: చూ, సామర్థ్యము. 1.

**చాతురుఁడు.** సం విణ.=: చూ, రూ-చతురుఁడు.

**చాతుర్జాతము.** పా. ఏలకులు లవంగాలు ఆకుపత్రికము నాగకేసరములున్న: చూ, చతుర్జాతము.

**చాతుర్మాస్యేష్టి.** అం. హవిర్యజ్ఞము లేడింటిలో నొకటి: చూ, హవిర్యజ్ఞములు.

**చాతుర్మాస్యము.** పా. ప్రతివత్సరము ఆషాఢ శుద్ధము మొదలు కార్తీకశుద్ధము వఱకు నాలుగు నెలలు చేసెడి యొకానొకయజ్ఞము: చూ, యజ్ఞము; అం. 2. నిహీనతానము లేడింటిలో నొకటి: చూ, నిహీనతానములు. (చూ, శుద్ధతానములు).

**చాతుర్యము.** సం. వి. అ. న.=చెతురు: చూ, చాతురి.

**చాతుర్వర్ణ్యము.** సం.వి. అ. న. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు.

**చాదస్తము.** వా. వి. చెప్పిన దే చెప్పుట, చేసినదే చేయుట.

**చాపబంధము.** అం.శబ్దాలంకారములలో నొకటి: చూ, శబ్దాలంకారములు. [బాణము. 1.

**చాపము.** సం. వి. అ. పుం. ధనుస్సు: చూ,

**చాపముష్టిక్రియాగుణవివరము.** అం. ధనుర్విద్యాప్రమేయములు నలుబదాతింటిలో నొకటి: చూ, ధనుర్విద్యాప్రమేయములు.

**చాపలము.** సం. వి. అ. న. 1: చూ, చాంచల్యము; అం. 2. సంచారీభావములు ముప్పది మూఁడింటిలో నొకటి (అ ముద్దులాఁడి యమ్మనోనాయకుం గాంచి హారముల దిద్దుచుఁ జూపు మరలించుచుఁ బలుక నమకించుచు మరల నూరకుండెను): చూ,సంచారీభావములు.

**చాపలేపము.** అం. తంత్రము లఱువదినాలుగింటిలో నొకటి: చూ, తంత్రములు.

**చాపల్యము.** సం. వి. అ. న: చూ, చాపలము.

**చాపోచ్చరణలక్షణము.** అం. ధనుర్విద్యాప్రమేయములు నలుబదాతింటిలో నొకటి: చూ, ధనుర్విద్యాప్రమేయములు. [కము.

**చాబుకము.** సం. వి. అ. న: చూ, రూ-చంబుకము.

**చాబూకము.** సం. వి. అ. న. —పై.—

**చామరద్వంద్వము.** అం. తంత్రములఱువదినాలుగింటిలో నొకటి: చూ, తంత్రములు.

**చామరపుష్పము.** సం. వి. అ. పుం. 1: చూ, పోఁక*; 2: చూ, మామిడి *; 3: చూ, మొగలి *; 4. రెల్లు *: చూ, తృణము. 1.

**చామరము.** సం. వి. అ. న. 1.=వింజామరము (రూ- చామర- చామరి- చమరము): చూ, సురఁటి; అం. 2: చూ, ఉద్ధతము. 2.

**చామరి.** సం. వి. ఈ. స్త్రీ. 1.=చూ, రూ-చామరము. 1; 2. గుఱ్ఱము: చూ, హయము.

**చామీకరము.** సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1; 2. మేరుపర్వతము: చూ, పర్వతము; 3. గని: చూ, భూమి. 1; పుం. 4. సూర్యునివిల్లు: చూ, బాణము. 1.

**చామీరము.** సం. వి. అ. పుం. సూర్యునివిల్లు: చూ, బాణము. 1.

**చాముండ.** సం. వి. ఆ. స్త్రీ. రూ-చాముండి. 1. ఒక మాతృక: చూ, మాతృకలు; 2. శివ పరిచారికలలో నొకతె: చూ, పరిచారిక; 3. మాతలేడుగురిలో నొకతె: చూ, మాతలు.

చాముండాతంత్రము. అం. శివప్రోక్తములగు చతుష్షష్టి తంత్రములలో నొకటి: చూ, తంత్రములు.

చాముండి. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ- చాముండ.

చామ్యము. సం. వి. అ. న. (సేమ్య అనివాడుక) పాయసమువంటి భక్ష్యము: చూ, భక్ష్యము.

చారకము. సం. వి. అ. పుం.=చోఱ*: చూ, స్రువ.

చారటి. సం. వి. ఈ. స్త్రీ. 1. మెట్టుదామర* చూ, పద్మము. 1; 2. నీలిని*: చూ, నెం[illegible] 3. తంగేడు*: చూ, హేమపుష్పకము 4. స్థౌణేయమను గంధద్రవ్యము*: చూ, రాజార్హము.

చారటిక. సం. వి. ఆ. స్త్రీ. నలి యను గంధద్రవ్యము: చూ, రాజార్హము.

చారణము. సం. వి. అ. న. రూ- చరణము. తిరుగుట: చూ, విహారము. 1.

చారణుఁడు. సం. వి. అ. పుం. 1. నానాదేశ సంచారకుఁడైన నట్టువుఁడు: చూ, సీకారి; 2. నానా దేశ సంచారకుఁడైన బట్టువాఁడు: చూ, బట్టువాఁడు; 3. ఒకానొక ఖేచరుఁడు. చూ, ఖేచరుఁడు. 3.

చారము. సం. వి. అ. పుం. 1.=చెఱ. బొండ, సంకెల (అని కొందఱు): చూ, బంధనాలయము; 2. నడ, పయనము: చూ, ప్రయాణము; 3.=చోఱ. చీడిమామిడి*: చూ, స్రవ; 4. పాట, గానము: చూ, స్వరము. 2; 5. పాము: చూ, సర్పము; అం. 6. వాయువులు తొమ్మిదింటిలో నొకటి: చూ, వాయువు. (పడమటిగాలి)

చారవాయువు. సం. వి. ఉ. పుం. పడమటి గాలి: చూ, చారము. 6.

చారాయణ. అం. కామశాస్త్రమును రచియించినవారిలో నొకరు: చూ, కామము. 8.

చారిణి. సం. వి. ఈ. స్త్రీ. తెల్లవిష్ణుక్రాంత*: చూ, విష్ణుక్రాంత.

చారితము. సం. వి అ. న. రతిబంధభేదము: చూ, రతిబంధము. [తింత్రిణి.

చారిత్రి. సం. వి. ఆ. స్త్రీ. చింత*: చూ,

చారిత్రము. సం. వి. అ. న: చూ, రూ- చరిత.

చారిపుష్ప. సం. వి. ఆ. స్త్రీ. తంగేడు*: చూ, హేమపుష్పకము. [సౌందర్యము.

[illegible] సం. వి ఉ. పుం. ఒప్పిదము: చూ, పక్ష్మము. 4; 3: చూ, నాగకేసర[illegible] 2 చూ, సంపెఁగ*; 5. సురపొన్న*: [illegible]చరుఁడు. పొన్న. [చూ, వెన్నెలఫు[illegible]

చారుమతి. [illegible]చంద్రునిభార్య: చూ, భార్య.

చారుగర్భుఁడు. సం. వి. అ. పుం శ్రీకృష్ణుని పుత్త్రుఁడు: చూ, పుత్త్రుఁడు. 1.

చారుగుప్తుఁడు. సం. వి. అ. పుం. —వై.—

చారుదర్శనము. సం. వి. అ. పుం. జువ్వి*: చూ, ప్లక్షము.

చారుధార. సం. వి. ఆ. స్త్రీ. ఇంద్రునిభార్య. శచి: చూ, భార్య. [స్వాదుఫల.

చారుఫల. సం. వి. ఆ. స్త్రీ. ద్రాక్ష*: చూ,

చారుబాహువు. సం. వి. ఉ. పుం: చూ, చారుగర్భుఁడు. [సవరము*.

చారుపర్ణి. సం. వి. ఈ. స్త్రీ: చూ, లంజె

చారుపుష్ప. సం. వి. ఆ. స్త్రీ —వై.—

చారుపుష్పము. సం. వి. అ. పుం, న. బంగారు: చూ, లోహము. 1.

చారుమతి. సం.వి.ఈ. స్త్రీ: చూ, చారుకాంతి.

చారువిందువు. సం. విణ: చూ, చారుగర్భుఁడు.

చారువ్రత. సం. వి. ఆ. స్త్రీ. మాసపర్యంతము ఉపవసించు ఆఁడుది, మాసోపవాసిని: చూ, స్త్రీ.

చారుహాసిక. పా. వైతాళీయజాతి వృత్తములలో నొకటి.( ఇది ప్రవర్తకవృత్తభాయనే నడచును.): చూ, వృత్తము. 1.

చార్చిక్యము. సం. వి. అ. న: చూ, రూ-చర్చిక్యము.

చార్మణము. సం. వి. అ. న. చర్మముల సమూహము: చూ, తోలు. 1.

చార్వాకుఁడు. సం. వి. అ. పుం. 1. చార్వాకను పేరిడి శాస్త్రమును చేసినవాఁడు; 2. ఒకానొక రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

చార్వి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఊహాపోహక్షమమైన బుద్ధి: చూ, బుద్ధి; 2. పసుపు: చూ, వర్ణము. 6; 3. కుబేరునిభార్య: చూ, భార్య; 4: చూ, వెన్నెల; 5. కాంతి: చూ, వెలుతురు. 1.

చాల సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-చలి.

చాలకము. సం. వి. అ. పుం. మదపుటేనుఁగు: చూ, హస్తి.

చాలనము. సం. వి. అ. న. 1. చలింపఁజేయుట; 2: చూ, జల్లెడ; 3. భయము. రూ-చలనము: చూ, వెఱపు. [జల్లెడ.

చాలని. సం. వి. ఈ. స్త్రీ.=జల్లెడ: చూ,

చాలము. సం. వి. అ. న. 1. గృహాచ్ఛాదన విశేషము, పిటము: చూ, సదనము. 1; 2 మోఁగటి *: చూ, పేరింకణము.

చాలి. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-చాల-చలి.

చాలినీన్యాయము. పా. జల్లెడలోఁబోసి జల్లించినరీతి.

చావిషులనుబ్రాహ్మణులు. పా. వీరు సామవేదులు ఋగ్వేదులునైయున్నారు. బంగాళాయందును, నర్మదాతీరమందును, సినారు జనారు అను స్థలములయందును గానఁబడియెదరు: చూ, బ్రాహ్మణులు.

చావము. సం. వి. అ. పుం. రూ-చాసము: చూ, పాలపిట్ట.

చాషుషుఁడు. అం: చూ, రూ-చాక్షుషుఁడు.

చాసము. సం.వి.అ. పుం: చూ, రూ-చావము.

## చి

చింక. దే. వి. 1. చిన్నకాలువ: చూ,నది; బ.2. రెల్లలలోనుండు జొన్నలు: చూ, ధాన్యము; 3. తుమయుక్తాల్పధాన్యము, ఇసుకు: చూ, ధాన్యము.

చింకలిక్క. వై.వి.=క్వోంకఃః. ఎఱ్ఱని మొగముగల కోఁతి: చూ, వానరము.

చింకిణోపణియాసాంతో బ్రాహ్మణులు. పా: చూ, సాంతో బ్రాహ్మణులు: (చూ. బ్రాహ్మణులు.)

చింగటము సం. వి. అ పుం. మహాశల్కమను చేప: చూ, మత్స్యము. 1.

చింగటి. సం. వి. ఈ. స్త్రీ. —వై. —

చింగడము. సం. వి. అ. పుం. —వై.—

చింగు. దే. వి. కచ్ఛభేదము: చూ, వలి. 2.

చింగోటి దే. వి. చికటారి: చూ, బాణము. 1.

చించ. సం. వి. ఆ. స్త్రీ.=చింత: చూ, తింత్రిణి.

చించి. సం. వి. ఈ. స్త్రీ. గుంజా*: చూ, శ్వేతపాకి.

చించు. దే. క్రి. చినుఁగఁజేయు. రూ-చింపు. కత్తిరించు (అని కొందఱు): స. క్రి. 2. ఖండించు: చూ, సెలగు.

చించోటము. సం. వి అ. పుం. ఒకరకముగడ్డి: చూ, తృణము. 1.

చింత. సం. వి. ఆ. స్త్రీ. 1. తలఁపు: చూ, స్మృతి. 1; 2. వగపు: చూ, పశ్చాత్తాపము; అం. 3. సంచారీభావములు ముప్పదిరెండింటిలో నొకటి (ఓ రసాతలమా! నాపైదయఁగలిగె నేని సీత యేతోవనే తెంచెనో యానతిమ్ము): చూ,సంచారీభావములు; వై.వి.(1).=చించా: చూ, చించ. (దోహదశాస్త్రపద్ధతిని చింతచెట్టు మొదట త్రవ్వి గోధుమలు, మినుములు, నువ్వులు, మాంసము, లేపనముచేసిన

విశేషముగా ఫలించును: చూ, దోహదకామ్య ము. (చూ, ఉపవిద్యలు.) (చూ, చిక్కుడు కుటుంబము.)

చింతకుఁడు. సం. విణ: చూ, దుఃఖితుఁడు.

చింతగుల్ల. వై. వి. బరడుతోనుండు చింతపండు. చింతపండు లేని పైపొర (అని కొందఱు) (పై పెంకు కండకాయలజాతిలో చేరును). చూ, అమ్లము. 3.

చింతఉట్టి. ద్వ. వి. —పై.— (వాడుకయందు చింతపండునంటియుండునరములసమూహము.)

చింతన. సం. వి. అ. స్త్రీ. పలుమాఱుతలఁచుట, పలుమాఱు చేయువుట (అని కొందఱు.)

చింతనీయము. సం. విణ. చింత్యము: చూ, విచార్యము. [ముద్ద: చూ, అమ్లము. 3.

చింతపండు. ద్వ. వి. ఏ. బరడూడ్చిన చింతపండు

చింతాకర్మ. సం. వి. అ. స్త్రీ. తహతహ: చూ, వ్యసనము. [హంస. 3, ఆ. 146

చింతాకుచుణుదు. ద్వ. వి: చూ, బాలక్రీడ.

చింతామణి. సం. వి ఇ. పుం. 1. కోరినకోరికల నిచ్చెడుదేవమణి: చూ. రత్నము. 1; 2. చావు నకు ముందు మాట్లాడించెడి మందు: చూ, మందు. 1. (ఈ ఔషధమును తయారు చేయు రీతులు పెక్కులుగలవు. అందొకవిధము:— శుద్ధిచేసిన గంధకము, రసము, మిరియాలు, వెలిగారము, దంతివిత్తులు, తిప్పసత్తు ఇవి అన్నియు సమభాగములుగనూరి నిమ్మపండ్ల పులుసుతో మర్దనచేసి గురిగింజ ప్రమాణము గల మాత్రలుకట్టి అనుపానవిశేషములతో నిచ్చునది. (పంచలోహ, అష్టలోహ, నవలోహ చింతామణులు మున్నగునవి గలవు); 3. ఒక కానొక బుద్ధుఁడు: చూ, బుద్ధుఁడు. 1.

చింతాయన. సం. వి. అ. స్త్రీ. 1. పెండ్లాము: చూ, భార్య; 2. కల్లు: చూ, సుర. 1; 3. మాయ; చూ, మాయము, 1.

చింతించు. సం. అ. క్రి. రూ-చింతిల్లు: చూ, పశ్చాత్తాపపడు.

చింతిల్లు. సం. అ. క్రి. —పై.—

చింతితము. సం. విణ: చూ, విచారితము.

చింత్యము. సం. విణ. 1: చూ, చింతనీయము; అం. 2. స-మ-హీనతానము లేడింటిలో నొకటి: చూ, స-మ-హీనతానములు. (చూ, సర్వ తానములు); 3. ఆగమము లిరువదెనిమిదింటి లో నొకటి: చూ, ఆగమములు (చూ, ఉప విద్యలు.) [పిన్న గ్రద్ద.

చింద. వై. వి.=చిల్లః. రూ-చీఁద-చీపర: చూ,

చిందము. దే. వి. శంఖము: చూ, సంకు. 1.

చిందఱ. దే. వి. 1. ఉంకించు: చూ, విజృంభ ణము; 2. కోపము. అం, భా. ప్ర. 185: చూ, కోపము; వై. వి. 3.=ఛిద్రమ్, తూఁటు: చూ, రంధ్రము. 1; 4. ఖండము. సా. 2, ఆ. 150: చూ, శకలము. 4 [చూ. విజృంభించు.

చిందఱగొను. దే. అ. క్రి. (చిందరన్ + కొను):

చిందరేఁగు. దే. అ. క్రి. ఆవేశమెత్తు: రూ-చీఁ దఱరేఁగు-చీఁదఱగొను. [సేయు.

చిందఱలుసేయు. ద్వ. స. క్రి: చూ, చిందఱ

చిందఱవందఱ. దే. వి. 1. తునుక. కళా 3, ఆ. 121: చూ, శకలము. 4; 2. కలగుండు: చూ, సంతాపము; విణ. 3. కలగుండువడినది: చూ, సంతాపితము; అవ్య. 4. కణశోర్థము. అం. భా. తృ. 67: చూ, పరిపరి.

చిందఱవందఱచేయు. దే. స. క్రి. ఖండించు: చూ, సెలగు.

చిందఱవోవు. ద్వ. అ. క్రి. (చిందఱ + పోవు) తూఁటువోవు. కళా. 7, ఆ. 19: చూ, తొఱ టలువాఱు.

చిందఱసేయు. ద్వ. స. క్రి. (చిందఱ + చేయు) ఛేదించు. సా. 1, ఆ. 93: చూ, ఛేదిల్లు. 1.

చించాడు. దే. అ. క్రి. (చిందు + ఆడు) చిందు లుద్రొక్కు, నర్తించు: చూ, మలఁపుగొను.

చిందియ. దే. వి. జెట్టుకుళ్లాయి. రూ-చిందె: చూ, వస్త్రము. [చూ, వలితము. 3.

చిందిలి. దే. విణ. చలించినది. లక్ష్మీ. 2, ఆ.58:

చిందిలిపడు. ద్వ. అ. క్రి: చూ, సంభ్రమించు.

చిందిలిపాటు. ద్వ. వి: చూ, సంభ్రమము. 1.

చిందిలు. దే. అ. క్రి. వలించు: చూ, సలించు.

చిందు. దే. వి. 1.=స్యందః. (బహుత్వమున) నటనము నాట్యము: చూ, వ్యంజకము. 1; 2. = స్యందః. బ. మాతంగనాట్యము, చిందువాలు: చూ,వ్యంజకము.1: 3. కోపము: చూ, రోషము; 4. గీతప్రబంధవిశేషము: చూ, పుస్తకము; విణ. 5. చెదరినది: చూ, వ్యాకీర్ణము; అ. క్రి. 6: చూ, వ్యాపించు. స్వా.4, ఆ. 58; 7: చూ, రాలు. స్వా. 2, ఆ. 67; 8. నీళ్ళు పాత్రమునుండి తొనఁకిపడు: చూ, తొలఁకు; స. క్రి. 9. వెచ్చపెట్టు: చూ, వెచ్చించు.

చిందుగ. దే. వి. రూ-చిందువ. 1. చిందుగ అను చెట్టు. హంస. 4, ఆ. 11; వా. వి. 2. చిందువ అను జంతువు: చిందువ.

చిందుద్రొక్కు. దే. అ. క్రి. (చిందు+త్రొక్కు) రూ-చిందులు ద్రొక్కు: చూ,నులఁపుగొను. [ఆ. 146.

చిందుపరువు. దే. వి: చూ, బాలక్రీడ. హంస. 3,

చిందులుద్రొక్కు. దే.అ.క్రి: చూ, రూ-చిందుద్రొక్కు.

చిందువ. దే. వి. 1: చూ, రూ-చిందుగ. 1; 2: చూ, రూ-చిందుగ. 2; 3. అల్పపేటిక: చూ, కురుగు. [చూ, వ్యాకీర్ణము.

చిందువందు. దే. వి. చెదరినది. స్వా. 3, ఆ.28:

చిందువందుచేయు. దే. స. క్రి. చెదరఁగొట్టు. శై. 5, ఆ. 192.

చిందువాలు దే. వి: చూ, చిందు 2.

చిందె. దే. వి: చూ, రూ-చిందియ.

చింపి. దే వి. 1. జీర్ణవస్త్రము. అం, భా. ద్వి. 157: చూ, వస్త్రము; విణ. 2. చినిఁగినది. శై. 5, ఆ. 192: చూ, భేదితము.

చింపిగుడ్డ. దే. వి: చూ, చింపి. 1.

చింపితి. దే.వి. నిప్పుసోఁకినట్లుండు కొసలుగలిగి బిరుసెక్కిన చిన్నవంకర వెండ్రుకలు. జెం జెరు, బరిక. చూ, వెండ్రుక. 1.

చింపు. దే. ప్రే: చూ, రూ-చించు. 1.

చింబు. దే. వి. మేఁక: చూ, మేషము. 1.

చింబోతు. దే. వి. (చింబు+పోతు) మేఁకపోతు: చూ, మేషము. 1.

చికటారి. దే. వి. రూ-చిక్కటారి. కళా. 2, ఆ: 17: చూ, చింగోటి.

చికమక. దే. వి. చిక్కు: చూ, గుక్కు. 3.

చికలీలము. సం. వి. అ. పుం: చూ, బురద.

చికిచికి. దే.విణ. చిన్న, అల్పము: చూ,స్వల్పము.

చికిత్స. సం.వి.ఆ. స్త్రీ. 1. (రోగమునకుఁజేయు) ప్రతిక్రియ: చూ, వైద్యము; అం. 2. వైద్యశాస్త్రముయొక్క స్కంధములు మూఁడింటిలో నొకటి: చూ,స్కంధములు (చూ, ఔషధస్కంధము.) [వైద్యుఁడు.

చికిత్సకుఁడు. సం. వి. అ. పుం. వెజ్జు: చూ,

చికిత్సితము. సం. వి. అ. న: చూ, చికిత్స.

చికినము. వై. వి. = చిక్కణమ్. చికిని, చోయవక్క: చూ, పోఁక.

చికిని. వై. వి. = —వై.— [సాపు. 4

చికిలి. దే. వి. తుడిచిచెక్కఁజేయుట: చూ,

చికిలికాఁడు. దే. వి. (కత్తులుమొదలైనవానిని) చికిలిచేయువాఁడు: చూ, సాపుచేయువాఁడు.

చికిలు. దే. అ. క్రి. చేసవుచేసేద్చు: చూ, రోదించు. [వాంధ.

చికీర్ష. సం. వి. ఆ. స్త్రీ. చేయనిచ్ఛ: చూ,

చికీర్షితము. సం. విణ. చేయ నిచ్ఛింపఁబడినది: చూ, వాంఛ. [చూ, లుబ్ధుఁడు. 2.

చికీర్షువు. సం. విణ. ఉ. చేయ నిచ్ఛగలవాఁడు:

చికురము. సం. వి. అ. పుం. 1. బ. రూ-చకురము-చిహురము: చూ, వెండ్రుక. 1; 2. కొండ: చూ, పర్వతము; 3. చికురపక్షి: చూ, పక్షి; 4. పాము: చూ, సర్పము; 5: చూ, ముంగిస; 6: చూ, బల్లి; 7. ఒకానొక చెట్టు: చూ, వృక్షము; విణ. 8. కదలునది: చూ, లోలము. 4; 9. చలించునది: చూ, త్రసము.

చికురుఁడు. సం. విణ: చూ, చపలుఁడు. 5.

చిక్క. సం. వి. ఆ స్త్రీ: చూ, పోఁక*.

చిక్కంటు. దే.వి. తల చిక్కుదీసికొనెడి నిడుపు దువ్వెన. రూ-చిక్కంటె: చూ, ప్రసాధని.

చిక్కంటె. దే. వి. —పై.—

చిక్కటారి. ద్వ వి. (చికి + కటారి): చూ, రూ-చికటారి.

చిక్కణబిల్ల. ద్వ. వి: చూ, బాలక్రీడ.

చిక్కణము. సం. వి. అ. న. 1.=చికినము-చికిని: చూ, చికినము; 2. ఏనుఁగుచెక్కు ప్రాదయు మదము: చూ, మదము. 1; పుం, న. 3: చూ, పోఁక*; విణ. 4. = చిక్కన. తఱచైనది: చూ, మొత్తము. 4; 5. నునుపైనది: చూ, స్నిగ్ధము. 2. [పోఁక.

చిక్కణి. సం. వి. ఈ. స్త్రీ. పోఁకపండు: చూ,

చిక్కఁదనము. ద్వ. వి. 1. = చిక్కణ: చూ, సాంద్రము. 2: 2. మృదువు: చూ, సుకుమారము.

చిక్కన. వై. వి. 1.=చిక్కణ: చూ, సాంద్రము. 2; 2 మృదువు: చూ, సుకుమారము; 3. తఱచు. "చిక్కనిపాలు": చూ, మొత్తము.4; 4. బలము: చూ, శక్తి. 1; 5. దార్ఢ్యము: చూ, స్థైర్యము. 1; 6. జిడ్డు: చూ, స్నిగ్ధము. 3. [కాశీ. 3, ఆ. 88

చిక్కనాబిల్లలు. దే. వి. బ: చూ, బాలక్రీడ.

చిక్కపట్టు. దే. వి. (చిక్కని + పట్టు) నిర్ణయము: చూ, సత్యము 1. [భూమి. 1.

చిక్కమన్ను. ద్వ. వి. కుంభకారమృత్తిక: చూ,

చిక్కము. సం. వి అ. న. 1.=చికిని. పోయవక్క: చూ, పోఁక; పుం. 2. చుంచు: చూ, మూషికము; వై. వి. (1) తీఁగెలు లోనగువానితో నల్లి పసులమూతికిఁ దగిలించెడు బుట్ట: చూ, సజ్జ. 1; (2).=శిక్యమ్ ఉట్టి: చూ, శిక్యము. 1; (3) దారముతో నల్లిన సంచి: చూ, సంచి; (4) ఉచ్చు: చూ, వాగుర.

చిక్కసము. సం. వి. అ. న. 1. నలుఁగుఁబిండి. యవలపిండి (అని కొందఱు) (పుం, న. అని కొందఱు): చూ, సాదము. (1); 2. హారిద్ర: చూ, వర్ణము. 6. [పోఁక.

చిక్కా. సం. వి. ఆ. స్త్రీ. పోఁకపండు: చూ,

చిక్కినవాఁడు. దే. వి. శుష్కాంగుఁడు: చూ, బక్కవాఁడు.

చిక్కిపోవుట. అం. మన్మథావస్థలు పదింటిలో నొకటి: చూ, మన్మథావస్థలు.

చిక్కు. దే. వి. 1. కష్టము: చూ, శోకము; 2. సంకటము: చూ, శోకము; 3. మెలి: చూ, లంక; అ. క్రి. 4. కృశించు: చూ, సొటసొటపోవు; 5. దొరకు: చూ, లోఁబడు; 6. తక్కు: చూ, మిడిపోవు; 7. తగులు: చూ, లంకించు. 1; 8. మిగులు: చూ, శేషించు.

చిక్కుఁజేయు. దే. స. క్రి: చూ, వంచించు.

చిక్కుట. అం. దశావస్థలలో నొకటి (కార్శ్యము): చూ, దశావస్థలు.

చిక్కుడు. దే. వి క్షుద్రశింబి*: చూ. మట్టిక.

చిక్కుడుకుటుంబము. పా. "లెగూమినాసే" కుటుంబమునకుఁ జెందిన చిక్కుడు, రేల, తుమ్మ కుటుంబములలో నిదియొకటి. ఈ కుటుంబలక్షణములు.—(1) ఆకు.-త్రిభిన్న పత్రము (మిశ్రపత్రము); (2) రక్షకపత్రములు.-5; (3) పుష్పదళములు.-5; (4) కేసరములు.-10. స్వేచ్ఛగానైనను కలసియైనను ఉండును; (5) పండ్లు.- రక్షకపత్రములను విడువక యనేకాకారములు గలిగి యుండును. అవి రెండుబద్దలుగా చీలును. కనుక ద్వివిదారణ ఫలములనఁబడును. "లెగూమినాసే" చిక్కుడు కుటుంబములోనివి.-జీనప, మెంతి, నీలి, ఉలవ మొదలైన కాయధాన్యములు, కానుగ మొదలైనవి; రేల కుటుంబములోనివి.—తంగేడు, చింత మొ; తుమ్మ కుటుంబములోనివి.—తెల్లతుమ్మ, నల్లతుమ్మ, బండిగురిగింజ, దిరిసెన, సీమచింత మొదలైనవి. [చూ. బీగము.

చిక్కుతాళము. దే. వి. ఒకరకము బీగము:

చిక్కుపడు. ద్వ. అ. క్రి. 1. చిక్కగు: చూ, రూ-చిక్కువడు; 2. సంకటపడు: చూ. రూ-చిక్కువడు. [శోకము.

చిక్కుపాటు. ద్వ. వి. సంకటపాటు: చూ,

చిక్కులు. వా. వి. బ. 1. కష్టములు; 2. లంకెలు; 3 అల్లికలు.

చిక్కువడు. ద్వ. అ. క్రి. (చిక్కు + పడు): చూ, రూ-చిక్కుపడు. [యను.

చిక్కొట్టు. దే. స. క్రి. (చీ + కొట్టు) చీచీ

చిక్కోల. దే. వి. (చిక్కు + కోల): చూ, చిక్కంటు.

చిక్రోడము. సం. వి. అ. పుం: అలిందకి-రూ-అలిందకి, కాలకారము. (తె. ప.):—ఉడత-రూ-ఉడుత-ఉటుత.

చిగిరించు. దే. అ. క్రి: చూ, పల్లవించు.

చిగిరింత. దే. వి. అంటింతగడ్డి*: చూ తృణము. 1.

చిగిరింత యైశ్వర్యము. జా. చిగిలింతగడ్డి మిక్కిలి యేపుగానెదిగి అతిశీఘ్రముగా నెండిపోవును. దానివలె పెరిగి నశించు నైశ్వర్యములు. "ఈ చిగిరింత యైశ్వర్యమునకై యింత పొంగనేల."

చిగిలికాఁడు. దే. వి: చూ, సౌందర్యవంతుఁడు.

చిగురాకు. దే. వి. (చిగురు + ఆకు) రూ-చిగుటాకు: చూ, విద్రుమము.

చిగురాకుదిండి. దే.వి.(చిగురు + ఆకు + తిండి) కోకిలము: చూ, పికము.

చిగురాకువిలుకాఁడు. దే. వి.(చిగురు + ఆకు + విలుకాఁడు): చూ, మన్మథుఁడు. శశాం.3, ఆ. 20.

చిగురు. దే. వి. రూ-చివురు. 1. కిసలయము: చూ, విద్రుమము; 2. లేఁత. "చిగురుఁ గొమ్మ." (వాల్మీ పరమగుచో దీని కడపటి యుకారము వికల్పముగ లోపించెడి. "చిగుర్నగుమోవి"): చూ, సుకుమారము; 3. దంతములకుఁ జొట్టుకొనియుండెడి సూక్ష్మమాంసము: చూ, మాంసము. 1.

చిగురుఁగొమ్మ. దే. వి. (చిగురు + కొమ్మ) చిగిరించిన లేఁతకొమ్మ, పూచిన లేఁతకొమ్మ (అని కొందఱు): చూ, శాఖ.

చిగురుఁబోఁడి. దే. వి. (చిగురు + పోఁడి) 1. చిగురువలె మనోజ్ఞురాలగు ఆఁడుది: చూ, స్త్రీ; 2. ఆఁడుది: చూ, స్త్రీ. (రూ-చిగురుఁబోణి.)

చిగురుకొను. దే. అ. క్రి. చిగిరించు (కొను= పుట్టు): చూ, పల్లవించు.

చిగురుచు. దే. అ. క్రి. రూ-చిగుర్చు. 1.—పై.—; 2. ఎఱ్ఱనగు. శై. 4, ఆ. 101: చూ, పల్లటిల్లు.

చిగురుటల్లె. దే. వి: చూ, చిగురువిల్లు.
చిగురుటాకు. దే. వి: చూ, రూ-చిగురాకు.
చిగురువిలుకాఁడు. దే. వి: చూ, మన్మథుఁడు. (రూ-చిగురువిల్కాఁడు.)
చిగురువిల్లు. దే. వి. మన్మథుని మూఁడవదియగు విండియొక్క నారి. (దీని బాణములు.—నల్ల కలువ, అరఁటి, మొల్లపూలు: చూ, తుమ్మెద యల్లె): చూ, మౌర్వి. 1, (చూ,బాణము.1.)
చిగురొత్తు. దే. అ. క్రి. (చిగురు + ఒత్తు) 1: చూ, చిగురుచు; 2. అనురాగము గలది యగు: చూ, ప్రియపడు.
చిగుర్చు. దే. అ. క్రి: చూ, రూ-చిగురుచు.
చిచ్చులు. వై. విశ.=శుచి. (చిచ్చు + ఉలు) అగ్నిమయము. రూ- చిచ్చులు: చూ, వహ్ని. 1.
చిచ్చులకంటి. ద్వ. వి. (చిచ్చులు + కన్ను): చూ, శివుఁడు.
చిచ్చులకోల. ద్వ. వి. ఆగ్నేయాస్త్రము: చూ, బాణము. 1.
చిచ్చులపిడుగు. జా. దిట్టముగా బాధించునది. "కం. వచ్చెఁగద విటులపాలిటి, చిచ్చుల పిడుగింక నేమి సేయుదు ననుచున్." (నిరం కుశోపాఖ్యానము.)
చిచ్చి. దే. అవ్య. బిడ్డలకు జోలలుపాడునపుడు పీడా పరిహారార్థము చెప్పఁబడు మాట.రూ-చిచ్చీ: చూ, శబ్దము. 2.
చిచ్చికుఁడు. సం. వి. అ. పుం. 1. రూ-చికిత్స కుఁడు: చూ, వైద్యుఁడు; 2. నాట్యపరి భాషయందు పూజ్యుఁడు: చూ,మారిషుఁడు.
చిచ్చీ. దే. అవ్య: చూ, రూ-చిచ్చి
చిచ్చు. వై. వి. 1.=శుచిః. అగ్ని: చూ, వహ్ని. 1; 2.=శుచిః. చేతనాచేతనాగ్ని: చూ, వహ్ని. 1; 3. తాపము: చూ, సంతాపము.
చిచ్చుబుడ్లు. ద్వ. వి. బాణపుసంచు వగ (ప్రభావతీపరిణయము): చూ, బాణసంచు.
చిచ్చులు. వై. విశ. = శుచి (చిచ్చు + ఉలు): చూ, రూ-చిచ్చులు.
చిటకము. వై వి. =: చూ, రూ-చిట్టకము.
చిటచిట. దే. వి 1. కాఁగిననూనెయందు నీటి బొట్లు పడఁగాఁగలుగునట్టి ధ్వన్యనుకరణము: చూ, హూహూ; 2. నిడుఁగుఱులు చెదరుట లోనగువానియందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ; 3. పరితాపము: చూ, సంతాపము; 4. కోపము: చూ, రోషము.
చిటచిటమను. దే. అ. క్రి. (చిటచిటలు + అను) మండిపడు: చూ, మండు.
చిటచిటలాడు. దే అ. క్రి. (చిటచిటలు + ఆడు) —వై.— పా. 8, ఆ. 82.
చిటపాట. దే. వి. 1. ఈర్ష్యచేఁ గలిగెడు స్త్రీయొక్క కోపము: చూ, రోషము; 2. చినుకులు పడుటయందగు ధ్వన్యనుకరణము. కళా. 4, ఆ. 89: చూ, హూహూ; 3 ఆకులుతినుట కాయలురాలుట యందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.
చిటాలు. దే. వి. ధ్వన్యనుకరణము. అచ్చ. యు, కాం. 364: చూ, హూహూ.
చిటి. దే.విశ.రూ-చిట్టి. 1. చిన్న. "చిటిపాప": చూ, స్వల్పము; 2. సన్నము."చిటిచాఁప": చూ, సూక్ష్మము. 4.
చిటిక. వై. వి.=క్ష్వేడికా. త్రుటి. నడిమివ్రేలిని పెద్ద వ్రేలితోఁగూర్చి ధ్వనింపఁజేయుట, వ్రేల్పుడి: చూ, స్వరము. 2; 2. నడిమి వ్రేలిని పెద్దవ్రేలితోఁగూర్చి ధ్వనింపఁజేయు నంతకాలము, చిటికరింత: చూ, స్వరము. 2.
చిటికరించు. వై. అ. క్రి. చిటికవేయు: చిట్టి మిడుచు.
చిటికరింత. వై. వి=: చూ, రూ-చిటిక.

చిటికలాట. ద్వ. వి: చూ, బాలక్రీడ.

చిటికలో. జా. శీఘ్రముగా. "ఒక చిటికగదా ప్రియులయందుఁ జెలులఁగలకల్." (శ్రీనివాసవిలాసము.)

చిటికాఁడు. దే. వి. 1. పొట్టిగానుండుటచేత కుక్క కియ్యఁబడిన పేరు (ఇది చిటిలింగఁడు అనుదానికి పర్యాయము): చూ, పివఁగి. 2; విణ. 2. చిన్నవాఁడు: చూ, శిశువు.

చిటికినబొద్దులు దే. వి. బ: చూ, రూ-చిటికెనబొద్దులు.

చిటికె. వై. వి.=త్రుటి. చిటికెరింత: చూ, రూ-చిటిక.

చిటికెన. దే. వి: చూ, చిటికెనవ్రేలు.

చిటికెనబొద్దులు. దే. వి. బ. కాలి చిటికెన వ్రేళ్లయందుంచుకొనెడు భూషావిశేషము. రూ-చిటికినబొద్దులు: చూ, భూషణము. 2.

చిటికెనవ్రేలు. దే. వి. ఊర్మిక: చూ, వేలు. 2.

చిటిగాఁడు. దే. వి. గమళ్ళవాఁడు, ఈండ్రవాఁడు (అని కొందఱు): చూ, సురాజీవి.

చిటిగొట్టె. ద్వ.వి. చిన్నజాతిగొట్టె*: చూ, రేఁగు.

చిటితాళము. ద్వ. వి: చూ, రూ-చిరితాళము.

చిటిపొటి. దే. విణ. అల్పము, అత్యల్పము (అని కొందఱు). సా. 3, ఆ. 15: చూ, స్వల్పము.

చిటిబొద్దులు. దే. వి. బ: చూ, రూ-చిటికెనబొద్దులు. [చూ, ధాన్యము.

చిటిముత్తెములు. ద్వ. వి. బ. ఒకరకమువడ్లు:

చిటిలింగఁడు. ద్వ. వి. చిన్నలింగమువలె నుండుటచే కుక్క కియ్యఁబడిన పేరు: చూ, చిటికాఁడు.

చిటివ్రేలు. దే. వి: చూ, చిటికెనవ్రేలు.

చిటుకను. దే. అ. క్రి. 1. చిటుక్కని మ్రోఁగు. రూ-చిటుకురను-చిటుక్కను. స్వా. 4, ఆ. 17: చూ, శబ్దించు; వా. 2. పగిలిపోవు: రూ-చిటుకురను-చిటుక్కను.

చిటుకుపాటుకు. దే. వి. వానవెలిసినపిమ్మట చెట్టుమీఁదనుండి బొట్లుపడునపుడు కలుగు ధ్వన్యనుకరణము: చూ, హబాహబా.

చిటుకుపాటుకుమను. దే. అ. క్రి. (చిటుకుపాటుకు + అను) పలుకు. "వాఁడు చిటుకుపాటుకుమనక ఉన్నాఁడు.": చూ, వచించు.

చిటుకురను. ద్వ. అ. క్రి. (చిటుకు + అను): చూ, చిటుకను. [—వై.—

చిటుక్కను. ద్వ. అ. క్రి. (చిటుక్కు + అను)

చిటులు. దే.అ క్రి. రూ-చిట్లు. 1. పగుళ్లువాఱు: చూ, భేదిల్లు. 2; 2. మిక్కిలికోపించు: చూ, రోషించు.

చిట్ట. వై. వి. 1. = చిత్రమ్. ఆశ్చర్యము: చూ, వింత. 1.(దేశ్యమని శబ్దరత్నాకరము); దే.వి. 2. చిన్నపాద. స్వా. 4, ఆ. 37; వసు. 1, ఆ. 113: చూ, పాద. 2; వై. విణ. 3.=స్పష్టమ్. వెల్లడియైనది: చూ, స్పష్టము; దే.విణ. 4 కల్పితము, రచియింపఁబడినది: చూ, విరచితము.

చిట్టంటుచేఁతలు. దే. వి. బ. (చిట్టి + అంటు + చేఁతలు): చూ, విలాసము. 2.

చిట్టంటులు. దే. వి. బ. (చిట్టి + అంటులు) నఖదంతక్షతాది: చూ, నఖక్షతము.

చిట్టకము. వై. వి.=చిత్రక. రూ-చిటకము-చీటకము. 1. శృంగార చేష్ట: చూ, విలాసము. 2; 2. క్రీడ: చూ, విలాసము. 1; 3. కపటము: చూ, వ్యాజము. 1.

చిట్టచివర. దే. విణ. (చివర + చివర) 1. అన్నిటికి చివర: చూ, సుద. 3; వా. 2: చూ, ఎట్టయెదురు. 2.

చిట్టడవి. ద్వ. వి. కాఱడవి: చూ, విపినము.

చిట్టడుగు కత్తెర. ద్వ. వి. మల్లయుద్ధములోని పరువళ్లు పండ్రెండింటిలో నొకటి: చూ పరువళ్లు. (గతిభేదము అనియు)

చిట్టతుమికి. దే. వి. రావణ*: చూ, తుమికి.

చిట్టమికుచు. దే. అ. క్రి: చూ, చిటికరించు.

చిట్టము. దే. వి. రూ-చిట్టియము- చిట్టెము: ఇనుము కాచునప్పుడు వచ్చెడు ముఱికి, శింఘాణము: చూ, లోహము. 1.

చిట్టా. వా. వి. రోజువారి లెక్క, రూ-చితా: చూ, పద్దు. 3.

చిట్టాడు. దే. అ. క్రి. (చిట్టి+ఆడు) 1. చలించు. సా. 3, అ. 15: చూ, చలించు; 2. చరించు: చూ, సంచరించు; 3. ప్రసరించు: చూ, వ్యాపించు; 4: చూ, తప్పటడుగులిడు. సా. 3, అ. 246; 5. క్రీడించు: చూ, చెరలాడు.

చిట్టాముట్టి. ద్వ. వి. చిన్నముత్తవపులగము, బల*: చూ, సహదేవ. (వీర్యవృద్ధి మేహశాంతి చేయును.)

చిట్టాముదపుఁజెట్టు. ద్వ. వి. —పై—

చిట్టాముదము. ద్వ. వి. (చిట్టి+ఆముదము) 1. చిట్టాముదాలనూనె: చూ, తైలము; బ, 2. చిట్టాముదపు విత్తులు. (చిట్టాముదాలు అనియు వాడుక.)

చిట్టి. దే. వి. 1. రూ-చిట్టియ-చిట్టె, గిద్ద-రూ-గిద్దె: చూ, ప్రస్థము. 3; విశ. రూ-చిటి. 2. చిన్న. ("చిట్టడవి-చిట్టాన- చిట్టీఁదు-చిట్టుడుకు- చిట్టెండ-చిట్టేలకి" ఇత్యాదులందుఁ బూర్వమునందుండునది): చూ, స్వల్పము; 3. సన్నము: చూ, సూక్ష్మము. 4.

చిట్టియ. దే. వి. రూ-చిట్టె. 1. వస్త్రములయంచులయందు నేసెడు చిన్నకమ్మి: చూ, మైటాలు; 2. వెదురుగనుపు: చూ, బుడిపి.

చిట్టియము. దే. వి: చూ, రూ- చిట్టము.

చిట్టివ్రేలు. దే. వి: చూ, రూ-చిటికెనవ్రేలు.

చిట్టీఁత. దే. వి. (చిట్టి+ఈఁత) ఖర్జూరి*: చూ, మధుఖర్జూరిక.

చిట్టీఁదు. దే. వి. (చిట్టి+ఈఁదు)—పై—

చిట్టీడ. దే. వి. (చిట్టి+ఈడ) క్షుద్రరక్తనాగరంగము*: చూ, శక్కరాంకము.

చిట్టు. దే. వి. దూగరకలిసినసన్ననూక: చూ, నూక.

చిట్టుడుకునీళ్లు. ద్వ. వి. బ. (చిట్టి+ఉడుకు నీళ్లు) పొంగునీళ్లు: చూ, వారుపుడు.

చిట్టుములు. దే. వి. బ. (చిట్టి+ఉములు) గర్భిణికి గలిగెడి యొకానొక లక్షణము: చూ, లక్షణము. 1.

చిట్టె. దే. వి. 1: చూ, రూ- చిట్టియ. 1; 2: చూ, రూ- చిట్టియ. 2; 3. చిత్రపటము: చూ, బింబము. 3; 4. ఉభయార్థసాధకమైన ఉపాయము, తంతు: చూ, తంత్రము.

చిట్టెము. దే. వి: చూ, రూ-చిట్టము

చిట్టెలుక. దే. వి. (చిట్టి+ఎలుక) గిరిక: చూ, మూషికము. [చూ, పత్రిల.

చిట్టేలకి. ద్వ. వి. (చిట్టి+ఏలకి) సన్నయేలకి*:

చిట్టిపొట్లకాయ. దే. వి: రూ- చిట్లపొట్లకాయ: చూ, బాలక్రీడ.

చిట్లకట్టియ. వై. వి. = కర. రూ-చిట్లుకట్టియ- చిట్లుకట్టె-చెట్లకట్టె, మిగులకోపి: చూ, రోషణుఁడు. [కాయ.

చిట్లపొట్లకాయ. దే. వి: చూ, రూ-చిట్టిపొట్ల

చిట్లు. దే. వి. 1. వృత్తాంతము: చూ, సమాచారము. 2; అ. క్రి. 2: చూ, రూ- చిటులు. 1; 3: చూ, రూ, చిటులు. 2.

చిట్లుకట్టియ. ద్వ. విశ: చూ, రూ-చిట్లుకట్టియ. (వైకృతమనికొందఱు.)

చిట్లుకట్టె. ద్వ. విశ. —పై—

చితా. వా. వి: చూ, రూ- చిట్టా.

చిడిపి. దే. విశ. 1. అల్పము: చూ, స్వల్పము; 2: చూ, పరుషము.

చిడిముడి. దే. వి. 1. కోపము: చూ, రోషము; 2. తొట్రు: చూ, సంభ్రమము. 1.

చిడిముడిపడు. ద్వ. అ. క్రి. తొట్రుపడు: చూ, సంభ్రమించు. [భ్రమము. 1.

చిడిముడిపాటు. ద్వ. వి తొట్రు: చూ, సం

చిదుగు. దే. విశే. అల్పము: చూ, స్వల్పము

చిదుగుడు. దే. వి. రూ-చెదుగుడు. చూ, బాలక్రీడ.

చిదుము. దే. వి. తీటకుఱుపు: చూ, విదర్చిక.

చిణి. అం. ప్రణవనాదములు పదింటిలో నొకటి: చూ, ప్రణవనాదములు.

చిణిచిణి. అం. —వై.—

చిత్. సం. అవ్య. కొంతయను నర్థమందు వర్తించును: చూ, చన.

చిత సం. వి. ఆ. స్త్రీ. 1.=సౌద. రూ-చితి-చిత్య: చూ, శ్మశానము; 2. ప్రోగు, గుంపు: చూ, సమూహము; 3: చూ, పొయ్యి; 4. చిదక: చూ, సరళదేవదారు; విశే. 5. కప్పఁబడినది: చూ, స్థగితము; 6. చేర్పఁబడినది: చూ, ఘటనము.

చితము. సం. విశే. వ్యాపించినది, వ్యాప్తము: చూ, ఖండితము.

చితి. సం. వి. ఇ. స్త్రీ. 1. సౌద: చూ, చిత. 1; 2. ప్రోగు, గుంపు: చూ, చిత. 2.

చితుకు. దే. వి. 1. రూ-చిదుగు. వేలిమికట్టె: చూ, సమిధ; అ. క్రి. 2. కుఱుపులోనగు నవి నలఁగు: చూ, పదమదమగు.

చిత్కృతము. సం. వి. అ. న. ఆవుదూడఅఱుపు: చూ, స్వరము. 2.

చిత్త. వై. వి. = చిత్రా. 1. చిత్తానక్షత్రము, ముత్తెపుసరము: చూ, నక్షత్రము. 1; 2 చిత్తకార్తె: చూ, నక్షత్రము. 1; అం. 3. నక్షత్రము లిరువదేడింటిలో నొకటి: చూ, నక్షత్రము. 1.

చిత్తగించు. వై. అ. క్రి.=చిత్త. 1: చూ, మనస్కరించు; స. క్రి. 2.=చిత్త. తలఁచు: చూ, యోచించు.

చిత్తచాంచల్యకాలము. అం. శిశుకాలములు పండ్రెండింటిలో నొకటి: చూ, శిశుకాలములు

చిత్తడి. ద్వ వి. (చిత్త + తడి) 1. మిక్కిలితడి: చూ, పదను. 2; 2. రూ-చిత్తతి. వర్షము, (జడి, జల్లు, తొలకరి, దల్లు, ముసురు, వాన, సోన): చూ, వాన. 1; 3. వర్షఋతువు (శ్రావణ భాద్రపదమాసములు): చూ, మాసద్వయము (ఋ, ఋతువులు.) [తోషము.

చిత్తప్రసన్నత. సం. వి. ఆ. స్త్రీ: చూ, సం

చిత్తభ్రమనొందుట అం. మన్మథావస్థలు పదింటిలో నొకటి: చూ, మన్మథావస్థలు.

చిత్తము. సం. వి. అ న. 1.మనస్సు, మానసము, మది: చూ, హృదయము. 2; అం. 2. అంతఃకరణములు నాలుగింటిలో నొకటి: చూ, అంతఃకరణములు; 3. వికారములు పదునాఱింటిలో నొకటి: చూ, వికారములు; వా. 4. దయ; 5. కటాక్షము; 6. గౌరవార్థమైన ప్రత్యుత్తరము.

చిత్తర. దే. వి. చిత్తర అను చేఁప: చూ, మత్స్యము 1.

చిత్తరువు. వై. వి.=చిత్రమ్. 1. ఆశ్చర్యము. కళా. 5, ఆ. 111: చూ, వింత. 1; 2. పటమునందు రూపము వ్రాయుట: చూ, వ్రాఁత; 3. పటమునందు వ్రాసినరూపము, బొమ్మ: చూ, బింబము. 3. (వ్యుత్పత్తియందుఁ గడపటి వర్ణము వికల్పముగా లోపించును. "చిత్తరు బొమ్మ" ఇం.)

చిత్తరువులు వ్రాయునది. అం. దూతీచతుష్టయమునందలి మూఁడవద్దానిలోని పదునార్గురిలో నొకతె: చూ, దూతీచతుష్టయము.

చిత్తతి. ద్వి.వి.(చిత్త+తతి): చూ, చిత్తడి. 8.

చిత్తవిప్లవము. సం. వి. అ. పుం. చిత్తభ్రాంతి: చూ, వెఱ్ఱి. 1.

చిత్తవిభ్రమము. సం. వి. అ. పుం. —పై.—

చిత్తాభోగము. సం. వి. అ. పుం: చూ, మనస్కారము.

చిత్తిక. సం. వి అ. స్త్రీ. నడుమునకుఁ గట్టు గొలుసు: చూ, మొలత్రాడు.

చిత్తిని. వై. వి.=చిత్రిణి. 1. చిత్రిణీజాతిస్త్రీ: చూ, స్త్రీ; అం. 2 స్త్రీజాతులు నాలుగింటిలో నొకటి: చూ, స్త్రీజాతులు

చిత్తు. సం. వి. త్. స్త్రీ. 1. జ్ఞానము. (చిత్): చూ, బుద్ధి; వా.వి. (1) (దిద్ది చెక్కు పఱుపని) సాపువ్రాయుటకు మొదట వ్రాసినవ్రాఁత (లేక) ముసాయిదా, అసలుకు సరియైన నకలు (అని కొందఱు): చూ. వ్రాఁత; (2) మొదట గుణించుకొను లెక్క, మనస్సునందు గుణించుకొను లెక్క (లేక) నోటిలెక్క (అని కొందఱు). (ఇది సం. అని కొందఱు.)

చిత్తోక్తి. సం. వి. ఇ. స్త్రీ. ఉపశ్రుతి, పువ్వుశకటి: చూ, వినికిడి.

చిత్తోన్నతి. సం. వి. ఇ. స్త్రీ. గర్వము: చూ, అహంకారము.

చిత్య. సం. వి. అ. స్త్రీ. సాద: చూ, చిత.1

చిత్యము. సం వి. అ. న. 1. గోరీ, కాష్ఠము: చూ, శ్మశానము; పుం. 2. అగ్ని: చూ. వహ్ని. 1.

చిత్ర. సం. వి. అ. స్త్రీ. 1.=చిత్త. చిత్తా నక్షత్రము: చూ, నక్షత్రము. 1; 2. మాయ: చూ, మాయము. 1; 3. రూ-ఉపచిత్ర. ఎలుకజీడి *: చూ, భల్లాతకి; 4. గుమ్మడి*. చూ, మహాఫలము; 5. పిన్నపాఁపర*: చూ: పాఁపర; 6: చూ, బుద్ధము *; 7. ఒకానొక అప్సరస: చూ, స్త్రీ; 8. ఒకానొక పాము: చూ, సర్పము; 9: చూ, దంతి *; 10. అముదము *: చూ, వ్యడంబకము; 11. చేతరాసి *; చూ, శకుల; అం. 12. గాంధారగ్రామగతమూర్ఛనలు ఏడింటిలో నొకటి: చూ, గాంధార గ్రామగత మూర్ఛనలు; 13. నిహీనతానములు ఏడింటిలో నొకటి: చూ. నిహీనతానములు(చూ,శుద్ధతానములు.)

చిత్రకంఠము. సం. వి. అ. పుం. కపోతము, గువ్వ: చూ. పావురము.

చిత్రకపత్రిక. సం.వి. అ. స్త్రీ: చూ, దంతి*.

చిత్రకము. సం. వి అ. న. 1. నొసటిబొట్టు, విశేషకము: చూ, బొట్టు.1; పుం. 2. చిఱుతపులి, పెద్దపులి (అని కొందఱు): చూ, శార్దూలము. 1; 3. ఆముదము *: చూ, వ్యడంబకము; 4. గుమ్మడి *: చూ, మహాఫలము; 5. చిత్రమూలము *: చూ. వహ్నిసంజ్ఞకము; 6. జామి *: చూ, జామి; 7. అశోకము*: చూ, హేమపుష్పము; అం. 8. ప్రచారములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, ప్రచారములు.

చిత్రకరుఁడు. సం. వి. అ. పుం: చూ, ముచ్చి.

చిత్రకవిత్వము. పా. చిత్రకవిత్వమనఁగా.— తలకట్లు, ఏకాక్షరములు, అనుప్రాసములు, యమకములు, అంత్యనియమములు మొదలైన పద్ధతులతో రచించుట: చూ, మాటలల్లుట. [చూ, మార్గములు.

చిత్రకాదిమార్గము. అం. మార్గములలో నొకటి:

చిత్రకాదిభస్మము. అం. భస్మములలో నొకటి: చూ, భస్మములు.

చిత్రకాయము సం. వి. అ. పుం. చిఱుతపులి: చూ, శార్దూలము. [కరుఁడు.

చిత్రకారుఁడు. సం. వి. అ. పుం: చూ, చిత్ర

చిత్రకుఁడు. సం. వి. అ. పుం. —పై.—

చిత్రకూటము. సం. వి. అ. పుం. చిత్రకూట మను కొండ: చూ, పర్వతము.

చిత్రకృత్తు. సం. వి. త్. పుం. 1: చూ, తినాసము*; 2: చూ, చిత్రకరుఁడు.

చిత్రకేతువు. సం. వి. ఉ. పుం. చూ, జాంబి*.

చిత్రగవి. సం. వి. ఈ. స్త్రీ. నానావర్ణములు గల ఆవు: చూ, ధేనువు.

చిత్రగుప్తుఁడు. సం. వి. అ.పుం. 1. జముఁడు: చూ, యముఁడు; 2. యమునివద్ద లెక్కవ్రాయు వాఁడు: చూ, యముఁడు.

చిత్రచరణము. సం. వి. అ. పుం: చూ, చిత్రమూలము*.

చిత్రతండుల. సం. వి. ఆ. స్త్రీ: చూ, వాయువిడంగము*.

చిత్రతండులము. సం. వి. అ. పుం —పై.—

చిత్రతమము. అం. తాళమార్గము లాఱింటిలో నొకటి (ఇదె మార్గపాత్రిణము): చూ, తాళమార్గములు.

చిత్రతరము. అం. —పై.—

చిత్రదండము. సం. వి. అ. పుం. కంద*: చూ, సూరణము.

చిత్రనేత్రి. సం వి. ఆ. స్త్రీ. గోరువంక: చూ, శారిక.

చిత్రపక్షము. సం. వి. అ. పుం. 1. కవుఁజు: చూ, కౌఁజు; 2. నెమలి: చూ, మయూరము.

చిత్రపటన్యాయము. పా. ముందు రేఖలు వైచి పిదప బొమ్మను తయారుచేయు విధము.

చిత్రపత్రము. సం. వి అ. పుం. తిలకము*: చూ, బొట్టు. 1.

చిత్రపత్రిక. సం. వి.ఆ. స్త్రీ. 1. కోలపాల*. చూ, శృంగబేరి; 2: చూ, దంతి*.

చిత్రపదము. పా. ఒకానొకవృత్తము. ఇది ఒక్కొక్క పాదమునకు రెండుభగణములును రెండుగురువులును గలిగి ఎనిమిదవఛందస్సునందుఁబుట్టినవృత్తము. ఉదా.—"చిత్రపదంబను వృత్తం, బత్రిమునిస్తుతుశౌరిన్, స్తోత్రముచేయఁగనొప్పున్, ధాత్రినిభాగగయుక్తిన్": చూ, వృత్తము. 1.

చిత్రపద్ధతి. అం: చూ, ఉద్ధతము. 2. (చూ, వ్యంజకము. 1.)

చిత్రపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. 1. కోలపొన్న*: చూ, పృశ్నిపర్ణి; 2: చూ, బొల్లిబూసర*; 3: చూ, మంజిష్ఠి*.

చిత్రపాద. సం. వి. ఆ. స్త్రీ. గోరువంక: చూ, శారిక.

చిత్రపింగలము. సం. వి. అ. పుం. నెమలి: చూ, మయూరము.

చిత్రపింఛకము. సం. వి. అ. పుం. —పై—.

చిత్రపుంఖము. సం వి అ. పుం. అమ్ము: చూ, బాణము 1.

చిత్రపృష్ఠము. సం వి. అ. పుం: చూ, పిచ్చుక.

చిత్రఫలకము. సం. వి. అ. పుం. ఫలకి, నడగడ్డిలోని చేఁప: చూ, మత్స్యము. 1.

చిత్రఫలము. సం. వి. అ పుం. —పై—

చిత్రఫలి. సం. వి. న్. పుం. —పై—. (ఈ. స్త్రీ. అని కొందఱు.)

చిత్రబంధములు. అం. సంఘాటము, ఉపపదము (2): (చూ. బంధములు.)

చిత్రబింబము. సం.వి.అ.పుం. ఊసరవెల్లి: చూ, సరటము.

చిత్రభాను. సం.వి.ఉ.పుం. సంవత్సరములు అఱువదింటిలో నొకటి: చూ, సంవత్సరములు.

చిత్రభానువు. సం. వి. ఉ.పుం. 1. అగ్ని: చూ, వహ్ని. 1; 2: చూ, సూర్యుఁడు.

చిత్రమీమాంస. అం. ఇది అప్పయదీక్షిత విరచిత గ్రంథము: చూ, కావ్యనాటకములు.

చిత్రము. సం. వి. అ.న. 1.=చిట్టు, ఆశ్చర్యము, అద్భుతరసము. నవరసములలో నొకటి: చూ, రసములు. (చూ, వింత. 1.).

2. = చిత్తరువు. వ్రాసిన బొమ్మ: చూ, బింబము. 3; 3. నానావర్ణములు గలసిన వన్నె: చూ, వర్ణము. 6; 4. తిలకము: చూ, బొట్టు. 1; పుం. 5: చూ, చిత్రమూలము*; 6. పాము: చూ, సర్పము; విణ. 7. ఆశ్చర్యకరమైనది: చూ, వింత 1; 8. నానావర్ణములు గలది: చూ, వర్ణము. 6; అం. 9. తాళమార్గములాఱింటిలో నొకటి. చూ, తాళమార్గములు. (ఇదే మార్గప్రాణము); 10. అర్థాలంకారములు నూఱింటిలో నొకటి (ప్రయత్నము విపరీత ఫలకాంక్ష యగుట) "మార్జనముల లోఁబడి సజ్జనులు నమ్రులౌదురు.": చూ, అలంకారము. 3.

చిత్రమూలత్రయము. అం. ఇవి. 3.—తెలుపు, నలుపు, ఎఱుపు: చూ, త్రయము.

చిత్రమూలము. సం. వి. అ. పుం. అగ్నిమాత*: చూ, వహ్ని సంజ్ఞకము. (జఠరాగ్నిని వృద్ధిఁ జేయును.)

చిత్రమేఖల. సం. వి. ఆ. స్త్రీ. ఎనిమిది పేటలు గల మొలనూలు: చూ, భూషణము. 2.

చిత్రమేఖలము. సం. వి. అ. పుం. నెమలి: చూ, మయూరము.

చిత్రయోని. సం. వి. ఇ. పుం. లావుకపిట్ట: చూ, లావుక.

చిత్రరథ. సం. వి. ఆ. స్త్రీ. చిత్రరథ యను నది: చూ, నది.

చిత్రరథుఁడు. సం. వి. అ. పుం. 1. చిత్రరథుఁడను గంధర్వుఁడు: చూ, వేలుపు; 2. ఒకానొక విద్యాధరుఁడు: చూ, వేలుపు; 3: చూ, సూర్యుఁడు.

చిత్రరేఖ. సం. వి. ఆ. స్త్రీ. 1. కుబేరుని పెండ్లాము: చూ, భార్య; అం. 2. దిక్పాలభార్యలలో నొకతె: చూ, దిక్పాలభార్యలు.

చిత్రలక్ష్యభేదనోపాయ ప్రతిపాదనము. అం. ధనుర్విద్యాప్రమేయములు నలుబదాఱింటిలో నొకటి: చూ, ధనుర్విద్యాప్రమేయములు.

చిత్రలత. సం వి. ఆ. స్త్రీ: చూ, మంజిటి*.

చిత్రలోచన సం వి. ఆ. స్త్రీ: చూ, శారిక.

చిత్రవతి. అం. గాంధారగ్రామగత మూర్ఛనలు ఏడింటిలో నొకటి: చూ, గాంధారగ్రామగత మూర్ఛనలు.

చిత్రవదాలము. సం. వి. అ. న. పాఠీనమను చేఁప: చూ, మత్స్యము. 1.

చిత్రవర్ణము. సం. వి. అ. పుం, న. 1. పులుగంగులు: చూ, వర్ణము. 6; అం. 2. వర్ణములు మూఁడింటిలో నొకటి: చూ, వర్ణములు

చిత్రవర్ణములు. అం. పంచకల్యాణము. అష్టమంగళము, శ్యామకర్ణము, చతుర్భద్రము, దివావైజయికము, నిశావైజయికము, రక్తాగ్రకర్ణి, శ్వేతబాహువు, త్రిభద్రము, శ్వేతఖురి, హారితదక్షిణపాది, ఊర్ధ్వానేకరేఖప్రోథి, త్రిరేఖప్రోథి. దీర్ఘైకరేఖావిశిష్టత్రిరేఖప్రోథి. ఓంకారరేఖాప్రోథి, వామహనురేఖ, వాలవామభాగరేఖ, దక్షిణాగ్రశ్వేతి, వామకర్ణాగ్రశ్వేతి, జానుశ్వేతి, అండశ్వేతి, మేఢ్రశ్వేతి, కంఠశ్వేతి, కక్షశ్వేతి, నాభిశ్వేతి, వక్షశ్వేతి, మార్జాలవర్ణి, సారంగవర్ణి, హారితాగ్రకర్ణి, నీలాగ్రకర్ణి. (30.)

చిత్రవల్లికము. సం. వి. అ. పుం. వదాలమను చేఁప: చూ, మత్స్యము. 1.

చిత్రవాలము. సం. వి. అ. పుం: చూ, పాలపిట్ట.

చిత్రశిఖండిజుఁడు. సం. వి. అ. పుం. బృహస్పతి: చూ, వేలుపుటొజ్జ.

చిత్రశిఖండులు. అం. మరీచ్యాది సప్తమహర్షులు (మరీచి, అత్రి, అంగిరుఁడు, పులస్త్యుఁడు, పులహువు, క్రతువు, వసిష్ఠుఁడు.)

చిత్రసారము. సం. వి. అ. పుం. బిల్ల *: చూ, సోధ్రకము [నది: చూ, నది.
చిత్రసేన. సం. వి. ఆ. స్త్రీ. చిత్రసేన యను
చిత్రసేనుఁడు. సం. వి. అ. పుం. ఒకానొక గంధర్వుఁడు: చూ, వేలుపు.
చిత్రాంగదసువు. సం. వి. ఊ. స్త్రీ. శంతనుని భార్య: చూ భార్య.
చిత్రాంగము. సం. వి. అ. న. 1. అరిదళము: చూ, హారిదళము; 2. ఎఱ్ఱచిత్రమూలము *: చూ, వహ్నిసంజ్ఞకము.
చిత్రాక్షి. సం. వి. ఈ. స్త్రీ. 1. గోరింక: చూ, శారిక; 2. ఒకరకము సర్పాక్షి *: చూ, సర్పాక్షి.
చిత్రాక్షుపము. సం. వి. అ. పుం ఏనుఁగు తుమ్మ*: చూ, తుమికి.
చిత్రాటీరుఁడు. సం.వి. అ.పుం.1. చందురుఁడు: చూ, హిమాంశువు; 2. ఘంటాకర్ణునకు బలి యీయఁబడిన మేఁక నెత్తురుగల నొసలుగల వాఁడు. [వర్ణము.
చిత్రాపూపము. సం. వి. అ. పుం: చూ, చరు
చిత్రించు. సం. స. క్రి చిత్రము వ్రాయు: చూ, వ్రాయు.
చిత్రిక. దే. వి. మ్రాను నునుపు పఱచెడు వడ్ల వాని కొఱముట్టు: చూ, త్రోపుడు. 2.
చిత్రికము. సం. వి. అ. పుం. చైత్రమాసము: చూ, మాసము. 1.
చిత్రిణి. సం. వి. ఈ. స్త్రీ. = చిత్తిని. 1: చూ, చిత్తిని: చూ, స్త్రీ; 2 చిత్తానక్షత్రము: చూ, నక్షత్రము. 1. [బడినది.
చిత్రితము. సం. విణ. = చిత్తరువు. చిత్రింపఁ
చిత్రితాంగజంబుక న్యాయము. పా. పులినిఁ జూచి నక్క వాఁత పెట్టుకొనినది అనువిధము.
చిత్రితాకరి. సం. వి. ఈ. స్త్రీ. జేమునిపాలు: చూ, దేశము.

చిత్రోకుఁడు. సం. వి. అ. పుం. చందురుఁడు: చూ, హిమాంశువు.
చిత్రోక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఆకాశవాణి: చూ, స్వరము. 2; 2. ఉపశ్రుతి: చూ, వినికిడి
చిత్రోత్తరము. సం. వి. అ. న. అర్థాలంకారములలో నొకటి: చూ, హేతువు. 2.
చిత్రావధము. సం. వి అ.పుం: చూ, బొమ్మమేడి*.
చిద. సం. వి ఆ. స్త్రీ: చూ, రూ-చిత.
చిదక. దే. విణ. చెప్పట. "చిదకముక్కు-.": చూ, తప్పట. [వాఁడు.
చిదకముక్కు-వాఁడు. దే.విణ: చూ, నడ్డిముక్కు-
చిదగొద దే. వి. 1. భేదము: చూ, వ్యత్యయము; 2. కలహము: చూ, యుద్ధము.
చిదిమి పెట్టిన బంటులు. జా. నిగ్గుదేలినశూరులు. "ఉ. అ, భీలతరాశనుల్ చిదిమిపెట్టిన బంటులు." విజ. 1, ఆ. 76. [దమగు.
చిదియు. దే. అ. క్రి. నలఁగు: చూ, నదమ
చిదుకు. దే. అ. క్రి: చూ, చిప్పిలు.
చిదుగు. దే వి: చూ, రూ- చితుకు. 1.
చిదుపు. దే. ప్రే. చిదియఁజేయు.
చిదుము. దే. వి. 1. చిగురు: చూ, విద్రుమము; స. క్రి 2. ఖండించు, తుత్రచేయు (అని కొందఱు): చూ, సెలగు; 3. నఖక్షతము చేయు: చూ, గిల్లు. 2; 4. పువ్వులులోనగు వానిఁ గోయు: చూ, తెంచు; 5. తుంచు; చూ, భేదిల్లు. 1; 6. వైచు: చూ, విసరు. 8.
చిదుముట. దే. వి. హింస. అం, భా. ద్వి. 221: చూ, వధము.
చిదుర. వై. వి.=ఛిద్ర. 1. తునక: చూ, శకలము. 4; విణ. 2. లేశము: చూ, స్వల్పము.
చిదురలు. వై. వి. బ.=ఛిద్ర-ఛిదుర. రూ-చిదురుపలు-చిదుర్పలు-చిద్రపలు 1. నూక్కు

ఖండములు: చూ, శకలము. 4; 2. సూక్ష్మ భాగములు: చూ, శకలము. 4. (దేశ్యమని శబ్దరత్నాకరము.)

చిదురుపలు. వై. వి. బ.= —పై.—

చిదుగ్పలు. వై. వి. బ.= —పై.—

చిదుప్రలు. వై. వి. బ.= —పై.—

చిదూప్రుఁడు సం. విణ. పాశుపతమతస్థుఁడు: చూ, స్మార్తిమంతుఁడు.

చిన. వై. విణ.= ఛిన్న. 1. కొద్ది: చూ, స్వల్పము; 2. కనిష్ఠము: చూ, స్వల్పము. (దేశ్యమని శబ్దరత్నాకరము.)

చిని. వై. విణ.=ఛిన్న. 1. రూ-చిన్ని. కొద్ది: చూ, స్వల్పము; 2 కనిష్ఠము: చూ, స్వల్పము. (దేశ్యమని శబ్దరత్నాకరము); దే. వి. 3. రూ-చిన్ని. మనోజ్ఞము: చూ, హృద్యము.

చినుఁగు. వై. అ. క్రి.=భిద్రి. రూ-చిరుగు. వస్త్రాదికము ఛిన్నమగు. పాండు. 5, ఆ. 140; వేమన. 1401: చూ, భేదిల్లు. 2. (దేశ్యమని శబ్దరత్నాకరము.)

చినుకు. దే. వి. 1. వర్షబిందువు రూ-చిన్కు: చూ, వాన. 1; 2. అల్పవర్షము. రూ-చిన్కు: చూ, వాన. 1; దే. అ. క్రి. 3. కాఱు: చూ, స్రవించు; అం. పే్రి. 4. కాఱుచు. వానకుఱియు (అని కొందఱు) స్వా. 5, ఆ. 18: చూ, కార్చు. 2.

చినుకుఁబూస. దే. వి. (చినుకు + పూస) ముత్యము: చూ, రత్నము.1. (చూ, ముత్తెము.)

చిన్న. వై. విణ.=ఛిన్న. 1. కొద్ది: చూ, స్వల్పము; 2. కనిష్ఠము: చూ, స్వల్పము. (దేశ్యమని శబ్దరత్నాకరము); దే. విణ. 3. చిహ్నము. అం, ప. సుర. 24: చూ, లక్షణము. 1; 4. బాలుఁడు అం, భా. ద్వి. 118: చూ, శిశువు; 5 తమ్ముఁడు: చూ. సహోదరుఁడు; 6. చిన్నచెల్లెలు: చూ, సహోదరి.

చిన్నఅప్ప. దే. వి. అప్పలలో చిన్నది. చూ, సహోదరి. (వా. చిన్నప్ప. )

చిన్నకాఱు. దే. వి. అలరుపాయము: చూ, శైశవము.

చిన్నచెల్లెలు దే. వి: చూ, చిన్న. 6.

చిన్నటనాఁడు. దే. వి. (చిన్న + నాఁడు) చిన్నతనము: చూ, శైశవము.

చిన్నతనము దే వి. —వై.—

చిన్నది దే. వి. (చిన్న + అది) 1. బాలిక. వేమన. 1395: చూ, స్త్రీ; విణ. 2. చిన్నయైనది: చూ, సైకము.

చిన్ననాఁడు. దే. వి: చూ, చిన్నటనాఁడు, వేమన. 1396. [చూ, పాఁపర.

చిన్నపాఁపర. దే. వి. గోతుంబి, పిన్నపాఁపర*:

చిన్నపామునైనఁ బెద్దకఱ్ఱతోఁగొట్టవలెను. లో. ఉదా.— “చిన్నపామునైనఁ బెద్దకఱ్ఱతోనే కొట్టవలయును. కాఁబట్టి సర్వసైన్య సమేతముగా నడచి యాకస్మికముగంబోయి.” (నీతిచంద్రిక-విగ్రహము.)

చిన్నఁబోవు. దే. అ. క్రి. రూ-చిన్నవోవు. ఖిన్నుఁడగు అం. భా. తృ. 95: చూ, విన్నవోవు.

చిన్నఁబోవుట. జా. దైన్యమును బొందుట. ఉత్సాహము తగ్గుట, తగ్గుస్థితికి వచ్చుట. “పొన్నవిరి నిక్కముగఁజూచి చిన్నవోదు.” (ప్రభావతీప్రద్యుమ్నము.)

చిన్నము. దే. వి. 1. నాలుగు గురిగింజల యెత్తు. కళా. 4, ఆ. 128; 2. నాలుగు గురిగింజల యెత్తుగల బంగారునాణెము. హరిశ్చ. 3, ఆ. 157: చూ, లోహము. 1.

చిన్నారి. విణ. మనోజ్ఞము. రూ-చిన్నారి- (మరిచి, అతిం చిన్నారిపొన్నారి- పొన్నరి- పులహువు, క హృద్యము.

చిన్నరికము. దే. వి. రూ-చిన్నటికము: చూ, శైశవము.

చిన్నరిపొన్నరి. దే. విశ: చూ, రూ-చిన్నరి.

చిన్నటికము. దే. వి: చూ, రూ-చిన్నరికము.

చిన్నవాఁడు. దే. వి. 1. బాలుఁడు: చూ, శిశువు; విశ. 2. చిన్నయైనవాఁడు: చూ, బుచ్చిగాఁడు.

చిన్నవోవు. దే. అ. క్రి. (చిన్న + పోవు) 1. ఖిన్నుఁడగు: చూ. రూ-చిన్నఁబోవు; చేౕ. 2. చిన్నవుచ్చు.

చిన్నారి. దే. విశ: చూ, రూ-చిన్నరి. "చిన్నారి చిగురు- చిన్నారిజాబిల్లి- చిన్నారినూఁగారు- చిన్నారిమొగము మొ."

చిన్నారిపొన్నారి. దే. విశ. —పై.—

చిన్ని. వై. వి. 1.=ఛిన్న. రూ-చిని; కొద్ది: చూ, స్వల్పము. (దేశ్యమని శబ్దరత్నాకరము); దే. వి. 2. మనోజ్ఞము. రాఘు. 2, ఆ. 8: చూ, హృద్యము.

చిన్నిదము. దే. వి. 1. చిన్నిపువ్వు: చూ, భూషణము. 2; 2 బంగారు: చూ, లోహము.1.

చిన్నిపువు. ద్వ. వి. రూ-చిన్నిపువ్వు. 1: చూ, చిన్నిదము. 1; 2. బ. నతి: చూ, నమస్కారము; 3. బ. నతి విశేషము: చూ, నమస్కారము.

చిన్నిపువ్వు. ద్వ. వి. —పై.—

చిన్నిపూఁబోఁడి. ద్వ. వి. —పై.—

చిన్నిబూఁచె ద్వ. వి. నతి: చూ, నమస్కారము.

చిన్నియ. వై. వి. రూ-చిన్నె. 1.=చిహ్నమ్ గుఱుతు: చూ, లక్షణము. 1; 2. కులుకు: చూ, విలాసము. 2. [ఆం. 94.

చిన్నియెలుక. ద్వ. వి: చూ, చిట్టెలుక. ప్రేం,

చిన్నె. వై. వి,=: చూ, రూ-చిన్నియ.

చిన్నెలాఁడి. ద్వ. విశ. (చిన్నెలు + ఆఁడి) విలాసవతి: చూ, స్త్రీ.

చిన్నెలాఁడు. ద్వ. విశ. (చిన్నెలు + ఆఁడు) విలాసవంతుఁడు: చూ, సౌందర్యవంతుఁడు.

చిపిటకము. సం. వి. అ. పుం. రూ-చిపిటము- చిపుటము-చిపిటము-చపుటము. అడుకులు: చూ, పృథుకము

చిపిటము. సం. వి. అ. పుం. 1. —పై.—; విశ. 2: చూ, నడ్డిముక్కువాఁడు; 3. విస్తరింపఁజేయఁబడినది, విస్తృతము: చూ, విపులము. [టకము.

చిపుటము. సం. వి. అ. పుం: చూ, రూ-చిపి

చిప్ప. దే. వి. 1. తునుక: చూ, శకలము. 4; 2. రూ-చిప్పర. భూస్తృణము*. ఆం, భా. ద్వ. 176: చూ, తృణము. 1; 3. తలపుర్రె: చూ, శల్యము. 1; 4. అల్పము: చూ, స్వల్పము; 5. కప్పచిప్ప: చూ, సంకు. 1; 6. కల్లుత్రాగడుగిన్నె. లక్ష్మి. 3, ఆ. 9-10: చూ, పాత్రము. 6; 7. టెంకాయచిప్ప: చూ, కరంకము. 1; 8. తాఁబేలువీఁపుచిప్ప. అచ్చ. బాల, కాం. 46: చూ, బొరుసు. 4; 9. భూగోళమునందర్ధభాగము; 10. ముత్తెపుఁజిప్ప, గవ్వచిప్ప. వేమన. 1408: చూ, సీపి; 11. మోఁకాటిచిప్ప: చూ, శల్యము. 1; 12. చేఁపమీఁది పొలుసు. పాండు.3, ఆ.167: చూ, శల్కము. 3; వా. 13. ముష్టిచిప్ప. "చిప్ప కట్టు చేతికివచ్చినది": చూ, పాత్రము.6.

చిప్పకత్తి. దే. వి. చెట్లు మొదలగునవి నఱకెడు మోటకత్తి: చూ, రిష్టి. 2.

చిప్పకసవు. ద్వ. వి: చూ, చిప్ప. 2 *.

చిప్పకుంకటి. ద్వ. వి. పిల్లజోట్టు. రూ-కూఁకటి: చూ, సిక. 4.

చిప్పకూఁకటి. ద్వ. వి. —పై.—

చిప్పగడ్డి. దే. వి: చూ, చిప్ప. 2*.

చిప్పగుద్దలి. ద్వ. వి. చెట్లునఱకు గొడ్డలి: చూ, ముద్గరము.

చిప్పగొడ్డలి. ద్వ. వి: చూ, చిప్పగుద్దలి.

చిప్పపెడక. దే. వి. రూ-చిప్పపెణక. ఇంటి పార్శ్వముల కప్పు: చూ, సదనము. 1.

చిప్పపెణక. దే. వి.—పై.—

చిప్పము. దే. వి. రూ-చిప్పెము. పెద్దమాట: చూ, మాట.

చిప్పముత్తెము. ద్వ. వి. కృత్రిమమౌక్తికము: చూ, రత్నము. 1. [చూ, వదనము. 2.

చిప్పమూతి. దే. వి. కళాహీనమగు ముఖము:

చిప్పర. దే. వి: చూ, చిప్ప. 2 *.

చిప్పిలు. దే. అ. క్రి. రూ-చిప్పిల్లు. నీటిబొట్టు లోనగునవి పైకుబుకు: చూ, బుగులుకొను.

చిప్పిల్లు. దే. అ. క్రి. —పై.—

చిప్పె. దే. వి. రూ-చిప్పెవాఁడు. కుటిలపు వాఁడు: చూ, సాచికుఁడు.

చిప్పెము. దే. వి: చూ, రూ-చిప్పము.

చిప్పెవాఁడు. దే. వి: చూ, చిప్పె.

చిబుకము. సం. వి. అ. న. 1. గడ్డము: చూ, చుంబుకము; అం. 2. పురుషలక్షణాంగములు ఏఁబదియెనిమిదింటిలో నొకటి: చూ, లక్షణాంగములు. (చిబుకము=గడ్డము) చివళ్లు పగులక తుమ్మెదకాంతిగలిగి కుదురుగనున్న యైశ్వర్యవంతుఁడగు. రోమరహితమైన సపుత్రకుఁడగు); 3. స్త్రీలక్షణాంగములు ఏఁబది యెనిమిదింటిలో నొకటి: చూ, స్త్రీలక్షణాంగములు. (చిబుకము=గడ్డము).—నుడియున్న శుభవతియగు. మచ్చయున్న గొడ్రాలగు. రోమమున్న మగనితోఁ గలహించును.) (రూ-చిబూకము.) [చూ, చేప్పరించు.

చిబుకు. దే. స. క్రి. చీఁకు. శై. 8, అ. 148:

చిబూకము: చూ, రూ-చిబుకము.

చిమచిమ. దే. వి. గాయపు మంటయందగు ననుకరణము: చూ, హాహా,

చిమట. దే. వి. 1. రూ-చిమ్మట-చిమ్మిట-చిమిట. ఇలకోడి: చూ, రిల్లు; వా. వి. 2. కేశోత్పాటిని. రూ-చిమటా: చూ, తండసము.

చిమటా. దే. వి. 1. ఖడ్గముష్టిసంగ్రాహ్యతలములోని చీలపట్టున నలుఁగునమర్చుట కుపయోగమగు తావు: చూ, మొసలివాయి; 2. కేశోత్పాటిని: చూ, రూ-చిమట. 2.

చిమిడిక. వా. వి. చిమిడిన యన్నము, లగడ: చూ, పాదము. (1)

చిమిని. వా. వి. పొగనాపి కాంతినిచ్చు గాజు గొట్టము: రూ-చిమ్ని-చిమిలి-చిమ్లి.

చిమిలి. వా. వి. —పై.—

చిముటాలు. దే. వి. బ. క్షౌరమప్పుడు తండసముతో వెండ్రుకలూడదీయుట, తండసపుపని.

చిముటు. దే. స. క్రి. సైగకు కన్నుమూసి తెఱచు

చిముడు. దే. అ. క్రి. 1. అన్నము పాకముమీఱి నుడికి ముద్దయగు: చూ, ముద్దకట్టు; 2. పాకము చెడు. [రూ-చిముడ్చు.

చిముడుచు. దే. ప్రే. క్రి. చిముడఁజేయు: చూ,

చిముడ్చు. దే. ప్రే. క్రి. —పై.—

చిమ్ని. వా. వి: చూ, రూ-చిమిని.

చిమ్మ దే. వి. జలకణసమూహము. స్వా. 8, అ. 185: చూ, సలిలము. [మేచకము. 1.

చిమ్మచీఁకటి. దే. వి. గాఢాంధకారము: చూ,

చిమ్మట. దే. వి: చూ, రూ-చిమట. 1—2

చిమ్మటబుఱ్ఱ. దే. వి. ఈలపురుగుధ్వని: చూ, స్వరము. 2.

చిమ్మదిరుగు. దే. అ. క్రి. గిరగిరఁ దిరుగు.

చిమ్మనగొట్టము. దే. వి. జలక్రీడయందు నీళ్లు చిమ్మెడు గొట్టము: చూ, శృంగము. 8.

చిమ్మనగోవి. దే. వి.—పై.—

చిమ్మనము. దే. వి. చిమ్ముడు. ప్రభా. 2, అ. 81: చూ, విక్షేపము.

చిమ్మరేఁగు. దే. అ క్రి: చూ, రూ-చిమ్మిరేఁగు.

చిమ్మత్తాయి. దే./వి: చూ, బాలక్రీడ (ఇట్లు చిమ్ముత్తాయి.)

చిమ్మిటు. దే. వి: చూ, రూ-చిమట. 1.

చిమ్మిరి. దే. వి. నువ్వులును బెల్లమును కలిపి చేసెడి ముద్ద: రూ-చిమ్మిలి.

చిమ్మిరేఁగు దే. అ. క్రి. మిక్కిలి విజృంభించు: చూ, విజృంభించు.

చిమ్మిలి. దే. వి: చూ, రూ-చిమ్మిరి

చిమ్ము. దే. వి. 1. పొంకుచేటు: చూ, స్వాతి. 1; 2. పైచేటు; స. క్రి. 3. ఊడుచు: చూ, సమ్మార్జించు; 4. వైచు: చూ, విసరు. 8.

చిమ్ముడు. దే. వి. చిమ్ముటు: చూ, విక్షేపము.

చిమ్ముబిల్లలు. దే. వి. బ: చూ, బాలక్రీడ.

చిమ్ములాటు. దే. వి. ఒకరిమీఁద నొకరు చిమ్ము కొనుట.

చిమ్ములాడు. దే. స. క్రి (చిమ్ములు + ఆడు) ఒకరిమీఁద నొకరు చిమ్ముకొను.

చిమ్మెటు. దే. వి: చూ, రూ-చిమట. 1.

చిమ్లి. వా. వి: చూ, రూ-చిమిని.

చియ్య. దే. వి. కండ. ''ఒడలఁజియ్యపట్టినది.'': చూ, మాంసము.

చిరంటి. సం. వి. ఈ స్త్రీ. 1. విధువరాలు, సువాసిని: చూ, స్త్రీ; 2. యౌవనవతి: చూ. స్త్రీ. [చూ, పురాతనము.

చిరంతనము. సం. విణ బహుదినములది, ప్రాఁతది:

చిరంభణము. సం. వి. అ. పుం: చూ, పిన్నగ్రద్ద.

చిరకాలము. సం. వి. అ. పుం: చూ, దీర్ఘరాత్రము. (చూ, చిరము.)

చిరక్రియుఁడు. సం విణ. తామసించి కార్యము చేయువాఁడు: చూ, దీర్ఘసూత్రుఁడు.

చిరగడము. దే. వి. 1. రూ-చిరుగడము-చిరువడము. తియ్యకంద*: చూ, సూరణము (మధుమూత్ర రోగులకు తినిపింపరాదు); వా. వి. 2. (వస్త్రాదులు) చినుఁగుట.

చిరజీవి. సం. వి. న్. పుం. 1. కాకి: చూ, వాయసము; 2. వెన్నుడు: చూ, విష్ణువు. 1; 3. నలువ: చూ, బ్రహ్మ. 1; 4: చూ, మార్కండేయుఁడు; 5. అశ్వత్థామ: చూ, ద్రోణాయనుఁడు: 6: చూ, బలిచక్రవర్తి; 7. వ్యాసుఁడు: చూ, ముని 1; 8. హనుమంతుఁడు: చూ, వానరము; 9: చూ, విభీషణుఁడు: 10: చూ, కృపుఁడు; 11: చూ, పరశురాముఁడు; 12. బూరుగు*: చూ, శాల్మలి; 13. జీవకము*: చూ, హ్రిస్వాంగము; విణ. 14. చిరకాలము జీవించువాఁడు: చూ, వృద్ధుఁడు.

చిరత్నము. సం. విణ: చూ, రూ-చిరంతనము.

చిరపర్ణము. సం. వి. అ. న. మాచిపత్రి*: చూ, సూరపర్ణము.

చిరపాకి. సం. వి. న్. పుం: చూ, వెలఁగ*.

చిరపుష్పము. సం. వి. అ. పుం. పొగడ*: చూ, వకుళము.

చిరపుర. దే. వి. భేదము: చూ, వేఱుపాటు. 1.

చిరము. సం. అవ్య. చిరాత్: చూ. చిరకాలము.

చిరమేహి. సం. వి. న్. పుం. (పుం, స్త్రీ. అని కొందఱు) గాడిద: చూ, రాసభము.

చిరరాత్రము. సం. వి. అ. న 1. రాత్రుల సమూహము: చూ, రాత్రి; 2. పెక్కు రాత్రులు: చూ, రాత్రి.

చిరసూత. సం. వి. అ. స్త్రీ. చాలా కాలమునకు ముందీనిన యావు, బక్కయణి, తఱిపియావు: చూ, ధేనువు.

చిరస్థుఁడు. సం. విణ: చూ, నాయకుఁడు.

చిరాకు. దే. వి. 1. కోపము: చూ, రోషము; వా. వి. 2. ఉక్కవలన గలుగు శ్రమము: చూ, శ్రమము. 1.

చిరాత్. సం. అవ్య: చూ, దీర్ఘరాత్రము.

చిరాయువు. సం. వి. ఉ. న. 1. రూ-చిరా యువు. బూరుగు*: చూ, శాల్మలి; పుం. 2. దేవుఁడు: చూ, వేలుపు; 3. ఊరకాఁకర, వాతాయువు*: చూ, సుష. 1; 4 కాకి: చూ, వాయసము. 1.

చిరి. సం. వి. ఇ. పుం.=చిలుక: చూ, శుకము.

చిరిక. సం. వి అ. స్త్రీ. పురాతన మలము: చూ, మలము. 1.

చిరిచిమము. సం. వి. అ. పుం. కాలు కనువున దిరుగుచేఁప. రూ-చిరిచిమము- చిలిచిమము- చిలీచిమము-చిలీచీమము: చూ, మత్స్యము. 1.

చిరితాళము. ద్వ. వి: చూ, చిటితాళము: చూ, వీణె. (మా)నితో (జేసిన తాళవిశేషమని కొందఱు)

చిరిపి. దే. వి. తైలమార్దకము. [శాదఘ్నము.

చిరిబిల్వము. సం. వి అ. పుం. కానుగు*: చూ,

చిరిమిడి. దే. వి: చూ, భక్ష్యము. (చేలిమిడియని కొందఱు.)

చిరివేరు. ద్వ. వి. ఎఱ్ఱచాయవేయుట కుపయుక్తమైన యొకానొక వేరు. రూ-చిఱువేరు: చూ, బకాను. (దీని ఆకు శ్లేష్మహరము. ఉబ్బసము తుయ తగ్గించును) [(దేశ్యమని శ-ర.)

చిరుఁగు. వై. అ క్రి.=జీర్ణ: చూ, చినుఁగు

చిరుక. సం. వి. అ. స్త్రీ. రూ-ఝిరుక-చీరి-చీరుక: చూ, చిమట. 1. [1.*

చిరుఁగడము. దే. వి. = చూ, రూ-చిరగడము.

చిరుగుడు. దే. వి. ఎఱ్ఱపులుము: చూ, మండలము. 3.

చిరుత. దే. వి. కాష్ఠక్రీడ: చూ, చిఱుతనగోడు.2

చిరుతరి. దే. వి. వ్రీహిభేదము: చూ, ధాన్యము.

చిరుతలఁకవియు. దే. అ. క్రి: చూ, మిఱుమిట్లుగొను.

చిరుతలుక్రమ్ము. దే. అ. క్రి. —వై—

చిరుతలువాఱు. దే. అ. క్రి. —వై.—

చిరునగవు. ద్వ. వి. (చిఱుత+నగవు) రూ-చిర్నగవు- చిర్నవ్వు-చిఱునవ్వు: చూ, హాస్యము. 1. [మ: చూ, శిరోనామ.

చిరునామ. వై. వి.=శిరోనామ. రూ-చిఱునా

చిరువడము. దే. వి: చూ, రూ-చిరగడము*.

చిరువాలు. దే. వి రూ-చిఱువాలు. ఇవురగాఁచినపాలు: చూ, పాలు. 1.

చిర్నగవు ద్వ. వి. (చిఱుత+నగవు) చూ, రూ-చిరునగవు.

చిర్నవ్వు. ద్వ. వి. —వై.—(రూ-చిఱునవ్వు)

చిర్భటము. సం. వి. అ. పుం. నక్కదోస*: చూ, దోస.

చిర్భటి. సం. వి ఈ. స్త్రీ. —వై.—

చిర్భిటి. సం. వి. ఈ. స్త్రీ. —వై.—

చిఱచిఱ. దే. వి. కోపవికారము: చూ, రోషము (చూ, అవటవ)

చిఱచిఱలాడు. దే. అ. క్రి. (చిఱచిఱలు+ఆడు) మండిపడు: చూ, మండు.

చిఱి. వై.వి. 1 =చిల్లి. రూ-చిఱ్ఱి-చిఱికూర-చిఱ్ఱికూర*: చూ, భండీరము. 2; విశే. 2. అల్పము: చూ, స్వల్పము.

చిఱికూర. వై. వి: చూ, చిఱి. 1.

చిఱితిండి. వా. వి. రూ-చిఱుదిండి. అన్నముమాని ఫలహారాదులు తినుట. పంచ. వేం. 480: చూ, భక్ష్యము.

చిఱిసెనగలు. వై. వి. బ. మసూరము. రూ-చిఱుసెనగలు: చూ, సెనగలు.

చిఱు. దే. విశే. 1. వృత్తియందు చిఱుతశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (ఉదా:—చిఱుగజ్జె, చిఱుగెంపు, చిఱుచెమట, చిఱుచెయ్వు, చిఱుచేఁప, చిఱుదోఁక, చిఱుపొక్కు మొ.); 2. అల్పము. ఆం, భా, త్ర. 16: చూ, స్వల్పము.

చిఱుగంటు. ద్వ. వి. ఘర్ఘరి. అం. భా. ద్వి. 151: చూ, భ్రామణము. 2.

చిఱుగాలి ద్వ. వి. (చిఱుత + గాలి) మంద మారుతము: చూ, వాయువు.

చిఱుగూబ. వై. వి. (చిఱుత + గూబ) వైడి కంటి: చూ, సకినంపుఁ బులుఁగు.

చిఱుచేఁప. దే. వి. రొయ్య- రొయ్య: చూ. మత్స్యము. 1.

చిఱుత. వై. వి. 1.=చిత్రకః. రూ-చిఱుతపులి-చిఱుపులి-చిఱుతగండు: చూ, శార్దూలము. 1; 2. సాముచేసెడువారు త్రిప్పెడు చిన్నకోల: చూ, బాణము. 1; 3. బాలుఁడు: చూ, శిశువు; విణ. 4. చిన్న. రూ- చిఱుతుక-చిటి-చిఱు అల్పము: చూ, స్వల్పము.

చిఱుతగండు. ద్వ. వి: చూ, చిఱుత. 1.

చిఱుతగూబ. వై. వి: చూ, రూ-చిఱుగూబ.

చిఱుతనగోడు. ద్వ. వి. (చిఱుత + గోడు) 1: చూ, బాలక్రీడ; 2: చూ, చిరుత.

చిఱుతనబిల్లలు. ద్వ. వి. బ. (చిఱుత + బిల్లలు): చూ, బాలికాక్రీడ.

చిఱుతపులి. వా. వి: చూ, చిఱుత. 1.

చిఱుతుక. వై. విణ.=చిత్రక (చిఱుత + ఉక) చిన్నవయసుగలది (ఆఁడుది): చూ, స్త్రీ.

చిఱుతేఁకు. ద్వ వి. (చిఱుత + తేఁకు): చూ, బారంగి*.

చిఱుతొడ ద్వ. వి. జంఘ: చూ, పిక్క.

చిఱుదిండి. ద్వ వి. (చిఱుత + తిండి) రూ-చిటితిండి. నలితిండి: చూ, భక్ష్యము.

చిఱుదొడ. ద్వ. వి. (చిఱుత + తొడ): చూ, రూ-చిఱుతొడ. [రూ-చిరునగవు.

చిఱునవ్వు. ద్వ వి. (చిఱుత + నవ్వు): చూ,

చిఱునామ. వై. వి.=: చూ, రూ-చిరునామ.

చిఱునాలుక. ద్వ. వి. (చిఱుత + నాలుక): చూ, కొండనాలుక. 1—2.

చిఱునెల్లి. ద్వ. వి. (చిఱుత + నెల్లి) పిన్ననెల్లి*: చూ, క్షిప్రపర్ణము. 1:

చిఱుపాల. ద్వ. వి. (చిఱుత + పాల, పాల కూర*: చూ, మనుపాల. [1.

చిఱుపులి ద్వ. వి. (చిఱుత + పులి): చూ, చిఱుత.

చిఱుబంతిపసుపు. వై. వి. (చిఱుత + బంతిపసుపు) పూసికొను పసుపు. హై. 2, ఆ. 100: చూ, వర్ణము. 6.

చిఱుబొద్ది. ద్వ. వి. (చిఱుత + బొద్ది) పారు*: చూ, విద్ధకర్ణి. (ఇది మూత్రముజారీచేయును.)

చిఱుము దే. అ. క్రి. 1: చూ, విజృంభించు; స. క్రి. 2: చూ, చిమ్ము. 3-4.

చిఱువడ్లు. ద్వ. వి. బ. (చిఱుత + వడ్లు) అణువులను వడ్లు: చూ, ధాన్యము.

చిఱువాలు. వై. వి. (చిఱుత + వాలు): చూ, రూ-చిరువాలు.

చిఱువేరు. ద్వ. వి. (చిఱుత + వేరు): చూ, రూ-చిరివేరు. [గలు.

చిఱుసెనగలు. ద్వ. వి. బ: చూ, రూ-చిటిసెన

చిట్టు. దే. వి. 1. కోపము: చూ, రోషము; 2. చూ, చింపిటి. "చిట్టుతల."

చిట్టుచిట్టు. దే. వి. తొట్రు: చూ, సంభ్రమము.

చిట్టులువొడుచు. దే. అ. క్రి. (చిట్టులు + పొడుచు) తొట్రుపడు: చూ, సంభ్రమించు.

చిట్టి. వై. వి.=చిల్లి: చూ, రూ-చిటి. 1.*.

చిట్టికూర. వై. వి. = —పై.—

చిట్టిపట్టె. ద్వ. వి: చూ, బాలక్రీడ.

చిట్టు. దే. వి. కోపము: చూ, రోషము.

చిట్టుద్ది. ద్వ. వి. (చిఱుత + ఉద్ది) చిన్నయుద్ది.

చిట్టుబుట్టు. వా. వి. 1: చూ, చిఱచిఱ; 2: చూ, బాలక్రీడ.

చిట్టుమను. దే. అ. క్రి. (చిట్టు + అను) 1. కోపించు: చూ, రోషించు; 2. బుసకొట్టు. అచ్చ. బాల, కాం. 106: చూ, బుసకొట్టు. 1.

చిట్టుముట్టాడు. దే.అ.క్రి. (చిట్టుముట్టు + ఆడు) 1. పెనగులాడు: చూ, పెంటిగొను; స. క్రి. 2. భేదించు: చూ, భేదిల్లు. 1. [శుకము.

చిలక. నా. వై. వి.=చిరి. రూ-చిలుక: చూ,

చిలకకూర. వై. వి. రూ-చిలుకకూర-చిల్కకూర*: చూ, హీలమోచిక (గ్రిహిణి మూల వ్యాధిని పోఁగొట్టును) (చూ, మారిషము.)

చిలకకొయ్య. ద్వ. వి. రూ-చిలుకకొయ్య: చూ, శంక్వము. [రూ-చిలకడ.

చిలకటం. దే. వి. చిలకత్రాడుకట్టు కొయ్య:

చిలకడ. దే. వి. —పై.—

చిలకత్రాడు. ద్వ. వి. రూ-చిలుకత్రాడు. చిలుకకాలిత్రాడు: చూ, సూత్రము. 1.

చిలుకమట్టు. ద్వ వి. కంచేరగాడిద: చూ, రాసభము.

చిలకలకొలికి. ద్వ.వి: చూ, రూ-చిలుకలకొలికి.

చిలకత్రాడు. దే. వి. ఎద్దుమీఁదిగ త బిగించు త్రాడు: చూ, సూత్రము. 1.

చిలచిల. దే. వి. నట్టుటయందగు ననుకరణము. కళా.6, అ. 252: చూ, హహాహహా.

చిలనీలిక. సం.వి.అ.స్త్రీ: చూ,రూ-చిలిమోలిక.

చిలవ. దే. వి. నీరుకోడి: చూ, ఫుంజా.

చిలికించు. దే. స క్రి. చేల్లు: చూ,ప్రోక్షించు.

చిలిచిమము. సం. వి. అ. పుం: చూ, రూ-చిరివిమము.

చిలిపి. దే. విణ. రూ-చిడిపి. 1. అల్పము. జై.8, అ. 140: చూ,స్వల్పము; 2. నికృష్టము:చూ, హీనము.1; 3. దుష్టుఁడు: చూ,వ్యాధుఁడు.2.

చిలిమిడి. దే. వి. అక్షోళము*: రూ-చిలిమిద: చూ, మృదుద్రుమము.

చిలిమిద. దే. వి. —పై.—

చిలిమోలిక. సం. వి.అ. స్త్రీ. రూ-చిలినీలిక. 1. మెఱుఁగుడుపురుగు: చూ,పురుగు; 2. మెఱుపు: చూ, విద్యుత్తు. 1; 3. కంఠభూషణము: చూ, భూషణము. 2.

చిలిచిలిపోవు. తె. అ. క్రి. (చిలిచిలి + పోవు): చూ, సందడించు. [చిమము.

చిలీచిమము. సం. వి. అ. పుం: చూ, రూ-చిరి

చిలీచీమము. సం. వి. అ పుం.—పై.—

చిలుక. వై. వి. 1.=చిరి. రూ-చిలక-చిల్క: చూ, శుకము; 2. చేయమేకు: చూ, బండికన్ను; అం 3 దూతికలలో నొకతె. దూతీచతుష్టయమునందలి మూఁడవదానిలోని పసునాతింటిలో నొకటి: చూ, దూతీచతుష్టయము.

చిలుకకూర. వై వి.=: చూ, రూ-చిలకకూర.

చిలుకకొయ్య. ద్వ. వి: చూ, రూ-చిలకకొయ్య.

చిలుకడ. ద్వ. వి. (చిలుకు + కడ) పగ్గములోనగు వానికొనను వేసెడు కొలికిముడి: రూ-చిల్కడ.

చిలుకతాళి. ద్వ. వి. మీఁదినిరుప్రక్కల చిలుకరూపేర్పఱచిన పతకము:చూ,భూషణము.2.

చిలుకతోఁటకూర ద్వ వి. మహాశాకము, పెరుఁగాకు*: చూ, మారిషము.

చిలుకత్తు. ద్వ. వి. (చిలుకు + అత్తు) కవచవిశేషము, జీరా: చూ, వారవారణము.

చిలుకత్రాడు. ద్వ. వి: చూ, రూ-చిలకత్రాడు.

చిలుకనాలుక. ద్వ. వి: చూ, శుకనాశము*.

చిలుకపలుకులు. జా. అర్థజ్ఞానములేని మాటలు.

చిలుకపిట్ట. వై. వి: చూ, రూ- చిలకపిట్ట.

చిలుకముక్కు. ద్వ. వి: కుండిగము*: చూ, శోణకము.

చిలుకముక్కులు. ద్వ. వి. బ. ఒకరకము వడ్లు. హంస. 5, అ. 128: చూ, ధాన్యము.

చిలుకమ్ము. వై. వి. దుమ్ముంటకిశరము. అం, భా. ద్వి. 218. రూ-చిలుకుటమ్ము. దోటమ్ము: చూ, బాణము. 1.

చిలుకయారె. వై. వి. (చిలుక + ఆరె) ఒకరకము మాదిగ సూది: చూ, సూది.

చిలుకరవుతు. వై. వి.=శుకరాహుత్త. రూ-చిలుకరౌతు: చూ, మన్మథుఁడు.

చిలుకరించు. దే. స. క్రి. చిలికించు: చూ, ప్రోక్షించు.

చిలుకరింత. దే వి. చిలుకరింపు: చూ, ప్రోక్షణము.

చిలుకరింపు. దే వి. —పై—

చిలుకలకొలికి. ద్వ. వి 1 చిలుక కొలికివంటి కొలుకులు గల అఁడుది: చూ, స్త్రీ; 2. అఁడుది: చూ, స్త్రీ.

చిలుకలు. అం. ఈతిబాధ లాఱింటిలో నొకటి: చూ. ఈతిబాధలు.

చిలుకు. దే. వి. 1. శరము. అచ్చ, కిష్కిం, కాం. 45: చూ, బాణము. 1; 2. బాణము యొక్క యలుఁగు. వసు. 4. ఆ. 86: చూ, బాణము. 1: 3. గొండ్లెము: చూ, విష్కంభము. 2; 4. కొలికి. పాండు. 5, ఆ. 133: చూ, ముక్కుకొలికి; 5. నాగేము యొక్క పైభాగము "గూపాయిపై చిలుకు": చూ, లోహము 1; అ. క్రి. 6. చిందు: చూ, తొలఁకు; 7. ప్రసరించు: చూ, వ్యాపించు; 8. మీఱు. స్వా. 3, ఆ. 108: చూ, ముష్కరించు; స. క్రి. 9. చల్లు: చూ, ప్రోక్షించు; 10. త్రచ్చు: చూ, మథించు; వా. 11. (స్ఫోటకపు పొక్కులు) దిగఁబోయు: చూ, దిగఁబోయు.

చిలుకుట. దే.వి. రూ-చిలుకుడు: చూ, మథనము.

చిలుకుటమ్మ. ద్వ. వి: చూ, రూ-చిలుకమ్మ.

చిలుకుడు. దే. వి: చూ, రూ-చిలుకుట.

చిలుకుమార్చు. దే. స. క్రి. చంపు. ఆం, భా. తృ. 128: చూ, సంహరించు.

చిలుగు. దే. వి: చూ, దీర్ఘయష్టిక*.

చిలుప. దే. వి. 1. కొంచెముగఁజేరి నిలిచిననీళ్లు: చూ, సలిలము; విణ. 2. అల్పము. స్వా. 4, ఆ. 17: చూ, స్వల్పము.

చిలుపచిలుప. దే. విణ. కొంచెము కొంచెము: చూ, స్వల్పము.

చిలుము. దే.వి. 1. లోహాదుల మలము, త్రుప్పు: చూ, లోహము. 1; 2. విషము: చూ, విసము. 1.

చిలుమువాలు. ద్వ విణ. 1. తులువ, కుత్సితుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 2. త్రుప్పుపట్టిన కత్తి: చూ, రిష్టి. 2.

చిలువ దే. వి. (చిలుము + వా) విషధరము: [చూ, సర్పము.

చిలువటెంకి. దే. వి. పుట్ట: చూ, వల్మీకము.

చిలువతాలుపు. దే. వి: చూ, శివుఁడు. అచ్చ. సుం, కాం. 41.

చిలువదారి. దే. వి. —పై—

చిలువతిండి. దే. వి. 1. గరుత్మంతుఁడు: చూ, హరివాహనుఁడు; 2. నెమిలి. అచ్చ. కిష్కిం, కాం. 67: చూ, మయూరము.

చిలువమేఁత. దే. వి. ఈఁదు. ఆం, భా. ప్ర. 59: చూ, వాయువు.

చిలువమేఁతరి. దే. వి: చూ, చిలువతిండి. 1.

చిలువఱేఁడు. దే.వి. సర్పరాజు: చూ, సర్పము.

చిలువానము. దే. వి. కూడఁబెట్టిన ధనము: చూ, విత్తము. 1.

చిలువాయనము. దే.వి. క్షుద్రము, చిల్లర, నక్కపాటి: చూ, సాధారణము. 2.

చిలువాలు. దే. వి: చూ, రూ-చిలువాలు.

చిల్క. వై. వి. 1.= చిరి: చూ, రూ-చిలక; 2: చూ, చిలకకూర*.

చిల్కచేకువులు. జా. నోటనుచ్చరించుటయేగాని మనస్సునఁబట్టని పలుకులు "చదువులివియెల్లఁ జిల్కలచేదువులనుచు". పాండు. 3, ఆ. 36.

చిల్కడ. ద్వ. వి: చూ, రూ-చిలుకడ.

చిల్కలు. అం: చూ, రూ-చిలుకలు.

చిల్ల. వై. వి. 1.=సిల్హః*: చూ, సల్లకి; దే. వి. 2. కతకము*. పంచ. వేం. 4, ఆ. 522: చూ, సల్లకి; 3. చిల్లమడ్డి: చూ, సల్లకి.

చిల్లకతరువు. సం. వి. ఉ. పుం: చూ, లొద్దుగు*.

చిల్లకోల. ద్వ. వి. తోమరము: చూ, సర్వల.

చిల్లగింజ. దే. వి. ఇందుగు*: చూ, సల్లకి.

చిల్లగొండి. దే. వి: చూ, పేచీకోరు.

చిల్లగోలు. దే. వి. విడిచివాటుగుదియ, భిందిపాలము: చూ, రిష్టి. 2.

చిల్లపెంకు. దే. వి. (చిల్లర + పెంకు) పగిలిన కుండముక్క: చిల్లపెంచు.

చిల్లపెంచు. దే. వి. (చిల్లర + పెంచు)—పై—

చిల్లమడ్డి. ద్వ. వి: చూ, చిల్ల. 3.

చిల్లము. సం. వి. అ. పుం. 1. చీపరపిట్ట: చూ, పిన్నగ్రద్ద; 2. తడిమన్ను: చూ, భూమి. 1; విణ. 3. తడికంటిది. రూ-చుల్లము: చూ, పిల్లము (తడిసిన కంటియందు ముఖ్యవృత్తి చేతను, తడిసిన కన్నులు గలవానియందు ఉపచారముచేతనువర్తించును); దే.వి.(1) హుక్కాకు నిప్పు పెట్టుకొనెడి పాత్రము: చూ, పాత్రము. 6.

చిల్లర. దే. వి. 1. చింతపండు మిరెపకాయలు లోనగు సరకు. రా, వి. 2, అ. 69: చూ, సరకు. 1; 2. కొంచెపాటి నాణెము: చూ, చిలుకు. 5; విణ. 3. సామాన్యము. "చిల్లర వేల్పులు": చూ, సాధారణము. 2.

చిల్లరకాడు. దే. విణ. సామాన్యుడు: చూ, హీనుడు.

చిల్లరదుకాణము. దే. వి. (పలుసరకుల మ్మెడు) అంగడి: చూ, దుకాణము.

చిల్లరబేరగాడు. దే. విణ. అమాంతగాడు: చూ, బేరగాడు.

చిల్లర బేరము. ద్వ.వి. బేరము: చూ, వాణిజ్యము.

చిల్లరవాడు. దే వి. సామాన్యుడు. అం, భా. తృ. 16: చూ, సందడికాడు.

చిల్లాడము. దే.వి. రూ- చిల్లాణము, చేల్లాణము. మొలవంక భేదము: చూ, బాణము. 1.

చిల్లాణము. దే. వి: చూ, రూ-చిల్లాడము.

చిల్లాభుడు. సం. వి. అ. పుం. బందిపోటు దొంగ: చూ, ముష్టిచ్చు. 1.

చిల్లి. సం. వి. ఈ. స్త్రీ. 1 =చిత్తి*: చూ, భండీరము. 2; 3: చూ, లొద్దుగు*; దే. వి. (1) తూటు: చూ, రంధ్రము. 1.

చిల్లింగి. దే. వి. మూలికచేత జేసెడి యుచ్చాటనాదిక్రియ, కార్మణము: చూ, హింసాకర్మ.

చిల్లు. దే. వి. చిమ్ముటలోనగు వానియందగు ధ్వన్యనుకరణము కళా. 2, ఆ. 9; కళా. 8, ఆ. 109: చూ, హూహూ.

చిల్లుడు. సం. విణ. రూ- చుల్లుడు. పుసికండ్ల వాడు, తడిసిన కన్నులు గలవాడు (అని కొందఱు): చూ, పుసికండ్లవాడు.

చిల్లుపాల్లు. దే. వి: చూ, సంక్షోభము.

చిల్లులుపోవు. దే. అ. క్రి. (చిల్లులు + పోవు) తూంట్లుపడు. లక్ష్మి. 3, ఆ, 36: చూ, తొఱ్ఱలువాఱు.

చిల్లోటి. దే. వి. ఒకరకము డాలువాలు, చిల్లోటికేడము-రూ- చిల్లోటి కేవడము: చూ, వారిక.

చిల్లోటికేడము. దే. వి.—పై—

చిల్లోటికేవడము. దే. వి.—పై— [ప్ర. 148.

చిల్వ. దే. వి: చూ, రూ-చిలువ. అం, భా.

చివగి. దే. వి. రూ-చివ్వగి-సివగి: చూ, రూ, సివ్వగి. [పాటికొమ్మ: చూ, శాఖ. 1.

చివక. దే. వి. రూ-చివ్వ. సన్నని చిన్న నిడు

చివచివ. దే. వి. గమనాదుల యందగు ననుకరణము. కళా. 8, ఆ. 95: చూ, హూహూ.

చివర పై. వి.=శిఖర. 1. కొన, అగ్రము: చూ, నుదు. 8; 2. ఉపశాఖ. అం, భా. ద్వి. 37: చూ, శాఖ. 1; 3. బెత్తము: చూ, వేత్రము 1. (దేశ్యమని శబ్దరత్నాకరము.)

చివరమాటు. ద్వ. వి. 1. తుదిపలుకు: చూ, శబ్దము. 2.

చివరము. సం. వి. అ. న: చూ, రూ-చీవరు.

చివికివెలమ. దే. వి: చూ, వెలమసంది*.

చివిల్లిక. సం. వి. ఆ స్త్రీ: చూ, రేఁగు*.

చివుక. దే. వి. 1. కాలురూపాయ, మగలము-రూ-మగులము: చూ, రూపాయ: వై.వి.2.= జం కా. రూ- చీసరువాయి- చీసవాయి-చివుకపిట్ట-చీవుక: చూ, తైలపాయిక (దేశ్యమని శబ్దరత్నాకరము.)

చివుకపిట్ట. వై. వి.=: చూ, రూ-చివుక. 2.

చివుకపిల్లి. వై. వి. ఒకరకము పిల్లి: చూ, మార్జాలము.

చివుకు. దే. వి. 1. రూ-చివుక్కు. ఎగయుట దాఁటుట గుండె దిగులొందుట లోనగువాని యందగు ననుకరణము: చూ, హుహూహుహూ; విణ. 2. సారములేనిది. అచ్చ.బాల, కాం. 216: చూ, ఫల్గువు 2; అ. క్రి. 3 తడియుటచే సారహీనమగు. పాండు. 2, ఆ. 66; 4. సారహీనమగు. అచ్చ. యు, కాం. 119: చూ, పూచు. 3. [ఆ. 111.

చివుక్కు.. దే.వి: చూ, రూ-చివుకు. 1. కళా. 5,

చివుక్కుమను. దే. అ. క్రి. (చివుక్కురు + అను) (తన్నెవరేని యొకమాట చెప్పినను మర్మము బయలుపడినను) మనసు కలఁగు. ప్రిభా. 3, ఆ. 92; కళా. 3, ఆ. 47: చూ, సంక్షోభించు.

చివురు. దే. వి: చూ, రూ-చిగురు. విజ. 1, ఆ. 150.

చివ్వ. దే. వి. 1. సన్నని చిన్న నిడుపాటికొమ్మ: చూ, శాఖ. 1; 2. బెత్తము: చూ, వేత్రము 1; 3. కుంతము: చూ, బాణము. 1; 4. కలహము: చూ, యుద్ధము; బ 5. బాణపుసంచుకగ: చూ, బాణసంచు.

చివ్వంగి. దే. వి: చూ. రూ-చివఁగి.

చివ్వఁగి. దే. వి. —వై.—

చివ్వలాఁడి. దే. విణ. (చివ్వలు + ఆఁడి) కలహశీలురాలు. హరిశ్చ. 4, అ. 177: చూ, స్త్రీ.

చివ్వి. అం. ఆయుధములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, బాణము 1. (చూ, ముప్పదిరెండాయుధములు)

చివ్వు. దే. స. క్రి. చెక్కు: చూ, వారు. 1.

చివ్వున దే. దవ్రి. క్రి. విణ. శీఘ్రముగ: చూ, వేగము. 3. [వెండుర్క. 1.

చిహురము. సం. వి. అ. పుం వెండ్రుక: చూ,

చిహ్నము. సం వి. అ.న. 1.=చిన్నె. గుఱుతు: చూ, లక్షణము. 1; 2. టెక్కెము, జెండా: చూ, సిడము.

చిహ్నములు. అం. పట్టు, విడుపు, కొట్టు, ప్రాణము రక్షించు, నీకు లోఁబడితిని, ఇంక నేమి సేతునని మ్రొక్కును, ఏడ్చును, ముట్టనీయకుండును. (9).

చిళ్ల. దే. వి. అగ్రము: చూ, సుద. 3.

## చీ

చీ. దే. అవ్య. ధిగర్థకము, తిరస్కారమును దెలిపెడి: చూ, వహేలనము.

చీఁకటి. దే. వి. (చీఁకు + కట్టు) 1. అంధకారము. రూ-చీఁకు-చీకువాలు-చీఁకువాలు (అని కొందఱు): చూ, మేచకము. 1; 2. తెల్లగా తెల్లవాఱకముందు కాలము. "నీవు చీఁకటితోనే లేచిరమ్మ.": చూ, వేగుజాము.

చీఁకటిగాము. ద్వ. వి. రాహుగ్రహము: చూ, రాహువు. 2. [వేం. ఆం. 11.

చీఁకటిగుండెదిగులు. ద్వ. వి: చూ, సూర్యుఁడు.

చీఁకటిగొంగ. దే. వి.—వై.—

చీఁకటిచెట్టు. దే. వి: చూ, తమాలము. 4 *.

చీఁకటితప్పు. దే వి. జారత్వము. "కులపెద్ద చీఁకటితప్పునకు నాలుగురూపాయలు జేరిమానా (కులతప్పు) విధించెను.": చూ, వ్యభిచారము.

చీఁకటిపడు. దే. అ. క్రి: ఇరులుకొను, చీకు రించు. (సం. ప.):—అంధకారమగు.

చీఁకటిమిత్తి. ద్వ. వి. చంద్రుఁడు. సాంబ. దేవ. 10: చూ, హిమాంశువు.

చీఁకటిమొటికిళ్లు. దే. వి. బ: చూ, బాలక్రీడ. (ఇట్లే చీఁకటి మొటికాయలు.)

చీఁకటిమాను. దే. వి: చూ, చీఁకటిచెట్టు *

చీఁకటియూఁగ. దే. వి. (చీఁకటి + ఈఁగ) చిన్న దోమ: చూ, దోమ.

చీఁకటివేరువిత్తు. దే. వి: చూ, చీఁకటిమిత్తి. ఆం. నా. సం. దే. 15.

చీఁకటులగొంగ. దే. వి: చూ, సూర్యుఁడు, సాంబ. దే. 9.

చీఁకు. దే. వి. 1 గ్రుడ్డితనము: చూ, గ్రుడ్డి. 2; విణ. 2. అంధుఁడు: చూ, రేచీఁకు; స.క్రి. 3: చూ, చేప్పరించు; 4. చుంబించు: చూ, ముద్దుపెట్టుకొను.

చీఁద. వై. వి.=చిల్ల. చిందపక్షి: చూ. పిన్నగ్రద్ద.

చీఁదఱ. దే. వి. 1. అసహ్యము: చూ, రోఁత.2; 2: చూ, విజృంభణము; 3. ఉపద్రవము; పా. 4, అ. 14: చూ, విపత్తు; 4. క్షోభము: చూ, సంతాపము; వై. వి. 5. = ఛిద్రమ్. తూఁటు: చూ, రంధ్రము. 1.

చీఁదఱగొను. దే. అ. క్రి. (చీఁదఱ + కొను) 1. ఉపద్రవపడు; 2: చూ, చిందఱరేఁగు; 3: చూ, చిందఱవోవు.

చీఁదఱరేఁగు. దే. అ. క్రి: చూ, చీఁదఱగొను.

చీఁదఱలువోవు. ద్వ. అ. క్రి. (చీఁదరలు + పోవు): చూ, చిందఱవోవు.

చీఁదు. దే. వి. 1. చీమిడి: చూ, శింఘాణము; స. క్రి. 2. (చీమిడిబయలువుచ్చుచు బుఱ్ఱని ఊపిరి విలికిరా) మొదటి రెండువేళ్లతో ముక్కునదుము.

చీఁముడు. దే. వి: చూ, చీఁదు. 1.

చీఁపురు. దే. వి. రూ-చీఁపురుకట్ట-చీకిలి: చూ, సమ్మార్జని.

చీఁపురుకట్ట. దే. వి —వై.—

చీఁపురుపుల్ల. దే వి: చూ, పారక.

చీకాకు. దే. వి. (చీకు + ఆకు) 1. చివికినఆకు: చూ, పర్ణము. 1; 2: చూ, శ్రమము. 1; విణ. 3 శ్రమముకొందినది: చూ, దుఃఖితము.

చీకాకుపడు. ద్వ. అ. క్రి. 1. బలహీనమగు: చూ, వలియు; 2. శ్రమపడు: చూ, వేసరు. 2.

చీకిరేను. దే. వి. ఒకానొకచెట్టు: చూ, వృక్షము.

చీకిలి. దే. వి: చూ, చీఁపురు.

చీకిలించు. దే. అ. క్రి: చూ, చిరుతలుకవియు.

చీకిలిమాకిలి. దే. విణ. కొక్కిరిబిక్కిరి. సా. 1, అ. 15.

చీకు. దే. వి. 1. అంధము: చూ, మేచకము. 1; 2. అంధుఁడు: చూ, రేచీఁకు; 3. రూ- చివుకు: చూ, ఫల్గువు. 2. [బకము.

చీకుకొక్కెర. ద్వ. వి. కోయష్టికము: చూ,

చీకురాయి. వై. వి. = జతుకా. చూ, రూ- చివుక. 2. (దేశ్యమని శబ్దరత్నాకరము.)

చీకురించు. దే. అ. క్రి: చూ, చీఁకటిపడు.

చీకురుఃయి. వై. వి. = జతుకా: చూ, రూ- చీకురాయి (దేశ్యమని శబ్దరత్నాకరము.)

చీకువాయి. వై. వి. = —వై.—

చీకువాలు. దే. వి. చీఁకటి: చూ, మేచకము. 1.

చీకొట్టు దే. స. క్రి. ఛీఛీయను: చూ, ధిక్కరించు.

చీటకము. వై. ః: చూ, రూ-చిట్టకము.

చీటి. దే. వి. 1. ఖండపత్రిక. వసు. 1, అ. 72: చూ, పురోణి; 2. పత్రిక: చూ, లేఖ. 3.

చీటికిమాటికి. దే. ద్ర. 1. ముహుర్ముహుః: చూ, శశ్వత్తు; జా. 2. తఱుచుగా. "చీటికిమాటికిఁ

దాలిమిదిగనాటుట మగపాడిగాదు." (నీతి చంద్రిక—సంధి.)

చీడ. సం. వి. అ. స్త్రీ. 1. కపటినియను గంధద్రవ్యము: చూ, రాజార్హము; దే. వి. (1) సస్యాములను చెఱిచెడి యొకానొకపురుగు: చూ, పురుగు; (2) ఒకానొకరోగము: చూ, రోగము. 1; (3) సస్యరోగము: చూ, నావి.

చీడపురుగు. దే. వి: చూ, చీడ (1).

చీడు. దే. వి. పుంజెము తక్కువయగువార. (వార = ఎనిమిది పుంజెములనూలు): చూ, వార. 1.

చీడుదబ్బ. దే. వి. నూలిచీడు తగిలించుటకు వెదురుబద్దలతో గుమ్మటమువలెఁ గట్టఁబడిన సాలెవాని పనిముట్టు: చూ, ఊడిత.

చీతలవ. దే. వి. ఒకానొకపిట్ట: చూ, పక్షి.

చీన. సం. వి. అ. స్త్రీ. జెమ్మ*: చూ, శమి.

చీనక. సం. వి. అ. స్త్రీ. ముప్పదియంగుళముల పొడవుగల జింక: చూ, హరిణము. 1.

చీనకము. సం. వి. అ. పుం. కాకకంగువు అను వడ్లు: చూ, ధాన్యము.

చీనము. సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1; పుం. 2. రూ-చీని. ముప్పదియంగుళముల పొడవుగలిగి గువ్వవన్నెగలిగిన జింక: చూ, హరిణము 1; 3. చూ, చీనకము; 4. నూలు, దారము (అని కొందఱు): చూ, పోఁగు. 1; 5. పట్టుబట్ట (ఇదె చీనాంబరము): చూ, వస్త్రము; 6. గుఱ్ఱపు పల్లమునకు క్రిందవేసెడుమెత్త: చూ, మెత్త. 2; 7. జెండా: చూ, పిడము; 8. చీనాదేశము: చూ, దేశము; దే. వి. (1) రూ-చీనాము. అల్పదారుచ్ఛేది: చూ, రూ-సేనము.

చీనాపంచేదార. వా. వి. చీనాదేశపుపంచేదార. (ఇది మెత్తగ నుండును.)

చీనాము. దే. వి: చూ, రూ-చీనము. (1)

చీని. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-చీనము. 2.

చీనీకట్టు. వా. వి. మదుపుకట్టు: చూ, న్యాతి. 1.

చీపర. దే. వి: చూ, పిన్నగ్రద్ద.

చీపు. దే. వి. అరఁటిగెలయందలి యొకభాగము: చూ, పూగుత్తి. [చంబుకము.

చీబుకము. సం. వి. అ. న. గడ్డము: చూ, రూ-చీబూకము. సం. వి. అ. న —వై.—

చీమ. దే. వి: చూ, పిపీలిక. [స్వరము. 2.

చీమచిటుకు. దే. వి. ఇంచుకంతచప్పుడు: చూ,

చీమిడి. వై. వి.=శింఘాణ: చూ, చీఁదు. 1. (దేశ్యమని శబ్దరత్నాకరము.)

చీము. దే. వి. చెడి తెల్లనైన నెత్తురు, పూయము: చూ, రక్తము 1. [పాత్రము 6.

చీముంత. దే. వి. చెంబు, తంబుగ, సగ్గడు: చూ,

చీముపట్టు. దే. అ. క్రి: చూ, ఎడకట్టు. 1.

చీర. సం. వి. అ. స్త్రీ. 1.=చీర-చేల. స్త్రీకట్టుకోక: చూ, చీర (1), చూ, వస్త్రము; వై. వి. (1).=చీర-చేల. (పురు-క) స్త్రీకట్టుకోక. రూ-చీరె: చూ, చీర. 1: చూ, వస్త్రము. (ఇది సువాసినులు కట్టుకొనెడి చీరెయందు వాడుక.) (శ. ర)

చీరకము. సం. వి. అ. పుం. 1. అధికారపత్రము: చూ, లేఖ. 4; 2: చూ, మిగుత (తిరిగొండ శేషము) [చూ, వస్త్రము.

చీరఖండకము. సం. వి. అ. పుం. యతులకాటి:

చీరచింపు. ద్వ. వి. ఒకానొకచేఁప: చూ, మత్స్యము. 1. [రకువు.

చీరణము. దే. వి చిన్నయంలి: చూ, పత్రిప

చీరపిట్ట. వై. వి. రూ-చీరపేను-చీరపోతు. ధేనుకము (గుడ్డనంటుకొనియుండు తెల్లనిపేను): చూ, యూకము.

చీరపేను. ద్వ. వి —వై.—

చీరపోతు. ద్వ. వి.—వై.—

చీరము. సం. వి అ. న. 1. కౌపీనము: చూ, బొట్టము; 2. నారచీర: చూ, వస్త్రము; 3. వస్త్రవిశేషము: చూ, వస్త్రము; 4. గీటు: చూ, రేఖ. 3; 5. జిలుగుపాత్రత: చూ, పాత్రత; 6 నలువదిపూసలుగుచ్చిన సరము: చూ, భూషణము. 2; 7 సీసము: చూ, లోహము 1; 8. యతులకాసె: చూ, రూ-చీనము; 9. ఆవుచేన్ను: చూ, స్తనము; 10 బంగారము: చూ లోహము. 1; 11. కచోరము*: చూ, వద్గ్రంథ; పుం. 12. చీరమను చేఁప: చూ, మత్స్యము. 1.

చీరవట్టము. సం. వి. అ. న. సీసము: చూ, లోహము. 1.

చీరి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఈలపురుగు: చూ, రూ-చిరుక; 2. కచ్చోరము*: చూ, పద్గ్రంథ; దే. వి. (1) చీరికి. "ఉ. దారుణదైత్యసాయక వితాన విజృంభణమాత్మలోపలన్, జీరికిసైనఁ గైకొనక." పారి. ఉ. 4, అ. (షష్ఠ్యంతముగానే యిది ప్రయోగములందుఁ గానఁబడుచున్నది): చూ, లక్ష్యము.1. (శ.ర)

చీరిక. దే. వి. 1. చీలిక: చూ, శకలము. 4; 2. చింపిగుడ్డ. ఆం, భా. ద్వి. 157: చూ, వస్త్రము.

చీరికి. దే. వి: చూ, చీరి. (1)

చీరికిఁగొననిది. దే. వి. అకృతలక్ష్యము: చూ, పడ్డచేయనిది.

చీరు. దే. వి. 1. బియ్యపుసూక: చూ, నూక; స. క్రి. 2. రూ-చీఱు. చీలుచు: చూ, సెలగు; 3. పిలుచు: చూ, సంబోధించు.

చీరుక. సం. వి. అ. స్త్రీ. ఈలపురుగు: చూ, రూ-చిరుక.

చీరుడు. దే. వి. 1 చీల్చుట. రూ-చీఱుడు: చూ, విదారణము; 2. పిలుపు: చూ, సంబోధనము.

చీఱు. వై. వి.=చేల: చూ, రూ-చీర. (1), 1.

చీర్ణపర్ణము. సం. వి. అ. పుం. 1. ఖర్జూరము*: చూ, మధుఖర్జూరిక; 2. పిచుమందము *: చూ, వేము. (త్రికాండశేషము).

చీర్ణము. సం విణ. 1 పరిశీలనఁజేయఁబడినది: చూ, శీలితము; దే. వి. (1): చూ, రూ-చీరణము.

చీఱు. దే. స క్రి. 1. గీఱు: చూ, ఱక్కు; 2: చూ. రూ-చీరు. 2.

చీఱుడు. దే. వి: చూ. రూ-చీరుడు. 1.

చీల. వై. వి.=శల్య. కీలము, మేకు: చూ, కూలము; 2. చాయమేకు: చూ, బండికన్ను. (దేశ్యమని శబ్దరత్నాకరము.)

చీలమండ. దే. వి: చూ, రూ-సీలమండ.

చీలి. దే. వి. పిల్లి: చూ, మార్జాలము.

చీలిక. దే. వి. పాయ. బ్రద్ద: చూ, శకలము.4.

చీలు. దే. అ క్రి. విదారితమగు: చూ, విదారించు. [చూ, విదారించు.

చీలుచు. దే. ప్రే. చీలఁజేయు. రూ-చీల్చు:

చీల్చు. దే. ప్రే. —వై.— [రణము. 1.

చీల్చుట. దే. వి. బ్రద్దలుచేయుట: చూ, విదా

చీవము. సం వి. అ. న. రూ-చీవరము-చీరము-చివరము. యతులకాసె: చూ, వస్త్రము.

చీవరము. సం. వి. అ. న. —వై.—

చీవరి. సం. వి. న్. పుం. బౌద్ధభిక్షుఁడు: చూ, బుద్ధుఁడు. 1.

చీవాట్లమారి. దే. వి. నిందితుఁడు: చూ, రోఁతలమారి. [శబ్దము. 2.

చీవాట్లు. దే. వి. బ గద్దింపుమాటలు: చూ,

## చు

చుంచురము. సం. వి. అ. పుం. ఎలుకజీడి*: చూ, భల్లాతకి. [వ్యవహారము. 4.

చుంచురి. సం. వి. ఈ. స్త్రీ. ద్యూతము: చూ,

చుంచులిక. సం. వి. ఇ. స్త్రీ. చింతగింజలచే జూదమాడుట: చూ, వ్యవహారము. 4.

చుంచువు. సం. వి. ఉ. పుం: చూ, చుంచరము *.

చుంట. సం. వి. ఆ. స్త్రీ: చూ, నుయ్యి.

చుంటి. సం. వి. ఈ. స్త్రీ. —పై.—

చుందరి. సం. వి. ఈ. స్త్రీ. కుట్టని: చూ, శంభళి.

చుంబకము. సం. వి. అ. పుం. 1. త్రాసు ముల్లు: చూ, సితాగ్రము; 2. సూదంటు రాయి. (ఇందుకు సంబంధించిన శాస్త్రపరిభాషాపదములు.— కృత్రిమలోహ చుంబకము, చుంబకము, చుంబకములోని దక్షిణోత్తరాభిముఖత, చుంబకీయ, చుంబకాకర్షణ, చుంబకమాల, చుంబకవక్రము, అయస్కాంతక్షీణత, చుంబకీయసూచీపతనము, చుంబకీయమూలతత్త్వములు, చుంబకవిషువవృత్తము, చుంబకబలక్షేత్రము, చుంబకద్రవము, చుంబకప్రవర్తన, చుంబకభూమధ్యవృత్తము, చుంబకపుసూది, చుంబకధ్రువములు, చుంబకీయసంపృక్తత, చుంబకవియోగము, స్కాంతము, స్కాంతీకరణము, స్కాంతాయితము, లోహచుంబకత్వము, విద్యుజ్జనక చుంబకయంత్రము, (బింబ) విస్తరణశక్తి, కోలతపరిమాణము.) ఇత్యాది.

చుంబకుఁడు. సం. వి. అ. పుం. 1. పెక్కుగ్రంథములయందు ఇంచుకించుక చదివినవాఁడు, అనేకమంది గురువులుగలవాఁడు (అని కొందఱు); 2. ముద్దుపెట్టుకొనువాఁడు, విటుఁడు (అని కొందఱు): చూ, విటుఁడు; 3. మోసకాఁడు: చూ, వంచకుఁడు.1; 4. ధూర్తుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 5. కాముకుఁడు: చూ, వలపుకాఁడు.

చుంబనము. సం. వి. అ. న. 1: చూ, ముద్దు. 3; అం. 2. ముఖరతులు నాలుగింటిలో నొకటి: చూ, ముఖరతులు; 3. ప్రధానమగు కళలు ఎనిమిదింటిలో చుంబనమను కళయొకటి: చూ, కళలు. 3.

చుంబనములు. అం. 1. నిమిత్తము, స్ఫుటితము, భ్రాంతము, తిర్యగము, ప్రథితము, అధరకము, ఉత్తరస్ఫ (స్ఫు) టితము, సంపుటము, అనుపదము, అన్వితము. (10); 2. సమితములు, స్ఫురితము, ఘటితము, భ్రాంతము, తిర్యగము, పీడితము, విఘటితము, అధరచుంబనము, ఉత్తమము, సంపుటము, అనదరనము, అన్వర్థము, ప్రాతిబోధకము, ఛాయికము, క్రాంతికము. (15).

చుంబనస్థానములు. అం. అధరము, కుచములు, కంఠము, చెక్కులు, నాసికము, లలాటము, చంకలు, భగము, నాభి (9).

చుంబి. అం. వేశ్యావశ్యపాంగములు నాలుగింటిలో నొకటి. (చూ, అంగము. 9): చూ, వేశ్యావశ్యపాంగములు.

చుంబించు. సం. స. క్రి: చూ, ముద్దుపెట్టుకొను.

చుకము. సం. వి. అ. పుం. 1. ఒడలు: చూ, శరీరము; 2. చింతపండు కలిపిన నీళ్లు: చూ, సలిలము.

చుకుఁడు. సం. వి. అ. పుం. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

చుక్కారము. సం. వి. అ. పుం. సింహనాదము: చూ, స్వరము. 2.

చుక్క. సం. వి. ఆ. స్త్రీ. చుక్ర *: చూ, పులిచింత.

చుక్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. —పై.—; 2. చింతపండు: చూ, వృక్షామ్లము; 3. చింత *: చూ, తింత్రిణి.

చుక్రము. సం. వి. అ. న. 1. చింతపండు: చూ, వృక్షామ్లము; పుం. 2. పులుసు: చూ, పుల్లన. 1; 3. పుల్లప్రబ్బలి*: చూ, ప్రబ్బలి; 4. చింత*: చూ, తింత్రిణి.

చుక్రామ్లము. సం. వి. అ. న. చింతపండు: చూ, వృక్షామ్లము.

చుక్రిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-
చుక్కిక. [త్రిణి.
చుక్ల. సం. వి. ఆ. స్త్రీ. చింతచె: చూ, తిం
చుక్లము. సం వి. అ. న. చింతపండు: చూ,
వృక్షామ్లము.
చుచుందరి. సం. వి. ఈ. స్త్రీ.=చుంచు: చూ,
రూ-చుందరి. [కము.
చుచుకము. సం. వి. అ. న. చూ, రూ-చూచు
చుచువు సం. వి. ఉ. పుం. నీరుచెంచలి: చూ,
సునిషణ్ణకము. [చుచుకము.
చుచూకము. సం. వి. అ. న: చూ, రూ-
చుతము. సం. వి. అ. పుం. గుదద్వారము:
చూ, ముడ్డి.
చుని. పా: చూ, కపూరియె బ్రాహ్మణులు.
(చూ, బ్రాహ్మణులు.)
చుబుకమచ్ఛము. సం. వి. అ. పుం. గోడాలు
లక్షణము: చూ. లక్షణము. 1. [కము.
చుబుకము. సం. వి. అ. న: చూ, రూ-చంబు
చుబుకావర్తము. సం. వి. అ. పుం. శ్రీశుభ
లక్షణము: చూ, లక్షణము. 1.
చుర. సం. వి. ఆ. స్త్రీ. చౌర్యము: చూ,
మ్రుచ్చిలి. [నిపానము.
చురి. సం. వి. ఈ. స్త్రీ. నూతివద్దగాడి: చూ,
చుర్దంశము. సం. వి. అ. పుం. నల్లి: చూ,
మత్కుణము. [బురద.
చులకము. సం. వి. అ. న. గొప్పబురద: చూ,
చులుంప. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుమేఁక: చూ,
మేషము. 1.
చులుంపి. సం. వి. ఈ. స్త్రీ. ఉత్పలమత్స్యము:
చూ, మత్స్యము. 1. [మత్స్యము. 1.
చులుక. సం. వి. ఆ. స్త్రీ. మొసలి: చూ,
చులుకము. సం. వి. అ. పుం. 1. చేర: చూ,
ప్రసృతి. 1; 2: చూ, పుడిసిలి; 3. ముంత:
చూ, భాండము. 3; 4: చూ, చిఱుతపులి.

చులుకి. సం. వి. న్. పుం. శింశుమారాకృతిగల
చేఁప: చూ, మత్స్యము. 1. [చులుకము.
చులూకము. సం. వి. అ. పుం: చూ, రూ-
చుల్లకి. సం. వి. ఈ. స్త్రీ. 1. పిసుక మొసలి.
హంస. 4, అ. 11: చూ, మత్స్యము 1;
2. ఒకరకము పాత్రము: చూ, పాత్రము. 6;
3. ఒకానొక కులము: చూ, వంగడము.
చుల్లము. సం. వి. అ. పుం. 1. చీపరపిట్టు: చూ,
పిన్నగ్రద్ద; విణ. 2: చూ, రూ-చిల్లము. శ.
చుల్లి. సం. వి. ఈ స్త్రీ. 1: చూ, ప్రొయ్యి;
2. సొద: చూ, శ్మశానము; 3. ఒకరకము
వాద్యము: చూ, వీణె.
చుల్లుఁడు. సం.వి.అ. పుం: చూ, రూ-చిల్లుఁడు.
చువ్రము. సం.వి.అ.న. నోరు: చూ, వదనము. 2.

## చూ

చూచికము. సం. వి. అ. పుం, న. తుడుము
వాద్యము: చూ, వీణె. [వు: చూ, స్తనము
చూచుకము. సం. వి. అ. పుం, న. రూ-చూచు
చూచుకములు. అం. (చేను మొనలు) పురుషలక్ష
ణాంగములు ఏఁబదియెనిమిదింటిలో నొకటి:
చూ, లక్షణాంగములు. [కము.
చూచువు. సం. వి. ఉ. పుం: చూ,రూ- చూచు
చూడ. సం. వి. ఆ. స్త్రీ. 1. రూ-చూడము.
నెమలిజుట్టు: చూ, శిక. 1; 2.=జుట్టు.రూ-
చూడము. శిగ: చూ, శిక. 1; 3.=చూరు.
ముంజూరు: చూ, సదనము. 1; 4. దండకడి
యము: చూ, భూషణము. 2; 5. కూపము:
చూ, నుయ్యి. [నుయ్యి.
చూడకము. సం. వి. అ. పుం. కూపము: చూ,
చూడము. సం.వి.అ.పుం: చూ, రూ-చూడ. 1.
చూడాకర్మ. సం. వి. న్. న: చూ, కేశఖండ
నము.

చూడామణి. సం. వి. ఇ. పుం. 1. అలంకారార్థము తలయందుంచుకొనెడు రత్నము, తలమానికము: చూ, రత్నము. 1; 2. గురిగింజ: చూ, శిలాపాకి.

చూడాల. సం. వి. అ. స్త్రీ. వటుత్రికముస్తె*: చూ, తృణము. 1.

చూడాలము. సం. విణ. జుట్టుగలది

చూడాలుఁడు. సం. విణ. జుట్టుగలవాఁడు.

చూతకము. సం. వి. అ. పుం. 1. ఓడకొయ్య: చూ, స్తంభము. 1; 2: చూ, మామిడి*; 3. కూపము: చూ, నుయ్యి.

చూతఫలరసాయనము. అం. రసాయనములలో నొకటి: చూ, రసాయనములు.

చూతము. సం. వి. అ. పుం. 1: చూ, మామిడి*; అం. 2. మన్మథబాణము లయిదింటిలో నొకటి. సమ్మోహనము): చూ, మన్మథబాణములు (ఇది మన్మథుని యైదుబాణములలో స్తంభనావస్థను జేయు బాణము.)

చూతాసవము. అం. ఆసవములలో నొకటి: చూ, ఆసవములు.

చూత్కృతము. సం. వి. అ. న. బాహ్యారతియందుఁ గొట్టుటవలనఁ బుట్టినధ్వని: చూ, స్వరము. 2.

చూబుకము. సం. వి. అ. న: చూ, రూ-చుబుకము.

చూర్ణకము. సం. వి. అ. పుం. 1. పేలపిండి, సక్తువు, సత్తుపిండి: చూ, సాదము (1); 2. గద్యవిశేషము (చూ, వృత్తము. 1.) (గుణపాదరహితకవిత్వము): చూ, మాటలల్లుట.

చూర్ణకుంతలము. సం. వి. అ. పుం. నెతికురులు: చూ, వెండ్రుక. 1.

చూర్ణపారదము. సం. వి. అ. పుం. ఇంగిలీకము: చూ, హింగుళము.

చూర్ణము. సం. వి. అ. న. 1. =సున్ని. గంధపొడి, వాసయోగము: చూ, సురుము; పుం. న. 2. = సున్నము: చూ, సున్నము; పుం. 3. =సున్ని. దుమ్ము, మొరముతోఁ గూడిన ధూళి: చూ, రేణువు. 1; 4. =చూరు. తుఱుము, పొడి. నూఱినపొడి: చూ, సురుము.

చూర్ణములు. అం. పంచాగ్ని, చిత్రకాది, బడబానల, మాణిమండ, ఉరీచ్యాది, తాలిస, ఏలాది, తుంబురుగ్వాది, కర్పూరాది, పంచబాణ, భుగ్వాది, ఐపత్య, నాగరాది.

చూర్ణి. సం. వి. ఇ. స్త్రీ. 1. పాతంజలివ్యాకరణము: చూ, వ్యాకరణములు; 2. మహాభాష్యము (చూర్ణిక): చూ, పుస్తకము; 3: చూ, చూర్ణకము. 2.

చూర్ణిక. సం. వి. అ. స్త్రీ. 1. గద్యభేదము: చూ, చూర్ణకము. 2; 2. గ్రంథభేదము (చూర్ణి=భాష్యము అని అమరము): చూ, పుస్తకము.

చూర్ణఖండము. సం. వి. అ. న. కర్కరము, సన్నముగానగుతాయి: చూ, రాయి.

చూర్ణనము. సం. వి. అ. న: చూ, నూఱుట.

చూర్ణికృత్తు. సం. వి. త్. పుం. పతంజలి: చూ, ముని. 1.

చూలిక. సం. వి. అ. స్త్రీ. 1. పిల్లజుట్టు: చూ, శిఖ. 4; 2. ఏనుఁగుచెవిమొదలు (అంకుశము చేత ప్రేరేపింపఁబడునది): చూ, హస్తి; 3. నాటకాంగము: చూ, నాటకము. 1.

చూల్లి. సం. వి. ఈ. స్త్రీ: చూ, చుల్లి. 1.

చూష. సం. వి. అ. స్త్రీ. ఏనుఁగు నడుమునఁ గట్టెడు తోలుమోకు: చూ, సూత్రము. 1.

చూషకము. సం. వి. అ. పుం. 1. నరిగాలి: చూ, వాయువు; అం. 2. వాయువులు తొమ్మిదింటిలో నొకటి: చూ, వాయువు.

చూషణము. సం. వి. అ. న. పీల్చుట.

చూళిక. అం. 1. వ్యాకరణములు తొమ్మిదింటిలో నొకటి: చూ, వ్యాకరణములు; పా. 2.

తెరలోనుండి చేయుపరిసంగము: చూ, నూత్న్యము.

చూళికాపైశాచి. అం. ప్రాకృతభాషాభేదములాఱింటిలో నొకటి: చూ, ప్రాకృతభాషాభేదములు. [చూ, భాషలు.

చూళికోక్తి. అం. భాష లెనిమిదింటిలోనొకటి:

# చె

చె. దే. విణ. వృత్తియందు చెన్ను శబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (దీనికి పరుషముపరమగునపుడు సమాగమము. ఉదా.- చెంగావి మొ.)

చెంక. వై. వి.=శంఖ. చెంప: చూ, లెంప. 2. (శేఖ్యమని శబ్దరత్నాకరము.)

చెంగఁగొట్టు: దే. అ. క్రి. (చెంగన్ + గొట్టు) ఓడించు: చూ, వెనుదీయు. 1.

చెంగట. దే. వి: చూ, సమీపము. 1.

చెంగనలు. దే. వి, బ. రూ-చెంగనాలు. 1.నతి: చూ, నమస్కారము; 2: చూ, బాలక్రీడ; 3. అపజయము: చూ, పరాజయము; 4. లంఘనము: చూ, లంఘు.

చెంగనాలు. దే. వి. బ. —పై.—

చెంగలి. దే. వి. 1. రక్తతృణము*: చూ, తృణము. 1; విణ. 2: చూ, సమీపము. 1.

చెంగలించు. దే. అ. క్రి. 1. అతిశయించు: చూ, ముమ్మరించు; 2: చూ, విజృంభించు; జై. 7, ఆ. 158; 3. దగదగమను: చూ, ప్రకాశించు. 1; 4. హసించు. కళా. 6, ఆ. 198: చూ, వెక్కిరించు. 3.

చెంగలింపు. దే. వి. చెంగలించుట. [కోష్ఠు*.

చెంగలికోష్టు. వై. వి: చూ, రూ-చెంగల్వ

చెంగలువ. ద్వ. వి. (చెన్ను + కలువ) 1. రూ-చెంగల్వ. ఎఱ్ఱకలువ, హల్లకము*: చూ, పద్మము. 1; 2. ప్రియముచే శుక్రకీయఁబడిన పేరు: చూ, సివఁగి. 2.

చెంగలువవెచ్చెలి. ద్వ. వి. చంద్రుఁడు. అం, భా. ప్ర. 117: చూ, హిమాంశువు.

చెంగల్వకోష్టు. వై. వి. రూ- చెంగలికోష్టు*: చూ, పారిభాష్యము. [చూ, ఆసవములు.

చెంగల్వాసవము. అం. ఆసవములలో నొకటి:

చెంగావి. దే. వి. (చెన్ను + కావి) ఎఱ్ఱదాళువర్ణము: చూ, వర్ణము. 6.

చెంగు. దే. వి. 1. వాద్యవిశేషము: చూ,వీణె; 2. చెఱఁగు: చూ, మెఱుఁగు; 3. వెనుకకుఁ జెక్కుకొనెడి దోవతికొంగు. అం, భా. ద్వి. 158: చూ, వలి. 2; అ. క్రి. 4. భేదమగు. అం, భా. తృ. 85: చూ, వేఱుపడు; 5. తొలఁగు: చూ, విరియు. 5; 6 చూ, వెనుదీయు. 1. జై. 1, ఆ. 79.

చెంచెడము. దే. వి: చూ, రూ-చెంచేడము.

చెంచెత. వై. వి. శబరకాంత: చూ, స్త్రీ.

చెంచేడము. దే. వి. రూ-చెంచెడము. ఒకానొక డేగ: చూ, శ్యేనము.

చెంచేలి. దే. వి. చెంచేలికూర, కుణుంజము *: చూ, వనవాస్తుకము.

చెంచు. వై. వి. 1.=మందరి. గంధమూషికము. ఆంధ్ర. ప. 5-24: చూ, మూషికము; 2.=చంచః. శబరుఁడు: చూ, వ్యాధుఁడు.1.

చెంచువాఁడు. ద్వ. వి. శబరుఁడు: చూ, వ్యాధుఁడు. 1.

చెండాడు. దే. స. క్రి. (చెండి + ఆడు) ఖండించు: చూ, సెలగు.

చెండి. వై.వి.=చండికా. గౌరి: చూ, పార్వతి.1.

చెండు. దే. వి. 1. కందుకము: చూ, బంతి. 3; 2. పూలబంతి: చూ, పూబంతి; 3: చూ, బాలక్రీడ; స. క్రి. 4. ఖండించు: చూ, సెలగు.

చెండుదానిమ్మ. ద్వ. వి. కాయలులేక పూవులు మాత్రము చెండువలెఁ బూచెడి యొకరకము దానిమ్మ *: చూ, దానిమ్మ. (నోటివెంట కారెడు రక్తము కట్టును.)

చెండుబెండాడు. దే. స. క్రి.(చెండుబెండు + ఆడు) ఖండించు. రాధు. 8, ఆ. 72: చూ, సెలగు.

చెండుబెండాడుట. బా. ఖండించుట, బంతితో, బెండుతోనాడుట. "ఉ. ఈడితశక్తినంగ జగతీశ్వరు సైనికులట్లు చెండ్లుబెండాడఁగ," కళా. 8. ఆ. 58.

చెంత. దే. వి. చేరువ: చూ, సమీపము. 1.

చెందమ్మి. దే. వి. (చెన్ను + తమ్మి) ఎఱ్ఱతామర, కోకనదము: చూ, పద

చెందామర. దే. వి. (చెన్ను తామర) —పై.—

చెందిరము. వై. వి. 1.=సిందూరము. రూ-చెంద్రము-చెందిరిక-చెంద్రిము-చెంద్రిమము-చేంద్రము-చేందురము: చూ, సిందూరము. 1; 2. అగ్నిశిఖము: చూ, వహ్నిశిఖము. 1.

చెందిరిక. దే. వి. రూ-చెంద్రిక. 1. కమ్మపెదుద్దు. స్వా.5. ఆ 58: చూ, భూషణము.2; వై. వి. 2.=సిందూరమ్. కుసుంభపుష్పము: చూ, వహ్నిశిఖము. 2; 3. కుసుంభవర్ణము. వసు. 5, ఆ. 81: చూ, వర్ణము. 6.

చెందు. దే. స. క్రి. 1. పొందు: చూ, ప్రాపించు; అ. క్రి. 2. కలుగు: చూ, పుట్టు. 2.

చెందుప్పు. ద్వ. వి.=సింధు. (చెందు + ఉప్పు) ఇందుప్పు, సైంధవము: చూ, లవణము. 1.

చెందొగ. దే. వి. (చెన్ను + తొవ) ఎఱ్ఱగలువ, హల్లకము. రూ-చెందొవ: చూ, పద్మము. 1.

చెందొవ. దే. వి. —పై.—

చెంద్రము. వై. వి.=సిందూరమ్: చూ, రూ-చెందిరము. (వృత్తియం దంత్యవర్ణ లోపము. చెంద్రకావి చూ.)

చెంద్రవంకలు. వై. వి. బ. = చంద్రవక్ర చెంద్రవంకలను వడ్లు: చూ, ధాన్యము.

చెంద్రిక: చూ, రూ-చెందిరిక.(కమ్మపెదుద్దు.—విజ. 3, అ. 142; కుసుంభపుష్పము.—వసు. 6, ఆ. 74; కుసుంభవర్ణము.—స్వా.5, ఆ. 68.)

చెంద్రిమ. వై. వి.=సిందూరమ్: చూ, రూ-[చెందిరము.

చెంద్రిమము. వై. వి.= —పై.—

చెంప. దే. వి. రూ-చెరఁప. కపోలము: చూ, చెంప. 2; 2. చెంప: చూ, పార్శ్వము. 2.

చెంపకట్లీ. దే. వి. స్త్రీభూషావిశేషము: చూ, భూషణము. 2.

చెంపకాయ. దే. వి: చూ, చెంపకాయ.

చెంపకొప్పు. దే. వి. ప్రక్కకొఱిగించివేసిన కొప్పు: చూ, వేనలి.

చెంపదెబ్బ. దే. వి: చూ, చెంపకాయ.

చెంపసరులు. ద్వ. వి. బ, స్త్రీకర్ణభూషావిశేషము: చూ, భూషణము. 2.

చెంబట్టిక. వా. వి. ఏరుగడము. "శిశువు ఉయ్యాలలో చెంబట్టిక వెళ్లినాఁడు.": చూ, మలము. 1. (గోదావరి, విశాఖమండల ప్రాంతములలో వాడుక.)

చెంబట్టికి. వా. వి. —పై.— "చెంబట్టికి తీయుము." [సరఁగు.

చెంబడివాఁడు. వా. వి. నావికుఁడు: చూ,

చెంబు. వై.వి.=శుల్బ. రాగి మొదలైనవానితోఁ జేసిన చిన్ననోరుగల చిన్న పాత్రము: చూ, పాత్రము. 6.

చెంబుతల. ద్వ. వి. బట్టగట్టినతల: చూ, బట్టతల

చెకచెకలాడు. దే. స. క్రి. సంతోషముతో చెలరేఁగు.

**చెకడా.** వై. వి.=శకట. పరకులు తెచ్చెడి ఎండ్లబండి: చూ, శకటము. 1.

**చెకపికలాడు.** దే. స. క్రి. తొందరపెట్టు. సా. 1, ఆ. 74: చూ, బాధించు.

**చెకము.** దే. వి. వస్త్రము మొదటిబద్దె: చూ, వస్త్రి. 1.

**చెకముకి.** దే. వి. రూ-చెకుముకి. నిప్పుకలుగుటకై యొకరకము ఱాతితోఁ దాఁకించెడి యుక్కుతునుక: చూ, రాయి.

**చెకుముకి.** దే. వి. —వై.—

**చెకుముకిఱాయి.** దే. వి. —వై.—

**చెక్క.** వై. వి. 1. మ్రాను లోనగువాని పలుచని ఖండము: చూ, శకలము.4; 2.=త్వక్కు: చూ, తోలు. 1; 3. దారుభేదము: చూ, గడు; 4.=శకల. తునుక: చూ, శకలము. 4; 5. పూగభాగము: చూ, పోఁక; 6: చూ, చెక్కతాపి.

**చెక్కకొణుజు.** ద్వ.వి. పశువులమేని రక్తముఁ బీల్చెడి యొకరకము పిడుఁజు: చూ, బుడ్డపిడుఁదు.

**చెక్కకొణుదురు.** ద్వ. వి. —వై.—

**చెక్కచెట్టు.** ద్వ. వి. ఎఱ్ఱచాయవేయుట కుపయోగించెడు చెక్కగల యొకానొక చెట్టు: చూ, వృక్షము.

**చెక్కడము.** దే. వి. (రత్నములను) పొదుగుట, చెక్కు: చూ, చెరువు. 1.

**చెక్కతాపి.** వై. వి. బేలుదారిగోడ మొదలగువానిమీఁద పూసిన గాఱనుతాచి మట్టపఱచెడి పీఁటన పిడియమర్చిన గుండ్రనిదుప్పు జేసెడు చిన్నపలక: చెక్క-రూ-చెక్కు, తాపి-రూ-తాపీ.

**చెక్కపిడుఁజు.** ద్వ.వి: చూ, చెక్కకొణుజు.

**చెక్కి.** వై. వి. = శంఖ.రూ-చెక్కిలి-చెక్కు, కపోలము: చూ, లెంప. 2.

**చెక్కియము.** దే. వి. రూ-చెక్కెము. 1. ఎముకలలోని నెయ్యి: చూ, మూలగ; 2. మస్తిష్కము: చూ, మెదడు.

**చెక్కిలి.** వై. వి.=శంఖ: చూ, రూ-చెక్కి. (శక్యమని శబ్దరత్నాకరము) (దీనికి ఉపమానములు.—అద్దము, కర్పూరము, చంద్రశకలము.)

**చెక్కు.** దే. వి. 1: చూ, చెక్కతాపి; 2: చూ, చెక్కడము. రా. వి. 2, ఆ. 39; 3. గడ్డతోఁగూడిన మట్టిపెల్ల: చూ, భూమి. 1; 4. సొమ్ముతెచ్చుటకు ఆజ్ఞాపత్రిక: చూ, హుండీ; వై. వి. 5.=శంఖ: చూ, రూ-చెక్కిలి; దే. స. క్రి. 6. ఖచించు, (రత్నములను) పొదుగు: చూ, వారు. 1; 7. చెక్కలుచేయు (వై. అనికొందఱు)

**చెక్కుచెమర్చకుండుట.** జా. కనుగందకుండుట. "ఎలతుమ్మెదలు చెక్కుచెమరింపకున్న వా చిగురుఁబోఁడి" విజ.4, ఆ. 62; "జయాంగనా సంగమంబును బొసంగియుఁ జెక్కుచెమర్చక యక్కురు వీరుండు." విజ.3, ఆ. 160.

**చెక్కుచెమర్పు.** ద్వ. వి: చూ, శ్రమము. 1.

**చెక్కుటద్దము.** వై. వి. అద్దమువంటి కపోలము. వై. 6, ఆ, 108: చూ, లెంప. 2.

**చెక్కుడుపాలు.** ద్వ. వి: చూ, కోలుడుపాలు.

**చెక్కులు.** అం. 1. చుంబనస్థానములు తొమ్మిదింటిలో నొకటి: చూ, చుంబనస్థానములు; 2. కళాస్థానములు పదునాలింటిలో నొకటి: చూ, కళాస్థానములు.

**చెక్కెము.** దే. వి: చూ, రూ-చెక్కియము.

**చెచ్చెర.** దే. ద్రి. క్రి. విశ. 1. శీఘ్రముగ: చూ, వేగము. 3; 2: చూ, సులభము.

**చెట్ట.** వై. వి. 1.=చేష్టా. కీడు: చూ, హాని. 2; 2. చేయి: చూ, హస్తము; 3. ఆపద: చూ, విపత్తు;విశ. 4. దుష్టుఁడు:చూ,వ్యాధుఁడు.2.

**చెట్టపుమెకము.** ద్వ. వి. ఒక్తెడుపిల్లి. సాంబ. తిర్య. 12: చూ, మార్జాలము.

**చెట్టపట్టు.** దే. వి. (చెట్ట+పట్టు) 1. పెండ్లి: చూ, వివాహము; స. క్రి. 2: చూ, పెండ్లియాడు.

**చెట్టు.** దే. వి. 1: చూ, వృక్షము; 2. గుల్మము: చూ, పొద. 2; 3. ఓషధి: చూ, వృక్షము.

**చెట్టుఁగొట్టిపైవేసికొనుట.** జా. వ్యర్థముగా బాధ తెచ్చికొనుట.

**చెట్టుఁగట్టుట, చెట్లపాలుసేయుట.** జా. కష్టపెట్టుట. "సీ. అతనినే చెట్లఁగట్టితివిత్రఁ డేవోట లంకించుకొనియె నలంఘ్యమయిన". కళా. 3, అ. 254.

**చెట్టుఁదిమ్మరి.** దే. వి. (చెట్టు+తిమ్మరి) వృక్షచరము. అచ్చ. యు, కాం. 177: చూ, వానరము.

**చెట్టుగట్టు.** దే. అ. క్రి. (చెట్టు+కట్టు) చెట్టుగానేర్పడు.

**చెట్టుచెడుకాలమునకుఁ గుక్కమూతిపిందె.** లో. ఉదా.—"చెట్టుచెడుకాలమునకుఁ గుక్కమూతి పిందెయన్నట్లు చేటుకాలంబు కడు నికటంబైనవీనికీదుర్బుద్ధిపుట్టెఁగాఁబోలును." (నీతిచంద్రిక—విగ్రహము.)

**చెట్టునట్టు.** దే. వి: చూ, చెట్టుఁదిమ్మరి.

**చెట్టుప.** దే. వి. రూ—చేట్టుప: చూ, ఱెక్క. 1.

**చెట్టుపడు.** ద్వ. అ. క్రి: చూ, స్తంభించు.

**చెట్టుమొదలు.** ద్వ. వి. అంఘ్రినామము: చూ, వేరు. 1.

**చెట్టొక పిట్టయగుట.** జా. చెల్లాచెదరగుట. "సీ. తరుణినీసడలతో సరిరాక యంచేలుచెట్టొక పిట్టయై చెదరిపోవ." (కవిచకోరచంద్రోదయము); "ఉ. చెట్టొక పిట్టయై చనిరి సేనలవారలు." (శశిరేఖానాటకము.)

**చెట్లకట్టియ.** వై. వి.=శఠ. మూర్ఖుఁడు, కోపి: చూ, రూ—చిట్లకట్టియ (వైశ్యమని శ. ర.)

**చెట్లకట్టె.** వై. వి.=శఠ.—పై.—

**చెట్లకరివి.** దే. వి. దుష్టుఁడు: చూ, వ్యాధుఁడు. 2

**చెట్లజీవితకాలము.** పా. చెట్లు బ్రతికెడు కాలమునుబట్టి మూఁడు తరగతులు.— 1. ఏకవార్షికములు—గోధుమలు మొ; 2. ద్వివార్షికములు.—వెండలము మొ; 3. బహువార్షికములు.—చింత, మామిడి మొ.

**చెట్లపాలై గట్లపాలై.** జా. చెల్లాచెదరై. "వారు చెట్లపాలై గట్లపాలై పోవఁజొచ్చిరి." (ధర్మజరాజసూయము.)

**చెట్లయాహారము.** పా. చెట్లతిండి: చూ, ఆకు 2.

**చెడగరము.** దే. విశ. 1. క్రూరము: చూ, ఘోరము. 2; 2. క్రూరుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

**చెడనాడు.** దే. స. క్రి. (చెడన్+ఆడు) ఆడిపోసికొను: చూ, నిందించు.

**చెడనివాఁడు.** దే. వి. స్థిరుఁడు: చూ, సదాతనుఁడు.

**చెడావు.** వా. వి. అదనము, హెచ్చు.

**చెడిది.** దే. వి. 1. అశుభము: చూ, హాని. 2; 2. ఆపద: చూ, విపత్తు.

**చెడిప.** దే. వి. (చెడిన+అప) రూ—చెడిపె: చూ, అంకులాఁడి.

**చెడిపె.** దే. వి.—పై.—

**చెడ్డి.** వై. వి.=చండాతక. రూ—చెడ్డీ. చల్లడము: చూ, గుడిగి.

**చెడు.** దే. అ. క్రి. 1: చూ, నశించు; 2. కొల్లపోవు: చూ, పతిపోవు; 3. కనఁబడకపోవు; చూ, వమ్మైపోవు.

**చెడుకంపు.** దే. వి. పూతిగంధము: చూ, వాసన.

**చెడుగఁడు.** దే. వి. (చెడుగు+అఁడు) క్రూరుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

**చెడుగు.** దే. వి. 1. అశుభకార్యము: చూ, హాని. 2; 2. ధూర్తుఁడు, కుజనుఁడు: చూ, వ్యాధుఁడు. 2; విశ. 3. దుష్టురాలు, కుత్సితస్త్రీ

(అని కొందఱు): చూ, స్త్రీ; 4. క్రూరము: చూ, రౌరవము. 2.

చెదుగుడు. వా. వి: చూ, రూ-చిదుగుడు.

చెదుజోతి. వా. వి: చూ, అరుజోతి.

చెదుతలఁపు. దే. వి: చూ, దుర్గుణము.

చెదుందుమ్ము. దే. వి: చూ, కరజము. 4.

చెదుప్రత్తి. దే. వి: చూ, అడవిప్రత్తి*

చెడ్డ. వై. వి. 1.=చేష్టా. రూ-చెట్ట. కీడు: చూ, హాని. 2; 2. ఆపద: చూ, విపత్తు; విణ. 3: చూ, దుష్టము. "చెడ్డపని."

చెడ్డతొయ్యాలి. ద్వ.వి. కులట: చూ, ఱంకులాఁడి.

చెడ్డపని. ద్వ. వి. కానిపని: చూ, వ్యళీకము. 2.

చెడ్డమాట. ద్వ. వి. చెడ్డపలుకు: చూ. శబ్దము. 2.

చెడ్డయిల్లు. ద్వ.వి. కారాగారము: చూ, సదనము.1.

చెడ్డి. దే. వి: చూ, రూ-చెడీ.

చెడ్డు. దే. స. క్రి. తొడచేఱచు.

చెణగగము. దే. వి: చూ, వ్యాధుఁడు. 2.

చెణుకు. దే. వి. అల్పము: చూ, స్వల్పము.

చెతురు. వై. వి. = చాతుర్యమ్: చూ, సామర్థ్యము. 1.

చెత్త. దే. వి. 1. తుక్కు: చూ, పెంట. 1; 2. గడ్డి: చూ, తృణము. 1.

చెద. వై. వి. పుట్టపెట్టు చీము, శిథిలి. తెల్లని చీమలగుంపు (అనికొందఱు): చూ, పిపీలిక. (రూ-చెదలు.)

చెదపురుగు. ద్వ. వి.—వై.—

చెదరఁబడు. ద్వ. అ. క్రి. (చెదరన్ + పడు) నీటిబొట్టులోనగునవి యెగిరిపడు: చూ, వెల్లివిరియు.

చెదరు. దే. వి. 1. చెదరుట, నీటిబొట్టు లోనగునవి యెగిరిపడుట; 2. కలఁత: చూ, సంతాపము; అ. క్రి. 3: చూ, చెదరఁబడు; 4: చూ, ఆకులపడు.

చెదలు. వై. వి.=శిథిలీ: చూ, రూ-చెద.

చెదపట్టు. ద్వ. అ. క్రి. (చెదలు + పట్టు) చెదలు పట్టు.

చెదారము. దే. వి. 1. తృణలేశము: చూ, పెంట. 1; 2. గడ్డి: చూ, తృణము. 1.

చెనఁగి. దే. వి. రూ- చెన్నంగి- చెన్నఁగి. 1. పొట్టి టెంకాయచెట్టు, అఖండుకము*: చూ, నారికేళము; బ. 2. ధాన్యవిశేషము. హంస. 4, ఆ 128: చూ, ధాన్యము.

చెనఁటి. దే. విణ: రూ-చెన్నఁటి. 1. కుజనుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 2. కుత్సితము: చూ, హీనము. 1; 3. వమ్ము: చూ, వ్యర్థము; 4: చూ, శూన్యము. 1; 5. అల్పము: చూ, స్వల్పము.

చెనకు. దే. వి. 1. ఎదిరించుట, తలపాటు: చూ, లూటీ. 4; 2. తాఁకుట. పాండు. 3, ఆ 27: చూ, స్పర్శము. 1; 3. (గోటి) నొక్కు: చూ, నఖక్షతము; స.క్రి. 4. ఎదిరించు: చూ, ప్రతిఘటించు; 5 తాఁకు: చూ, స్పృశించు.

చెనయు. దే. స. క్రి. 1. ఎదిరించు: చూ, ప్రతిఘటించు; 2. తాఁకు: చూ, స్పృశించు; 3: చూ, సోలు.

చెనుపరి. దే. విణ. గ్రామ్యము(మాట): చూ, శబ్దము 2.

చెన్నంగి. దే. వి: చూ, రూ-చెనఁగి.

చెన్నఁగి. దే. వి.—వై.—

చెన్నఁటి. దే. విణ: చూ, రూ-చెనఁటి.

చెన్నఁటిపోవు. దే. అ. క్రి. (చెన్నఁటి + పోవు): చూ, వ్యర్థమగు.

చెన్నచెల్గ. దే. వి. తరిగొఱ్ఱ*: చూ, హాలిని; 2. వెన్నవెదురుకూర*: చూ, హాలిని.

చెన్నవెఱుకు. దే. వి.—వై.—

చెన్ను. దే. వి. 1. కాంతి. ఆం, భా. ప్ర. 80: చూ, వెలుతురు. 1; 2. రీతి: చూ, విధము.1;

3. అందము. స్వా. 5, ఆ. 70, పంచ. వేం. 4, ఆ. 546: చూ, సౌందర్యము; 4 మంజులము. ఆంధ్ర, సం. మా. 52: చూ, హృద్యము.

చెన్నుఁడు. దే. విణ. అందగాఁడు: చూ, సౌందర్యవంతుఁడు.

చెప్పకచెప్పేడు. జా. ఒకరుచెప్పక తెలిసుకొనఁబడుట. "చ. ప్రియపుం, జిలుతితనంబు మీ మొగము చెప్పకచెప్పేడునద్దిరయ్య." స్వా. 1, ఆ. 73.

చెప్పు. దే. వి. 1: చూ, పాదుక; స. క్రి. 2. అను: చూ, వచించు. (దీనికిఁ బ్రార్థనాద్యర్థమునందు ద్విత్వము వికల్పముగ లోపించును. చెపుము, చెప్పుము లోనగునవి.)

చెప్పుట. దే. వి. అనుట: చూ, ప్రస్తావము. 2.

చెప్పుటట్ట. దే. వి: రూ-చెప్పుతట్ట: (సం. ప).—ఈక్షితప్రియము, ఉపసక్తము, కాంక్షితప్రియము, కాకాండము, గోధాపది. చర్మరము.*(పిచ్చికుక్క కాటువిషము హరించును.)

చెప్పుడుమాట. దే. వి. నిదేశము, ఒకరు చెప్పనట్టి మాట: చూ, శబ్దము. 2.

చెప్పుతట్ట. దే. వి: చూ, రూ-చెప్పుటట్ట*

చెప్పువాఁడు. దే. వి: చూ, వక్త. 1.

చెమట. వై. వి.=శ్రమ. రూ-చెమర-చెమరు-చెమ్మట: చూ, స్వేదము. 1. (దేశ్యమని శ.ర.)

చెమటకాయ. ద్వ. వి. ఎండవేఁడిమిచేత దేహము నందుఁగలిగెడు చిన్నగుల్ల: చూ, చెమరకాయ.

చెమటగొట్టు. దే. విణ. చెమట పట్టినవాఁడు: చెమరుఁబోతు.

చెమటపట్టు. దే. అ క్రి. ఆవిరిల్లు, చెమటపోయు, చెమరించు-రూ- చెమరుచు-చెమర్చు-చెమ్మరించు.

చెమటపోయు. దే. అ. క్రి.—పై.—

చెమటియావు. దే. వి. చిత్రగవము. రూ-చేమటియావు. ఆం. భా. ద్వి. 263: చూ, ధేనువు,

చెమర. వై. వి.=శ్రమ: చూ, రూ-చెమట.

చెమరకాయ. దే. వి: చూ, రూ-చెమటకాయ.

చెమరించు. దే. అ. క్రి: చూ, చెమటపట్టు. పా. 2, ఆ. 9.

చెమరు. వై. వి. 1.=శ్రమ: చూ, రూ-చెమర. పాండు. 5, ఆ. 201 (దేశ్యమని శబ్దరత్నాకరము); 2.=సింహలుండః*: చూ, చెముడు. 1; 3: చూ, రూ- చెమరుఁగాకి.

చెమరుఁగాకి. దే. వి రూ- చెమర్కాకి: చూ, వాయసము. 1.

చెమరుఁబోతు. దే. విణ: చూ, చెమటగొట్టు.

చెమరుచు. దే. అ. క్రి. రూ-చెమర్చు. 1: చూ, చెమటపట్టు; 2. చెమ్మగిల్లు: చూ, పదనుకొను.

చెమర్కాకి. దే. వి: చూ, రూ-చెమరుఁగాకి.

చెమర్చు. దే. అ. క్రి: చూ, రూ-చెమరుచు.

చెమికలు. దే. వి. బ. నేయునపుడు తెగిననూలు. అది కొను నూలుతునుకలు. (ఇక్కడవ్యుత్పత్త్యర్థం దేకవచనాంతము.)

చెముడు. వై. వి. 1.=సింహలుండః రూ-జెముడు*. (వాడుకయందు సరళాదిగా నుండినను ఇట్లు పరుషాదిగా కొన్నిప్రతుల యందుఁగలదు): చూ, స్నుహి. (దీని పాలు చర్మముమీఁద పొక్కును. కాడల రసము చెవిపోటు మాన్పును.); 2. రూ-చెవుడు-చెవుడుపాటు-చెవుడ్పాటు: చూ, బధిరితము.

చెముడుకాకి. వా. వి: చూ, చెమరుఁగాకి.

చెమురుకాకి. దే. వి. —పై.—

చెమ్మ. వై. వి. 1.=శింబి. తంబ, తమ్మ*: చూ, శింబి (దేశ్యమని శబ్దరత్నాకరము); దే. విణ. 2. తడి: చూ, పదను. 2.

చెమ్మగిల్లు. దే. అ. క్రి. రూ-చెమ్మయొలుకు-చెమరుచు-చెమర్చు, తడిగలదియగు: చూ, చెమరుచు. 2.

చెమ్మచెక్క. దే. వి: చూ, బాలికాక్రీడ.

చెమ్మటు. వై. వి.=శ్రీమః: చూ, రూ-చెమటు. (శేశ్య మని శబ్దరత్నాకరము.)

చెమ్మయుఱుకు. దే. అ.క్రి. (చెమ్మ + ఉఱుకు) చెమ్మగిల్లు. స్వా. 3, ఆ. 18: చూ, చెమరుచు. 2.

చెమ్మరించు. దే అ క్రి: చూ, రూ-చెమరించు.

చెయి. వై. వి.=కయ. రూ-చెయ్యి-చే-చేయి 1. కయి: చూ, హస్తము; 2. తొండము: చూ, శుండము; 3. రెండు మూరలకొలఁది: రూ-చెయ్యి-చే-చేయి.

చెయిదము. వై. వి.=చేష్టా. పని; కృత్యము. రూ- చెయిది- చెయ్దము- చెయ్ది- చెయువు- చెయ్వు. పా. 1, ఆ. 86: చూ, వ్యాపారము. 1. (బ. చెయువులు-చెయ్వులు-చెయువుఁరు = పనులు)

చెయిది. వై. వి. = —వై.—

చెయువు. వై. వి. = —వై.—కళా. 3, ఆ. 47.

చెయువులసాక్షి. వై. వి. కర్మసాక్షి. అచ్చ. యు, కాం. 278: చూ, సూర్యుఁడు.

చెయ్దము. వై. వి =: చూ, రూ-చెయిదము.

చెయ్ది. వై. వి. = —వై.—

చెయ్యి. వై. వి. = కయ: చూ, రూ- చెయి (తొండము.—అచ్చ. బాల, కాం. 194.)

చెయ్యిగల మెకము. దే. వి. ఏనుఁగు. సాంబ. తిర్య. 2: చూ, హస్తి.

చెయ్వు. వై. వి. =: చూ, రూ-చెయిదము.

చెరఁగు. వై. వి. రూ- చెఱఁగు; అంచు: చూ, మైజోలు.

చెరఁప. దే. వి: చూ, రూ-చెంప.

చెరచెర. దే. ద్రి, క్రి. విణ. 1. రూ-చెచ్చెర. శీఘ్రముగ: చూ, వేగము. 3; 2. కోపము: చూ, రోషము; 3. కోపవికారము: చూ, అవటవ (చూ, రోషము)

చెరపంజోటు. దే. వి. జాల్మఁడు: చూ, వ్యాధుఁడు. 2. (రూ-చెఱపనచేటు.)

చెరమ. దే. వి. రూ-చెఱమ. నాసాపుటము: చూ, ముంజెఱమ.

చెరలాటము. ద్వ. వి. చెరలాడుట. రాఘ. 2 ఆ. 6: చూ, విహారము. 1.

చెరలాడు. ద్వ. అ. క్రి. (చెరలు + అడు) 1: చూ, విహరించు; 2: చూ, వ్యాపించు; 3: చూ, సంచరించు.

చెరవ. వై. వి. = చరు. వంటకును, నీళ్లు కాఁచుటకును ఉపయుక్తమైన యిత్తడి పాత్రము. రూ-చెరవము-చెరివె-చెర్వము-చెర్వి: చూ, పాత్రము. 6.

చెరవము. వై. వి. = —వై.—

చెరి. దే. వి. 1. పడుగుసరిచేయుట, లప్పము వేయుటలోను శిల్పులపని (అనికొందఱు): చూ, లప్పము; అవ్య. 2. పరస్పరము, రూ-చెఱి: చూ, మిథము.

చెరికి. దే. విణ. ధూర్తుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

చెరివె. వై. వి. =: చూ, రూ- చెరవ.

చెరుగు. దే స. క్రి. బియ్యము లోనగువానిని జేటతో చెరుగు: చూ, కోడు. 1.

చెరుచు. దే. ప్రే: చూ, రూ- చెఱచు.

చెరువు. దే. వి. 1. చెక్కుటు: చెక్కడము చెక్కు; 2. తటాకము: చూ, సరస్సు. 1; స. క్రి. 3. చెక్కు, ఖచించు: చూ, వారు.1; 4. నాటు: చూ, మొలవేయు.

చెర్వము. వై. వి. =: చూ, చెరవ.

చెర్వి. వై. వి. =—వై.—

చెఱ. వై. వి. 1. =చారః. కారాగృహము: చూ, బంధనాలయము; 2. =చారః. నిర్బంధము: చూ, బలవంతము.

చెఱఁగు. వై. వి. 1. దిక్కు: చూ, హరిత్తు; 2. కొంగు: చూ, మైజాలు;

చెఱఁగుమాయు. ద్వ. అ. క్రి. బహిష్ఠయగు: చూ, సమర్తాడు.

చెఱకడము. దే. వి. గుడము: చూ, బెల్లము. 1.

చెఱకు. దే. వి. ఇక్షువు*: చూ, రసాలము. 3.

చెఱకుకడలి. దే. వి. ఇక్షూదము: చూ. సముద్రము.

చెఱకుగడ. దే. వి: చూ, అంగారిక. 2.

చెఱకుతోఁట. దే. వి. చూ, ఇక్షువణము.

చెఱకువిలుకాఁడు. దే. వి: చూ, మన్మథుఁడు. (రూ- చెఱకువిల్కాఁడు)

చెఱకువిల్లు. దే. వి మన్మథధనుస్సులలో మొదటి విల్లు. వేం. ఆం. 9: చూ, మన్మథబాణములు

చెఱఁగుమాసినది. వా. వి. ముట్టుత: చూ, రజస్వల.

చెఱఁగొను. ద్వ. స క్రి. చెఱపట్టు: చూ, వారించు.

చెఱచు. దే. ప్రే. 1. చెడఁజేయు రూ. చెరుచు, చెఱపు, చెఱుచు, చెఱుపు; 2. పోఁగొట్టు: రూ- చెరుచు, చెఱపు = చెరుపు (ఇట్లు కొరమధ్యముగా ప్రయోగముకొందఱి మతము). చూ, తొఱఁగు) [కోపమునమండు.

చెఱచెఱలాడు. దే. అ. క్రి (చెఱచెఱలు + ఆడు)

చెరపట్టు. దే. స. క్రి: చూ, చెఱఁగొను

చెఱపనచేటు. దే. విణ. 1: చూ, నాశకుఁడు. శై. 4, ఆ. 69; 2: చూ, నాశకురాలు. శై. 4, ఆ. 69; 3: చూ, రూ- చెరపంజోటు. ఆం, భా. తృ. వి. 6. [చూ, చెఱచు. 1-2.

చెఱపు. దే. వి. 1. కీడు: చూ, హాని. 2; ప్రే. 2:

చెఱపోవు. దే. అ. క్రి: చూ, వాలాయించు.

చెఱబడ్డవాఁడు. దే. విణ: చూ, బందెకాఁడు.

చెఱమ. దే. వి: చూ, రూ- చెరమ.

చెఱలాటు. దే. వి: చూ, విహారము. 1.

చెఱవడు. దే. అ. క్రి: చూ, చెఱపోవు.

చెఱసాల. వై. వి: చూ, బంధనాలయము.

చెఱి. దే. వి. 1: చూ, రూ- చెరి. 1; అవ్య. 2: చూ, రూ- చెరి. 2; 3. ఒక్కొక్కనికి: చెఱుక.

చెఱిసగము. పా. పరస్పరము సమభాగము.

చెఱుక. దే. అవ్య: చూ, చెఱి. 3.

చెఱుకు. వై. వి: చూ, రూ- చెఱకు

చెఱుకుపందెము. పా. పన్నిదములలోని భేదము: చూ, వ్యవహారము. 4

చెఱుచువాఁడు. దే. విణ: చూ, నాశకుఁడు.

చెఱుపరి. దే. విణ. (చెఱుపు + అరి) -పై.-

చెఱుపు. దే వి. 1. కీడు. భంగము (అని కొందఱు): చూ, హాని. 2; ప్రే. 2: చూ, చెఱచు.

చెఱుము. దే. స. క్రి: చూ, తాచు

చెఱువు. దే. వి. 1. తటాకము: చూ, సరస్సు. 1; 2. సత్రము: చూ, సదనము. 1.

చెలఁగు. దే. అ. క్రి. 1. ఒప్పు: చూ, సమ్మతించు; 2. అలరు చూ, వికసించు; 3 అంగవించు: చూ, యత్నించు; 4. ఉగ్గడించు: చూ, శబ్దించు; 5. బొబ్బరించు. శై. 7, ఆ. 32: చూ, వచించు: 6. అలరారు: చూ, ప్రకాశించు; 7: చూ, సంతోషించు.

చెలఁది. దే వి: చూ, చెలగము. కళా. 3. ఆ. 83. [చూ, సాలెగూఁడు.

చెలఁదితెర. ద్వ. వి. సాలెపురుగు చేసిన నేఁత:

చెలఁదిబల్లి. వై. వి: చూ, చెలగము. వేం. ఆం. 95.

చెలక. దే. వి రూ- చెలిక- చెల్క. 1. క్షేత్రము: చూ, భూమి. 1; 2. బీటినేల: చూ, భూమి. 1.

చెలగము. వై. వి. = శలక: చూ, సాలెపురుగు.

చెలగాటము. దే. వి: చూ, విహారము. 1.

చెలగు. దే. స. క్రి. ఖండించు: చూ, సెలగు.

చెలది. దే. వి. రూ- చెలిది- చెల్ది. 1. త్వగ్గత వ్యాధి: చూ, రోగము. 1; 2. మేహరోగము: చూ, రోగము. 1.

చెలము. దే. వి. ఎండిపోయిన యేఱు లోనగు

వానియందు నీటికొఱకు త్రవ్వెడు పల్లము: చూ, సరస్సు. 1.

చెలయు. దే. అ. క్రి. 1: చూ, విజృంభించు; స. క్రి. 2. రూ-చెలవు-చెలయు: చూ, విసరు. 8. [—పై.—

చెలరేఁగు. దే. అ. క్రి. (చెలగు + రేఁగు)

చెలవు దే. స. క్రి: చూ, చెలయు. 2.

చెలామణి. వా. వి. చెల్లుబడి.

చెలి. దే. వి. 1. ఆఁడుది: చూ, స్త్రీ: విణ. 2. రూ-చెలికత్తియ-చెలికత్తె-చెలిమికత్తియ-చెలిమికత్తె. సఖి: చూ, స్త్రీ: 3. రూ-చెలికాఁడు-చెలిమరి-చెలువుఁడు, హితుఁడు: చూ, స్నేహితుఁడు. 2; అం 4 రాజ్యాంగము లేడింటిలో నొకటి (సుహృత్తులు): చూ. రాజ్యాంగములు.

చెలిక. దే. వి: చూ, రూ-చెలక.

చెలికత్తియ. ద్వ. వి. రూ-చెలికత్తె. 1: చూ, రూ-చెలి. 2; అం. 2. దూతీచతుష్టయమునందలి మూఁడవదానిలోని పదునాలుగుటిలో నొకతె: చూ, దూతీచతుష్టయము. (స్వార్థమున క త్తియ-క త్తె)

చెలికత్తె. ద్వ. వి. —పై.—

చెలికవెలుఁగు. దే. వి: చూ, వెలమసంది *.

చెలికాఁడు దే. విణ: చూ, స్నేహితుఁడు. 2. (స్వార్థమున కాఁడు)

చెలికారము. దే. వి: చూ, స్నేహము. 1.

చెలికి దే. వి. పరిగ సేరిన పొలము: చూ, భూమి 1.

చెలిది. దే. వి: చూ, రూ-చెలది.

చెలిపి. దే. వి: చూ, లెంప. 2.

చెలిమరి. దే. విణ. (చెలిమి + అరి): చూ, స్నేహితుఁడు; 2. సఖి: చూ, చెలి. 2.

చెలిమి. దే. వి. రూ-చెలికారము-చెల్మి. ప్రేమము, మిత్రభావము (అని కొందఱు): చూ, స్నేహము. 1.

చెలిమికత్తియ. ద్వ. విణ: చూ, రూ-చెలికత్తియ. (ఇట్లు రూ-చెలిమికత్తె).

చెలిమికాఁడు. దే. విణ: చూ, చెలికాఁడు.

చెలిమిచుక్క. ద్వ. వి. అనూరాధానక్షత్రము, దోరణపుసాటిరిక్క: చూ, నక్షత్రము. 1.

చెలిమిడి. దే. వి: చూ, జలతండులీయము *.

చెలిమినిఁజేదు మేపింప వచ్చునుగాని బలిమిం బాలుద్రాగింప లేము. లో. ఉదా.-"చెలిమినైనఁ జేదుమేపింపవచ్చుంగాని బలిమినైనఁ బాలు ద్రావింపరాదు అను లోకోక్తి వినలేదా." (నీతిచంద్రిక-విగ్రహము.)

చెలియ. దే. వి 1. ఆఁడుది: చూ, స్త్రీ; 2. సఖి: చూ, స్త్రీ. [చూ, గోధుమ.

చెలియలికట్ట. దే వి. సముద్రపుగట్టు, వేల:

చెలియలు. దే. వి. రూ చెల్లియలు-చెల్లెలు-చెల్లె-చెలెలు. చిన్నసోదరి: చూ, సహోదరి.

చెలువ. దే. వి. (చెలువ + అ) రూ-చెల్వ. 1. అందముగల ఆఁడుది: చూ, స్త్రీ; 2. ఆఁడుది: చూ, స్త్రీ.

చెలువము. దే వి. 1. కాంతి: చూ, వెలుతురు. 1; 2 అందము: చూ, సౌందర్యము. (రూ-చెలువు-చెల్వు.)

చెలువు. దే. వి. —1-2. పై —; 3. రూ-చెల్వు. మంజులము. ఆంధ్ర, సం. మా. 52: చూ, హృద్యము.

చెలువుఁడు. దే. వి. 1. ధవుఁడు. అం, భా. ద్వి. 1'5: చూ, భర్త. 1; 2: చూ, విటుఁడు; 3. సుందరపురుషుఁడు: చూ, సౌందర్యవంతుఁడు; 4. ప్రియుఁడు. కళా. 1. అ 174: చూ, స్నేహితుఁడు. 1.

చెలో. వా. వి. బండితోలులు లోనగువానియందగు సనుకరణము: చూ, హూహూ.

చెల్క. దే. వి: చూ. రూ-చెలక.

చెల్గు. దే. స. క్రి: చూ, రూ-చెలఁగు.

చెల్ది. దే. వి: చూ. రూ-చెలది.

చెల్మి. దే. వి: చూ. రూ-చెలిమి.

చెల్ల. దే. ద్రి. ఖేదార్థకము, సంతాపమును దెలుపునది: చూ, సంతాపము.

చెల్లఁబో. దే. అవ్య. (చెల్లన్ + పో)—పై.—

చెల్లచెదరు. దే. విణ. (చెదరు + చెదరు) రూ-చెల్లాచెదరు. మిక్కిలి చెదరినది: చూ, యథాయథా.

చెల్లాచెదరు దే. విణ. —పై.—

చెల్లించు. దే. స. క్రి. ఓడించు; ఆం, భా. తృ. 124: చూ, జయించు.

చెల్లియ. దే. వి: చూ, రూ-చెలియలు-చెల్లెలు.

చెల్లియలు. దే. వి. —పై.—

చెల్లు. దే. వి. 1. బాకీదారు యిచ్చిన సొమ్మును తన బాకీపత్రము వెనుక త్రోయు వ్రాయు జమ: చూ, వసూలు: విణ. 2 చెల్లినది. "చెల్లురూపాయిలు ముప్పది"; అ. క్రి. 3. చెల్లు: చూ, పరిగణించు; 4. వెచ్చమై తీఱు: అయిపోవు-రూ-పోవు; 5. కడచు: చూ, సను. 3; 6. కొనసాగు. జై. 6 ఆ. 46: చూ, సిద్ధించు; 7. తగు, యుక్తమగు: చూ, సరిపడు 2; 8. శక్యమగు: చూ, వసపోవు: 9. దీర్ఘమగు: చూ, సాఁగు. 2; 10. తీఱు. "నాకు రూకలు చెల్లెను.": చూ, బెరయు.

చెల్లుబడి. దే. వి. 1. అధికారము, ప్రాజాపత్యము: చూ, ప్రక్రియ. 1; విణ. 2. సిద్ధిఁ బొందినది: చూ, రపము.

చెల్లె. దే. వి: చూ. రూ-చెల్లియ.

చెల్లెలికట్టు. దే. వి: చూ, రూ-చెలియలికట్ట.

చెల్లెలు. దే. వి: చూ, రూ-చెల్లియలు.

చెల్వ. దే. వి: చూ, రూ-చెలువ.

చెల్వు. దే. వి: చూ, రూ-చెలువు. (కాంతి.- ఆం, భా. ప్ర. 30; మంజులము.- వేం. ఆం. 56.)

చెవాకు. ద్వ. వి: చూ, రూ-చెవియాకు.

చెవి. వై. వి.=శ్రవః. 1. శ్రవణము: చూ, శ్రోత్రము: 2. రాట్నము లోనగు యంత్రములయందుఁ గల తదవయవ విశేషము; 3. తాళపుచెవి: చూ, బీగము.

చెవికిఁ జేఁదు. జా. వినుటకసహ్యమైనది. "చెవికిఁ జేఁదుగానున్నను దనకుఁ దోఁచినహితము నిశ్చయముగ వాకృవ్వవలయును." (నీతిచంద్రిక-విగ్రహము.)

చెవికెలు. దే వి. గట్టినూలుపోచెలు: చూ, [పోఁగు. 1.

చెవిగోణక. ద్వ. వి: చూ, కొనచెవి.

చెవిగఱచుట. జా. రహస్యము చెప్పుట. "చేరువం జేరి యెవ్వఁగో చెవి గఱచెదరు." (నీతిచంద్రిక.)

చెవిగూబ. ద్వ. వి: చెవిబొక్క, గూబ; (సం ప).— ఋషభము, కర్ణబాహము కర్ణమూలము, కర్ణరంధ్రము (చెవిమొదలు అని కొందఱు.)

చెవిచోరుపాము. ద్వ. వి. కర్ణజలూక: చూ, [సర్పము.

చెవిటి. ద్వ. విణ. (చెవి + అవిటి) చెవిటివాఁడు: చూ, బధిరుఁడు.

చెవిటిమూఁగ. ద్వ. విణ. చెవుడును మూఁగతనమును గలవాఁడు: (సం.ప) అనేడమూకుఁడు, ఏడమూకుఁడు. (చూ, బధిరుఁడు)

చెవిపమ్మె. ద్వ. వి. పోఁగులుంచుకొను తావు.

చెవిదోరఁబెట్టు. ద్వ. స. క్రి. ఆలకించు: చూ, విను. 2.

చెవిబొక్క. ద్వ. వి: చూ, చెవిగూబ.

చెవియొగ్గు. ద్వ. స. క్రి: చూ, చెవిదోరఁబెట్టు.

చెవినిల్లుగట్టుకొనుట. జా. తఱుచుగాఁ జెప్పుట.

"మే మెల్లఁబలుదెఱంగులఁ జెవినిల్లుకట్టుకొని పోరిన మామాటలు పాటిగాఁగొనక." (నీతి చంద్రిక-విగ్రహము.)

చెవిపోటుజాతకుఁడు. పా. ద్వితీయాధిపతి లగ్నమునను న్నను, ద్వితీయాధిపతియష్టమమున గుళికునితోఁగూడి కుజసంబంధమున్నను, తృతీయమునఁ గుజుఁడుండి రాహువుచేఁ జూడఁబడినను, తృతీయాధిపతి క్రూరషష్ట్యంశల యందుఁజేరి శుభదృగ్యోగము లేనపుడును చెవిపోటప్పుడప్పుడు గలుగుచుండును. వీరికి శుభగ్రహసంబంధము లేకుండనుండవలెను: చూ, కర్ణరోగజాతకుఁడు.

చెవిమొదలు. ద్వ. వి: చూ, చెవిగూబ.

చెవియాకు. ద్వ. వి (చెవి + ఆకు) 1 లక్కాకు: చూ, భూషణము. 2; 2. తాటంకము. (చూ, కమ్మ. 2): చూ, భూషణము. 2.

చెవిలోసొంటికొమ్మూఁదుట. జా. "ఉ. మీ దొరమేమురాగ్రహ సమేతుఁడు సూర్యసుతుండు దేవతా, సూదన బాణవేగమున సొమ్మసిలెం జెవిలోన సొంటికొ, మ్మూదినవాఁడవైతివె యమోయిటువంటివె భృత్యకృత్యముల్." (రామాభ్యుదయము.) [బెట్టు

చెవివాలఁబెట్టు. ద్వ. స. క్రి: చూ చెవిదోరఁ

చెవివేయుట. జా. చెప్పుట. "ఎప్పటివప్పుడు మనచెవులవేసి చేసుచుండవలయును." (నీతి చంద్రిక-విగ్రహము.)

చెవుడు. వై. వి. = క్ష్వేడః. చెవులువినని రోగము, బాధిర్యము: చూ, బధిరితము.

చెవుడుపడు. వై. అ. క్రి. చెవుడుగలదగు: రూ-చెవుడ్పడు (ప్రే-చెవుడుపఱచు.)

చెవుడుపాటు. వై. వి. చెవుడుపడుట, చెవిటితనము: రూ-చెవుడ్పాటు. [పడు.

చెవుడ్పడు. వై. అ. క్రి: చూ, రూ-చెవుడు

చెవుడ్పాటు. వై.వి: చూ, రూ-చెవుడుపాటు.

చెవులపిల్లి. వై. వి: చూ, చెవులపోతు.

చెవులపూవులు. వై. వి. బ. కర్ణభూష.కళా.7. ఆ. 66: చూ, భూషణము. 2.

చెవులపోతు. ద్వ. వి. కుందేలు: చూ, శశము.

చెవులుబట్టియాడించుట. జా. లోఁకువచేయుట. "భూరిభుండారంభరహితుండైనచోఁ బగవాఁడు తలమీఁది వానినయినం జెవులుబట్టి యాడింతురు." (ధర్మజ రాజసూయము); "నిను గీతిసాహితీమో, హనవాణులు చెవులు బట్టి యాడింపఁగా." విజ. 1, ఆ. 156; "సీ. చిన్నప్రాయపు లేడిఁజెవులు పట్టాడించుగతినున్న దీరామ కన్నుదోయి." విజ. 2, ఆ. 104

చెవ్వ దే. వి. శిశువులకు పుట్టినతోడనే కలుగు తెవులు, చెవ్వకాయలు: చూ, రోగము 1.

చెవ్వకాయలు. దే. వి. — పై. —

చెవ్వాకు. ద్వ. వి: చూ, రూ-చెవియాకు 1-2; బ. 3. వ్యర్థోక్తులు. "అవ్వాకులు చెవ్వాకులు ప్రేలుచున్నాఁడు.": చూ, శబ్దము. 2.

## చే

చే. వై. అవ. 1. తృతీయావిభక్తి యందువచ్చు ప్రత్యయము: చే.చేత, తో.తోడ; వి. 2.= కరః. రూ-చెయ్యి-చేయి: చూ, హస్తము.

చేఁ జొచ్చియడుగుట. అం. అష్ట కష్టములలో నొకటి: చూ, అష్టకష్టములు.

చేఁత. వై. వి. =చేష్టా. 1. చేయుట; 2. పని, కృత్యము. స్వా. 3. ఆ. 33: చూ, వ్యాపారము. 1; విశే. 3. కృత్రిమము."చేఁతగట్టు."

చేఁతకాఁడు. ద్వ. విశే. క్రియావంతుఁడు. అచ్చ. ఆ, కాం. 98: చూ, సమర్థుఁడు.

చేఁతగట్టు. వై. వి. కృతకాద్రి: చూ, పర్వతము.

చేఁతపెయ్య. ద్వ.వి. చనిపోయినపెయ్యయొక్క

తోలును గడ్డిపెట్టికప్పి దూడయాకారముగ చేయఁబడిన కృత్రిమరూపము: చూ, ధేనువు.

చేఁతరాసి. వై. వి.=ఝురసి. రూ-చేఁతలాసి: చూ, శకుల.

చేఁతరికము. దే. వి. రూ చేఁతతికము 1 వైరము: చూ, విరోధము. 1; 2. కీడు: చూ, హాని. 2

చేఁతతికము. దే. వి. —పై.—

చేఁతలాసి. వై. వి.=: చూ, చేఁతరాసి

చేఁతిదొండ. ద్వ. వి. చేఁదుగలదొండ*: చూ, దొండ.

చేఁతిదోస. దే. వి. చేఁదుగలదోస*: చూ, దోస.

చేఁతినీరు. ద్వ. వి. తిక్తోదకము: చూ, సలిలము.

చేఁతిపొదువ. అం. మల్లయుద్ధములోని మెలఁకువ: చూ, మల్లశాస్త్రము.

చేఁతిపుచ్చ. దే. వి. తిక్తకాళింగి*. (గాఢవిరేచనకారి, గర్భిణీ స్త్రీలకియ్యరాదు): చూ, పుచ్చ.

చేఁతిపొట్ల. ద్వ. వి. పటోలిక*: చూ, పొట్ల.

చేఁతిబీర. దే వి. చేఁదుగలబీర*: చూ, బీర.

చేఁతియానుగు. దే వి. చేఁతిసొర*: చూ, సొర.

చేఁతిసొర. దే. వి. —పై.—

చేఁతాడు. దే. వి (చేఁదు+తాడు) నీరు చేఁదునట్టి త్రాడు: చూ, సూత్రము. 1.

చేఁద. దే. వి. (చేఁదు+అ) నీరుతోడుపాత్రము, బొక్కెన: చూ, పాత్రము. 6.

చేఁదబావి. ద్వ. వి: చూ, నుయ్యి.

చేఁదు. దే. వి. 1: చూ, తిక్తము; 2. వికటగంధము. అం, భా. ప్ర. 107: చూ, సుగంధము; అ. క్రి. 3. ఆకర్షించు: చూ, రెమ్మ; అం. 4. షడ్రసములలో నొకటి: చూ, రసములు.

చేఁదుమేపుట. జా. ఇష్టములేని పని చేయించుట.

చేఁప దే. వి. 1. ఝుషము: చూ, మత్స్యము. 1; 2. కుమ్మరమత్స్యము: చూ, మత్స్యము. 1.

చేఁపనూనె. ద్వ. వి. మత్స్యముల తైలము (కాడ్లివర్ ఆయిల్.) (క్షయ, రికెట్సు అను తెవులు కుదురును. సుఖవిరేచనకారి): చూ, తైలము.

చేఁపరాసి. ద్వ. వి. మీనరాశి: చూ, రాశి.

చేఁపలబుట్ట. ద్వ. వి. కువేణి: చూ, వల. 1.

చేఁపు. దే. వి. 1. పాలద్రవము; అ. క్రి. 2. పాలుద్రవించు, "ఎనుఁ జేఁపు": చూ, ప్రవించు.

చేఁపుడు. దే. వి. చేఁపుట.

చేకట్లు. ద్వ. వి. బ. హస్తభూషా విశేషము. (ఇక్కడమణికట్టుయొక్క యర్థము చేతికట్లు) వసు. 2. ఆ. 44. చూ, భూషణము. 2.

చేకత్తి. ద్వ. వి. కరవాలము, చేతికత్తి: చూ, రిషి. 2.

చేకము. దే. వి. వస్త్రముయొక్కడిశ, బద్దె: [చూ, వత్తె.

చేకానుక. ద్వ. వి. రాజులలో నగు వారిని జూడఁబోవునపుడు కొనిపోయెడి యుపహారము: చూ, లంచము.

చేకుఱు. దే. అ. క్రి. రూ- చేకూఱు. లభించు: [చూ, సిద్ధించు.

చేకూడు. ద్వ. అ. క్రి. 1.—పై—; ప్రే.2. చేకూర్చు.

చేకూరు. దే. అ. క్రి: చూ, రూ- చేకుఱు.

చేకూఱు. దే. అ. క్రి. -పై.- అం, భా. ప్ర 89.

చేకొణద. దే వి రూ- చేకొణిది. తీగమోరట*: చూ, మోరట.

చేకొణిది. దే. వి. —పై.—

చేకొణుఁజు. దే. వి. శిథిలి. పచ్చగంగుగల చెద పురుగు: చూ, పిపీలిక.

చేకొణుదు. దే. వి. —పై.—

చేకొను. ద్వ. స. క్రి. 1 గ్రహించు: చూ, పుచ్చుకొను; 2. ఆదరించు: చూ, సంభాళించు; 3. గెలుచు: చూ జయించు; ప్రే. 4. చేకొలుపు.

చేకోక్తి. అం. అర్థాలంకారములలో నొకటి;

లోకోక్తియన్యార్థ గర్భితమగుట. ఉదా.—"పాము కాళ్లు పాము యెఱుంగును.": చూ, అలంకారములు 3. (ఛేకోక్తి అనికొందఱు)

చేగ. దే. వి. 1. రూ- చేవ: చూ, సారము, 5; 2. దృఢము: చూ, స్థిరము; 3. చాఁగ*:చూ, సత్త్వ. [ఏనుఁగు: చూ, హస్తి.

చేగలమెకము ద్వ. వి. (చే+కలమెకము)

చేగలవాఁడు. ద్వ. వి. (చే+కలవాఁడు) ఈగి కలవాఁడు: చూ, వదాన్యుఁడు. [భిక్ష్యము.

చేగోడి. దే. వి. (చే+కోడి) కోడిపెడ: చూ,

చేచేమురు. ద్వ. వి. నెయ్యి. సాంబ. మాన.47: చూ, తైలము.

చేట. దే. వి. 1. చెరిగెడు సాధనము: చూ, శూర్పము; 2. కీడు: చూ, హాని. 2; అం. 3. మల్లబంధవిశేషములలో నొకటి: చూ, మల్లశాస్త్రము.

చేటకుఁడు. సం. వి. అ. పుం. 1. దాసుఁడు: చూ, సేవకుఁడు; 2. ఉపపతినాయకులలో భేదము: చూ, నాయకనర్మసచివులు (నాయకసఖులు) (రూ-చేటుఁడు.)

చేటకొల్లారు. దే. వి. మూఁడు ప్రక్కలను చేరికకట్టడముగల యిల్లు: చూ, సదనము. 1.

చేటగోళ్లబోటి. ద్వ. వి. (చేటగోరు+బోటి) చుప్పనాక. అచ్చ. అర, కాం. 11: (చూ, శూర్పణఖ): చూ, రాక్షసి. 1.

చేటచెవులమెకము. ద్వ. వి. ఏనుఁగు: చూ, హస్తి. [కుఁడు. 1.

చేటచెవులవేలుపు. ద్వ. వి: చూ, వినాయ

చేటచేఱు దే. వి. ఆఁడువారియొక్క యొక విధమైన కోకకట్టు.

చేటపెయ్య. వా. వి: చూ, చేతపెయ్య.

చేటరిక్క. ద్వ వి. కుమ్మరసారెమీఁక్క, విశాఖానక్షత్రము: చూ, నక్షత్రము. 1.

చేటరిక్కనెల. ద్వ. వి. వైశాఖమాసము: చూ, మాసము. 1.

చేటవీనులదణి. ద్వ.వి: చూ, వినాయకుఁడు. 1.

చేటసవతురిక్క. ద్వ. వి: చూ, చేటరిక్క.

చేటి. సం. వి. ఈ. స్త్రీ. = చేడె. 1. ఆఁడుది: చూ, స్త్రీ; 2. పనికత్తె, తొత్తు: చూ, స్త్రీ.

చేటిక. సం. వి. ఆ. స్త్రీ. = చేడె —వై—; అం. 3: చూ. అభిసారిక.

చేటు. వై. వి. 1.=చేష్ట రూ-చేట్పాటు-చేడి-చేడిది, కీడు: చూ, హాని.2; దే వి. 2. ఆపద: చూ, విపత్తు; 3 నాశము: చూ, నష్ట.

చేటుఁడు. సం. వి. అ. పుం. 1. పనివాఁడు: చూ, సమర్థుఁడు; విణ. 2. నికృష్టుఁడు: చూ, వ్యాధుఁడు. 2; అం. 3: చూ, చేటకుఁడు (చూ, నాయకనర్మసచివులు-నాయకసఖులు.)

చేటుపాటు. దే.వి. 1. అశుభము. చూ, హాని.2; 2. ఆపద: చూ, విపత్తు. (రూ-చేట్పాటు.)

చేట్పాటు. దే. వి. —వై—

చేట్లకొలవి. దే. విణ: చూ, వ్యాధుఁడు. 2.

చేడకుఁడు. సం. వి. అ. పుం. దాసుఁడు: చూ, సేవకుఁడు.

చేడి. సం. వి. ఈ. స్త్రీ 1. దాసి, తొత్తు: చూ, స్త్రీ; దే. వి. (1) అశుభము, కీడు: చూ హాని. 2. [చూ. స్త్రీ.

చేడిక. సం. వి. ఆ. స్త్రీ. దాసి, తొత్తు:

చేడిది. దే. వి. 1 అశుభము: చూ, హాని. 2; 2. ఆపద: చూ, విపత్తు.

చేడియ. వై. వి.=చేటికా. రూ-చేడె. ఆఁడుది: చూ, స్త్రీ. [సేవకుఁడు.

చేడుఁడు సం. వి. అ. పుం. దాసుఁడు: చూ,

చేడె. వై. వి.=: చూ, రూ-చేడియ.

చేద్పడు. ద్వ. అ. క్రి. 1. గాసిల్లు: చూ, బాధపడు; 2. చలించు: చూ, సలించు,

చేడ్పాటు. ద్వ. వి. చేడ్పడుట, బాధ, వ్యథ: చూ, దుఃఖము.

చేత్. సం. అవ్య. పక్షాంతరము, అయితే, అట్లాయెనా, ఇటువలెనైన.

చేత. వై. అప: చూ, రూ-చే. 1. [హారీతకి.

చేతకి. సం. వి. ఈ. స్త్రీ. కరకి*: చూ,

చేతన. సం. వి ఆ. స్త్రీ. తెలివి: చూ. బుద్ధి.

చేతఃకి. సం. వి. ఈ. స్త్రీ: చూ, చేతకి*

చేతనము. సం. విణ ప్రాణముకలది, జంతువు: చూ, ప్రాణి.

చేతనగత్నములు అం. (బ్రహ్మ-క్షత్రియ- వైశ్య-శూద్ర- స్త్రీ- గృహ- వన- అశ్వ- గోరత్నములు (9) [(అగ్నియు): చూ, నీతి.

చేతముకు. ద్వ. వి. చిన్నతముకు, చేతితుడుము

చేతవులు. ద్వ. అ. క్రి. 1. లభించు: చూ, సిద్ధించు; 2. నష్టివచ్చు: చూ. నష్మవోవు.

చేతస్సు. సం. వి. స. న. మానసము, మది, మనసు: చూ, హృదయము.

చేతాఁకు. ద్వ. వి: చూ, సాహసము.

చేతికట్టు. వై. వి: చూ, వేత్రము 1.

చేతిబిడ్డ. ద్వ. వి. (చేయి + బిడ్డ) పసిబిడ్డ: చూ, శిశువు.

చేతివట్టుము. దే. వి. చేతిసొమ్మువంకుగ.

చేతివాత్రలు. ద్వ. వి. బ. (చేయి + వాత్రలు) రూ-చేవాత్రలు: చూ, సంతకము.

చేతుకి. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-చేతకి.

చేతులప్పళించు. ద్వ. అ. క్రి. లోపటమ. అం, భా. తృ. 106: చూ, మస్తరించు.

చేతులు. అం. (హస్తములు) 1. శరీరాంగముల లోనివి. (రెండుచేతులు): చూ, అంగము.9; 2. నఖక్షతస్థానములు తొమ్మిదింటిలోనివి (రెండుచేతులు): చూ, నఖక్షతస్థానములు; 3. కళలుండు స్థలములలోనివి (రెండు చేతులు): చూ కళలుండుస్థలములు.

చేతులు చేయువు నోరు కతిసదు. లో. ఉదా.—"క. అడుగక యుండినఁదగుపర, మిడు నేనిస్థారణంబ యాశ్వయుఁడై సం, బుడమింజేయువు చేతులు, నకువదు నోగనెడు మాటకును దప్పకునే." (మ చిలో పాఖ్యానము)

చేతెఁడు. ద్వ. వి. హస్తప్రమాణము.

చేతోభవుఁడు. సం. వి. అ. పుం: చూ. మన్మథుఁడు.

చేత్రాడు. దే. వి. 1 నీళ్లుతోడు ట్టి త్రాడు: చూ, సూత్రము. 1; 2. మల్లయుద్ధాయుధము అం. భా. ద్వి. 207: చూ, బాణము.1. (చూ. మల్లశాస్త్రము) [ణము. 2.

చేదండ. ద్వ. వి కయిదండ: చూ, భూషణము.

చేదర్శనము. వై. వి: చూ, చకానుక. జై. 3, ఆ. 76. [యు వాడుక.)

చేదస్తము వై. వి.=ఛాందసము. (చాదస్తమని

చేదర్థము. పా "ఇనక" చేదర్థంబునందగు ఉదా.-"వాఁడువచ్చినక నేను బోయెదను." 'ఏని'యను నర్థముకలది చేదర్థము.'వచ్చినక' అనఁగా వచ్చెనేని యని యర్థము. (వ్యాకరణము.)

చేదాటము. అం. 1.హిందోళజభాషలు తొమ్మిదింటిలో నొకటి: చూ, హిందోళజభాషలు (చూ, భాష. 1.); 2. టక్కజభాషలు ఇరువదియొకటింటిలో నొకటి: చూ, టక్కజభాషలు (చూ, భాష. 1.)

చేది. సం. వి ఇ. పుం. దేశములు ఏఁబదియాఱింటిలో నొకటి: చూ, దేశము (చేదిదేశము.- చైద్యము, డాహాలము.)

చేదిరాజు. సం. వి. అ. పుం. శిశుపాలుఁడు- శిశుపాలుఁడు, చేదిరాట్టు, చైద్యుఁడు, దమఘోషసుతుఁడు: చూ, రాజు. 1.

చేదిరాటు. సం. వి. జ్. పుం: చూ, చేదిరాజు.

చేదివియ. వై. వి.=శేయనీప దివ్వటి: చూ, దివిటి.

చేదోడు. ద్వ. విణ. (చే + తోడు) రూ- చేయి దోడు. 1. కార్యసహాయుఁడు; 2. కార్య సహాయురాలు.

చేదోడువాదోడు. జా. పనికి సహాయము, మాటకుసహాయము. "చేదోడువాదోడుగన్."

చేను. దే. వి. 1. బ. చేలు. పంట నేల. కళా. 8, ఆ. 12: చూ, భూమి. 1; 2. అడవి: చూ, విపినము. (వైకృతమని కొందఱు.)

చేపట్టు. దే. వి. 1. అనుగ్రహము: చూ, సాక తము 2: 2, చోటు. పాండు. 4 ఆ. 168: చూ, స్థానము. 1; 3. ఆశ్రయము: చూ, ప్రాపు. 2; 4. పెండ్లి: చూ, వివాహము; 5: చూ, హస్తగ్రహణము; ద్వ. స. క్రి. 6. అవలంబించు: చూ, ప్రాపుగొను. 7. గ్రహించు: చూ, పుచ్చుకొను; 8: చూ, పెండ్లియాడు. హరిశ్చ. 2, ఆ. 175.

చేపట్టుకుంచము. ద్వ. విణ. ఎవ్వరేదికోరినను దాని నే నెఱవేర్చువాఁడు.

చేపడవ. ద్వ. వి: చిన్న పడవ: చూ, హోడము.

చేపడు. వై. అ. క్రి. 1. చిక్కు. పంచ. వేం: 4. ఆ. 517 చూ, లోఁబడు; 2. లభించు: చూ, సిద్ధించు.

చేపల్లటీ. ద్వ. వి. ఒకానొకపావురాయి. వేం. ఆం. 98: చూ, పావురము.

చేపెట్టియ. వై. వి. =శేయపేటి. రూ- చేపెట్టె: చూ, మందసము. [ణములు

చేబ. దే వి. మల్లబంధవిశేషము: చూ, విన్నా

చేబదులు. దే. వి. చేతిఅప్పు, అల్పకాలమునకుఁ దీసినఅప్పు: చూ, బాకి. 2.

చేబాడిస. ద్వ. వి. చిన్న బాడిస.

చేబోడి. ద్వ విణ: చూ, నిర్ధనుఁడు.

చేమ. దే వి. దుంపజాతికూర, అలుకము. అలువు —రూ— అలావు*: చూ, శకుటము.

చేమంతి. వై. వి.= సేవంత: చూ, రూ- సేమంతి* (ఒకానొక పూఁచెట్టు.)

చేమంతిపువ్వు. వై. వి. 1. జడయందును, కొప్పునను ధరించు ఆడువానినగ: చూ, భూషణము. 2; 2. చేమంతి చెట్టున పూచిన పూవు.

చేమటియావు. దే. వి. రూ- చెమటియావు. చిత్రవర్ణముగలగోవు: చూ, ధేనువు.

చేమపూరాజీనములు. ద్వ. వి బ. ఒకరక ముసడ్లు: చూ, ధాన్యము. [తో. ను. 4.

చేమరి. దే వి. ఆతంచనము, తోడంటు: చూ:

చేమిరి. దే. వి —వై— (పేరుట కైపాలలో మజ్జిగ మిడుచుట.)

చేమోడుచు. ద్వ. అ. క్రి: రూ- చేమోడ్చు: చూ, మొక్కు. 2.

చేమోడ్చు ద్వ. అ. క్రి.—వై.—

చేమోడుపు. ద్వ. వి. రూ. చేమోడ్పు: చూ, మొక్కు. 1.

చేమోడ్పు. ద్వ. వి. —వై.—

చేయము. సం. వి. అ. న. 1. పరువడము: చూ, చయనము; వా. దే. క్రి (1) కావింపము.

చేయమ్ము. వై.వి.=శేయాంబక.(చేయి + అమ్ము) చేతితోప్రయోగించెడు బాణము, జోడము: చూ, బాణము. 1.

చేయలంతి. ద్వ. వి. విణ. (చే + అలంతి) దగ్గఱ: చూ, సమీపము. 1.

చేయి. వై. వి. 1.= శేయ. రూ- చే-చెయి: చూ, హస్తము; 2=శేయ. తొండము: చూ, శుండము; 3 కిరణము. అచ్చ. అ, కాం. 48: చూ, మయూఖము. 1; 4. పక్షము, వైపు. "ఈవ్యవహారమునందు వాఁడు నాకు ఎదుటిచేయిగా నున్నాఁడు.": చూ, పార్శ్వము. 2;

5. పట్టు. హరిశ్చ. 2, ఆ. 49: చూ, ప్రతిగ్రహము. 1; 6. రెండుమూఁగల కొలఁది: చూ, చెయి. 3.

చేయికిగ్రిందగుట. జా. పుచ్చుకొనుట. "ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁదనువుపై పాంసోత్తరీయంబుపై, పాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపైనూత్నమ, ర్యాదం జెందు కరంబుకిగ్రిందగుట నాహస్తంబు మీఁదౌట మేఁ, ల్గాదే రాజ్యము గీజ్యమున్నతతమే కాయంబనాపాయమే." (భాగవతము.) [రూ-చేదోసి.

చేయిదోడు. ద్వ. విశ. (చేయి + తోడు): చూ,

చేయిమీఁదగుట. జా. దాతలక్షణము, ఇచ్చువాని చేయి మీఁదుగానుండుట, ఇచ్చుట

చేయు. వై. స. క్రి. 1 =శీ. కాఁచు, ఒనర్చు, పన్ను: చూ, సమకట్టు; 2. నిర్వహించు: చూ, సలుపు; 3 కలిగించు: చూ, సృజించు

చేర. దే. వి. రూ-చేఱ చేరె. ఇంచుక వంచఁబడిన చేయి. విజ. 1, ఆ. 132: చూ, ప్రసృతి. 1.

చేరి. అం. ముప్పదిరెండాయుధములలో నొకటి: చూ, ముప్పదిరెండాయుధములు (చూ, బాణము. 1.)

చేరిక. దే. వి. 1. దగ్గఱ: చూ, సమీపము. 1; 2. కూడిక: చూ, సంయోగము; 3. గతి: చూ, సంయోగము.

చేరు. వై. వి. 1.=సరము. కళా. 7, ఆ. 121. చూ, భూషణము. 2; 2. రూ- చేఱు. త్రాడు, దారము, పగ్గము- రూ-ప్రగ్గము, బొందు. పా. 2, ఆ. 39: చూ, సూత్రము.1; 3. గొలుసు. "ఉయ్యాలచేరులు.": చూ, శృంఖలము. 3; వై. వి. 4.=సార. రూ- చేఱు-చారు. మిరియము లోనగు సంబారము చేర్చి కాఁచిన చింతపండు రసము: చూ, యూషము (దేశ్యమని శబ్దరత్నాకరము); దే. వి. 5 దగ్గఱ: చూ, సమీపము. 1; అ. క్రి. 6. ఒఱగు: చూ, వ్రాలు. 3; 7. అంటుసిల్లు. జై. 7, ఆ. 43: చూ, సమీపించు; 8. లభించు: చూ, సిద్ధించు; స. క్రి. 9. పొందు: చూ. ప్రాపించు.

చేరుకోల వై వి. కళ. రూ-చేర్కోల-చేఱుకోల: చూ, మునికోల. (బండిగుఱ్ఱములు, ఎద్దులు లోనగు వానిని గొట్టెడి కొరడా) (ద్వ్యర్థమని కొందఱు.)

చేరుగడ. దే వి. 1. దగ్గఱ: చూ, సమీపము.1; 2. రక్షణము, దిక్కు: చూ, శరణము 2; విశ. 3. సమీపమైనది: చూ, సమీపము. 1.

చేరుగొండి. దే. వి. 1. చేరివచ్చిన పెండ్లాము: చూ, భార్య. 1; విశ. 2. చేరివచ్చినది: చూ, సహితము; 3. చెడ్డది: "ఇది చేరుగొండి ఆవు.": చూ దుష్టము.

చేరుచు. దే. ప్రే. 1. చేరఁజేయు; 2. కూడఁబెట్టు: చూ, బంధించు. (రూ-చేర్చు.)

చేరుచుక్క. వై. వి. 1. పాపటబొట్టు: చూ, లలాటిక; 2 జేడబిళ్ల: చూ, భూషణము. 2. (రూ చేఱుచుక్క.)

చేరుడుబియ్యము. దే. వి. మెఱుఁగుపోటులేని బియ్యము, చేరుడులు-రూ-చేరుళ్లు, దంగుడులు రూ-దంగుళ్లు: చూ, బియ్యము.

చేరుడులు. దే. వి బ. —వై.— [పము. 1.

చేరువు. దే. వి. రూ-చేర్వు. దగ్గఱ: చూ, సమీ

చేరుబడి. దే. వి. —వై.—

చేరుళ్లు. దే. వి. బ: చూ, చేరుడుబియ్యము.

చేరువ. దే. వి. 1. రూ-చేర్వ. గుంపు: చూ, సమూహము; 2. దండు: చూ, సేన. 1; 3. రూ-చేరువు- చేరుబడి- చేరుగడ: చూ, సమీపము. 1; విశ. 4. సమీపమైనది: చూ, సమీపము. 1.

చుప్పనక. వై. వి.=శూర్పణఖా: చూ, రాక్షసి. (అపహాసముగల ఆఁడుదానియందీ శబ్దము వాడెదరు.)

చుప్పనాక. వై. వి.= —పై.—

చుప్పనాతి. ద్వ. వి. —పై.— .(శ. ర) (శూర్పణఖా శబ్దతద్భవమని కొందఱు.)

చుబ్బనమాఱి. వై. వి (చోఱి + చోఱి) మిక్కిలిచోఱి, పెద్దకొల్ల యనుట.

చుమి. వై. ని. 1.=స్మ. చోఁకుమి. రూ-చుమా-చుమ్మ-చుసు-చుమ్మ-చుమ్మా-చుమీ-చుమ్మి-చుమ్మీ-చుమ్ము-చువ్వె-చువ్వే-చోవె-చోవే-చో-చోరె-చోరే; వై. అవ్య. 2. రూ-చుమీ-చుమ్మి-చుమ్మీ. నిశ్చయార్థకము: చూ, సత్యము. (బ. చుండి-చుండీ.)

చుమీ. —పై.—

చుము. వై. ని.=స్మ: చూ, చుమి. 1.

చుమ్మ. వై. ని. 1.=స్మ. —పై.—; దే. వి 2. దుఃఖము: చూ, శోకము; 3. నొప్పి: చూ, వేదన. 1.

చుమ్మచుట్లు. దే. వి. బ. కడుపులోఁ గలుగు వేదన: చూ, వేదన. 1.

చుమ్మలుచుట్టు. దే.అ. క్రి. వేదనపడు, కలఁగు. విజ. 3, ఆ. 136: చూ, సంక్షోభించు.

చుమ్మలువాఱు. దే. అ. క్రి. —పై.—

చుమ్మా వై. ని.=స్మ: చూ, చుమి. 1.

చుమ్మి: చూ, రూ-చుమి.

చుమ్మీ. —పై.—

చుమ్ము. వై. ని.=స్మ: చూ, చుమి. 1.

చుయ్యంకి. దే. వి. వాద్యవిశేషము, తాళము: చూ, వీణె.

చుర. వై. వి. = క్షుర. కఠారము: చూ, రిష్టి. 2.

చురకత్తి. వై. వి = ఛురిక. —పై.—

చురచురపోవు. దే. అ. క్రి. (చురచుర + పోవు) జ్వలించు: చూ, మండు.

చురి. వై. వి. = ఛురిక: చూ, రూ-చుర.

చురియ. వై. వి. = —పై.—

చుఱచుఱ. దే. వి కాలుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హుళాహుళా.

చుఱకగు. దే. అ. క్రి. 1. ధ్వనించు: చూ, శబ్దించు; వా. 2. ధాన్యముధర పెరుఁగు.

చుఱుకటీఁడు. దే. విశే. శూరుఁడు. ఆం, పదా. స. 39: చూ, హంవీరుఁడు. 2.

చుఱుకరి వై. వి.=శూర (చుఱుకు + అరి( 1. —పై.—; 2. చొరవగలవాఁడు: చూ, సాహసికుఁడు.

చుఱుకు. దే. వి. 1. శీఘ్రము: చూ, వేగము.3; 2. రూ-చుఱుక్కు, తీక్ష్ణము: చూ, మిడి.4; 3. ఉష్ణము: చూ, వేఁడిమి; 4. వాఁడిమి: చూ, వాలు. 6; 5. వీరము: చూ, శౌర్యము. 1; 6. రూ-చుఱుక్కు. నాటుట నిప్పు సోఁకుట లోనగువాని యందగు ధ్వన్యనుకరణము: చూ, హుళాహుళా; విశే. 7. వేఁడిమిగలది: చూ, వేఁడిమి; 8. వాఁడిగలది: చూ, శితము. 1.

చుఱుక్కు. దే. వి: చూ, రూ-చుఱుకు. 2-6.

చుఱువుచ్చు. దే. స. క్రి. (చుఱుకు + పుచ్చు) కాల్చు: చూ, దహించు.

చుఱ్ఱు. దే. వి: చూ, చుఱచుఱ.

ౘుఱ్ఱుకొను. దే. స. క్రి: చూ, ౘుఱువుచ్చు

ౘులకన. వై. వి, విశే: చూ, రూ-ౘులుకన.

ౘులుక. దే. ద్రి. క్రి. విశే. రూ-ౘుల్క. 1. లాఘవముగా: చూ, లాఘవము. 1; 2. సులభముగా: చూ, సులభము.

ౘులుకఁజేయు. ద్వ. స. క్రి. (ౘులుక + చేయు) లాఘవపఱచు.

ౘులుకన. వై. వి.=సులభ. రూ- ౘుల్కన 1. తేలిక: చూ, లాఘవము 1; 2. సౌలభ్యము: చూ, సులభము; విశే. రూ-ౘుల్కన. 3. లఘువు: చూ, లాఘవము. 1; 4. సులువు: చూ, సులభము.

ౘులుకపాటు. ద్వ. వి: చూ, ౘులుకన. 1.

ౘుల్క. దే. ద్రి, క్రి. విశే. చూ, రూ-ౘులుక.

ౘుల్కన: చూ, రూ-ౘులకన. [పాటు.

ౘుల్కపాటు. ద్వ. వి: చూ, రూ-ౘులుక

ౘుల్లజుంఱు. దే. వి. మొటిమవంటి చిన్న నెత్తురు గడ్డ: చూ, వ్రణము. [సూకరము.

ౘుల్లగము. దే. వి. కోడెవయసుగల పంది: చూ,

ౘుల్లి. దే. వి. మగగుఱి. చూ, శిశ్నము. (రూ-ౘుల్ల.)

ౘువక. దే. వి. రూ-ౘువ్వ-చివగ-చివ్వ. 1. ఉపశాఖ: చూ, శాఖ. 1; 2. బెత్తము: చూ, వేత్రము. 1.

ౘువ్వ. దే. వి. —పై.—

ౘువ్వే. వై. ని. రూ-ౘువ్వే (చూడవు + ఎ): చూ, రూ-ౘుమీ. 1.

ౘువ్వే. —పై.—

## ౘూ

ౘూ. వై. అవ్య. చూడుము, చూడుఁడు. ప్రభా. 3, ఆ.64: చూ, ౘుమీ. 1.

ౘూఁడి. దే. వి. చూలు, గర్భము; పశుగర్భము. "ౘూఁడియావు, ౘూఁడిపంది" మొ: చూ, భ్రూణము. 1. (చివుడు అనియు వాడుక.)

ౘూఁడు దే. స. క్రి. కాల్చు. జై. 5, ఆ.188: చూ, దహించు.

ౘూఁడుగొడుపు. దే.వి. (ౘూఁడు + కొడుపు) పసరములకు వాఁతవేసెడి యినుపకోల: చూ, కఱుగోల. 1.

ౘూసురు. వై. వి.=శోకః: చూ, శోకము.

ౘూసురుపడు. వై. అ. క్రి: చూ, శోకించు.

ౘూచాయ వై. వి. (ౘూపు + ఛాయ) 1.జాడ: చూ, సూచన. 1; 2. తేలిక: చూ, లాఘవము. 1.

ౘూచు. వై అ. క్రి. 1: చూ, యత్నించు. నిర్వ. 3, ఆ. 67; వై. స. క్రి. 2.=సూచ్. కనుగొను: చూ, వీక్షించు.

ౘూచుట. వై. వి. 1. చూ, వీక్షణము; అం. 2. దశావస్థలలో నొకటి: చూ, దశావస్థలు.

ౘూటిక. వై.వి. దృష్టి: చూ, వీక్షణము. (వా)

ౘూడగలవాఁడు. ద్వ. వి: చూ, సౌందర్యవంతుఁడు.

ౘూడికి. వై. వి: చూ, రూ-ౘూటిక.

ౘూడ్కి. వై. వి. —పై.—

ౘూపట్టు. ద్వ. అ. క్రి. (ౘూపు + పట్టు): చూ, ప్రత్యక్షమగు.

ౘూపరి ద్వ. విశే. (ౘూపు + అరి): చూ, ౘూడగలవాఁడు. [ౘూపఱులు.

ౘూపఱి ద్వ. విశే. బ. ౘూచువారు:ౘూపఱు-

చూపఱి. ద్వ. విశే. బ. —పై.—

చూపఱులు. ద్వ. విశే. బ. —పై.—

చూపు. వై. వి. 1. చూచుట: చూ, వీక్షణము; ప్రే. 2. చూపించు: చూ, వీక్షించు. (దీనికి ఉపమానము.—బాణము.)

చూపుగుట్టము. వై. విశే. పనికి ఉపయోగము కానివాఁడు: చూ, నిష్ప్రయోజకుఁడు.

చూపుడుగుట్టము వై. విశే. —రూ-పై.—

చూపుడుఁబూఁట. ద్వ. విశే. (చూపుడు + పూఁట) చూపనొప్పుకొన్న పూఁటకాఁపు.

చూపుడువ్రేలు. ద్వ. వి. తర్జని: చూ, వ్రేలు.2.

చూపెట్టు. ద్వ. స. క్రి. (చూపు + పెట్టు) కనుపెట్టు: చూ, ప్రతీక్షించు.

చూపోపమి. ద్వ. వి. చూడసహింపమి.

చూపోపు. ద్వ. అ. క్రి. (చూపు + ఓపు) చూడసహించు.

చూర. వై. వి.=క్షుర-ఛురిక: చూ. రూ-చురి

చూరకత్తి. వై. వి. = ఛురిక. —పై.—

చూరణసఱుసు. అం. సఱుసులు మూఁడింటిలో నొకటి. (ఖడ్గయుద్ధములోని వ్రేటుభేదము): చూ, సఱుకులు.

చూరి. వై. వి. = ఛురికా: చూ. రూ-చురి. (కృపాణికాగ్రిమని కొందఱు.)

చూరియావు. దే. వి. (చూరి+ఆవు) ఒక విధమైన వన్నెగల యావు. (అప్రి): చూ, ధేనువు.

చూరీ. వై. వి. = ఛురికా: చూ, రూ-చురి.

చూరు. వై. వి. 1.=చూడా. వలీకము: చూ, వెలిసె. (చూ, సదనము. 1.); 2. = చూర్ణము: చూ, సురుము; అ. క్రి. 3 తగులు: చూ, లంకించు. 1.

చూరుకమ్మి. వై. వి. చూరుపట్టె: చూ, వలభి.

చూరుకట్టు. ద్వ. వి. ఇంటిమీఁద కప్పువేయునపుడు పూరిపఱచి యాఁతమెల్లె లోనగువానిని పెండెవలె మీఁదనుంచి కట్టుటకై నారతో కుట్టెడుకుట్టు.

చూరుకట్టుదబ్బ. ద్వ. వి. చూరుకుట్టునకు నారగుచ్చెడు దబ్బనమువంటి కొయ్యదబ్బ లోనగునది. (చూరుకట్టుబద్దఅనియువాడుక.)

చూరుపట్టె. వై. వి: చూ, చూరుకమ్మి.

చూరుముగ్గ. వై. వి. చూరుకమ్మియందు వాసమునకు సరిగా ముగ్గవలె నేర్పఱిచినది. జై. 5, అ 157. [చూ, చుమి. 1.

చూరె. వై. ని (చూడరు+ఎ) రూ-చూరే:

చూరెలుక. ద్వ. వి. ఒకరకము చిన్నయెలుక: చూ, మూషికము. [చూ రె.

చూరే. వై. ని. (చూడరు+ఏ): చూ, రూ-

చూ[illegible]. దే. వి. ఇంటికప్పు, క్రిందికప్పు: చూ, సదనము 1. [చూ, లూటీ. 4.

చూఱ. వై. వి.=చౌర్య. రూ-చౌఱ. కొల్ల:

చూఱకాఁడు. మి. వా. విశే. కొల్లపెట్టినవాఁడు (ఇది బిరుదుపేరు. బిరుదుపేళ్లు లక్షణమునను కట్టుపడియుండవు): చూ, ముమ్ము. 1.

చూఱకొను. ద్వ. స. క్రి. రూ-చూఱలాడు-చూఱాడు. కొల్లపెట్టు: చూ, ముచ్చిలించు.

చూఱకోలు. ద్వ. వి: చూ, చూఱ.

చూఱలాడు. ద్వ. స. క్రి. (చూఱలు + ఆడు): చూ, చూఱకొను.

చూఱలాడుట. జా. అంతయు హరించుట. "సీ. వీఁడచేయలఁ బెంచి వ్రేతలమానంబు చూఱలాడిన లోకసుందరుండు." (భాగవ

తము); "ఉ. లే. నవ్వు దొలంగనీదు నయనం
బుల నామదిచూఱలాడెడిన్" (కవికర్ణ
రసాయనము)

చూఱవోవు. ద్వ. అ. క్రి. (చూఱ + పోవు) కొల్లవోవు: చూ, పఱిపోవు.

చూఱాను. ద్వ. స. క్రి. (చూఱ + ఆను): చూ, చూఱకొను [భ్రూణ.

చూలాలు. దే. వి. (చూలు + ఆలు): చూ,

చూలి. దే. వి బిడ్డ: చూ, శిశువు.

చూలు. దే. వి 1. గర్భము: చూ, భ్రూణము. 1; 2. బిడ్డ: చూ, శిశువు; 3. గర్భస్థపిండము: చూ, భ్రూణము. 2; 4 గోమహిష్యాది పశుగర్భము, గర్భగ్రహణము (అని కొందఱు): చూ, ప్రజనము. 1; 5. చూల గుఱ్ఱి కొలుము: చూ, ప్రజనము. 2.

చూలుకొను. దే. అ. క్రి. చూలుగలదియగు: చూలువడు. [—పై—

చూలువడు. ద్వ. అ. క్రి. (చూలు + పడు)

చూవె. ద్వ. ని (చూడవు + ఎ) రూ-చూవే: చూ, చుమీ. 1.

చూవే ద్వ. ని. —పై—

## చొ

చొంగి. దే. వి. చొల్లు: చూ, లాల.

చొంగిణ. అం: చూ, రూ-చొంగిణ.

చొంగిణము. అం. —పై—

చొంగిణి అం. —పై—

చొక. వై. వి. = చోక్షు: చూ, రూ-చొక్కము. 2-3.

చొకా. వై. వి. 1. = కంచుకా. రూ-చొక్కా: చూ, వస్త్రము; విశ. 2. స్వచ్ఛమైనది: చూ, రూ-చొక్కము. 2.

చొకాటము. వై. విశ = శృంగార: చూ, రూ. చొక్కము. 2.

చొకాయ. వై. వి = కంచుకా. రూ-చొక్కాయ-చొక్కాయి-చొకాయి చొక్కా-చొకా-చొగా-చొలా: చూ, వస్త్రము.

చొకాయి. వై. వి = —పై—

చొకారము. వై. వి.=శృంగార. 1. మిక్కిలి స్వచ్ఛత: చూ, రూ-చొక్కము. 2; విశ. 2. మిక్కిలి స్వచ్ఛమైనది: చూ, రూ-చొక్కము. 2.

చొక్క. వై. విశ.=: చూ, రూ-చొక్కము. 2. (వ్యుత్పత్తియందు చొక్కమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము) "చొక్కసంగతుల్" మొ.

చొక్కటము వై. విశ.=—పై—1.

చొక్కడము. వై. విశ. = —పై—

చొక్కణ దే. వి: చూ, శీతల *.

చొక్కతరము. వై. విశ. =: చూ, రూ-చొక్కము. 2. [లోహము. 1.

చొక్కపుబంగారు. ద్వ. వి. అపరంజి: చూ,

చొక్కము. వై. విశ. 1. అధికకాంతిగల రత్నము: చూ. రత్నము. 1; 2.= చోక్షమ్. స్వచ్ఛమైనది (రూ. చొక-చొకా-చొక్క-చొక్కా-చొక్కటము-చొక్కడము-చొకాటము-చొక్కాటము-చొకారము-చొక్కారము): చూ, హృద్యము; 3. అందము: చూ, సౌందర్యము.

చోక్కా. వై. వి. 1. = కంచుకా. రూ- చోక్కాయ: చూ, వస్త్రము; విశ.2: చూ, రూ- చోక్కము. 2. (నృత్తియందు చోక్కాట మనను మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము "చోక్కాపాత్రము." మొ.)

చోక్కాకు. ద్వ. వి. (చోక్కు + ఆకు) ఎండాకు: చూ, పత్రము. 1. (శుష్కశబ్దతద్భవమని పురుషోత్తమకవీయము.)

చోక్కాటము. వై. విశ. = శృంగార: చూ, చోక్కము. 2. (వృత్తియందు అంత్యోపాంత్యవర్ణములకు లోపము.) [చోక్కా. 1.

చోక్కాయ. వై. వి = కంచుకా: చూ,

చోక్కాయి. వై. వి.= —వై.—

చోక్కారము: చూ, రూ-చోకారము.

చోక్కిడు. దే. స. క్రి. (చోక్కు + ఇడు): చూ, వంచించు.

చోక్కిలి. దే. వి. 1 చెంబు లోనగునవి క్రిందఁబడుట లోనగువానిచే నగు నొక్కు, చొట్ట: చూ, సొట్ట; 2. దేహమునందు రోగముచేత గలిగిన పల్లము అనఁగా వంకర: చూ, వేల్లితము. 2; విశ. 3. రోగముచే వంకరైనది, చొట్ట: చూ, సొట్ట.

చోక్కిల్లువోవు. దే. అ. క్రి. (చోక్కిల్లు + పోవు): చూ, వంకరవోవు.

చోక్కు. వై.విశ. 1. ఎండినది. "చోక్కాకు": చూ, విశీర్ణము. 2; దే. వి. 2. యువయువతి సంభృతప్రేమ: చూ, వలపు. 2; 3 మూర్ఛ: చూ, రోగము. 1; 4. మీఁదజల్లినచో పరవశము చేయు భస్మవిశేషము: చూ, మైదు; 5. పారవశ్యము: చూ, విస్మృతి:

చోక్కునీరు. ద్వ. వి. కల్లు: చూ, సుర. 1.

చోక్కుపెట్టు. దే. స. క్రి: చూ, చోక్కిడు.

చోక్కుపొడి. దే. వి: చూ, చోక్కు. 4.

చోక్కుమందు. దే. వి. —వై.— లక్ష్మీన్గ. 1, అ. 47. [చూ, వస్త్రము.

చోగా. వై. వి =కంచుకా. రూ-చోక్కా:

చోచ్చినయిల్లు. ద్వ. వి. 1. ప్రవేశించినయిల్లు. రూ- చోచ్చినిల్లు: చూ, సదనము. 1; వా. 2. అత్తిల్లు. రూ-చోరఁగమి..., చూ సదనము.1.

చోచ్చినిల్లు. ద్వ. వి. —వై.—

చోచ్చిలు. దే. అ.క్రి. రూ-చోచ్చిల్లు-చోచ్చు-చోత్తెంచు-చోరఁబడు-చోరఁబాఱు. ప్రవేశించు: చూ, సోఁకు. 4.

చోచ్చిల్లు దే. అ. క్రి. —వై.—

చోచ్చు. దే. అ. క్రి. —వై.—

చోటచోట. దే. వి. కాఱుట పడియుట లోనగువానియందగు ధ్వన్యనుకరణము: చూ, హలాహలా.

చొట్ట. దే. వి: చూ, చోక్కిలి.

చోడచోడ. దే వి. చిప్పిల్లుటయందగు ధ్వన్యనుకరణము. చూ, హలాహలా.

చోత్తెంచు. దే. అ. క్రి. (చోచ్చు + తెంచు): చూ, రూ-చోచ్చిలు (స్వార్థమున తెంచు.)

చోదుగు. దే. వి. తడి: చూ, పదను 2. [బెరడు.

చోనుము. దే. వి. ఎండిన అరఁటిపట్టు: చూ,

చోనుపు. దే. స. క్రి. 1. చెక్కు: చూ, వారు. 1; ప్రే. 2. రూ-చోన్పు-చోప్పరించు- చోప్పపఱచు- చోప్పఱచు- చోప్పించు: చూ, దోఁపు. 5.

చొన్పు. దే. ప్రే. రూ- చొనుపు: చూ, దోఁపు. 5.

చొప్ప. దే. వి. జొన్న లోనగువాని దంటు.

చొప్పకాఁడి. దే. వి. రెండెడ్లనుకట్టి తోలెడు దిండువంటి చొప్పమోపు.

చొప్పడు. ద్వి. అ. క్రి. (చొప్పు + పడు) 1. అత్తు: చూ, సరిపడు. 2; 2. కలుగు: చూ, పుట్టు. 2; 3. లభించు: చూ, సిద్ధించు.

చొప్పరి. దే. విశే. (చొప్పు + అరి) బాటసారి: చూ, పాంథుఁడు. [దోఁపు. 5.

చొప్పరించు. దే. ప్రే. చొప్పించు: చూ,

చొప్పవఱచు. దే. ప్రే. —పై—

చొప్పించు దే. ప్రే. —పై—

చొప్పిల్లు. దే. అ. క్రి. తగు: చూ, సరిపడు. 2.

చొప్పు. దే. వి. 1. త్రోవ: చూ, మార్గము. 1; 2 రీతి: చూ, విధము. 1; 3. జాడ: చూ, సూచన 1.

చొప్పున. దే. అవ్య. ఏసి: చూ, వంతున.

చొబలము. దే. వి. గుఱ్ఱము గర్భమందుండు పిండము: చూ, భ్రూణము. 1.

చొరఁబడు. ద్వి. అ. క్రి. (చొరన్ + పడు): చూ, చొచ్చిలు. (స్వార్థమునపడు.)

చొరఁబాఱు. దే. అ. క్రి. —పై—

చొరపోఁత. దే. విశే. (చొరవ + పోఁత) ఎడములేనిది. "వానికి అమ్మవారు చొరపోఁతగా పోసినది.": చూ, సర్వము.

చొరవ. దే. వి. 1. అభినివేశము: చూ, ప్రవేశము; 2. బుద్ధికుశలత: చూ, బుద్ధి: 3. అన్నముమీఁది యిచ్ఛ: చూ, వాంఛ.

చొరవకత్తియ. ద్వి. విశే. రూ- చొరవకత్తె. చొరవగలది: చూ, స్త్రీ.

చొరవకాఁడు. దే. విశే. చొలుకరి: చూ, సాహసికుఁడు [చొక్కా-కు.

చొరుగు. దే. వి. రూ- చొనుపు: చూ,

చొనుపు. దే. వి. —పై—

చొఱ. దే. వి. 1. రూ-చొఱ్ఱ చొఱ-రాజీవమను చేఁప: చూ, మత్స్యము 1: విశే. 2 బాలుఁడు: చూ, శిశువు.

చొఱచొఱ. దే. వి. వడియుటయందును జొబ్బిలుటయందును నగు ధ్వన్యనుకరణము: చూ, హాహాహా

చొఱమీను. ద్వి. వి: చూ, చొఱ. 1. [వ్యాధుఁడు. 1.

చొత్రిగాఁడు. దే. వి. కిరాతుఁడు: చూ,

చొలుగు. వా. వి. (దస్తు-పెట్టె) అర: చూ, రూ-సొలుగు.

చొఱ్ఱ. దే. వి: చూ, రూ-చొఱ. 1.

చొలయు. దే. అ. క్రి. 1. మూర్ఛపోవు: చూ, సొమ్మసిల్లు; 2. యుద్ధమునఁబాఱు: చూ, వెనుదీయు. 1; 3. వైముఖ్యమునొందు: చూ, రూ-సొలయు; 4. వైరస్యమునొందు: చూ, రూ-సొలయు. [వస్త్రము.

చొలా. వై. వి.=కంచుకా. అంగరకా: చూ,

చొల్లు. దే. వి. చొల్లు: చూ, చొంగ.

చొల్లియము. దే. వి. జడతో చుట్టినచుట్టు, కబరీవిశేషము, రూ-చొల్లెము: చూ, [వేనలి.

చొల్లెము, దే. వి. —పై— స్వా. 4, ఆ. 30.

# చో

చో. దే. వి. 1. కాలము: చూ, సమయము. 1; 2. చోటు. చూ, స్థానము. 1.

చోన్. దే. వి. అచ్చోటన్, ఇచ్చోటన్, కాని చోటన్, లేనిచోటన్, ఇత్యాది సమాసపదములయందు ఉత్తరపదమైన 'చోటు' శబ్దము యొక్క సప్తమీ విభక్తి రూపము నందు టవర్ణము లోపింపఁగా మిగిలినది. ఉదా.— "అచ్చోన్, ఇచ్చోన్, కానిచోన్, లేని చోన్" మొ. ఇదికొన్నిచోట్ల అప్పుడు అనుసరమునిచ్చుచున్నది. "ప్రాణహానితప్పించుచోన్" ఇత్యాదులు. (శ. ర.)

చోటు. దే. వి. తానము: చూ, స్థానము 1.

చోడి. దే. వి. 1. సస్యవిశేషము. వి, పు. 4 ఆ. 16: చూ, సస్యము. 1; 2. ధాన్యవిశేషము: చూ, ధాన్యము (బ. చోళ్లు)

చోడు. దే. వి. రూ- సోడు. బ్రహ్మరంధ్రము: చూ, మాడపట్టు. [శోకము.

చోదుమ. దే వి. రూ-చోద. కష్టము: చూ,

చోద. దే. వి. —పై.—

చోద్యము. వా. వి. రూ-సోద్దెము: చూ, వింత.1.

చోపు. వై. వి. 1=క్షోభమ్. కలఁత: చూ, సంతాపము; స. క్రి. 2.=క్షుభ్. కలఁచు: చూ, కలఁచియాడు; 3. నడపించు, తోలు-రూ-తోలు: చూ, పరిషేవించు. 1; 4. వెంబడించిపరుగెత్తు: చూ, పాఱఁదోలు.

చోపుడు. వై. వి.= చూ, చోపు. 1.

చోపుడుఁగట్టె. ద్వ. వి. చోపు పెట్టుకోల: చోపుడుఁగోల.

చోపుడుఁగోల. ద్వ. వి. —పై.—

చోపుదారుఁడు. వా. వి. చూ. వేత్రధరుఁడు

చోగ. వా. వి. బాలుఁడు: చూ, శిశువు.

చోరు. వా. వి కోటు చెప్పినపుడు ఆటనుడిచిన నెడి దొంగ పేకముక్క. "కళావరుసదాము చోరు."

చోలి దే. వి: చూ, రూ-చోలి.

చోలిబుడుత. దే.వి.1. చోట్లి: చూ, చోలి. 1: 2. చిఁపలవంటికన్నులుగలయూఁడుది: చూ, స్త్రీ.

చోలివాఁడు. దే. విశే. బాలుఁడు: చూ, శిశువు.

చోలా. వై. వి.=: చూ, రూ-చొలా. [పిండి.

చోవి. దే. వి. బూరెలకై దమ్మాతగా పెట్టెడు

# చౌ

చౌ. వై. స. 1.=చతుః. రూ-చవు: చూ, నాలుగు; విశే 2. వ్యక్తియందు చౌక మనకుమీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము (చౌడోలు మొ.)

చౌక. దే. విశే. 1. వెలతక్కువ: చూ, రూ-చవుక. 1; 2. తక్కువ, న్యూనము: చూ, రూ-చవుక. 2; 3. తిరస్కారము: చూ, వహేళనము.

చౌకటులు. ద్వ. వి. బ: చూ, రూ-చవుకటులు.

చౌకట్టులు. ద్వ. వి బ. 1.—పై—; 2.దోరణపుఁబట్టెమీఁదకపిలెదిల్లను ఆధారముగా ఇరు

9. చవర్గములోనొక యక్షరము: చూ, కవర్గము.

**ఛందము.** సం. వి. అ. పుం. 1. అభిప్రాయము: చూ, స్మృతి. 1; 2. లోకువ: చూ, వశము. 1; 3: చూ, ఛందస్సు. 1: (చూ, వృత్తము. 1.)

**ఛందశ్చిత్తు.** సం. వి. త్. పు. ఛందశ్శాస్త్రమును జేయువాఁడు.

**ఛందస్సు.** సం. వి. స్. న. 1. పద్యలక్షణము చెప్పెడు శాస్త్రము. ఛందము: చూ, ఛందస్సులు. (చూ, వృత్తము. 1); 2. తొలి చదువు, నిగమము: చూ, వేదము; 3. యథేచ్ఛమైన నడవడిక: చూ, వర్తనము. 1; 4 కోరిక: చూ, వాంఛ; అం. 5. శాస్త్రములాఱింటిలో నొకటి: చూ, శాస్త్రములు; 6. విద్యలుపదునాలుగింటిలోనొకటి: చూ, విద్యలు; 7. వేదాంగములాఱింటిలోనొకటి: చూ, వేదాంగములు.

**ఛందస్సులు.** అం. ఛందస్సు.—అన్ని వేదములయందుండెడు నన్ని మంత్రములకు పాదవిభజనమును ఆపాదములకు గురులఘ్వక్షరసంఖ్యలను బోధించెడి శాస్త్రము. ఇది సర్వవిద్యేశ్వరుఁడైన శివుని వలన నందీశ్వరుఁడు ఆయనవలన సనత్కుమార అగస్త్య, బృహస్పతి, ఇంద్ర, వాసుకి, పింగళులనెడివారును సంప్రదాయ క్రమమున నేర్చుకొనిరి. ఇందుపుట్టిన గ్రంథములు.—ఛందోవిచితి (వాసుకి, పింగళుఁడు), మృతసంజీవనీ వృత్తి (భట్టి, హలాయుధుఁడు) వృత్తరత్నాకరము (కేదారకవి), లలితము, సేతువు (కనకసభాపతి మొదలగువారు), ధీశోధిని (శ్రీనాథుఁడు), మఱియు ఛందశ్శేఖరము, ఛందోకౌస్తుభము, పాణీభూషణము మొదలగు విశేషగ్రంథములు పుట్టియున్నవి. పిదప కవిజనాశ్రయమనునాంధ్రఛందోలక్షణశాస్త్రము (వేములవాడ భీమకవి), సులక్షణసారము, కావ్యాలంకారచూడామణి, కవిలోకసంజీవని, కవిగజాంకుశము మొదలగు ననేకగ్రంథములు పుట్టియున్నవి. ఈ లక్షణగ్రంథముల సారాంశమని యెన్నఁదగిన అప్పకవీయమందును పూర్వగ్రంథములందును సమవృత్తసంఖ్యాదులను దెలియఁజేయు ప్రస్తారప్రత్యయము మొదలగు షట్ప్రత్యయముల వలన నిరువదాఱు ఛందములయ్యెను. అందుల వివరణము.—1. ఉక్త. 2. 2. అత్యుక్త. 4. 3. మధ్య. 8, 4. ప్రతిష్ఠ. 16, 5. సుప్రతిష్ఠ. 32, 6 గాయత్రి. 64. 7. ఉష్ణిక్కు. 128, 8. అనుష్టుప్పు 256, 9. బృహతి. 512, 10. పఙ్క్తి. 1024. 11. త్రిష్టుప్పు. 2048, 12. జగతి 4096, 13. అతిజగతి 8192, 14. శక్వరి. 16384, 15. అతిశక్వరి. 32768, 16. అష్టి. 65536, 17. అత్యష్టి. 131072, 18. ధృతి. 262144, 19. అతిధృతి. 524288. 20. కృతి 1048576, 21. ప్రకృతి. 2097152, 22. ఆకృతి. 4194304, 23. వికృతి. 8388608, 24. సంకృతి. 16777216, 25. అభికృతి. 33554432, 26. ఉత్కృతి. 67108864. (కేదారకవి చెప్పిన షట్ప్రత్యయాధ్యాయములోనున్న ప్రస్తారములవల్ల పుట్టిన నీ ఇరువదియాఱు ఛందస్సులకును సర్వసమవృత్త సంఖ్యలమొత్తము (13,42,17,726) పుట్టెను. ఇందుక్త మొదలు బృహతిదనుక తొమ్మిది ఛందంబులకు యతి లేదు. ప్రాస మాత్రమే కలదు. (ఇందు త్రిభంగి, ఆర్యా, లయవిభాతి, ఉత్సాహ, వైతాళి మొదలగు వృత్తములుఁ జేరియుండలేదు.) [పద్యలక్ష్యోపయోగసంజ్ఞలు.—ఇందుగల ఛందస్సంఖ్యలు వృత్తసంఖ్యలు మున్నగు వివరములు వృత్తము అను శబ్దముకడఁ జూచుకొనవలెను): చూ,

వృత్తము. 1. (చూ, జాతులు 5). (చూ, పద్యములు.)

ఛందోభేదవివేకము. అం. సుగుణము లిరువదెని మిదింటిలో నొకటి: చూ, సుగుణములు.

ఛందోవతి అం. శ్రుతు లిరువదిరెండింటిలో నొకటి: చూ, శ్రుతులు. [పిడక.

ఛగణము. సం. వి. అ. న. కరీషము: చూ,

ఛగల. సం. వి. ఆ. స్త్రీ. బొద్ది *: చూ, వృద్ధదారకము.

ఛగలము. సం. వి. అ. న. 1. నీలికోక: చూ, వస్త్రము; పుం. 2. మేకపోతు: చూ, మేషము. 1; 3. పిడకనిప్పు: చూ, వహ్ని. 1; అం. 4. అగ్నిభేదములు నాలుగింటిలో నొకటి: చూ, అగ్నులు. (చూ, వహ్ని. 1.)

ఛగలాండి. సం. వి. ఈ. స్త్రీ. 1. బొద్దికూర* (గొఱ్ఱెవృషణములవంటి అవయవములుకలది): చూ, ఛగల; 2. గాడిదగడపర*: చూ, శ్వసనము. 2.

ఛట. సం. వి. ఆ. స్త్రీ. 1. గుంపు: చూ, సమూహము; 2. వరుస: చూ, పంక్తి. 1.

ఛటాంబ. సం. వి. ఆ. స్త్రీ. మెఱుపు: చూ, విద్యుత్తు.

ఛటాఫలము. సం. వి. అ. పుం: చూ, పోక*.

ఛటాభ. సం. వి. ఆ. స్త్రీ: చూ, ఛటాంబ.

ఛడావు. వా. వి. హెచ్చు, చేడావు, చెడావు.

ఛడి. వా. వి. బెత్తము: చూ, వేత్రము. 1

ఛత్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. గుడ్డికామంచి*: చూ, తృణము. 1; 2. పాలఘ్నుము, అడవి సదాప (భూమినిఁ గప్పియుండునది) *: చూ, సదాప; 3. కొత్తిమిరి *: చూ, వితున్నకము. 1; 4: చూ, పుట్టగొడుగు *; 5. నల్లజీలకఱ్ఱ *: చూ, సుషవి. 2; 6. శిలీంధ్రము *: చూ, నేలతాడు.

ఛత్రపర్ణము. సం. వి. అ. పుం. ఏడాకులరటి*: చూ, రంభ. 2.

ఛత్రబంధము. పా. శబ్దాలంకారములలో నొకటి: చూ, హేతువు. 2.

ఛత్రభంగము. సం. వి. అ. పుం. 1. రాజ్యనాశము; 2. స్వాతంత్ర్యము: చూ, స్వామ్యము; 3. ముండమోపితనము: చూ, వైధవ్యము.

ఛత్రము సం. వి. అ. న. 1. గొడుగు: చూ, వారిత్ర; అం. 2. పురుషలక్షణాంగములలో నొకటగు పాదతలరేఖలలో నీఛత్రమొకటి: (చూ, లక్షణాంగములు.): చూ, పాదతలరేఖలు. [గొడుగు *.

ఛత్రాకము. సం. వి. అ. న: చూ, పుట్ట

ఛత్రాకి. సం. వి. ఈ. స్త్రీ: చూ, సర్పాక్షి* (గొడుగువంటి ఆకులను బొందియుండునది.)

ఛత్రాతిఛత్రము. సం. వి. అ. పుం. గడ్డిదుబ్బు: చూ, తృణము. 1.

ఛత్రారుణి. సం. వి. ఈ. స్త్రీ: చూ, పుచ్చ*.

ఛత్రి. సం. వి. ఈ. స్త్రీ. చిన్నగొడుగు: చూ, వారిత్రి.

ఛత్రిన్యాయము. పా. ఎక్కువమంది గొడుగులు పట్టుకొని పోవుచుండ నందొకఁడూరక పోయినను గొడుగులు పట్టుకొని పోవువారనియే నిరూపింపఁబడుదురను రీతి. (సమష్టిమీఁదఁ జెప్పిన విషయ మేకదేశమున నన్వయింపక పోవచ్చును.)

ఛదనము. సం. వి. అ. న. 1. ఆకు: చూ, పర్ణము 1; 2. ఈఁక: చూ, ఱెక్క. 1; 3. స్థౌణేయమను గంధద్రవ్యము, గండివనము *: చూ, రాజార్హము; 4. చీఁకటిమ్రాను *: చూ, తమాలము. 8; 5. కప్పు: చూ, వ్యవధానము. 8.

ఛదము. సం. వి. అ. పుం: చూ, ఛదనము.

ఛదస్సు. సం. వి. స్. న. ఇంటికప్పు, పటలము: చూ, సదనము. 1.

ఛది. సం. వి. ఇ. పుం. —పై— [ద్రోస.

ఛదిని. సం. వి. ఈ. స్త్రీ. చేఁతిద్రోస*: చూ,

ఛద్గువు. సం. వి. ఉ. పుం. 1. ఛద్గురోగము: చూ, రోగము. 1; 2. పిల్లిమొగము: చూ, మార్జాలము. [చూ, ముని. 1.

ఛద్మతాపసుఁడు. సం. వి. అ. పుం. కపటతపస్వి:

ఛద్మము. సం. వి. న్. న. 1. నెపము: చూ, వ్యాజము. 1; 2. మోసము: చూ, వంచన; 3. ఇల్లు: చూ, సదనము. 1; 4. వడ్లు: చూ, ధాన్యము.

ఛన్నము. సం. విశ. 1. ఏకాంతము: చూ, రహస్యము; 2. రూ-ఛాదితము. కప్పఁబడినది: చూ, స్థగితము.

ఛన్నవీరుఁడు. సం. వి. అ. పుం: చూ, శివుఁడు.

ఛర్దనము. సం. వి. అ. న. 1. రూ-ఛర్ది. వమనము: చూ, వాంతి; పుం. 2: చూ, వేము*. చూ, శ్వసనము. 2.

ఛర్దము. సం. వి. అ. న: చూ, వాంతి.

ఛర్ది. సం. వి. ఇ. స్త్రీ. 1.= వెలది: చూ, వాంతి; 2. వీర్యము, శుక్లము: చూ, రేతస్సు 1.

ఛలము. సం. వి. అ. న. 1. నెపము: చూ, వ్యాజము. 1; 2. వెనుదీయుట, యుద్ధమందు మర్యాద తప్పుట, స్ఖలితము: చూ, స్ఖలనము. 2; 3. ఒకయభిప్రాయముతోఁ జెప్పినపదమునకు మఱియొక యభిప్రాయము చేసుకొని యుత్తరము చెప్పుట(ఇదియొక వాదదోషము.); 4. చిల్లమడ్డిక*: చూ, సల్లకి.

ఛవి. సం. వి. ఇ. స్త్రీ. 1. కాంతి: చూ, వెలుతురు. 1; 2. కిరణము: చూ, హాయనము. 2;

## ఛా

ఛాందసుఁడు. సం. వి. అ. పుం. వేదముచదివినవాఁడు: చూ, శ్రోత్రియుఁడు.

ఛాందోగ్యము. అం. ఉపనిషత్తులు పదింటిలో నొకటి: చూ, ఉపనిషత్తులు.

ఛాగణము. సం. వి. అ. పుం. పిడకనిప్పు: చూ, వహ్ని. 1.

ఛాగతుండము. సం. వి. అ. న. విషవిద్యాతంత్రభేదము, పాములవాండ్ర తంత్రము. ఉపాయము: చూ, మాయము. 1.

ఛాగదానము. అం. షోడశ మహాదానములలో నొకటి: చూ, మహాదానములు.

ఛాగపశున్యాయము. పా. సామాన్యముగా పశుశబ్దమువృష భాగములకర్థముకలదియైనను వేదమందొకానొకచోట మేఁకనుచెప్పుటచేత యజ్ఞములందు సామాన్యముగా పశువనఁగా మేఁకయే యగుచున్నదనురీతి.

ఛాగము. సం. వి. అ. పుం. మేఁకపోతు: చూ, మేషము. 1. [వహ్ని. 1.

ఛాగరథము. సం. వి. అ. పుం. అగ్ని: చూ,

ఛాగలకము. సం. వి. అ. పుం. 1. ఛాగలకము ను చేప: చూ, మత్స్యము. 1; 2. మేఁకపోతు: చూ, మేషము. 1

ఛాగలాంత్రిక. సం. వి. అ. స్త్రీ. బొద్దికూర*: చూ, వృద్ధదారకము. [ఛాగరథము.

ఛాగవాహనుఁడు. సం. వి. అ. పుం: చూ,

ఛాగి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుమేఁక: చూ, మేషము. 1.

ఛాగిక. సం. వి. ఆ. స్త్రీ. —పై—

ఛాతము. సం. విశ. నఱుకఁబడినది, ఛిన్నము: చూ, వృక్ణము. [బక్కవాఁడు.

ఛాతుఁడు. సం. విశ. రూ-ఛ్యాతుఁడు: చూ,

ఛాత్రగండుడు. సం. వి. అ. పుం. విభక్త్యంత ములగు శ్లోకముల ఆదియెఱింగినవాఁడు: చూ, పదాద్యవిత్తు.

ఛాత్రదర్శనము. సం. వి. అ. న. అప్పుడుతఱచి తీసినవెన్న: చూ, వెన్న.

ఛాత్రము. సం. వి. అ. న. పెద్దతేనెతెట్టె, సారఘము: చూ, మధువు. 5.

ఛాత్రికము. సం. వి. అ. న. పచ్చనితేనెటీఁగఁ బెట్టిన గొడుగువంటి తెట్టులోఁబుట్టిన పచ్చని తేనె, సారఘమధువు: చూ, మధువు. 5.

ఛాత్రుఁడు. సం. వి. అ. పుం.=చట్టు: చూ, శిష్యుఁడు. [వధానము. 3.

ఛాదము. సం. వి. అ. న. కప్పుటు: చూ, వ్య

ఛాదితము. సం. విణ. కప్పఁబడినది: చూ, స్థగితము.

ఛాయ. సం. వి. ఆ. స్త్రీ.=చాయ. 1: చూ, నీడ; 2. కాంతి: చూ, వెలుతురు 1. 3. శోభ, వస్త్రభూషణాదిప్రయుక్తమైన కాంతి: చూ, వెలుతురు. 1; 4. రంగు: చూ, వర్ణము. 6; 5. అభివ్యక్తి: చూ, ప్రతిబింబము. 1. 6. సూర్యునిభార్య: చూ, భార్య: 7. శనితల్లి: చూ, వరి; 8. జాడ: చూ, మానస. 1: (1 మొదలు 8 వఱకుగల అర్థములకు చాయ తద్భవము); 9. కావలి: చూ, రక్షణము; 10. నూడెదె: చూ, లంచేము; 11. వరుస: చూ, పంక్తి. 1; 12. ఇంచుక: చూ, స్వల్పము; అం. 13. భాషాంగములు పదునొకటింటిలో నొకటి: చూ, భాషాంగములు. (చూ, భాష. 1.)

ఛాయాకరుఁడు. సం. వి. అ. పుం. 1. గొడుగు పట్టువాఁడు: చూ, ఛత్రపటికుఁడు; విణ 2. నీడనుగలుగఁజేయువాఁడు.

ఛాయాగ్రహము. సం. వి. అ. పుం. కేతుగ్రహము: చూ, రాహువు. 2.

ఛాయాతరువు. సం. వి. ఉ. పుం. నీడచేతనే మిక్కిలి ఉపయోగకరముగా నుండెడుపెద్ద చెట్టు, సిగిచ్ఛాయము*: చూ, పొన్న.

ఛాయాతుండి. అం. తుండ్యపాంగములు రెం డింటిలో నొకటి: చూ, తుండ్యపాంగములు (చూ, అంగము. 9.)

ఛాయాత్మజుఁడు. సం. వి. అ. పుం. శని గ్రహము: చూ, రాహువు. 2.

ఛాయాపథము. సం. వి. అ. పుం. దేవమార్గము: చూ, మార్గము 1.

ఛాయాపుత్రుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, ఛాయాత్మజుఁడు: 2. అశ్వినీనక్షత్రము: చూ, . 1. [చూ, శాదష్న్నము.

ఛాయామయము. సం. వి. అ. పుం. కానుగు*:

ఛాయాప్రియుఁడు. సం. వి. అ. పుం: చూ, సూర్యుఁడు. [చూ, హిమాంశువు.

ఛాయాభృత్తు. సం. వి త్. పుం. చంద్రుఁడు:

ఛాయామిత్రము. సం. వి. అ. న. గొడుగు: చూ, వారిత్ర. [ఛాయాభృత్తు.

ఛాయామృగధరుఁడు. సం. వి. అ. పుం: చూ,

ఛాయావతి. సం. వి. ఈ. స్త్రీ. సూర్యలోకము: చూ, లోకము. 1.

ఛాజ్గామా. వా వి ఏనుఁగుపైనగల అంబారీ ముందుండు అలంకార విశేషము.

## ఛి

ఛిక్కణి. సం. వి. ఈ. స్త్రీ కొయ్యతోఁట కూర*: చూ, మూరిమము.

ఛిక్కిక. సం. వి. ఆ. స్త్రీ. —పై—

ఛిక్లిక. సం. వి. ఆ. స్త్రీ. —పై—

ఛితము. సం. విణ. కోయఁబడిన తృణాదులు: చూ, వృకము. [శాదస్న్నము.

ఛిత్తి. సం వి. ఇ. పుం. కిగజము*: చూ,

ఛిత్రకము. సం. వి. అ. పుం. బిళ్ల*: చూ, సోధ్రికము.

ఛిత్వరము. సం. వి. అ. న. కత్తి: చూ, రిష్టి. 2.
ఛిత్వరుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, విటుఁడు; 2: చూ, శత్రువు. 1.
ఛిద. సం. వి. ఆ. స్త్రీ, నఱకుడు: చూ, వర్ధనము. [రత్నము. 1.
ఛిదకము. సం. వి. అ. న. వజ్రము: చూ.
ఛిది. సం. వి. ఈ. స్త్రీ. కుఠారము: చూ, ముద్గరము.
ఛిదిరము. సం. వి. అ. పుం. 1. అగ్ని: చూ, వహ్ని. 1; 2. త్రాడు: చూ, సూత్రము. 1; 3. కత్తి: చూ, రిష్టి. 2; 4. గండ్రగొడ్డలి: చూ, ముద్గరము. [చునది.
ఛిదురము. సం. విణ. 1. ఛేదించునది; 2. భాగించు
ఛిదురుఁడు. సం. వి. అ. పుం: చూ, విటుఁడు.
ఛిద్రిసాధము. పా. బిడ్డలుఁగనని పడఁతుల గుఱుతు: చూ, లక్షణము. 1.
ఛిద్రము. సం. వి. అ. న. 1. = చిందఱ. బెజ్జము: చూ, రంధ్రము. 1; 2. తప్పు: చూ, నేరము. [చూ, పిప్పలి.
ఛిద్రవైదేహి. సం. వి. ఈ. స్త్రీ. గజపిప్పలి *:
ఛిద్రితము. సం. విణ. బెజ్జము వేయఁబడినది: చూ, విద్ధము. 1.
ఛిన్న. సం. వి. ఆ. స్త్రీ. 1. తిప్పతీఁగ *: చూ, సోమవల్లి; 2: చూ, ఱంకులాఁడి; విణ. 3. ఛేదింపఁబడినది: చూ, విచ్ఛిన్నము. 3.
ఛిన్నగ్రంథినిక. సం. వి. ఆ. స్త్రీ. పెద్దబోడతరము *: చూ, ముండిని.
ఛిన్నపుష్పకము. సం. వి. అ. పుం. తిల్వకమను గ్రంథ్యము *: చూ, రాజార్హము.
ఛిన్నము. సం. విణ. 1. కోయఁబడిన తృణాదులు: చూ, వృక్ణము; 2. భాగహారము చేయునది, హారసంబంధమయినది: చూ, హారము. 3; అం. 3. కరణములు నూటయొనిమిదింటిలోని నొకటి: చూ, కరణములు: 4. కటికిర్యలయిదింటిలోని నొకటి: చూ, కటికిర్యలు.
ఛిన్నరుహా. సం. వి. ఆ. స్త్రీ. 1. తిప్పతీఁగె*: చూ, సోమవల్లి; 2. అందుగు*: చూ, సల్లకి.
ఛిన్నరుహము. సం. వి. అ. పుం. తిలకము *: చూ, నువ్వులు.
ఛిల్లి. సం. వి. ఈ. స్త్రీ 1. చిల్లికూర*: చూ, భండీరము; 2. చెట్లు మొదలగువాని పట్టు: చూ, బెరడు. [చూ, మారిషము.
ఛిల్లిక. సం. వి. ఆ. స్త్రీ. కోయుఁగూర *:

## ఛు

ఛుఛుందరి. సం. వి. ఈ. స్త్రీ. చుంచు: చూ, మూషికము.
ఛుపము. సం. వి. అ. పుం. 1. తాఁకుట: చూ, స్పర్శము. 1; 2. గాలి: చూ, వాయువు; 3. పోరు: చూ, యుద్ధము.
ఛుర. సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, సున్నము; 2. పొడి: చూ, సురుము.
ఛురి. సం. వి. ఈ. స్త్రీ. = చురియ-చూరి-సురె-సూరె, శస్త్రి, మొలనుంచుకొను సూరకత్తి: చూ, రిష్టి. 2 (రూ-ఛూరి.)
ఛురిక. సం. వి. ఆ. స్త్రీ. = —పై.—
ఛురికాకూశ్మాండన్యాయము. పా. ఎంత గుమ్మడికాయయైనను చిన్నకత్తి కోసివైచునను రీతి.
ఛురితము. సం. వి. అ. న. శృంగారసప్రధానక్రియలయందు గిల్లుట: చూ, నఖక్షతము.
ఛుల్లి. సం. వి. ఈ. స్త్రీ: చూ, పొయ్యి.

## ఛూ

ఛూరి. సం. వి. ఈ. స్త్రీ=: చూ, రూ-ఛురి.
ఛూలము. సం. వి. అ. పుం: చూ, సురటి.

# ఛే

ఛేకము. సం. వి. అ. పుం. రూ-సేకము. (క్రీడార్థమై పెంచఁబడి యిల్లుమఱఁగిన చిలుక మొదలైన పక్షులకును ఇట్టి మొదలైన మృగములకును పేరు: చూ, దీమము.

ఛేకానుప్రాసము. అం. 1. శబ్దాలంకారములలో నొకటి రెండేసి యక్షరము లెడతెగక మరలమరల వచ్చుట. ఉదా.-"శ్రీకరకరణీయదక్షునీ నైపుణ్యపుణ్యములు ప్రకటకటకాధీశ్వరు లెన్న విపుల పులకాంకురములు మేననుల్లసిల్లు."; "ధరధర దోషవర్జ సంహారహార": చూ, హేతువు 2 (చూ, అలంకారము. 3.); 2. అనుప్రాసములు మూఁడింటిలో నొకటి (అనుప్రాసములు.— ఛేకానుప్రాసము, వృత్త్యనుప్రాసము, లాటానుప్రాసము): చూ, అలంకారము. 3.

ఛేకాపహ్నుతి. అం. ఛేకాపహ్నుత్యలంకారము: చూ, హేతువు. 2.

ఛేకుఁడు. సం. విణ. 1. ఉచ్ఛేత్తి: చూ, నాగరకుఁడు; 2. నేర్పరి: చూ, సమర్థుఁడు.

ఛేకోక్తి. అం: చూ, రూ-ఛేకోక్తి.

ఛేత్త. సం. విణ. (ఋ. ఈ. ఋ.): చూ, నఱుకువాఁడు. [ము, ఛేద్యము.

ఛేత్తవ్యము. సం. విణ ఛేదింపఁదగినది: ఛేదితవ్య

ఛేదనము. సం. వి. అ. న. 1 నఱుకుట: చూ, వర్ధనము. 2; అం. 2. హస్తక్రియలిరువదింటిలో నొకటి: చూ, హస్తక్రియలు.

ఛేదనీయము. సం. వి. అ. పుం. ఇంగుదు*: చూ, సల్లకి.

ఛేదము. సం. వి. అ. పుం. 1. నఱుకుడు: చూ, వర్ధనము. 2; 2. తునుక: చూ, శకలము. 4; 3. భిన్నాంకమునందు క్రింది సంఖ్య: చూ, హారము. 8.

ఛేదించు. సం. స. క్రి. 1. నఱుకు: చూ, సెలగు; 2. త్రుంచు: చూ, విదారించు.

ఛేదితము. సం. విణ. ఛేదింపఁబడినది: చూ, విచ్ఛిన్నము. 3.

ఛేదితవ్యము. సం. విణ.: చూ, ఛేత్తవ్యము.

ఛేద్యము. సం. విణ —పై.—

ఛేలువు. సం. వి. ఉ. పుం. కొనగచ్చే*: చూ, సోమరాజి.

# ఛో

ఛోటి. సం. వి. న్. పుం. కైవర్తుఁడు: చూ, వలఁతేఁడు. •[వే]లుస్నుడి.

ఛోటిక. సం. వి. అ. స్త్రీ. చిటిక: చూ,

ఛోరణము. సం. వి. అ. న. విడిచిపెట్టుట: చూ, పరిత్యాగము. [లుంగము. *.

ఛోలంగము. సం. వి. అ. పుం; చూ, మాతు

# ఛ్యా

ఛ్యాతుఁడు. సం వి. అ. పుం. రూ-శాతుఁడు-ఛాతుఁడు-చిక్కినవాఁడు: చూ, బక్కవాఁడు.

# జ

జ. ఒకయక్షరము. సం. వి. అ. పుం. 1. గెలుపు: చూ, విజయము 1; 2. మేరుపర్వతము: చూ, పర్వతము; 3. చప్పుడు: చూ, స్వరము. 2; 4. జేతరి: చూ, విజిగీషువు; 5. ఓర్వమి: చూ, నూను. 1; 6: చూ, శివుఁడు; 7. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 8. పాటపాడువాఁడు: చూ, సీకారి; స్త్రీ. 9. గంగానది: చూ, నది; 10. ఆఁడుగుఱి: చూ, భగము. 12; 11. సముద్రపు చెలియలికట్ట:

చూ, రోధస్సు; న. 12: చూ, పిఱ్ఱి; 13. సగ: చూ. భూషణము. 2: 14. పెండ్లాము: చూ, భార్య; 15. తేజస్సు: చూ, వెలుతురు. 1; 16. నీరు: చూ, సలిలము; 17: చూ, పుట్టుక; 18: చూ, లక్ష్యార్థము: 19. మడుగు: చూ, సరస్సు. 1; అం. 20. తాలవ్యములలో నొకటి: చూ, తాలవ్యములు; 21. చవర్గములో నొక యక్షరము: చూ, కవర్గము; 22. సరళములలో నొకటి: చూ, సరళములు.

జమ్. సం. అవ్య. పెండ్లాము: చూ, భార్య.

జంగ సం. వి. ఆ. స్త్రీ. గంజాయి *: చూ, జీడగాఁజే.

జంగవాకటి. సం వి. ఈ. స్త్రీ. వానలో నుప యోగించెడు గూడ: చూ, వారిత్రి.

జంగమము. సం విణ. తిరుగునది: చూ, చలమానము. 1.

జంగముఁడు. సం. వి. అ. పుం. = జంగము, శూద్రులందు శివదాసుఁడు. (తె. ప):— జంగమయ్య- జంగము- జంగముదేవర. (గాజులబలిజె అనియు వాడుక.)

జంగలబిడాలము. సం. వి. అ. పుం. = జంగుపిల్లి, రూ-జాంగలబిడాలము. 1: చూ, మార్జాలము

జంగలము. సం. వి. అ. పుం, న. 1. పాల: చూ, మాంసము; విణ. 2. జనములేనిది (చోటు): చూ, నిర్జనము.

జంఘ. సం. వి. ఆ. స్త్రీ.=జంగ. ప్రసృత: చూ, పిక్క.

జంఘపరిక్షిప్తరోమములు. పా. బ. విధవాలక్షణము: చూ, లక్షణము. 1.

జంఘలు. అం. 1. పురుషలక్షణాంగములలో నొకటి. (పిక్కలు) తురగజంఘులైన ధనియగు. మృగజంఘులైన దీర్ఘాయువగు స్థూలజంఘ న మార్గమున నడమీవాఁడగు. సింహజం ైన ధనప్రదము. వ్యాఘ్రజంఘులైన కీర్తికరము. సృగాలజంఘులును రోమరహిత జంఘులునైన దరిద్రుఁడగును. మకరనూకర జంఘులైన లక్ష్మీ తనంతటను వరించును. సూక్ష్మజంఘులైన నైశ్వర్యభోగి యగు. ఉష్ట్ర జంఘులైన భాగ్యహీనుఁడగు. కాకజంఘులైన రాజగు కరికరజంఘులైన శ్రీమంతుఁడగు: చూ, లక్షణాంగములు; 2. స్త్రీలక్షణాంగములలో నొకటి. (పిక్కలు) మృగజంఘులైన రాజకన్నికయగు. కాహళజంఘులైనను గజజంఘులైనను సుఖవతియగు. రోమవతులై యున్న సన్న్యాసిగు స్థూలములైన విధవయగు. సుషిరములగిన ధనవాశమగు దీర్ఘములై రోమములధికమైన విధవయు దాసియునగు. అంబులపొదులవలెను రాజపు పరిపాటులవలెను పందిముటెలవలెను నున్న భాగ్యవతియు పుత్రవతియు నగు: చూ. స్త్రీలక్షణాంగములు; 3. నాట్యోపయోగాంగములు పందొమ్మిదింటిలో నొకటి: చూ, అంగము. 9. చూ, నాట్యోపయోగాంగములు.

జంఘాకరికుఁడు. సం. వి. అ. పుం. (రూ-జంఘాకారికుఁడు) సమాచారములను తీసికొనిపోయి అందుచేత జీవించువాఁడు, పరుగెత్తువాఁడు (అని కొందఱు): చూ, సందేశహరుఁడు.

జంఘాకారికుఁడు. సం. వి. అ. పుం. —పై.—

జంఘాక్రియలు. అం. ఉద్వాహితము, నతము, క్షిప్తము, పరివృత్తము, అవర్తితము. (5)

జంఘాత్రాణము. సం. వి. అ. న. పిక్కలకవచము; ఏనుఁగుపిక్కల కవచము (అని కొందఱు): చూ, వాగవారణము.

జంఘాపథము. సం. వి. అ పుం. నాలుగుత్రోవలు కలయుదారి: చూ, మార్గము. 1.

జంఘామచ్ఛము. సం. వి. అ. పుం. ధననాశమగుటను గుఱుతు: చూ, లక్షణము. 1.

జంఘాలుఁడు. సం. విణ: చూ, అతిజవుఁడు.

జంఘావర్తము. సం. వి. అ. పుం. పేదరాల
య్యెడు ఆడుదాని గుఱుతు: చూ, లక్ష
ణము. 1.

జంఘావర్తి. అం. అశ్వశాస్త్రమునందలి అశుభా
వర్తములలో నొకటి: చూ, అశుభావర్తములు.

జంజని. సం. వి. ఈ. స్త్రీ. పిల్లనగ్రోవిధ్వని:
చూ, స్వరము. 2. [హింగువు.

జంతుకము. సం. వి. అ. పుం. ఇంగువ: చూ,

జంతుకారి. సం. వి. ఈ. స్త్రీ: చూ, సుగలి*.

జంతుఘ్నము. సం. వి. అ. పుం. కృష్ణాగరు *:
చూ, రాజార్హము.

జంతుఫలము. సం. వి. అ. పుం: చూ, మేడి*

జంతువృక్షము. సం. వి. అ. పుం: ఒకానొక
మామిడి*: చూ. మామిడి.

జంతువు. సం. వి. ఉ. పుం: చూ, కీరి.

జంతుహృద్రోగతండులము. సం. వి. అ. పుం:
చూ, వాయువిళంగము *.

జంత్రము. సం. వి. అ. న. 1. కూటము.
స్వా. 2, అ. 43: చూ, యంత్రము. 1;
వా. 2. గారడము: చూ, మాయము. 1.

జంపతులు సం. వి. ఇ. పుం. (ద్వి) ఆలుమగలు,
దంపతులు, భార్యాభర్తలు.

జంబాలము. సం. వి. అ. పుం. 1.=సుబ్బలి.
అడుసు: చూ, బురద; 2. పాఁచి*: చూ,
శైవలము. [నది: చూ, నది.

జంబాలిని. సం. వి. ఈ. స్త్రీ. జంబాలిని యను

జంబిక. సం. వి. అ. స్త్రీ. పాడిపిండి: చూ,
పాదము. (1). [2: చూ, మరువము*.

జంబీరము. సం. వి. అ. పుం. 1: చూ, నిమ్మ*;

జంబుకగతి. అం. గతులు పండ్రెండింటిలో
నొకటి: చూ, గతులు.

జంబుకము. సం. వి. అ. పుం. 1. నక్క. (రూ-
జంబూకము-జాంబుకము- జంబువు.): చూ,
సృగాలము; 2: చూ, మహిసాక్షి*; 3: చూ,
శోణకము *; 4. చూ, మొగలి *.

జంబుకారగ్వధన్యాయము. పా. నక్క-రేలకాయ
లందిని కడుపునొప్పియెత్తియుఁ నక్కఁడు రేల
కాయలు దినరాదని యనుకొని కడుపునొప్పి
పోఁగానే మరల రేలకాయలు తినుటకు
వెళ్లినరీతి.

జంబుకుఁడు. సం. వి. అ. పుం.1: చూ, వరుణుఁ
డు. 1; 2: చూ, హీనుఁడు.

జంబుబ్రాహ్మణులు. పా. వీరుకణ్వ-గౌతమ-
పిప్పలు-ఆశ్వలాయన శాఖలకుఁజెందినవారు.
కాంబేసింధు శాఖలకు సమీపమున భరోజి
జిల్లాలోనుండు జంబుసారమనుపట్టణము కోని
వారైయుందురు: చూ, బ్రాహ్మణులు.

జంబువు. సం. వి. ఊ. స్త్రీ, ఉ. న.=ఱింబు-
జెమ్మ. 1. నేరేడుపండు: చూ, నేరేడు;
ఊ. స్త్రీ. 2. రూ-జాంబవము. :చూ, నేరే
డు*; 3. రాజజంబువు*: చూ, నేరేడు; 4.
దీవులేడింటిలో నొకటి: చూ, ద్వీపములు;(చూ,
లంక 1); 5 నేరెటేఱు;చూ, నది; 6. నక్క:
చూ, సృగాలము. [చూ, నేరేడు.

జంబూటము. సం. వి. అ. పుం. కాకినేరేడు*:

జంబూలము. సం. వి. అ. పుం. 1. జంబువు*:
చూ, నేరేడు; 2: చూ, మొగలి*.

జంభభేది. సం. వి. న్. పుం. ఇంద్రుఁడు: చూ,
వేల్పుఱేఁడు.

జంభము. సం. వి. అ. పుం.1. (రూ-జంభీరము-
జంభీరము-జంభఫలము.): చూ, నిమ్మ*;2. దం
తము:చూ,పల్లు. 2; 3. తిండి:చూ, సాపాటు;
4 కపటము: చూ, వ్యాజము. 1.

జంభలము. సం. వి. అ. పుం: చూ, నిమ్మ*.

జంభలుఁడు. సం. వి. అ. పుం. జినుఁడు: చూ,
బుద్ధుఁడు. 1.

జంభారి. సం. వి. ఇ. పుం. 1: చూ, జంభభేది: 2. వజ్రాయుధము: చూ, బాణము. 1.

జంభాసురుఁడు. సం. వి. అ. పుం. ఒకానొక రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

జంభీరము. సం. వి. అ. పు: చూ, నిమ్మ*.

జంభుఁడు. సం.వి. అ. పుం.(జంభువు) ఉ కారాంతము(అనికొందఱు): చూ, జంభాసురుఁడు.

జకుటము. సం. వి. అ. పుం. 1. అమడపిల్లలు, కవల పిల్లలు; 2: చూ, వంగపూవు.

జక్షితము. సం. విణ. చూ, భుక్తము 2.

జగచ్చక్షువు. సం వి. స్. పుం.=జగముకన్ను: చూ, సూర్యుఁడు.

జగణము. పా. ఒకలఘువు, ఒకగురువు, ఒక లఘువు (మురారి): చూ, అష్టగణలక్షణము.

జగతి. సం.వి.ఈ. స్త్రీ. 1.జగము:చూ,లోకము; 2. జనము:చూ, ప్రజ. 2; 3: చూ,భూమి 1; 4.జగతియను పంద్రెండవఛందస్సు. (పంద్రెండక్షరముల పాదముగల ఛందస్సు) ఛందస్సులిరువదియాఱింటిలో నొకటి: చూ, ఛందస్సులు; 5. పండ్రెండు: చూ, మున్నూటికము; 6. వాస్తుపురుషుఁడు, ఇండ్లు మొదలైనవియేర్పఱుపఁదగినభూమి (అనికొందఱు) : చూ, వాస్తువు.

జగతాక్రాంతము. అం. నవీనతానము లేడింటిటిలో నొకటి: చూ, నవీనతానములు (చూ, శుద్ధతానములు.)

జగత్తు. సం. వి. త్. న=జగము. (రూ జగతి-జగము): చూ, లోకము; పుం. 2. :రూ-జగత్ప్రాణము: చూ, వాయువు; విణ. 3. తిరుగునది (గమనముగల జీవలోకము): చూ, వలమానము. 1.

జగత్ను(న్న)వు. సం. వి. ఉ. పుం. 1. అగ్ని: చూ, వహ్ని. 1; 2. జంతువు: చూ, శరీరి.

జగత్పతి. సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు: చూ, వేల్పుఱేఁడు. [వాయువు.

జగత్ప్రాణుఁడు. సం వి. అ. పుం: చూ,

జగద్బలుఁడు. సం. వి. అ. పుం.—పై.—

జగద్యోని. సం. వి. ఇ. పుం: చూ, శివుఁడు.

జగద్వహా. సం. వి. ఆ. స్త్రీ: చూ. భూమి 1.

జగన్నాథుఁడు. సం. వి. అ. పుం: చూ, విష్ణువు. 1. [జగత్తు. 1.

జగము. సం. వి. త్. న =జేగము: చూ, రూ-

జగరము. సం. వి. అ. పుం. కవచము: చూ, వాగవారణము.

జగలము. సం. వి. అ. పుం. మంగ*: చూ,శ్వసనము. 2; 2. కసుము: చూ, భక్ష్యము: 3. మద్యపిష్టము, మేదకము: చూ, సుర. 2.

జగలుఁడు. సం. విణ. చూ, వంచకుఁడు. 1.

జగ్ధము. సం. విణ: చూ, భుక్తము. 1.

జగ్ధి. సం. వి.ఇ. స్త్రీ. కుడుపు: చూ, సాపాటు.

జఘనచపల. పా.కందపద్యభేదము లాఱింటిలో నొకటి. ఉదా:— "క్షమఁబద్యరీతిఁబూర్వా, ర్థము నపలాకందము క్రియఁ-దగున పరా, ర్థము జఘనచపలను మునీం, ద్రమానసమరాళ-దాశార్హా." (చూ, కందము. 3.): చూ, వృత్తము. 1.

జఘనచ్ఛదనము. సం. వి.అ.పుం: చూ, మద్ది*.

జఘనము. సం. వి. అ. న. 1. మడికట్టు: చూ, ముంజేయి; 2. మొల, స్త్రీల కటిముందు భాగము (అనికొందఱు): చూ, మొల: 3. దేశాచారముగా ముద్దుపెట్టుకొను ... గార రసప్రధానస్థానము; 4.శృంగారార్ధము... ధానమగు గోరువంకలిడు స్థానము ... నఖక్షతము; 5. గుద్దుటకుఁ దగిన ... 6. స్త్రీల పిఱుఁదుల ముందుప్రక్క... దు: చూ, పిఱ్ఱ. పుం, 8. త...

అం. 9. స్త్రీలక్షణాంగములలో నొకటి.(కటి ముందుభాగము) విస్తారమయ్యున్న పూజ్యా రాలగు: చూ, స్త్రీలక్షణాంగములు.

జఘనావర్తి. అం. అశ్వశాస్త్రమునందలి అశుభావర్తములలో నొకటి: చూ, అశుభావర్తములు. [మేడి*.

జఘనేఫల. సం. వి. ఆ. స్త్రీ: చూ, బొమ్మ

జఘనోపశ్లేషము. అం. జాతస్మరాలింగనము లెనిమిదింటిలో నొకటి: చూ, జాతస్మరాలింగనములు (చూ, ఆలింగనములు.) [సహోదరి.

జఘన్యజ. సం. వి. ఆ. స్త్రీ. చెల్లెలు: చూ,

జఘన్యము సం. వి. అ. న. 1. పురుగుటి: చూ, శిశ్నము; 2. తోఁక: చూ, వాలము. 1: 3. గొరిసె: చూ, విఁఖము; విణ. 4. వెనుకటిది: చూ, వెనుక. 1; 5. దూఱఁదగినది: చూ, హీనము. 2; 6. రూ-జఘన్యకము, కడపటిది: చూ, వేఁసి. 2.

జఘన్యుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, శూద్రుఁడు; విణ. 2. తమ్ముఁడు: చూ, సహోదరుఁడు; 3. అధముఁడు: చూ, హీనుఁడు.

జఘన్యజుఁడు. —పై.— (జఘన్యజుఁడు అనియు వాడుక.)

జఘాలుఁడు. సం. వి. అ. పుం. మిక్కిలి శీఘ్రముగాఁ బోవువాఁడు: చూ, జంఘాకరికుఁడు.

జట. సం. వి. ఆ. స్త్రీ. 1.=జేడ: చూ, వేనలి; 2. ఊడ: చూ, శిఫ. 1; 3. రూ-జటిల: చూ, మాంసి*; 4: చూ, హ్రీబేరము*; వా. 5. పనసయొక్క పెను ఆవృత్తులు: చూ, మరలు బాటు. [గంజాయి: చూ, జేడగాఁజే.

జటాగాంధారి. సం వి. ఇ పుం.=జేడగాఁజే.

జటాచీరుఁడు. సం. వి. అ. పుం: చూ, శివుఁడు.

జటాజ్వాలము. సం. వి. అ. పుం. 1. దీపము: చూ, స్నేహాశము; విణ. 2. చెప్పఁబడినది: చూ, శబ్దము. 2.

జటాటంకుఁడు. సం. వి. అ. పుం: చూ, శివుఁడు.

జటాటీరుఁడు. —పై.—

జటాధరుఁడు. సం, వి. అ. పుం. బుద్ధభేదము: చూ, బుద్ధుఁడు. 1.

జటాధారి. సం. వి. ఇ. పుం =జేడదారి. ఋషి. జటి చూ, ముని. 1.

జటామాంసి. సం వి. ఈ స్త్రీ: చూ, మాంసి* (ఇది కాకిసోమలు, వాతయామ్పలు, అపస్మారములలో మంచిపనిచేయును.)

జటామృగము. సం. వి. అ. పుం.=జేడలమెకము: చూ, సింహము.

జటాయువు. సం. వి. ఉ. న్. పుం. 1: చూ, మహిసాక్షి*; 2.రూ-జటాయుస్సు. సంపాతి తమ్ముఁడు: చూ, దాక్షాయ్యము.

జటాలము. సం. విణ. జడలుగలది: జటిలము.

జటావల్లి సం వి. ఈ. స్త్రీ: చూ, రుద్రజడ*.

జటి. సం. వి. న్. పుం. 1. రూ-జటినము. జువ్వి*: చూ, ప్లక్షము; 2: చూ, మఱ్ఱి; 3. జేడలుగల సన్యాసి: చూ, ముని. 1.

జటిల. సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, మాంసి*; 2: చూ, పిప్పలి. 1.

జటిలము. సం. వి. అ. పుం. 1: చూ, సింహము; విణ. 2: చూ, జటాలము.

జటులము. సం. వి. అ. పుం. రూ-జడులము: చూ, పుట్టుమచ్చ.

జఠరకోశము. పా: చూ, అన్నకోశము.

జఠర క్రిములు. అం. ఖల్వము, క్షామము, పూర్ణము (3)

జఠరము. సం. వి. అ. పుం. 1. రూ-జఠరము. కడుపు: చూ, భూర్తిణము. 1; 2. రూ-జఠరము. అన్నకోశము (జఠరరసము ఊరెడు తిత్తి): చూ, భూర్తిణము. 1; విణ. 3. ముదిసినది, వృద్ధిపొందినది: చూ, వృద్ధము. 2; 4. కఠినమైనది; చూ, భేడిదము.

జఠరాగ్ని. సం. వి. ఇ. పుం. అన్నకోశమందలి వేడిమి: చూ, వహ్ని. 1.

జడ. సం. వి. అ. స్త్రీ: చూ, శూకశింబి*.

జడత. సం. వి. అ. స్త్రీ. 1.=జేడను. మనస్సును అంగములును చేష్ట లుడిగియుండుట, జాడ్యము: చూ, విలంబము. 1; అం. 2. శృంగారరసములోని వ్యభిచారీభావములలో నొకటి. (జాడ్యము) (అపరసునకై పరికించి పరికించి యాతఁడు చెంగటం జేరుసంతనే యేమి చేయుటకుందోఁచక యూరకుండెను.): చూ, సంచారీభావములు.

జడత్వము. సం. వి. అ. పుం: అచేతనత్వము, జడిమ, జడిమము.

జడధి. సం. వి. ఇ. పుం: చూ, సముద్రము.

జడము. సం. వి. అ. న. 1. రూ-జలము. నీరు: చూ, సలిలము; విణ. 2. చేల్లనిది: చూ, శీతలము. 5; 3. తెలివిలేనిది: చూ, మఱపు. 2; 4. మూఁగది; 5. ప్రాణములేనిది: అచిత్తు, అచేతనము, అచైతన్యము, అప్రాణి.

జడశ్రి. సం. వి. అ. స్త్రీ. కాకిదొండ*: చూ, దొండ.

జడాత్మ. సం. వి. న్. పుం: చూ, మహిషము.

జడిమ. సం. వి. న్. పుం: చూ, జడత్వము.

జడిమము. సం. వి. అ. పుం. —పై—

జడుఁడు. సం. విణ. 1. తెలివిలేనివాఁడు, మందుఁడు: చూ, మూఢుఁడు; 2. మంచుచేతఁ గొట్టఁబడినవాఁడు: చూ, హిమగ్రస్తుఁడు.

జడులము. సం. వి. అ. పుం: చూ, రూ-జటిలము.

జడ్డి. అం. వి. తీర్పుకర్త.

జడ్జిమెంటు, అం. వి. తీర్పు.

జతుక. సం. వి. అ. స్త్రీ. 1.=చివుక: చూ, తెలపాయిక; 2: చూ, సురలి*; 3. కోరింద *: చూ, ముచపత్రి.

జతుకము. సం. వి. అ. న 1: చూ, లక్క; 2. ఇంగువ: చూ, హింగువు.

జతుకాష్ఠన్యాయము. పాలక్కపుల్ల యొక్కడ విఱిచిన నక్కడ విఱిగిమరల అతికిన నతుకుకొని మరలవిఱిచిన విఱుగుననురీతి.

జతుకి. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-జతుక. 2.*.

జతుకృత్తు. సం. వి. త్. స్త్రీ. రూ-జంతుకృత్తు. కోరింద*: చూ, ముచపత్రి.

జతుని సం. వి ఈ. స్త్రీ. గుడ్లగూబ: చూ. పకినంపుఁబులుఁగు.

జతుపుత్రము. సం. వి. అ. పుం, న. ద్యూతవిశేషము, నయము; చూ, సాగటాలు.

జతురక్తము. సం. వి. అ. పుం: చూ, లక్క.

జతువు. సం. వి. ఉ. న. 1: చూ, లక్క; 2: చూ, రూ-జతూక. 2.

జతూక. సం. వి అ. స్త్రీ. 1. కోరింద *: చూ, ముచపత్ర; 2. = చివుక, రూ-జతుక-జమూక: చూ, తెలపాయిక.

జతూకము. సం. వి. అ. న. రూ-జతుక-జతువు: చూ, లక్క.

జతూముఖము. సం. వి. అ. పుం. వ్రీహిధాన్య[ము: చూ, ధాన్యము.

జత్రువు. సం. వి. ఉ. న. 1. మూఁపులయొక్క సంధియెముకలు, మెడకొంకులు: చూ, శల్యము. 1; అం. 2. పురుషలక్షణాంగములలో నొకటి. (గూఢములైనప్రశస్తములు): చూ, లక్షణాంగములు; 3. స్త్రీలక్షణాంగములలో నొకటి (గూఢములై నరములు కానరానట్టి పుణ్యాత్ములరాలగు): చూ, స్త్రీలక్షణాంగములు. (బ. జత్రులు.)

జదూధము. సం. వి. అ. న: చూ, మాంసము.

జనంగముఁడు. సం. వి. అ. పుం. మాలవాఁడు: చూ, మాల (1)

జనక. సం. వి. అ. పుం: చూ, సహదేవి*.

జనకము. అం. జన్యతాళములలోనొకటి: చూ, జన్యతాళములు.

జనకరాగమునందుఁ బుట్టిన భాషాంగములు, అం. ఇవి 98.—(1. సౌవీరజ 4, 2. కకుజ 7, 3. టక్కాజ 21, 4. పంచమజ 10, 5. భిన్న పంచమజ 4, 6. ఉత్కలకైశికిజ 2, 7. హిందోళజ 9, 8. భోటజ 1, 9. మాళవకైశికిజ 18, 10. గాంధారపంచమిజ 1, 11. భిన్న షడ్జకజ 17, 12. వేసరషాడవజ 2, 13. మాళవపంచమిజ 3, 14. తానజ 1, 15. పంచమషాడవజ. 3.=మొత్తము సౌవీరాది పదునైదు భాషాంగములు 93. (వీరినామములు శీక్షాకోపదములకడను జూచుకొనవలెను.): చూ, భాష. 1. (96 అనికొందఱు.)

జనకుఁడు. సం. వి అ. పుం. 1. తండ్రి: చూ, పితరుఁడు. 1; 2. జనకమహారాజు: చూ, రాజు. 1. [సమూహము.

జనత. సం. వి. ఆ. స్త్రీ. జనసమూహము: చూ,

జననకాలమహాదశ. సా. కృత్తిక మొదలు జన్మనక్షత్రము వఱకు లెక్కింప వలెను. ఆలెక్కించిన మొత్తమును 9 చేతను భాగింప వలెను. భాగింపఁగావచ్చిన శేషము రవ్యాది క్రమేణ జననకాల మహాదశయగును. శేషము 1 అయిన రవిమహాదశ—2 అయిన చంద్ర—3 అయిన కుజ—4 అయిన రాహువు—5 అయిన గురు—6 అయిన శని—7 అయిన బుధ—8 అయిన కేతు—9 అయిన శుక్ర శేషము మిగులనిచో 9 శేషముగ చూచు కొనేది: చూ, గ్రహముల దశాపరిమాణాదులు

జననము. సం. వి. అ. న. 1: చూ, పుట్టుక; 2. వంశము, గోత్రము: చూ, వంగడము

జనని. సం. వి. ఈ. స్త్రీ. 1. తల్లి: చూ, మాత. 1; 2: చూ, దయ; 3. కోరింద *: చూ, ముచపత్రి.

జననీయము. సం. వి. అ. న. నెయ్యి: చూ, తైలము.

జనపదము. సం. వి. అ. పుం. 1. మండలము: చూ, దేశము; 2. పల్లెటూరు: చూ, దేశము.

జనపదుఁడు. సం. వి అ. పుం: చూ, మనుష్యుఁడు.

జనము. సం. వి. అ. పుం. 1: చూ. ప్రజ; 2: చూ, జనలోకము.

జనమేజయపంజిషుఁడు. సం. వి అ. పుం. జనమేజయుఁడు: చూ, రాజు. 1.

జనమేజయుఁడు. సం. వి. అ. పుం —వై.—

జనయిత సం. వి ఋ. పుం. తండ్రి: చూ, పితరుఁడు. 1. [తల్లి: చూ, మాత. 1.

జనయిత్రి. సం వి. ఈ. స్త్రీ. రూ-జనిత్రి.

జనలోకము అం. ఊర్ధ్వలోకము లేడింటిలో నొకటి: చూ, ఊర్ధ్వలోకములు (చూ, లోకము 1.) [శబ్దము. 2.

జనశ్రుతి. సం. వి. ఈ. స్త్రీ. నానుడి: చూ,

జనాంతము సం. వి. అ. పుం. మండలము: చూ, దేశము. [చూ, శబ్దము. 2.

జనాంతికము. సం. వి. అ. న. చాటుమాట: ...నాభా. వా. వి ...నసంఖ్య.

జనార్దనము సం. వి. అ. న: చూ, సాంటి; అం. 2. క్షేత్రములు ఇరువదినాలుగింటిలో నొకటి: చూ, క్షేత్రములు.

జనార్దనుఁడు. సం. వి. అ. పుం. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. చూ, యముఁడు; 3: చూ, శివుఁడు.

జనార్దనాయనమః. అం. (జనార్దనః = జన్మమరణాన్యర్థయతీ=నాశయతీతి) జననమరణముల బోఁగొట్టు వస్తువుకొఱకు నమస్కారము. చూ. ఓమ్.

జని. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుది: చూ, స్త్రీ; 2. పెండ్లాము: చూ, భార్య; ఈ. స్త్రీ. 3. కోడలు: చూ, స్నుష; 4. కో

రిందక*: చూ, ముచపత్రి; ఇ. పుం, స్త్రీ. 5. (చూ-జన్మ- జన్మము- జననము- జనుస్సు: చూ, పుట్టుక.

జనించు. సం. అ. క్రి. కలుగు: చూ, పుట్టు.2.

జనితము. అం. 1-భూచారులు పదునార్గురిలో నొకడు: చూ, భూచారులు; 2. కరణములు నూటయెనిమిదింటిలో నొకటి: చూ, కరణములు.

జనువు. సం. వి. ఉ, న్. న: చూ, పుట్టుక.

జనుపాంధుఁడు. సం. విణ. పుట్టుగ్రుడ్డి: చూ, రేచీఁకు.

జన్మకీలుఁడు. సం.వి. అ. పుం: చూ, విష్ణువు1.

జన్మనక్షత్రభుక్తియును ఏష్యమును కనుఁగొను రీతి. పా. జాతకుఁడు జన్మించినరోజున జనన కాలమున కన్నిగడియలు ప్రొద్దుఅయినదియు ముందు కనుఁగొనవలెను. (చూ, అహః ప్రమాణము) పిమ్మట ఆరోజునక్షత్ర మెన్ని గడియలున్నదో కనిపెట్టవలెను.(ఎ).ఉదయాది జన్మకాలఘటికలకంటె ఆరోజునక్షత్రి ఘటికలు తక్కువయున్నప్పుడు జన్మకాలఘటికలలోనుంచి యారోజు నక్షత్రి గడియలను దీసివేసినయెడల మిగిలినది జన్మనక్షత్ర భుక్తి యగును. (బి). ఉదయాది జనన కాలఘటికల కంటె నారోజు నక్షత్రఘటికలు హెచ్చుగ నుండునపుడు నక్షత్రఘటికలలోనుంచి జనన కాల ఘటికలను దీసివేయఁగా మిగిలినవి జన్మనక్షత్రి ఏష్యమగును.

జన్మభూమి. సం. వి. ఇ. స్త్రీ పుట్టినచోటు: చూ, భూమి. 1.

జన్మము. సం. వి. అ. పుం, న. న్. న. 1: చూ, పుట్టుక; అం. 2. తారలు తొమ్మిదింటిలో నొకటి: చూ, తారలు.

జన్మలగ్నభుక్తి. పా. ఉదయలగ్నప్రమాణము లో నారోజు భుక్తిగడియలను దీసివేయఁగా మిగిలిన గడియాలు ఉదయలగ్నశేషమగును. ఉదయలగ్నశేషగడియాలులను గలుపుకొని జననసమయము వఱకు నయిన కాలమున కుదయాది లగ్నప్రమాణముల సంఖ్యను గలిపి వరుసను లెక్కింప జననకాలమున కే లగ్నము వచ్చునో యదియు జన్మలగ్నమగును. జన్మలగ్నభుక్తియుఁ గూడ నిందులోనే తెలియును.

జన్మలగ్నము. పా. 1. శిశువుయొక్క భూపతన కాలమున కెంతప్రొద్దయినదియును ముందు తెలిసికొనవలెను. పిమ్మట నారోజుదయ లగ్నమును ఉదయలగ్నభుక్తియు నెఱుంగ వలెను ఇవి పంచాంగమునఁ దెలియఁగలవు. మఱియు జన్మలగ్నము నిజమని చెప్పుటకు - (ఎ) జాతకములో చంద్రుఁ డేలగ్నమందుండునో యాలగ్నాధిపతి యున్నరాశికి 5వ రాశిగాని 9వ రాశిగాని జన్మలగ్నమగును. (లేక) (బి). చంద్రరాశ్యధిపతికి సప్తమము గాని ఆసప్తమమునకు 5వ రాశి గాని 9వ రాశి గాని జన్మలగ్నమగును.(లేక) (సి).ఒకప్పుడు చంద్రుఁడుండిన రాశియె జన్మలగ్నమగును. (లేక) (డి).చంద్రుఁడుండు లగ్నమునకు 5వ రాశిగాని 9వ రాశిగాని కూడ నొకప్పుడు జన్మలగ్నమగును; అం. 2 లగ్నకారకత్వములలో నొకటి. చూ, లగ్నకారకత్వములు. ఇదె తను-జ్ఞాన-జన్మభూమి-కీర్తి-బలము- ఆయువు- రాజనీతి- స్వభావము- విరక్తి-ఆత్మ- ఉదయ- రాశి- లగ్న- కల్యవిలగ్నమ్మను పేర్లంబరఁగు.

జన్మవర్త్మ. సం. వి. న్. న. ఆఁడుగుఱి: చూ, భగము. 12.

జన్మి. సం. వి. న్. పుం: చూ, శరీరి

జన్మించు. సం. అ. క్రి కలుగు; చూ, పుట్టు.2

జన్య. సం. వి. ఆ. స్త్రీ. 1. తల్లిచెలికత్తె; 2. తోడిపెండ్లికూఁతురు; 3. సుఖము: చూ. సంతోషము.

జన్యతాళములు. అం. ఆదితాళము, దర్పణము, చర్చరి, సింహలీలము, కందర్పము, సింహవిక్రమము, శృంగారము, రతిలీలము, రంగతాళము, పరిక్రమము, ప్రత్యంగము, గజలీలము, త్రిభిన్నము, వీరవిక్రమము, హంసలీలము, వర్ణభిన్నము, రాజచూడామణి, రంగద్యోతము, రాజతాళము, సింహవిక్రీడితము, వనమాలి, వర్ణతాళము, రంగప్రదీపకము, హంసనాదము, సింహనాదము, మల్లికామోదము, శరభలీలము, రంగాభరణము, తురంగలీల, సింహనందనము, జయశ్రీ, విజయానందము, ప్రతితాళము, ద్వితీయకము, మకరందము, కీర్తితాళము, విజయము, జయమంగళము, రాజవిద్యాధరము, మఠ్యము, జయతాళము, హుడుక్కకము, నిస్సారుకము. క్రీడాతాళము, త్రిభంగి, కోకిలప్రియము, శ్రీకీర్తి, బిందుమాలి, సమతాళము, నందనము, ఉదీక్షణము. మల్లిక (మట్టిక) ఢెంకిక, వర్ణమట్టిక, అభినంది, అంతఃక్రీడ, మల్లతాళము, దీపకము. అనంగలీలము, విషమము, నాంది, కుందము, ముకుందము, ఏకతాళము, కంకాళము, చతుస్తాళి, ఝంపటమ్ము (దొంబలిక), అభంగము, రాజబంగాళము, లఘుశేఖరము, ప్రతాపశేఖరము, గజఝంప, చతుర్ముఖము, ఝంప, ప్రతిమఠ్యము, తృతీయకము, వసంతము, లలితము, రతి, కరణము, యతి, షట్తాళము, వర్ధనము, వర్ణయతి, రాజనారాయణము, మదనము, పార్వతీలోచనము, గరుడము, శ్రీనందనము, లీలావిలోకితము, లలితప్రియము, లసితము, ప్రియము, జనకము, లక్ష్మీశము, రాగవర్ధనము, ఉత్సవము. (96) (చూ. తాళము.2.) (చూ. వీణె.)

జన్యము. సం. వి. అ. న. 1. పోరు: చూ. యుద్ధము; 2 అంగడి: చూ. దుకాణము; 3. దూఱు: చూ. నింద. 1.

జన్యుఁడు. సం. వి అ. పుం. 1. తండ్రి: చూ. పితరుఁడు. 1; 2. తోడిపెండ్లికొడుకు; విణ. 3. పుట్టఁదగినవాఁడు; 4 పుట్టించువాఁడు.

జన్యువు. సం. వి. ఉ. పుం. 1. జంతువు: చూ. శరీరి; 2. అగ్ని: చూ. వహ్ని. 1; 3. నలువ: చూ. బ్రహ్మ. 1.

జప. సం. వి. ఆ. స్త్రీ. 1. దాసనము *: చూ. హాయిజీవనమారకము; 2. మంకెన *: చూ. రక్తకము.

జపమాల. సం. వి. అ న: అక్షమాల, అక్షసరము, అక్షసూత్రము: చూ. మాల. 1.

జపము. సం. వి. అ. పుం. రూ- జాపము. 1. మంత్రావృత్తి: చూ. తపము: 2. వేదాధ్యయనము: అధీతి, అధ్యయనము, ఉపక్రమము.

జపవటి. సం. వి. ఈ. స్త్రీ: చూ. జపమాల

జపసమయము. పా. గ్రహసమయములలో నొకటి (శత్రుజయము): చూ. గ్రహసమయములు.

జపాస్ఫటికన్యాయము. పా. మంకెనపువ్వు స్ఫటికము దగ్గఱఁబెట్టిన స్ఫటికము తయు నెఱ్ఱఁబడినరీతి.

జపించు. సం. స. క్రి: చూ. తపించు. 2.

జప్యము. సం. వి. అ న. గాయత్ర్యాది మంత్రము: చూ. మంత్రము. 1 (చూ. ఓమ్, చూ. గాయత్రి); విణ. 2 జపింపఁదగినది.

జబరు. జబరుదస్తీ. వా. వి. బలాత్కారము.

జమదగ్ని. అం. మహర్షులేడుగురిలో నొకఁడు: చూ. మహర్షులు.

జమదగ్నిజుఁడు. సం. వి. అ. పుం: చూ, పరశురాముఁడు.

జమాయించు. వా. క్రి. బుకాయించు.

జయ. సం. వి. ఆ. స్త్రీ. 1. = జే. దుర్గ: చూ, పార్వతి. 1; 2. పార్వతియొక్క చెలికత్తె; 3. తదియ: చూ, తిథి. 1; 4. అష్టమి: చూ, తిథి. 1; 5. త్రయోదశి: చూ, తిథి. 1; 6. కరక *: చూ, హరీతకి; 7. రూ-జయంతి. తక్కలి *: చూ, వైజయంతి; 8. నెల్లి *: చూ, శీప్రపర్ణము. 1: 9. గంజావి *: చూ, త్రికూలిని; 10. అరఁటి *: చూ, రంభ. 2; 11. బ్రిమ్మి *: చూ, సోమెద; 12. బౌద్ధదేవి: చూ. స్వాహ. 2; అం. 13. సంవత్సరములు అఱువదింటిలో నొకటి: చూ, సంవత్సరములు (రూ-జయము); 14: చూ, దీవన; 15: చూ, నమస్కారము.

జయంతి. సం. వి. ఈ. స్త్రీ. 1 ఇంద్రుని కూఁతురు: చూ, పుత్రిక. 1; 2. దుర్గ: చూ, పార్వతి. 1; 3. టెక్కెము: చూ, సిడము; 4. తక్కలి *: చూ, వైజయంతి; 5. పండుగతోఁ గూడిన తిథి (నృసింహజయంతి, శ్రీకృష్ణజయంతి మొ.)

జయంతిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, సోమెద*.

జయంతుఁడు. సం. వి. అ. పుం. 1. ఇంద్రుని కొడుకు, కాకాసురుఁడు: చూ, పుత్రుఁడు. 1; 2: చూ, భీముఁడు; 3: చూ, శివుఁడు; 4: చూ. హిమాంశువు.

జయఘంట. సం. వి. ఆ. స్త్రీ. = జేగంట. 1. డేంగురు: చూ, వీణె; అం. 2. ఘనవాద్యము లాఱింటిలో నొకటి: చూ, ఘనవాద్యములు; 3. పంచమహావాద్యములలో నొకటి: చూ, పంచమహావాద్యములు.

జయతాళము. అం. జన్యతాళములలో నొకటి: చూ, జన్యతాళములు.

జయద్రథుడు. సం. వి. ఉ. పుం: చూ, స్పష్టక్షీరము *.

జయనము. సం. వి. అ. న. 1. జయించుట: చూ, విజయము; 2. గుఱ్ఱము లోనగువాని కవచము: చూ, హయము (చూ, వారవారణము.)

జయపద. పా: చూ, క్షుద్రప్రబంధము.

జయపెట్టు. మి. అ. క్రి: చూ, దీవించు.

జయమంగళము. అం. 1. జన్యతాళములలో నొకటి: చూ, జన్యతాళములు; 2. జయమంగళవృత్తము: చూ, వృత్తము. 1.

జయము. సం. వి. అ. పుం. 1: చూ, రూ జయనము. 1; అం. 2: చూ, జయ. 13.

జయరామము. అం. క్షేత్రములు ఇరువదినాలుగింటిలో నొకటి: చూ, క్షేత్రములు.

జయవారము. సం. వి. అ. పుం. మంగళవారము: చూ, వారము. 1

జయవాహిని. సం. వి. ఈ. స్త్రీ. ఇంద్రుని భార్య: చూ, భార్య. [జన్యతాళములు.

జయశ్రీ. అం. జన్యతాళములలో నొకటి: చూ,

జయాజీవుఁడు. సం. వి. అ. పుం. మేళము కట్టి జీవించెడువాఁడు: చూ, శైలూషుఁడు.

జయించు. సం. స. క్రి. గెలుచు: చూ, విజయమునొందు.

జయుఁడు. సం. వి. అ. పుం: చూ, జయంతుఁడు. 1; 2 యుధిష్ఠిరుఁడు: చూ, విజయుఁడు. 1; 3. విష్ణువుయొక్క ద్వారపాలకుఁడు: చూ, విజయుఁడు. 2; అం. 4. వసువులు ఎనమండ్రిలో నొకఁడు: చూ, వసువులు.

జయువు. సం. వి. ఉ. పుం; చూ, మందు. 1.

జర. సం. వి. ఆ. స్త్రీ. 1. రూ-జర్జరము: చూ, ముసలితనము; అం. 2. షడూర్మలలో నొకటి: చూ, ఊర్మలు.

జరంతము. సం. వి. అ. పుం: చూ, మహిషము.
జరంతుఁడు. సం. వి. అ.పుం: చూ, వృద్ధుఁడు.
జరఠ. సం.వి. ఆ. స్త్రీ. రూ-జఠరము, కడుపు, పొట్ట: చూ, భ్రూణము. 1.
జరఠము. సం. విణ. 1. ముదిసినది: చూ, వృద్ధము. 2; 2. కఠినమైనది: చూ, బెడిదము; 3 పసుపు కలిసిన తెలుపువర్ణము గలది: చూ, వర్ణము. 6.
జరణము. సం. వి. అ. న. 1. జీలకఱ్ఱ: చూ, సుషవి 2; 2. తెల్లజీలకఱ్ఱ: చూ, సుషవి.2; 3. ఇంగువ: చూ, హింగువు. 2; పుం. 4. సౌవర్చలవణము: చూ, లవణము. 1.
జరత్కారుఁడు. సం. వి. అ. పుం. ఒకానొక రాజు: చూ, రాజు. 1
జరత్కారువు. సం. వి. ఊ. స్త్రీ. మనసాదేవి, జరత్కారుని భార్య: చూ, భార్య.
జరద్గవము. సం. వి. అ. పుం. ముసలియెద్దు: చూ, వృషభము. 1.
జరాభీరువు. సం. వి. ఉ. పుం: చూ, మన్మథుఁడు.
జరాయుజము. సం. విణ. మావిలోనఁ బుట్టినది.
జరాయుజములు. బం. సృష్టిభేదములు నాలుగింటిలో నొకటి: చూ, సృష్టిభేదములు.
జరాయువు. సం. వి. ఉ, న్. పుం రూ-జరాయుస్సు. 1: చూ, మావి. 2; 2: చూ, జటాయువు. 2.
జరాసంధజిత్తు. సం. వి. త్. పుం: చూ, భీమసేనుఁడు.
జరాసంధుఁడు. సం. వి. అ. పుం: చూ, బార్హద్రథి.
జరుఁడు. సం. విణ. (శ్. ఈ. త్): చూ, వృద్ధుఁడు. 1.
జరూథము. సం. వి. అ. న. సంజోడు: చూ, మాంసము.
జర్జరము. సం. వి. అ. న. 1. పాఁచి: చూ, శైవాలము; 2. ఇంద్రుని టెక్కెము: చూ, సిడము; 3. ఇంద్రనీలమణి: చూ, రత్నము. 1; పుం. 4. కోయిల: చూ, పికము; విణ. 5. శిథిలమైనది: చూ, శ్లథము; 6 జీర్ణమైనది: చూ, యాతయామము.
జర్జరితము. సం. విణ: చూ, జర్జరము. 5.
జర్జరీకము సం. విణ. 1. -పై-: 2. పెక్కుతూంట్లుగలది.
జర్ఝరము. సం. వి. అ. పుం. 1: చూ, జర్జరము. 2; విణ. 2. చల్లఁబడినది: చూ, ప్రోక్షితము.
జర్ఝరికము. సం. వి అ న. 1: చూ, జేగ్రెడ; పుం. 2: చూ, ముసలితనము.
జర్ణము. సం. వి. అ. పుం. చెట్టు: చూ,వృక్షము.
జర్తుఁడు సం. వి. అ. పుం: చూ, హిమాంశువు.
జర్తిలము. సం. వి. అ. పుం. అడవినువ్వులు: చూ, నువ్వులు.
జల. పా: చూ, జలలు.
జలకంటకము. సం. వి. అ. పుం. 1. మొసలి: చూ, మత్స్యము. 1; 2. పరికె, శ్రీశృంగము: చూ, శృంగాటము. 2.
జలకపి. సం. వి ఇ. పుం. శింశుమారమను చేఁప: చూ, మత్స్యము. 1.
జలకరంకము. సం. వి. అ. పుం. 1. టెంకాయ: చూ, ముక్కంటిపండు; 2. మబ్బు: చూ, మేఘము. 1; 3 శంఖము: చూ, సంకు. 1; 4. అల: చూ, వీచి. 1.
జలకల్కము. సం. వి. అ. పుం: చూ, బురద.
జలకాంక్షి. సం. వి. న్. పుం. ఏనుఁగు: చూ, హస్తి.
జలకామము. సం .వి. అ. పుం: చూ, ప్రబ్బలి*.
జలకిరాటము. సం వి. అ. పుం. గుఱ్ఱపుమూతి చేఁప: చూ, మత్స్యము. 1.
జలకుక్కుటము. సం. వి. అ. పుం. నీరుకోడి: చూ, పుంజు.

